

శ్రీసురేశ్వరాచార్యకృత

# నైష్కర్మ్యసిద్ధి

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారిచే
ప్రకటింపఁబడియె



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచేఁ
ముద్రితము.
1 9 2 6.



శ్రీసురేశ్వరాచార్యకృత

# నైష్కర్మ్యసిద్ధి

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు
వ్రాసినపీఠికతోఁజేర్చి



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
ప్రకటితము.
1926.

# ఉపోద్ఘాతము.

క. అనువుగ బ్రహ్మజ్ఞానం, బెనయఁగ నైష్కర్మ్యసిద్ధి కృతిచేసినయా
వినుతమతికిఁ బ్రణమిల్లెద, ననయము భక్తిని సురేశ్వరాచార్యులకున్.

నిఖిలసంసారక్లేశములను దొలఁగించి నిరవధికానందము నొసంగునది యాత్మవిద్యయని యందఱు నంగీకరించియున్నారు. ఈయాత్మవిద్య నుపనిషత్తులు ప్రతిపాదించుచున్నవి. ఉపనిషద్వాక్యములు కొన్నియెడలఁ బరస్పరభిన్నార్థద్యోతకంబులై కానంబడుటంజేసి మతభేదముల కవకాశము గలిగెను. ఉపనిషత్ప్రతిపాదితాంశంబులను దూషించుచు సాంఖ్యబౌద్ధచార్వాకాదిమతంబులు కాలవశంబున నుత్పన్నములయ్యె. అట్టివిరుద్ధమతములను నిరాకరించి వైదికమతమును స్థాపించుటకై వేదవ్యాసుఁడు బ్రహ్మసూత్రములను రచించెను. ఆసూత్రములత్యల్పగ్రంథములై బహుళార్థగర్భితంబు లైనకారణంబునఁ బూర్వులగు మనీషావిశేషభూషితదూషితులు వివిధార్థకలితంబులగు నైకప్రకారంబుల వ్యాఖ్యానములుచేయ నవకాశము గలిగెను.

పిదపఁ గొంతకాలమునకు నిప్పటి కించుమించుగా రెండువేలయేండ్లకుఁ బూర్వము శ్రీశంకరభగవత్పాదాచార్యు లవతరించి బ్రహ్మసూత్రము లద్వైతబోధకంబులని స్థాపించి విమతమతఖండనంబుగావించి యఖిలవిద్వజ్జనభూష్యంబును ననితరదూష్యంబును నగుభాష్యంబును రచించి లోకోపకారంబుచేసిరి. వారి బ్రహ్మసూత్రభాష్యము ప్రసన్నముగాఁ గానంబడుచున్నను నతిగంభీర మగుటంజేసి శాస్త్రనిష్ణాతులగు పండితులకుఁదక్క సామాన్యులకు సులభముగామిచే శ్రీశంకరభగవత్పాదులే యుపదేశసాహస్రి, వివేకచూడామణి మొదలగుప్రకరణగ్రంథములను రచించి సామాన్యజనులకు మహోపకార మొనరించిరి. వారికిఁ బలువురుశిష్యు లుండినను వారిలోఁ బద్మపాదహస్తామ

లకతోటకసురేశ్వరులను నలువురుముఖ్యులు. అన్నలువురిలోను సురే శ్వరులు ప్రధానులని తత్కృతగ్రంథంబులంబట్టి చెప్పఁదగియున్నది.

అద్వైతసిద్ధిగ్రంథకారులగు శ్రీమధుసూదనసరస్వతులు తాము రచించిన సిద్ధాంతబిందువను గ్రంథమునందు సురేశ్వరాచార్యులను శ్రీ శంకరాచార్యులతోఁజేర్చి యిట్లు నుతించియున్నారు:—

"నస్తౌమి తం వ్యాసమశేషమర్థం సమ్యఙ్నసూత్రై రపియో బబంధ,
విచాపితైస్సంగ్రథితాఖిలార్థం తం శంకరం నౌమి సురేశ్వరంచ."

శ్రీశంకరభగవత్పాదులు తాము స్థాపింపఁబూనిన యద్వైత మతంబును నీలోకంబున విస్తరింపఁజేయుటకై భూసంచారముసేయుచు నందందుఁగల సాంఖ్యులు, వైశేషికులు, నైయాయికులు, సౌగతులు, జైనులు, చార్వాకులు మొదలగుమతప్రవర్తకులతో వాదములుచేసి వారిని జయించుచుఁ జనుచుఁ గడపటఁ గర్మమీమాంసాప్రవర్తకులును దంత్రవార్తికనామకమహాగ్రంథకర్తయు నగు కుమారిలభట్టునొద్దకుఁ బోయి వాదమునకాహ్వానింప నప్పండితవర్యుండు తనకప్పు డవసానస మయంబగు టెఱిఁగించి తనశిష్యుండగు మండనమిశ్రుఁడు కాశ్మీరదేశ మున నుండుటం దెలిపి యతనిపాలి కరిగి యాతనితో వాదముసేయు మని నుడివిన శంకరాచార్యు లాతనికడకేగి వాదములొనర్చి యతనిని జయించి సన్న్యాసం బొసంగి యతనికి సురేశ్వరులను నామంబిడి తమ శిష్యుంగాఁ జేకొనిరి.

సురేశ్వరులు గురువునానతిమెయిఁ దదీయతైత్తిరీయబృహదార ణ్యకభాష్యములకు వార్తికములు గావించుటయేకాక నైష్కర్మ్యసిద్ధి యను నీమహావేదాంత ప్రకరణగ్రంథంబును శ్రీశంకరాచార్యవిరచిత దక్షిణామూర్తిస్తోత్రమునకు మానసోల్లాసంబను వ్యాఖ్యానమును వ్రాసిరి.

పిదప శంకరాచార్యులు తాము స్థాపించినయద్వైతమతము శాశ్వతముగాఁ బుడమిని నెలకొని జనుల కుపకారముగావించుచుండఁ

దూరంగమం ద్యోతనవద్ద్యుతీనాం తన్మే మన శ్శివసంకల్పమస్తు.''
అను శ్లోకముచే వ్యక్తంబయ్యెడు.

3. వచనమాలయను బాలక్రీడావ్యాఖ్యానమునం దీక్రింద నుదాహరింపఁబడినశ్లోకము కానంబడుచున్నది:—

''ఆవనమ్య మనుసురేశ్వర యోగీశ్వరతీవ్రకిరణ గురుచరణాన్,
శాస్త్రాణాం వ్యాకర్తౄన్ కర్తౄనపి దేవతా నిఖిలాః.''

ఇట "శాస్త్రాణాం వ్యాకర్తౄన్" అనఁగా ధర్మశాస్త్రగ్రంథ వ్యాఖ్యాతలనని యర్థము. "కర్తౄనపి" అనుపదమును "శాస్త్రాణాం కర్తౄనపి" అని యోజనముచేసికొనఁదగు. అనఁగా ధర్మశాస్త్రగ్రంథకర్తలనని యర్థము. మనువు, సురేశ్వరులు, తీవ్రకిరణుఁడు (సూర్యుఁడు) గురుచరణుఁడుగాఁగల యోగీశ్వరుఁడగు యాజ్ఞవల్క్యముని, వీరిని సమస్తదేవతలను నమస్కరించి యని భావము.

ఇక్కడ మనుయాజ్ఞవల్క్యులు శాస్త్రకర్తలనియు సురేశ్వరులు శాస్త్రవ్యాఖ్యాతలనియు తెలియఁగునది. యోగీశ్వరశబ్దముచే విజ్ఞానేశ్వరయోగియనియు నర్థము స్ఫురించెడు. అతఁడు విభావనగ్రంథకారునికిఁ బూర్వకాలికుఁడగునేని యీయర్థము సరిపడును. ఏది యెటు లున్నను సురేశ్వరశబ్ద మిచ్చట వ్యాఖ్యానకర్తలలోఁ జతపడియుండుటచే సురేశ్వరులే విశ్వరూపులనుట స్పష్టము.

4. మాధవాచార్యకృతగ్రంథమని ప్రసిద్ధిగల శంకరవిజయము నందు బ్రహ్మ సురేశ్వరాచార్యులుగా నవతరించెననియు నతనికనుకూలు రాలై యుపచరించుటకై సరస్వతి యుభయభారతియనుపేరుతో నవత రించి తాను విశ్వరూపుఁడను పండితోత్తముని వరించి యతనిం బెండ్లి యయ్యెననియు శ్రీశంకరాచార్యులు కాశ్మీరదేశమునకుఁబోయి యందు మండనమిశ్రునితో వాదముచేయునపు డాతనిధర్మపత్నియగు నుభయ భారతి వారిరువురికిని మాధ్యస్థ్య మొనరించెననియుఁ జెప్పఁబడియుండు

టచే మండనమిశ్రుఁడు, విశ్వరూపాచార్యుఁడు సురేశ్వరాచా
వీరొక్కరే యని యెఱుంగఁదగియున్నది.

5. మాధవాచార్యకృత వివరణప్రమేయసంగ్రహమునం
క్యముం గనుఁడు:—

"ఆధ్యాసస్యాహమితిమమేతిచాకారద్వయంస్నేహతారతమ్యాదుపపద్యతే
వ్యంచ 'తదేతద్ప్రేయఃపుత్రాద్" ఇత్యస్యాః శ్రుతేర్వ్యాఖ్యానావసరే
పాచార్యైర్దర్శితం'

ఇచ్చట విశ్వరూపాచార్యై ర్దర్శితమ్మనువాక్యము

"విత్తాత్ పుత్రః ప్రియః పుత్రాత్ పిండః పిండా త్తథేంద్రియం,
ఇంద్రియేభ్యః ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా పరః ప్రియః."

అనుశ్లోకమును సూచించుచున్నది. ఇది సురేశ్వరాచా
బృహదారణ్యకవార్తికమునఁ బ్రథమాధ్యాయమునఁ జతుర్థబ
మునం దున్నది. ఈశ్లోకకర్తను విశ్వరూపుఁడని మాధవాచా
చెప్పియుండుటచే విశ్వరూపాచార్యుఁడే సురేశ్వరాచార్యులని
ష్టంబగుచున్నది.

మున్ను మనము నుడివినచందంబున శ్రీశంకరాచార్యులు
రవిషయంబున కరిగి యచ్చట మండనమిశ్రుని వాదమున నోడించి
నికి సన్న్యాసమిప్పించి సురేశ్వరులనునామధేయంబు గావించిరి
మండనమిశ్రుఁడే విశ్వరూపుఁడని తెలియవచ్చుచున్నది.

ఈవిషయ మిట్లున్నను నిది యిప్పుడు దృశ్యమానం
కతిపయనిదర్శనములవలన మండనమిశ్రుఁడును సురేశ్వరులును
గారనియు భిన్నులనియు నూహింపఁదగియున్నదని పండితుల
దఱు తలంచుచున్నారు. వీరియభిప్రాయములకుఁ బ్రధానాధా
సూచింతెద:—

మండనమిశ్రకృతంబగు బ్రహ్మసిద్ధియను నద్వైతగ్రంథమునందలి కొన్నిమతములను సురేశ్వరాచార్యులు తమబృహదారణ్యకభాష్యవార్తికమున దూషించి యున్నారనుట. బృహదారణ్యకభాష్యవార్తికము 14 వ అధ్యాయము, 4 వ బ్రాహ్మణము, 796 వ శ్లోకము:—

"అన్యేతు పండితంమన్యాః సంప్రదాయానుసారతః,
విజ్ఞాయేతి వచశ్శ్రోత మిదం వ్యాచక్షతేఽన్యథా."

దీని కానందగిరిటీక. "సంప్రత్యకార్యకరణా సామాన్యవిశేషం ప్రత్యగ్బ్రహ్మాత్మ్యుపగచ్ఛతాం మండనాదీనాం తద్వ్యాఖ్యాముత్థాపయతి అన్యేత్వితి"

అని యుండుటచే "అన్యేతు పండితంమన్యాః అన్యథా వ్యాచక్షతే" అను వాక్యముచే సురేశ్వరాచార్యులు మండనమిశ్రాదులమతములను దూషించినారని యానందగిరి యభిప్రాయపడినట్లు తెలియుచున్నది. ఇదినిక్కమేని మండనమిశ్రుడును సురేశ్వరాచార్యులును భిన్నులని తెల్లంబగు.

ఈవిధమున నీవిషయము సంశయగ్రస్తమైయుండుటచే నింకను బరిశోధకులగు విపశ్చిద్వరేణ్యులు పరిశీలించి ప్రతిహత్యశక్యములగు ప్రమాణములచేతను యుక్తులచేతను నిర్ణయము చేసినపిదప దీనింగూర్చి నిశ్చయాభిప్రాయం బెఱుంగనగునని సహృదయులకు విన్నవించుచున్నాను.

ఇక సురేశ్వరాచార్యకృతగ్రంథములను గుఱించి ప్రస్తావింతము. ఇతఁడు పూర్వాశ్రమంబున యాజ్ఞవల్క్యస్మృతికి బాలక్రీడ యను వ్యాఖ్యానమును రచించెనని మున్నెనుడివితిఁగదా. అది కరంబు ప్రౌఢమై మితాక్షరవ్యాఖ్య యుప్పతిల్లిన కాలమువఱకుఁ దద్దయుఁ బ్రసిద్ధిగాంచి పండితాదృతమై యుండెను. విజ్ఞానేశ్వరీయము వచ్చినపిదప దానివ్యాప్తి యడుగంటెను. ఇప్పుడది ముద్రితమైనకతంబునఁ బునర్వ్యాప్తిఁ జెందునుగాక!

మండనమిశ్రవిరచితగ్రంథము లింకను మూఁడుగలవు. విధివివే కము, స్ఫోటసిద్ధి, బ్రహ్మసిద్ధి - అనునవి. విధివివేకము పూర్వమీమాంసాగ్రంథము - స్ఫోటసిద్ధి వ్యాకరణగ్రంథము - బ్రహ్మసిద్ధి వేదాంతగ్రంథము.

సన్న్యాసాశ్రమస్వీకారానంతరము సురేశ్వరాచార్యులు శ్రీశంకరాచార్యులుచేసిన తైత్తిరీయారణ్యక బృహదారణ్యకభాష్యములకు వార్తికములును దక్షిణామూర్తిస్తోత్రమునకు మానసోల్లాసమను చక్కనివ్యాఖ్యానమును నైష్కర్మ్యసిద్ధియను నొకస్వతంత్రవేదాంతగ్రంథమును వ్రాసిరి. తత్కృతగ్రంథము లన్నియును సుప్రసిద్ధములై పండితజనసమ్మానితములై యొప్పుచున్నను వానిలో వార్తికము లతిప్రౌఢములై భాష్యార్థములను ఛందోనిబద్ధములుగా ననేకయుక్తులతో నతివిపులముగా వివరించుటచే నద్వైతమును బూర్ణముగాను శాస్త్రసంప్రదాయముతోను లెస్సగాఁ దెలిసికొనఁగోరువార లీరెండువార్తికములను బఠింపక మానరు.

ఇఁక నైష్కర్మ్యసిద్ధింగూర్చి చెప్పవలసి యున్నది. ఇది వేదాంతశాస్త్రమున నొకముఖ్యమగు ప్రకరణగ్రంథము.

"శాస్త్రైకదేశవిషయం శాస్త్రకార్యాంతరే స్థితం,
ఆహుః ప్రకరణంనామ గ్రంథభేదం విపశ్చితః."

అని ప్రకరణలక్షణము. శాస్త్రములో నుపపిపాదయిషితాంశము లంగోపాంగములతోఁగూడి వాదప్రతివాదచర్చలచే నిర్ణయింపఁబడును. ప్రకరణము ముఖ్యములగు సిద్ధాంతాంశములనుమాత్రము లఘూపన్యాసపురస్సరముగా వివిధయుక్తులచే సంక్షేపముగాఁ బ్రతిపాదించును. శాస్త్రములందుఁ బ్రవేశములేనివారికి విషయగ్రహణమునకుఁ బ్రకరణములు శరణములు. శాస్త్రములవలన నెఱుంగఁదగిన సిద్ధాంతాంశములిందు సులభములగుటచేఁ బండితులకును బ్రకరణము

పాదితంబులగు మహావాక్యముల వలననే కలుగును. అన
జ్ఞానమునకు వేదాంతవాక్యములే ప్రమాణములుగాని ప్ర
రంబులు ప్రమాణములుగావని భావము. జ్ఞానముచే సర్వ
వగు నజ్ఞానము నశించినపుడే 'అహం బ్రహ్మాస్మీ'త్యేవం రూప
పావస్థానంబగు మోక్షముగలుగును. కేవలానందస్వరూపవ
బద్వితీయమై ప్రకాశించు చుండును.

నైష్కర్మ్యసిద్ధియను నీమహావేదాంతప్రకరణగ్రంథ
మునుపు తెలుఁగులిపిలో ముద్రితముకాకుండెను. దీనికి వి
మగు చక్కనియాంధ్రవ్యాఖ్యానమును సులభశైలితో
లగు శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు వ్రాయించి యుం
నియు దానినిపుడు తామాంధ్ర జనుల కుపకరించునటులు
మనియు నుడివి దీనికొక యుపోద్ఘాతమును వ్రాసియిమ్మని
కటేశ్వరశాస్త్రులు నన్నర్థింప నేనీయుత్తమ వేదాంతగ్రంథము
మతి నీచిన్నపీఠికను వ్రాసియిచ్చితి. అద్వైతమతమును సుల
శాస్త్రసంప్రదాయముతోను నెఱుంగఁగోరు ముముక్షువు
నవశ్యము మాటిమాటికిఁ బఠింపవలయు. జ్ఞేయాంశము
ఖ్యానమువలన ముముక్షువులకుఁ గరతలామలకంబులగు
దియములేదు.

ఈ గొప్ప వేదాంతగ్రంథమును మంచివ్యాఖ్యానవ
యచ్చువేయించి యాంధ్రలోకంబునకుఁ బరమోపకారం
వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవా రాంధ్రజనులకృతజ్ఞతకుఁ
ఏతద్గ్రంథకర్తలగు సురేశ్వరాచార్యుల యశం బాశాంత
యాకల్ప మవనిం బెంపారుఁగాక!

నాగపూడి కుప్పుస్వామి

ఓమ్.

# సర్వవేదాంతసారసంగ్రహము

లేక

# నైష్కర్మ్యసిద్ధి.

## ప్రథమాధ్యాయము.



అవతారిక. శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారి శిష్యులలో మొదటివారగు శ్రీ సురేశ్వరాచార్యులు తనగురువుచే నాజ్ఞాపింపఁబడి యొక్క వేదాంత ప్రకరణమును జేయఁగోరెను. ఆప్రకరణమున కధికారి, ప్రయోజన, సాధన, విషయ, సంబంధముల నైదింటిని ముందుగా జెప్పుచున్నారు. అధికారి యన నీగ్రంథమును జదువ యోగ్యుఁడైనపురుషుఁడు; ప్రయోజనమన నాపురుషునకుఁ గలుగుఫలము; సాధనమన నాఫలము లభించుటకుఁ దగునుపాయము; విషయమన నీగ్రంథముచేఁ జెప్పఁబడు నర్థము; సంబంధమన నీగ్రంథమునకును, నధికారి విషయ ప్రయోజన సాధనములకు నన్యోన్యముగల యనుబంధము. ఈయైదింటిలో ముందుగా నధికారిని నిరూపించుచున్నారు.—

సూ. ఆబ్రహ్మస్తంబపర్యంతాః సర్వప్రాణినః సర్వప్రకారస్యాపి
దుఃఖస్య స్వభావత ఏవ జిహాసవ స్తథా తన్నివృత్త్యర్థం
ప్రవృత్తి రపి స్వభావత ఏవ. ౧

పదాన్వయము. బ్రహ్మమొదలు కీటకపఱకుఁగల జంతువులచే సర్వవిధమగు దుఃఖము స్వభావముగనే విడువవలసినదని కోరఁబడుచున్నందున నాదుఃఖము నివర్తించుటకొఱకుఁ దగినప్రవృత్తి స్వభావముగనే కలిగియుండును.

తాత్పర్యము. బ్రహ్మమొదలుకొని యల్పజంతువైన చీమవఱకు నీలోకములో నుండు జంతువులన్నియు నాధ్యాత్మికాధిభౌతికాధిదైవికము లనుదుఃఖములు తమకు లేకపోవలయునని సహజముగఁ గోరుచుండును. కాన నాదుఃఖములు నివర్తించు ప్రయత్నమును సహజముగఁ జేయుచుండును. అనఁగా శాస్త్రజన్యజ్ఞానమును గోరకయే దుఃఖమును బోఁగొట్టఁగలది యగు యుపాయముల వెదకుచుండునని భావము. ఆధ్యాత్మికమని, అధిదైవికమని, అధిభౌతికమని దుఃఖము మూఁడువిధములు; ద్వారా

లిసారాదిరోగములచే నగుదుఃఖ మాధ్యాత్మికము; అతివాతాతివర్షణములచే నగుదుఃఖ మాధిదైవికము; శత్రువ్యాఘ్రవృశ్చికాదులచే నగుదుఃఖ మాధిభౌతికము. ఈత్రివిధ దుఃఖము మరల యతీతము, అనాగతము, వర్తమానమని యొక్కొక్కటియుం మూఁడు విధములుగ నున్నది. గతించిపోయినదుఃఖ మతీతము; రాఁబోవుదుఃఖ మనాగతము; అప్పు డనుభవింపఁబడుచుండుదుఃఖము వర్తమానము అని చెప్పఁబడును. వీనిలో నతీత దుఃఖము పూర్వముననే గతించిపోయినందుచే దానినివృత్తికొఱకు యత్నము చేయ నక్కఱలేదు. వర్తమానదుఃఖ మనుభవింపనిది నివృత్తికానందున దాని నివృత్తికొఱకును యత్న మక్కఱలేదు. అనాగతదుఃఖముమాత్రము భయమును గలుగఁజేయుచుండు గాన నాదుఃఖమును సంభవింపనీయక ప్రయత్న మవశ్యముగఁ జేయఁదగును. దానినే లోకమున నందఱును జేయుచుందురు. కాన సర్వదుఃఖనివృత్తిని గోరియుండువార లీగ్రంథమున కధికారు లని భావము. ఇందుచే సర్వదుఃఖనివృత్తియే యీప్రకరణమునకుఁ బ్రయోజనమని సూచింపఁబడెను.

అవ. “ఓయీ! జ్వరము అతిసారము మొదలగురోగాదులచేఁ గలుగు నాధ్యాత్మికదుఃఖమును వైద్యశాస్త్రమునందు చెప్పఁబడియుండు నౌషధములు పోఁగొట్టును. శత్రువ్యాఘ్రాదిజంతువులచేఁ గలుగు నాధిభౌతికదుఃఖమును, పురుషునియొక్క కాలోచితమైన నేర్పు పోఁగొట్టును. అతివాతాతివర్షణాదులచే గలుగు నాధిదైవికదుఃఖమును శాంతికపౌష్టికాది కర్మలు పోఁగొట్టును. కాన నీప్రకరణంబుచేఁ బ్రయోజన మేమియుఁ గానంబడదు.” అని పూర్వపక్షవాది యాక్షేపించునని సిద్ధాంతవాది యాత్యంతికదుఃఖము యీప్రకరణమున చెప్పఁబడు నాత్మతత్త్వజ్ఞానముచేఁ దప్ప యితరసాధనములచే పోఁగొట్టఁబడ నేరదని చెప్పుచున్నారు.—

సూ. దుఃఖస్య చ దేహోపాదానైకహేతుత్వా ద్దేహస్య చ
పూర్వోపచితధర్మాధర్మమూలత్వా దనుచ్ఛిత్తిః. ౨

దం-అ. దుఃఖమునకు శరీరగ్రహణమే ముఖ్యమైనకారణముగ నుండుటచేతను, శరీరగ్రహణమునకు పూర్వజన్మములయందు సంపాదింపఁబడిన పుణ్యపాపములే కారణములుగ నుండుటచేతను దుఃఖము పోఁగొట్టఁబడ నేరదు.

తా. ఆధ్యాత్మికాదిదుఃఖము దేహము ఇంద్రియములు వీనిసముదాయరూపమగు నీశరీరమునందు, నేను, నాది యని యభిమానముంచుటచేతనే గలిగినది కావున శరీరమునందు అహం, మమాభిమానము పోయిననేతప్ప నశింపదు. జన్మాంతరముల

యందు సంపాదింపఁబడిన పుణ్యపాపములచే శరీరాభిమానము గలిగెను కావున పుణ్య పాపంబులు నశించినఁగాని దేహాభిమానము నశింపదు. అనఁగా నేదో యొకసమయమున నొకదుఃఖము ఈశరీరమునకు సంభవించియున్నను నది నివర్తించుచుండునటుల గాన్పించుచున్నది. అయినను సర్వదుఃఖములకుఁ బునరుత్పత్తి లేనటుల సంభవించెడి నివృత్తి దేహాభిమానము వదలిపోయినఁగాని గలుగనేరదు. కావున దేహాభిమాన నివృత్తిదక్క దక్కినయుపాయములచే సర్వదుఃఖాత్యంతిక నివృత్తి కలుగదు. ఏదికార్యమో *అది స్వయముగనే నివర్తించునను లోకన్యాయమును యోచింపఁగా శరీరము కార్యమగుటచే నది కొంతకాలమునకు స్వయముగనే నివర్తింపదా యని యాక్షేపింపరాదు. వర్తమానశరీరము నివర్తించినను వర్తమానశరీరసంపాదిత పుణ్యపాపంబులచే మఱియొకదేహము తప్పక కలుగునుగాన నొకదానికి పిమ్మట మఱియొకటిగ గలుగుశరీర పరంపర విచ్ఛేదంబు నొందదని యభిప్రాయము.

అవ. ఇటులైనను పుణ్యపాపములు తమఫలమగు సుఖదుఃఖముల ననుభవించుటచే నశించును గావున పుణ్యపాపమూలంబైన శరీరపరంపరయును స్వమూలము నశించుటచే నశింపదా యని యాక్షేపము కలుగునని దలంచి పరిహారము ననఁగా సమాధానమును జెప్పుచున్నారు.—

సూ. తయోశ్చ విహితప్రతిషిద్ధకర్మమూలత్వా దనివృత్తిః. 3

దం-అ. ఆపుణ్యపాపములకును విధింపఁబడుచు నిషేధింపఁబడుచున్న కర్మలు కారణమగుటచే నివృత్తిగలుగనేరదు.

తా. వేదశాస్త్రములలో విధింపఁబడినకర్మలు యజ్ఞదానాదులు; నిషేధింపఁబడినకర్మలు సురాపాన బ్రహ్మహత్యాదులు. వీనిలో యజ్ఞదానాదులను జేయుటచేఁ బుణ్యంబును, సురాపాన బ్రహ్మహత్యాదులఁ జేయుటచేఁ బాపంబును గలుగుచుండును. పూర్వజన్మంబునఁ జేసిన పుణ్యపాపంబుల కీజన్మంబున గలిగిన సుఖదుఃఖానుభవముచే నాశంబుగలిగినను ఈజన్మంబునం దొనర్చిన విహితనిషిద్ధకర్మలచేఁ బుణ్యపాపములు మరల గలుగుచుండును గావున బుణ్యపాపంబులకుఁ బోకడ యెప్పటికిని గలుగ నేరదని యభిప్రాయము.

---

* కార్యమనఁగా నొకదానిచేఁ జేయఁబడువస్తువు; శరీరము పంచభూతములచే జేయఁబడినవస్తు వగుటచే కార్య మన బడును.

అవ. "శబ్దబుద్ధికర్మణాం* త్రిక్షణావస్థాయిత్వమ్" అనున్యాయము ననుసరించి కర్మలును మూఁడుక్షణములకంటె నెక్కువకాలము నిలువవు. కావున స్వయముగనే నశించునని సంశయపడి ప్రత్యుత్తరమును చెప్పుచున్నారు.—

సూ. కర్మణశ్చ రాగద్వేషాస్పదత్వాత్. ౪

దం-అ. విహితనిషిద్ధకర్మలకు రాగద్వేషములు కారణమగుటచే "నివృత్తి గలుగదు."

తా. ఒకవస్తువునందుండు నాసక్తి రాగమనఁబడు. ఒకవస్తువునందు గలిగియుండు వైరస్యము ద్వేష మనఁబడును. ఇట్టి రాగద్వేషములచే విహితనిషిద్ధకర్మలొనర్పంబడుచుండును. విహితనిషిద్ధకర్మలు తమంతటతాము క్షణికములయినను ప్రవాహరూపములుగ నవిచ్ఛిన్నంబులై (ఎడతెగనివై) యుండు. కర్మలకు మూలంబైన రాగద్వేషంబులు తెగనిచోఁ గర్మలును ప్రవాహరూపముగఁ బుట్టుచుండునుగాని తెగవని భావము.

అవ. రాగద్వేషములును కార్యములగుటచే స్వయముగ నివర్తింపవా యనిన నివర్తింపవని చెప్పుచున్నారు.—

సూ. రాగద్వేషయోశ్చ శోభనాశోభనాధ్యాస నిబంధనత్వాత్. ౫

దం-అ. రాగద్వేషములకును విషయములయందు సౌందర్యాసౌందర్యముల నారోపించుటయే మూలమై యున్నందున "నివృత్తిగలుగదు."

తా. శబ్దాదివిషయములలో "నిది సౌందర్యముతో నుండునది, అది సౌందర్యముతో లేనిది" అనుబుద్ధి పొడముచుండును. ఇట్టి బుద్ధివిషయ మొక్కటియేయైయున్నను దేశకాలకర్మల ననుసరించి మారిమారి పుట్టును. అనఁగా నొకవస్తువునందే యొకసారి సుందరమను బుద్ధియును మఱియొకసారి అసుందరమనుబుద్ధియును గలుగునని యర్థము. ఇట్టి సుందరత్వాసుందరత్వములు వస్తుస్వరూపమునందు లేకయే యొకానొకప్పుడు మాత్రము వెలయుచున్నందున నారోపితములని చెప్పందగియున్నవి. ఎప్పుడు వస్తువునందు సుందరత్వము వెలయునో అప్పుడావస్తువునందు రాగముకలుగును. ఎప్పు డసుందరత్వము వెలయునో అప్పుడు ద్వేషము కలుగును. సుందరత్వాసుందరత్వములు వస్తువులయందు మారిమారి వెలయుచుండును గావున రాగద్వేషములు సర్వదా ప్రవర్తించును గాని నివర్తింపవని భావము.

---

* శబ్దము, జ్ఞానము, కర్మ యీమూఁడును, మూఁడుక్షణము లుండునవి.

అవ. వస్తువులయందు సుందరత్వాసుందరత్వముల యారోపణమును ననిత్యమై నందున స్వయముగా నివర్తించునని బోడమినసందేహమును పరిహరించుచున్నారు.—

సూ. అధ్యాసస్య చ అవిచారిత సిద్ధద్వైతవస్తు నిమిత్తత్వాత్. ౬

దం-అ. ఆరోపమునకును ఆపాతముగాఁ దోఁచుచున్న భేదప్రపంచమే నిమిత్తముగా నున్నందున "నివృత్తిగలుగదు."

తా. ఒకదానియందు మఱియొకవస్తువునైనను, మఱియొకవస్తువు ధర్మమునైనను నారోపించుట యధ్యాసమనఁబడు. ముత్యపుచిప్పనుజూచి దానిని వెండియని దలంచుట, త్రాటినిజూచి యది సర్పమని దలంచుటయును మొదటియధ్యాసమునకు దృష్టాంతము. శుద్ధమగు స్ఫటికమునుజూచి యది యెఱ్ఱనిస్ఫటికమని యెన్నుట రెండవయధ్యాసమునకు దృష్టాంతము. ఈయధ్యాసమే యారోపమనఁబడును. ఇట్టి యధ్యాసము భేదప్రపంచము నవలంబించియున్నందున భేదప్రపంచమే యధ్యాసమునకుఁ గారణము. భేదప్రపంచములేక యొకవస్తువే యున్నచో. దేనియం దేది యారోపింపఁబడును? భేదప్రపంచము విచారించిచూచిన కనుపడనిదై యుండును. సామాన్యముగఁ జూచిన ప్రకాశించుచుండును. ఇట్టి భేదప్రపంచమే సుందరత్వాసుందరత్వాద్యధ్యాసమునకు కారణమైనందున భేదప్రపంచము వెలయుచుండువఱకు నధ్యాసము నివర్తింపదని భావము.

అవ. భేదప్రపంచమునైతము కార్యమైనందున ననిత్యము. అందుచే స్వయముగ నివర్తింపదా యని శంకించి పరిహారమును చెప్పుచున్నారు.—

సూ. ద్వైతస్యచ శుక్తికారజతాది వత్సరస్యాపి స్వతస్సిద్ధా
ద్వితీయాత్మానవబోధమాత్రోపాదానత్వా దవ్యావృత్తిః. ౭

దం-అ. సకలమైన భేదప్రపంచమునకును ముత్యపుచిప్పయం దధ్యసింపఁబడిన రజతమునకువలె స్వయంప్రకాశమై సకలభేదశూన్యమైన పరమాత్మ యొక్క స్వరూపజ్ఞానమే నిమిత్తమైనందున నివృత్తికలుగదు.

తా. ముత్యపుచిప్పయొక్క స్వరూపమును దెలియకయుండుటచే ముత్యపుచిప్పయందు రజతము వెలయుచున్నదిగదా? అటులే ప్రత్యక్షవేద్యంబగు నీభేదప్రపంచంబంతయుం బరమాత్మస్వరూపమును దెలియకపోవుటచే వెలయుచున్నయది. పరమాత్మయొక్కస్వరూపము స్వయంప్రకాశమై నిత్యనిర్దోషమై సకలభేదశూన్యమై ఏకరూపమై యుండును. ఇట్టి పరమాత్మస్వరూపము యథార్థముగఁ బ్రకాశింపనందున తద్విపరీ

తంబైన ప్రపంచంబు అనఁగా జడమై సకలదోషములతోఁ గూడినదై, భేదరూపమై, యనేకరూపమైన ఈప్రపంచంబు ప్రకాశించుచున్నది. కావున స్వప్రకాశమును, నద్వితీయమును నగుపరమాత్మస్వరూపము యథార్థంబుగా తెలియుంతఱకీప్రపంచం బనువర్తించియుండునుగాని మధ్యమున నిర్నిమిత్తము నివర్తింపదు. శుక్తిస్వరూపముయొక్క అజ్ఞానముచేఁ బుట్టినరజతము శుక్తిస్వరూపజ్ఞానము గలిగినపిదపగదా నివర్తించును. ఆప్రకారమే పరమాత్మస్వరూపాజ్ఞానముచే గలిగిన భేదప్రపంచము పరమాత్మస్వరూపజ్ఞానము గలిగినపిదప నివర్తించును. కారణ మనువర్తించియుండ, కార్యము నివర్తించుట లోకమునం దెచ్చటనైనను గాన్పింపదని భావము.

అవ. ఈవిధముగ నాత్మస్వరూపజ్ఞానము ద్వైతప్రపంచమునకును, ద్వైతప్రపంచ మధ్యాసమునకును, అధ్యాసము రాగద్వేషములకును, రాగద్వేషములు విహితనిషిద్ధకర్మలకును, విహితనిషిద్ధకర్మలు ధర్మాధర్మములకును, ధర్మాధర్మములు దేహగ్రహణమునకును, దేహగ్రహణం బాధ్యాత్మికాది దుఃఖములకును కారణంబైయున్నందున ఆత్మస్వరూపాజ్ఞానమే సర్వదుఃఖములకు పరంపరగా కారణము గావున ఆత్మస్వరూపాజ్ఞానము నశింపక యుండువఱకు మఱియొకయుపాయముచే నాధ్యాత్మికాదిదుఃఖములు నివర్తింపవని యుపసంహరించుచున్నారు.—

సూ. అత స్సర్వానర్థహేతు రాత్మానవబోధ ఏవ. ౮

దం-అ. కావున నాత్మస్వరూపము తెలియకపోవుటయె సకలమైన యనర్థమునకు కారణము.

తా. సుగమము.

అవ. ఈయాత్మస్వరూపాజ్ఞానము సకలమైన యనర్థమునకు మాత్రము కారణముగాదు. ఆత్మస్వరూపంబై నిత్యానుభవయోగ్యంబైన సుఖమునకుగూడ యాచ్ఛాదకంబై యుండునుగాన నాత్మస్వరూపాజ్ఞానంబు నివర్తించినచో నిరతిశయానందప్రాప్తి మామతంబున నాత్మయాథాత్మ్యజ్ఞానంబుచే గలుగునని యభిప్రాయముతోఁ జెప్పుచున్నారు.—

సూ. సుఖస్య చాగమాపాయినః అపరతంత్రస్య ఆత్మస్వభావత్వా త్తస్యానవబోధః పిధానమ్. ౯

దం-అ. ఉత్పత్తివినాశములు లేనిదై స్వతంత్రమైన సుఖము ఆత్మస్వరూపమే గావున ఆసుఖమున కాత్మస్వరూపాజ్ఞానము ఆచ్ఛాదకము.

టీ. స్రక్చందనవనితాది విషయముల ననుభవించుటచే గలిగినసుఖము ఉత్పత్తి వినాశములుగలిగి యనిత్యమై పరాధీనమైయుండు; అనఁగా స్రక్చందన వనితాది విషయములతోఁ గూడికగలిగినప్పుడు పుట్టుచు వియోగముగలిగినప్పుడు నశించుచున్నందునను స్రక్చందనాదివిషయముల కధీనమై యున్నందునను విషయసుఖము నిత్యమును స్వతంత్రమును గానని యర్థము. ఆత్మస్వరూపభూతంబైనసుఖము పుట్టుక నశించుటలు గలదిగాదు. అందుచే నిత్యమై స్వతంత్రమైయుండు. అట్టిసుఖము సర్వకాలముల యందు ప్రకాశించి మనకెంపుడు ననుభవమునకు రాఁదగియుండినను నాత్మస్వరూపాజ్ఞానముచేఁ గప్పఁబడి యనుభవమునకు రాకయున్నదని భావము. ఆత్మ "సుఖస్వరూపుఁడు" అనునర్థమున "ఏషోఽస్యపరమ ఆనందః, ఆత్మైవానందః" ఇత్యాదిశ్రుతివాక్యములును, పరమప్రేమాస్పదత్వానుభవమును ప్రమాణము. సుషుప్తి సమాధిదశలయందు సర్వాధికముగా ననుభవింపఁబడుచున్న సుఖ మాత్మస్వరూపమైనది. "ఆత్మస్వరూపమే ఆనందము" అని శ్రుతివాక్యముల కర్థము. లోకమున సకలజంతువులకును తమయొక్క ధనధాన్యగృహక్షేత్రపుత్రకళత్రాదులయందు గల ప్రేమకంటె తనయందు ప్రేమ యధికముగా గనుపడుచున్నది. ఇందుచే నాత్మ పరమానందస్వరూపుఁ డని తెలియందగు.

అవ. ఓయీ! ఆత్మస్వరూపసుఖం బజ్ఞానముచే నాచ్ఛాదింపఁబడెనిమ్ము. దాని వలన మనకేమి? యనిన చెప్పుచున్నారు.—

సూ. [illegible] ౧౦

టం—క. కావున బ్రహ్మజ్ఞానమునకు ముగింపు నిశ్శేషముగఁ గనఁగనేని సకల పురుషార్థంబులు సంపూర్ణముగ లభించు.

టీ. ఆత్మస్వరూపభూతమైన సుఖమును గప్పి యనుభవమునకు రాకుండ జేయుచున్న యజ్ఞానము నిశ్శేషముగ నివర్తించెనేని యాధ్యాత్మికాది సకలదుఃఖంబులు నిశ్శేషముగ నశించి నిరతిశయమైన పరమానందం బావిర్భవించును గావున మఱియొక పురుషార్థంబు నొందం బనిలేకయుండు నని భావము.

అవ. ఓయీ! అట్లయినయెడల; అందువలన యాగదానాదికర్మలును దహరశాండిల్యాదియుపాసనలును వేదశాస్త్రములచే విధింపఁబడియుండఁగా వానినివదలి దుఃఖనివృత్తికొఱకుండగు పురుషుఁ డాత్మస్వరూపయథార్థజ్ఞానంబునందు ప్రవర్తించుటకును అట్టిజ్ఞానమే మీచేత నీప్రకరణములో చెప్పఁబడుటకును కారణ మేమనిన చెప్పుచున్నారు.—

సూ. అజ్ఞాననివృత్తేశ్చ సమ్యక్ జ్ఞానస్వరూపలాభమాత్రహే
తుత్వాత్తదుపాదానమ్. ౧౧

దం-అ. అజ్ఞానముయొక్క నివృత్తికి ఆత్మయాథాత్మ్యజ్ఞానముయొక్క స్వరూప ప్రాప్తిమాత్రమే కారణమై యున్నందుచే నాసమ్యక్ జ్ఞానమును గ్రహించుటయే యావశ్యకము.

తా. సర్వానర్థంబులకు మూలకారణం బాత్మస్వరూపమును తెలిసికొనమి. అది యాత్మ యాథాత్మ్యమును తెలిసికొనుటచే నశించునుగాని వేఱొక్కయుపాయముచే నశింపదు గావున యాగదానాదికర్మములుగాని, దహరశాండిల్యా ద్యుపాసనములుగాని యజ్ఞానంబునకు నాశకంబులుగావు. లోకమున నజ్ఞానమునకు నివర్తకము జ్ఞానమే యని యున్నది. రజ్జుస్వరూపము నెఱుంగమిచే గలిగిన సర్పభ్రాంతి, రజ్జువుయొక్క స్వరూపజ్ఞానము గలుగుటవలన రజ్జుస్వరూపాజ్ఞానము నశించిన నివర్తించుగాని గరుడధ్యానాది కర్తలచే నివర్తించుటలేదుగదా? కావున సర్వానర్థనివృత్తిని యపేక్షించిన యధికారి ఆత్మయాథాత్మ్యజ్ఞానమునందే ప్రవర్తించుచుండు. మేము నీప్రకరణములో నాత్మయాథాత్మ్యజ్ఞానమును ప్రతిపాదించుటకే యారంభించినారమని భావము.

అవ. ఆత్మస్వరూపయాథార్థ్యజ్ఞానము గ్రహింపఁదగియుండుగాక ! అయిన నట్టిజ్ఞానము ప్రమాణాంతరములచేతగలుగదా? సమ్యక్ జ్ఞానసంపాదన కిచ్ఛగల యధికారి వేదాంతములయందే నియతముగా ప్రవర్తింపవలసినపని యేమి యనిన చెప్పుచున్నారు.—

సూ. అశేషానర్థహేతుత్వాత్మానవబోధ విషయస్య చ అనాగ
మికప్రత్యక్షాది లౌకికప్రమాణావిషయత్వాత్ వేదాం
తాగమ వాక్యాదేవ సమ్యక్ జ్ఞానమ్. ౧౨

దం-అ. సర్వానర్థకారణమైన యాత్మస్వరూపాజ్ఞానమునకు గోచరమైయుండెడు నాత్మస్వరూపము వేదములకంటె భిన్నములగు ప్రత్యక్ష, అనుమానాదిలౌకిక ప్రమాణంబులకు గోచరింపనందున వేదాంతశాస్త్రమునందున్న వాక్యమువలననే సమ్యక్ జ్ఞానము సంపాదింపఁదగియున్నది.

తా. ఆధ్యాత్మికాది దుఃఖరూపంబులగు సకలానర్థంబులకు కారణం బాత్మస్వరూపాజ్ఞానంబె యని ముందే చెప్పియున్నారము. అట్టి యజ్ఞానం బాత్మస్వరూపము నాశ్రయించి ఆత్మస్వరూపమునే విషయముగా గైకొని ప్రవర్తించుచుండు. ఈప్ర

కారం బజ్ఞానగోచరంబైన యాత్మస్వరూపము వేదవాక్యములచేతనే తెలియఁదగియున్నదిగాని ప్రత్యక్ష, అనుమానంబులకు గోచరింపదు. అది యెట్లనిన, రూపంబు గలపదార్థము నేత్రములకు గోచరమగును. ఆత్మకు రూపములేనందున ఆత్మస్వరూపము నేత్రములకు గోచరముకాదు. ఒకపదార్థమున నొకభాగము నేత్రములకు గన్పట్టి మఱియొకభాగము నేత్రములకుఁ గాన్పించనిచో, నాగాన్పించనిభాగము ననుమానముచేఁ దెలియనగును. ఆత్మస్వరూపమున నొకభాగము నేత్రములకు గన్పట్టదుగావున ఆత్మస్వరూపం బనుమానముచేఁ దెలియంబడదు; కావున నాత్మస్వరూపయాథార్థ్యమును దెలియంజేయు సమ్యక్జ్ఞానము వేదాంతవాక్యములచేఁ దెలియవలసియున్నందున సమ్యక్జ్ఞాన సంపాదనేచ్ఛగల యధికారి వేదాంతములయందే నియమముగాఁ బ్రవర్తింపవలయునని యభిప్రాయము. ఇందుచేత యాత్మస్వరూప యాథాత్మ్యజ్ఞానమే సకలానర్థనివృత్తిరూప ప్రయోజనంబునకు సాధనంబనియు, ఆత్మస్వరూపమే విషయమనియుఁ జెప్పఁబడెను. సంబంధము యథాయథంబుగ నూహఁజేయవలసినది. అనఁగా ప్రయోజనమునకును దానిసాధనములకును సాధ్యసాధనభావసంబంధంబని, అధికారికిని ప్రయోజనములకును ప్రాప్యప్రాపకసంబంధమని, అధికారిసాధనంబులకు ప్రాప్యప్రాపకసంబంధంబని, అధికారివిషయములకు జ్ఞాతృజ్ఞేయసంబంధంబని యీవిధముగా నూహింపవలయు.

అవ. ఇప్పుడు ప్రకరణలక్షణమును జెప్పుచు నింతవఱకు నుపపాదించిన ప్రకరణారంభప్రతిజ్ఞను ప్రారంభించుచున్నారు.—

సూ. అతః అశేష వేదాంత సారసంగ్రహ ప్రకరణ మిద
మారభ్యతే. ౧౩

దం-అ. కావున సకలమైనవేదాంతములయొక్క సారమును సంగ్రహించి ప్రతిపాదించు నీప్రకరణము మాచే నారంభింపఁబడుచున్నది.

తా. ఇదివఱకుఁ జెప్పినవిధముగా నధికారి విషయప్రయోజనములు కలిగియున్నందునను ప్రయోజనము తత్త్వజ్ఞానముకంటె మఱియొకసాధనముచే సిద్ధింపకపోవుటచేతను, సకలమైనయుపనిషత్తులను నొక్కటిగాఁ జేసి వానిలో నుపాసనాభాగములను వదలి సారమైన నిర్విశేష బ్రహ్మప్రతిపాదకభాగమును సంగ్రహించి సంక్షేపముగ నీప్రకరణమును చేయుచున్నారమని భావము. ఇందుచేఁ బ్రకరణముయొక్కలక్షణము సూచింపఁబడినది. 'శాస్త్రైకదేశవిషయం శాస్త్రకార్యాంతరేస్థితం, ఆహుః ప్రకరణం నామ శాస్త్రభేదం విపశ్చితః' అని ప్రకరణలక్షణము పూర్వాచార్యులచేఁ

జెప్పఁబడినది. అంగము ఉపాంగములతో ప్రధానార్థము నుపపాదించునది శాస్త్రమనఁబడును. అట్టిశాస్త్రములోని యొకభాగమునుమాత్రము ప్రతిపాదించునదియును, శాస్త్రములోఁ జెప్పఁబడినవిషయమును సంక్షేపముగా నుపన్యసించుగ్రంథము ప్రకరణమనఁబడునని పైశ్లోకార్థము. ఉపనిషత్తులు నిర్విశేషంబై సచ్చిదానందాత్మకంబగు పరమాత్మను ప్రధానముగా ప్రతిపాదించుచు, నట్టిపరమాత్మస్వరూపజ్ఞానమున కనుకూలముగ నాపరమాత్మ కవిద్యాసంబంధముచేఁ గలిగిన సగుణస్వరూపమును, సగుణస్వరూపముచేఁ గలుగుచున్న నిఖిలప్రపంచసృష్టిస్థితిలయంబులను వానికి యుపకారకంబులైన జపధ్యానాదులను విస్తారముగ వివరించిచెప్పినందున శాస్త్రమనంబడును. అట్టిశాస్త్రముచేఁ జెప్పఁబడినయర్థములలో నేకదేశమును ముఖ్యమును నగు నిర్విశేషపరమాత్మస్వరూపమును మాత్రము గ్రహించి సంక్షేపముగ వివరించిచెప్పు నీగ్రంథము ప్రకరణమనాఁబడు.

అవ. ఇప్పుడు గ్రంథకర్త తానుచెప్పఁబోవు శ్లోకములకన్నింటికిని, సంబంధమును జెప్పఁదలఁచి మొదటిశ్లోకమునకు సంబంధమును చెప్పుచున్నారు.—

సూ. తత్రాభిలషితార్థప్రచయాయ ప్రకరణార్థసంసూత్రణాయ చాయమాద్యః శ్లోకః. ౧౪

దం-అ. ఆప్రకరణమున కోరఁబడఁదగిన యర్థమునుచెప్పు నీప్రకరణము ప్రసిద్ధినొందుటకును ప్రకరణములో వివరింపఁబడునర్థమును సూచించుటకును నీమొదటిశ్లోకము బ్రవర్తించుచున్నది.

తా. గ్రంథమును జేయువారలు గ్రంథారంభమునందు దేవతానమస్కారరూపమగు మంగళాచరణమును జేయుదురు. ఆచేయుమంగళము గ్రంథమును నిర్విఘ్నముగ బరిసమాప్తినొందించును. శిష్టులగువా రాగ్రంథమును జేకొని లోకములోఁ బ్రవర్తింపఁ జేయుటకును సాధనమైయుండును గావున ముందుగా పరదేవతానమస్కారరూపమైన మంగళము నాచరించుచు గ్రంథమును జదువువారల కీగ్రంథంబునందు బ్రవృత్తికలుగుట కనుకూలముగా గ్రంథప్రతిపాద్యములగు విషయప్రయోజనముల సూచించుచు మొదటిశ్లోకము ప్రవర్తించుచున్నది.

అవ. శ్లోకము నుదాహరించుచున్నారు.—

శ్లో. ఖానిలాగ్న్యబ్ధరిత్ర్యంతం ప్రక్షణేవోద్గతం యతః,
ధ్వాంతచ్ఛిదే నమస్తస్మై హరయే బుద్ధిసాక్షిణే. ౧. ౧౫

దం-అ. ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమి వీనియొక్క స్వరూపము పుష్పమాలికవలన సర్పమువలె యెవనివలనఁ బుట్టెనో అట్టియజ్ఞానాంధకారమును నివర్తింపఁజేయువాఁడును, అంతఃకరణమునకు సాక్షియునైన పరమేశ్వరునకు నమస్కారమును జేయుచున్నాను.

తా. పృథివ్యప్తేజోవాయురాకాశంబులను పంచభూతములును, వీనికి కారణములైనసూక్ష్మభూతములైదును, వానికి కారణములగు ప్రకృతిమహదహంకారములును, వీనిచే నిర్మింపఁబడిన ఏకాదశేంద్రియములును పంచప్రాణములును, జరాయుజాండజస్వేదజోద్భిజ్జంబులను చతుర్విధభూతములును గలిగి విస్పష్టముగఁ గన్పట్టుచున్న యీ ప్రపంచమంతయు కనుచీకటిలోఁబడి యున్నపుష్పమాలికవలన సర్పము ప్రకాశించినటుల యెవనివలనఁ బ్రకాశించుచున్నదో యట్టివాఁడు పరమాత్మ, అనఁగా మందాంధకారమున నున్నపుష్పమాలికను జూచినప్పుడు ఇది సర్పమని భ్రాంతియుదయించును. ఆసర్పభ్రాంతికి కారణము పుష్పమాలికయేగదా? ఆప్రకారమే యజ్ఞానావృతమగు పరమాత్మను జూడఁగా నిదిప్రపంచమని భ్రాంతి గలుగును. అట్టిప్రపంచభ్రాంతికి కారణము పరమాత్మయే యర్థము. అట్టిప్రపంచభ్రాంతికి కారణమై అంధకారమున సూర్యునివలె యజ్ఞానమునంతయు శేషములేక పోఁగొట్టువాఁడై జడములగుటచే స్వతఃప్రకాశించుయోగ్యతయు, నన్యములను ప్రకాశింపఁజేయుయోగ్యతయును లేకయుండిన యంతఃకరణవృత్తులకు ప్రకాశించుయోగ్యతను నన్యవిషయములను ప్రకాశింపఁజేయు యోగ్యతనుగూడ గలుగఁజేయుచున్నవాఁడై, పరమేశ్వరుఁడని వేదాంతములయందు ప్రసిద్ధముగాఁ జెప్పఁబడుపరబ్రహ్మకొఱకు నమస్కారమును జేయుదునని భావము. ఇందులో పరమేశ్వరనమస్కారరూపమైన మంగళము శబ్దశక్తిచేతనే గన్పట్టుచున్నది. జీవాత్మ పరమాత్మైక్యంబనే ప్రకరణమున చెప్పఁబడువిషయమును, అజ్ఞాననివృత్తి యనే ప్రయోజనమును, అర్థశక్తిచే సూచింపఁబడుచున్నవి. అదియెట్లనిన, అంతఃకరణమునకు సాక్షియగు పరమేశ్వరునికొఱకు అనియే చెప్పినందున జీవాత్మపరమాత్మలయొక్క ఐక్యము సూచింపఁబడినవి. అజ్ఞానాంధకారమును నశింపఁజేయువాఁడని చెప్పినందున నజ్ఞాననివృత్తియే ప్రయోజనమని సూచింపఁబడినది. మావితోఁబుట్టు మనుష్యాది భూతములు జరాయుజములని, గ్రుడ్డులలోనుండిబుట్టు పక్షిసర్పాదిభూతము లండజములని, చెమటచేతను ఆవిరిచేతను బుట్టు మశకమత్కుణాదిభూతములు స్వేదజంబులని, భూమిని భేదించుకొనిపుట్టు తరుగుల్మలతాదులు ఉద్భిజ్జంబులనియుఁ జెప్పఁబడును.

అవ. ఇఁకను తర్వాతశ్లోకమునకు తాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్యము. స్వసంప్రదాయస్య చోదితప్రమాణ పూర్వకత్వ
జ్ఞాపనాయ విశిష్టగుణసంబంధ సంకీర్తనపూర్వికా గురో
ర్నమస్కారక్రియా. ౧౬

దం-అ. తనయొక్క విద్యాప్రాప్తికి ఆచార్యులే కారణమని దెలియఁజేయుటకొ అకు యోగ్యంబులైన గుణములయొక్క సంబంధమును జేర్చుట మొదలైనగురువులకు నమస్కారముకూడఁ జేయఁబడుచున్నది.

తా. "ఆచార్యాద్దేవవిదితా విద్యాసాధిష్ఠంప్రాపత్ ఆచార్యవాన్ పురుషో వేద" ఇత్యాదిశ్రుతివచనములు, 'సద్గురుకటాక్షముచేఁ బొందంబడినవిద్యయే ఫలకారి' యని చెప్పుచున్నది. అట్టి సదాచార్యసంప్రదాయక్రమముగ వచ్చినవిద్యయే లోకములో శిష్టులచే నాదరింపఁబడుచున్నది. కావున నీగ్రంథకర్త తనకు ప్రాప్తించినదియు నీగ్రంథములో తాను ప్రతిపాదించు బ్రహ్మవిద్య తనకు సదాచార్యోపదేశముచేతనే లభించినదిగాని స్వబుద్ధిచే నూహింపఁబడినదిగాదనియుఁ దెలియఁజేయుచు నట్టిసదాచార్యుల మహాగుణములను కీర్తించి వారికి నమస్కారమును జేయుచున్నారు. పరదేవతానమస్కారమునువలె గురునమస్కారముంగూడ నవశ్యకర్తవ్యమని "యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశ్యంతే మహాత్మనః" అని శ్రుతిచెప్పుచున్నది. ఎవనికి పరమేశ్వరునియం దత్యంతభక్తిగలిగియుండునో అట్టిమహాపురుషునకే గురువుచే నుపదేశింపఁబడిన యర్థంబులు ప్రకాశించును; అనఁగా ఫలించునని శ్రుత్యర్థము. స్మృతి. 'ఆచినోతిహి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి, స్వయమాచరతే యస్మాత్తస్మా దాచార్య ఉచ్యతే.' అని యాచార్యులయొక్కలక్షణము స్మృతులయందు చెప్పఁబడియున్నది. వేదవేదాంగాదిశాస్త్రములయందు గలయర్థము లన్నింటిని బాగుగ విచారించితెలిసికొని త న్నాశ్రయించినశిష్యుల కాయర్థముల నుపదేశించి యనుష్ఠింపఁజేయుచు తానుసైతమాయర్థము ననుష్ఠించువాఁ డాచార్యుఁడనఁబడునని స్మృతివాక్యమున కర్థము. ఇందుచేత శాస్త్రప్రతిపాదితమైన యర్థమును దెలిసి యుపదేశించువారే యాచార్యులుగాని స్వబుద్ధిచేతఁ గొన్నియర్థముల నూహించి చెప్పువార లాచార్యులుగారని దెలియఁబడుచున్నది. గ్రంథకర్తయును ఆచార్యపదమును బ్రయోగింపవలసినచోట నుదితప్రమాణపదమును బ్రయోగించి యీయర్థమునే సూచించిరి. ప్రమాణమనఁగా యథార్థజ్ఞానమును గలుగఁజేయు వేదాంతవాక్యములు; వానిని ఉపదేశించి తత్త్వార్థమును బోధించువార లాచార్యులని యుదితప్రమాణశబ్దమున కర్థము.

అవ. ఆచార్యులవలన తెలియఁబడినవిద్యయే శ్రేష్ఠమైనఫలమును పొందించును. ఆచార్యులుగలపురుషుఁడు బ్రహ్మతత్త్వము నెఱుంగును.

శ్లో. అలబ్ధ్వాతిశయం యస్మా ద్వ్యావృత్తా స్తమబాదయః,
గరీయసే నమ స్తస్మై అవిద్యాగ్రంథిభేదినే. ౨. ౧౪

దం-అ. తమప్ మొదలగుప్రత్యయములు ఎవనికంటె అన్యులయందు ఉత్కృష్టతను (శ్రేష్ఠత్వమును) లభించక మరలిపోయెనో అజ్ఞానముయొక్క దృఢబంధము చేనైనను ఛేదించిన మాగురువునకు నమస్కారము చేయఁబడుచున్నది.

తా. లోకములో తమప్ప్రత్యయమును నిరతిశయాదిశబ్దములును సర్వప్రకారములచేత శ్రేష్ఠత్వ మెచ్చో పరమావధినొందియుండునో అట్టి వస్తువుయొక్క శ్రేష్ఠత్వమును జెప్పుచుండును. అట్టిశబ్దములే మహాత్మునికంటె అన్యులయందు శ్రేష్ఠత్వ మెక్కుడుగా సిద్ధింపనందున అన్యుల నందఱునువదలి యేమహాత్ముఁడే సర్వప్రకారములచే నందఱికంటె శ్రేష్ఠుండని చెప్పుచు పర్యవసించెనో అట్టి శ్రీశంకరభగవత్పాదులను నామధేయముగల మాగురువులకొఱకు నమస్కారముఁ జేసెదను. మీగురువులు సర్వప్రకారములచే సర్వశ్రేష్ఠులని మీకేలాగునఁ దెలియవచ్చెననిన, నాయొక్క హృదయము నావరించియున్న యజ్ఞానము దృఢమైనముడివలె నన్ను బంధించి సంసారసముద్రములో ముంచుచుండు నజ్ఞానగ్రంథి యింతవఱ కెవ్వరికిని ఛేదింప శక్యముగాకయుండినదానిని యీమాగురువులు ఛేదించి ఛిన్నభిన్నంబులుగాఁ ద్రెంచి నన్ను సంసారసముద్రములోనుండి లేవనెత్తి సుఖింపఁజేసిరిగావున ఈమాగురువులే సర్వప్రకారములచే సర్వశ్రేష్ఠులని నేనెఱింగితిని. ఇట్టిగురువులకొఱకు నేను నమస్కారంబు లనవరతంబు గావించెదనని భావము. 'ఆత్మనామ గురోర్నామ' ఇత్యాదిధర్మశాస్త్రవచనము తననామమును గురువుయొక్కనామమును తలిదండ్రులనామమును, ఇంకను పూజ్యులగువారినామములను బ్రత్యక్షముగాఁ జెప్పఁగూడదని చెప్పుచున్నందున నిచ్చో నీగ్రంథకర్త స్వగురునామమును ప్రత్యక్షముగ నుచ్చరింపక పర్యాయముగాఁ జెప్పిరి. ఈగ్రంథకర్తయగు సురేశ్వరాచార్యులు మండనమిశ్రులను నామముగలవారై కుమారిలభట్టాచార్యులకు శిష్యులైయుండి కర్మమీమాంసమం దత్యంతశ్రద్ధగలిగి బ్రహ్మమీమాంసావిద్వేషంబుతో సన్న్యాసులనినమాత్రమున నె మండిపడుచు తత్కాలముననుండిన దండి, బాణ, మురారి, భట్టభాస్కర, ఖండనకా, రోదయనాచార్యాది పండితులనెల్ల నోడించి కర్మమీమాంసామతంబు నెల్ల భూమండలంబున ప్రశస్తినొందఁజేసి తేజరిల్లుచుండ శ్రీశంకరభగవత్పాదు లీమండనమిశ్రునినగరంబునకుం జని సకలశాస్త్రంబులలో నీత

నితో నూఱుదినంబులు వాదించి పరాజితుంగావించి వేదాంతమీమాంసాశాస్త్రం బునం దాభిముఖ్యమును గల్పించి పరమహంసపరివ్రాజకుం గావించి కృతార్థునింజేసె నని శంకరవిజయంబునంగలకథ నిచ్చో ననుసంధింపవలయును.

అవ. మూఁడవశ్లోకమునకుఁ దాత్పర్యమును జెప్పుచున్నారు.—

వాక్య. నమస్కార నిమిత్త స్వాశయావిష్కరణార్థః. ౧౮

దం-అ. నమస్కారమునకుఁ గారణమైన తనయభిప్రాయమును దెలియఁజేయు టయే ప్రయోజనముగాఁగలది యీమూఁడవశ్లోకము.

తా. రెండవశ్లోకములో తనగురువులకు నమస్కారము నేకారణమును బట్టిచే సిరో ఆ కారణమును స్పష్టముగఁదెలియఁజేయుటకై మూఁడవశ్లోకమును జెప్పుచున్నారు.

శ్లో. వేదాంతోదరసంగూఢం సంసారోత్సారి వస్తుగమ్,
జ్ఞానం వ్యాకృత మప్యన్యై ర్వక్ష్యే గు ర్వనుశిక్షయా. ౩. ౧౯

దం-అ. ఉపనిషత్తులయొక్క గర్భమున రహస్యముగా నుంచఁబడినదియు సంసారమును నిరాకరించునదియుఁ బరమార్థవస్తువును బోధించునదియునైన జ్ఞానమును ఇతరపండితులచే వివరింపఁబడినదైనను గురువులయాజ్ఞచేఁ జెప్పుచున్నాను.

తా. వేదాంతములనిచెప్పఁబడు బృహదారణ్యక ఛాందోగ్య ముండకాద్యుపని షత్తులలోఁ జెప్పఁబడియుండినను అపరిశుద్ధాంతఃకరణగలవారిచేఁ దెలియ శక్యము గాక పాతాళమందు పెట్టఁబడిన మహానిధివలె నతిరహస్యముగానున్న తత్త్వజ్ఞానమును నేనీగ్రంథములో వివరించుచున్నాను. ఈజ్ఞానము జీవాత్మపరమాత్మలయొక్క ఐక్య మును జెప్పి జీవాత్మయందు గన్పట్టుచున్న సద్వానర్థసంపాదకంబైన సంసారమును నిశ్శే షముగ చిమ్మివేయును. ఇట్టిజ్ఞానము నింతకుమును పే కృష్ణద్వైపాయన శుక గౌడపా దాది మహామునులచే విస్తారముగ శారీరకమీమాంసాదిగ్రంథములలో వివరింపఁబడి యున్నందున నే నీగ్రంథమును రచియించుట యనావశ్యకమైనను, మాగురువులు నన్నో క గ్రంథమును రచియింపమని యాజ్ఞాపించుటచే వారియాజ్ఞను పరిపాలించుటకై నే నీ గ్రంథములో పూర్వోక్తమైన జ్ఞానమును వివరించుచున్నానని భావము. శ్రీశంకరభగ వత్పాదులవారు తామురచియించిన బ్రహ్మసూత్రభాష్యమున కొక్కవార్తికంబు చేయిం పంబూని సురేశ్వరాచార్యులవారికి ఆజ్ఞాపించిరి. పద్మపాదాదిశిష్యులు సురేశ్వరాచా ర్యులు కర్మమీమాంసయం దతిశ్రద్ధకలవారు గావున బ్రహ్మసూత్రభాష్యమునకు వ్యా ఖ్యానముచేయుట తమ కసమ్మతమనిరి. అంతట శ్రీశంకరభగవత్పాదులవారు సురేశ్వ రాచార్యులంజూచి వారి నొకవేదాంతప్రకరణగ్రంథమును రచియింపుడని యాజ్ఞాపిం

చిరి. ఆయాజ్ఞ నవలంబించి సురేశ్వరాచార్యులీగ్రంథమును నిర్మించిరని శంకరవిజయములోని కథ నిచ్చోట ననుసంధింపవలయును.

అవ. ఓయీ! ఈప్రకరణములోఁ జెప్పఁబడినవిషయము జీవాభిన్నబ్రహ్మస్వరూపమని చెప్పితిరి. అది సంగతముకాదు. కొంతదెలిసి కొంతదెలియకయుండువస్తువు విషయంబనంబడు, అనఁగ సామాన్యాకారంబని, విశేషాకారంబని రెండాకారములుగల వస్తువులో సామాన్యాకారంబు దెలిసి విశేషాకారంబు దెలియకయున్న యావస్తువునందు విచారము విశేషాకారము నిర్ణయించుటకు ప్రవర్తించుగావున నది విషయమనఁబడును. బ్రహ్మస్వరూపము నిరాకారమైనందున సామాన్యాకారవిశేషాకారంబులు రెండును లేవు గావుననే బ్రహ్మకొంతభాగము తెలియఁబడి కొంతభాగము తెలియఁబడక యుండునదిగాదు. సమగ్రముగాఁ దెలియఁబడనిదనియే చెప్పఁదగియున్నది. అట్టిబ్రహ్మస్వరూపమీప్రకరణమున కెట్లు విషయమగును? గావున నీప్రకరణమునకు విషయములేదను శాస్త్రమునకు శంకించుచు తత్పరిహారార్థంబుగా నుత్తరశ్లోకము చెప్పఁబడినదని చెప్పుచున్నారు —

వాక్య. కిం విషయం ప్రకరణ మితి చే త్త దుపన్యాసః. ౨౦

సం-టీ. ప్రకరణము ప్రతిపాద్యార్థము కలదిగా దనినచో నాప్రతిపాద్యార్థము యొక్క నిరూపణ చేయఁబడును.

శా. స్పష్టము.

శ్లో. యత్ప్రభా వినా నాస్తి యదనిర్థా న కించన,
ప్రత్యగ్రత్నకనిష్ఠస్య మాహాత్మ్యం వక్ష్యతే స్ఫుటమ్. శ్లో. ౨౧

సం-టీ. దేనియొక్క ప్రకాశము కలుగుచుండఁగా దేహేంద్రియాదిజడపదార్థములయొక్క ప్రకాశము గలుగునో దేనియొక్క ప్రకాశములేనిచో సర్వము గొంచమైనను ప్రకాశింపగలుగదో అట్టిదేహేంద్రియాది సర్వాంతరత్వసర్వప్రపంచాధ్యాసాధిష్ఠానత్వములుగలదై ప్రకాశించిన (అనఁగా సర్వాంతరమై సర్వప్రపంచసమారోపకారణంబైన) చిదాత్మయొక్క వాస్తవస్వరూపము స్పష్టముగాఁ జెప్పఁబడును

శా. దేహేంద్రియాదిపదార్థములు ఘటపటాదిపదార్థములును జడములైనందున ప్రకాశించుయోగ్యతలేకయుండును. చిదాత్మ కేవలచిద్రూపమైనందున స్వయముగాఁ బ్రకాశించుచుండును. అట్టిచిదాత్మ అంతఃకరణమున ప్రతిఫలించి విస్పష్టముగాఁ బ్రకాశించినేని యంతఃకరణము దానివికారరూపములుగా నుండువృత్తులును అవృత్తులతో

సంబంధించిన ఘటపటాదిపదార్థములును సర్వము ప్రకాశించును. చిదాత్మ విస్పష్టముగా ప్రకాశింపనిచో దీపములేనిఇంటిలో రాత్రికాల మేపదార్థమును భాసింపనటుల నొక పదార్థముసైతము భాసింపదు. కావున సర్వపదార్థములకు ప్రకాశకమై దేహేంద్రియాది పదార్థముల కన్నింటికి సాంతరమై సర్వసాక్షియై దేహేంద్రియాది సర్వప్రపంచాధ్యా సాధిష్ఠానంబైన చిదాత్మయొక్క స్వరూపయాథార్థ్యము శారీరకభాష్యాదిగ్రంథము లలో విస్తారముగఁ జెప్పఁబడి యున్నను చిదాత్మస్వరూపనిర్ణయార్థమై కావలసిన సందర్భమంతయు నొక్కచోటను జెప్పఁబడియుండనందున బుభుత్సువులబుద్ధి చిదాత్మ స్వరూపయాథార్థ్యమును త్వరలోఁ దెలియఁజాలక చిక్కువడుననియోచించి చిదాత్మ స్వరూపనిర్ణయముకొఱకు కావలసినసందర్భమునంతయును నే నీగ్రంథములో నొక్క చోఁ జేర్చి విస్పష్టముగా సంగ్రహముగఁ జెప్పుచున్నానని భావము. ఇందుచే సర్వ ప్రపంచాధ్యాసంబున కధిష్ఠానంబై సర్వపదార్థప్రకాశకంబై సర్వసాక్షియై స్వయం ప్రకాశమానమై యద్వితీయమై జీవాభిన్నమైన బ్రహ్మస్వరూపమే యీప్రకరణమునకు ప్రతిపాద్యవిషయమని చెప్పఁబడెను. ఇట్టి పరమాత్మ నిరాకారంబైనను సచ్చిదానందా త్మకమైన సామాన్యాకార మొకటియు సర్వసాక్షిత్వ సర్వాధిష్ఠానత్వాద్వితీయత్వా ద్యాకార మొకటియు రెండాకారములు మాయచే నొందియున్నది. వానిలో సచ్చిదా నందాకారము ప్రత్యక్షముగఁ దెలియఁబడుచున్నప్పటికిని సర్వసాక్షిత్వాద్యాకారము వేదాంతవాక్యవిచారముచేతనే ప్రకాశింపఁదగియున్నది. కావున చిదాత్మయొక్క భాగముచేత ప్రకాశించి మఱియొకభాగముచేఁ బ్రకాశింపకయున్నందున విషయమనఁ బడును. ఇట్టి చిదాత్మయని చెప్పఁబడు బ్రహ్మస్వరూపము ఈశాస్త్రమునకు ప్రతిపాద్య విషయమై యున్నది. 'ఘటోఽస్తి, ఘటోభాతి, ఘటఇష్టః' ఇత్యాది లోకవ్యవహారముల యన్నింటియందును సచ్చిదానందములు ప్రకాశించుచున్నవి. 'ఘటోఽస్తి' ఘటముకలదను వ్యవహారమునందు సత్తయును, 'ఘటోభాతి' ఘటము ప్రకాశించుచున్నది యనువ్యవ హారమునందు ప్రకాశమని చెప్పఁబడుచిత్తును, 'ఘటఇష్టః' ఘటము ఇష్టమైనది యనువ్య వహారమునందు ఆనందమును భాసించుచున్నందున బ్రహ్మయొక్క సచ్చిదానందాకారము సామాన్యముగాఁ దెలియఁబడుచున్నదని అఖండసచ్చిదానందత్వాద్వితీయత్వాద్యాకార ము వేదాంతవాక్యవిచారముచేసినఁగాని దెలియఁబడదని యెఱుఁగునది.

అవ. బ్రహ్మస్వరూపయాథార్థ్యమును స్పష్టముగాఁ జెప్పినందున తనయాచా ర్యులు బ్రహ్మస్వరూపమును యథార్థముగ చెప్పలేదని తోఁచుచున్నది. అందుచేఁ దన యాచార్యులకు బ్రహ్మస్వరూపము బాగుగఁ దెలియలేదనిగాని విపరీతముగఁ దెలిసినది

యనిగాని చెప్పవలయుం. అట్లు చెప్పినచోఁ దన కాయాచార్యోపదేశముచేఁ బ్రాప్తించిన బ్రహ్మజ్ఞాన మజ్ఞానప్రాయమనిగాని విపరీతమనిగాని చెప్పవలయునుగదా! అప్పుడీ గ్రంథమున బ్రహ్మస్వరూపయాథార్థ్యమును స్పష్టముగా చెప్పెదనని చేసిన ప్రతిజ్ఞ యసంగతమగునని యోచించి తనయాచార్యులయం దజ్ఞానవిపరీతజ్ఞానములు లేవనిచెప్పుటకీయుత్తరశ్లోకము నవతరించుచున్నదని చెప్పుచున్నారు.—

వాక్య. వివక్షితప్రకరణార్థప్రరోచనాయ అనుక్తదురుక్తాప్రామాణ్యాకారణశంకావ్యుదాసేన స్వగురోః ప్రామాణ్యోపవర్ణనమ్ ౨౨

దం-అ. చెప్పఁదలచినప్రకరణార్థమున శిష్యులకు రుచినిబుట్టించుటకొఱకు ఆయథార్థవాదిత్వబుద్ధికి నిమిత్తములైన అనుక్తదురుక్తములయొక్క శంకను నిరాకరించుటచేత స్వాచార్యులకు యథార్థవాదిత్వమును వర్ణించుట యావశ్యకమైయున్నది.

తా. ఈప్రకరణమున తాను జెప్పందలఁచిన యర్థమునందు శిష్యులకు రుచిగలిగినంగాని వా రాయర్థమునందుఁ బ్రవర్తింపరు గావున శిష్యులకు రుచిని యవశ్యముగా సంపాదింపవలసియున్నది. అందులకై స్వాచార్యులు యథార్థ వాదియని, సర్వజ్ఞులని చెప్పి వారియనుగ్రహముచేఁ దనకు ప్రాప్తించినజ్ఞాన మీప్రకరణములోఁ జెప్పఁబడెనని వర్ణింపవలయు. తనగురువులు నిర్మించిన శారీరకభాష్యాదిగ్రంథములలో చెప్పవలసినయర్థములు చెప్పకపోవుటగాని విపరీతముగఁ జెప్పుటగాని లేదుగావున స్వాచార్యులు సర్వజ్ఞులును యథార్థవాదులును అని భావము.

శ్లో. గురుణోక్తో వేదరాద్ధాంత స్తత్ర నో వచ్మ్యశక్తితః,
సహస్రకిరణవ్యాప్తే ఖద్యోతః కింప్రకాశయేత్. ౫-౨౩

దం-అ. వేదములయొక్క సిద్ధాంతము ఆచార్యులచేఁ జెప్పఁబడినది. ఆవేదసిద్ధాంతమునందు సామర్థ్యములేనందున నేనేమియుఁ జెప్పఁజాలను. సూర్యునిచే వ్యాపింపఁబడిన (ప్రకాశింపఁజేయఁబడిన) విషయమును మిణుగురుపురువు లేమి ప్రకాశింపఁ జేయఁగలదు?

తా. అస్మర్యమాణకర్తృకంబులయినందున పురుషప్రణీతంబులు గాకయుండి భ్రమ, విప్రలంభము మొదలగు దోషములకు దూరమై యన్నింటికి శ్రేష్ఠమగు ప్రమాణగ్రంథములైన వేదములనెల్ల చక్కగా శోధించి, యాశోధనచే వెలువడిన సారమును శారీరకభాష్యాదిగ్రంథములలో బ్రహ్మస్వరూపయాథార్థ్యగోచరంబైన

సిద్ధాంతము నిస్సందియముగా మాగురువులచే ప్రతిపాదింపఁబడియున్నది. ఆయర్థమున నే నెక్కువగాఁ జెప్పున దెంతమాత్రమును లేదు. అంత కధికముగఁ జెప్పుటకును గాని, యంతమాత్రము చెప్పుటకుఁగాని నేను శక్తుఁడను గాను. సూర్యుఁ డొకవస్తువును ప్రకాశింపఁజేయుచుండఁగా మిణుగురుపురు వావస్తువును తనశక్తిచే సూర్యునికంటె యెక్కువగఁగాని, యంతమాత్రముగాని ప్రకాశింపఁజేయదుగదా? శారీరకభాష్యాదిగ్రంథములలో మాయాచార్యులు చెప్పిన యర్థము వేదములయొక్క తాత్పర్యమే గావున దురుక్తముగానేరదు. "శ్లో. గుశబ్ద స్త్వంధకారస్స్యా ద్రుశబ్ద స్తన్నిరోధకః, అంధకార నిరోధిత్వా ద్గురు రిత్యభిధీయతే" అను నిర్వచనప్రకారము మాగురువులు అజ్ఞానాంధకారముచే వ్యాపింపఁబడిన సంసారమహారణ్యములోఁబడి దరిగానక యీఁదులాడుచున్న జనుల యజ్ఞానాంధకారమును బోఁగొట్టి రక్షించుకొఱకు శారీరకభాష్యాదిగ్రంథమను తీక్ష్ణమైనసూర్యబింబమును కల్పించిరి. కావున మోక్షేచ్ఛాపరుల కపేక్షితములైన యర్థములనన్నిటిని జెప్పిరిగాని కొన్నిటిని చెప్పకపోయినదిలేదు. కావున వారియం దప్రామాణ్యబుద్ధిని జేయందగదని భావము. గురుశబ్దములోని 'గు' అనునక్షరము అజ్ఞానాంధకారమును జెప్పును. 'రు' అనునక్షరము దానియొక్క నివారణమును జెప్పును. కావున నజ్ఞానాంధకారమును నిరాకరించువారు గురువని చెప్పంబడునని నిర్వచనశ్లోకార్థము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారిక చెప్పఁబడుచున్నది.—

వాక్య. గురుణైవ వేదార్థస్య పరిసమాపితత్వా త్ప్రికరణోక్త్యా
ఖ్యాత్యాద్యప్రామాణ్యకారణాశంకేతి చేత్తద్వ్యదా
సార్థ ముపన్యాసః. ౨౮

దం-అ. ఆచార్యులచేతనే వేదాంతసిద్ధాంతము సమగ్రముగా చెప్పి సమాప్తినొందింపఁబడియుండఁగా మీ రీగ్రంథరచనకు గడంగుటకు ఖ్యాతిలాభపూజలను అప్రామాణ్యహేతువులయొక్క శంకకలుగునని యనినచో దాని నిరసించుకొఱకు నుత్తరశ్లోకముయొక్కరచన యావశ్యకమయినది.

తా. మీ కాచార్యులగు శ్రీశంకరభగవత్పాదులే వేదాంతసిద్ధాంతము నేకొఱత లేకుండ నిశ్చయించి గ్రంథములను జేసియుండిరి. కావున తా మీగ్రంథమును జేయుటకు కారణము గాన్పించదు. ఆచార్యులవారు శారీరకభాష్యాదిగ్రంథములయం దచ్చటచ్చట నర్థాంతరమధ్యమందు చేర్చిచెప్పిన తత్త్వార్థమునంతయు నొకచోటఁ జేర్చి మేము చెప్పవలసియున్నది. అదియె యీగ్రంథరచనకు గారణమని చెప్పినచో నాచార్యులవారే యుపదేశసాహస్రి మొదలగు గ్రంథములను రచియించి వానియందు తత్త్వార్థ

మునంత నొకచోటఁ జేర్చి చెప్పియున్నందున నావిధమున చెప్పఁదగినదిగ నుండలేదు. గావున మీరీగ్రంథరచనకు కారణము ఖ్యాతి లాభ పూజలకని తోఁచుచున్నది. ఖ్యాతి లాభపూజల నపేక్షించువారలు తఱచుగా నప్రామాణికులుగ నున్నారు. అట్టి యప్రామాణికులచే రచియింపఁబడిన గ్రంథములు ముముక్షువులకెల్ల ఆదరణీయంబై యుండవని కొందఱు శంకించెదరు; ఆశంకను నివారించుటకొఱకీ శ్లోకము చెప్పఁబడుచున్నది. ఖ్యాతియనఁగా కీర్తి, లాభమనఁగా రాజసన్నిధానమున నీగ్రంథమును వినిపించినవారిచే నియ్యంబడు ధనకనకవస్త్రవాహనాదిప్రాప్తి, పూజయనఁగా తదితరజనులచేఁ జేయఁబడు అర్ఘ్యపాద్యమృష్టాన్నప్రదానాది సన్మానము. వీనిని గోరువారు సాధారణముగా తత్త్వజ్ఞులు కారని లోకమునందును శాస్త్రమునందును సుప్రసిద్ధమైయున్నది.

అవ. ఆశ్లోక మేదియనిన చెప్పుచున్నారు.—

శ్లో. నఖ్యాతి లాభ పూజార్థం గ్రంథోఽస్మాభి రుదీర్యతే,
స్వబోధ పరిశుద్ధ్యర్థం బ్రహ్మవిన్నికషాశ్మసు. ౬. ౨౪

దం-అ. ఖ్యాతి లాభపూజలకొఱకు మాచే గ్రంథము చెప్పఁబడినది కాదు. బ్రహ్మవేత్తలను సానలయందు మాజ్ఞానమును పరిశుద్ధముగాఁ జేసికొనుటకొఱకుఁ జేయఁబడుచున్నది.

తా. ఖ్యాతి లాభపూజనలకై యీగ్రంథము చెప్పఁబడదేమ. అందులకని నే నీగ్రంథమును రచియింపలేను. ఆచార్యానుగ్రహమునఁ లభించిన నాతత్త్వజ్ఞానమును బ్రహ్మవేత్తలకుఁ దెలియఁజేసి యుక్తిప్రకారము హెచ్చుతగ్గులున్నచో దానిని పూర్తిజేసికొని తత్త్వజ్ఞానమును శుద్ధమైనదిగఁ జేసికొనుటకొఱకే యీగ్రంథమును రచియించితిని. బంగారపుకునకు యెంతవన్నెగలదో తెలియంగోరువారు ముందుగా సానరాతియందు ఆబంగారపుకునకు నొరసిచూచి వన్నెతక్కువగానుండినచో మఱియొకపుటమును వేసి వర్ణమును సంపూర్ణమైనది యగునట్లు చేయుచున్నారు. వన్నె పూర్తిగనుండిన యూరకుందురు. అప్రకారమే నే నాచార్యోపదేశముచే లభించిన తత్త్వజ్ఞానము సంపూర్ణముగనున్నదా? కాదుగనున్నదా? యని తెలియంగోరి బ్రహ్మవేత్తలు నాతత్త్వజ్ఞానమును పరీక్షించుటకు నీగ్రంథమును రచియించితిని. గ్రంథమును రచియింపనిచో బ్రహ్మవేత్తలకు నాతత్త్వజ్ఞానముయొక్క పూర్ణత్వాపూర్ణత్వము లెట్లు తెలియును? బ్రహ్మవేత్తలు నాచే రచియింపఁబడిన గ్రంథమునుజూచి తత్త్వజ్ఞానము సంపూర్ణమని చెప్పినచో నేను కృతకృత్యుండనని సంతసించెదను. కాదుగానున్నదనిన నాకొదు

నాశమే పురుషార్థమని ప్రకరణార్థంబులు నాల్గింటిలో ఆనర్థతత్కారణపురుషార్థములు మూఁడు చెప్పఁబడెను.

అవ. ప్రకరణార్థము నాలుగింటిలో మూఁటినిచెప్పి శేషించినదానిని చెప్పుటకు ముందరిశ్లోకము ప్రవర్తించుచున్నది యని చెప్పుచున్నారు.—

వాక్య. పురుషార్థహేతో రవశిష్టత్వా త్తదభివ్యాహారః. ౨౮

దం—అ. పురుషార్థముయొక్క సాధనము శేషించినదిగాన దానిని చెప్పునది యీశ్లోకము.

తా. అనర్థ, తత్కారణ, పురుషార్థ, తత్సాధనములు నాలుగు ప్రకరణమున చెప్పఁబడినవిషయము లనిచెప్పి వెనుకటిశ్లోకములో మొదటిమూఁటిని కాన్పించినందున పురుషార్థసాధనము శేషించి చెప్పఁబడవలసినదై యున్నది. దానిని చెప్పుట కీశ్లోకము రచింపఁబడుచున్న దనిభావము.

అవ. శ్లోకము నుదాహరించుచున్నారు.—

శ్లో. వేదావసానవాక్యోత్థ సమ్యగ్జ్ఞానాశుశుక్షణిః,
దందహీత్యాత్మనో మోహం నకర్మా ప్రతికూలతః. ౮. ౨౯

దం-అ. వేదాంతములయందుఁగల మహావాక్యములచేతఁ బుట్టి తత్త్వజ్ఞానమను వహ్ని చిదాత్మయొక్క అజ్ఞానమును దహించును. యాగదానాదికర్మయోగము విరోధిగానందున దహింపఁజాలదు.

తా. ఉపనిషత్తులన వేదములయొక్క శిరోభాగములు. అవి వేదములవలె పరమప్రమాణములుగాని యప్రమాణములని చెప్పందగదు. అట్టి యుపనిషత్తులయందు జీవస్వరూపమును జెప్పు వాక్యములుకొన్ని, బ్రహ్మస్వరూపమును జెప్పువాక్యములుకొన్ని, జీవబ్రహ్మలయైక్యమును జెప్పువాక్యములుకొన్ని వినఁబడుచున్నవి. వీనిలో జీవవిషయకవాక్యములు బ్రహ్మవిషయకవాక్యములు ఈరెండును అవాంతరవాక్యములని, జీవబ్రహ్మైక్యమును జెప్పువాక్యములు మహావాక్యములని చెప్పఁబడును. వీనిలో మహావాక్యములను సదాచార్యుల సన్నిధానమందుచేరి యథావిధిగా విని ఆయర్థమును సయుక్తికముగా మననముచేసి నిస్సంశయమగు నాయర్థము నేకాగ్రచిత్తముతో భావనచేసిన జీవబ్రహ్మైక్య సాక్షాత్కారజ్ఞానము పుట్టును. అట్టిజ్ఞానము అగ్ని దూదిపింజను దహించినట్లు ఆత్మయొక్కయజ్ఞానమును నిశ్శేషముగ దహించును. వేదములయొక్క ప్రథమభాగములోఁ జెప్పఁబడిన యాగదానహోమాదికర్మలు అజ్ఞానమువలె జడములై అజ్ఞానకల్పితమైన యజమాన ఋత్విక్పురోడాశభేదము నవలంబించి ప్రవర్తించుచు

న్నందున అజ్ఞానమునకు విరోధులుకావు గావున అజ్ఞానమును నశింపఁజేయఁజాలవని భావము. ఇందుచే ప్రకరణార్థములు నాల్గింటిలో పురుషార్థసాధనము వేదాంతమహావాక్యజన్యజ్ఞానమని చెప్పఁబడెను.

అవ. ఉత్తరగ్రంథసందర్భమునకు సంగతిని చేయుచున్నారు.—

వాక్య. ప్రతిజ్ఞాతార్థ సంశుద్ధ్యర్థం పూర్వపక్షోక్తిః. 30

దం-అ. ప్రతిజ్ఞచేసినయర్థమును శుద్ధముగా చేయుటకొఱకు పూర్వపక్షము చెప్పఁబడును.

తా. పూర్వపక్షసిద్ధాంతములను జేసి విచారించిన యర్థము నిస్సంశయమై యుండుగావున వేదాంతమహావాక్యజన్యజ్ఞానమే మోక్షసాధనము. కర్మలు కావనిచెప్పినయర్థమును స్థిరపఱచుటకొఱకు ముందుగా పూర్వపక్షము చెప్పఁబడునని భావము.

వాక్య. తత్ర జ్ఞాన మభ్యుపగమ్య తావ దుపన్యాసః. 31

దం-అ. ఆపూర్వములో వేదాంతమహావాక్యజ్ఞానము కలదని అంగీకరించి ముందుగా పూర్వపక్షము ప్రతిపాదింపఁబడును.

తా. జ్ఞానమే మోక్షసాధనమనిచెప్పిన అర్థమునం దనేకవిధములైన పూర్వపక్షంబు లుపన్యసింపఁబడును. వానిలో వేదాంతజన్యజ్ఞాన ముండిననుండుగాక. అది మోక్షంబునకు సాధనముగాదు. యాగదానాదికర్మలే మోక్షసాధనంబులని ముందుగా పూర్వపక్షము చేయఁబడుచున్నదని భావము.

అవ. పూర్వపక్షము భాట్టమతము ననుసరించి చేయఁబడుచున్నది.—

శ్లో. ముక్తేః క్రియాభిః సిద్ధత్వాత్ జ్ఞానం తత్ర కరోతి కిమ్,
కథంచేత్ శ్రుణు తత్సర్వం ప్రణిధాయ మనో యథా. ౯. 32

దం-అ. మోక్షము కర్మలచేతనే సిద్ధించుచుండ జ్ఞానము ఆమోక్షమునం దేమి చేయును? ఏవిధమనినచో దానినంతయును చెప్పెద. మనస్సును వాస్తవముగా నేకాగ్రముచేసి వినుము.

తా. తత్త్వజ్ఞానమును, వేదాంతవాక్యశ్రవణముచే సంపాదించుకొనినవారు సైతము "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి, అహరహ స్సంధ్యా ముపాసీత" మొదలగుశ్రుతివాక్యములచే విధింపఁబడుచున్న సంధ్యావందనాగ్నిహోత్రాదికర్మల నవశ్యము చేయవలయునుగదా? వాని త్యజించిన "వీరహావాఏష" ఇత్యాదిశ్రుతులు మహాపాతకము గలుగుచున్నదనిగదా చెప్పుచున్నవి. కావున నవశ్యకర్తవ్యములైన నిత్యనైమిత్తిక

కర్మలచేతనే మోక్షము సంభవించుచుండఁగా తత్త్వజ్ఞానముతో ప్రయోజనములేనందున తత్త్వజ్ఞానమే మోక్షసాధనమని చెప్పఁదగదు. మోక్షము నిత్యమనిగదా చెప్పఁబడుచున్నది. అట్టి మోక్షము కర్మలచే సాధింపఁబడిన అనిత్యము కాదా యని యాక్షేపింపఁదగదు. ఆత్మయొక్క స్వరూపావస్థానమే మోక్షమనఁబడును. అది నిత్యసిద్ధము గావున కర్మలచే సాధింపఁబడునది కాదు. అయిన నట్టిస్వరూపావస్థానమునకు అనాది కర్మఫలానుభవము ప్రతిబంధకమైయున్నది. అట్టిప్రతిబంధకము నివర్తించిన స్వతస్సిద్ధమైన స్వరూపావస్థానము గోచరించును. ప్రతిబంధకమును నివర్తింపఁజేయుట కర్మసాధ్యంబుగాని స్వరూపావస్థానము కర్మసాధ్యము కానేరదు. కావున మోక్షమున కనిత్యత్వ మురాదు. ఈయర్థమునంతయు విస్తారముగ నిరూపించెదము. సావధానచిత్తులరై వినుండని భావము. బ్రతికియుండువఱకు నగ్నిహోత్రమును చేయవలసినది, ప్రతిదినమును సంధ్యావందనమును చేయవలసినది. అగ్నిహోత్రమును చేయనివాఁడు బ్రహ్మహత్యచేసినవాఁడవునని శ్రుతుల కర్థము.

అవ. తత్త్వజ్ఞానము లేకపోయినను కేవలకర్మలచేతనే మోక్షము సిద్ధించు ప్రకారమును పూర్వపక్షవాది నిరూపించుచున్నాఁడు.—

శ్లో. అకుర్వతః క్రియాః కామ్యాః నిషిద్ధా స్త్యజత స్తథా,
నిత్యనైమిత్తికం కర్మ విధివ చ్చానుతిష్ఠతః. ౧౦. 33

దం-అ. కామ్యకర్మలను చేయక ఆప్రకారమే నిషిద్ధకర్మలను పరిత్యజించి నిత్యనైమిత్తికకర్మను యథావిధిగా చేయుచున్నవానికి మోక్షము సంభవించును.

తా. పుత్త్రపశుస్వర్గాదిఫలములను గలుగఁజేయుచున్న పుత్త్రకామేష్టి చిత్రాయాగజ్యోతిష్టోమాదికర్మలు కామ్యములని చెప్పఁబడును. సురాపానపరదారగమనాది కర్మలు నిషిద్ధకర్మలని చెప్పఁబడును. సంధ్యావందనాగ్నిహోత్రాదికర్మలు నిత్యములని, జాతేష్టి, గృహదాహేష్టి, విశ్వజిద్యాగాదిశ్రౌతకర్మలు గ్రహణస్నానాదిస్మార్తకర్మలు నైమిత్తికములని చెప్పఁబడును. వీనిలో కామ్యకర్మల నాచరించిన స్వర్గాది సుఖముల ననుభవింపవలసియుండును. నిత్యనైమిత్తికకర్మల నాచరింపకపోయిన పాపమునుసంభవించి నరకాదిదుఃఖముల ననుభవింపవలసియుండును గాని యాచరించిన నేఫలమును గలుగదు. కావున కామ్యకర్మలను నిషిద్ధకర్మలను ద్యజించి నిత్యనైమిత్తికములను మాత్రముయథావిధిగనాచరించువానికి స్వరూపావస్థానమోక్షమవశ్యముగాఁ గలుగును. ఏనఁగా నిత్యనిర్వికారుఁడగు నాత్మకు సుఖదుఃఖాదిసంసారము అవిద్యచేత కలిగినదని

చెప్పెడువేదాంతియును, (౧) "పుణ్యః పుణ్యేన కర్మణాభవతి, పాపః పాపేన కర్మణా బధ్యతే జంతుః" అను మొదలగు శ్రుతిస్మృతివాక్యముల ననుసరించి సంసారమునకు కర్మయును కారణమని యవశ్యముగా జెప్పవలసియుండును. అందుచే నిత్యనిర్వికారమైన యాత్మస్వరూపమునకు ప్రచ్యుతి పుణ్యపాపకర్మలచేతనే కలిగెనని నిశ్చయింపవలయును. అట్టిపుణ్యపాపకర్మలు కామ్యనిషిద్ధకర్మానుష్ఠాన నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానంబులచేతంగదా పుట్టుచున్నవి. కామ్యనిషిద్ధకర్మల నాచరింపక నిత్యనైమిత్తికంబుల నాచరించుచుండిన పుణ్యపాపంబులు జన్మింపవు. పుణ్యపాపంబులు జన్మింపకఁబోయిన ఆత్మస్వరూపమునకు ప్రచ్యుతికలుగదు. అప్పుడాత్మకు స్వరూపావస్థానరూపంబైన మోక్షము ప్రతిహతముగాఁ గలుగుఁగావున ఆత్మస్వరూపావస్థానరూపమోక్షమునకు కర్మలు సాధనముగాని జ్ఞానము సాధనముగాదని తాత్పర్యము.

అవ. కామ్యకర్మపరిత్యాగాదిసాధనముల ననుష్ఠించిన స్వరూపావస్థానరూపమగు మోక్ష మేవిధముగాఁ గలుగునని సిద్ధాంతవాది ప్రశ్నఁజేయుచున్నాఁడు.—

వాక్య. కిమతో భవతి. ౩౪

దం-అ. అందువలన నేమియగును?

తా. కామ్యకర్మలను నిషిద్ధకర్మలను పరిత్యజించి నిత్యనైమిత్తికములనుమాత్రము నాచరించుచున్న స్వరూపావస్థాన మేవిధముగ గలుగునో ఆవిధమును చెప్పుమనిభావము.

అవ. పూర్వపక్షవాది సిద్ధాంతము చేసినప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. కామ్యకర్మఫలం తస్మా ద్దేవాదీత్వం నఢౌకతే,
నిషిద్ధస్య నిరస్తత్వా న్నారకీం నైత్యధోజనిమ్. ౧౧. ౩౫

దం-అ. అందువలన కామ్యకర్మలకు ఫలమైన దేవాదిజన్మలను పొందఁడు. నిషిద్ధకర్మను నిరసించినందున నరకసంబంధమైన హీనగతిని పొందఁడు.

తా. జ్యోతిష్టోమాదికామ్యకర్మల నాచరించిన స్వర్గాదిలోకములకు బోయి యచ్చట దేవస్త్రీ పారిజాతకుసుమాదిభోగముల ననుభవింపవలసియుండును గావున తద్భోగానుగుణమైన దేవదేహంబు నొందును. సురాపానాదినిషిద్ధకర్మాచరణము చేసిన నరకలోకమున కేగి తప్తకుంభాదిమహానరక దుఃఖముల ననుభవింపవలసియుండును గాన

---

౧. పుణ్యకర్మచే పుణ్యపురుషుఁడై పుట్టును. పాపకర్మచే పాపపురుషుఁడై పుట్టును. పుణ్యపాపకర్మలచే జీవుఁడు బంధింపఁబడుచున్నాఁడు. అని శ్రుతి స్మృతి వాక్యముల కర్థము.

కదోభోగానుగుణంబైన యాతనాశరీరమునొందును. ఆరెంటిని విడిచియుండుటచే నుత్తమమైన దేవశరీరమునుగాని నికృష్టమైన యాతనాశరీరమునుగాని పొందఁడనిభావము. ఇందుచేత పుణ్యపాపమిశ్రంబైన మనుష్యాదిశరీరంబులుగూడ కలుగవని భావము.

అవ. సంచితకర్మల కీవిధముగ పరిహారము కలిగినఁ గలుగవచ్చును. ప్రారబ్ధకర్మల కేవిధముగ పరిహారముకలుగునని సిద్ధాంతవాది ప్రశ్నఁజేయునని తలఁచి పూర్వపక్షవాది పరిహారమును చెప్పుట ఉత్తరశ్లోకతాత్పర్యమని చెప్పుచున్నారు.—

వాక్య. దేహారంభకయోశ్చ ధర్మాధర్మయోః జ్ఞానినాసహాకర్మిణః
సమానౌ చోద్యపరిహారౌ. ౩౬

దం-అ. దేహమును ఆరంభించి (కలుగఁజేసి) యున్న పుణ్యపాపములవిషయమై ఆక్షేపసమాధానములు తత్త్వజ్ఞానసాధనవాదితోఁగూడ కర్మసాధనవాదికిని తుల్యములుగ నున్నవి.

తా. పుణ్యపాపకర్మలు సంచితములు ప్రారబ్ధములని రెండువిధములు. అందులో పూర్వజన్మలయందు సంపాదింపఁబడి ఫలమునిచ్చుట కవకాశమును కనిపెట్టియుండు కర్మలు సంచితములు. వర్తమాన శరీరమును కలుగఁజేసి సుఖదుఃఖముల నిచ్చుచున్న కర్మలు ప్రారబ్ధములు. వీనిలో సంచితములు నిత్యనైమిత్తికము నాచరించుచు కామ్యనిషిద్ధములను పరిహరించుచున్నందువలన నివర్తించును. ప్రారబ్ధకర్మలు వర్తమానశరీరమునందు ఫలమును కలుగఁజేయుచున్నందున ఏవిధమున నివర్తించునని యన్యులాక్షేపించిన అనుభవముచేతనే నివర్తించునని కర్మలు మోక్షసాధనమని వాదించు నేను, సమాధానమును చెప్పెదను. తత్త్వజ్ఞానము మోక్షసాధనమని వాదించు నీవును, తత్త్వజ్ఞానముచే సంచితకర్మలు నశించినను, ప్రారబ్ధకర్మ లేవిధముగ నశించునని యాక్షేపించినవారలకు అనుభవముచేతనే నశించునని సమాధానమును చెప్పవలసియుండుం గావున ప్రారబ్ధవిషయమై శంకాపరిహారములు మనకిరువురకు సమానములని చెప్పుట ఉత్తరశ్లోకమునకు తాత్పర్యమని భావము.

అవ. శ్లోకము నుదాహరించుచున్నాఁడు.—

శ్లో. వర్తమాన[2] మిదం[3] యాభ్యాం[5] శరీరం[4] సుఖదుఃఖదమ్,[1]
ఆరబ్ధం[7] పుణ్యపాపాభ్యాం[6] భోగాదేవ[10] తయోః[8] క్షయః.[9] ౧౨. ౩౭

దం-అ. సుఖదుఃఖముల నిచ్చుచున్న[1] వర్తమానమైన[2] ఈశరీరము[3] ఏపుణ్య[4] పాపము[5]లచేఁ[6] జేయఁబడినదో[7] ఆపుణ్యపాపములకు[8] వినాశము[9] అనుభవమువల్లనే.[10]

తా. సుఖదుఃఖముల నిచ్చుచుండు నీశరీరమును కలుగఁజేసియున్న ప్రారబ్ధకర్మలు అనుభవముచేతనే నశించును. అని చెప్పెడివిషయములో మాత్రము జ్ఞానసాధనవాది వైన నీకును కర్మసాధన వాదినైన నాకును వివాదములేదు. సంచితకర్మలు నిత్యనైమిత్తికకర్మానుష్ఠానముచే నశించునని నేనును తత్త్వజ్ఞానముచే నశించునని నీవును చెప్పుచున్నాము; ఇదియే మనకిరువురకు భేదమని తాత్పర్యము.

అవ. కామ్యకర్మలను నిషిద్ధకర్మలను విడిచియున్నఁజాలదా? నిత్యనైమిత్తికకర్మల నాచరింపవలసిన యావశ్యకమేమని కొందఱుచేయు నాక్షేపమును పూర్వపక్షవాది యనువదించుచున్నాఁడు.—

వాక్య. కామ్యప్రతిషిద్ధ కర్మఫలత్వా త్సంసారస్య తన్నిరాసే
నైవాశేషానర్థ నిరాసస్య సిద్ధిత్వాత్కిం నిత్యానుష్ఠానే
నేతిచేత్. ౩౭

దం-అ. సంసారము కామ్య నిషిద్ధకర్మలయొక్క ఫలమౌటవలన కామ్యనిషిద్ధకర్మలను విడిచినందుచేతనే సకలమైన యనర్థముయొక్క నివారణము సిద్ధించునది గావున నిత్యకర్మల నాచరించుటచేత నేమిప్రయోజనము అనిచెప్పిన.

తా. జ్యోతిష్టోమాదికామ్యకర్మల నాచరించినందున పుణ్యముకలుగును. సురాపానాదినిషిద్ధకర్మల నాచరించిన పాపముకలుగును. ఈపుణ్యపాపములయొక్క ఫలములు సుఖదుఃఖములు; వానియొక్క యనుభవమే సంసారము; అట్టిసంసారము పుణ్యపాపములు పుట్టకపోయిన నశించును. కామ్యనిషిద్ధకర్మల నాచరింపకయుండిన పుణ్యపాపములు పుట్టకయుండు గావున కామ్యకర్మనిషిద్ధకర్మలఁ బరిత్యజించి యున్నమాత్రంబుననే సర్వానర్థరూపమగు నీసంసారము నివర్తించుచుండ నిత్యనైమిత్తికకర్మల ననుష్ఠించుట నిష్ప్రయోజనమని కొందఱు శంకించెదరని భావము.

అవ. ఆయాక్షేపమును పూర్వపక్షవాదియే పరిహరించుచున్నాఁడు.—

వాక్య. తన్న తదకరణా దప్యనర్థప్రసక్తేః. ౩౮

దం-అ. ఆనిత్యనైమిత్తికకర్మల నాచరింపకపోయినను అనర్థము ప్రసక్తమగును (ప్రాప్తించును) కావున నదికాదు.

తా. నిత్యనైమిత్తికకర్మల నాచరించుట నిష్ప్రయోజనమని చెప్పందగదు. నిషిద్ధకర్మల నాచరించుటచేత నేప్రకారము పాపముపుట్టునో ఆప్రకారమే నిత్యనైమిత్తికకర్మల నాచరింపకపోయినను పాపముపుట్టును. దానిచే దుఃఖరూపమైనసంసారము

ంభవించును గావున కామ్యనిషిద్ధపరిత్యాగం బావశ్యకంబైనటుల నిత్యనైమిత్తిక కర్మా
ష్ఠానంబుగూడ నావశ్యకంబై యున్నది. స్మృ. "అకుర్వ న్విహితం కర్మ నిందితంచ
మాచరన్, ప్రసజం శ్చేంద్రియార్థేషు నరః ప్రతన మృచ్ఛతి." అనుమనుస్మృతివచ
ము నిషిద్ధకర్మల నాచరించుటవలె విహితకర్మల నాచరింపకపోవుటయును పాపము
కు కారణమని చెప్పుచున్నదని భావము. శ్రుతిస్మృతివిహితంబైన సంధ్యావందనాది
ర్మల నాచరింపక నిషిద్ధంబులైన సురాపానాదికర్మల నాచరింపుచు శబ్దాదివిషయంబు
యం దత్యాసక్తుండై ప్రవర్తించుమనుష్యుఁడు పాతిత్యమును బొందునని మనువువచ
మున కర్థము.

అవ. ఈయర్థమును శ్లోకముతోఁజెప్పి మొదటిపూర్వపక్షమును ముగించుచు
న్నాఁడు.—

శ్లో. నిత్యానుష్ఠానత శ్చైనం ప్రత్యవాయో న సంస్పృశేత్,
అనాదృత్యాత్మవిజ్ఞాన మతః కర్మాణి సంశ్రయేత్. ౧౩. ౪౦

దం-అ. నిత్యకర్మల ననుష్ఠించుటచే నీపురుషుని పాపము స్పృశింపదు. కావున
ాత్మవిషయమైన తత్త్వజ్ఞానము నాదరింపక కర్మలనే యాశ్రయింపవలయును.

తా. నిషిద్ధకర్మల నాచరింపకపోవుటవలన పాపము సంభవించనటుల నిత్యనైమి
త్తికముల నాదరించుటచే పాపము సంభవింపదు. కావున నాత్మతత్త్వజ్ఞానముతో
ముముక్షువులకు ప్రయోజనమేమియుం గానరాదు. ఆత్మకు స్వస్వరూపావస్థానరూప
మైన మోక్షము దేవతిర్యగాదిజన్మపరంపర నివారింపఁబడిన సంభవించును. జన్మపరం
రానివారణము పుణ్యపాపములు లేకపోయినం గలుగు. కామ్యనిషిద్ధకర్మముల నాచ
ంపక నిత్యనైమిత్తికంబుల నాచరించిన పుణ్యపాపములు లేకపోవును గావున నాత్మత
త్త్వజ్ఞానముతో ప్రయోజనము లేనందున ఆత్మతత్త్వజ్ఞానసాధనములగు సద్గురూపగమన
వేదాంతశ్రవణాదుల నాదరింపక కామ్యనిషిద్ధంబులవిడచి నిత్యనైమిత్తికకర్మల నాచ
ంచుచుండవలయునని భావము.

అవ. ఓయీ! ఆత్మతత్త్వజ్ఞానము నంగీకరించితివేని దానిచే మోక్షముగలుగునని
నెన్నుము. 'తమేవం విదిత్వా అతిమృత్యుమేతి' ఇత్యాదిశ్రుతులు ఆత్మజ్ఞానముచేతనే
మోక్షముగలుగునని గదా చెప్పుచున్నవి యని సిద్ధాంతవాది యాక్షేపించునని తలంచి
పూర్వపక్షవాది ఆత్మజ్ఞానము నంగీకరింపనని రెండవపూర్వపక్షమును జెప్పుచున్నాఁడు.—

వాక్య. అభ్యుపేత్యైవ ముచ్యతే న తు యథావస్థితాత్మవస్తు
విషయం జ్ఞానమస్తి తత్ప్రతిపాదక ప్రమాణాభావాత్. ౪౧

దం-అ. అంగీకరించి యిట్లు చెప్పఁబడినది. ఆత్మతత్త్వమును ప్రతిపాదించు ప్రమాణమే లేనందున యథార్థమైన యాత్మస్వరూపము గోచరింపఁజేయు జ్ఞానము లేదు.

తా. బ్రహ్మస్వరూపవిషయమైన జ్ఞానము వేదాంతవాక్యములవలనఁ గలుగుచున్నదని మేము పరమతము నంగీకరించి యాజ్ఞానము మోక్షమున కుపయోగింపదని చెప్పితిమిగాని బ్రహ్మస్వరూపవిషయజ్ఞాన మొకటికలదని మామతము గానేరదు. ప్రమాణము ననుసరించి ప్రమేయముగలదని చెప్పవలయు. ప్రమాణములేక ప్రమేయముచెప్పిన బుద్ధిమంతులు పరిహసించెదరు. బ్రహ్మస్వరూపజ్ఞానమునుగూర్చి యొకప్రమాణమైనను గాన్పింపదని భావము.

అవ. బ్రహ్మస్వరూపజ్ఞానమునుగూర్చి ప్రతిపాదకప్రమాణములేదని చెప్పిన దానిని శ్లోకముచేఁ జెప్పుచున్నారు.—

శ్లో. [5]యావం త్య[1]శ్చేహ [6]విద్యంతే [4]శ్రుతయః [2]స్మృతిభిః [3]సహ,
[9]విదధ [7]త్యాదరయత్నేన [8]కర్మా[10]తో [11]భూరి [12]సాధనమ్. ౧౪. ౪౨

దం-అ. [1]ఈలోకమునందు [2]స్మృతులతోఁ[3]గూడ [4]శ్రుతు [5]లెన్నికలవో [6]అవియన్నియు [7]మహాప్రయత్నముతోడ [8]కర్మనే [9]విధించుచున్నవి. [10]కావున కర్మయే [11]గొప్ప [12]సాధనము.

తా. శ్రుతులనఁగా వేదములు, స్మృతులనఁగా ధర్మశాస్త్రములు; ఈరెండును సకలజనులకు హితమైనవిషయమును బోధించుచుండును; ఇట్టిశ్రుతిస్మృతులు కర్మలనే పరమతాత్పర్యముతో చెప్పుచున్నవిగాని జ్ఞానమును చెప్పుటలేదు గావున శ్రుతిస్మృతి విహితమైన కర్మయే సకలపురుషార్థములకు సాధనము; మోక్షమునకుగూడ కర్మయే సాధనము అని భావము.

అవ. వేదాంతవాక్యములకు తాత్పర్యము తెలియక నీవు తత్త్వజ్ఞానమునందు ప్రమాణములేదని చెప్పుచున్నావని సిద్ధాంతవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. స్యాత్ప్రమాణా సంభవో భవదపరాధాత్. ౪౩

దం-అ. నీయొక్క దోషమువలన ప్రమాణముయొక్క అభావము కలిగెను.

తా. తత్త్వజ్ఞానమునందు వేదాంతవాక్యములే ప్రమాణములుగ నున్నవి. వాని తాత్పర్యమును నీవు బాగుగ విచారింపకపోయితివి. అందుచేతనే ప్రమాణములు లేవని

నీకుఁ దోఁచినదిగాని వాస్తవముగా తత్త్వజ్ఞానమునందు ప్రమాణములు లేకపోలేదు అని భావము.

అవ. పూర్వపక్షవాది ఉత్తరమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఇతి చేత్తన్న యతః. ౪౪

దం-అ. ఇట్లు చెప్పితివేని యది కానేరదు. ఏలనన చెప్పెద వినుము.

తా. నేను వేదాంతవాక్యములను బాగుగ విచారింపలేదని చెప్పకుము. నేను వేదాంతవాక్యముల నన్నింటిని చక్కఁగా విచారించితిని. వాని నిరూపించెదను. సావధానముగా వినుమని భావము.

అవ. పూర్వపక్షవాది తాను వేదాంతవాక్యములయొక్క తాత్పర్యమును చక్కగా విచారించిన ప్రకారమును శ్లోకముతో చెప్పుచున్నాఁడు.—

శ్లో. యత్నతో వీక్షమాణోఽపి విధిం జ్ఞానస్య న క్వచిత్,
శ్రుతౌ స్మృతౌ వా పశ్యామి విశ్వాసో నాన్యతోఽస్తి నః. ౧౫. ౪౫

దం-అ. నేను ప్రయత్నముచేత పర్యాలోచనమును చేయుచున్నవాఁడనయ్యును జ్ఞానముయొక్క ప్రతిపాదనమును శ్రుతియందుగాని స్మృతియందుగాని యెచ్చటనైనను జూచినవాఁడనుగాను. మఱియొకదానియందు మాకు నమ్మకములేదు.

తా. శ్రుతులను స్మృతులను అన్నిటిని నేను పూర్వోత్తరసందర్భము నవలంబించి విచారించితిని. ఒకచోటనైనను ఆత్మజ్ఞానమునువిధించినవాక్యము ఒకటియైనను కాన్పించలేదు. నీవు ఆత్మజ్ఞానమునందు ప్రమాణములని నమ్మియుండిన ఉపనిషత్తులలోఁగూడ యావజ్జీవము కర్మలను జేయవలయునని విధింపఁబడియున్నది. 'ఆత్మాన ముపాసీత' అనెడువాక్య ముపాసనాఖ్యకర్మవిధాయకమని స్పష్టమేగదా. 'ఆత్మావాఽరే ద్రష్టవ్యః కతమ ఆత్మాయోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః' ఇత్యాది వాక్యములు జ్యోతిష్టోమాది కర్మలయందు కర్తయగు జీవాత్మయొక్కస్వరూపమును చెప్పుచున్నవి. గాని నీకు సమ్మతమైన కర్మకర్తృత్వాదిసకలవిశేషశూన్యమైన ఆత్మస్వరూపమును చెప్పునవిగావు. కావున నాత్మతత్త్వజ్ఞానమునందు ప్రమాణము వాస్తవముగ లేదు. నాబుద్ధిదోషముచేత చక్కగా శ్రుతిస్మృతులను నేను విచారింపకపోయినందున లేకపోయినదిగాదు. బౌద్ధక్షపణకాదిశాస్త్రంబులలో మోక్షసాధనం బాత్మజ్ఞానమని చెప్పఁబడియున్నది. అయినను బౌద్ధాదిశాస్త్రములు భ్రాంతిమూలములై వేదవిరుద్ధములుగా నున్నందున వానియందు మాకు విశ్వాసములేదు. అవిచెప్పినయర్థములను మేము

ఆచరింపమని భావము. ఓమైత్రేయీ! ఆత్మ చూడఁదగినవాఁడు. ఆత్మయనఁగా నెవఁడు? ఎవఁడు విజ్ఞానస్వరూపుఁడై ప్రాణములయందుండి హృదయములోపల తేజోమయుఁడై కనుపడుచుండెనో ఇతఁడే ఆత్మ అని శ్రుతుల కర్థము.

అవ. ఓయీ! అజ్ఞానము జ్ఞానము కలిగిన నివర్తించును. ఈయర్థము లోకములో ననుభవసిద్ధమై యున్నదిగదా! కావున నజ్ఞాననివర్తకమైన జ్ఞానమునందు శ్రుతిస్మృతులలో విధివచనము లేకపోయిన నేమియని సిద్ధాంతవాదివలె మఱియొకఁడు శంకించుచున్నాఁడు.—

వాక్య. స్యాత్ప్రవృత్తి రంతరేణాపి విధిం లోకవత్. ౨౬

దం-అ. విధివచనము లేకపోయినను లోకమునందువలె జ్ఞానమునందు ప్రవృత్తి కలుగవచ్చును.

తా. లోకములో శుక్తికాదులవిషయమై కలిగినయజ్ఞానము శుక్తికాదిస్వరూపజ్ఞానము కలిగిన నివర్తించుచున్నది. అట్టి యజ్ఞానముకలవా రాయజ్ఞానము నివర్తింపవలయునని కోరి జ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నమును స్వయముగనే చేయుచున్నారుగదా. ఆప్రకారమే యాత్మస్వరూపమునందుగల యజ్ఞానమును నివర్తింపఁజేయఁగోరినవా రాత్మస్వరూపజ్ఞానమును సంపాదింపఁగోరి స్వయముగనే ప్రవర్తించెదరు. శ్రుతిస్మృతులయందు జ్ఞానమును గూర్చి విధిలేకపోయిన నేమిహానికలుగును? ప్రత్యక్షానుమానాదిప్రమాణాంతరములచేఁ దెలియఁబడని యర్థమునేగదా శ్రుతిస్మృతులు విధింపవలసియుండెడును. అజ్ఞానము జ్ఞానముచే నివర్తించునని అజ్ఞాననివృత్తికాముఁడు జ్ఞానమును సంపాదింపవలయుననే యర్థము ప్రత్యక్షప్రమాణమైన లోకమువలన సిద్ధించుచుండఁగా శ్రుతిస్మృతులు విధింపవలసిన యవసరములేదని భావము.

అవ. ఈశంకను పూర్వపక్షవాది పరిహరించుచున్నాఁడు.—

వాక్య. ఇతి చేత్తన్న యతః. ౨౭

దం-అ. ఇటులంటివేని అదికాదు. ఎందువలననినచో చెప్పెదను వినుము.

తా. లోకములో శుక్తికాద్యజ్ఞాననివృత్తికాముఁడు శుక్తికాదిజ్ఞానమునందు వర్తించినటుల ఆత్మస్వరూపాజ్ఞాననివృత్తికాముఁడైన ముముక్షువును ఆత్మస్వరూపజ్ఞానమునందుఁ బ్రవర్తించునని చెప్పఁగూడదు. అది యెందువల్లననిన దానికి కారణము చెప్పెదను వినుమని భావము.

అవ. కారణమును శ్లోకముతోఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. అంతరేణ విధిం మోహాత్ యః కుర్యాత్సాంపరాయికమ్,

న తత్స్యా దుపకారాయ భస్మనీవ హుతం హవిః. ౧౬. ౪౮

ప్ర-అ. ఏపురుషుఁడు విధినివిడిచి మోహామువలన పరలోకఫలమునకు సాధనమైన కర్మను చేయునో భస్మమునందు హోమముచేయఁబడిన హవిస్సువలె ఆకర్మ ఉపకారము (ఫలము) కొఱకు కాదు.

తా. అజ్ఞాననివృత్తిమాత్రమే మోక్షమని చెప్పెడుపక్షమందు ఆయజ్ఞాననివృత్తి దృష్టఫలమైనందునఁగదా జ్ఞానమే సాధనమని లోకప్రమాణముచేఁ దెలియందగు. అజ్ఞాననివృత్తిమాత్రమే మోక్షము కానేరదు. ఆత్మస్వరూపావస్థానరూపమైన మోక్షము వర్తమానదేహము నశించినపిదప సంభవించుచున్నందున స్వర్గాదులవలె అదృష్టఫలమైయుండును. అట్టిమోక్షమునకు ఆత్మజ్ఞానము సాధనమని లోకప్రమాణముచేత నిశ్చయించుటకు శక్యముకానేరదు. దృష్టఫలసాధనము లోకప్రమాణముచే నిశ్చయింపఁదగును గాని అదృష్టఫలసాధనమును లోకప్రమాణముచే నిశ్చయింపఁదగదు. మోక్షము అదృష్టఫలమేగాని దృష్టఫలముగాదు. తత్త్వజ్ఞానముకలవారు శరీరములోనుండియు అజ్ఞాననివృత్తికలవారై జీవన్ముక్తిని బొందియున్నారుగదా? కావున మోక్షము దృష్టఫలమేగాని యదృష్టఫలము కాదనినచో నది న్యాయముకాదు. జీవన్ముక్తిని మీరు కల్పించుకొని సంతోషించుచున్నారుగాని అది యేప్రమాణమునందును గాన్పించదు కావున మోక్షమదృష్టఫలమని నిశ్చయము. అట్టి యదృష్టఫలమైన మోక్షమునకు సాధనమును శాస్త్రమున విధించినప్రకారముగ ననుష్ఠించిన ఫలించును. లేనిచో బూడిదలోఁజేసిన హవిస్సుంబోలె వ్యర్థమగును. (శ్రుతిస్మృతిశాస్త్రములు కర్మను మోక్షాదిఫలసాధనమని విధించుచున్నవి. కావున కర్మల ననుష్ఠించిన మోక్షముగలుగునుగాని జ్ఞానముచేఁ గలుగదు. 'బుద్ధే చ క్షేమప్రాపణం తచ్ఛాస్త్రై ర్విప్రతిషిద్ధం' అని యాపస్తంబమహర్షియును జ్ఞానము మోక్షసాధనముగాదని చెప్పియున్నారు) అని భావము.

అవ. వేదములన్నియును కర్మపరములేగాని జ్ఞానపరములుగావని మేము చెప్పినది కేవల యుక్తులచేతనేగాదు. వేదతాత్పర్యములు చక్కఁగా తెలిసినవారియొక్క వచనములచేతఁ గూడ చెప్పితిమని వచించుచున్నాఁడు.—

వాక్యై రంగీకృత ప్రామాణ్యై ర్వేదార్థజ్ఞై [illegible] న్యాయశాస
నాత్. ౪౯

ప్ర-అ. అంగీకరింపఁబడిన యథార్థవాదిత్వముగలిగి వేదతాత్పర్యము నెఱింగిన మునిపుంగవులయొక్క వచనములవలనను వేదము కర్మపరమని నిశ్చయించితిమి.

తా. అనంతశాఖాత్మకంబైన వేదమును విభజించి లోకములోఁ బ్రవర్తింపఁజేసిన వేదవ్యాసులనెడు ప్రసిద్ధినొందిన కృష్ణద్వైపాయనమహర్షియొక్క శిష్యుండును సకల లోకములలో యథార్థవాదియని సకలజనులచేత నంగీకరింపఁబడినవాఁడును స్వాచార్యుఁడైన కృష్ణద్వైపాయనుని యనుగ్రహముచేతను తనయొక్క తపఃప్రభావము చేతను సకలవేదములయొక్క తాత్పర్యమునునిస్సంశయముగాఁ దెలిసినవాఁడునైన జైమిని మహాముని తాఁజేసిన మీమాంసాశాస్త్రములో వేదములన్నియుం కర్మపరములని చెప్పి యున్నాఁడు. ఆ కారణముచేతఁగూడ వేదములు కర్మపరములేగాని జ్ఞానపరములు గావని నిశ్చయింపవలయునని భావము.

అవ. వేదములు కర్మపరములని జైమినిమహామునిచెప్పిన సూత్రమును శ్లోకముతో నుదాహరించుచున్నాఁడు.—

శ్లో. "ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మి"తోఽన్యథా,
ఇతి సాటోపమాహోచ్చై ర్వేదవి జ్జైమినిః స్వయమ్. ౧౭. ౫౦

దం-అ. వేదము కర్మలే ప్రతిపాద్యములుగాఁగలిగియున్నందున దీనికంటె భిన్నమైనది అప్రమాణము. అని వేదములనెఱింగిన జైమినిమహాముని తాను సంకోచములేనటుల ప్రసిద్ధముగ చెప్పెను.

తా. జైమినిమహాముని సకలవేదములయొక్క తాత్పర్యమును నిస్సంశయముగఁ దెలియఁజేయుటకుగాను పండ్రెండధ్యాయములుగల మీమాంసాశాస్త్రమును రచించెను. ఆశాస్త్రములలో మున్నుగా ధర్మమును విచారించెదనని ప్రతిజ్ఞచేసి ధర్మమును ప్రతిపాదించెడిప్రమాణము వేదమనిచెప్పి ఆ వేదము పురుషులచే నిర్మింపఁబడినది కానందునను, అనాదిగురుశిష్యపరంపరగా నీలోకములోఁ బ్రవర్తించుచున్నందున నిర్దోషమని నిత్యమని ప్రతిపాదించి ఇట్టివేదము సాకల్యముగా ధర్మమని చెప్పఁబడుకర్మలనే ప్రతిపాదించుచున్నదని కర్మప్రతిపాదకంబుగాని వేదభాగ మొక్కింతయైనను లేదనిచెప్పెను. తరువాత వేదము కొంతభాగము విధిరూపముగ, కొంతభాగము మంత్రరూపముగ, మఱికొంతభాగము అర్థవాదరూపముగగదా యున్నవి. అందులో విధిరూపమైన భాగము కర్మలను ప్రతిపాదించుచున్నప్పటికిని మంత్రార్థవాదములుగల భాగములు కర్మలను ప్రతిపాదింపలేవుగదా? కావున నాభాగము ప్రమాణముగాకపోవలయునని యాక్షేపించుకొని మంత్రార్థవాదములుకూడ కర్మప్రతిపాదకంబులైన విధివాక్యములతో నేకీభవించి కర్మలనే నిరూపించుచున్నందున విధివాక్యములతో సమానములుగా ప్రమాణములై యుండునని ప్రతిపాదించెను. అతీంద్రియపదార్థములనెల్ల ప్రత్యక్షముగఁ

జూడఁదగిన తపఃప్రభావముగలిగి సర్వవేదతాత్పర్యమును కరతలామలకముగా సాక్షాత్కరింపఁజేసికొనియున్న జైమినిమహాముని పూర్వపక్షసిద్ధాంతపూర్వకముగా సర్వలోకవిదితంబగుసటుల వేదములు కర్మలనే ప్రతిపాదించుచున్నవనిచెప్పినందున వేదము కర్మప్రతిపాదకమేగాని తత్త్వజ్ఞానప్రతిపాదకముగాదని నిశ్చయింపవలయుననని భావము.

అవ. జైమినిమహాముని చెప్పుటమాత్రమేగాదు. వేదముగూడ నీప్రకారమే చెప్పినదని కనుపఱచుచున్నాఁడు.—

వాక్య. మంత్రవర్ణాశ్చ. ౫౧

దం-అ. వేదములోని మంత్రములవలనఁగూడ వేదము కర్మపరమైయున్నది.

తా. స్పష్టము.

అవ. మంత్రమును శ్లోకముతో నుదాహరించుచున్నాఁడు.—

శ్లో. "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః"
ఇతి మంత్రోఽపి నిఃశేషం కర్మణ్యాయు రవాసృజత్. ౧౮. ౫౨

దం-అ. ఈలోకమునందు కర్మలనుజేయుచునే నూఱుసంవత్సరములు జీవింపనిచ్ఛయింపవలయుననుమంత్రము సకలమైన ఆయుఃవ్యమును కర్మయందు వినియోగింపఁజేసినది.

తా. 'కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేచ్ఛతగ్ సమాని' అనుమంత్రము ఈశావాస్యమను నుపనిషత్తులో నున్నది. ఇది ఈలోకములోనిపురుషుఁడు తాను జీవించియుండునంతవఱకు యాగదానాదికర్మలను అనుష్ఠించుచుండవలయునుగాని యూరకయుండఁదగదని చెప్పుచు పురుషునియొక్క యావదాయుష్యమును కర్మానుష్ఠానముననే వినియోగపఱచుచున్నదిగాని మఱియొకకార్యమునకు నిమిషకాలమైనను ఉపయోగించుటకు సమ్మతింపలేదు గావున వేదములన్నియుఁ కర్మపరములే యని కర్మలే మోక్షసాధనమని నిశ్చయించినారమని భావము.

అవ. ఈప్రకారము వేదవాక్యములయొక్క తాత్పర్యమును యోచింపఁగా వేదవాక్యములు బ్రహ్మస్వరూపమును చెప్పునవి కావని నిరాకరించి వేదవాక్యములయొక్క సామర్థ్యమును బట్టి యోచించి ఆబ్రహ్మస్వరూపమును చెప్పఁజాలవని చెప్పుచున్నాఁడు.—

వాక్య. జ్ఞానినశ్చ వస్తుని వాక్యప్రామాణ్యాభ్యుపగమాత్
వాక్యస్యచ క్రియాపదప్రధానత్వాత్ తతశ్చ అభిప్రేతజ్ఞానాభావః. ౫౩

దం-అ. జ్ఞానవాదికిని బ్రహ్మవస్తువునందు వాక్యము ప్రమాణమని అంగీకారము ఉన్నందునను, వాక్యమునకు క్రియాపదము ముఖ్యమైయున్నందునను ఈకారణమువలన మీకు సమ్మతమైనజ్ఞానము సిద్ధింపదు.

తా. కర్మలు మోక్షసాధనమనిచెప్పు నేనును, కర్మలయందు వేదవాక్యమే ప్రమాణమని చెప్పియున్నాను. తత్త్వజ్ఞానము మోక్షసాధనమనిచెప్పు నీవును బ్రహ్మస్వరూపమునందు వేదవాక్యమే ప్రమాణమని యంగీకరించియుంటివి గావున వాక్యము ప్రమాణమని చెప్పుటయందు మన కిరువురకు వివాదములేదు. అట్టివాక్యమునకు సామర్థ్యము పురుషప్రయత్నసాధ్యంబైన క్రియను చెప్పుటయందు కలదా యని విచారించెదము. అనేకపదములయొక్క సముదాయము వాక్యమనంబడు. అట్టివాక్యములో క్రియాపదము ప్రధానమైయుండు. క్రియాపదములేనిచో వాక్యము సంపూర్ణముకానేరదు. 'శుక్లాంగాం దండేనానయ' తెల్లనిగోవును కఱ్ఱతో తీసికొనిరమ్ము అనిచెప్పినచో వాక్యముపూర్ణముగానుండునుగాని 'శుక్లాం దండేన' అనిమాత్రముచెప్పిన వాక్యము పూర్ణముకానేరదు గదా? పురుషప్రయత్నసాధ్యమైన యర్థము క్రియాపదమున కర్థమైయుండు. వేదములును వాక్యరూపములై యున్నందున క్రియాపదప్రధానములై యుండు: గావున వేదవాక్యములు పురుషప్రయత్నసాధ్యమైనకర్మను చెప్పుటయందు సామర్థ్యముకలదిగాని కేవలసిద్ధవస్తువును చెప్పుటయందు సామర్థ్యముగలదికాదు గావున స్వతస్సిద్ధమయిన బ్రహ్మవస్తువును వివరణచేయువాక్యమే లేనందున బ్రహ్మజ్ఞానమే మోక్షసాధనమను నీపక్షమునందు నీకు సమ్మతమైనజ్ఞానము సిద్ధింపదని భావము.

అవ. ఈచెప్పిన యర్థమును శ్లోకముతో వివరించుచున్నారు.—

శ్లో. వినహాయ్య క్రియాం నైవ సంహన్యంతే పదాన్యపి,
నసమస్త్యపదం వాక్యం యత్స్యాద్జ్ఞానవిధాయకమ్. ౧౫. ౫౮

దం-అ. పదములు క్రియాపదమునువిడిచి పరస్పరము కలియనే కలియవు. ఏవాక్యము జ్ఞానమునువిధించునో అట్టివాక్యము పదహీనమైయుండదు.

తా. మోక్షసాధనమైన బ్రహ్మజ్ఞానమును వాక్యముగదా వర్ణించిచెప్పుచున్నదని నీయభిప్రాయము. అట్టివాక్యము పదములయొక్కకూడికవలనగాని కలుగదు. పదములయొక్క సంయోగములేని వాక్యమే లేదు. పదములయొక్క సంయోగము క్రియాపదములేనిచో గలుగదు. క్రియాపదము పురుషసాధ్యమైన వ్యాపారమును బోధించును. పురుషసాధ్యమైన వ్యాపారమే కర్మయనంబడు. జ్ఞానమనునది వస్తుతంత్రమైయుండును గావున పురుషసాధ్యమైన వ్యాపారమును బోధించు క్రియాపదమున

కర్థముకా నేరదు గావున వేదవాక్యము కర్మనే బోధించుటయందు శక్తంబైయుండును గాని జ్ఞానమును బోధించుటయందు శక్తంబైయుండదని భావము.

అవ. ఈప్రకారము కేవలకర్మలవలననే మోక్షము సిద్ధించును. సిద్ధబ్రహ్మవిష యమైనజ్ఞానము లేనేలేదని చెప్పి రెండవపూర్వపక్షమును ముగించి బ్రహ్మజ్ఞానము కల దని యంగీకరించినను ఆజ్ఞానము స్వతంత్రముగా మోక్షసాధనము కానేరదు. కర్మసహి తమై మోక్షసాధనము కాఁగలదని మూఁడవపూర్వపక్షమును చెప్పుచున్నాడు.—

వాక్య. జ్ఞానాభ్యుపగమేఽపి నదోషః యతః. ౫౫

దం-అ. బ్రహ్మజ్ఞానముకలదని యంగీకరించినను దోషములేదు. ఎందువలననినిన చెప్పెదను.

తా. 'బ్రహ్మవిదాప్నోతి విద్యాం చా విద్యాంచ జ్ఞాన ముత్పద్య తేపుంసాం' ఇత్యాది శ్రుతిస్మృతుల నాలోచింపఁగా బ్రహ్మజ్ఞానము కలదని యంగీకరింపవలయును; అంగీకరించినను కర్మ మోక్షసాధనమని చెప్పుటయందు దోషమును కానము. ఎందువల్ల ననిన దానికి కారణమును చెప్పుచున్నాను వినుమని భావము.

అవ. కారణమును శ్లోకముతోఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. కర్మణోఽంగాంగిభావేన స్వప్రధానతయాథవా,
సంబంధస్యేహ సంసిద్ధేః జ్ఞానే సత్యప్యదోషతః. ౨౦. ౫౬

దం-అ. అంగాంగీభావముచేతఁగాని, లేక ముఖ్యముగాఁగాని మోక్షమునందు కర్మకు సంబంధము సిద్ధించుచున్నందున బ్రహ్మజ్ఞానము కలిగియున్నప్పటికిని దోష ములేదు.

తా. 'యదేవ విద్యయాకరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి' యనుశ్రుతికర్మయే ఫలమునిచ్చుననియు ఆకర్మ జ్ఞానముతోఁగూడియుండిన విశేషముగ ఫలమునిచ్చునని చెప్పుచున్నందున కర్మ ప్రధానసాధనమని జ్ఞానము ఆకర్మకు అంగముగ నుండునని చెప్పవచ్చును. లేదా, 'వేదయజ్ఞేన దానేనతపసానాశకేన బ్రాహ్మణావివిదిషంతి' యనుశ్రుతి యజ్ఞదానాదికర్మల ననుష్ఠించుటచే జ్ఞానము పుట్టునని చెప్పుచున్నందున జ్ఞా నము ప్రధానసాధనమని అజ్ఞానమునకు కర్మ అంగమని చెప్పవచ్చును. లేనిచో 'విద్యాం చా విద్యాంచయ స్తద్వేదోభయగ్ంసహ' అనుశ్రుతి జ్ఞానకర్మలు రెండు మోక్షమును గూర్చి సమానసాధనములని చెప్పుచున్నందున జ్ఞానకర్మలు మోక్షఫలమునుగూర్చి సమ ప్రధానసాధనములనిగాని చెప్పవచ్చును. ఈమూఁడుపక్షములలోఁగూడ కర్మలు మోక్ష సాధనములని కాన్పించుచున్నందున బ్రహ్మజ్ఞానము మోక్షసాధనమని చెప్పెడివారును

కర్మలు జ్ఞానము అంగముగాఁగలవైగాని జ్ఞానమున కంగములుగాఁ గాని జ్ఞానముతో సమానములైగాని మోక్షసాధనమని యంగీకరింపవలసియున్నందున కర్మలు మోక్షసాధనమని చెప్పినది దోషముకాదు. కేవల జ్ఞానము మోక్షసాధనమనుటయే అప్రమాణమని భావము. శ్రద్ధతోఁ గూడుకొని రహస్యమైన జ్ఞానముతోఁగూడ ఏకర్మ చేయఁబడునో ఆకర్మ ఫలమును ఇచ్చెడివిషయములో విశేషసామర్థ్యము కలదైయుండును. బ్రహ్మభావమును (మోక్షమును) పొందఁదలఁచినవారు యజ్ఞముచేతను, దానముచేతను, తపస్సుచేతను, హితమితపవిత్రాన్నభక్షణముచేతను బ్రహ్మజ్ఞానమును సంపాదింపఁగోరెదరు. ఏపురుషుఁడు జ్ఞానమును కర్మను సమానముగాఁ దెలిసి అనుష్ఠించునో అని మూఁడుశ్రుతులకు అర్థము.

అవ. కర్మలయొక్క సహాయము నపేక్షింపనిజ్ఞానము మోక్షసాధనము కాదని చెప్పిన మూఁడవపూర్వపక్షమును నిగమించుటకు ముందటిశ్లోకములో సూచింపఁబడెడి హేతువును స్ఫుటముగఁ జెప్పుచున్నాఁడు.—

వాక్య. యస్మాత్ జ్ఞానాభ్యుపగమా నభ్యుపగమేపి నజ్ఞానా న్ముక్తిః. ౫౭

దం-అ. బ్రహ్మజ్ఞానము నంగీకరించినను అంగీకరింపకపోయినను ఏహేతువువలన జ్ఞానమువలన మోక్షములేదో, ఆహేతువువలన నని ముందటిశ్లోకముతో నన్వయము.

తా. బ్రహ్మజ్ఞానము వేదాంతములయందు చెప్పఁబడియున్నది. అని యంగీకరించినను అట్టిజ్ఞానము స్వతంత్రముగా మోక్షసాధనముకాదు. అంగీకరింపకపోయినను మోక్షసాధనముగాదు. అని యిదివఱకు చెప్పియుంటిమిగదా యని భావము.

అవ. చెప్పినహేతువును పురస్కరించికొని స్వాభిప్రాయమును విశదపఱచి పూర్వపక్షమును ముగించుచున్నాఁడు.

శ్లో. అత స్సర్వాశ్రమాణాం హి వాఙ్మనః కాయ కర్మభిః,
స్వనుష్ఠితై ర్యథాశక్తి ముక్తిస్స్యా న్నాన్యసాధనాత్. ౨౧.౫౮

దం-అ. కావున నన్నియాశ్రమములయం దుండువారలకు మోక్షము చక్కగా ననుష్ఠింపఁబడిన మనోవాక్కాయకర్మలచేతనే సంభవించును; మఱియొకసాధనముచే సంభవింపదు.

తా. ఇదివరలో చెప్పినప్రకారము బ్రహ్మజ్ఞానము నంగీకరించినను నంగీకరింపకపోయినను అట్టికేవలజ్ఞానమువలన మోక్షము సిద్ధింపదుగావున బ్రహ్మచర్యాశ్రమము

యున్నందున యతనిచిత్త మచ్చటి భోగచేత వ్యాపింపఁబడి మలినమైపోవుటచే విభ్రాంతుఁడై యీవిధమున చెప్పుచున్నాఁడు. ఇదిగాక గృహక్షేత్రపుత్రకళత్రాది సకలపరికరంబులను బరిత్యజించి పరమహంసపరివ్రాజకాశ్రమం బవలంబించిన నేతప్ప బ్రహ్మజ్ఞానసిద్ధి గలుగదు. ఇట్టిమహాయాసమును సహించుటకుఁ దగినబుద్ధి శుద్ధిలేనందున గృహక్షేత్రపుత్రకళత్రాదులను విడుపంజాలక వారితోఁ గూడి యుండి అనుష్ఠింపఁ దగిన కర్మలచేతనే మాకు స్వర్గములు అనాయాసముగ సిద్ధించునని తలఁచి సంతోష చిత్తులై యున్నారు. ఈపూర్వపక్షవాదులు ప్రతిపాదించినయర్థమునందు వారికి వారి బుద్ధియే ప్రమాణముగా నున్నదిగాని మఱియొకశ్రుతిస్మృతివాక్యము సహాయముగగాని ప్రమాణముగగాని లేదుగావున తమబుద్ధికిఁ దోఁచినంత చెప్పిరిగావున, పూర్వపక్షవాదులచేఁ జెప్పఁబడిన యర్థమంతయు భ్రాంతిసిద్ధమని నిశ్చయింపఁదగియున్నందున వారివచనములయం దనేకదోషములుకలవు. కర్మవాదులు భ్రాంతులని "అగ్నిముగ్ధాహ వై ధూమతాంతః స్వం లోకం న ప్రతి ప్రజానాతి, ప్లవాహ్యేతే అదృఢాః యజ్ఞరూపాః, అవిద్యాయా మంతరే వర్తమానాః, యా మిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః" అను మొదలగుశ్రుతిస్మృతివాక్యములు నిశ్చయించుచున్నవని భావము. అగ్నిసాధ్యములైనకర్మలయం దత్యంతాసక్తికలవాఁడు భోగచే నావరింపఁబడిన చిత్తముగలవాఁడై స్వకీయమైన స్వరూపమును (ఆత్మతత్త్వమును) యెఱుఁగఁజాలఁడు. యజ్ఞములనే యీసాధనములు ఓటిమోడలు. అజ్ఞానములోఁబడి కర్మలనే నమ్మియుందురు. పుష్పించినవృక్షమువలె ఆపాతరమణీయంబైన కర్మప్రతిపాదక వేదవాక్యమును వివేకవిహీనులు దానితాత్పర్యము నెఱుంగక చెప్పుచుందురని శ్రుతిస్మృతివాక్యముల కర్థము.

అవ. ఇఁకను పూర్వపక్షవాదమునందు తా నూహించినదోషములను ప్రకటించుటకై యుత్తరగ్రంథము ప్రకటించుచున్నదని సిద్ధాంతవాది చెప్పుచున్నాఁడు:—.

వాక్య. దూషణోపక్రమావధి జ్ఞాపనా యాహ. ౬౧

దం-అ. దూషణముల నారంభించుట కవసానమును (ప్రయోజనమును) దెలియఁజేయుటకొఱకు చెప్పుచున్నారు.

తా. పూర్వపక్షవాదముపై దోషము లారంభించి యేల చెప్పఁబడునని దానిని చెప్పుచున్నారని భావము.

శ్లో. అత్రాభిదధ్మహే దోషాన్ క్రమశో న్యాయబృంహితైః,
వచోభిః పూర్వపక్షోక్తి ఘాతిభి ర్నాతిసంభ్రమాత్. ౨౩. ౬౨

దం-అ. ఈపూర్వపక్షమునందు యుక్తియుక్తములై చెప్పఁబడిన విషయము

ఆగ్రహములేక దోషములను క్రమముగఁ జెప్పుచున్నా

...క్షసాధనమని నిర్ణయించిన పూర్వపక్షవాదియొక్క మ
దూషణములను చెప్పుచున్నారము. ఆదూషణములను చెప్పి
వానికి విరుద్ధముగా యుక్తులతోఁ జేర్చి చెప్పెదము
మాణయుక్తికరాన్యముగాఁ జెప్పము. అందులోను డంబ
...ల నవలంబించి పూర్వపక్షవాదిని ఏవిధముననైనను జ...ంచె
చెప్పము తత్త్వమును నియమించుకొని వాదము నవ
నవిఁగల బలాబలములను నిరూపించెదము. తత్త్వనిర్ణ
పై దూషణములను నిర్ణయించుచున్నామని భావము.

...ందు తాత్పర్యమును జెప్పుచున్నారు.—

...పి కర్మకార్యస్య ముక్తావసంభవా
...ర్మకార్యత్వమ్. ౬౩

...లుగనున్న కర్మవ్యాపారము మోక్షమునందు సంభవిం
సాధ్యము కానేరదు.

...యాత్మయొక్క స్వరూపావస్థానమే మోక్షమనఁబడు.
...క్రియాదికల్పకమైన మూలాజ్ఞానము ప్రతిబంధకమై యుం
అజ్ఞానముయొక్క నివృత్తిమాత్రమే మోక్షమున కపేక్షి
తఁ జేయఁబడు ఉత్పత్తి, ప్రాప్తి, వికృతి, సంస్కారము అని
లపేక్షితంబులుగావు. కావున మోక్షము కర్మసాధ్యముగా
...రము ననుసంధింపవలయును. 'క్రియత ఇతికర్మ' యను
కర్మ యనఁబడును. ఇది ద్రవ్యములయందు నాల్గువిధము
...ను. అదియెట్లనిన తంతువాయుని (సాలెవాని) చేఁ
...ర్మ పటంబున నుత్పత్తిని కలుగంజేయు; ఒకపురుషుని చేఁ
మాది ప్రాప్తిని గలుగంజేయు; క్షీరమునందుఁ జేయఁబడు
టకై పెట్టునుజ్జిగతోటితోడు) క్షీరమునకు దధిరూపమైన
మలినదర్పణమునందు జేయు భస్మనిఘర్షణకర్మ (అద్దపు
బూడిదెతో నద్దముపై రాచి తోమడము) ఆదర్పణమునకు
...తారూపంబైన సంస్కారమును కలుగంజేయు. ఈనాల్గుగు

గుణములకంటె నధికమైనగుణములు కర్మలకు సాధ్యములై యున్నట్టు గానంబడవు. ఈ నాల్గుగుణములును, నిత్యసిద్ధమై, సర్వవ్యాపకమై, నిరవయవమై, నిత్యశుద్ధమైన యాత్మస్వరూపమునకు గలుగనేరవు. ఆత్మస్వరూపము నిత్యసిద్ధమైనందున పటమువలె నుత్పత్తికి యోగ్యము కాదు. సర్వవ్యాపకమైనందున నిత్యప్రాప్తముగావున గ్రామాదులవలె ప్రాప్తికి యోగ్యము కాదు. నిరవయవంబైనందున క్షీరమువలె వికారమునొందదు. నిత్యశుద్ధమైనందున దర్పణమువలె సంస్కారము నపేక్షింపదు. కావున నుత్పత్తి, ప్రాప్తి, వికృతి, సంసారము లనియెడు చతుర్విధకర్మఫలములు నిత్యసిద్ధాత్మస్వరూపావస్థానరూపమైన మోక్షమున కపేక్షితములుగావు. కావున మోక్షము కర్మసాధ్యము కానేరదు.

శ్లో. అజ్ఞానహీనమాత్రత్వాత్ ముక్తేః కర్మ నసాధనమ్,
కర్మాపమార్ష్టి నాజ్ఞానం తమసీవోద్ధితం తమః. ౨౮. ౬౮

దం-అ. మోక్షము అజ్ఞానముయొక్క వినాశముమాత్రమే గావున దానికి కర్మసాధనము కాదు. అంధకారములోఁ బుట్టిన భ్రాంతిని అంధకారము నివారింపలేనటుల అజ్ఞానమును కర్మ నివారింపఁజాలదు.

తా. పరిశుద్ధమైన ఆత్మస్వరూపమే మోక్షము. అట్టి యాత్మస్వరూపము నిత్యసిద్ధమై యున్నప్పటికి అనాద్యజ్ఞానముచే నావరింపఁబడి లేనిదానివలెఁ గానంబడుచున్నది. అజ్ఞానము నివర్తించినమాత్రమున నాత్మస్వరూపము మేఘమువిడిచినసూర్యబింబమువలె నత్యుజ్జ్వలమై ప్రకాశించును. ఇట్టి యాత్మస్వరూపమైన మోక్షమునకు అజ్ఞాననివృత్తిమాత్రమే కావలయును గాని కర్మలచేఁ గాదగినప్రయోజనము కొంచెమైన నక్కఱలేదు. అజ్ఞాననివృత్తికైనను కర్మలు సాధనములు కావా యనినచో కావు అని సమాధానము. అంధకారము వ్యాపించినకాలములో నాయంధకారమును నిమిత్తముగాఁ జేసికొని రజ్జువునందు సర్పభ్రమమునుగాని, స్థాణువునందు చోరభ్రాంతిగాని పుట్టును. అట్టిభ్రాంతి తనపుట్టువునకు నిమిత్తమైనయంధకారమును నివృత్తిఁ జేయంజాలదుగదా? ఆప్రకారమే యజ్ఞానము ఆత్మస్వరూపము నావరించియున్నకాలములో నాయజ్ఞానమును నిమిత్తముగాఁ గైకొని దేశకాలద్రవ్యఫలాదిభేదముల నవలంబించి ప్రవర్తించిన యాగదానాదికర్మలు స్వనిమిత్తమైన యజ్ఞానమును నశింపఁజేయలేవు. నశించువస్తువును నశింపఁజేయువస్తువును స్వరూపస్వభావములచే పరస్పరవిరుద్ధములై యుండవలయును. అంధకారము ప్రకాశము పరస్పరవిరుద్ధములు గావున ప్రకాశ మంధకారమును నశింపఁజేయుచున్నవి. అజ్ఞానము కర్మయు నాలాగున విరుద్ధములుగావు. అజ్ఞానము జడస్వరూపము, కర్మయును జడస్వరూపము, భేదమును స్ఫురింపఁజేయుట అజ్ఞానస్వభావము.

భేదముల నవలంబించియుండుట కర్మస్వభావము. కావున అజ్ఞానము కర్మయును ఏక స్వరూపస్వభావములు కలవైనందున కర్మ లజ్ఞానమును నశింపఁజేయఁజాలవని భావము.

అవ. ఉత్పత్త్యాది చతుర్విధక్రియాఫలములు లేనందున మోక్షము కర్మసాధ్యము కాదని దూషించి కర్మసాధ్యమని యంగీకరించినను దూషణముకలదని చెప్పుచున్నారు —

వాక్య. కర్మ కార్యత్వాభ్యుపగమేపి దోషఏవ. ౬౫

దం-అ. మోక్షము కర్మసాధ్యమని యంగీకరించినను దూషణమే కలదు.

తా. స్పష్టము.

అవ. దూషణమును శ్లోకముతో చెప్పుచున్నారు.—

శ్లో. ఏకేన వా భవేన్ముక్తి ర్యది వా సర్వకర్మభిః,
ప్రత్యేకం చేద్వ్యర్థాన్యాని సర్వేభ్యోఽప్యేకకర్మతా. ౨౫. ౬౬

దం-అ. ఒక్కొక్కకర్మచేతనే మోక్షము సిద్ధించునా? లేక అన్నికర్మలచే సిద్ధించునా? ఒక్కొకకర్మచే సిద్ధించెనేని ఇతరకర్మలు వ్యర్థములుగాఁగలవు. అన్నికర్మలచేత సిద్ధించెనేని యావత్కర్మలు నొకకర్మగానే యుండవలయు.

తా. కర్మలచేతనే మోక్షముగలుగునని వాదించు పూర్వపక్షవాదినిగూర్చి ప్రశ్న చేసెదము. అగ్నిహోత్రములు మొదలు సహస్రవార్షికసత్రాంతము అను కర్మలున్నవిగదా? వీనిలో నొక్కొక్కకర్మచేతనే మోక్షము సిద్ధించునా? లేక యావత్కర్మలచే సిద్ధించునా? ఒక్కొకకర్మచే సిద్ధించునంటివేని ఒకకర్మచేతనే మోక్షము సిద్ధించుచుండ నితర కర్మలను వేదము విధించుట కావశ్యకము లేకపోవును. ఆవశ్యకములేకయే విధింపఁబడిన కర్మలునిష్ఫలములని చెప్పవలసియుండును; లేకఅగ్నికర్మలచే మోక్షము సిద్ధించునంటివేని అగ్నిహోత్రాదిసహస్రవార్షికసత్రాంతకర్మల కన్నింటికిని ఒక మోక్షమే ఫలమైనందున యావత్కర్మ లొక్కటియే యనవలసియుండును అట్లుచెప్పుట బహువిరుద్ధము. ప్రతి కర్మను వేఱువేఱుగా విధించి వానికి ఫలమును వేఱువేఱుగా విధింపఁబడియుండఁగా ఒకటేకర్మ యని ఒకటేఫలమని యెట్లు చెప్పవచ్చును? ఇదియునుగాక బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమములు నాలుగింటికి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను వర్ణములు మూఁడింటికిని ప్రత్యేకముగ విధింపఁబడినకర్మలు ఒకనిచేత నాచరింపఁబడు టకు శక్యములుకావు గావున మోక్షము సర్వకర్మలఫలమని చెప్పఁదగదు. సర్వకర్మలచే మోక్షము సిద్ధించుననఁగా సర్వవర్ణాశ్రమములకు విధించిన యావత్కర్మలచేత మోక్షము కలుగునని కాదు. ఆయావర్ణాశ్రమములకు ప్రత్యేకముగావిధించిన సర్వకర్మలచే మోక్షము సిద్ధించునని చెప్పితిమి గావున సర్వకర్మల నాచరించుట దుస్సాధ్యమని చెప్పఁ

దగదు. ఆయావర్ణాశ్రమములయందుండువారలు తమతమవర్ణాశ్రమముల కనుగుణముగా విధించినయావత్కర్మలను సులభముగా నాచరింప శక్తులేగదా? యని యంటిరేని యప్పుడు తత్తద్వర్ణాశ్రమంబులకు విధించినకర్మలు విచిత్రములుగా నున్నందున తత్ఫలమైన మోక్షమునైతము విచిత్రమైయుండునని చెప్పవలసియుండు. ఆత్మస్వరూపభూతమగు మోక్ష మేకస్వరూపముగావున విచిత్రమని చెప్పుట సకలశ్రుతివిరుద్ధము గావున కర్మసాధ్యము మోక్షమని చెప్పిన ఇట్టిదోషములు బొసఁగనేరవని భావము.

అవ. ఓయీ! నిత్యనైమిత్తికకర్మలకు ఫలము చెప్పఁబడియుండలేదు. అయినను కర్మలైనందున ఫలమును కోరుచుందురు. మోక్షమును ఫలమైనందున సాధనముల నపేక్షించుచుండుఁ గావున నీరెంటికిని సంబంధముకలుగఁజేసిన నిత్యనైమిత్తికకర్మలకు మోక్షమే ఫలమని సిద్ధించునని శంకించుకొని పరిహరించుచున్నారు.—

వాక్య. సర్వప్రకారస్యాపి కర్మణః ఉత్పత్తిత ఏవవిశిష్ట
సాధ్యాభిసంబంధాత్ నపారిశేష్యసిద్ధిః. ౬౨

దం-అ. సకలవిధమైనకర్మకును ఉత్పత్తిచేతనే ఒకానొకవిశేషఫలముతోడ సంబంధముకలిగియున్నందున పారిశేష్యన్యాయము సిద్ధింపదు.

తా. నిత్యనైమిత్తికకర్మలకును ఫలశ్రవణములేని యితరకర్మలకును ఆయాకర్మలయొక్క స్వరూపమును విధించిన యుత్పత్తివాక్యముచేతనే ఫలముకూడ సంగ్రహింపఁబడియున్నది. అనఁగా 'విశ్వజితాయజేత' యనుశ్రుతివాక్యముచే, విశ్వజిద్యాగమనునొకకర్మ విధింపఁబడుచున్నది ఈకర్మకు ఫలము వినఁబడియుండలేదు. అయినను దీనికి స్వర్గమే ఫలమని జైమినిమహాముని నిర్ణయించి ఈప్రకారమే యేయేకర్మలకు ఫలము వినఁబడియుండదో వానికన్నింటికిని స్వర్గమునే ఫలమునుగ కల్పించుకొనవలయునని న్యాయమును చూపించియున్నారు గావున అగ్నిహోత్రము హోతీత్యాదిశ్రుతివాక్యములచే విధింపఁబడుచున్న యగ్నిహోత్రాది కర్మలకు ఫలము వినఁబడకపోయినను విశ్వజిద్యాగమునకువలె స్వర్గఫలముతోడ సంబంధము సిద్ధమైయున్నది గావున పారిశేష్యన్యాయమును బట్టి నిత్యనైమిత్తికకర్మలకు మోక్షము ఫలమని చెప్పఁదగదని భావము. పారిశేష్యన్యాయమే నష్టాశ్వదగ్ధరథన్యాయమని చెప్పఁబడు. ఆన్యాయ మెట్లనిన, ఇరువురు పురుషు లొకగ్రామమునుండి అశ్వములఁబూన్చిన రథములనెక్కి ప్రయాణమైపోవుచుండ మార్గమధ్యమున నొకయుపద్రవము సంభవించి యొకనికి రథంబు కాలి, మఱియొకనియశ్వములు మడిసె. అంతనయ్యిరువురిలో రథముగాలినవాఁడు తనకశ్వంబులుండియు రథంబులేమింజేసి తనపయనము సాగమి నాలోచించి యెచ్చటనైనను నొక

అవ. మోక్షమునుద్దేశించి కర్మలు విధింపఁబడలేదు గావునను కర్మలకు మోక్షము ఫలముకాదని చెప్పుచున్నారు.—

వాక్య. ప్రమాణాసంభవాచ్చ. ౯౯

దం-అ. ప్రమాణము లేనందువలనను మోక్షము కర్మసాధ్యముకాదు.

తా. కర్మలచే మోక్షము సిద్ధించునని చెప్పు శ్రుతిస్మృతివచనములు ఒకటియైనను లేదు; ఆకారణముచే సైతము మోక్షము కర్మసాధ్యముకాదని చెప్పవలయునని భావము.

అవ. ఈయర్థమును శ్లోకముచే విస్పష్టముగాఁ జూపుచున్నారు.—

శ్లో. సాధ్యసాధనభావోఽయం వచనాత్పారలౌకికః,
నాశ్రౌషం మోక్షదం కర్మ శ్రుతేర్వక్త్రాత్కథంచన. ౨౯. ౭౦

దం-అ. పరలోకవిషయమైన యీకార్యకారణభావము శాస్త్రవచనమువలన తెలియఁదగియున్నది; మోక్షమునిచ్చునది కర్మయని వేదముయొక్క ముఖమునుండి యేవిధముగనైనను నేను విన్నదిలేదు.

తా. ఈలోకములోని వస్తువులవిషయమై దేనికి ఏదిసాధనమో దేనికి ఏదిసాధ్యమో ఆసంబంధము ప్రత్యక్షముచేతఁగాని అనుమానముచేతఁగాని తెలియందగు. శాస్త్రీయవిషయమై ఆసంబంధము శాస్త్రవచనముచేతనే తెలియఁదగియున్నది. మోక్షము శాస్త్రీయవిషయముగాని లౌకికవిషయముగాదు; అట్టిమోక్షమునకు కర్మలు సాధనమని శాస్త్రములో నెచ్చోటనైన నొకవచనము చెప్పియుండిన నవశ్యముగా నంగీకరించెద. శాస్త్రమున వేదము; ఆవేదముఖమునుండి కర్మలు మోక్షమునిచ్చునని చెప్పినవాక్యమును నేను వినియెఱుఁగను. కావున మోక్షముకర్మసాధ్యముకాదని భావము.

అవ. పూర్వపక్షవాదివైన నీవు ౧౦, ౧౧, ౧౨ శ్లోకములలోఁజెప్పిన యర్థము నంతయును నేనుగూడ నంగీకరించితిని గావున నీవుచెప్పినది వ్యర్థమని చెప్పుచున్నారు-

వాక్య. అభ్యుపగతాభ్యుపగమాచ్చ శ్వశ్రూనిర్గచ్ఛోక్తివద్భవతో నిష్ప్రయోజనః ప్రలాపః. ౭౧

దం-అ. అంగీకరించినవిషయమునే అంగీకరించినందున నీయొక్కవచనము అత్తగారు భిక్షములేదని చెప్పినటుల వ్యర్థము, నిరర్థకము.

తా. కర్మలే మోక్షసాధనమని నిర్వహించుటకుఁ బూనుకొనిన నీవు కామ్యనిషిద్ధములను విడిచి నిత్యనైమిత్తికకర్మలను యథావిధిగ నాచరింపవలయుననియు అందు

వలన కామ్యకర్మలకు ఫలమైన దేవమనుష్యాదిజన్మనుగాని నిషిద్ధకర్మకు ఫలమైన నరతిర్యగాదిజన్మలనుగాని పొందఁడనియుఁ బ్రారబ్ధకర్మ లనుభవముచేతనే నశించుననియుఁ జెప్పితివి. ఈవిషయమునంతయును నేను ముందుగా నంగీకరించియుంటిని. కావున దానినే నీవు మరలచెప్పుట శ్వశ్రూభిక్షాప్రతిషేధన్యాయముతో సరియైన నిష్ఫలమని భావము. ఒకగ్రామములో నొకయింట తలిదండ్రులు భార్య మొదలగుకుటుంబముతోఁ గూడి కాపురముచేయుచుండెను. ఒకనాఁ డత్తగారేదో యొకపనినిమిత్తమై పొరుగింటికి పోయియుండఁగా నొకబ్రహ్మచారి మధుకరముకొఱకు ఈబ్రాహ్మణునియింటికివచ్చి 'భవతి భిక్షాం దేహి' యని భిక్షమును యాచింపఁగా నత్తగారింటిలో లేనందున కోడలాబ్రహ్మచారినింజూచి 'భిక్షములేదు వెళ్లిపొమ్ము' అనెను. అంత నాబ్రహ్మచారి యాయిల్లువదలి మఱియొకయింటికిఁ బోవుచుండ పొరుగింటినుండి యింటికివచ్చుచున్న యత్తగారాబ్రహ్మచారినిజూచి 'యోచిన్నవాఁడా! మాయింటికిపోలేదా?' యని యడిగిన నాబ్రహ్మచారి 'పోయితిని, మీకోడలు భిక్షములేదు, వెళ్లిపొమ్ము' అనెను. అదివిని యత్తగా 'రదిన్యాయముకాదు మరల మాయింటికిరమ్ము' అని యాబ్రహ్మచారిని తనయింటికి తోడ్కొనివచ్చి 'ఓచిన్నవాఁడా! ఏమివచ్చితివి' అని యడిగిన ఆబ్రహ్మచారి 'భవతి భిక్షాం దేహి' యని మునుపటివలె భిక్షమును యాచించెను. అందు కత్తగారు 'భిక్షములేదు, వెళ్లిపొమ్ము' అనిచెప్పిన ఆబ్రహ్మచారి ఖిన్నుఁడై 'మీకోడలుచెప్పినమాటలు మీరుచెప్పితిరే, మీ రెక్కువచేసినదేమి?' అని యడిగిన 'లేదనిచెప్పుటకుఁగాని కలదని చెప్పుటకుఁగాని, నేను స్వతంత్రురాలనుగాని కోడలికి స్వాతంత్ర్యమెక్కడిది?' అని ప్రత్యుత్తరముచెప్పెను. ఇది శ్వశ్రూభిక్షాప్రతిషేధన్యాయము.

అవ. ఈయర్థమును శ్లోకముతో వివరించుచున్నాఁడు.—

శ్లో. నిషిద్ధకామ్యయో స్త్యాగః త్వయాపీష్టో యథామయా,
నిత్యస్యా ఫలవత్త్వాచ్చ నమోక్షః కర్మసాధనః. ౭౮. ౭౨

ప్ర-అ. నిషిద్ధకామ్యకర్మలయొక్క త్యాగము నాచే నేలాగున నంగీకరింపఁబడెనో నీచేతను నాలాగున నంగీకరింపఁబడినది. నిత్యకర్మకు ఫలములేనందువలనను మోక్షము కర్మలచే సాధింపఁదగినది కానేరదు.

తా. నిషిద్ధకామ్యకర్మలను పరిత్యజింపవలయునని మనమిరువురము సమానముగ నంగీకరించియున్నారము. కాని కర్మలు మోక్షసాధనమని నే నంగీకరింపకపోయినను నీవుమాత్రము చెప్పుచున్నావు; అది యుక్తముకాదు. కామ్యకర్మలకు స్వర్గాదికము ఫలమని నిషిద్ధమునకు ప్రత్యవాయము (పాపము) ఫలమని, నైమిత్తికములకు పాపక్షయము

ఫలమని, నిత్యకర్మలకు ఫలమేలేదని నీ వంగీకరించియుంటివి. కావున మోక్షమునకు కర్మలుగూడ సాధనములుగావని భావము.

అవ. ఇంతవఱకుచెప్పిన సిద్ధాంతగ్రంథముయొక్క తాత్పర్యమును సంగ్రహించి చెప్పుచున్నారు.—

వాక్య. ఏవం తావ న్ముక్తేః క్రియాభి స్సిద్ధత్వా దితి నిరస్తో యం పక్షః 23

దం-అ. ఈప్రకారము మోక్షము కర్మలచే సిద్ధించునను నీపూర్వపక్షము సమగ్రముగా నిరసింపఁబడెను.

తా. ౨౩ వ శ్లోకము మొదలు యింతవఱకు పూర్వపక్షవాదిచెప్పిన కర్మసాధనవాదమును సంపూర్ణముగ ఖండించినారమని భావము.

అవ. ముందుచెప్పఁబోవుగ్రంథముయొక్క తాత్పర్యమును సంగ్రహించి చూపుచున్నారు.—

వాక్య. అథాధునా సర్వకర్మప్రవృత్తి హేతునిరూపణేన యథావస్థితాత్మ వస్తువిషయ కేవలజ్ఞాన మాత్రాదేవ సకలసంసారానర్థ నివృత్తి రితీమం పక్షం ద్రఢయితు కామః ఆహ. 24

దం-అ. తరువాత నిప్పుడు సకలకర్మలయందు ప్రవర్తించుటకు కారణమ్మును నిరూపించుటచేత యథార్థముగానున్న ఆత్మవస్తువును గోచరింపఁజేయు కేవలమైన జ్ఞానమాత్రమువలననే సమస్తసంసారమనెడు నర్థముయొక్క వినాశము కలుగునని ఈపక్షమును దృఢముగాచేయ నిచ్ఛగలవాఁడై సిద్ధాంతవాది చెప్పుచున్నాఁడు.

తా. కర్మలు మోక్షసాధనము కావని నిరాకరించి తరువాత సిద్ధాంతవాది యేమి చెప్పుచున్నాఁడనిన సకలమైన నిత్యనైమిత్తికకామ్యనిషిద్ధకర్మలయందీపురుషుఁడు ఏ హేతువుచేఁ బ్రవర్తించుచున్నాఁడో ఆహేతువు మిథ్యాజ్ఞానమని చెప్పఁబడెడు అనాద్యజ్ఞానమనియు ఆయజ్ఞానముచే నావరింపఁబడి జీవాత్మ సకలకర్మల నాచరించుచు సకలవిధములైన యనర్థముల ననుభవింపుచున్నాఁడనియు యావత్కర్మలు నజ్ఞానకార్యములైనందున జ్ఞానసాధ్యంబైన యజ్ఞాననాశమే లక్షణంబుగాఁగల మోక్షమునందు కర్మలు లేశమైన నుపయోగింపవనియు కేవలమై నిర్విశేషచిన్మాత్రజ్ఞానముచేతనే మోక్షమను కైవల్యము సిద్ధించుననియు విశేషముగ ప్రతిపాదించి నిశ్చయించుచున్నాఁడని భావము.

ఓయీ! కర్మయందీపురుషుఁడు ప్రవర్తించుటకు కారణము మిథ్యాజ్ఞాన
చెప్పవచ్చును? లౌకికకర్మలని వైదికకర్మలని కర్మలు రెండు విధ
. కృషిగోరక్షణవాణిజ్యాదులు లౌకికకర్మలు; వీనికి లోకసిద్ధములైన
నప్రమాణములు మూలమై గానిపించుచున్నవి. అగ్నిహోత్రదర్శపూర్ణ
వైదికకర్మలు; వీనికి శ్రుతిస్మృతిప్రమాణము మూలంబైయున్నది గావున
ృత్తికి కారణము ప్రత్యక్షానుమానాగమప్రమాణములు కారణములుగాని
రణమని చెప్పఁదగదని యాక్షేపముకలుగునని యోచించి కర్మ ప్రవృత్తికి
జ్ఞానమే యని నిశ్చయించుటకొఱకు విమర్శనమును జేయుచున్నారు.—

ఇహ చేదం పరీక్ష్యతే. ౭౫

అ. ఇచ్చట నీవిషయము విమర్శింపఁబడును.

కర్మలయందు ప్రవర్తింపఁజేయునట్టి కారణమును నిరూపించుసమయములో
కవిచారమును జేసెదనని భావము. ఈవిచారముచేతనే కర్మ ప్రవృత్తి
యో నిశ్చయముగాఁ దెలియఁబడునని యభిప్రాయము.

ఆవిచారప్రకారమును చూపించుచున్నారు.—

కిం యథా ప్రతిషిద్ధేషు యాదృచ్ఛికేషు చ కర్మసు
స్వాభావికస్వాశయోత్థనిమిత్తవశాదేవేదం హితమి
దమహితమితి పరికల్ప్య మృగతృష్ణికోదకపిపాసురివ
లౌకికప్రమాణసిద్ధాన్యేవ సాధనాన్యుపాదాయ హి
తప్రాప్తయే అహితనిరాసాయచ స్వయమేవ ప్రవర్తతే
నివర్తతే చ తథైవ అదృష్టార్థేషు కామ్యేషు నిత్యేషు
చ కర్మసు కిం వాన్యదేవ తత్ర ప్రవృత్తినివృత్తి నిమి
త్త మితి. ౭౬

అ. నిషిద్ధములై యాదృచ్ఛికములైన కృత్యములయందు సహజమైన తన
ట్టిన కారణమువల్లనే ఇది యనుకూలమని ఇది ప్రతికూలమని కల్పించుకొని
ృలజలమును త్రాగ నిచ్ఛయించినవానివలె లోకసిద్ధప్రమాణములచేఁ బ్రసిద్ధ
ధనములనే గ్రహించి అనుకూలవిషయమును పొందుకొఱకు, ప్రతికూలవిష
రిహరించుకొఱకును స్వయముగా నేయేప్రకారము ప్రవర్తించునో, నివ
అప్రకారమే అదృష్టమే ప్రయోజనముగాఁగల కామ్యకర్మలయందును
యందును ప్రవర్తించునా, లేక దానియందు ప్రవృత్తినివృత్తులకు కారణ
నుండునా యని విమర్శించెదమని వెనుకటివాక్యముతో నన్వయము.

తా. ఈలోకములో నీదేహముతోనే యనుభవింపఁదగిన ఫలముగలకృత్యములు దృష్టార్థములని పరలోకములో దేహాంతరముతో ననుభవింపఁదగిన ఫలముగలకృత్యములు అదృష్టార్థములని చెప్పఁబడును. దృష్టార్థములు నిషిద్ధములని, యాదృచ్ఛికములని రెండువిధములు. ద్యూతము, పరదారగమనము, చౌర్యము మొదలగుకృత్యములు దృష్టార్థనిషిద్ధములు. వీనియొక్కఫలమైన ద్రవ్యనాశ, రాజదండనాదిదుఃఖము ఈదేహముతోనే యనుభవింపఁబడుచున్నందున ఇవి దృష్టార్థనిషిద్ధములని చెప్పఁబడుచున్నవి. శయనాసనభోజనేష్టవిహారాదికృత్యములు దృష్టార్థయాదృచ్ఛికములు నాఁబడు. వీనియొక్కఫలమైన శ్రమాపనయన, తృప్తివృత్త్యాదిపూర్వకసుఖము ఈదేహముతోనే యనుభవింపఁబడుచున్నందునను ఇవి దృష్టార్థయాదృచ్ఛికకృత్యము లనఁబడును. అదృష్టార్థకృత్యములలోఁగూడ నిషిద్ధములని, విహితములని రెండుప్రకారములుగలవు. సురాపానాదికృత్యములు నిషిద్ధములని జ్యోతిష్టోమాదికృత్యములు విహితములని చెప్పఁబడు. వీనియొక్కఫలమైన నరకస్వర్గములు పరలోకమునందే దేహాంతరముచేత ననుభవింపఁదగియున్నందున నివి యదృష్టార్థకృత్యము లనంబడు. వీనిలో దృష్టార్థములైన నిషిద్ధకృత్యంబులందును, యాదృచ్ఛికకృత్యములయందును పురుషుఁడు ప్రవర్తించునప్పుడు శాస్త్రజ్ఞానము నపేక్షింపకయే సహజముగాఁబుట్టిన స్వబుద్ధిచేత (అనఁగా నేను సుఖమును పొందకయుంటిని, దుఃఖముల ననుభవించుచుంటిని, ఏలాగైనను సుఖమును నేను పొందవలసియున్నది, దుఃఖమును నివారించుకొనవలసియున్నది. అనుబుద్ధిశాస్త్రమును చదివినను, చదువకపోయినను సర్వసాధారణముగ నందఱకు గలుగుచున్నది.) ఇట్టి స్వబుద్ధిచేత, సుఖమునందు రాగము, దుఃఖమునందు ద్వేషమును బుట్టినప్పుడు ఎదుట నుండువస్తువులలో వేనియందు రాగము ప్రవర్తించునో వానిని యనుకూలములని, వేనియందు ద్వేషము ప్రవర్తించునో వానిని ప్రతికూలములని కల్పించుకొని అనుకూలములయినవస్తువులు తనకు లభించుకొఱకు, ప్రతికూలములు తొలఁగిపోవుకొఱకు ఏవి సాధనములుగానుండునో వానిని శాస్త్రాపేక్షలేకనే కేవలలోకోపచారమునుబట్టి తెలిసికొని ఆసాధనముల ననుసరించి అనుకూలసుఖప్రాప్తికొఱకు ప్రవర్తించుచు ప్రతికూలదుఃఖనివారణముకొఱకు నివర్తించుచు నుండునుగదా? ఈప్రకారమే యదృష్టార్థకృత్యములయందును ప్రవర్తించునా? లేక శాస్త్రములను విచారించి అందుచేత బుట్టిన సమ్యక్జ్ఞానమవలంబించి ప్రవర్తించునా? యని విచారించెదమని భావము. అనఁగా గ్రీష్మకాలములో మధ్యాహ్నపువేళ చవిటినేలయందు నెండమావులు ప్రవర్తించిన . వానింజూచి వివేకములేనివాఁడు మహాతటాకజలములని తలఁచి ఆయుదకమును పుచ్చుకొని దప్పిఁ

దీర్చుకొన నిశ్చయించి ప్రవర్తించునట్టివాని ప్రవృత్తికి నిమిత్తము జలముగాని దాని యందు జలమను బుద్ధియేగదా! ఇదియే మిథ్యాజ్ఞానము. ఈప్రకారమే దృష్టార్థకృత్యములయందు పురుషులు ప్రవర్తించుటకు నిమిత్తము శాస్త్రజ్ఞాననిరపేక్ష కేవలస్వాభిప్రాయజనితరాగద్వేషకల్పితానుకూలప్రతికూలాధ్యాసరూపమైన మిథ్యాజ్ఞానముగ గదా కాన్పించుచున్నది. అదృష్టార్థకృత్యములయందు బ్రవర్తించుటకు నీమిథ్యాజ్ఞానమే నిమిత్తమా? లేక శాస్త్రవిచారజనిత సమ్యక్జ్ఞానమా? యని తాత్పర్యము. ఈ లోకములోని ప్రతివస్తువునందును అనుకూలత్వముగాని ప్రతికూలత్వముగాని నియతముగాలేదు. ఆయాపురుషులయొక్క బుద్ధిభేదము నవలంబించి దేశకాలావస్థానవిశేషములనుబట్టి అప్పుడప్పుడు అనుకూలత్వ ప్రతికూలత్వములు కల్పింపఁబడుచుండు గావున ఆయాపదార్థములయొక్క అనుకూలత్వప్రతికూలత్వవిషయమైనబుద్ధి మిథ్యాజ్ఞానమని యెఱుంగునది.

అవ. సందిగ్ధమై ప్రయోజనసహితమైనపదార్థమే విచారింపఁదగియుండునుగాని అసందిగ్ధమై అప్రయోజనమైనవస్తువు విచారింపఁదగియుండదు. సూర్యప్రకాశములో నుండి కంటికెదురుగానున్న ఘటము సందిగ్ధముకానందున విచారింపఁదగినదికాదు; కాకదంతములు ప్రయోజనహీనములైనందున విచారింపఁదగినవి కావుగదా? కావున సందిగ్ధప్రయోజనమైన పదార్థమే విచారయోగ్యమైయుండు. కావున ప్రస్తుతమందు విచారింపఁబడుకర్మ ప్రవృత్తినిమిత్తమునకు సందిగ్ధత్వమును కనుపఱచి పిదప సప్రయోజనత్వమును జూపఁదలఁచి ముందుగా ప్రశ్నను జేసి యుత్తరమును చెప్ప నారంభించుచున్నారు.

వాక్య. కించాతో యద్యేవం శృణు. ౭౭

దం-అ. ఇట్లైనచో దీనివలన నేమి ప్రయోజన మంటివేని వినుము చెప్పెదను.

తా. కర్మలయందు ప్రవర్తించుటకు కారణము నిశ్చయింపఁబడిన నేమిప్రయోజనము కలుగుననిన ఆప్రయోజనమును చెప్పెదను, సావధానముగా వినుమని భావము.

అవ. పూర్వపక్షవాదిసిద్ధాంతవాదుల కిరువురకు నీకర్మప్రవృత్తి నిమిత్త విచారమువలన కలిగెడిఫలమును విభజించి చెప్పుచున్నారు.—

వాక్య. యది తావ ద్యథావస్థితాత్మవస్తు సమ్యగ్జ్ఞానం ప్రమాణభూతం లౌకిక మాగమికం వా ప్రవృత్తి నిమిత్తమితి నిశ్చయః నివృత్తిశాస్త్రంచ నాభ్యుపగ

మృతే తదా హతాః కర్మత్యాగినో భ్రాంతి విజ్ఞాన మాత్రావష్టం భాదలౌకికప్రమాణోపాత్త కర్మాను ష్ఠాన త్యాగిత్వాచ్చ అథ మృగతృష్ణికోదక పిపాసు ప్రవృత్తినిమిత్తవ దయథావస్తు భ్రాంతివిజ్ఞాన మేవ సర్వప్రవృత్తినిమిత్తం తదా వర్ధామహే వయం హతాః స్థయూయ మితి. ౭౮

దం-అ. ఆప్తోపదేశముచేతఁగాని వేదాంతవచనములచేతఁగాని పుట్టినదియు యథార్థమైనదియు నున్నతీరుగానున్న (నిర్వికారమైన) ఆత్మస్వరూపమును గోచరింపఁ జేయుచున్న సమ్యక్జ్ఞానము కర్మలయందు ప్రవర్తించుటకు కారణమని నిశ్చయమైనచో, సర్వకర్మసన్న్యాసమును బోధించుశాస్త్రమును అంగీకరింపఁబడకపోయినచో, అప్పుడు కర్మలనన్నింటిని పరిత్యజించియున్న మేము భ్రమచేత నేర్పడిన సమ్యక్జ్ఞానమును మాత్రము అవలంబించియున్నందువలనను, వేదవాక్యములచేఁ బ్రతిపాదింపఁబడిన కర్మలయొక్క అనుష్ఠానమును త్యజించినందువలనను చెడిపోయినవారల మగుదుము. లేదా యెండమావులనీటిని ద్రావనిచ్ఛయించినవానియొక్క ప్రవృత్తికి కారణమువలె అయథార్థమైనపదార్థమును గోచరింపఁజేయుచున్న భ్రాంతిజ్ఞానమే సర్వకర్మలయందు ప్రవర్తించుటకు నిమిత్తమైనచో నప్పుడు మేము వృద్ధినిబొందుచున్నాము, మీరు చెడిపోవుచున్నారని ప్రయోజనము సిద్ధించును.

తా. వేదవాక్యములయొక్క విచారముచేతఁగాని సకలవేదశాస్త్రముల నెఱింగిన మహాపురుషునియొక్క యుపదేశముచేతఁగాని సమ్యక్ (మంచి) జ్ఞానము పుట్టును. అట్టిజ్ఞానము వాస్తవమై నిష్కల్మషమైన ఆత్మతత్త్వమును దెలియఁజేయుచుండును. అటువంటి సమ్యక్జ్ఞానమే కర్మలయందు ప్రవర్తించుటకు నిమిత్తమని నిశ్చయింపఁబడినయెడల కర్మత్యాగమునుచేసిన మేము మోక్షమార్గములోనుండి భ్రష్టులమై చెడిపోయినవారల మగుదుము. అదియెటులనిన, సమ్యక్జ్ఞానము కర్మలయందు ప్రవర్తింపఁజేయునేని అసమ్యక్జ్ఞానమునకు విషయ (గోచర) మైన ఆత్మస్వరూపము కర్తృత్వాది ధర్మములుకలదని నిశ్చయింపవలయునుగదా? ఆయర్థమును యథార్థముగా తెలియంజాలక ఆత్మస్వరూపము కర్తృత్వాదిధర్మశూన్యమని, నిర్వికారమని, నిరంజనమని, స్వయంప్రకాశమని, నిత్యముక్తమని యీవిధముగా విపరీతముగా తెలిసికొని యిట్టిభ్రాంతి జ్ఞానము నవలంబించియుంటిమి. అపౌరుషేయ నిత్యప్రమాణములైన వేదములు యావజ్జీవము కర్మల ననుష్ఠింపవలయునని విధించుచున్నప్పటికిని, ఆకర్మలను విడిచితిమి. అగ్ని

హోత్రాదికర్మల నాచరించుటకు యోగ్యతలేని కుంటివారు, గ్రుడ్డివారు, చెవిటివారు, భార్యాహీనులు మొదలగువారికి విధింపఁబడిన సన్న్యాసమును కర్మానుష్ఠానశక్తులమైన మే మాచరించియుంటిమి గావున ఇట్టి మేము సమ్యక్జ్ఞానమే కర్మప్రవృత్తికారణంబైనయెడల నిశ్చయముగా చెడిపోవుదుము. ఈప్రకారముగాక యెండమావులను జూచి జలమని భ్రమించి ఆజలమునుద్రాగి దాహమును దీర్చుకొనియెదనని ప్రవర్తించువానియొక్క ప్రవృత్తికి భ్రాంతిజ్ఞాన మెటుల నిమిత్తమో అటులే లౌకికవైదికకర్మలయందన్నిటియందుఁ బ్రవర్తించుటకు మూలము ఆత్మస్వరూపమును యథార్థముగఁ దెలియఁజేయక విపరీతముగఁ దెలియఁజేయుచున్న భ్రాంతిజ్ఞానమేయని నిశ్చయింపఁబడినచో నాత్మస్వరూపయాథార్థ్యజ్ఞానము కలవారమై ముముక్షువులకందఱకు నవశ్యకర్తవ్యంబని విధింపఁబడియున్న సర్వకర్మపరిత్యాగపూర్వక పరమహంససన్న్యాసాశ్రమము నంగీకరించియున్న మేము సన్మార్గమందే ప్రవర్తించుచున్నందున వృద్ధినొందుచున్నాము. భ్రాంతిజ్ఞానముచే నావరింపఁబడి కర్మజడులైయున్న మీరు చెడిపోవుచున్నారు. ఇదియే యీవిచారంబునకు ప్రయోజనమని భావము.

అవ. ఈవిధముగ ప్రయోజనసహితంబైన సంశయమును గనుపఱచి నిర్ణయము చేయుచున్నారు.—

శ్లో. హితం సంప్రేప్సతాం మోహా దహితం చ జిహాసతామ్,
ఉపాయాన్ ప్రాప్తిహీనార్థాన్ శాస్త్రం భాసయతేఽర్కవత్.

దం-అ. అజ్ఞానమువలన అనుకూలవిషయమును పొందఁగోరుచుండువారికిని ప్రతికూలవిషయమును పరిహరింపఁ గోరుచుండువారికిని వానియొక్క లాభ పరిత్యాగములే ప్రయోజనముగాఁగల సాధనములను శాస్త్రము సూర్యునివలె ప్రకాశింపఁ జేయుచున్నవి.

తా. ఆత్మస్వరూపము సర్వకాలసర్వావస్థలయందును నిరస్తనిఖిలదుఃఖమై పరమానందఘనమైయుండు. వీనిలో పరమానందఘనమైయున్నదని యెట్లు తెలియవచ్చు ననిన జాగ్రదవస్థలో స్రక్చందనవనితాపదార్థములయొక్క సంశ్లేషము సుఖజనకమైనటులు గాన్పించుచుండినను గాఢసుషుప్తియందు ఏపదార్థముయొక్క సంశ్లేషము లేకపోయినను మహాసుఖ మనుభవింపఁబడుచున్నది. నిద్రలోనుండి లేచినపిదప నింతకాలము మహాసుఖముగా నిదురపోయితినని మనమందఱము ననుభవింపుచున్నాముగదా? ఇట్టిసుఖము ఆత్మస్వరూపమునందుండు సుఖమేగాని విషయజనితసుఖముగాదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇదిగాక మనకెల్లరకు గృహక్షేత్రపుత్త్రకళత్రాదులకంటె ఆత్మ

యందు ప్రేమ హెచ్చుగాఁ గన్పట్టుచున్నది. గృహక్షేత్రపుత్త్రకళత్త్రాదులు మన కుపకారకములని వానియందు ప్రేమను చేయుచున్నాము. ఆత్మయందు నిష్కారణముగ గదా ప్రేమనుజేయుచున్నాము గావున ఈరెండుకారణములనుబట్టి ఆత్మ పరమానందస్వరూపమని తెలియవలయు. ''ఏషోస్య పరమ ఆనందః, ఆత్మైవానందః'' ఇత్యాదిశ్రుతివాక్యములు ఆత్మపరమాత్మస్వరూపుఁడని తెలియఁజేయుచున్నవి. ''అసంగోహ్యాయం పురుషః ఆత్మాఽజరోఽమరోఽభయోఽమృతః తస్యభాసా సర్వ మిదం విభాతి'' ఇత్యాదిశ్రుతులు ఆత్మస్వరూపము నిర్వికారమని, అసంగమని, స్వప్రకాశమని ప్రతిపాదించి సహజముగా నిరస్తసమస్తానర్థములుకలదని చెప్పుచున్నవి గావున ఇట్టి నిరస్తనిఖిలదుఃఖనిరతిశయానందంబైన ఆత్మస్వరూపము అనాద్యవిద్యాఽవృతంబైయున్నందున దానినిఁ దెలియంజాలక తమకు కొన్నియనర్థములు సంభవించియున్నవనియు వానిని పరిహరించుకొనవలయునని కొన్నిసుఖవిశేషములు లేవనియు వానిని పొందవలయునని జనులు కోరుచుందురు. ఇట్టిజనులయొక్క అనాద్యజ్ఞానసిద్ధంబైనకోరిక ననుసరించి తత్తదనర్థపరిహారంబునకును తత్తత్సుఖప్రాప్తికిని యోగ్యములగుసాధనములను వేదము ప్రకాశింపఁజేయును. అనఁగా నభిమతములగు నాయాగ్రామములకుఁ బోవఁదలంచి రాత్రివేళ చీఁకటిచేత తత్తద్గ్రామమార్గములు దెలియకఁ జిక్కువడుజనులకు సూర్యుఁడు తాను ఉదయించి ఆయాగ్రామమార్గములను మాత్రము ప్రకాశింపఁజేయునుగాని మార్గములను నిర్మించుటను మార్గములయందు జనులను నడిపించుటను చేయఁడుగదా? ఆప్రకారమే ఆత్మస్వరూప యాథార్థ్యము తెలియక సుఖము అప్రాప్తమని దుఃఖముప్రాప్తమని దలంచి సుఖప్రాప్తికొఱకు దుఃఖనివృత్తికొఱకును ప్రయత్నమునుజేయుచు వానికి సాధనము లేవియో యెఱుంగక చిక్కువడుచున్నవారలకు ఇట్టిసుఖమును పొందుట కిది సాధనమని ఇట్టిదుఃఖమును పోఁగొట్టుకొనుట కిది సాధనమని మాత్రము ప్రకాశింపఁజేయును. ఇంతమాత్రమేగాని శాస్త్రము తానే మీరు కర్తలు భోక్తలు మీకుఁ బొందఁదగిన సుఖముగలదు, నిరాకరింపఁదగిన దుఃఖముగలదు గావున మీరు సుఖమును సంపాదించుకొనుఁడు, దుఃఖము నిరాకరించుకొనుఁడు, మీరు వర్ణాశ్రమాదిధర్మములు గలవారని యీప్రకారము ధర్మము బోధించి జనులను ప్రవృత్తినివృత్తిమార్గములయందు సంచరింపఁజేయదని భావము.

అవ. ఈప్రకారము ఇష్టసాధనములను అనిష్టసాధనములను తెలిసినందున రాగద్వేషములు కలుగుననియు రాగద్వేషములు కలుగుటచేత ప్రవృత్తినివృత్తులు సంభవించుననియు పూర్వగ్రంథములోఁ జెప్పిన అర్థమును సంగ్రహముగా ననువదించుచున్నారు.—

వాక్య. ఏవం తావ త్ప్రత్యక్షానుమానాగమప్రమాణావష్టం
భాదాత్మనో నిరతిశయసుఖహితావ్యతిరేకసిద్ధేరహిత
స్య చ షష్ఠగోచరవత్ స్వత ఏవానభిసంబంధా దేవం
స్వాభావ్యాత్మానవబోధమాత్రా దేవహితం మే స్యా
దహితం మే మాభూదితి మిథ్యాజ్ఞానం తూపరశక్తి
కానవబోధోత్థమిథ్యాజ్ఞానవ త్ప్రవృత్తి నిమిత్తమితి
నిర్ధారితం శాస్త్రంచ న పదార్థశక్త్యాధానకృదితి.౭౦

౭౦-అ. ఈప్రకారము ప్రత్యక్షము అనుమానము శాస్త్రము అనుమూఁడు ప్రమాణముల నవలంబించుట చేత ఆత్మకు నిరవధికానందమను అనుకూలవిషయము తోడ అభేదము సిద్ధించినందువలన ప్రతికూలవిషయమగుదుఃఖము అఱవప్రమాణము నకు గోచరించునట్టి అభావమువలె సహజముగ సంబంధింపకపోవుటవల్లను ఇట్టిస్వభావ ముగల ఆత్మస్వరూపమును తెలియకపోవుటచేతనే అనుకూలవిషయము తనకు కావల యునని ప్రతికూలవిషయము తనకు లేకపోవలయు నని కలుగుమిథ్యాజ్ఞానము చవిటినేలను, ముత్యపుచిప్పను ఎఱుఁగనందుచేత కలిగినమిథ్యాజ్ఞానమువలె ప్రవృత్తినివృత్తులకు నిమి త్తంబైయుండునని నిర్ణయింపఁబడినది. శాస్త్రమును పదార్థములయందు సామర్థ్య మును పుట్టించునది కాదనియు నిర్ణయింపఁబడినది.

తా. ప్రత్యక్షానుమానాగమములను బట్టి విచారింపఁగా ఆత్మ నిత్యనిర్దుఃఖనిరతి శయపరమానంద స్వరూపుఁడనిగనుకనే ఈయాత్మకు పొందఁదగిన హితముగాని, నివర్తిం పఁదగినదుఃఖము (అహితము) గాని లేశమైనను లేదనియును అయినను ఇట్టియాత్మయొక్క వాస్తవస్వరూపము నెఱుంగమింజేసి, తనకొకహితము పొందవలసియున్నట్టును, అహిత ము నివర్తింపవలసియున్నట్టును తోఁచుచున్నదనియు ఇదియే మిథ్యాజ్ఞానమనియు ఈ మిథ్యాజ్ఞానమే హితప్రాప్తికిని అహితనివృత్తికిని సాధనములైన లౌకికవైదికకర్మలయం దన్నిటియందు ప్రవర్తించుటకును కారణమైయున్నదనియు సూర్యుఁడాయాగ్రామం బులకుఁ బోవఁదలంచినవారికి ఆయాగ్రామమార్గంబులను బ్రకాశింపఁజేయునటులు వేద మును, సుఖప్రాప్తి దుఃఖనివృత్తులను కోరువారికి తత్సాధనములను ప్రకాశింపఁజేయును గాని చిదాత్మయందు కర్తృత్వభోక్తృత్వవర్ణాశ్రమాదివిశేషశక్తిని స్వర్గాదులయందు సా ధ్యత్వమును యాగాదులయందు సాధనత్వమును పుట్టించునది కాదనియు పూర్వశ్లోకము లో ప్రతిపాదింపఁబడినదని భావము. అఱవప్రమాణమనఁగా ననుపలబ్ధిప్రమాణము; ఇది అభావమును తెలియఁజేయును. అభావము ఏవిధమున సత్తకలది కానేరదో ఆవిధమున

నే దుఃఖము ఆత్మయందు సత్తకలది కాదని భావము. ఊషరభూమియొక్క స్వరూపము తెలియంగకపోవుటచే నచ్చట జలమనెడిభ్రాంతి కలుగును. ఇది యొకవస్తువునందు మఱియొకవస్తువనెడు జ్ఞానమైనందున మిథ్యాజ్ఞాన మనఁబడును. ఈమిథ్యాజ్ఞానమే కదా జలపానరజతగ్రహణములయందుఁ బ్రవర్తించుటకు నిమిత్తము అని దృష్టాంతవాక్యము నకు భావము.

అవ. ఉత్తరగ్రంథము ప్రవర్తించుటకు తాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. ఏతస్యైవోత్తరత్ర ప్రపంచ ఆరభ్యతే. ౧౧

దం-అ. ఈ గ్రంథముయొక్క వివరణమే ఉత్తరగ్రంథమునందు ఆరంభింపబడుచున్నది.

తా. వెనుకటిశ్లోకములోఁ బ్రతిపాదించినవిషయమే యిఁక ముందటిగ్రంథములో విస్తారముగాఁ జెప్పఁబడును అని భావము.

శ్లో. నపరీప్సాం జహాసాంవా పుంసఃశాస్త్రం కరోతివా,
నిజ ఏవతు తే యస్మా త్పశ్వాదావపి దర్శయాత్. ౩౦. ౧౨

దం-అ. వేదము పురుషునకు పొందవలయుననెడు ఇచ్ఛనుగాని విడువవలయుననెడు ఇచ్ఛనుగాని చేయదు (పుట్టింపదు). ఇది ప్రసిద్ధము. ఎందువల్లననిన ఆయిచ్ఛలు రెండును పశువులు మొదలగువానియందును కనఁబడుచున్నందున స్వాభావికములే ఆయియున్నవి.

తా. వేదమనఁగాఁ దెలియఁబడనియర్థమును దెలియఁజేయునేగాని లేనియర్థము పుట్టింపదు గావున సకలజనులకును సుఖప్రాప్తియందు దుఃఖనివృత్తియందును ఇచ్ఛలను పుట్టింపదు. ఈయిచ్ఛలు పశుపక్షిమృగాదులయందుఁగూడ కలవు గనుక ఇవి సకలజంతువులకు స్వభావసిద్ధములని నిశ్చయింపఁదగియున్నవి. ఈయిచ్ఛలు శాస్త్రముచేతనే పుట్టింపఁబడినచో శాస్త్రజ్ఞానములేని పశుపక్షిమృగాదులు సుఖప్రాప్తియందును దుఃఖనివృత్తియందును ఇచ్ఛలేక యుండవలయు. పశుపక్షిమృగాదులుగూడ మనుష్యులవలె సుఖసాధనమైన హరితతృణభక్షణమునందును దుఃఖసాధనమైన దవాగ్నిస్పర్శమును పరిహరించుటయందును ఇచ్ఛగలిగి ప్రవర్తించునటుల మనము చూచుచున్నారము. కావున శాస్త్రము ఇచ్ఛాజనకము గాదనియుఁ ఇచ్ఛ యనునది అనాద్యవిద్యావృతులైన సకలజీవులకును స్వాభావికధర్మమనియు తెలియవలయునని భావము.

అవ. ఇంతకుముందు కర్మలయందుఁ బ్రవర్తించుటకు కారణము మిథ్యాజ్ఞానమని నిరూపించి అందుచేత మోక్షము కర్మసాధ్యముకాదని చెప్పిరి. ఇప్పుడు తత్త్వ

జ్ఞానగోచరంబైన యాత్మస్వరూపమును బాగుగ నాలోచించిచూచినను మోక్షము కర్మసాధ్యము కాదనియు కర్మలయందుఁ బ్రవేశించుట కవకాశములేదనియు ప్రతిపాదించుచున్నారు.

వాక్య. ఉక్తం తావదనవబుద్ధవస్తుయాథాత్మ్య ఏవ విధిప్రతిషేధశాస్త్రే ష్వధిక్రియత ఇతి, అథాధునావిషయస్వభావానురోధేన ప్రవృత్త్యసంభవం వక్తు కామ ఆహ. ౮౩

దం-అ. ఆత్మవస్తువుయొక్క యాథార్థ్యము నెఱుంగనివాఁడే విధినిషేధశాస్త్రములయందు అధికారముకలవాఁడై యుండునని చెప్పఁబడెను. తరువాత నిప్పుడు ఆత్మవస్తువుయొక్క స్వభావము అనుసరించుటచేతను ప్రవృత్తియొక్క అసంభవమును చెప్ప నిచ్ఛయించినవాఁడై చెప్పుచున్నాఁడు.

తా. ౭౮-౮ వ వాక్యమందుండు ౨౯ వ శ్లోకమునందును ఆత్మస్వరూపమును వాస్తవముగా నెవ్వఁడెఱుంగఁడో వాఁడాత్మయందు కర్తృత్వభోక్తృత్వములను వర్ణాశ్రమాది ధర్మముల నారోపించుకొని వ్యవహరించును గావున విధినిషేధశాస్త్రములయందధికారము గలిగియుండునని ప్రతిపాదింపఁబడినది. ఆత్మస్వరూపప్రతిపాదితంబులైన వేదాంతవాక్యంబుల నవలోకించిన తత్త్వజ్ఞానం బుద్భవిల్లు. అట్టిజ్ఞానంబున కాత్మవిషయంబైయుండు. తాదృశాత్మస్వరూపమును పర్యాలోచించిచూచినచో విధినిషేధశాస్త్రప్రతిపాదితంబులైన కర్మలయందు ప్రవర్తించుటకు నిమిత్తములేదని ప్రతిపాదింపఁదలఁచి చెప్పుచున్నారని భావము.

అవ. అందు కొందఱకు ముందుగా పొందఁదగినవస్తువు రెండువిధములనియు పరిహరింపఁదగినవస్తువు రెండువిధములనియు విభజించి రెండుశ్లోకములతో నిరూపించుచున్నారు.—

శ్లో. లిప్సతేఽజ్ఞానతోఽలబ్ధం కంఠే చామీకరం యథా,
వర్జితంచ స్వతో భ్రాంత్యా ఛాయాయా మాత్మనో యథా.
భయా న్మోహా ద్వనద్ధాత్రా రక్షః పరిజిహీర్షతి,
యచ్చాపరిహృతం వస్తు తథాలబ్ధం చ లిప్సతే. ౩౭. ౮౪

దం-అ. మెడయందున్నహారమునువలె పొందఁబడియున్న (వస్తువును) దానిని అజ్ఞానముచేత పొందవలయునని కోరును, అజ్ఞానముచే నావరింపఁబడిన చిత్తముగలవాఁడు భయముచేత తననీడయం దారోపింపఁబడిన రాక్షసునివలె స్వయముగానే

విడువఁబడియున్నవస్తువును భ్రాంతిచేత పరిహరింప నిచ్ఛయించును. ఆలాగుననే పొందఁబడనివస్తువును పొందనిచ్ఛయించును అని రెండుశ్లోకముల కొక్కటే యన్వయము.

తా. ఈలోకములోఁ బొందఁదగినవస్తువులు రెండువిధములు. ఒకటి స్వతః పొందఁబడియున్నప్పటికిని భ్రాంతిచేఁ బొందఁబడనిదానివలె తోఁచి పొందవలయునని కోరఁబడునది. దీనికిదృష్టాంతము. తనకంఠమునందున్న సువర్ణహారము అనఁగా ఒకానొకపురుషుఁడు తనకంఠమునందు హారమును ధరించియుండియును భ్రాంతిచేత హారము లేదని తలఁచి దానిని పొందవలయునని కోరుచుండును. ఇదియె ప్రాప్తప్రాప్తవ్య మనంబడును. మఱియొకటి స్వతః పొందఁబడనిదై యుండియు పొందవలయునని కోరఁబడుచుండునది. ఇది అప్రాప్తప్రాప్తవ్య మనంబడును. దీనికి దృష్టాంతము. స్వతః హారములేనివాఁడు తనకు హారముకావలయునని కోరుట. ఈప్రకారమే పరిహరింపఁదగినవస్తువులు రెండువిధములు. ఒకటి స్వతః విడచియున్నప్పటికిని భ్రాంతిచే విడువఁబడనిదానివలె తోఁచి విడువ నిచ్ఛయింపఁబడునది; దీనికి దృష్టాంతము తననీడయందుఁ దోఁచఁబడు పిశాచము, అనఁగా ఒకానొకపురుషుఁడు స్వతః పిశాచములేనివాఁ డైనప్పటికిని తననీడనుచూచి భ్రాంతిచేత పిశాచము తనవెంటవచ్చుచున్నదని భయపడి దానిని పరిత్యజింప నిచ్ఛయించును. ఇది పరిహృతపరిహార్య మనఁబడును. మఱియొకటి స్వతః సంభవించియుండి పరిత్యజింప నిచ్ఛయింపఁబడునది. దీనికిదృష్టాంతము సర్పము తనవెంటఁబడి తఱుముచుండఁగా దానిని పరిహరింప నిచ్ఛయించుట. ఇది అపరిహృతపరిహార్య మనంబడును. ఈవిధముగ ప్రాప్తవ్యములు రెండువిధములు, పరిహార్యము రెండువిధములని తెలియవలయునని భావము.

అవ. ఈప్రకారమే యపుగాక, అయినను ఏది యేయుపాయముచేత పరిహరింపఁబడుననఁగా ముందఱిశ్లోకముతో ఆయుపాయములను తెలియఁజేయుచున్నారని చెప్పుచున్నారు.—

వాక్య. తత్రైతేషు చతుర్షు విషయేషు ప్రాప్తయే పరిహారా
యచ విభజ్య న్యాయః ప్రదర్శ్యతే. ౮౬

దం-అ. అందులో నీనాల్గువిషయములయందు ప్రాప్తి (పొందుట) కొఱకు పరిహరించెడికొఱకు ఉపాయము విభజించి చూపింపఁబడుచున్నది.

తా. వాస్తవముగా పొందఁబడనివస్తువులు స్వర్గాదులు. వానిని పొందుకొఱకు ఏమియుపాయమో వాస్తవముగా పరిహరింపఁబడనివి. నరకాదులు, వానిని పరిహరిం

చెడినొ అవి ఏమియుపాయమో ఆయుపాయములను విభజించి చూపించుచున్నారని భావము.

శ్లో. ప్రాప్తవ్యపరిహార్యేషు జ్ఞాత్వోపాయాన్ శ్రుతేః పృథక్,
కృత్వాథప్రాప్నుయాత్ ప్రాప్యం తథా నిష్టం జహాత్యపి. ౩౩.౮౭

దం-అ. పొందఁదగినవానివిషయమై పరిహరింపఁదగినవానివిషయమై సాధనములను వేదమువలన ప్రత్యేకముగాఁ దెలిసికొని యనంతర మనుష్ఠించి పొందఁదగినదానిని బొందును. ఆప్రకారమే పరిత్యజింపవలసినదానిని పరిహరించును.

తా. వాస్తవముగా పొందఁబడక పొందవలయునని కోరఁబడుచుండునవి స్వర్గాదిఫలములు; అవి లభింపవలయునని యిచ్ఛయించుపురుషుఁడు ఆస్వర్గాదిఫలములకు ఏవి సాధనములో వానిని వేదవాక్యములవల్ల బాగుగ నెఱింగి యాసాధనములను యథావిధిగ నాచరించి పిదప స్వర్గాదిఫలములను బొందును. అనఁగా స్వర్గాదిఫలములు అగ్నిహోత్రాదికర్మల నాచరించిన లభించునని వేదము చెప్పుచున్నందున ముందుగా నాసాధనముల నెఱింగి పిదప నాయగ్నిహోత్రాదికర్మలను బాగుగ ననుష్ఠించి స్వర్గాదిఫలమును పొందునని అర్థము. ఆప్రకారమే వాస్తవముగా పరిహరింపఁబడనివై పరిహరించుకొనవలయునని కోరఁబడునవి నరకాదిదుఃఖములు; అట్టి నరకాదిదుఃఖములకు సాధనములు సురాపానాదికృత్యములని వేదము చెప్పుచున్నందున వాని నెఱింగి పరిహరించిన నరకాది దుఃఖములను పొందఁడని భావము.

అవ. ఈప్రకారము అప్రాప్తప్రాప్తవ్య అపరిహృతపరిహార్యములయొక్క సాధనములను ప్రతిపాదించి మిగిలిన రెంటియొక్క సాధనములను నిరూపించుచున్నారు.—

వాక్య. అథావశిష్టయోః. ౮౮

దం-అం. తర్వాత శేషించినవానియొక్క సాధనము చూపింపఁబడు.

తా. ౩౩-వ శ్లోకముయొక్క ఉత్తరార్థములోఁ జెప్పిన అప్రాప్తప్రాప్తవ్యముయొక్క అపరిహృతపరిహార్యముయొక్క సాధనమును నిరూపించినపిదప ౩౭ వ శ్లోకములో ౩౩ వ శ్లోకముయొక్క పూర్వార్థములోను చెప్పిన ప్రాప్తప్రాప్తవ్యముయొక్కయు పరిహృతపరిహార్యముయొక్కయు సాధనములు ప్రతిపాదింపఁబడునని భావము.

వాక్య. స్వభావతః. ౮౯

దం-అ. "స్వభావతః" అనుపదము శ్లోకముతోఁ జేరియన్వయించుచున్నది. స్వభావముగ పరిహరింపఁబడి పొందఁబడియున్నవానియొక్క పరిహారలాభములు జ్ఞానమువలనఁ

గలుగునుగాని కర్మచేతఁ గలుగవు. ఆపరిహారలాభములు అజ్ఞానమాత్రమే ప్రతిబంధకముగాఁ గలిగియున్నందున కర్మచేత సిద్ధింపవు.

తా. సహజముగ పరిహరింపఁబడియుండియును అజ్ఞానముచేత పరిహరింపఁబడలేదని యెన్నఁబడెడివిషయము జ్ఞానముచేతనే పరిహరింపఁబడును. సహజముగ పొందఁబడియుండును. అజ్ఞానముచేత పొందఁబడలేదని తలపఁబడెడి విషయమును జ్ఞానముచేతనే పొందఁబడునుగాని కర్మలచేత పరిహరింపఁబడదు. పొందను బడదు. అది యెందువల్ల ననఁగా పరిహృతపరిహార్యమునకును ప్రాప్తప్రాప్తవ్యమునకును అజ్ఞానమేకారణమైనందున అజ్ఞానము నివర్తించినంగాని పరిహృత పరిహార్య ప్రాప్తప్రాప్తవ్యముల యొక్క పరిహారలాభములు కలుగవు. అజ్ఞానము జ్ఞానముచేత నివర్తించునుగాని, కర్మచేత నివర్తింపదని భావము. అనఁగా తనచరణాభరణమును (నూపురమును) చూచి భ్రాంతిచేత సర్పమనుకొని భీతినొంది ఆసర్పమును నివర్తింపఁజేసికొనవలయు ననఁగా ఇది సర్పముకాదు, నూపురమే యనుజ్ఞానమును సంపాదించుకొనవలయును ఆట్టిజ్ఞానముచేత అజ్ఞానము నివర్తించి సర్పముకూడ, నివర్తించునుగాని గరుడధ్యానమును జేసిన నివర్తింపదుగదా. తనకంఠమునందున్న ముక్తాహారమును భ్రాంతిచేత నెచ్చటనో పోయినదనుకొని దానిని పొందవలయుననుకొనిన కంఠములోనే ముక్తాహారమున్నదని తెలిసికొనవలయును. అందుచేతనే హారములేదనెడిభ్రాంతి నశించి హారముపొందఁబడునుగాని అడవికిఁబోయి వెదకినఁ బొందఁబడదుకదా! ఆప్రకారమే ఆత్మస్వరూపము నిత్యప్రాప్తంబైయుండియు భ్రాంతిచేత ప్రాప్తముకానిదానివలె భాసించుచున్నందున ఆత్మస్వరూపమును యథార్థముగ తెలిసికొన్నందువలననె యీ భ్రాంతినశించిఆత్మస్వరూపముప్రాప్తించుఁగాని కర్మల ననుష్ఠించిన భ్రాంతి నివర్తింపదు. ఆత్మస్వరూపమును ప్రాప్తింపదు. ఈప్రకారమే అనర్థరూపంబైన దేహేంద్రియాద్యనాత్మప్రపంచము ఆత్మయందు స్వభావముగా నివృత్తమైయుండియును భ్రాంతిచేత నివృత్తము కానిదానివలె భాసించుచున్నది. ఇదియును ఆత్మస్వరూపయాథార్థ్యజ్ఞానముచేతనే నివర్తింపవలయుంగాని కర్మానుష్ఠానముచేత నివర్తింపదు. అని తాత్పర్యము.

అవ. ఓయీ స్వభావముగా ప్రాప్తమైయున్న ఆత్మస్వరూపముయొక్క ప్రాప్తియును స్వభావముగా నివృత్తమైయున్న అనాత్మప్రపంచముయొక్క నివృత్తియును కేవలజ్ఞానముచేత సిద్ధించుగాక, సకలానర్థనివృత్తిపూర్వక నిరతిశయానందావాప్తిరూపంబైన మోక్షము నేలాగున సిద్ధించును ? ఇటువంటి మోక్షము సంసారదశలో ననుభవింపఁబడక యున్నందున స్వర్గాదులవలె సాధ్యంబని తోఁచుచున్నది. కావున కర్మలచేతనే సిద్ధించునని చెప్పవలయునని శంకించుచున్నారు.—

శ్లో. పరిహృతావాప్తయో ర్బోధా ద్ధానప్రాప్తీ న కర్మణా,
మోహమాత్రాంతరాయత్వాత్ క్రియయా తేనసిధ్యతః. ౩౮. ౯౦

దం-అ. ఆత్మస్వరూపముయొక్క యాథార్థ్యమును తెలిసినందుచేతనే కోరఁబడునట్టి సర్వాధికమైన సుఖముయొక్క ప్రాప్తియును సమస్తమైన దుఃఖముయొక్క వినాశమును కలుగును. కర్మచేత కలుగదని యేకారణమువలన చెప్పఁబడెను ?

తా. అవతారికచేతనే తాత్పర్యము స్పష్టమగుచున్నది.

అవ. ఇందునకు సమాధానమును చెప్పుచున్నారు —

వాక్య. కస్మాత్పునరాత్మవస్తుయాథాత్మ్యావబోధమాత్రాదేవ
అభిలషిత నిరతిశయసుఖావాప్తి నిశ్శేషదుఃఖనివృత్తీ భ
వతః-నతు కర్మణేతి. ౯౧

దం-అ. సుగమము. అనఁగా పైశ్లోకమునే వాక్యముగా చెప్పియున్నారు.

అవ. ఇందునకు సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. ఉచ్యతే.

దం-అ. చెప్పఁబడును.

తా. ఈయాక్షేపమునకు సమాధానమును చెప్పుచున్నారమని భావము.

అవ. సమాధానమును శ్లోకములోఁ జెప్పుచున్నారు.—

శ్లో. కర్మాజ్ఞాన సముత్థత్వా న్నాలం మోహాపనుత్తయే,
సమ్యక్ జ్ఞానం విరోధ్యస్య తామిస్రస్యాంశుమానివ. ౩౯. ౯౨

దం-అ. కర్మ అజ్ఞానమువలన పుట్టినందున అజ్ఞానమును పోఁగొట్టుటకొఱకు సమర్థమైనదికాదు. అంధకారమునకు సూర్యునివలె ఈఅజ్ఞానమునకు సమ్యక్ జ్ఞానము విరోధిగానుండును.

తా. యాగదానాదికర్మకలాపము అజ్ఞానముచేతనే పుట్టినదికావున అజ్ఞానమునకు విరోధిగానుండదు. అందుచేతనే అజ్ఞానమును నివర్తింపఁజేయఁజాలదు. లోకములోఁగూడ పరస్పరవిరోధముగల పదార్థములలోనే యొకపదార్థము మఱియొకపదార్థమును నివర్తింపఁజేయునుగాని అవిరుద్ధములు నివర్తింపఁజేయవుగదా? కావున సూర్యుఁడంధకారమునకు విరోధిగానుండి ఆయంధకారమును నివర్తింపఁజేసినటుల ఆత్మస్వరూపవిషయమైన సమ్యక్ జ్ఞానము అజ్ఞానమునకు విరోధిగానుండి ఆయజ్ఞానము నశింపఁజేయును. నిరతిశయానందప్రాప్తియును నిశ్శేషదుఃఖనివృత్తియును ఆత్మస్వరూపము

కంటె భిన్నములుగావు. అట్టియాత్మస్వరూపము అజ్ఞానముచేత నావరింపఁబడియున్నది. ఆయజ్ఞానము ఆత్మస్వరూపసమ్యక్ జ్ఞానముచేత నశింపఁజేయఁబడఁగా ఆత్మస్వరూపము ప్రకాశమునొందును. అందుచేతనే ఆత్మస్వరూపాభిన్నములైన నిరతిశయసుఖప్రాప్తి నిశ్శేషదుఃఖవినాశములును ప్రకాశించును. ఇవి అజ్ఞానముచేత నాచ్ఛాదింపఁబడి యున్నందున సంసారదశలోఁ బ్రకాశింపలేదుగాని బొత్తిగా లేనందుచేతఁగాదు; కావుననే దేహాంతమునందేగాదు సంసారదశలోఁ (దేహముతోఁ గూడియున్నదశలో) గూడ సమ్యక్ జ్ఞానముగలవారికి ప్రకాశించుచున్నవి; అని ముందు విశదముగా చెప్పెదము. కావున నిరతిశయానందప్రాప్తి నిఖిలానర్థనివృత్తిరూపంబైన మోక్షము సమ్యక్ జ్ఞానముచేత సిద్ధించునుగాని అజ్ఞానావిరోధియగు కర్మచేత సిద్ధింపదని భావము. ౮౮, ౮౯, ౯౦ వాక్యములకు మఱియొకఅర్థము కలదు. అదియెట్లనిన శుక్తిరజ్వాదులయందు కలిగిన రజతసర్పాదిభ్రాంతి శుక్తిరజ్వాదిసమీపగమనమనెడి క్రియచేతఁగదా నివర్తించుచున్నది. ఆప్రకారమే ఆత్మస్వరూపమునందు కలిగిన సంసారిత్వభ్రాంతియును కర్మచేతనే నివృత్తియగునని శంకించుకొని పరిహారమును చెప్పుచున్నారు. మూఁడువాక్యములకు ప్రతిపదార్థము సమానము. తాత్పర్యమును చెప్పెదము. లోకములో శుక్తిరజ్వాదులయందుఁ గలిగిన రజతసర్పాదిభ్రాంతిని శుక్తిరజ్వాదిసమీపగమనమనెడి క్రియయే సాక్షాత్తుగా నశింపఁజేయుటలేదు. ఇఁకనేమనిన శుక్తిరజ్వాదిస్వరూపముతోడ పురుషుని యొక్క చక్షురింద్రియము చక్కఁగా సంబంధించులాగునచేయును. అందుచేత శుక్తిరజ్వాది స్వరూపయాథార్థ్యజ్ఞానము కలుగును. ఆజ్ఞానము అజ్ఞానమును బోఁగొట్టి రజతసర్పాదిభ్రాంతిని నివర్తింపఁజేయును. ఆప్రకారమే కర్మయును చిత్తమునందుఁగల మాలిన్యమును నివర్తింపఁజేయును. అందుచేత ఆత్మస్వరూపయాథార్థ్యజ్ఞానముకలుగును. ఆజ్ఞానము అజ్ఞానమును నివర్తింపఁజేసి సంసారిత్వభ్రాంతిని నశింపఁజేయునుగాని సాక్షాత్తుగ నజ్ఞానమును బోఁగొట్టఁజాలదు. కర్మకును అజ్ఞానమునకును పరస్పరవిరోధము లేదని అందుచేతనే కర్మ అజ్ఞానమును నివర్తింపఁజేయఁజాలదనియు నింతకుముందే చెప్పియున్నాము. శుక్తికాదిసమీపగమనముమాత్రమే రజతాదిభ్రాంతిని నివర్తింపఁజేయునెడల శుక్తికాసమీపమునకుఁబోయి శుక్తికను జూడక నలుదిక్కులు చూచు నట్టివానికిని రజతభ్రాంతి నశింపవలసియుండును. ఆలాగున నశించుట లేదుగదా, కావున అజ్ఞానమును జ్ఞానమే నశింపఁజేయునుగాని కర్మ నశింపఁజేయదని భావము.

అవ. కర్మలు అజ్ఞానమువల్ల పుట్టినందున అజ్ఞానమును నివర్తింపఁజేయు సామర్థ్యముగలవి కావని చెప్పినను జ్ఞానమును అజ్ఞానమువల్లనే పుట్టినందున అజ్ఞానము నివర్తింపఁజేయఁజాలదని పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. నన్వాత్మజ్ఞానమప్యవిద్యోపాదానం నవాశాస్త్రశిష్యా
చార్యాద్యనుపాదాయాత్మజ్ఞానం లభ ఇతి. ౯౩

దం-అ. ఓయీ ఆత్మజ్ఞానమును అజ్ఞానమే కారణముగాఁగలది. శాస్త్రము శిష్యుఁడు గురువు మొదలగువానిని గ్రహింపకయే ఆత్మజ్ఞానమును పొందఁబడదుగదా?

తా. దేహము ఇంద్రియములు మొదలగు భేదప్రపంచము అజ్ఞానముచేతఁ గల్పింపఁబడినదనియు ఇట్టిభేదప్రపంచములోఁ జేరినయజమానుఁడు ఋత్విజులు పురోడాశాది ద్రవ్యము స్వర్గాదిఫలము మొదలగు భేదముల నవలంబించి ప్రవర్తించునట్టికర్మలును అజ్ఞానముచేతఁ గల్పింపఁబడినవనియు ఇట్టి యజ్ఞానకల్పితములైనకర్మలు అజ్ఞానమును నివర్తింపఁజేయ నేరవని చెప్పినను మీరు చెప్పెడు ఆత్మజ్ఞానమును అజ్ఞానకల్పితమని యే తోఁచుచున్నది. శిష్యుఁడని గురువని శాస్త్రమని చెప్పఁబడెడి భేదము నవలంబించి కదా యాత్మజ్ఞానము కలుగుచున్నది. ఈగురుశిష్యశాస్త్రాదిభేదము అజ్ఞానముచేతనే కల్పింపఁబడినది గనుక గురుశిష్యాదిభేదము నవలంబించి కలుగుచున్న ఆత్మజ్ఞానమును అజ్ఞానకల్పితమే యని నిశ్చయముగాఁ జెప్పవలయు. ఇట్టి అజ్ఞానకల్పితమైన ఆత్మజ్ఞానమును కర్మలవలె అజ్ఞానమును నివర్తింపఁజేయఁజాలదని భావము,

అవ. ఆత్మజ్ఞానము అజ్ఞానకల్పితమైనప్పటికిని పరమార్థసత్యమైన ఆత్మస్వరూపమును గోచరింపఁజేయుచున్నందున అజ్ఞానమునకు విరోధిగానుండును గావున అజ్ఞానమును నివర్తింపఁజేయఁగలదని సిద్ధాంతవాది పరిహారమును జెప్పుచున్నాఁడు.—

వాక్య. నైషదోషః యత ఆత్మజ్ఞానం హి స్వతస్సిద్ధపరమా
ర్థాత్మానస్తుస్వరూప మాశ్రియాదేవ అవిద్యా తదు
త్పన్న కారకగ్రామప్రధ్వంసి. ౯౪

దం-అ. ఇది దోషము కాదు. ఎందువల్లననిన ఆత్మజ్ఞానము అకల్పితమై యథార్థమైన ఆత్మవస్తువుయొక్క స్వరూపమును మాత్రము అవలంబించియున్నందువల్లనే అజ్ఞానమును అజ్ఞానకల్పితమైన కర్తృకరణాది భేదసముదాయమును నశింపఁజేయుచున్నది.

తా. ఆత్మజ్ఞానము కర్మలవలె అజ్ఞానమువల్ల జనించినప్పటికిని కర్మలకంటె చాల వైలక్షణ్యము కలదైయున్నది. అదియెట్లనిన చెప్పెదను వినుఁడు. కర్మలు జడమువలె మిథ్యాభూతములై (క్షణభంగురములై) ఆత్మాతిరిక్తములై స్వతః భిన్నములైయున్న వర్ణాశ్రమవయోవస్థా స్వర్గపుత్రపశ్వన్నాదివస్తువుల నవలంబించి వానిని ప్రతిపాదించుచుఁ బ్రవర్తించుచున్నవి. ఆత్మజ్ఞానము చేతనమై సత్యమై స్వతః అభిన్నమైనస్వాత్మ

స్వరూపమును అవలంబించి ఆయాత్మవస్తువునే ప్రతిపాదించుచుఁ బ్రవర్తించుచున్నది కావున జడమై మిథ్యాభూతమై ఆత్మాతిరిక్తంబైన అజ్ఞానము తత్సమానస్వభావముఁగలిగి అజ్ఞానసమానస్వభావముగల విషయములను ప్రకాశింపంజేయుంకర్మల కవిరుద్ధంబై యుండుంగావున కర్మ లజ్ఞానమును నివర్తింపఁజేయంజాలవు. ఆత్మజ్ఞానము అవిద్యాకల్పితాంతఃకరణ వృత్తిరూపంబైనందున స్వతః జడమై మిథ్యారూపంబైనప్పటికిని అజ్ఞానమున కత్యంతప్రతిభటంబైన చిత్పరమార్థాద్వితీయాత్మస్వరూపమును ప్రకాశింపఁజేయుచున్నందున అజ్ఞానమునకు విరోధిగానున్నది గనుక అజ్ఞానమును ఆఅజ్ఞానముచేత కల్పింపఁబడిన కర్త్రాదిప్రపంచమును నశింపఁజేయఁగలదని భావము.

అవ. ఈప్రకారము కర్మకును జ్ఞానమునకును ప్రతిపాద్యభేదముచేత కలిగియున్నవైలక్షణ్యమును ప్రతిపాదించి మఱియొకవైలక్షణ్యమును ప్రతిపాదించుచున్నారు.-

వాక్య. స్వాత్మోత్పత్తావేవ శాస్త్రాద్యపేక్షతే - నోత్పన్నమవిద్యా నివృత్తౌ - కర్మ పునః స్వాత్మోత్పత్తా వుత్పన్నంచ. ౯౫

దం-అ. ఆత్మజ్ఞానము తనయొక్క ఉత్పత్తి (పుట్టక) యందే శాస్త్రము మొదలయినవానిని యపేక్షించును. పుట్టినదై అవిద్యను నివర్తింపఁజేయుంటయందు అపేక్షింపదు. కర్మ అన్ననో తనస్వరూపముయొక్క పుట్టుకయందును పుట్టినదై ఫలమును ఇచ్చుటయందును భేదమును అపేక్షించియుండును.

తా. యాగదానాదికర్మకలాపము తాను పుట్టునప్పుడు కర్త కరణము మొదలగు అవిద్యాకల్పితభేదపదార్థముల నవలంబించి పుట్టును. పుట్టినతరువాతనుగూడ కర్తృకరణాదిభేదముల నపేక్షించియే ఫలము నిచ్చును. అనఁగా ఒకపురుషుఁడు తనకు స్వర్గాదిఫలము కావలయుననికోరి దేశకాలద్రవ్యములను జేర్చుకొని మనోవాక్కాయముల చేత శాస్త్రోక్తవ్యాపారము నాచరించినగాని యాగదానాదికర్మలు పుట్టవుగనుక, కర్మలు తాము పుట్టువిషయమై కర్త్రాదిభేదవస్తువుల నపేక్షించుచున్నవి. పుట్టినతర్వాత స్వర్గాదిఫలముల నిచ్చునప్పుడును, మరణానంతరకాలమును చంద్రలోకాదిదేశమును, విలక్షణభోగ్యవస్తువులను, వానిని అనుభవించెడిభోక్తను, ఈలాటిభేదవస్తువుల నపేక్షించియుండును గావున కర్మలు పుట్టునప్పుడు ఫలముల నిచ్చునప్పుడునుగూడ అవిద్యాకల్పితకర్తృభోక్త్రాదివస్తువుల నపేక్షించియుండును. ఆత్మజ్ఞానము, గురువు, శిష్యుఁడు, వేదాంతమహావాక్యములు మొదలగుభేదము నపేక్షించినప్పటికిని పుట్టినతరువాత అవిద్యానాశమనుఫలము నిచ్చునపుడు గురుశిష్యాదిభేదము నపేక్షింపదు. గురుశిష్యాదిభేదమును ఈభేదమును కల్పించిన అజ్ఞానమును నిశ్శేషముగా నశింపఁజేయును. కనుక ఇట్టివైలక్షణ్యము కర్మలకును ఆత్మజ్ఞానమునకును కలిగియున్నది.

అవ. ఓయీా కర్మ తాను ఫలమునిచ్చునప్పుడు అజ్ఞానమును తత్కల్పితభేద మును అపేక్షించునని యేలచెప్పవలెను? నిరపేక్షముగానే ఫలమునియ్యఁగూడదా యని శంకింపఁగా ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. నహి క్రియాకారకనిస్పృహా కల్పకోటివ్యవహితఫ
లదానాయ స్వాత్మానం బిభర్తి సాధ్యమానమాత్ర
స్వరూపత్వాత్తస్యాః. ౯౮

దం-అ. ఆకర్మ కేవలము పుట్టింపఁదగినస్వరూపము కలదైయున్నందున కర్మక ర్త్రాదిసాధనముల నపేక్షింపనిదై అనేకకల్పముల కావల సిద్ధించునట్టిఫలము నిచ్చుకొఱకు తనస్వరూపమును ధరింపఁజాలదు.

తా. కర్మయనఁగా సిద్ధమై స్వతంత్రమైన పదార్థముకాదు. ఇఁక నెటువంటి దనిన పురుషప్రయత్నముచేత పుట్టింపఁబడి స్వతంత్రమైన పదార్థము నాశ్రయించి యుండును. ద్రవ్యము స్వతంత్రమనియు అట్టి ద్రవ్యమును ఆశ్రయించి గుణములుగాని కర్మలుగాని ప్రవర్తించుననికదా శాస్త్రకారులు చెప్పుచున్నారు. గనుక కర్మ, కర్త యొక్క ప్రయత్నవిశేషముచేత పుట్టింపఁబడి ఆకర్తనే ఆశ్రయించియుండును. ఇట్టి కర్మ తానుపుట్టినప్పుడే తనయొక్కఫలమును ఇచ్చునదికాదు. తనకంటె ముందు సం పాదింపఁబడి తనకంటె ప్రబలమైనకర్మలు వానిని ఫలములను ఇచ్చి సమాప్తిపొందిన పిదప ఫలమునిచ్చును. కావున తాను పుట్టినకాలమున కనంతర మెన్నికోట్లకల్పములకు తాను ఫలము నిచ్చును. అందుచేత నంతకాలము నిరాశ్రయముగా నుండఁజాలదు. కావున తన పుట్టుకకు కారణమైనకర్తను ఆశ్రయించెడి తనస్వరూపమును ధరించి యుండును. ఈహేతువుచేతనే కర్మ తాను ఫలము నిచ్చునప్పుడును అజ్ఞానమును తత్క ల్పితకర్త్రాదిభేదవస్తువుల నపేక్షించియుండునని నిశ్చయింపఁబడెనని భావము.

అవ. ఓయీా! యాగదానాది కర్మలు చిరకాలమునకు ఫలమునిచ్చునని యేల చెప్పవలె? తాము పుట్టగానే ఫలము నియ్యగూడదా యని శంకింపఁగా అలాగున చెప్పఁ గూడదు. అనుభవమునకు విరుద్ధముగా నుండునని పరిహరించుచున్నారు.—

వాక్య. నచక్రియా ఆత్మజ్ఞానవత్ స్వాత్మప్రతిలాభకాలఏవ
స్వర్గాదిఫలేన కర్తారం సంబధ్నాతి. ౯౯

దం-అ. కర్మ ఆత్మజ్ఞానమువలె తనయొక్క ఉత్పత్తికాలమందే తన్ననుష్ఠించిన వానిని (కర్తను) స్వర్గము మొదలగుఫలములతోడ సంబంధింపఁజేయదుగదా?

తా. ఆత్మజ్ఞానము తాను ఎప్పుడుజన్మించునో తత్క్షణమందే తన్ను పుట్టించిన వానికి అజ్ఞాననివర్తిని కలుగఁజేయును. కర్మలు ఆలాగున కలుగఁజేయవు. జ్యోతిష్టోమాదియాగములు తాముపుట్టుచునే తమ్ము ననుష్ఠించిన యజమానునికి స్వర్గమును కలుగఁ జేసినది లేదుగదా. కావున కర్మలు చిరకాలమునకు ఫలమునిచ్చునని భావము.

అవ. ఆత్మజ్ఞానము కర్మల నపేక్షించిగాని చిరకాలమునకే ఫలము నిచ్చునది యని శంకింపఁగా పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. ఆత్మజ్ఞానం పునః పురుషార్థసిద్ధా నోత్పద్యమాన
స్వరూపవ్యతిరేకేణ అన్యద్రూపాంతరం సాధనాంత
రం వా పేక్షతే. ౬౮

దం-అ. ఆత్మజ్ఞానమన్ననో ఫలసిద్ధివిషయమై పుట్టుచున్నస్వరూపముకంటె భిన్నముగా మఱియొకరూపమునుగాని సాధనమునుగాని అపేక్షింపదు.

తా. ఆత్మజ్ఞానము అంతఃకరణము శుద్ధమైనంగాని పుట్టదు. అంతఃకరణశుద్ధి యాగదానవేదపారాయణాది కర్మలచేతఁ గలుగును. అంతఃకరణము మిక్కిలి శుద్ధమైనపిదప వేదాంతమహావాక్యశ్రవణము నొకసారిచేసినమాత్రమున ఆత్మతత్వజ్ఞానము కలుగును. అంతఃకరణము కొంచెము శుద్ధముకాఁగానే ఔత్సుక్యముచేత వేదాంత మహావాక్యశ్రవణమును చేసినయెడల ఆత్మతత్వజ్ఞానము సకృత్ శ్రవణముచేఁ గలుగదు గనుక, వేదాంతవాక్యములవిషయమైన శ్రవణ మనన నిదిధ్యాసములను మాటిమాటికి చేయవలయును. ఇట్టి శ్రవణాద్యభ్యాసముచేత నంతఃకరణగతమాలిన్యము నిశ్శేషముగా నివర్తించి ఆత్మతత్వజ్ఞానము అతిస్ఫుటముగా జన్మించును. జన్మించినపిదప అజ్ఞానమును తత్కల్పితమగు భేదమును నిశ్శేషముగా స్వతంత్రముగా నివర్తింపఁజేయునుగాని కర్మలనుగాని, అభ్యాసమునుగాని అపేక్షింపదు. కర్మలు అభ్యాసము ఇవి ఆత్మజ్ఞానస్వరూపోత్పత్తికి సహాయములుగాని అవిద్యానాశమను ఫలోత్పత్తికి సహాయములు కావని భావము.

అవ. ఓయీ! ఆత్మజ్ఞానము కర్మలను అభ్యాసమును అపేక్షించవనిచెప్పుట యుక్తముకాదు. అనాదికాలమునుండి ప్రవర్తించుచున్న భేదప్రపంచదర్శనమున్ను దానిచేతకలిగిన వాసనలున్ను ఆత్మజ్ఞానమును బాధించును గనుక అట్టిబాధను పరిహరించెడికొఱకు అభ్యాసాదుల నపేక్షించియుండునని శంకించుచున్నారు.—

వాక్య. కుత ఏతత్. ౬౯

దం-అ. ఇది ఎందువల్లను?

తా. ఆత్మజ్ఞానము అభ్యాసాదుల నపేక్షించదని యేకారణమువల్ల చెప్పుచున్నారని భావము.

అవ. సమాధానము చెప్పుచున్నారు.—

వాక్య. యతః.　　　౧౦౦

దం-అ. ఏకారణమువల్లనంటే చెప్పెదను వినుము.

తా. స్పష్టము.

అవ. కారణమును శ్లోకముతో స్ఫుటముగా చెప్పుచున్నారు.—

శ్లో. బలవద్ధి ప్రమాణోత్థం సమ్యగ్జ్ఞానం నబాధ్యతే,
ఆకాంక్షతే న చాప్యన్య ద్బాధనం ప్రతిసాధనమ్. ౩౭. ౧౦౧

దం-అ. ప్రమాణముచేఁ బుట్టినదిగనుకనే బలిష్ఠమైన సమ్యక్జ్ఞానము నిశ్చయముగా బాధింపఁబడదు. బాధించుటనుగూర్చి మఱియొకసాధనమునున్ను అపేక్షింపదు.

తా. ప్రత్యక్షము అనుమానము ఆగమము (శాస్త్రము) ఈమూఁడుప్రమాణములలో శాస్త్రము ప్రబలప్రమాణము. ఆశాస్త్రములలో వేదము ఉత్తమము. అట్టి వేదములలో ఉపనిషత్తులు శ్రేష్ఠములు. అట్టి ఉపనిషత్తులలో సారవంతములైన మహావాక్యములు మహాప్రబలములు. ఇట్టి ప్రబలప్రమాణముచేత జన్మించిన ఆత్మతత్త్వజ్ఞానము అన్నిటికంటె బలిష్ఠమైనందున దుర్బలప్రత్యక్షాదిప్రమాణములచే పుట్టినభేదప్రపంచదర్శన తద్వాసనలచేత బాధింపబడదు. భేదప్రపంచతద్వాసనలను తాను బాధించునప్పుడును అభ్యాససాధనల నపేక్షించదు. స్వయముగా నసహాయశూరునివలె నశింపఁజేయును. దుర్బలమై యుండిననేగదా సహాయాంతరమును కోరవలెను. భేదప్రపంచతద్వాసనలు చిరకాలనిరూఢములై యున్నందున బలిష్ఠములనియు తత్కాలోత్పన్నంబైయున్నందున ఆత్మజ్ఞానము దుర్బలమనియు ఇట్టిదుర్బలాత్మజ్ఞానము ప్రబలతమభేదప్రపంచదర్శనతద్వాసనల నేలాగున బాధించునని యాక్షేపింపఁదగదు. గిరిగుహలయందు చిరకాలవాసితములైయున్న తిమిరములను తత్కాలోత్పన్నంబైన ప్రదీపప్రభ అతిశీఘ్రముగ నివర్తింపఁజేయుచున్నట్లు మనము ప్రత్యక్షముగఁ జూచుచున్నారము. కావున చిరకాలస్థితి తత్కాలోత్పన్నత్వములు బలాబలములకుఁ గారణములుగావు. ప్రబలప్రమాణజన్యత్వ దుర్బలప్రమాణజన్యత్వములు, వస్తుస్వభావమున్ను బలాబలములకు కారణములు గనుక ప్రబలప్రమాణజన్యమైన ఆత్మజ్ఞానము దుర్బలప్రమాణజన్యములైన భేదదర్శనతద్వాసనలను స్వతంత్రముగానే నివర్తింపఁజేయునని భావము.

అవ. ఈప్రకారము తత్త్వజ్ఞానమే మోక్షసాధనము. కర్మలు కావని ప్రతిపా దించిన సిద్ధాంతవాది తనయొక్క పక్షమును ముగించుచున్నాఁడు.—

వాక్య. స్వపక్షస్య హేత్వవష్టంభేన సమర్థితత్వాన్నిరాశంక
ముపసంహ్రియతే. ౧౦౨

దం-అ. తనయొక్కపక్షము హేతువు నవలంబించుటచేత సాధింపఁబడినం దున నిస్సంశయముగా నుపసంహరింపఁబడుచున్నది.

తా. కర్మలే మోక్షసాధనము. జ్ఞానముకాదని చెప్పిన పూర్వపక్షవాదియొక్క మతము మంచిహేతువులనుచెప్పి నిరూపింపఁబడినదికాదు. జ్ఞానమే మోక్షసాధనము కర్మకాదని చెప్పిన మామతము మంచిహేతువులను చెప్పి సమర్థింపఁబడినది గనుక మా మతమే సమీచీనమతమని అంతఃకరణశుద్ధితో నిర్ణయించుచున్నారని. భావము.

శ్లో. తస్మాద్దుఃఖోదధేర్హేతో రజ్ఞానస్యాపనుత్తయే,
సమ్యక్జ్ఞానంసుపర్యాప్తంక్రియాచేన్నోక్తహేతుతః. 3 ౭౧౦

దం-అ. ఆకారణమువలన దుఃఖసముద్రమునకు కారణమైన అజ్ఞానముయొక్క నివారణమునకు ఆత్మజ్ఞానమే మిక్కిలి చాలినది. (సమర్థమైనది.) వెనుక చెప్పిన కారణమువలన కర్మ కాదు.

తా. ఇంతవఱకు మేము చెప్పినహేతువునుబట్టి విచారించగా ఆధ్యాత్మికాధి దైవకాధిభౌతికదుఃఖప్రచురంబై సముద్రమువలె అపరిచ్ఛేద్యంబైన యీసంసారమను నర్థమునకు కారణము అజ్ఞానము. ఇట్టిఅజ్ఞానమును నశింపఁజేయుటకు ఆత్మతత్త్వజ్ఞానము మిక్కిలి సమర్థమైయున్నది గాని యాగదానాదికర్మలు సమర్థములుగాఁగావని నిశ్చ యింపఁదగియున్నదని భావము.

అవ. ౩౬ వ శ్లోకములో నిత్యప్రకాశరూపంబైన చిదాత్మను గోచరింపఁజే యుచున్నందునను, అపౌరుషేయమై నిత్యనిర్దోషమై సర్వప్రమాణబలిష్ఠంబైన వేదాంత వాక్యములవలన జన్మించినందునను ఆత్మజ్ఞానము సంసారానర్థకారణంబైన అజ్ఞానమును నిశ్శేషముగా నివర్తింపఁజేయఁగలదని గనుకనే అనాదికాలమునుండి ప్రవర్తించుచున్న భేదప్రపంచతద్వాసనలఁగూడ నివర్తింపఁజేయఁగలదుకాని వానిని నివర్తింపగాఁ జేయునప్పుడు పౌనఃపుణ్యమనుష్ఠానమనెడి (అభ్యాసమనెడి) సాధనాంతరముయొక్క సహాయమును కోరదనియు చెప్పఁబడినది. అందులో భేదప్రపంచతద్వాసనలచేత బాధింపఁబడదని చెప్పినవిషయములో ప్రత్యక్షానుభవమునకు విరోధముకలదని పూర్వపక్షవాది ఆక్షేపించుచున్నాఁడు.—

వాక్య. నను బలవదపి సమ్యక్జ్ఞానమపి సదప్రమాణోత్థేన అసమ్యక్జ్ఞానేన బాధ్యమాన ముపలభామహే యత ఉత్పన్నపరమార్థబోధస్యాపి కర్తృత్వభోక్తృత్వ రాగద్వేషాద్యనవబోధోత్థప్రత్యయా ఆవిర్భవంతి, న హ్యబాధితే సమ్యక్జ్ఞానే తద్విరుద్ధానాం ప్రత్యయానాం సంభవోఽస్తి. ౧౦౪

దం-అ. ఓయీ! బలిష్ఠమైనప్పటికి సమ్యక్జ్ఞానమున్ను ప్రమాణాభాసములైన ప్రత్యక్షాదిప్రమాణములవల్ల పుట్టిన భ్రాంతి జ్ఞానముచేత బాధింపఁబడుచుండునటుల చూచుచున్నాము.(తెలియుచున్నాము.)ఎందువల్లనంటే పరమార్థమైన సమ్యక్జ్ఞానము పుట్టినవానికిని, కర్తృత్వము, భోక్తృత్వము, రాగము, ద్వేషము మొదలగు అజ్ఞానజనితములయిన వృత్తులు ఆవిర్భవించుచున్నవి. సమ్యక్జ్ఞానము బాధింపఁబడనిదైయుండఁగా దానికి విరుద్ధములైనవృత్తులకు పుట్టుకయుండదుగదా.

తా. సచ్చిదానందాద్వితీయంబైన ఆత్మస్వరూపమును గోచరింపఁజేయుచున్న సమ్యక్జ్ఞానము అన్నిటికంటె బలవంతమైనది. అయితే అవుగాక. దుర్బలప్రమాణములగు ప్రత్యక్షానుమానములచేఁ బుట్టింపఁబడిన భేదప్రపంచదర్శనతద్వాసనలచే బాధింపఁబడుచున్నది. ఇది మనకందఱకు ప్రత్యక్షముగాఁగదా యున్నది. వేదాంతవాక్యములను యథావిధిగా శ్రవణముఁజేసి ఆత్మవిషయమునునైన సమ్యక్జ్ఞానమును నిస్సంశయముగా లభించియున్నవారున్ను సంధ్యావందనాదికృత్యముల నాచరించుచు, అన్నాది పదార్థములభుజించుచు అనుకూలవిషయములయం దాసక్తిఁగలిగి ప్రతికూలవిషయములయందు ద్వేషముఁగలిగి వ్యవహరించుచున్నారు. ఈకర్తృత్వభోక్తృత్వరాగద్వేషాది ధర్మములు తదనుకూలవ్యవహారములు అజ్ఞానముచేత పుట్టింపఁబడినవేగదా? సమ్యక్జ్ఞానము అజ్ఞానమునే బాధింపఁబడినయెడల సమ్యక్జ్ఞానవిరుద్ధములైన కర్తృత్వాది వ్యవహారములు ఏలాగున ప్రవర్తించును గనుక తత్త్వజ్ఞానము కలవారే కర్తృత్వాది వ్యవహారములుకలవారై యున్నట్టు మనము చూచుచున్నందున అజ్ఞానముచేత తత్త్వజ్ఞానము బాధింపఁబడుచున్నది. కావున సమ్యక్జ్ఞానము భేదప్రపంచదర్శనతద్వాసనాద్యజ్ఞానముచేత బాధింపఁబడదని చెప్పుట అనుభవవిరుద్ధమని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుట కారంభించుచున్నారు.—

వాక్య. నైతదేవం. ౧౦౫

దం-అ. ఇది ఈలాగునకాదు.

తా. భేదప్రపంచదర్శనతద్వాసనాద్యజ్ఞానము సమ్యక్ జ్ఞానమును బాధించునని చెప్పినది యుక్తముకాదని భావము.

అవ. పూర్వపక్షవాది కారణమును ప్రశ్న చేయుచున్నాఁడు.—

వాక్య. కుతః. ౧౦౬

దం-అ. ఎందువలన.

తా. ఏ కారణమువలన సమ్యక్ జ్ఞానమును అజ్ఞానము బాధించునని చెప్పినది యుక్తముకాదు? అని భావము.

అవ. సిద్ధాంతవాది కారణమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. బాధితత్వా దవిద్యాయాః విద్యాం సా నైవ బాధతే,
తద్వాసనా నిమిత్తత్వం యాంతివిద్యాస్మృతే ర్ధ్రువమ్. ౩౮. ౧౦౭

దం-అ. అజ్ఞానము బాధింపఁబడియున్నందున - ఆఅజ్ఞానము సమ్యక్ జ్ఞానమును బాధింపనే బాధింపదు. ఆసమ్యక్ జ్ఞానముయొక్క సంస్కారములు సమ్యక్ జ్ఞానముయొక్క అవిచ్ఛిన్నానుసంధానమునకు కారణత్వమును పొందుచున్నవి. వాస్తవము.

తా. ఆత్మవిషయమైన సమ్యక్ జ్ఞానముచేత అజ్ఞానము బాధింపఁబడుచున్నది. గనుక తన్ను బాధించుచున్న సమ్యక్ జ్ఞానమును తాను బాధింపఁజాలదు. అజ్ఞానముచేత పుట్టింపఁబడిన భేదప్రపంచదర్శనరాగద్వేషాదివాసనలున్ను అజ్ఞానము నశించఁగానే తాముగూడా నశించుచున్నందున సమ్యక్ జ్ఞానమును బాధింపఁజాలవు. సమ్యక్ జ్ఞానము పుట్టుటకుముందు కలిగియున్న అజ్ఞానతద్వాసనలు సమ్యక్ జ్ఞానము పుట్టఁగానే నశించుచున్నందున సమ్యక్ జ్ఞానమును బాధించలేకపోయినప్పటికిని, సమ్యక్ జ్ఞానము తర్వాత పుట్టిన అజ్ఞానతద్వాసనలు సమ్యక్ జ్ఞానము బాధింపవా యని శంకింపఁదగదు. సమ్యక్ జ్ఞానము పుట్టినతరువాత సమ్యక్ జ్ఞానమునకు సంబంధించినశుద్ధవాసనలే పుట్టుచుండునుగాని తజ్జనితంబులైన రాగద్వేషాదిమలినవాసనలుగాని జన్మించవు. నివర్తకమైన పదార్థము ప్రకాశించుచుండఁగా నివర్త్యములు తిరిగి పుట్టనేరవు. సూర్యబింబము ప్రకాశించుచుండఁగా తిమిరపటలము తిరిగి పుట్టనేరదుగదా? సమ్యక్ జ్ఞానము పుట్టిన తరువాత పుట్టినశుద్ధవాసన సమ్యక్ జ్ఞానము అవిచ్ఛిన్నముగాఁ బ్రవర్తించుటకు కారణమైయుండును. కనుక సమ్యక్ జ్ఞానోత్పత్త్యనంతరము అజ్ఞానతద్వాసనలు జన్మించి సమ్యక్ జ్ఞానమును బాధించుననుశంక ఉన్మత్తప్రలాపము. తత్త్వజ్ఞానముకలవారికిని రాగద్వేషాదివాసనలు లోకములో కనుపడుచున్నవి. అని చెప్పినదిన్ని అవిచారవిలసితము. తత్త్వజ్ఞానమే పుట్టియుండినయెడల రాగద్వేషాదివాసన లుండనేయుండవు.

రాగద్వేషాదివాసనలుండవేని తత్త్వజ్ఞానము కలిగియుండదని భావము. ఇందువిషయమైనాలవయధ్యాయములో విశేషముగా వివరింపఁబోవుచున్నారము. ఇచ్చట చెప్పఁబడిన శుద్ధవాసనామలినవాసనాలక్షణములు తత్త్వజ్ఞానరాగద్వేషాదివాసన లొకచోట కనుపడువిషయమై చెప్పవలసినవిశేషములు, మేముప్రచురించిన జీవన్ముక్తిప్రకాశికలో విస్తారముగా ప్రతిపాదించియున్నందున నిచ్చట నుపరమించుచున్నారము.

అవ. గతించిన గ్రంథముయొక్కతాత్పర్యమును అనువదించుచు ముందు చెప్పఁబోవుగ్రంథతాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. "కర్మా జ్ఞాన సముత్థత్వా ది"త్యుక్తో హేతు స్తస్యచ సమర్థనం పూర్వమేవాభిహితం-"హితం సంప్రేప్సతా మి"త్యాదినా-తదభ్యుచ్చయార్థ మవిద్యాన్వయేనచ సంసారాన్వయిత్వం ప్రదర్శయిష్యా మిత్యత ఆహ. ౧౦౮

దం-అ. కర్మ అజ్ఞానమువలన పుట్టింపఁబడినందువలన అని హేతువు చెప్పఁబడినది. దానియొక్కసమర్థనము (నిర్వాహము) అనుకూలవిషయమును కోరుచున్నవారికి, అనెడిగ్రంథముచేత పూర్వమే చేయఁబడినది. దానియొక్క అభివృద్ధికొఱకు అజ్ఞానములో సంబంధించినందుచేత సంసారముతోడ సంబంధము చూపించెదనని అందుకుగాను చెప్పుచున్నారు.

తా. కర్మలు అజ్ఞానమువల్ల పుట్టింపఁబడినందున అజ్ఞానమును నివర్తింపఁజేయఁజాలవని ౩౫ వ శ్లోకములో ప్రతిపాదించినకర్మలయొక్క అజ్ఞానజన్యత్వమనెడి హేతువును అనుకూలవిషయమును కోరుచు ప్రతికూలవిషయమును విడువ నిచ్ఛయించువారికి తగినసాధనములను వేదము ప్రకాశింపఁజేయుచున్నదని ౭౯ వ శ్లోకములో ముందుగా సమర్థించిరి. ఆలాగున సమర్థించిన యర్థమును విశేషముగా బలపఱచుటకొఱకు అజ్ఞానముతో సంబంధించినందుచేతనే సంసారముతో సంబంధము కలిగినదని కనుపఱచుటకొఱకు ముందఱిశ్లోకము చెప్పఁబడుచున్నదని భావము. అనఁగా కర్మ అజ్ఞానమువల్ల పుట్టినందున అజ్ఞానమును నివర్తింపఁజాలదని ఇదివఱకు చెప్పినారము. ఇప్పుడు అజ్ఞానముచేత నేర్పడిన అభ్యాసముచేతనే కర్మలు ప్రవర్తించుచున్నందున అజ్ఞానమును నివర్తింపఁజేయఁజాలవని మఱియొకయుక్తిని చూపుటకై శ్లోకము రచింపఁబడుచున్నదని భావము.

శ్లో. బ్రాహ్మణ్యాద్యాత్మకే దేహే లాత్వా నాత్మేతి భావనామ్,
శ్రుతేః కింకరతామేతి వాఙ్మనః కాయకర్మసు. ౩౯. ౧౦౯

దం-అ. పురుషుఁడు బ్రాహ్మణత్వాదిధర్మములతోఁ గూడియున్న దేహమందు ఆత్మయనుబుద్ధిని గ్రహించి వాక్కుచేత, మనస్సుచేత, శరీరముచేతను చేయఁబడెడు కర్మలయందు వేదమునకు దాసత్వమును పొందుచున్నాఁడు.

తా. బ్రాహ్మణత్వాదిజాతులు, గృహస్థత్వాద్యాశ్రమములు, ధనికత్వపాండిత్యాది ధర్మములు, ఇవన్నియుం దేహమునకు సంబంధించినవిగాని ఆత్మకు సంబంధించినవిగావు. ఇటువంటి వివేకములేనిపురుషుఁడు బ్రాహ్మణత్వాదివిశేషణములుగల దేహమే తానని అజ్ఞానముచేత భావించుచుండును. ఇట్టి యజ్ఞానముకలవాఁడై యున్నందుననే వాగింద్రియముచేఁ జేయఁదగిన జపస్వాధ్యాయాదికర్మలయందును, మనస్సుచేఁ జేయఁదగినదియైన దేవతాధ్యానాదికర్మలయందును, శరీరముచేఁ జేయఁదగిన యాగదాన తీర్థస్నానాదికర్మలయందును వేదమునకు దాసుఁడై వేదము చెప్పినప్రకారమే భయభక్తులతో సంచరించుచుండును. కావున కర్మలు అజ్ఞానమును ఎప్పటికిని విడిచియుండ నందున అజ్ఞానమును నివర్తింపఁజేయలేవని భావము.

అవ. ఈప్రకారము అజ్ఞానముండిననేగాని కర్మలు ఉండవని చెప్పి, అజ్ఞానము లేనిచో, కర్మ లుండవనిచెప్పుటకు ముందరిశ్లోకము ప్రవర్తించుచున్నదని చెప్పుచున్నారు.—

వాక్య. యస్మాత్కార్మాజ్ఞాన సముత్థమేవ తస్మాత్తద్వావృత్తౌ నివర్తత ఇతి ఉచ్యతే. ౧౧౦

దం-అ. ఏహేతువువలన కర్మ అజ్ఞానమువల్లనే జన్మించినదో ఆహేతువువల్ల ఆ అజ్ఞానము నివర్తించెనా కర్మ నివర్తించునని చెప్పఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. దగ్ధాఖిలాధికారశ్చేత్ బ్రహ్మజ్ఞానాగ్నినామునిః,
వర్తమానః శ్రుతేర్మూర్ధ్ని నైవ స్యాద్వేదకింకరః. ౪౦. ౧౧౧

దం-అ. బ్రహ్మవిచారముఁ జేయువాఁడు బ్రహ్మజ్ఞానమను వహ్నిచే దహింపఁ జేయఁబడిన సర్వకర్మాధికారములు కలవాఁడయ్యెనేని వేదముయొక్క శిరస్సునందున్న వాఁడై వేదమునకు దాసుఁడు (పరతంత్రుఁడు) కానేకాఁడు.

తా. వైరాగ్యశమదమాది గుణములుకలవాఁడై సద్గురుసన్నిధియందు వేదాంత మహావాక్యములను చక్కఁగా విని ఆయర్థమును మననముచేసినపురుషునకు బ్రహ్మస్వరూప

విషయమగు సమ్యక్ జ్ఞానము కలుగును. (అనఁగా వేదాంతమహావాక్యములు పరమాత్మ స్వరూపము, అసంగమని, నిత్యమని, నిర్వికారమని, నిరంజనమని, నిర్గుణమని స్వయం ప్రకాశమని, కర్తృత్వాది ధర్మశూన్యమని, బ్రాహ్మణత్వాదిజాతులుగాని, బ్రహ్మచర్యా ద్యాశ్రమములుగాని, లేనిదని అఖండసచ్చిదానందరూపంబని చెప్పి ఇట్టిపరమాత్మయే అనాద్యజ్ఞానసంబంధముచేత తనస్వరూపమును తానెఱుఁగక అజ్ఞానకల్పితములైన అంతఃకరణాదులయొక్క కర్తృత్వబ్రాహ్మణత్వాదిధర్మములను తనయం దారోపించుకొని 'నేను కర్తను నేను బ్రాహ్మణుఁడను' అని యీలాగువ్యవహరించుచు జీవాత్మ నని తలంచుచున్నాఁడుగాని వాస్తవముగా జీవాత్మయనఁగా పరమాత్మయేగాని అంతకంటే లేశమైన భేదముకలవాఁడు గాఁడని బోధించుచున్నవి. ఇట్టి వేదాంతవాక్యములను చక్కగా గురుముఖతః విని, ఆయర్థమును నిరంతరమును భావనఁజేసినచో 'నేను పరమాత్మను కర్తనుగాను. బ్రాహ్మణుఁడనుగాను. బ్రహ్మచర్యాశ్రమములకు గలవాఁడనుగాను. అఖండసచ్చిదానందస్వరూపుఁడను అనెడిజ్ఞానము అత్యంతవిశదమై జన్మించునని అర్థము.) ఇట్టిజ్ఞానము అగ్ని, ఎండిపోయినగడ్డిపోచలను దహించినట్లు అజ్ఞానకాలమందు అజ్ఞానముచేత నేను బ్రాహ్మణుఁడను సంధ్యావందనాదికర్మలను చేయవలయునని తలంపఁబడుచున్నకర్మాధికారమును రూపత్తు నిశ్శేషముగ దహించును. అందుచే తత్త్వజ్ఞాని వేదముల శిరస్సునందుండి వేదాంతములచే ప్రతిపాదింపఁబడుచున్న పరబ్రహ్మస్వరూపుఁడైయుండును. కావున వేదములలోఁ జెప్పిన విధినిషేధములకు బద్ధుఁడు కానేరఁడు. బ్రాహ్మణత్వాద్యభిమానముకలవాఁడే వేదములలోఁజెప్పిన విధినిషేధములకు బద్ధుఁడుగాని, అభిమానములేనివాఁడు బద్ధుఁడు కాఁడు తత్త్వజ్ఞాని జ్ఞానముచే నశించిన అభిమానముకలవాఁడు గనుక విధినిషేధములకు బద్ధుఁడు కాఁడని భావము.

అవ. ఏపురుషుఁడు అజ్ఞానముతోడ సంబంధించి కర్తృత్వాదిసంసారధర్మములు కలవాఁడై వేదములకు పరతంత్రుఁడై యుండునో ఆపురుషుఁడు సంసారములో సంచరించుప్రకారమును, వైరాగ్యమును పుట్టించుకొఱకు వర్ణించుచున్నారు.—

వాక్య. అథేతరో ఘనతరా విద్యాపటల సంవీతాంతఃకర
ణోంగీకృతకర్తృత్వాద్యశేషకర్మాధికారకారణః విధి
నిషేధచోదనా సందంశోపదష్టః కర్మసు ప్రవర్త
మానః. ౧౧౨

దం-అ. ఇఁకను తత్త్వజ్ఞానములేనిపురుషుఁడు మిక్కిలి దృఢమైన అజ్ఞానసముదాయముచేత (పరంపరచేత) చుట్టుకోఁబడిన మనస్సుకలవాఁడై అంగీకరింపఁబడిన కర

త్వము మొదలగు సకలమైన కర్మాధికారహేతువులుకలవాఁడై విధినిషేధములను ప్రతిపాదించుచున్నవేద మను పటుకారుచేత పట్టుకొనఁబడి ప్రవర్తించును. ౧౦౫ వ శ్లోకముతో నేకవాక్యముగా నీవాక్యము నన్వయింపవలయును.

శ్లో. శుభై రాప్నోతి దేవత్వం నిషిద్ధై ర్నారకీం గతిమ్,
ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతేఽవశః. ౭౧.

దం-అ. పుణ్యకర్మలచేత దేవత్వమును బొందును. పాపకర్మలచేత నరకసంబంధమైనగతిని పొందును. పుణ్యపాపములరెంటిచేత మనుష్యజన్మమును పరవశుఁడై పొందును.

తా. సమ్యక్జ్ఞానముకలపురుషుఁడు సర్వకర్మలను సవాసనగా విడచి అఖండసచ్చిదానందస్వరూపుఁడై యుండును. సమ్యక్జ్ఞానములేనివాఁడు అతిదృఢమైన అజ్ఞానము మనస్సున పెరఁచుకొని వ్యాపించియున్నందున కర్తృత్వభోక్తృత్వ బ్రాహ్మణత్వాది ధర్మములు తనకుకలవని, అందుచేతనే యాగదానాదికర్మలను తాను అవశ్యముగాఁ జేయవలసియున్నదని తలఁచి పటుకారుతో పట్టుకొనఁబడినవస్తువు ఎటుపోవుటకు వీలులేక పరతంత్రమై యున్నట్లు విధివాక్యములకు నిషేధవాక్యములకు బద్ధుఁడై ఆవాక్యములు చెప్పినకర్మలను జేయుచు వలదనినకర్మలను విడుచుచు సంచరించుచున్నవాఁడై ఒకప్పుడు పుణ్యకర్మములను ఉత్కటముగాఁ జేసి దేవజాతిలో జన్మించుచు మఱియొకప్పుడు పాపకర్మలను ఉత్కటముగాఁ జేసి వానివలన మహారౌరవాదినరకముల ననుభవించుచు, మఱియొకప్పుడు పుణ్యపాపకర్మములను సమానముగాఁ జేసి మనుష్యలోకములో జన్మించుచు ఆధ్యాత్మికాది తాపత్రయము ననుభవించుచుండునని భావము. "పుణ్యేన పుణ్యం లోకం జయతి, పాపేన పాపం, ఉభాభ్యా మేవ మనుష్యలోకం" అను శ్రుతియొక్క అర్థమే శ్లోకములోఁ జెప్పఁబడినది. పుణ్యకర్మచేత పుణ్యలోకమును జెందును. పాపకర్మచేత పాపలోకమును జెందును. రెండుకర్మలచేత మనుష్యలోకమని శ్రుత్యర్థము.

అవ. ఉత్తరశ్లోకములోఁ జెప్పఁబడెడి "ఏవం" శబ్దము ఏఅర్థమును బోధించునో ఆయర్థమును వివరించుచు సంసారసంచారప్రకారమును విశదపఱచుచున్నారు.-

వాక్య. ఆబ్రహ్మాస్తంబపర్యన్తే ఘోరే దుఃఖౌదధౌ ఘటీ
యంత్రవ దారోహావరోహ న్యాయేన అధమ మధ్య
మోత్తమ సుఖదుఃఖమోహావిద్యుచ్చపల సంపాతదా
యినీః విచిత్రయోనీః చండోత్పింజలకశ్వసనవేగాభి

హతాంభోధి మధ్యవర్తి శుష్కాలాజవత్ శుభా
శుభవ్యా మిశ్రకర్మవాయుసమీరితః. ౧౧౪

దం-అ. చతుర్ముఖుఁడు మొదలు పిపీలికపఱకు ఏర్పడియున్న భయంకరమైన సంసారదుఃఖమను మహాసముద్రమునందు ఏతపుకుండవలె ఊర్ధ్వగమనాధోగమన న్యాయముచేత హీనములై మధ్యమములై శ్రేష్ఠములైన సుఖదుఃఖ మోహములయొక్క మెఱుపుతీఁగలవలె అనిత్యములైన సంపర్కములను ఇచ్చుచున్న నానావిధములగు జన్మములను సంక్రమించుచున్నవాఁడై (పొందుచున్నవాఁడై) ప్రచండమై సంకులమైన మహావాయువుయొక్క మధ్యభాగమునందున్న యెండుసారకాయవలె పుణ్యపాపమిశ్రములను వాయువుచేత ప్రేరణచేయఁబడుచున్నవాఁడై.

శ్లో. ఏవం చంక్రమ్యమాణోయ మవిద్యా కామకర్మభిః,
పాశితో జాయతే కామీ మ్రియతేచా సుఖావృతః. ౪౨.౧౧౫

దం-అ. ఈప్రకారము ఈతత్త్వజ్ఞానహీనుఁడైన పురుషుఁడు అజ్ఞానము, కామము, కర్మలు వీనిచేత కట్టఁబడి కోరికలు కలవాఁడై పుట్టుచుండును. అనేకదుఃఖములచేత నావరింపఁబడి మృతినొందుచుండును. అని ౧౧౪ వ వాక్యమును నీశ్లోకమును నొకటిగా నన్వయించవలయును.

తా. ఈసంసారము సముద్రమువలె అపరిచ్ఛిన్నమై, దుఃఖప్రచురమై, భయంకరమై, బ్రహ్మ మొదలు పిపీలికపఱకు అనేకజంతువులచే సంకీర్ణమైయున్నది. ఇట్టి సంసారమునందు ఏతపుబాన ఒకప్పుడు పైకిఁబోవుచు మఱియొకప్పుడు క్రిందికిదిగుచు సంచరించుచున్నట్టి తత్త్వజ్ఞానములేని పురుషుఁడు ఒకప్పుడు మనుష్యజన్మము మొదలుకొని చతుర్ముఖునివరకునుగల హెచ్చుజన్మములను పొందుచుండును. మఱియొకప్పుడు మనుష్యుఁడు మొదలుకొని పిపీలిక (చీమ) వఱకు గలహీనజన్మముల నొందుచుండును. ఈజన్మములయం దన్నింటియందును సుఖము దుఃఖము మోహము ఇవి నియతముగా సంభవించును. ఇవి సంభవించినను మెఱపులవలె క్షణభంగురములై యుండునుగాని నిత్యములుగావు. ఇదిగాక హీనమధ్యమోత్తమములుగా నుండును. అనఁగా దేవతలయందుండు సుఖము ఉత్తమము. మనుష్యులయందుండునది మధ్యమము. పశుపక్ష్యాదులయందుండు సుఖము హీనము. పశుపక్ష్యాదులయందుండు దుఃఖము ఉత్తమము. మనుష్యులయందుండునది మధ్యమము. దేవతలయందుండు దుఃఖము హీనము. ఈప్రకారముగనే దుఃఖమోహమునుకూడా తెలియవలయునని యర్థము. ఇట్టి జన్మపరంపర ననుభవించుచు మహావాయువుచేత క్షోభింపఁబడుచున్న సముద్రములోనున్న ఎండుసార

కాయ ఒకచోటనైనను నిమిషకాలము నిలువకుండా తిరుగుచున్నట్టు ఈఅ
షుండు పుణ్యపాపమిశ్రములను త్రివిధకర్మలః మహావాయువువలె తన్ను నెట్టుచు
అజ్ఞానము, దానిచే నేర్పడిన తత్తత్ఫలాభిలాషము, దానిచేతఁ జేయఁబడిన
పాదికర్మలు, ఇవి పాశములవలె దృఢముగా బంధించి యీడ్చుచుండఁగా నొక
డైనను కొంచముకాలము నిలువక అనేకకోరికలుగలిగి అనేకదుఃఖముల న
చుచు మాటిమాటికి పుట్టుచు చచ్చుచు ప్రవర్తించుచుండునని భావము.

అవ. సంసారమునకు ముఖ్యకారణము కామమని చెప్పిన అర్థమునంద
స్మృతివచనములు ప్రమాణములని చెప్పుచున్నారు.—

వాక్య. యథోక్తార్థే ఆదరవిధానాయ ప్రమాణోపన్యాసః.

తా. స్పష్టము.

శ్లో. శ్రుతిశ్చేమం జగాదార్థం కామస్య వినివర్తయే,
తన్మూలా సంసృతి ర్యస్మా త్తన్నాశోఽజ్ఞానహానతః. ౪౩.

దం-అ. ఎందువల్ల సంసారము ఆకామమే కారణముగాఁగలదై యు
అందువలన శ్రుతివచనమున్ను కామముయొక్క వినాశముకొఱకు ఈయర్థమును
చున్నది. ఆకామముయొక్క వినాశము అజ్ఞానముయొక్క వినాశమువల్ల
చున్నది.

తా. కర్తృత్వభోక్తృత్వాదిసంసారము కామమువల్లనే ప్రవర్తించుచు
కావున కామముయొక్క వినాశమును అవశ్యముగా సంపాదింపవలయునని శ్రు
నము. కంఠోరవముగాఁ జెప్పుచున్నదిగాని, మేము మాబుద్ధిచేత నూహించి కా
సంసారమునకుఁ గారణమని ఆకామమును నశింపఁజేయవలయునని చెప్పిన
కాము. కామవినాశము దేనివలన కలుగుననిన అజ్ఞానముయొక్క నాశమువల్ల
నని భావము.

అవ. ఏశ్రుతివచనము చెప్పుచున్నదని పూర్వపక్షవాది ప్రశ్నను చే
న్నాఁడు.—

వాక్య. కా త్వసౌ శ్రుతి రితిచేత్.

దం-అ. ఈశ్రుతివచనము యేది అంటే.

తా. స్పష్టము.

అవ. ఇందుకు సిద్ధాంతి శ్రుతివచనము నుదహరించుచు ప్రతిచెప్పుచున్నా

శ్లో. 'యదా సర్వే ప్రముచ్యంతే' ఇతి 'స్వ'తిచ వాజినః,

కామబంధన మేవేదం వ్యాసోప్యాహ పదేపదే. ౮౮. ౧౧౯

దం-అ. "యదా సర్వే ప్రముచ్యంతే" అనిన్ని, "ఇతి నుకామాయమానః" అనిన్ని శుక్లయజుర్వేదులు చెప్పుచున్నారు. కామబంధన మే వేదం అని వ్యాసమహాముని మాటిమాటికి చెప్పెను.

తా. శుక్లయజుర్వేదము వాజశాఖ యనంబడును. అట్టి వాజిశాఖీయులు, బృహదారణ్యకోపనిషత్తులో, "యదా సర్వే ప్రముచ్యంతే కామాయే స్యహృదిశ్రితాః, అథ మర్త్యో మృతోభవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే" అని ఒకచోటను, "ఇతి నుకామయమానః అథాకామయమానః" అని మఱియొకచోటనున్న కామమే సంసారమునకు కారణమని, ఆకామము నశించిపోయిన మోక్షము తత్కాలముననే కలుగునని చెప్పుచున్నారు. వ్యాసమహాముని మహాభారతములో ననేకస్థలములయందు "కామబంధనమే వేదం నాన్యదస్తీహబంధనం, కామబంధనముక్తోహి నేహ భూయోభిజాయతే" అని కామబంధనమే సంసారకారణమని ఆకామముయొక్క నివృత్తియే మోక్షమనిన్ని చెప్పియున్నారు గనుక మేము చెప్పినయర్థము అనేకశ్రుతిస్మృతిసమ్మతమై యున్నందున ముఖ్యముగా నందఱిచే నాదరింపఁదగినదని భావము. "ఈపురుషునియొక్క హృదయమునం దాశ్రయించియున్న కామములు యేవికలవో అవియన్నియు నెప్పుడు విడిచిపోవునో అపుడు మనుష్యుఁడు ముక్తుఁడవును. ఈదేహమునందే బ్రహ్మను బొందును. అనఁగా జీవన్ముక్తి ననుభవించునని యర్థము. ఈప్రకారము కామములు కలవాఁడు సంచరించును. ఇఁకను కామములులేనివాఁడు ఏలాగున నుండుననఁగా చెప్పెదను. ఈసంసారము కామముచే నేర్పడినముడి. ఈసంసారమునందు కామముకంటే మరియొకబంధనమేలేదు. కామమనెడి ముడి వీడిపోయిన మనుష్యుఁడు ఈసంసారమునందు తిరిగి పుట్టఁడు. అని శ్రుతిస్మృతివచనముల కర్థము.

అవ. వెనుకటిగ్రంథములో కామమే సంసారమునకు కారణమనిన్ని సమ్యక్జ్ఞానముచే సంసారము నశించఁగా కామము నశించుననిన్ని ఈయర్థము శ్రుతిస్మృతిసమ్మతమనిన్ని అట్టిశ్రుతిస్మృతు లివియనిన్ని ప్రతిపాదింపఁబడినది. అందులో కర్మలు మోక్షమునకు యేమాత్రమైనను ఉపయోగింపవా యని పూర్వపక్షవాది ప్రశ్నచేయుననియూహించి కర్మలు మోక్షమున కుపయోగించేప్రకారమును చెప్పుచున్నారు.—

వాక్య. ఏష సంసారపంథా వ్యాఖ్యాతః అథేదానీం తదావృత్తయే కర్మాణ్యారాదుపకారకత్వేన యథా మోక్షహేతుతాం ప్రతిపద్యంతే తథాభిధీయతే. ౧౨౦

దం-అ. ఈసంసారమార్గము వివరింపఁబడినది. ఇఁక నిప్పుడు ఆసంసారము యొక్క నివృత్తికొఱకు కర్మలు పరంపరగా నుపకారముచేయుటచేత యేప్రకారము మోక్షమునకు సాధనత్వమును పొందునో ఆప్రకారము చెప్పఁబడును.

తా. పురుషుఁడు అజ్ఞానముచేత నావరింపఁబడి సంసారములో సంచరించే ప్రకారమును విస్తారముగా నింతవఱకు ప్రతిపాదించినారము. శ్రుతిస్మృతి విహితములైనకర్మలు సంసారముయొక్క నివృత్తికి యేమిన్ని సహాయముచేయవా? బొత్తిగా వ్యర్థములేనా? యని కొందఱు శంకించెదరు. అందుకు సమాధానము నికమీఁద చెప్పుచున్నారము. అందులో కర్మలు ముఖ్యముగా అవ్యవహితముగా మోక్షమునకు సాధనము కాకపోయినప్పటికి, పరంపరగా నుపకారముచేయుచు మోక్షమునకు సాధనములు కాఁగలవు. ఏలాగుననంటే ఆప్రకారమును వివరించెదమని భావము.

శ్లో. తస్యైవం దుఃఖతప్తస్య కథం చి త్పుణ్యశీలనాత్,
నిత్యేహోత్థాలితధియో వైరాగ్యం జాయతే హృది. ౪౫. ౧.౨౧

దం-అ. ఈప్రకారము దుఃఖములచేత పరితాపమునొందువాఁడును, బహుప్రయాసముచేత పుణ్యకర్మల ననుష్ఠించుటవలన సంభవించిన నిత్యకర్మానుష్ఠానముచేత పరిశుద్ధముగాఁజేయఁబడిన బుద్ధికలవాఁడునైన ఆపురుషునకు మనస్సునందు వైరాగ్యము పుట్టును.

తా. మహాభయంకరమైన సంసారసముద్రములోబడి నీచోచ్చజన్మల ననేకములనొందుచు బహువిధదుఃఖముల ననుభవించుచున్న యీపురుషునకు ఒకానొకప్పుడు పుత్త్రపశ్వన్నస్వర్గాదిఫలముల నపేక్షించినందున శ్రుతిస్మృతివిహితములైన యాగదానాదిపుణ్యకర్మల చేయవలయునని బుద్ధి యుదయించును. ఇట్టి కామ్యపుణ్యములను చేయవలయుననే బుద్ధియున్ను తరుచుగా కలుగదు. ఈప్రకారము సంసారసముద్రములోఁబడి యీఁదుచుండుకాలములో బహుకాలమునకు పరమేశ్వరానుగ్రహముచేత కామ్యపుణ్యములను చేయవలయుననేబుద్ధి ఉదయించి తరువాత నాకామ్యపుణ్యములను చేయుచుండఁగా కొంతకాలమునకు చిత్తము కొంచెము పరిశుద్ధమగును. అందుచేత నిత్యనైమిత్తికకర్మలను చేయవలయునని బుద్ధిజనించి నిత్యనైమిత్తిక పుణ్యముల ననుష్ఠించును. వానిని కొంతకాలము ననుష్ఠించఁగా బుద్ధి నిండా పారిశుద్ధ్యమునొందును. అందుచేత వైరాగ్యము జన్మించును అని భావము.

వాక్య. కీదృగ్వైరాగ్య ముత్పద్యతే ఇతి ఉచ్యతే. ౧.౨౨

దం-అ. ఎటువంటివైరాగ్యము కలుగునని యంటేశా చెప్పఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. నరకా ద్భీ ర్యథా స్యాద్భూ త్తథా కామ్యఫలాదపి,
యథార్థదర్శనా త్తస్మా న్నిత్యం కర్మ చికీర్షతి. ౪౬. ౧౨౩

దం-అ. ఈపురుషునకు నరకమువలన ఏలాగున భయము కలిగెనో ఆలాగున కామ్యఫలమైన స్వర్గమువలనకూడా భయముకలుగును. ఆవాస్తవార్థమును జూచుట చేత నిత్యమైనకర్మ నేచేయ నిచ్ఛయించును.

తా. నిషిద్ధమైన సురాపానాదికర్మచేత మహానరకము సంభవించును. అట్టి నరకముపచ్చునంటే ఏలాగున భయమునొందునో విహితములైన యాగదానాదికర్మలచేత సంప్రాప్తములయ్యేడి స్వర్గాదులకుఁగూడా ఆలాగున భయమునొందును. అనఁగా నరకమునువలె స్వర్గమునుకూడా కోరనటువంటి వైరాగ్యము కలుగునని భావము. నరకము దుఃఖరూపమైనందున భయమును కలుగఁజేయును సరే. స్వర్గము సుఖరూపముగదా. ఇది ఎందువలన భయమును కలుగఁజేయునంటే, స్వర్గముయొక్క వాస్తవరూపము నాలోచించి చూచినందున భయమును కలుగఁజేయునని చెప్పెదము, అనఁగా కామ్యకర్మలయొక్క ఫలమైన స్వర్గము సుఖరూపమైనప్పటికిని నిత్యముకాదు. తనకంటె హెచ్చైనస్వర్గసుఖము మఱియొకటి కనుపడుచున్నందున అసూయను కలుగఁజేయును. ఎప్పుడో నశించునని తెలిసియున్నందున జాడ్యగ్రస్తుఁడైన పుత్త్రునివలె ప్రతిక్షణము నందును దుఃఖమును కలుగఁజేయుచుండును. ఇది స్వర్గముయొక్క వాస్తవస్వరూపము. దీనిని తెలిసినందున స్వర్గసాధనములైన కామ్యకర్మలను నిశ్శేషముగా పరిత్యజించి నిత్యకర్మలనే ముఖ్యముగా ననుష్ఠించునని భావము.

అవ. కామ్యకర్మలనువిడిచి నిత్యకర్మలనే అనుష్ఠించునుగాక! ఈకర్మ లేలాగున మోక్షమున కుపకరించునని పూర్వపక్షివాది ప్రశ్నను చేయుచున్నారు.—

వాక్య. ఏవం నిత్యనైమిత్తికకర్మానుష్ఠానేన. ౧౨౪

దం-అ. ఈప్రకారము నిత్యనైమిత్తికకర్మల నాచరించుటచేత నేమికలుగును?

తా. స్పష్టము.

అవ. నిత్యనైమిత్తికకర్మానుష్ఠానము మోక్షమున కుపకరించేప్రకారమును వివరించుచు సిద్ధాంతవాది ప్రతివచనమును చెప్పుచున్నారు.—

శ్లో. శుధ్యమానంతు తచ్చిత్త మీశ్వరార్పిత కర్మభిః,
వైరాగ్యం బ్రహ్మలోకాదౌ వ్యనక్త్యథ సునిర్మలమ్. ౪౭. ౧౨౫

దం-అ. పరమేశ్వరునియందు సమర్పింపఁబడినకర్మలచేత నాపురుషునియొక్క చిత్తము పరిశుద్ధిని పొందింపఁబడినదై అనంతరము బ్రహ్మలోకము మొదలగు సుఖమందును మిగుల నిర్మలమైన వైరాగ్యమును ప్రకటించును.

తా. నిత్యనైమిత్తికకర్మల నాచరించి వాటియొక్కఫలమును పరమేశ్వరునికొఱకు సమర్పించునట్టి పురుషునియొక్క చిత్తమును ఆకర్మలు నిండా నిర్మలముగాఁజేయును. ఆలాగున నిర్మలమైనయాచిత్తము ఇహలోకసుఖములయందువలె బ్రహ్మలోకాదిసుఖములయందును వైరాగ్యముకలదై యుండును. కావున నిత్యకర్మలు వైరాగ్యోత్పత్తిద్వారా మోక్షమున కుపకరించునని భావము.

అవ. ఓయీ! వైరాగ్యము మోక్షమునకు సాధనమనిగాని సహాయమనిగాని యెచ్చటనైనా చెప్పియుండలేదుగదా? కావున వైరాగ్యమును పుట్టించినమాత్రమున కర్మలు మోక్షమున కుపరించునని యేలాగున చెప్పవచ్చునని పూర్వపక్షవాది శంకించునని సిద్ధాంతవాది తలంచి విషయాసక్తియనే రాగము, మోక్షసాధనములయందు పురుషుఁడు ప్రవర్తింపకయుండులాగున ప్రతిబంధించును కాఁబట్టి మోక్షసాధనములయందు ప్రవర్తించువానికి రాగనివృత్తి అవశ్యాపేక్షితమై యున్నది. రాగనివృత్తియే వైరాగ్యమనంబడు గావున వైరాగ్యమును బుట్టించునట్టికర్మలు మోక్షమునకు ఉపకారములని చెప్పఁదగియున్నవి అని సయుక్తికముగా చెప్పుచున్నారు.—

వాక్య. యస్మాత్ రజస్తమోమలోప సంసృష్టమేవ చిత్తం
కామబడిశేనాకృష్య విషయదురంతసూనాస్థానేషు
నిక్షిప్యతే తస్మాన్నిత్యనైమిత్తికకర్మానుష్ఠానపరిమార్జ
నేన అపవిద్ధ రజస్తమోమలం ప్రసన్నమనాకులం
సమ్మార్జిత స్ఫటికశిలాకల్పం బాహ్యవిషయహేతు
కేన చ రాగద్వేషాత్మకేన అతిగ్రాహబడిశేనాకృష్య
మాణం విధూతాశేషకల్మషం ప్రత్యక్ప్రాత్రప్రణవం
చిత్తదర్పణ మవతిష్ఠతే. ౧౨౬

దం-అ. రజోగుణతమోగుణములనే మాలిన్యముచేత సర్వదా సంయుక్తమై యున్నచిత్తము విషయాసక్తి యనెడిగాలముచేత నాకర్షింపఁబడి శబ్దాదివిషయములనెడి మారణప్రదేశములయందు యేకారణముచేత చేర్చఁబడునో ఆందువలన చిత్తమనెడి యద్దపుబిళ్ళ నిత్యనైమిత్తికకర్మల నాచరించుట యనే సమ్మార్జనము (ఊడుపు) చేత నిరసింపఁబడిన రజస్తమోగుణములనే మాలిన్యముగలదై శుద్ధమై నిశ్చలమై కడిగినస్ఫటికమణి

తో సమానమై బాహ్యవిషయములు (శబ్దాదివిషయములు) కారణముగాఁగల రాగద్వేషరూపమగు అతిగ్రహమనెడుగాలములచే నాకర్షింపఁబడనిదై విదిలింపఁబడిన సకలకాలుష్యంబులుగలదై ఆత్మస్వరూపమునందే ఆసక్తిఁగలదైయుండును.

తా. చిత్తమును రజోగుణము తమోగుణము ఆవరించియుండునేనివిషయములందాసక్తికలుగును. ఆయాసక్తియే కామమనంబడు. అట్టికామముగాలముచే వలనులాగినట్టు చిత్తమును బలాత్కారముగా నీడ్చి శబ్దాదివిషయములయందుఁ జేర్చును. శబ్దాదివిషయములు సూనాస్థానమువంటిది. సూనాస్థానమనఁగా పశువు పక్షిమృగాదులను హింసించే స్థలము. అట్టిసూనాస్థలమునందు చేర్చఁబడిన మత్స్యము లేప్రకారము నానావిధముగా హింసింపఁబడునో ఆప్రకారమే శబ్దాదివిషయములయందు కామముచేత చేర్చఁబడిన చిత్తమున్ను నానావిధదుఃఖముల నొందుచుండును గావున చిత్తమందుగలరజస్తమోమాలిన్యమున నివర్తింపఁజేయుట ఆవశ్యకమైయున్నది. అందుకుగాను నిత్యనైమిత్తికకర్మల ననుష్ఠించిన ఆయనుష్ఠానము ఇటుకపొడితోఁజేసిన నిఘర్షణము (వొరిపిడి), అద్దము యొక్కమాలిన్యమును నివర్తింపఁజేసినటుల చిత్తముయొక్క రజస్తమోమాలిన్యమును నివర్తింపఁజేయును. అందుచేత చిత్తము అద్దపుబిళ్లవలె స్వచ్ఛమై నిస్తరంగసముద్రమువలె నిశ్చలమై కడిగిపెట్టిన స్ఫటికశిలాశకలమువలె అత్యంతశీతలమై యుండును. అప్పుడు శబ్దాదివిషయములచే నేర్పడి వాటినిబట్టి ప్రవర్తింపుచున్న రాగద్వేషములందీగాలమువలె చిత్తము నాకర్షించఁజాలవు. ఈ రాగద్వేషములు శబ్దాదివిషయములకంటె నెక్కువగా చిత్తమును బంధించి బాధించుచున్నందున అతిగ్రహములనంబడు. చిత్తము సకలకల్మషములను పరిత్యజించియున్నందున ఈఅతిగ్రహములనే రాగద్వేషములు చిత్తమును బాధింపవు. అందుచేత చిత్తము చిదాత్మస్వరూపమునందే ఆసక్తమై చిదాత్మస్వరూపమును ప్రకాశింపఁజేయుచుండును.

వాక్య. అత ఇద మభిధీయ్యతే. ౧౨౭

దం-అ. ఆహేతువువలన ఇది చెప్పఁబడుచున్నది.

తా. స్పష్టము.

అవ. ఏమి చెప్పఁబడుచున్నదంటె చెప్పుచున్నారు.—

శ్లో. వ్యుత్థితా శేషకామేభ్యః యదా ధీ రవతిష్ఠతే,
తదైవ ప్రత్యగాత్మానం స్వయ మేవా వివక్షతి. ౪౮. ౧౨౮

దం-అ. ఎపుడు బుద్ధి సకలకామములవలన వ్యుత్థానమును(సంబంధాభావమును) పొందియుండునో అప్పుడే స్వయముగానే చిదాత్మస్వరూపమునుగూర్చి అభిముఖముగా ప్రవేశింప నిచ్ఛయించును.

తా. అద్దము మాలిన్యముతోఁగూడియున్నప్పుడు యెదురుగానున్న బింబమును గ్రహించలేకపోయినను మాలిన్యము నివర్తించఁగానే బింబమును ఏప్రకారము గ్రహించునో ఆప్రకారమే చిత్తము కామములచేత నావరింపఁబడియున్న సమయములలో చిదాత్మయొక్కస్వరూపమును గ్రహించలేకయుండినను నిత్యనైమిత్తికకర్మానుష్ఠానముచేత సర్వకామములను పరిత్యజించి కేవలమై ఎప్పుడుండునో అప్పుడు విశేషప్రయత్నములేకయే చిదాత్మయం దభిముఖమై చిదాత్మను గ్రహించి ప్రకాశింపఁజేయుచుండును గావున నిత్యనైమిత్తికకర్మలు కామనివృత్తియనెడి వైరాగ్యమును చిత్తమునందు కలుగఁజేయఁగా చిత్తము చిదాత్మయం దాసక్తమగును. అదియే సమ్యక్ జ్ఞానమనంబడు. అట్టి సమ్యక్ జ్ఞానముచేత సంసారకారణంబైన యజ్ఞానము నిశ్శేషముగా నశింపఁజేయఁబడును. అదియే మోక్షమనంబడు గావున కర్మలు వైరాగ్యోత్పత్తిద్వారా మోక్షమునకు ద్వారమని చెప్పితిమని భావము.

అవ. ఈప్రకారము కర్మానుష్ఠానముచేత నంతఃకరణము పరిశుద్ధమై వైరాగ్యము కలిగినతరువాత పురుషునకు సర్వకర్మసన్న్యాసమునందే అధికారముగాని కర్మల నాచరించుట కధికారము లేదనెడి యభిప్రాయముతోఁ జెప్పుచున్నారు.—

వాక్య. అతః పరమవసితాధికారాణి కర్మాణి ప్రత్యక్ప్రవణ
సూనోకృత సంప్రత్తికాని చరితార్థాని సంతి. ౧౬౯

దం-అ. తరువాత నిత్యనైమిత్తికకర్మలు సమాప్తినిచెందిన అధికారముగలిగి చిదాత్మయం దాసక్తియనెడి పుత్త్రునియందు చేయఁబడిన సంప్రత్తికలవై చేయవలసిన ఉపకారముచేసి యస్తమించును.

తా. చిత్తము చిదాత్మయం దాసక్తినిబొందినతరువాత కర్మలు తాము చేయవలసినకార్యములు యావత్తు సమాప్తినొందినందున చిదాత్మాసక్తియనెడి సమ్యక్ జ్ఞానమునందు శేషించిన అజ్ఞాననివృత్త్యాదికార్యములను పెట్టి తాము ఋణవిముక్తినొంది నశించిపోవును. లోకములో నొకానొకపురుషుఁడు యాగదానాదిసమస్తకర్మల నాచరించి కుమారుని పుట్టించి తరువాత తాను మృతినొందుకాలములో తాను చేయవలసినకర్మలు యావత్తు చేయఁబడియున్నందున శేషించిన కుటుంబభరణపితృఋణమోచనాదికృత్యముల నాచరించెడి అధికారమును కుమారునియందుచేర్చి తాను మృతిఁబొందినటుల నని భావము. పురుషుఁడు మృతినొందునప్పుడు తాను చేయఁగా మిగిలియున్నదన్ని తానుచేయుటకు వీలులేని లౌకికవైదికకర్మానుష్ఠానభారమును కుమారునియందు చేర్చుట "సంప్రత్తి" యనఁబడును.

అవ. భగవద్గీతలలో ఏవచనము ఈయర్థమునందు ప్రమాణమైయున్నదంటే ఆవచనము నుదాహరించుచున్నారు.—

శ్లో. "ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమ" ఏవేతి చ స్మృతిః. ౫౧. ౧౩౪

దం-అ. తత్త్వజ్ఞానము నెక్కుటకు (పొందుటకు) నిచ్ఛకలవానికి కర్మసాధన మని చెప్పఁబడును. తత్త్వజ్ఞానము నెక్కిన(పొందిన) వానికి సర్వకర్మసన్న్యాసమే సాధనమని స్మృతివచనము ప్రమాణమని శేషము.

తా. తత్త్వజ్ఞానమును పొంద నిచ్ఛయించినవానికి కర్మానుష్ఠానము సాధనమని న్ని, తత్త్వజ్ఞానమును పొందినవానికి కర్మసన్న్యాసమే సాధనమనిన్ని విశదముగా చెప్పు చున్న భగవద్గీతావచనము కర్మలు పరంపరగా మోక్షసాధనములని చెప్పుటయందు ప్రమాణమని భావము.

అవ. నిత్యనైమిత్తికకర్మానుష్ఠానము పరంపరగా మోక్షమున కుపయోగించు నని చెప్పిరి. ఆపరంపర యెట్టిదని విశదముగా కనుపరచుచున్నారు.—

వాక్య. నిత్య కర్మానుష్ఠానా ద్ధర్మోత్పత్తిః ధర్మోత్పత్తేః పాపహాని, తత శ్చిత్తశుద్ధిః, తత స్సంసారయాథాత్మ్యావబోధః, తతో వైరాగ్యం, తతో ముముక్షుత్వం, తత స్తదుపాయపర్యేషణం, తత స్సర్వకర్మ తత్సాధన సంన్యాసః, తతో యోగాభ్యాసః, తత శ్చిత్తస్య ప్రత్యక్ప్రవణతా తత స్తత్త్వమస్యాది వాక్యార్థపరిజ్ఞానం, తతో విద్యోచ్ఛేదః, తతః స్వాత్మన్యేవావస్థానమ్. ౧౩౫

దం-అ. నిత్యకర్మల ననుష్ఠించుటవలన ధర్మము జనించును. ధర్మము జనించినం దున పాపములయొక్క నాశము కలుగును. పాపహానివలన చిత్తము శుద్ధినొందును. చిత్తము శుద్ధినొందుటవలన సంసారముయొక్క వాస్తవస్థితి తెలియును. అందువలన వైరాగ్యము పుట్టును. అందుచే మోక్షేచ్ఛకలుగును. అందువలన మోక్షసాధనములను విచారించును. అందువలన సర్వకర్మలను దానిసాధనములను సన్న్యసించును. అందువ లన యోగము నభ్యసించును. అందువలన చిదాత్మయందు ఆసక్తికలుగును. అందువలన 'తత్త్వమసి' యను మహావాక్యములయొక్క అర్థము తెలియఁబడును. అందువలన అజ్ఞా నముయొక్క వినాశముకలుగును. అందువలన స్వస్వరూపమునందు స్థిరత్వము కలుగును.

తా. నిత్యనైమిత్తికకర్మలనాచరించి వాటిఫలమును పరమేశ్వరునకు సమర్పించుచుండఁగా కొంతకాలమునకు ఆపురుషునియొక్క మనస్సునందుపాపములను నశింపఁ జేయునట్టి అదృష్టము జన్మించును.ఆయదృష్టము జన్మించినందువలన చిత్తమునందు గల పాపములు నశించిపోవును. పాపములు నశించినతోడనే చిత్తము దర్పణమువలె నిర్మలమై నిత్యవస్తువును అనిత్యవస్తువును వివేకించి తెలిసికొనెడిసామర్థ్యముకలదైయుండును. అప్పు డాచిత్తమునకు సంసారముయొక్క వాస్తవస్థితి తెలియును. అనఁగా సంసారము అనిత్యమని,అశుచియని,దుఃఖమయమని, హేయమనిన్ని తెలియుననియర్థము.ఇదియేగదా సంసారముయొక్కవాస్తవస్థితి.ఇటులుండఁగా సంసారము నిత్యమని, శుచియని,సుఖరూపమని,ఉపాదేయమని తలంచుట చిత్తదోషమని తెలియవలయు. సంసారయాథార్థ్యము తెలిసినపిమ్మట సంసారమునందువిరక్తిజనించును.విరక్తిబుట్టినపిదపనిత్యమై,శుద్ధమై,పరమానందరూపంబైన మోక్షేచ్ఛగలుగును. పిదప యామోక్షమున కేదిసాధనమో దానిని విచారించును. మోక్షసాధనముల నెఱింగినపిదప వాటిని అనుష్ఠించుటకు కర్మలు,ఆకర్మల ననుష్ఠించుటకు సాధనములైన గృహస్థాశ్రమాదులున్ను, ప్రతిబంధకములుగాఁ దోఁచి, వాటినన్నిటిని యథాశాస్త్రముగా పరిత్యజించి పరమహంస సన్న్యాసాశ్రమమును గ్రహించును.తరువాత సద్గురుసన్నిధియందు వేదాంతవాక్యములయొక్క శ్రవణ మనన నిదిధ్యాసనములనే యోగము నభ్యసించును. వేదాంతవాక్యములయొక్క అర్థమును సంశయవిపర్యయములు లేకుండా సంప్రదాయమునననుసరించిగురుముఖతః వినుట శ్రవణ మనంబడు. వీనిని యర్థమును యుక్తులతోఁచేర్చి మనస్సులో నాలోచించి నిశ్చయించుకొనుట మననమనంబడు. నిశ్చయించుకొనినయర్థమును మనస్సులో చిరకాలము భావించుట నిదిధ్యాసమనంబడు. ఇట్టి యోగాభ్యాసమును కొంతకాలము చేయఁగా చిత్తము శబ్దాదివిషయములయందు ప్రవర్తించుట మాని శుద్ధచిద్రూపుఁడైన ప్రత్యగాత్మయందు ప్రవర్తించి తదేకాయత్తమైయుండు. అనంతరము వేదాంతములయందుగల'తత్త్వమసి' 'అహంబ్రహ్మాస్మి' మొదలయిన మహావాక్యములయందు చెప్పఁబడిన జీవబ్రహ్మైక్యజ్ఞానము ప్రత్యక్షముగా నావిర్భవించును. అందువలన సూర్యోదయముకాఁగానే అంధకారము నివర్తించినటుల అనాదికాలప్రవృత్తంబైన అజ్ఞానంబు;నిశ్శేషముగా నశించిపోవును. అనంతరము స్వరూపావస్థానము కలుగును. అనఁగా స్వచ్ఛంబైన స్ఫటికము జపాకుసుమసన్నిధానమువలన లోహితరూపము కలదానివలె భాసించుచున్నట్టు అఖండసచ్చిదానందాకారంబైన ఆత్మస్వరూపము అజ్ఞానముచేత అన్యరూపములను పొంది జరామరణాదిధర్మములు కలదానివలె గన్పట్టుచుండి ఆఅజ్ఞానము నశించగానే జపాకుసు

మసాన్నిధ్యంబు తొలంగినస్ఫటికంబు స్వచ్ఛంబైయున్నట్టు అఖండసచ్చిదానంద రంబై యుండు. ఇట్టి అఖండసచ్చిదానందాకారము ఆత్మకు సర్వకాలములయం రూపమై యున్నప్పటికి అజ్ఞానదశయందు తిరోహితమైయుండి జ్ఞానదశయం వించును. ఇదియే స్వరూపావస్థానము. ఇదియే మోక్షమనిభావము. ఇచ్చట శ్ర ననాదుల నాచరించినపిదప చిత్తమునకు చిదాత్మాసక్తి కలుగునని చెప్పఁబడి యు ౪౮, ౪౯ శ్లోకములలో నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానముచేత చిత్తమునకు చి సక్తికలుగునని, తరువాత సన్న్యసించునని చెప్పియున్నది. కావున పూర్వోత్త ధముగలదని కొందఱు శంకించెదరు. శ్రవణమననాదుల కనంతరమందు చిత్త కలుగునట్టి చిదాత్మాసక్తి యనఁగా చిత్తము అప్రయత్నముగా (స్వభావ చిదాత్మయందు చేరుట. నిత్యకర్మానుష్ఠానానంతరమందుకలిగెడి చిదాత్మాసక్తి య చిదాత్మ యెటువంటిదో తెలిసికొనవలయుననెడి ఇచ్ఛ గనుక పరస్పరవిరోధము తెలియవలయును.

అవ. స్వరూపావస్థానము కలుగునని చెప్పినందుకు ప్రమాణమును చూ చున్నారు.—

వాక్య. బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి విముక్తశ్చ విముచ్యతే ఇతి. ౧౩౬

దం-అ. "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి," "విముక్తశ్చ విముచ్యతే" శ్రుతులు ప్రమాణము.

తా. "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" అనెడిశ్రుతి మోక్షేచ్ఛగలపురుషుఁడు మున్ను బ్రహ్మస్వరూపుఁడైయుండియును వాక్యార్థజ్ఞానము కలిగినపిమ్మటకూడా స్వరూపములోనే చేరునని చెప్పినందున బ్రహ్మస్వరూపావస్థానమే మోక్షమని తె బడుచున్నది. "విముక్తశ్చ విముచ్యతే" అనెడిశ్రుతిన్ని పురుషుఁడు అవిద్యాదిదో చేత సర్వదా విడువఁబడినవాఁడైనప్పటికి వాక్యార్థజ్ఞానము పుట్టినతరువాత అవి దోషములచే విడువఁబడినవానివలె తోఁచఁబడునని చెప్పుచున్నందున ఆగంతుక తిరస్కారపూర్వకముగా ఆత్మస్వరూపావస్థానమే మోక్షమని తెలియఁబడుచు భావము.

అవ. పారంపర్యక్రమమును నిగమించుచున్నారు.—

శ్లో. పారంపర్యేణ కర్మైవం స్యాదవిద్యానివృత్తయే,
జ్ఞానవన్నావిరోధిత్వాత్కర్మావిద్యాం నిరస్యతే. ౫౦.

టం-అ. ఈప్రకారము కర్మపరంపరాసంబంధముచేత అజ్ఞానముయొక్క నివృత్తికొఱకు అగుచున్నది. జ్ఞానమువలె కర్మవిరోధికానందున అజ్ఞానమును నివర్తింపచేయ జాలదు.

తా. ఇదివఱకు చెప్పిన ప్రకారము నిత్యనైమిత్తికకర్మలు అజ్ఞాననివృత్తికి పరంపరగా సాధనములుగాని సమ్యగ్జ్ఞానమువలె సాక్షాత్సాధనములు కావు. అజ్ఞానజన్యములైనందున అజ్ఞానమునకు విరోధులు కాకపోవుటచేత అజ్ఞానమును సాక్షాత్తుగా నశింపచేయఁజాలవని భావము.

అవ. కర్మలు సాక్షాత్తుగా మోక్షమునకు సాధనములుకావని చెప్పుటయందు మఱియొకయుక్తిని చెప్పుచున్నారు.—

వాక్య. న చ కర్మణః కార్యమణ్వపి ముక్తౌ సంభావ్యతే
నాపి ముక్తౌ యత్సంభవతి తత్కార్యాపేక్షతే తదు
చ్యతే. ౧౨౭

టం-అ. కర్మయొక్క కృత్యము కొంచమైనను మోక్షమునందు కలిగియున్నట్లూహింపఁబడదు. మోక్షమునం దేది సంభవించునో దానిని కర్మ అపేక్షింపదు. అని చెప్పఁబడుచున్నది.

తా. కర్మలు ఏకార్యముచేయునో ఆకార్యము మోక్షమునందు లేదు. ఏది మోక్షమునందుకలదో దానిని కర్మలు అపేక్షించవు. అది యెలాగంటే విశదముగా నిరూపించుచున్నామని భావము.

శ్లో. ఉత్పాద్య మాప్యం సంస్కార్యం వికార్యంచ క్రియాఫలమ్,
నైవం ముక్తిర్యత స్తస్మాత్కర్మ తస్యా న సాధనమ్. ౧౨౮

టం-అ. పుట్టింపఁదగినది, పొందఁదగినది, సంస్కరింపఁదగినది, ఆకారాంతరమును పొందింపఁదగినదియును కర్మకు ఫలమైయుండును. మోక్షము ఇటువంటిది ఎందువలన కాదో అందువలన ఆమోక్షమునకు, కర్మ సాధనముకాదు.

తా. ఉత్పత్తి, ప్రాప్తి, సంస్కారము, వికారము ఈనాలుగుధర్మములు కర్మసాధ్యంబులైయుండును. ఆత్మస్వరూపభూతంబైన మోక్షమునం దీనాలుగుధర్మములు సంభవించవు గనుకను మోక్షమునందు సంభవించుచున్న నిశుద్ధాత్మస్వరూపము కర్మలచేత నపేక్షింపఁబడదు గనుకనున్ను మోక్షము కర్మసాధ్యముకాదని భావము. ఇచ్చట చెప్పిన ఉత్పత్త్యాదిధర్మములనుగుఱించి పైనవాక్యములలో విస్తారముగ వ్రాసియున్నారము.

అవ. ఇంతవఱకు చెప్పినగ్రంథార్థము ననువదించుచు ఉత్తరగ్రంథము తాత్పర్యములను నిరూపించుచున్నారు.—

వాక్య. ఏవం తావత్కేవలం కర్మ సాక్షాదవిద్యాపనుత్తయే నపర్యాప్తమితి ప్రపంచితమ్, ముక్తౌ చ ముముక్షు జ్ఞానతద్విషయ స్వాభావ్యానురోధేన సర్వప్రకార స్యాపి కర్మణోఽసంభవఉక్తో "హితం సంప్రేప్సతా మి" త్యాదినా- యాదృశశ్చారా దుపకారకత్వేన జ్ఞానోత్పత్తౌ కర్మణాం సముచ్చయః సంభవతి తథా ప్రతిపాదితం అవిద్యోచ్ఛిత్తౌ తు లబ్ధాత్మస్వభావస్యా త్మజ్ఞానస్యైవాసాధారణం సాధకతమత్వం నాన్యస్య ప్రధానభూతస్య గుణభూతస్య చేత్యేత దధునో చ్యతే. ౧౪౦

దం-అ. ఈప్రకారము కేవలమైనకర్మ, ముఖ్యముగా అజ్ఞానమును నివ జేయుటకొఱకు సమర్థమైనదికాదని విస్తరింపఁబడెను. మోక్షేచ్ఛగలవానియొక్క ముయొక్కజ్ఞానమునకు గోచరమైన పరమాత్మయొక్క స్వభావమును అనుసరించు మోక్షమునందున్న సర్వవిధమైనకర్మకు సంబంధములేదని "హితం సంప్రేప్స ఇత్యాదిగ్రంథముచేత చెప్పఁబడినది. జ్ఞానము పుట్టుటయందు పరంపరగా నుపక చేత నెటువంటిసంబంధము కర్మలకు కలదో ఆప్రకారమున్ను చెప్పఁబడినది. నాశమునందు ఆత్మస్వభావమును లభించియున్న ఆత్మజ్ఞానమునకే అసాధారణమై మైన సాధకత్వముకలదనిన్ని ఇతరమైన ప్రధానకర్మకుగాని అంగభూతమైనకర్మ లేదని యిఁకమీఁద చెప్పఁబడును. .

తా. కేవలకర్మలే మోక్షసాధనముగాని జ్ఞానముకాదనిన్ని ౧, లేదా, అంగముగాఁగలకర్మలే మోక్షసాధనమనిన్ని ౨, జ్ఞానమున కంగములైనకర్మలు మో ధనమనిన్ని ౩, కర్మజ్ఞానములు రెండు సమప్రధానములై మోక్షసాధనములని నాలుగువిధములుగా పూర్వపక్షవాది ప్రతిపాదించినపక్షములలో మొదటిపక్షమును సించి కర్మలు అవిద్యను నశింపఁజేయుటకు సాక్షాత్సాధనములుకావని విస్తార వింతవఱకు ప్రతిపాదింపఁబడినది. ఇదిగాక మోక్షమునం దిచ్ఛకలవాఁడు కర్మ ఖులై అనిత్యములైన ఇహలోకపరలోకసుఖములయందు విరక్తికలవాఁడై యుం ట్టి ముముక్షువుయొక్క స్వభావము నాలోచించి చూడఁగా కర్మలు మోక్ష

అవ. ఇఁకను కర్మజ్ఞానములు సమప్రధానము లనెడి పక్షమును నిరాకరించు చున్నారు.—

వాక్య. సమప్రధానయో రప్యసంభవయేవ. ౧౮౩

దం-అ. సమప్రధానములైన కర్మజ్ఞానములకుకూడ సంభవములేదు.

తా. కర్మజ్ఞానములు రెండున్ను తుల్యప్రధానములై మోక్షసాధనములని చెప్పిన పక్షమున్ను సంభవించదని భావము.

అవ. ఎందువల్ల సంభవించదంటే చెప్పుచున్నారు.—

శ్లో. బాధ్యబాధకభావాచ్చ పంచాస్యోరణయో రివ,
ఏకదేశా నవస్థానా న్న సముచ్చయతా తయోః. ౫౫. ౧౮౪

దం-అ. ఆకర్మజ్ఞానములరెంటికి సింహమునకు గొఱ్ఱెకువలె బాధ్యబాధకభావము కలిగియున్నందున నొకచోటనుండుట కవకాశములేదు గనుక సమప్రధానభావము కలుగదు.

తా. నశింపఁజేసెడిస్వభావముగల సింహము నశింపఁజేయఁబడెడి స్వభావముగల మేషమున్ను లోకములో నొకచోటనుండుట కవకాశము లేనటుల కర్మజ్ఞానములు కూడా నొకచోట నుండజాలవు. కావున కర్మజ్ఞానములు రెండు సమప్రధానములై మోక్షసాధనములు కానేరవని భావము.

అవ. చెప్పిన బాధ్యబాధకభావమును సమర్థించుటకొఱకు పూర్వపక్షవాదియొక్క ప్రశ్న ననువదించుచున్నారు.—

వాక్య. కుతో బాధ్యబాధకభావః యస్మాత్. ౧౮౫

దం-అ. ఏకారణమువలన బాధ్యబాధకభావము కలిగియున్నది.

తా. కర్మ బాధ్యముగా జ్ఞానము బాధకముగా నుండుట కేమికారణ మని భావము.

అవ. కారణమును కనుపఱచి బాధ్యబాధకభావమును నిర్వహించుచున్నారు.—

శ్లో. అయథావ స్తువిద్యా స్యా ద్విద్యా తస్యా విరోధినీ,
సముచ్చయ స్తయో రేవం రవిశార్వరయో రివ. ౫౬. ౧౮౬

దం-అ. ఏకారణమువలన కర్మ మిథ్యావస్తువిషయముగా కలిగియుండునో జ్ఞానము అందుకువిరుద్ధముగా నుండునో అందువలన ఆకర్మజ్ఞానములకు ఈప్రకారము సూర్యునికి అంధకారమునకువలె సముచ్చయము సంభవించదు.

తా. అజ్ఞానముచేత కల్పింపఁబడిన కర్తృత్వభోక్తృత్వాద్యభిమానమును నిమిత్తముగాఁ జేసికొని ప్రవర్తించుచున్నందున కర్మ అవిద్యయనంబడు. కర్తృత్వభోక్తృత్వాదిసర్వాభిమానశూన్యమై అకల్పితమైన పరమార్థవస్తువు నవలంబించి ప్రవర్తించుచున్నందున జ్ఞానము విద్యయనంబడు. ఇట్టి కర్మజ్ఞానములు స్వభావముచేతనే పరస్పరవిరుద్ధములై యున్నందున సూర్యుఁడు అంధకారము ఈరెండు నొకచోట చేరియుండనటుల సముచ్చయమును బొందనేరవు. ఈకర్మజ్ఞానములు రెంటిలో మిథ్యాకల్పితవస్తువు నవలంబించియున్నకర్మ దుర్బలమైనందున బాధ్యమైయుండును. పరమార్థము, కల్పితవస్తువు నవలంబించియున్నజ్ఞానము ప్రబలమైనందున బాధకమైయుండునని భావము.

అవ. కనుక జ్ఞానవంతుఁడు కర్మవిధులకు బద్ధుఁడుకాఁడని ఉపసంహరించుచున్నారు.—

వాక్య. తస్మా దకారబ్రహ్మాత్మని పరిసమాప్తావబోధ స్యాశేష కర్మచోదనా నామ చోద్యస్యాభావ్యాత్ కుంఠీ భవంతి. ౧౪౭

దం-అ. కనుక కర్తృత్వాదిశూన్యమైన పరమాత్మయందు పర్యవసానమునొందిన జ్ఞానముగలపురుషునకు సకలమైనకర్మవిధులును నియోజ్యస్వభావముబట్టి సామర్థ్యహీనములై యుండును.

తా. కర్తృత్వకరణత్వాది సర్వధర్మశూన్యమై అద్వితీయమై సచ్చిదానందాత్మకమైన పరబ్రహ్మయందు ఎవనికి దృఢమైనజ్ఞానము కలిగియుండునో అట్టిపురుషుఁడు కర్మవిధులకు బద్ధుఁడుకాఁడు గనుక, కర్మబోధకములైన విధివాక్యము లాజ్ఞానియొక్క స్వభావమునుజూచి అతనిని కర్మలయందు ప్రవర్తింపఁజేయఁజాలక మొక్కపోయిన గొడవలివలె వ్యర్థములై యుండునని భావము.

అవ. తత్త్వజ్ఞానివిషయమై కర్మవిధులు వ్యర్థములై యుండుట కేమికారణమని పూర్వపక్షవాది ప్రశ్నచేయుచున్నాఁడు.—

వాక్య. కథం తత్. ౧౪౮

దం-అ. అది ఏప్రకారము.

తా. తాత్పర్యము అవతారికలోనే స్పష్టముగానున్నది.

అవ. సిద్ధాంతవాది ప్రత్యుత్తరమును చెప్పుచున్నాఁడు —

వాక్య. అభిధియ్యతే. ౧౪౯

దం-అ. చెప్పఁబడును.

తా. నీవు చేసినప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పుచున్నామని భావము.

అవ. ప్రత్యుత్తరమును దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నారు.—

శ్లో. బృహస్పతిసవే యద్వత్క్షత్త్రియో న ప్రవర్తతే,
బ్రాహ్మణత్వాద్యహమ్మానీ విప్రో వా క్షతకర్మణి. ॥౭. ౧॥౦

దం-అ. క్షత్త్రియుఁడు బృహస్పతిసవనమను యాగమందు యెటువలె ప్రవర్తించఁడో, బ్రాహ్మణత్వాదిధర్మముల నభిమానించియున్న బ్రాహ్మణుఁడు క్షత్త్రియయోగ్యమగు కర్మయందు యెటువలె ప్రవర్తించఁడో అటువలెనని ౫౮ వ శ్లోకముతో నన్వయము.

తా. 'బ్రాహ్మణో బృహస్పతిసవేనయజేత' అనెడిశ్రుతి బ్రాహ్మణుఁడు బృహస్పతిసవనమను యాగముచేత యజించవలయును అనిచెప్పుచున్నది. ఇట్టియాగమును నేను బ్రాహ్మణుఁడననెడి యభిమానము ఎవనికియుండునో వాఁడేయాచరించునుగాని నేను క్షత్త్రియుఁడననెడి యభిమానముకలవాఁడు చేయఁడుగదా? ఆప్రకారమే 'రాజా స్వారాజ్యకామో రాజసూయేన యజేత', అనెడిశ్రుతి క్షత్త్రియుఁడు స్వారాజ్యఫలమును గోరియుండెనేని రాజసూయయాగముచేత యజించవలయునని చెప్పుచున్న ఇట్టిరాజసూయయాగమును నేను క్షత్త్రియుఁడనని యభిమానముకలవాఁడే చేయునుగాని నేను బ్రాహ్మణుఁడను, నేను వైశ్యుండను అనెడి అభిమానముకలవాఁడు చేయఁడుగదా? అని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను జేయుచున్నారు.—

వాక్య. యథా యం దృష్టాంతః ఏవం దార్ష్టాంతికోఽపీత్యత
ఆహ. ౧॥౧

దం-అ. ఈదృష్టాంత మేప్రకారమో దార్ష్టాంతికముకూడ నీప్రకారమేనని అందుకుగాను చెప్పుచున్నారు.

శ్లో. విదేహో వీతసందేహో నేతి నేత్యవశేషితః, [౧॥౨
దేహాద్యనాత్మదృక్తద్వత్ తత్క్రియాం వీక్షతేఽపి న. ॥౮.

దం-అ. నేతి నేతీత్యాదివాక్యములచేత శేషించియున్నవాఁడై స్థూలదేహమునం దభిమానములేనివాఁడై సర్వసంశయములు లేకయున్నపురుషుఁడు దేహము మొదలగువాటియందు ఆత్మబుద్ధిలేనివాఁడై యున్నందున ఆకర్మను చూడనుగూడా చూడఁడు.

తా. 'అథాత ఆదేశో నేతినేతి' అనెడిశ్రుతివాక్యము, దేహ, ప్రాణ, మనో, బుద్ధి, ఆనందములనెడికోశములు అయిదు ఆత్మ కావని వీటి కాధారమైన శుద్ధచైతన్యమే ఆత్మయని ప్రతిపాదించుచున్నందున ఆయర్థమును గురూపదేశముచేత నెఱిఁగి స్వానుభవముచేత దృఢపఱచుకొని నేను శుద్ధచిదానందస్వరూపుఁడనని నిరంతరమనుసంధించునట్టి పురుషుఁడు స్థూలదేహమందుగాని, సూక్ష్మదేహమందుగాని, కారణదేహమందుగాని అభిమానములేక యుండును. ఇదిగాక దేహేంద్రియాదులయందు ఆత్మబుద్ధిలేనివాఁడై యుండును గనుక దేహేంద్రియాదులయం దభిమానముకలవారికి విధింపఁబడి అట్టివారిచేతనే ఆచరింపఁబడుచున్నకర్మలను మనోవాక్కాయములచే నాచరింపఁడు సరే కదా. కంటితోనైనను ఆకర్మలను చూడఁడనిభావము. అనఁగా దేహేంద్రియాద్యభిమానముకలవారికి అనుష్ఠేయములుగా కర్మలను విధించుచున్న వేదవాక్యములు ఆయభిమానములేని తత్త్వవేత్తను కర్మలయందు ప్రవర్తింపఁజేయఁజాలవు. బ్రాహ్మణత్వాభిమానముకలవానికి అనుష్ఠేయముగా బృహస్పతిసవనమును విధించుచున్న శ్రుతివాక్యము బ్రాహ్మణత్వాభిమానములేని క్షత్రియుని ఆబృహస్పతిసవనమునందు ప్రవర్తింపఁజేయఁజాలనటుల, అని పిండితార్థము.

అవ. దేహేంద్రియాదులయందు మిథ్యాభిమానముకలవాఁడే కర్మలయందు ప్రవర్తించునుగాని అభిమానరహితుఁడు ప్రవర్తించఁడని చెప్పఁబడెను. అందులో మిథ్యాభిమానము ప్రవర్తింపఁజేయుననెడి అర్థమును దృష్టాంతముచేత విశదపఱచుచున్నారని ఉత్తరశ్లోకమున కవతారిక చేయఁబడుచున్నది.—

వాక్య. తస్యార్థస్య విస్పష్టార్థముదాహరణం. ౧౪౯

పం-అ. ఆయర్థముయొక్క ప్రకటనముకొఱకు దృష్టాంతము చెప్పఁబడెను.

తా. మిథ్యాభిమానమే ప్రవర్తింపఁజేయునని చెప్పినయర్థము విశదమయ్యెడికొఱకు దృష్టాంతమును జూపించెదమని భావము.

శ్లో. మృత్స్నామయే యద్గజత్వం శిశుః ప్రకల్ప్య వల్గతి,
తథైవ సాక్షాత్మని దేహమోహాత్ ... ద్వివిక్తదృష్టే. ౫౯. ౧౫౦

పం-అ. బాలుఁడు మంచిమట్టితోఁ జేయఁబడిన ఏనుఁగునందు గజత్వము నారోపించి ఎటువలె క్రీడించునో అటువలె వివేకములేనివాఁడు ఆత్మయందు దేహేంద్రియాదుల నారోపించుకొని నానావిధములుగాఁ బ్రవర్తించును.

తా. లోకములో మృదువైన మంచిమృత్తికతోఁ జేయఁబడినఏనుఁగును బాలుఁడు చేతఁ బట్టుకొని అది వాస్తవమైనఏనుఁగు కాకపోయినప్పటికిని వాస్తవమైనఏనుఁగు అని

అభిమానించి అనేకవిధములైన ఆటలను ఆడుచున్నాఁడు. ఇచ్చట బాలుఁడు ఆ
నాఁడుట మిథ్యాభిమానమేకదా? అటువలెనే ఆత్మకును దేహేంద్రియాదుల
కలిగియున్న భేదము నెఱుంగఁజాలని మూర్ఖుఁడు వాస్తవముగా దేహేంద్రియా
లేని యాత్మయందు దేహేంద్రియాదులు కలవని మిథ్యాభిమానమును జేసి అందుః
నానావిధకర్మల నాచరించుచుండు నని భావము.

అవ. ఓయీ! జ్ఞానకర్మలు అంగాంగిభావముగాగాని సమప్రధానముగా
సముచ్చయము కలుగదని చెప్పినది యుక్తముగా నుండదు. 'యదేవ విద్యయా క
జ్ఞాత్వా కర్మాణి కుర్వీత' ఇత్యాదిశ్రుతులు జ్ఞానముతోఁగూడ ఏకర్మ చేయఁబడ
ఆకర్మ శ్రేష్ఠమని తెలిసికొని, కర్మలను చేయవలయునని చెప్పుచున్నందున కర్మ
ములకు సముచ్చయము ప్రమాణమైయుండఁగా, అని, పూర్వపక్షివాది శంకించ
తలఁచి సిద్ధాంతవాది సమాధానమును జెప్పుచున్నారు. —

వాక్య. న చ వయం జ్ఞానకర్మణోః సర్వత్రైవ సముచ్చయం
ప్రత్యాచక్ష్మహే, యత్ర ప్రయోజ్య ప్రయోజక
భావో జ్ఞానకర్మణో స్తత్ర నాస్మత్పిత్రాపి శక్యతే
నివారయితుమ్. ౧౫౫

దం-అ. మేము జ్ఞానకర్మలకు అంతటను సముచ్చయమును నిషేధింపము. ఎచ
జ్ఞానకర్మలకు నిమిత్తనైమిత్తికభావములు కలిగియుండునో అచ్చట సముచ్చయము
తండ్రిచేతనైన నివారించుటకు శక్యమైయుండదు.

తా. జ్ఞానకర్మలకు కొన్నిస్థలములయందు సముచ్చయము మేము నిషేధిం
ముగాని, అన్నిస్థలములయందు సంభవించదని నిషేధించినవారము కాము. ఎచ్చట
నము నిమిత్తముగానుండి అజ్ఞానము నవలంబించి కర్మ ప్రవర్తించుచుండునో అ
లమందు దాజ్ఞానకర్మలకు సముచ్చయములేదని మనలను బుట్టించిన పరమేశ్వరుఁడుకరు
నివారింపఁజాలఁడు గనుక యెచ్చట జ్ఞానకర్మలకు నిమిత్తనైమిత్తికభావములేదో
ట జ్ఞానకర్మలకు సముచ్చయము సిద్ధించదని చెప్పితిమని భావము.

అవ. అయిన నెచ్చట జ్ఞానకర్మలకు నిమిత్తనైమిత్తికభావము కలిగియుండు
ఎచ్చట కలిగియుండదంటే ఆవిభాగమును చెప్పుటకు అవతారికను చేయుచున్నారు.

వాక్య. తత్ర విభాగప్రదర్శనాయ ఉదాహరణం ప్రదర్శ్యతే. ౧

దం-అ. అందులో విభాగమును చూపించుటకొఱకు దృష్టాంతము కనుప
బడును.

శ్లో. స్థాణుం చోరధియాలాయ భీతో యద్వత్పలాయతే, [౧౫౭
బుద్ధ్యాదిభి స్తదాత్మానం భ్రాంతో౽ధ్యారోప్య చేష్టతే. ౬౦.

దం-అ. స్థాణువును (మొద్దును) చోరుఁడనెడి బుద్ధిచేత గ్రహించి భయమును బొందినవాఁడై యెటువలె పఱుగెత్తునో, అటువలెనే ఆత్మను బుద్ధ్యాదిరూపముగా నారోపించి భ్రమనొందినవాఁడై ప్రవర్తించును.

తా. కనుచీకటిలోనున్న కొమ్మలులేని మొద్దునుచూచి ఒకపురుషుఁడు అది దొంగయని తలఁచి భయపడి పరుగెత్తినటుల శుద్ధచైతన్యరూపమైన ఆత్మను దేహేంద్రియమనఃప్రాణబుద్ధివిశిష్టమని తలఁచి భ్రాంతిచెందినపురుషుఁడు కర్మలయందు ప్రవర్తించును. కావున ఇచ్చట జ్ఞానకర్మలు నిమిత్తనైమిత్తికములై యున్నందున సముచ్చయము కలదని చెప్పవచ్చును; అనఁగా స్థాణువును జూచినప్పుడు దొంగయను జ్ఞానము పుట్టినందున భయపడి పలాయనమునొందును. అప్పుడు స్థాణువునందు కలిగిన చోరజ్ఞానము పలాయనకర్మకు నిమిత్తమైయున్నది. చోరజ్ఞానము కలుగనియెడల పలాయనము కలుగదు గదా? గనుక చోరజ్ఞానము నిమిత్తము, పలాయనకర్మ నైమిత్తికముగానున్నది. అచ్చట చోరజ్ఞానపలాయనకర్మలకు సముచ్చయము కలదు. ఈప్రకారమే శుద్ధమైన ఆత్మను బుద్ధ్యాదివిశిష్టముగా తెలిసికొన్నందున కర్మల నాచరించును. అప్పుడు ఆత్మయందు గలిగిన బుద్ధ్యాదివిశిష్టజ్ఞానము కర్మలకు విశిష్టమైయున్నది. ఆత్మయందు బుద్ధ్యాదివిశిష్ట జ్ఞానము కలుగనిచో, కర్మ లాచరింపఁబడవు గనుక, బుద్ధ్యాదివిశిష్టాత్మజ్ఞానము నిమిత్తముగా, కర్మలు నైమిత్తికములుగా నున్నవి. ఇచ్చట బుద్ధ్యాదివిశిష్టాత్మజ్ఞానకర్మలకు రెంటికి సముచ్చయము కలదు. ఇట్టిస్థలమందు జ్ఞానమునకు, కర్మలకు సముచ్చయము లేదు అని చెప్పుట కీశ్వరుఁడుకూడా సమర్థుఁడు కాఁడని తాత్పర్యము.

అవ. "యదేవ విద్యయా కరోతి జ్ఞాత్వా కర్మాణి కుర్వీత" ఇత్యాది శ్రుతులయందుచెప్పిన జ్ఞానకర్మ సముచ్చయమున్ను ఇటువంటిదే యని చెప్పుచున్నారు.—

వాక్య. ఏవం యత్ర యత్ర జ్ఞానకర్మణోః ప్రయోజ్య ప్రయోజకభావ స్తత్ర తత్ర సర్వత్రాయం న్యాయః. ౧౫౮

దం-అ. ఈప్రకార మెచ్చటెచ్చట జ్ఞానకర్మలకు నిమిత్తనైమిత్తికభావము కలిగియుండునో అచ్చటచ్చట నంతటను యిదియే న్యాయము.

తా. "యదేవ విద్యయా కరోతి జ్ఞాత్వా కర్మాణి కుర్వీత" ఇత్యాదిశ్రుతులయందు జ్ఞానకర్మలు ఇప్పుడు మే ముదాహరించిన జ్ఞానకర్మలవలె నిమిత్తనైమిత్తికభావముకలవియే గనుక సముచ్చయము చెప్పవచ్చును అని భావము.

అవ. ఆత్మయాథాత్మ్యజ్ఞానమునకు, కర్మలకు, నిమిత్తనైమిత్తికభా కనుక నచ్చట సముచ్చయమును చెప్పఁగూడదని దృష్టాంతపూర్వముగాఁ అవతారికను జేయుచున్నారు.—

వాక్య. యత్ర తు న సమకాలం నాపి క్రమేణోపపద్య
సముచ్చయః స విషయ ఉచ్యతే. ౧౫

దం-అ. ఎచ్చట నేకకాలమందు క్రమముగాగాని సముచ్చయము పదో ఆవిషయము చెప్పఁబడును.

శ్లో. స్థాణోః స తత్త్వవిజ్ఞానం యథా నాంగం పలాయతే,
ఆత్మన స్తత్త్వవిజ్ఞానం తద్వన్నాంగం క్రియావిధౌ.

దం-అ. స్థాణువుయొక్క యాథార్థ్యజ్ఞానము పలాయనమున కెట్లు ము కాదో అటువలె చిదాత్మయొక్క యాథార్థ్యజ్ఞానము కర్మానుష్ఠానమున ము కాదు.

తా. స్థాణువునుజూచి యిది స్థాణువు అని కలిగినజ్ఞానము యథార్థ యథార్థజ్ఞానముకలవాఁడు భయపడి పరుగెత్తఁడుగదా? కావున స్థాణు జ్ఞానపలాయనమును కలుఁగజేయనందున స్థాణుయాథార్థ్యజ్ఞానము పల నిమిత్తముగాదు గావున స్థాణుయాథార్థ్యజ్ఞాన పలాయనకర్మలకు సముచ్చ దు. ఈలాగుననే ఆత్మయొక్క కర్తృత్వాది సర్వధర్మశూన్యమైన యాథా కర్మలయందు ప్రవర్తించుటకు నిమిత్తముకానేరదు గనుక ఆత్మతత్త్వ న్ను, కర్మలకున్ను సముచ్చయము కలుగదని భావము.

అవ. జ్ఞాన మంగమని కర్మప్రధానమని చెప్పెడి పక్షములో ప్ర జెప్పఁబడెడికర్మకు ఆత్మజ్ఞానము బాధకమైయున్నందున ఆత్మజ్ఞానము కర్మ దని ప్రతిపాదించుచున్నారు.—

వాక్య. యస్మాద్గుణస్యైత్య త్వాస్వభావ్యమ్.

దం-అ. ఏహేతువువలన అంగమున కిట్టిగుణముగలదో ఆహేతు తత్త్వజ్ఞానము కర్మల కంగముకాదు.

తా. ప్రధానము ననుసరించియుండునది అంగమని చెప్పఁబడ అంగమునకు ప్రధానానుసారిత్వము స్వభావమైయున్నది. ఇట్టిస్వభావము జ్ఞానమునకు లేదు. ఎందువల్లనంటే, యథార్థప్రమాణమువలనబుట్టి కర్తృ శూన్యమైన ఆత్మస్వరూపమును గోచరింపఁజేయుచున్న ఆత్మజ్ఞానము,

...ృత్వాదిధర్మవిశిష్టమైన మిథ్యాత్మను ఆశ్రయించి ప్రవర్తించునట్టి కర్మ ...ం గాని, అనుసరించదు గనుక నాత్మజ్ఞానము కర్మల ననుసరించెడి స్వభా...వగనుకనే ఆత్మతత్త్వజ్ఞానము కర్మల కంగము కానేరదని భావము.

...యర్థమునే శ్లోకముతో వివరించుచున్నారు.—

యస్యానురోధేన స్వభావ మనువర్తతే, [౧౬౨
...స్య గుణభూతం స్యాన్న ప్రధానా ద్గుణో యతః. ౬౨.

ఏది ఏవస్తువుయొక్క అనుసరణముచేత స్వభావము ననువర్తించియుం...కి గుణమై (అంగమై) యుండును. ఎందువల్లనంటే ప్రధానమును (అం...ది అంగముకానేరదు.

వస్తువు ఏవస్తువు ననుసరించియుండుటయే స్వభావముగాఁ గలిగియుండు అంగముగానుండును. అనఁగా నేవస్తు వేవస్తువు ననుసరించి దానికి ఉప...వృద్ధినొందుచుండునో ఆవృద్ధినొందించునది వృద్ధినొందింపఁబడు దానికి ...దునని యర్థము. ఇంతేగాని ప్రధానమును నశింపఁజేయునట్టి వస్తువు ...ఁబడదు గనుక ఆత్మజ్ఞానము కర్మను బాధించుచున్నది. అందుచే నంగ భావము.

...ర్మస్వరూపజ్ఞానము కర్మల కంగమని చెప్పుటకు ప్రకరణము, సన్నిధి ...ణములు గలవు. ఆత్మతత్త్వజ్ఞానము కర్మల కంగము అని చెప్పుటకు చెప్పుచున్నారు.—

ప్రకరణాత్కాంతిక జ్ఞానం కర్మగుణో భవేత్, [౧౬౩
ప్రకరణే యస్య (యస్మాత్) తత్తస్యాంగం ప్రచక్షతే. ౬౩.

ఎందువల్లననిన, కర్మను ప్రతిపాదించెడి ప్రకరణమునఁ గోరఁబడు కర్మ కంగము కావచ్చును. ఏది దేనియొక్క ప్రకరణమునఁ జెప్పఁ అది దానికి అంగమనికదా పండితులు చెప్పుచున్నారు.

...ర్మస్వరూపము తెలియనిచో కర్మ నాచరించుటకు శక్యముగాదు. ...రణము కర్మస్వరూపజ్ఞానము నపేక్షించుచున్నది. అందువలన కర్మ ...ం కర్మ కంగము కావచ్చును. అంగాంగివస్తువు లట్టివని నిర్ణయించిన ...ది దేనియొక్క ప్రకరణమునఁ నపేక్షింపఁబడియుండునో అది దానికి నిర్ణయించియున్నారని భావము.

అవ. ఈచెప్పినయర్థమును విశదపఱుచుచున్నారు.—

శ్లో. స్వరూపలాభమాత్రేణ యత్త్వవిద్యాం నిహంతి నః, [౧౬౪
నతదంగం ప్రధానం వా జ్ఞానం స్యాత్కర్మణః క్వచిత్. ౬౪.

దం-అ. స్వరూపము లభించినమాత్రముచేత యేజ్ఞానము అజ్ఞానమును నశింపఁజేయునని మాకు సమ్మతమైయున్నదో ఆట్టిజ్ఞానము యెప్పటికిని కర్మకు అంగముగాగాని, అంగిగాగాని యుండనేరదు.

తా. వేదాంతవాక్యములచేఁ బుట్టింపఁబడుచున్న ఆత్మతత్త్వజ్ఞానముతాను పుట్టినంతమాత్రముచేతనే సకలజ్ఞానములను, తత్కార్యములను నశింపఁజేయునని మేము ప్రతిపాదించి (అంగీకరించి) యుంటిమి. అట్టియాత్మతత్త్వజ్ఞానము కర్మప్రకరణములోఁ జెప్పఁబడియుండలేదు. గనుక ఆత్మతత్త్వజ్ఞానము కర్మకు ఆంగముగాగాని, అంగిగాగాని యుండనేరదని భావము. అనఁగా కర్మ స్వరూపజ్ఞానము కర్మల కంగమని చెప్పుటకు ప్రకరణము వాక్యము మొదలగుప్రమాణములు గలవు. ఆత్మతత్త్వజ్ఞానము కర్మల కంగమనిచెప్పుట కట్టిప్రమాణములు లేవు అందువలన ఆత్మతత్త్వజ్ఞానము కర్మాంగము కాదని సముదాయార్థము.

అవ. ఆత్మతత్త్వజ్ఞానము కర్మలతోటి సముచ్చయమునొందునని అంగీకరించిన పూర్వపక్షవాదియును ఆత్మతత్త్వజ్ఞానము ప్రమాణముచేతఁ బుట్టినందున తనచేత ప్రకాశింపఁజేయఁబడు విషయముయొక్క అజ్ఞానమును నివర్తింపఁజేయునని బలాత్కారము గానైన నొప్పుకోవలయును. అప్పుడు తనకు సమ్మతమైన సముచ్చయవాదము సిద్ధించదని ప్రతిపాదించుచున్నారు.—

వాక్య. సముచ్చయాపక్షవాదినా ప్యవశ్య మేతదభ్యుపగంతవ్యమ్, యస్మాత్. ౧౬౫

దం-అ. సముచ్చయపక్షము నంగీకరించిన పూర్వపక్షవాదిచేతకూడా అవశ్యముగా నీయర్థ మంగీకరింపఁబడవలయును.

తా. స్పష్టము.

అవ. ఏయర్థము నంగీకరింపవలయునంటే చెప్పుచున్నారు.—

శ్లో. అజ్ఞాన మనిరాకుర్వ జ్జ్ఞాన మేవ న సిధ్యతి,
విపన్నకారకగ్రామం జ్ఞానం కర్మ న ఢౌకతే. ౬౫. ౧౬౬

దం-అ. ఎందువల్ల అజ్ఞానమును నశింపఁజేయనిదే జ్ఞానమే సిద్ధింపదో అందువల్ల పూర్వపక్షివాదికూడా ఈయర్థమును అవశ్య మంగీకరింపవలయునని వెనుకటివాక్య

ముతో నన్వయము. కర్త్రాది సాధనసముదాయమును నశింపఁజేసినజ్ఞానము కర్మను స్పృశించదు.

తా. జ్ఞానమునకు ఉత్పాదకములగు ప్రమాణములు మూఁడు. ఒకటి ప్రత్యక్షము రెండవది అనుమానము. మూఁడవది శబ్దము. ఇందులో ప్రత్యక్షమనగా చక్షురాదీంద్రియము. అనుమానమనఁగా నొకభాగముచే నింద్రియములకు గోచరించనిపదార్థముల నూహింపఁజేయునట్టి సాధనము. పర్వతాగ్రమందు వహ్నిని ఊహింపఁజేయునట్టి సాధనము ధూమము గనుక ధూమ మనుమానమనంబడు. శబ్దమనగా తనకు తెలియని అర్థమును తెలియఁజేయుచున్న అక్షరసముదాయరూపమైన వాక్యము. ఈమూఁడుప్రమాణములచేతఁ గలిగెడిజ్ఞానము తాను ఏవిషయమును గ్రహించుచున్నదో ఆవిషయము తాను పుట్టక మునుపు అజ్ఞానముచేత నావరింపఁబడియుండఁగా (తెలియఁబడనిదైయుండగా) ఆయ జ్ఞానమును నశింపఁజేసినఁగదా ఆవిషయమును ప్రకాశింపఁజేయును. ఇందు లోకదృష్టాంతమును చెప్పెదను. చక్షురింద్రియమునకును ఘటమునకును సంయోగము కలిగినప్పుడు ఇది ఘటమనెడిజ్ఞానము పుట్టును. ఈజ్ఞానము పుట్టుటకు మునుపు ఘటము తెలియఁబడ నందున అజ్ఞానముచేత నావరింపఁబడి యున్నదని చెప్పవలయునుగదా? ఇది ఘటమను జ్ఞానము పుట్టఁగానే ఆయజ్ఞానము నశించి ఘటము ప్రకాశించును గనుక జ్ఞానమును నశింపఁజేయునని సర్వవాదులు నంగీకరింపవలయును. ఈప్రకారమే వేదాంతవాక్యమును శబ్దప్రమాణములో నంతర్భవించియున్నందున అట్టివేదాంతవాక్యమువల్లఁ బుట్టిన ఆత్మ విషయజ్ఞానమును అంతకుముందు ఆత్మస్వరూపము నావరించి ఆయాత్మస్వరూపమ వందు కర్తృత్వాదివిపరీతధర్మములు నారోపించుచున్న అజ్ఞానమును నశింపఁజేయు నని అంగీకరింపవలయును గనుక అజ్ఞానమును తత్కార్యంబై కర్తృత్వాదిధర్మకదంబ మును నశింపఁచేయుచు నుదయించిన ఆత్మతత్త్వజ్ఞానము కర్తృత్వాదిధర్మములను వాటికి కారణమైన అజ్ఞానముతో కూడియున్న ఆత్మకు అవలంబించి ప్రవర్తించుచున్న కర్మ తోటి సంబంధించదని మాపూర్వపక్షవాది బలాత్కారముగనైన నొప్పుకోవలసినదని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను జేయుచున్నారు.

వాక్యం. ఇదం చాపరం కారణం జ్ఞానకర్మణోః సముచ్చయ నిబర్హి. ౧౬౨

దం-అ. జ్ఞానకర్మలయొక్క సముచ్చయమును నిరాకరించెడిహేతువు ఇది మఱియొకటి కలదు.

అవ. అది యేదంటే.

శ్లో. హేతుస్వరూపకార్యాణి ప్రకాశతమసోరివ,
విరోధీని తతో నాస్తి సాంగత్యం జ్ఞానకర్మణోః. ౬౬. ౧౬౭

దం-అ. జ్ఞానకర్మలయొక్క కారణము, స్వరూపము; కృత్యమున్ను, ప్రకాశమునకు (వెలుతురునకు) అంధకారమునకువలె విరుద్ధములైయున్నవి. అందువలన జ్ఞానకర్మలకు సముచ్చయము లేదు.

తా. జ్ఞానమునకు కారణము ప్రమాణము. కర్మకు కారణము అభిమానరాగద్వేషాదులు. జ్ఞానముయొక్క స్వరూపము పరమార్థప్రకాశకృతము. కర్మయొక్క స్వరూపము జడమైనందున ప్రకాశాభావము. జ్ఞానముయొక్క కృత్యము అజ్ఞాననివృత్తి. కర్మయొక్క కృత్యము ఉత్పత్త్యాదిచతుష్టయము. ఇవి పరస్పరవిరుద్ధములైయున్నందున, ప్రకాశమునకు చీకటికి ఏప్రకారము సంబంధము లేదో ఆప్రకారమే జ్ఞానకర్మలకున్ను పరస్పరసముచ్చయము లేదని భావము.

అవ. ఈప్రకారము తత్త్వజ్ఞానము తనయొక్క ఉత్పత్తిమాత్రముచేతనే సర్వాజ్ఞానమును నివర్తింపఁజేయును గనుక కర్మలయొక్క సాంగత్యమును పొందదని సిద్ధాంతవాది నిర్వహించగా దానిని సహించక మఱికొందఱు వాదులు చెప్పెడి పూర్వపక్షమును చూపించుటకుగాను అవతారికను చేయుచున్నారు.—

వాక్య. ఏవ ముపసంహృతే కేచి త్స్వసంప్రదాయబలావ
ష్టంభాదాహుః. ౧౬౮

దం-అ. ఈప్రకారము నిగమించగా కొందఱు తమయొక్క సంప్రదాయబలమును నాశ్రయించుటవలన చెప్పుచున్నారు.

తా. తత్త్వజ్ఞానము మోక్షసాధనముకాదని, కర్మలు స్వతంత్రముగా గాని, జ్ఞానము నంగముగాఁ జేసికొనిగాని, మోక్షసాధనములై యుండునని చెప్పిన పూర్వపక్షవాదియొక్క మతమును నిరాకరించి తత్త్వజ్ఞానము మోక్షసాధనమనిన్ని తత్త్వజ్ఞానము అజ్ఞానమును నివర్తింపఁజేయుటయందు తనయొక్క ఉత్పత్తిని తప్ప మఱియొకదానిని అపేక్షించదనిన్ని సిద్ధాంతవాది నిర్వహించగా దానిని తత్త్వజ్ఞానమే మోక్షసాధనమని మాత్ర మంగీకరించి ఆతత్త్వజ్ఞానము మఱియొకదానిని అపేక్షించదనెడి విశేషము నంగీకరించని మఱికొందఱు పండితాభిమానులు పూర్వపక్షమును చేయుదురు. వారు చెప్పెడి పూర్వపక్షమునకు వారివారిగురూపదేశమే సాధనముగాని మఱియొకశ్రుతిస్మృతులవచనములు సాధనములుగావని భావము.

ఏమని పూర్వపక్షమును చెప్పెదరంటె ఆపూర్వపక్షక్రమమును ప్రతి
...న్నారు. —

యదేతద్వేదాంతవాక్యాదహం బ్రహ్మేతి విజ్ఞానం
సముత్పద్యతే తన్నైవ స్వోత్పత్తిమాత్రేణాజ్ఞానం
నిరస్యతి కిం తర్హి అహన్యహని ద్రాఘీయసా కా
లేన ఉపాసీనస్య సతః భావనోపచయాన్నిశ్శేషమజ్ఞా
న మపగచ్ఛతి "దేవో భూత్వా దేవానప్యేతీ" తి
శ్రుతేః. ౧౭౦

...అ. వేదాంతవాక్యమువలన 'అహంబ్రహ్మ' (నేనే బ్రహ్మ) ననే యే యీ
...నో అజ్ఞానము తనయొక్క ఉత్పత్తిమాత్రముచేతనే అజ్ఞానమును నిరసిం
...వదు. ఇంక నేమంటే ప్రతిదినమందు దీర్ఘమైనకాలముచేత అనుష్ఠించఁబడు
...సాక్షాత్కారముయొక్క అభివృద్ధివలన అజ్ఞానము నిశ్శేషముగా నివర్తించును.
...త్వా దేవా నప్యేతి' యనెడి శ్రుతివలన నీయర్థము ప్రతిపాదింపఁబడు

'తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి' ఇత్యాది వేదాంతమహావాక్యములను వినుట
...బ్రహ్మను అనెడి జ్ఞానము కలుగునుగాని ఆట్టిజ్ఞానము తాను పుట్టినమాత్రముచే
...నమును నివర్తింపజేయజాలదు. ప్రతిదినము చిరకాలము అభ్యాసముచేయఁ
...నము వృద్ధినొంది కొంతకాలమునకు అజ్ఞానము నిశ్శేషముగా నివర్తిం
...తత్త్వజ్ఞానము ఆభ్యాసము నపేక్షించియున్నది. ఈయర్థమును "దేవో
...వా నప్యేతి" యనెడిశ్రుతి ప్రతిపాదించుచున్నందున అవశ్యముగా నంగీ
...ను. గనుక అభ్యాసముకూడ కర్మలో నంతర్భూతమైయున్నందున అభ్యా
...సముచ్చితమైన తత్త్వజ్ఞానము మోక్షసాధనముగాని, కేవలతత్త్వజ్ఞానము
...ముకాదని భావము. అభ్యాసపాటవముచేత దేవస్వరూపసాక్షాత్కారము
...నశించినపిదప దేవస్వరూపములో నేకమై లయించునని శ్రుత్యర్థము.
...మఱికొందఱు పూర్వపక్షవాదులు చెప్పెడి పూర్వపక్షమును చూపించు

అపరే తు బ్రువతే, వేదాంతవాక్యజనిత మహం
బ్రహ్మేతి విజ్ఞానం సంసర్గాత్మకత్వా దాత్మవస్తుయా
థాత్మ్యావగాహేవ న భవతి. కింతర్హి ఏతదేవ గం

గాంగస్రోతోవత్సంతతమభ్యస్యతః అన్యదేవా వాక్యా
ర్థాత్మకం విజ్ఞానాంతర ముద్పద్యతే తదేవాశేషాజ్ఞాన
తిమిరోత్సారీతి "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణ"
ఇతి శ్రుతేరితి. ౧౭౧

దం-అ. వేదాంతవాక్యములవల్లపుట్టిన "అహం బ్రహ్మ" (నేను బ్ర
అనెడుజ్ఞానము సంసర్గరూపముగా నున్నందున ఆత్మవస్తువుయొక్క యాథార్థ్య
ప్రతిపాదించునది కానేరదు. ఇఁక నేమంటే ఈజ్ఞానమునే గంగాప్రవాహమువలె
చ్ఛిన్నముగా నభ్యసించువానికి మఱియొక వాక్యార్థవిలక్షణమైనజ్ఞానము పుట్టును.
జ్ఞానమే సకలమైన అజ్ఞానాంధకారమును నిరసించును. 'విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత
ణః' అనెడిశ్రుతివలన నీయర్థము ప్రతిపాదింపఁబడుచున్నది. అని మఱికొం
చెప్పెదరు.

తా. పదములయొక్క సముదాయము వాక్యముగావున, వాక్యార్థము
ములయొక్క సంసర్గము కలదై యుండును. కనుక వేదాంతవాక్యములవలనఁ
"అహం బ్రహ్మ" యనెడిజ్ఞానము వాక్యార్థమైనందున పదార్థములయొక్క సం
కలదై యుండును. అనఁగా తత్త్వమసియనెడి వాక్యములవల్లబుట్టిన జ్ఞానము
దార్థత్వం పదార్థములయొక్క సంసర్గము కలదై యుండునని యర్థము. ఇట్టి వా
ర్థజన్యమైన జ్ఞానము పరమార్థస్వరూపముయొక్క యాథార్థ్యమును తెలియఁజేం
లదు. ఎందువల్లనంటే "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం" ఇ
శ్రుతులు పరమాత్మస్వరూపము 'సజాతీయవిజాతీయస్వగత' భేదములు లేనిదై
డమై ఏకరూపమైయుండునని చెప్పుచున్నందున పదార్థములనే ధర్మములతో
యున్న వాక్యార్థజన్యజ్ఞానము అఖండమైన బ్రహ్మను తెలియఁజేయఁజాలదు.
ర్థజ్ఞానము అజ్ఞానమును నిరసించునుగాని అయథార్థజ్ఞానము నిరసించలేదుగదా?
వాక్యార్థజన్యజ్ఞానము అజ్ఞానమును నిరసించఁజాలదు. ఇఁకనేమంటే ఈవాక్యా
మునే గంగాప్రవాహ మేలాగున విచ్ఛేదములేకుండా ప్రవహించునో ఆలాగునవిచ్ఛే
లేకుండా అనుసంధించినయెడల ఒకవిధమైనజ్ఞానము జన్మించును. అజ్ఞానము వా
జ్ఞానమువలె పదార్థసంసర్గముకలది కానందున అఖండనిర్విశేషబ్రహ్మస్వరూపము
యాథార్థ్యమును గోచరింపఁజేయును గనుకనే అది యథార్థజ్ఞానమనంబడు.
యథార్థజ్ఞానమే అజ్ఞానాంధకారమును మధ్యాహ్నసూర్యునివలె నిశ్శేషముగా
పఁజేయును. గనుక నిరంతరాభ్యాసవిశిష్టవాక్యార్థజ్ఞానమే విలక్షణజ్ఞానోత్పాదన

అజ్ఞానమును నివర్తింపఁజేయుచున్నందున వాక్యార్థజ్ఞానము తాను జన్మించినమాత్రాననే అజ్ఞానమును నివర్తింపఁజేయుననిన్ని కర్మనిరపేక్షవాక్యార్థజ్ఞానమే మోక్షసాధనమనిన్ని చెప్పఁకూడదు. ఇఁక నేలాగున చెప్పవలయుననంటే అభ్యాసాఖ్యకర్మసముచ్చితవాక్యార్థజ్ఞానమే మోక్షసాధనమని చెప్పవలయును. ఈయర్థము "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" అనెడి శ్రుతిచేత స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడుచున్నందున మిక్కిలిగ విశ్వసింపఁదగియున్నదని భావము. వేదాంతవాక్యములవలన సంసృష్టరూపమైన (పదార్థధర్మములతోఁ గూడియున్న పరబ్రహ్మను తెలిసికొని అనంతర మసంసర్గరూపమైన (సర్వధర్మశూన్యమై అఖండమైన) పరబ్రహ్మమును గోచరింపఁజేయు సాక్షాత్కారజ్ఞానమును అభ్యాసముచేత సంపాదింపవలయునని శ్రుతికి పూర్వపక్షవాది చెప్పెడి అర్థము. సృష్టికి పూర్వకాలమునందీ ప్రపంచము సద్రూపమైన పరబ్రహ్మగానే యుండెను. ఆపరబ్రహ్మ తనతో సమానరూపమైన మఱియొక చేతనవస్తువుకాని భిన్నరూపమైన మఱియొక అచేతనవస్తువుగాని తనకు విశేషణములైన గుణములుగాని లేనిదై అఖండమైయుండెనని శ్రుత్యర్థము.

అవ. ఈవిధముగా వచ్చిన పూర్వపక్షవాదుల నిద్దఱను సిద్ధాంతవాది నిరసించుచున్నాఁడు.—

వాక్య. అస్య పక్షద్వయస్య నివృత్తయే ఇద మభిధీయతే. ౧౭౨

దం-అ. ఈరెండుపక్షముల నిరాకరణముకొఱకు ఈముందుశ్లోకము చెప్పఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. సకృత్ప్రవృత్త్యా మృద్నాతి క్రియాకారకరూపభృత్,
అజ్ఞాన మాగమజ్ఞానం సాంగత్యం నాస్త్యతోఽనయోః. ౬౭

దం-అ. వేదాంతవాక్యజన్యమగుజ్ఞానము నొకమాఱు ప్రవృత్తించిన మాత్రముచేతనే కర్మకర్తృరూపమును బొందియున్న అజ్ఞానమును మర్దించును గనుక ఈకర్మజ్ఞానములకు సముచ్చయము లేదు.

తా. నీవు చెప్పెడి అభ్యాసమనెడి అవిచ్ఛిన్నానుసంధానము చిత్తమున కేకాగ్రతనుదించి అసంభావనావిపరీతభావనలనెడు చిత్తవిక్షేపములను పోఁగొట్టుటకు సాధనమైనందున నిత్యనైమిత్తికకర్మలవలె జ్ఞానోత్పత్తికి ఉపకారకమేకాని జ్ఞానమున కంగము గాదు. అనఁగా చిత్తమునందు తత్త్వజ్ఞానము పుట్టకుండ చేయునట్టి ప్రతిబంధములు నాలుగు గలవు. అందులో మొదటిప్రతిబంధము అనాదిజన్మార్జితపాపసంచయము. ఇది

నిత్యనైమిత్తికకర్మానుష్ఠానముచేత పోవును. రెండవ ప్రతిబంధము అజ్ఞానము. నేత్రగతపటలాదిదోషములు అంజనప్రక్షేపాదికర్మలచేత పోయినప్పటికి అంధకారము ఘటాదిపదార్థముల నావరించి ప్రకాశింపఁజేయనటుల, కర్మానుష్ఠానముచేత పాపములు నశించినప్పటికి ఈఅజ్ఞానము చిత్తము నావరించి తత్త్వజ్ఞానము పుట్టకుండ ప్రతిబంధించుచుండు. ఇట్టి అజ్ఞానము సద్గురుసన్నిధానమునందు శ్రద్ధాభక్తులతోఁగూడి వేదాంతవాక్యములను వినుటచేత నివర్తించును. మూఁడవప్రతిబంధము అసంభావన; అసంభావన యనఁగా జీవబ్రహ్మలయొక్క ఐక్యము. ఘటపటములయొక్క ఐక్యమువలె ప్రత్యక్షమునకు విరుద్ధముగానున్నది. కర్తృత్వాదివిరుద్ధధర్మములుగలవాఁడైనందున జీవబ్రహ్మలకైక్యము సంభవించదు గనుక పరమప్రమాణమైన వేదాంతవచనము జీవబ్రహ్మల కైక్యము ఏలాగున చెప్పినదని చిత్తములోఁ గలుగుచున్నసంశయము. ఇది మననముచేత నివర్తించును. వేదాంతవాక్యశ్రవణముచేత కలిగినజీవబ్రహ్మైక్యమును తదనుకూలయుక్తులచేత నాలోచించుట మనన మనంబడు. అనఁగా ఘటపటములు ఇంద్రియగోచరమైనందున వాటియొక్క ఐక్యము అసంభావితమే. జీవబ్రహ్మలు ఇంద్రియగోచరము కానందునను శాస్త్రముచేతనే ప్రతిపాదింపఁబడుచున్నందునను శాస్త్రప్రతిపాదితమైన వారియొక్క ఐక్యము విరుద్ధముకానేరదు. కర్తృత్వాకర్తృత్వాదిధర్మములు జీవబ్రహ్మలయొక్క స్వరూపమునందుండునవి కావు. జీవబ్రహ్మోపాధులయిన అవిద్యామాయలయందుండునవి. జీవబ్రహ్మలు శుద్ధచిద్రూపులు గావున వారికి అన్యోన్యైక్యము సంభావితమేను. అనే పర్యాలోచనము మనన మనంబడు. ఇట్టి మననముచేత సంశయ మనెడి అసంభావన నివర్తించును. విపరీతభావ మనునది నాలుగవప్రతిబంధము. జీవబ్రహ్మలయొక్క ఐక్యము వాస్తవమని విశ్వసింపఁబడియున్నప్పటికి భేదమే సర్వవ్యవహారములయందు ప్రకాశించుచుండుట విపరీతభావన యనంబడు. ఈప్రతిబంధము నిదిధ్యాసముచేత నివర్తించును. జీవబ్రహ్మైక్యమును నిరంతరము అనుసంధించుట నిదిధ్యాసము. ఇదిను అభ్యాసమనంబడు. ఈప్రకారము జ్ఞానోత్పత్తిప్రతిబంధములు నాలుగు క్రమముగా నిత్యనైమిత్తికకర్మానుష్ఠానవేదాంతవాక్యశ్రవణతన్మనననిదిధ్యాసములచేత నివర్తించఁగా 'తత్త్వమసీ'త్యాది మహావాక్యములచేత బ్రహ్మస్వరూపయాథార్థ్యజ్ఞానముదయించును. ఇదియే సమ్యక్ జ్ఞానమనంబడు. ఇట్టి సమ్యక్జ్ఞానము తాను పుట్టిన మాత్రాననే సంసారమునకు కారణమై క్రియాస్వరూపముగా కర్తృకరణాదిసకలప్రపంచముగాఁ బరిణమించియున్న అజ్ఞానమును నిశ్శేషముగా నశింపఁజేయునుగాని అభ్యాసాదుల నపేక్షించదు గావున, జ్ఞానకర్మలకు సముచ్చయము కలుగదనిభావము. 'విజ్ఞాయ

ప్రజ్ఞాం కుర్వీత యనెడిశ్రుతికి వేదాంతవాక్యశ్రవణముచేత బ్రహ్మస్వరూపముయొక్క సాక్షాత్కారముకొఱకు మనననిదిధ్యాసములనెడి ప్రజ్ఞను చేయవలయునని యర్థము.

ఆవ. బ్రహ్మస్వరూపము భేదశూన్యమై అద్వితీయమైయుండునని యంగీకరించి అటువంటిబ్రహ్మయొక్క జ్ఞానము కర్మలతో సముచ్చయము పొందదని ఇంతవఱకు ప్రతిపాదింపఁబడినది. ఇంకను బ్రహ్మస్వరూపము భేదాభేదములు రెండుకలదై యుండునని చెప్పెడివారిపక్షమందున్ను, బ్రహ్మజ్ఞానము కర్మలతో సముచ్చయము నొందదని నిరూపింప నారంభించుచున్నారు.

వాక్య. ఏవం తావదనానాత్వే బ్రహ్మణి జ్ఞానకర్మణోః సము
చ్చయో నిరాకృతః అథాధునా పక్షాంతరాభ్యు
పగమేనాపి ప్రత్యవస్థానే పూర్వవదనాశ్వాసోయథా
తథాభిధీయతే. ౧౭౪

దం-అ. ఈప్రకారము బ్రహ్మస్వరూపము నానాత్వము (భేదము) లేనిదై యుండఁగా జ్ఞానకర్మలకు సముచ్చయము (సాంగత్యము) నిరాకరింపఁబడినది. ఇఁక నిప్పుడు మఱియొకపక్షమును అంగీకరించుటచేత ప్రతివాదముచేసినప్పటికి మునుపటివలెనే అవిశ్వాసము (అనాదరము) ఏప్రకారముగా చేయఁబడునో ఆప్రకారముగా చెప్పఁబడును.

తా. ఇంతవరకు బ్రహ్మస్వరూపము నిత్యనిర్భేదమని చెప్పెడివేదాంతసిద్ధాంతమందు జ్ఞానకర్మలకు సముచ్చయము కలుగదని చెప్పితిమి. ఇఁకను బ్రహ్మస్వరూపము కేవల మభిన్నమే కాదు. భిన్నాభిన్నమని చెప్పెడివారు మాతో ప్రతివాదముచేసినప్పటికి వారివాదమున్ను ఏప్రకారము ఆదరింపఁదగియుండదో, ఆప్రకారముగా ప్రతిపాదించెదమని భావము.

శ్లో. అనుత్సారితనానాత్వం బ్రహ్మ యస్యాపి వాదినః,
తన్మతే నాపి దుస్సాధ్యో జ్ఞానకర్మసముచ్చయః. ఉ.అ. ౧౭౫

దం-అ. ఏవాదికి బ్రహ్మ నిరాకరింపఁబడిన భేదముకలది కాదో ఆవాదియొక్క మతముచేత కూడ జ్ఞానకర్మలయొక్క సముచ్చయము సాధింప శక్యమైయుండదు.

తా. అద్వితీయబ్రహ్మవాదిపక్షమందు జ్ఞానకర్మలకు సాంగత్యము సంభవించదు. సరేగదా? బ్రహ్మ భేదముకలదిగా కూడ నుండునని చెప్పెడివానియొక్క పక్షమందున్ను జ్ఞానకర్మలకు సముచ్చయము సంభవించదని భావము.

అవ. బ్రహ్మ భిన్నాభిన్నమై యుండునసెడిమతము రెండువిధములు. కొందఱు జీవబ్రహ్మలకు సంసారదశయందున్ను అభేదముకలదని చెప్పుదురు. మఱికొందఱు సంసారదశయందు భేదమే కాని అభేదము లేదనిన్ని మోక్షదశయందే అభేదము కలిగియుండు నని చెప్పుదురు. వారి రెండుపక్షములను విభాగించి చూపించెదమని చెప్పుచున్నారు.

వాక్య. తస్య విభాగోక్తి ర్దూషణవిభాగప్రజ్ఞప్తయే. ౧౬౬

దం-అ. దూషణయొక్క విభాగమును తెలియఁజేయుటకొఱకు అభేదాభేదవాదముయొక్క వికల్పము వచింపఁబడును.

తా. భేదాభేదవాదములలో కొన్ని భేదములు కలవు. వాటికి దూషణములు వేరువేరుగా జెప్పఁబడును అట్టి దూషణభేదము తెలియఁజేయుకొఱకు భేదాభేదవాదమును వికల్పించెదమని భావము.

శ్లో. బ్రహ్మాత్మా వా భవేత్తస్య యదివా నాత్మరూపకం,
ఆత్మానాప్తి ర్భవే న్మోహా దితరస్యా ప్యనాత్మనః. ౬౯: ౧౭౭

దం-అ. అభేదాభేదవాదియొక్కపక్షములో బ్రహ్మ ఆత్మస్వరూపమే అవునా? లేక ఆత్మస్వరూపము కాదా? మొదటిపక్షములో అజ్ఞానమువల్లనే ఆత్మయొక్క అప్రాప్తి కలుగుచున్నది. రెండవపక్షములో ఆత్మగాని బ్రహ్మయొక్క ప్రాప్తి కలుగనే కలుగదు.

తా. బ్రహ్మస్వరూపము భిన్నాభిన్నమని చెప్పెడివారు బ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటె భిన్నమనెదరా? బ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటె అభిన్నమే అయినపక్షమందు ప్రత్యగాత్మకు బ్రహ్మస్వరూపావాప్తి స్వతస్సిద్ధమైయుండఁగా విస్మృతకంఠగతచామీరకన్యాయముగా బ్రహ్మస్వరూపముయొక్క అప్రాప్తి అజ్ఞానము మాత్రముచేతనే సంభవించియున్నది. అజ్ఞానము జ్ఞానమాత్రముచేతనే నివర్తించవలసి యున్నందున జ్ఞానమే బ్రహ్మప్రాప్తికి సాధనముగాని కర్మతో ప్రయోజనము కనుపడదు గనుక కర్మజ్ఞానములకు సముచ్చయము సిద్ధించదు. బ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటె భిన్నమని చెప్పెడిపక్షమందు 'అత్యంతభిన్నమైన బ్రహ్మయొక్కప్రాప్తి జీవునికి సంభవించదు గనుక జ్ఞానముగాని, కర్మగాని బ్రహ్మప్రాప్తికి సాధనము కానేరదు గావున కర్మజ్ఞానములకు సముచ్చయమే కలుగదని భావము.

అవ. బ్రహ్మ ప్రత్యగాత్మకంటె అభిన్నమా అని చేసిన మొదటివికల్పమునందు చెప్పినదూషణమును విశదముగా చెప్పుచున్నారు.—

వాక్య. తత్ర యది తావద్వాస్తవేనైవ వృత్తేన బ్రహ్మ

ప్రాప్త మాత్మస్వాభావ్యాత్కేవల మాసురమోహా
పిధానమాత్రమేవాప్తినిమిత్తం తస్మిన్ పక్షే. ౧౭౮

దం-అ. అందులో బ్రహ్మ ఆత్మస్వరూపముకంటె అభిన్నమైయున్నందున వాస్తవ స్థితిచేతనే పొందఁబడియుండెనా ముఖ్యముగా అసురసంబంధమైన అజ్ఞానముయొక్క ఆవరణముమాత్రమే బ్రహ్మ పొందఁబడకయుండుటకు నిమిత్తమైయుండెనా, ఆపక్షమందు దూషణము చెప్పఁబడును.

తా. బ్రహ్మ ప్రత్యగాత్మకంటె అత్యంతాభిన్నమై యున్నందున ప్రత్యగాత్మకు నిత్యప్రాప్తమైయున్నదనిన్ని అట్టిబ్రహ్మయొక్క అప్రాప్తికి అజ్ఞానమే కారణమనిచెప్పెడి భేదాభేదవాదిపక్షమునందు దూషణము చెప్పుచున్నామని భావము. అజ్ఞానము ఆసుర సంపదలో చేరినదని చెప్పినందున ఆసురమని చెప్పఁబడినది. అసురసంపద యని దైవ సంపదయని రెండు స్వభావములు. వీటియొక్క లక్షణము భగవద్గీతలయొక్క ౧౬-వ అధ్యాయములో విశదముగా చెప్పఁబడియున్నది.

అవ. దూషణమును కనుపఱచుచున్నది.—

శ్లో. మోహాపిధానభంగాయ నైవ కర్మాణి కారణమ్,
జ్ఞానే నైవ ఫలావాప్తే స్తత్ర కర్మ కరోతి కిమ్. ౨౦. ౧౭౯

దం-అ. అజ్ఞానావరణమును నిరసించుటకొఱకు కర్మలు నిమిత్తము కానేకావు. జ్ఞానముచేతనే అజ్ఞాననివృత్తియనెడి ఫలము ప్రాప్తించుచుండగా నచ్చట కర్మయేమిచేయ లదు?

తా. అజ్ఞానమును కర్మలు నివర్తింపఁజేయఁజాలవు. జ్ఞానముచేతనే అజ్ఞాననివృత్తి కలుగుచుండగా కర్మలు నిరర్థకములై యుండును గనుక జ్ఞానకర్మలకు సముచ్చయము కలుగదని భావము.

అవ. బ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటె భిన్నమా యని చేసిన రెండవవికల్పమునందు దూషణమును విశదపఱచుచున్నారు.—

వాక్య. అనాత్మరూపకే తు బ్రహ్మణి న కర్మ సాధనభావం
ప్రతిపద్యతే; నాపి జ్ఞానం కర్మ సముచ్చితమసముచ్చి
తం వా; యస్మాదన్యస్య స్వత ఏవ సాధకస్య బ్రహ్మ
ణోఽప్యన్యత్వం స్వత ఏవ సిద్ధం. తత్రైవమ్. ౧౮౦

దం-అ. బ్రహ్మ ఆత్మస్వరూపముగానిచో కర్మయున్ను సాధనత్వమున్ను (ఉపాయత్వమును) పొందనేరదు. కర్మతో సముచ్చితమైన జ్ఞానమున్ను సముచ్చితముగాని

జ్ఞానమున్ను సాధనత్వమును బొందనేరదు. ఎందువల్లనంటే, బ్రహ్మప్రాప్తిని సాధించునట్టి పురుషుఁడు స్వయముగానే భిన్నుఁడైయుండగా బ్రహ్మకున్ను భేదము స్వయముగానే సిద్ధమై యున్నదిగదా.

తా. బ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటె భిన్నమని చెప్పెడియెడల బ్రహ్మప్రాప్తియనెడి మోక్షమునకు కర్మలు సాధకములు కావు. కర్మసముచ్చిత జ్ఞానముగాని కేవలజ్ఞానముగాని యీరెండున్ను సాధనములు గావు. ఎందువలన సాధనములు కావంటే, బ్రహ్మప్రాప్తిని కోరియున్న ముముక్షుపురుషుఁడు తాను బ్రహ్మకంటె భిన్నుఁడై యున్నందున, బ్రహ్మయున్ను ముముక్షుపురుషునకంటె భిన్నమైయుండును. ముముక్షుపురుషునకు బ్రహ్మ తాదాత్మ్యరూపమైన మోక్షము ఎప్పటికి సంభవింపదు. కావున ముముక్షువు మోక్షప్రాప్తికి సాధనముగా కర్మనుగాని, జ్ఞానమునుగాని అంగీకరించఁడు. కనుక కర్మజ్ఞానములలో నొకటియైనను మోక్షమునకు సాధనము గానేరదని భావము.

అవ. ఓయీ! ప్రత్యగాత్మపరమాత్మలకు స్వతః భేదము కలిగియున్నప్పటికి అభేదసంపాదనార్థమై సాధనముల నంగీకరింపవచ్చునంటే అలాగున చెప్పఁదగదని ప్రతిపాదించుచున్నారు.—

శ్లో. అన్యస్యాన్యాత్మతాప్రాప్తౌ న క్వచిద్ధేతుసంభవః,
తస్మిన్ సత్యపి నానష్టః పరాత్మానం ప్రపద్యతే. ౭౧. ౧౮౧

ట౦-అ. ఒకవస్తువు మఱియొకవస్తువుయొక్క తాదాత్మ్యమును బొందుటయందు ఎచ్చటను కారణము సంభవించదు. ఆవస్తువు ఉండగా దానికి అన్యవస్తుతాదాత్మ్యము సంభవించదు. తాను నశించినవస్తువు అన్యవస్తుస్వరూపమును బొందనేరదు.

తా. "మిథ్యైత దన్య ద్ద్రవ్యం హి నైతి తద్ద్రవ్యతాం యతః" అనెడి ప్రమాణమునుబట్టి యోచించగా పరస్పరభిన్నమైన వస్తువులలో ఒకవస్తువు మఱియొకవస్తువుతోడి తాదాత్మ్యమును ఎప్పటికిని పొందదు; గనుక అట్టి తాదాత్మ్యప్రాప్తిసాధనము ఎచ్చటను సంభవించదు. అనఁగా ఒకవస్తువును మఱియొకవస్తువునుగాఁ జేయుసాధనము ఈలోకములో లేదని యర్థము. ఒకవస్తువు మఱియొకవస్తువుయొక్క తాదాత్మ్యమును బొందునప్పుడు ఆవస్తువు ఉండగానే అన్యవస్తుతాదాత్మ్యము కలుగునని చెప్పుట విరుద్ధము. ఆవస్తువు నశించిన పిదప అన్యవస్తుతాదాత్మ్యము దేనికి గలుగును? కనుక ఒకవస్తువునకు మఱియొకవస్తువుయొక్క తాదాత్మ్యమును సంపాదించెడి సాధనము లేదని భావము. ఒకవస్తువు మఱియొకవస్తువుయొక్క తాదాత్మ్యమును బొందదు గనుక ఘర

మాత్మ జీవాత్మలు స్వతః భిన్నులనిచెప్పి వారికి తాదాత్మ్యము కలదని చెప్పుట అబద్ధమని ప్రమాణవచనమున కర్థము.

అవ. ఓయీ! పరమాత్మ సంసారదశయందుగూడ ప్రత్యగాత్మకంటె భిన్నాభిన్నమై యుండునుగాని, కేవలభిన్నముగానైనను, కేవలాభిన్నముగానైనను, ఉండదు గనుక పూర్వోక్తదోషములు సంభవించవని మఱికొందఱు భేదాభేదవాదులు నిరూపించగా ఆపక్షమును దూషించుచున్నారు.—

వాక్య. అపరస్మిꣳ స్తు పక్షే విధిః. ౧౮౨

దం-అ. మఱియొకపక్షమందు సమాధానము (దూషణము) చెప్పఁబడును.

తా. పరమాత్మ సంసారదశయందున్న ప్రత్యగాత్మతోటి భేదాభేదోభయ రూపమున నుండునని చెప్పెడివారిపక్షమందు దూషణము చెప్పఁబడునని భావము.

అవ. ఏమిదూషణము చెప్పఁబడునంటే, దానిని శ్లోకరూపముతో చెప్పుచున్నారు.—

శ్లో. పరమాత్మానుకూలేన జ్ఞానాభ్యాసేన దుఃఖినః,
ద్వైతినోఽపి విముచ్యేరన్న పరాత్మవిరోధినా. ౭౨. ౧౮౩

దం-అ. పరబ్రహ్మకు అనుకూలమైన ఉపాసనముచేతనే దుఃఖవంతులైన భేదవాదులున్ను ముక్తులవుదురుగాని పరమాత్మకు విరుద్ధమైన ఉపాసనచేత ముక్తులు కానేరరు.

తా. సంసారదుఃఖము ననుభవించుచున్న భేదాభేదవాదులున్ను 'దేవోభూత్వా దేవానప్యేతి' యనెడిశ్రుతినిబట్టి పరమాత్మకు అనుకూలమైన అనఁగా పరమాత్మయొక్క అభేదాంశము నవలంబించియున్న "అహం బ్రహ్మాస్మి" యనెడి అభేదోపాసనము చేతనే ముక్తికలుగుచున్నదని చెప్పుచున్నారుగాని, పరమాత్మయొక్క భేదాంశము నవలంబించియున్న కర్మభేదోపాసనముచేతనే ముక్తి కలుగునని చెప్పరు. కనుక ఉపాసనమే మోక్షసాధనమని యంగీకరించవలయునుగాని కర్మ మోక్షసాధనమని యంగీకరించఁదగదని భావము. ఇదిగాక భేదాభేదవాదిపక్షమున పరమాత్మభిన్నమైకదా ఉన్నది. అప్పుడు పరమాత్మయొక్క భేదాభేదాంశములను రెంటిని అవలంబించియున్న ఉపాసనముచేత ముక్తిగలుగవలయుననికాని 'అహం బ్రహ్మాస్మి" యనెడి కేవలాభేదోపాసనమున్ను, కేవలభేదోపాసనమున్ను భిన్నాభిన్నస్వరూపముగా నున్నపరమాత్మకు విరుద్ధముగా నున్నందున దానిచేత ముక్తి కలుగదు. వేదశాస్త్రములయందు కర్మరూపమైన భేదోపాసనమున్ను జ్ఞానరూపమైన అభేదోపాసనమున్ను రెండే కలవుకాని భేదాభేద

ములను రెంటిని అవలంబించియున్న ఉపాసనము కానంబడదు. అభేదము నవలంబించినజ్ఞానమున్ను, భేదము నవలంబించిన కర్మమున్ను చేర్చి యనుష్ఠించిన మోక్షముకలుగునని చెప్పెదమంటిరా కర్మజ్ఞానములకు సముచ్చయము కలుగదని యదివరకే విస్తారముగ నిరూపించియున్నారము. గనుక భేదాభేదవాదిపక్షమునందు మోక్షసాధనమే దుస్సంపాదనమై యున్నదని తాత్పర్యము.

అవ. ఓయీ! బ్రహ్మతోఁటి జీవునికి అభేదమే చెప్పెదము. అందువలన ప్రస్తుత దోషములు పరిహరింపఁబడునని యంటివేని కేవలాభేదమునే చెప్పెడియెడల జ్ఞానవిధిగాని కర్మవిధిగాని సంభవించదని చెప్పుచున్నారు.—

వాక్య. ఇతరస్మిం తు పక్షే విధే రేవానవకాశత్వం కథమ్. ౧౫౪

దం-అ. మఱియొకపక్షమునందు విధికి అవకాశమే లేదు అనుట యెట్లు?

తా. బ్రహ్మ భిన్నాభిన్నమైనప్పటికి జీవుఁడు బ్రహ్మతోఁటి కేవలాభిన్నుఁడేయని కొందఱు చెప్పెదరు. వారిపక్షమందు కర్మయందుగాని ఉపాసనయందుగాని విధి సంభవింపనే సంభవింపదని భావము.

అవ. ఏలాగున సంభవింపదంటే ప్రశ్నపూర్వకముగా చెప్పుచున్నారు.—

శ్లో. సమస్తవ్యస్తభూతస్య బ్రహ్మణ్యేవావతిష్ఠతః,
బ్రూత కర్మణి కో హేతు సర్వానన్యత్వదర్శినః. ౭౨. ౧౫౫

దం-అ. ఏలాగంటే భిన్నాభిన్నస్వరూపుఁడైన బ్రహ్మయందే నిష్ఠగలిగియుండి సర్వపదార్థములను తనకంటె అభిన్నముగాఁ జూచుచున్నవానికి కర్మయందు నిమిత్తమేమి కలదో చెప్పుదురుగాక.

తా. జీవుఁడు సంసారదశయందు బ్రహ్మతోఁటి భేదాభేదములుకలవాఁడై యున్నప్పటికి శాస్త్రవిచారముచేత బ్రహ్మస్వరూపము నెఱింగి బ్రహ్మస్వరూపమే తానని నిశ్చయముకలవాఁడై సర్వప్రపంచము బ్రహ్మస్వరూపమేయని తలఁచునప్పుడు బ్రాహ్మణత్వాది సర్వకర్మాధికారత్వశూన్యమగు పరమాత్మస్వరూపమే తానైయున్నందున ఉపాసనమని చెప్పఁబడెడి మానసకర్మయందుగాని కర్మయని చెప్పఁబడెడి బాహ్యకర్మయందుగాని ప్రవర్తించుటకు నిమిత్తము లేదని భావము.

అవ. అనేకరూపమైన బ్రహ్మయందు జీవునికి కేవలాభేదమే కలదని చెప్పెడివాదిపక్షమునందు మఱియొకదూషణము కలదని చెప్పుచున్నారు.

వాక్య. సర్వకర్మనిమిత్తసంభవాసంభవాభ్యాం సర్వకర్మసంకరశ్చ ప్రాప్నోతి యస్మాత్. ౧౫౬

దం-అ. సర్వకర్మలయొక్క నిమిత్తములు సంభవించుటవలనను సంభవింపక పోవుటవలనను సర్వకర్మలకు సంకరమున్ను సంభవించుచున్నది.

తా. జీవులు పరమాత్మకంటె కేవలభిన్నులని యెవరు చెప్పుచున్నారో, వారిపక్షములో బ్రాహ్మణుఁడు బృహస్పతిసవనము చేయవలయునని, క్షత్రియుఁడు రాజసూయము చేయవలయునని, వైశ్యుఁడు వైశ్యస్తోమము చేయవలయునని విధించబడినకర్మలు అసంకీర్ణములై వ్యవస్థితములై యుండును. జీవులు పరమాత్మకంటె అభిన్నులే కాని భిన్నులు కారని ఎవరు చెప్పెదరో వారిపక్షమునందు జీవులందఱు సర్వాత్మకమైన బ్రహ్మతోఁటి అభిన్నులైయున్నందున సర్వాత్మకులై యుందురుగనుక బ్రాహ్మణునియందు క్షత్రియత్వము, క్షత్రియునియందు బ్రాహ్మణత్వము, ఈప్రకారమే అందఱియందు దన్నివర్ణాశ్రమాదివిశేషములు కలిగియున్నందున అందఱు జీవులు నియమము లేకుండా అన్నికర్మలను ఆచరించవచ్చును గనుక సర్వకర్మలకు సంకరము కలుగునని భావము.

అవ. చెప్పినదూషణమునే వివరించుచున్నారు.—

శ్లో. సర్వజాత్యాదిమత్త్వేఽస్య నితరాం హేత్వసంభవః,
విశేషం హ్యనుపాదాయ కర్మ నైవ ప్రవర్తతే. ౭౮. ౧౮౭

దం-అ. ఈజీవునకు సకలమైనజాతి మొదలగు ధర్మములు కలిగియుండెనేని బొత్తిగా నిమిత్తము సంభవింపదు. విశేషమును గ్రహించకయే కర్మ ప్రవర్తించనే ప్రవర్తించదుగదా?

తా. తత్త్వజ్ఞానముగలపురుషుఁడు సర్వాత్మకబ్రహ్మస్వరూపాభిన్నుఁడై యున్నందున సర్వాత్మకుఁడైయుండును. అందువలన బ్రాహ్మణత్వాదిజాతులన్నియును, బ్రహ్మచర్యాద్యాశ్రమములన్నియును నాతత్త్వవేత్తయందు గలిగియుండును గనుక బ్రహ్మవేత్త యావత్కర్మలను చేయవలసియుండును గాని ఒక్కొక్కకర్మనుమాత్రము చేయవలసినటుల కనుపడదు. కర్మవిధులు బ్రాహ్మణత్వాదిధర్మములలో నొక్కొక్కవిశేషము నవలంబించి ప్రవర్తించినవి గాని సర్వధర్మసముదాయము నవలంబించి ప్రవర్తించలేదు. కర్మప్రవృత్తినిమిత్తంబైన బ్రాహ్మణత్వాదివిశేషము సర్వాత్మకబ్రహ్మస్వరూపాభిన్నుఁడైనందున సకలజాత్యాదిధర్మములుగల తత్త్వవేత్తయందు సంభవించదు అని భావము.

అవ. ఓయీ! సర్వాత్మకబ్రహ్మతోఁటి జీవునకు భేదము కలదు గాని, అయినను నేను బ్రాహ్మణుఁడను నేను క్షత్రియుఁడ నను జాత్యాదిధర్మవిశిష్టమైన స్థూలదేహమునందభిమానము కలిగియున్నందున భేదమున్ను కలదు. అందువలన అధికారిభేదమునుబట్టి

కర్మభేదము కలిగియుండును గనుక సర్వకర్మసాంకర్యము సంభవించదని పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. స్యాద్విధి రధ్యాత్మాభిమానాత్. ౧౮౮

దం-అ. శరీరమునందు అభిమానము కలిగియున్నందున కర్మవిధి ప్రవర్తించును.

తా. స్పష్టము.

అవ. సిద్ధాంతపరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. ఇతి చే న్నైవమ్. ౧౮౯

దం-అ. ఈలాగని చెప్పితే యాలాగున ననగూడదు.

వాక్య. యస్మాత్. ౧౯౦

దం-అ ఎందువల్లనంటే చెప్పుచున్నాము.—

శ్లో. న చాధ్యాత్మాభిమానోఽపి విదుషోఽస్త్యాసురత్వతః
విదుషోఽప్యాసుర శ్చేత్ స్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్. ౭౫. ౧౯౧

దం-అ. తత్త్వవేత్తకు దేహాభిమానము అసురసంబంధమైనందున సంభవింపదు. తత్త్వవేత్తకు కూడా అసురసంబంధమైన దేహాభిమానము కలిగియుండెనేని బ్రహ్మసాక్షాత్కారము వ్యర్థము.

తా. తత్త్వజ్ఞానముచేత అసురసంబంధమైన అజ్ఞానమున్ను తజ్జన్యమైన దేహాత్మాభిమానమున్ను నశించినందున తత్త్వవేత్తకు దేహాభిమానము జనించదు. కనుక ప్రతినియతకర్మాధికారము సంభవించదు. కర్మాధికారము సిద్ధించెడికొఱకు తత్త్వవేత్తకు కూడా అజ్ఞానము అనువర్తించియుండునని అంగీకరించితిరేని తత్త్వవేత్తకు కలిగిన బ్రహ్మజ్ఞానము వ్యర్థమని చెప్పవలయును. ఎందువల్లనంటే తత్త్వజ్ఞానముయొక్క స్వభావము అజ్ఞానమును నివర్తింపఁజేయునట్టిదిగదా? అట్టి తత్త్వజ్ఞానము పుట్టినప్పటికి అజ్ఞానము నశింపనియెడల తత్త్వజ్ఞానము నిరర్థకమనుట నిశ్చయము గనుక తత్త్వవేత్తకు అజ్ఞానముగాని తజ్జన్యమైన దేహాభిమానముగాని లేవు గావున ప్రతినియతకర్మాధికారమున్ను లేదు. అందువల్లనే సర్వకర్మసాంకర్యము సంభవించునని భావము.

అవ. గతించినయర్థమును అనువదించుచు నుత్తరశ్లోకమునకు సంగతిని చేయుచున్నారు.

వాక్య. అజ్ఞానకార్యత్వాత్త్వేపిచ్చ న సమకాలం నాపి క్రమేణ జ్ఞానకర్మణో ర్వస్తుస్వవస్తుతంత్రత్వాత్సంగతి రస్తీత్యేవం నిరాకృతోఽపి కాశం కుశం వాఽవలంబ్యాహ. ౧౯౨

దం-అ. జ్ఞానకర్మలకు రెంటికిని అజ్ఞానమువల్ల జన్మించుట కలిగియున్నప్పటికి పరమార్థవస్తువున కధీనమైయుండుటయును కలిగియున్నందున ఏకకాలముగా గాని క్రమముగాగాని సముచ్చయము లేదని నిరాకరింపఁబడినవాఁడైనప్పటికి రెల్లునుగాని దర్భనుగాని అవలంబించి (పట్టుకొని) చెప్పుచున్నాఁడు.

తా. బ్రహ్మాకారాకారితాంతఃకరణవృత్తిజ్ఞానమనిన్ని యాగదానాదికము కర్మయనిన్ని పూర్వమే చెప్పియున్నారము. ఇట్టి జ్ఞానకర్మలు రెండున్ను అజ్ఞానముచేతపుట్టినవైనప్పటికిని జ్ఞానము పరమార్థమైన ఆత్మను అవలంబించియున్నందువల్లను, కర్మ పరమార్థమైన భేదమును అవలంబించియున్నందునను ఈరెంటికి సమప్రధానసముచ్చయముగాని అంగాంగీభావసముచ్చయముగాని సంభవింపదని ఇదివఱకు నిరాకరించితిమి. ఈప్రకారము నిరసించినవాడైనప్పటికి పూర్వపక్షవాది యుక్త్యంతరము లేనందున కాశకుశావలంబన న్యాయముగా తిరిగి యాక్షేపించుచున్నాడని భావము. నదీప్రవాహములోఁబడిన పురుషుఁడు ఆప్రవాహమును దాటుటకుఁ దగినసాధనము దొరకనందున ప్రవాహములోఁబడి వచ్చుచున్న రెల్లుదుబ్బునుగాని కుశదుబ్బునుగాని అవలంబించును. అది నదీప్రవాహమును దాటించజాలనందున నిరర్థకమైయుండును. ఇదియే కాశకుశావలంబనన్యాయము. ఈప్రకారము ప్రకృతమందుపూర్వపక్షవాదిజ్ఞానకర్మసముచ్చయవాదమునునిర్వహించుటకుగాను ప్రబలయుక్తులు లేనందున దుర్బలమైనయుక్తిని గ్రహించుచున్నాఁడు. ఈయుక్తి జ్ఞానకర్మసముచ్చయవాదమును నిర్వహించలేనందున నిరర్థకమైయుండును.

అవ. శ్లోకములోని మొదటిపాదములో పూర్వపక్షవాదియొక్క ఆక్షేపమును కనుపఱిచి మిగిలిన మూఁడుపాదములలో సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.

శ్లో. అథాధ్యాత్మం పునర్యాయా దాశ్రితో మూఢతాం భజేత్
స కరోత్యేవ కర్మాణి కో హ్యజ్ఞం వినివారయేత్. ౭౬ ౧౬౩

దం-అ. దేహాభిమానమును తిరిగి పొందెనేని అజ్ఞానము నాశ్రయించినవాఁడగును. వాఁడు కర్మలను చేయనేచేయును. అజ్ఞానిని ఎవఁడు నివారించును?

తా. నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడను అనే దేహాభిమానము తత్త్వజ్ఞానికిన్ని అనుభవసిద్ధమైయున్నది గనుక అనుభవసిద్ధమైన దేహాభిమానము లేదని యుక్తిచే నిరాకరింపఁదగదు. కావున తత్త్వజ్ఞానికిగూడా దేహాభిమానము కలదు. అందుచేతనే ప్రతినియతకర్మాధికారమున్ను కలదని పూర్వపక్షవాది యాక్షేపించఁగా సిద్ధాంతవాది సమాధానమును చెప్పుచున్నారు. తత్వజ్ఞానికిని దేహాభిమానమే యున్నయెడల వాఁడు

తత్త్వజ్ఞానము కలవాఁడే కాఁడు. అజ్ఞానము నాశ్రయించియున్నవాఁడనే తలఁచవలయును. మేము తత్త్వజ్ఞానికి కర్మసంబంధములేదని చెప్పుచున్నారముగాని అజ్ఞానికికర్మసంబంధములేదని చెప్పినవారము కాము. అజ్ఞాని కర్మలనుచేసితే చేయునుగాక! నీవున్ను దేహాభిమానముగల అజ్ఞానికే కర్మసంబంధముకలదని చెప్పుచున్నావుగాని జ్ఞానికి చెప్పినవాఁడవు కావు. అందుచేత ఏమిన్ని హానిలేదని భావము, దేహాభిమానముకలవానియందు కనుపడుచున్నజ్ఞానము అభావజ్ఞానమేకాని తత్త్వజ్ఞానముకాదు. తత్త్వజ్ఞానికి దేహాద్యభిమానము లేశమైన నుండదని తాత్పర్యము.

అవ. తత్త్వజ్ఞానికి కర్మ సంభవింపదనెడి అర్థమునందు మఱియొకయుక్తిని చెప్పుచున్నారు.—

వాక్య. సిద్ధత్వాచ్చ న సాధ్యం యతః. ౧౯౪

దం-అ. సిద్ధమైనందున సాధ్యముకాదు.

తా. కర్మ యనునది తత్త్వవేత్తయొక్క స్వరూపమైనందున సిద్ధరూపముగానున్నది గనుక అనుష్ఠానముచేత సాధింపఁదగినదికాదు అని భావము.

అవ. ఎందువల్ల సాధింపదగినది కాదంటే శ్లోకములో వివరించుచున్నారు—

శ్లో. సామాన్యేతరరూపాభ్యాం కర్మాత్మైవాస్య యోగినః,
నిఃశ్వాసోచ్ఛ్వాసవత్తస్మాన్న నియోగ మపేక్షతే. ౭౭. ౧౯౫

దం-అ. ఈజ్ఞానికి కర్మసామాన్యాకారవిశేషాకారములచేత ఆత్మస్వరూపముగనే యున్నది. ఆహేతువువలన ఉచ్ఛ్వాసనిశ్వాసములవలె విధిని అపేక్షింపఁడు.

తా. ఈలోకములోనివస్తువులలో కొన్ని సామాన్యరూపముగాను మఱికొన్ని విశేషరూపముగా నుండును. సామాన్యవిశేషములలోఁ జేరక వేరుగా నుండుపదార్థమే లేదు. కర్మయున్ను సామాన్యములోగాని విశేషములోఁగాని అంతర్భవించియుండును. 'సర్వంఖల్విదం బ్రహ్మ; యదస్తి యన్నాస్తి చ విప్రవర్య' ఇత్యాదిప్రమాణములవలన సామాన్యవిశేషపదార్థములు యావత్తు బ్రహ్మస్వరూపముగానే యున్నందున కర్మయున్ను బ్రహ్మస్వరూపమే. తత్త్వవేత్తయున్ను బ్రహ్మస్వరూపుఁడే. అయినందున కర్మయున్ను తత్త్వజ్ఞానికి స్వరూపమైయున్నందున సిద్ధముగానిసాధ్యము కాదు గావున విధిని అపేక్షింపదు. అయితే తత్త్వజ్ఞానియున్ను విహితకృత్యములయందు ప్రవర్తించుచు నిషిద్ధకృత్యములయందు వర్తించుచున్నట్టు చూచుచున్నాను, దీనికి కారణమేమనగా తత్త్వజ్ఞానియొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములకు స్వభావము కారణమైనటుల ప్రవృత్తినివృత్తులకున్ను స్వభావమే కారణముగాని విధి కారణము గాదు. అని భావము. ఈకనుపడెడిప్రపంచము

యావత్తు బ్రహ్మమేకదా? ఏదికలదో ఏదిలేదో అదియంతయును పరమాత్మస్వరూపమే యగును. అనఁగా ఏది విశేషపదార్థమో, ఏది సామాన్యపదార్థమో అదియంతయుం భగవత్స్వరూప మనియే అర్థము.

అవ. ఈప్రకారముగా అభేదవాదమును నిరాకరించగా, బ్రహ్మస్వరూపము సర్వదా భేదాభేదోభయరూపమై యుండుననని భేదాభేదవాది నిరూపించుచున్నాఁడు.—

వాక్య. అస్తు తర్హి భిన్నాభిన్నాత్మకం బ్రహ్మ. తథాచ జ్ఞానకర్మణీ సంభవతః. భేదాభేదవిషయత్వాత్తయోః. ౧౯౬

పం-అ. అయితే బ్రహ్మస్వరూపము భేదాభేదోభయరూప మగుఁగాక. ఆలాగున చెప్పితే అజ్ఞానకర్మలకు రెంటికిని భేదాభేదావలంబనము కలిగియున్నందున జ్ఞానకర్మలు రెండును సంభవించును.

తా. బ్రహ్మస్వరూపము భేదాభేదోభయరూపమై యున్నదిగాని, కేవలాభేదరూపమైగాని కేవలభేదరూపమైగాని యుండలేదు. ఎందువల్లనంటే తత్త్వమస్యాదివాక్యములచేత 'అహం బ్రహ్మాస్మి' యనెడి అభేదజ్ఞానము మోక్షసాధనమని చెప్పఁబడుచున్నది. ఇట్టి అభేదజ్ఞానము బ్రహ్మయందభిన్నత్వము లేనియెడల శాస్త్రములచేత నుపదేశింపఁబడదు. కర్తృకరణాద్యనేకకారక (సాధన) ములచేత సాధింపఁదగినకర్మయున్ను 'వసంతే వసంతే జ్యోతిషా యజేత్యాది' వాక్యములచేత ప్రతిపాదింపఁబడుచున్నది. ఇట్టి భేదాశ్రయమైన కర్మ బ్రహ్మమందు భిన్నత్వము లేనియెడల ఉపదేశింపఁబడదు. ఆ భేదాశ్రయమైనజ్ఞానమున్ను భేదాశ్రయమైనకర్మయున్ను వేదవాక్యములయందు ప్రతిపాదింపఁబడుచున్నందున బ్రహ్మమున్ను భిన్నాభిన్నోభయరూపమని నిశ్చయింపవలయును గనుక జ్ఞానకర్మలకు సముచ్చయము చెప్పఁదగియున్నది అని భావము.

అవ. ఈభేదాభేదవాదియుక్తపక్షమును సిద్ధాంతవాది నిరసించుచున్నారు.—

వాక్య. అత్ర తావదనయో రేకత్ర న సంభవతి. ౧౯౭

పం-అ. అందులో నిప్పుడు అపృష్టమే సంభవింపదు.

తా. బ్రహ్మయందు భేదాభేదములు సంభవించునా సంభవించవా యని పిదప విచారించెదము. లోకములో గూడా భేదాభేదములు రెండు నొకపదార్థమునందు సంభవించవని భావము.

అవ. భేదాభేదవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కిం కారణమ్?

దం-అ. ఏమి కారణము?

తా. లోకములోగూడ నొకపదార్థమునందు భేదాభేదములు రెండు సంభవించవని చెప్పుట కేమికారణము? ఘటపటాదిపదార్థముల యన్నింటియందున్ను భేదాభేదములు రెండు ప్రత్యక్షముచేతనే తెలియఁబడుచున్నవిగదా? యెటువలెనంటె, పటము శుక్లము. ద్రవ్యమైనపటము గుణమైన శుక్లత్వమున్ను, ఘటము మృత్తు అనెడిస్థలమందు కార్యమైనఘటము కారణమైనమృత్తికయున్ను, ఘటము సత్తు అని స్థలమందు విశేషమైన ఘటమున్ను, సామాన్యమైనసత్తయున్ను, సమానాధికరణముగా ప్రయోగింపఁబడుచున్నందున పటత్వ శుక్లత్వములకుమృద్ఘటములకు సత్తాఘటములకున్ను భేదాభేదము కలిగియున్నది. వీటికి కేవలభేదమే కలదని చెప్పెడియెడల, అశ్వమహిషములకు వలె సమానాధికరణప్రయోగమున్ను ఏకకాలీనోపలంభమున్ను లేకపోవలయును. అశ్వమహిషములకు కేవలభేదమే కలిగియున్నందున అశ్వము మహిషము అని సమానాధికరణప్రయోగముగాని అశ్వమహిషము లేకకాలమునందే కనుపడుటగాని లేకయున్నది. కేవలాభేదమే చెప్పెడియెడల పటశుక్లాదిశబ్దములు ఏకార్థములైనందున ఘటకుంభశబ్దములకువలె సమానాధికరణప్రయోగము లేకపోవలయును. ఘటము కుంభము అని సమానాధికరణప్రయోగము లేదు గదా. ద్రవ్యగుణములకు, కార్య-కారణములకు సామాన్య-విశేషములకున్ను, సామానాధికరణ్యము కనుపడుచున్నందున వీటికి భేదాభేదోభయరూపములు కలవని నిశ్చయింపఁదగియున్నది. గనుక లోకములోని పదార్థములు కూడ భేదాభేదోభయరూపములు కలవని నిశ్చయింపఁదగియున్నది గనుక లోకములోని పదార్థములనుగూడ భేదాభేదోభయరూపము లేదని చెప్పుట న్యాయము కాదని భావము.

అవ. ఈశంకకు పరిహారమును సిద్ధాంతవాది చెప్పుచున్నారు.

వాక్య. నహి భిన్నోఽయమిత్యభేదబుద్ధి మనిరాకృత్య భేద
బుద్ధిః పదార్థమాలింగతే. ఏవం హ్యనభ్యుపగమే
భిన్నాభిన్నపదార్థయోరలౌకికత్వం ప్రసజ్యేత. ౯౯

దం-అ. ఇది భిన్నమైనది కాదనెడి య భేదబుద్ధి తొలఁగితేనే కాని, భేదబుద్ధి దార్థమునందుఁ గలుగదుగదా. ఈలాగున అంగీకరించనియెడల భిన్నాభిన్నపదార్థములకు అలౌకికత్వము (అప్రామాణికత్వము) ప్రసక్తమగును.

తా. భేదాభేదము లోకపదార్థమునందు కలవని చెప్పెడి పూర్వపక్షవాదియొక్క అభిప్రాయమును విచారించెదము. అభేదము అనఁగా భేదముయొక్క అభావమా?

లేక, భేదమునకు విరోధిపదార్థమా? లేక భేదమునకంటె అన్యమైనపదార్థమా? భేదము యొక్క- అభావమంటిరా? భేదమున్ను తదభావమున్ను ఒకచోట నుండ నేరవు. భేదమునకు విరోధియంటిరా తేజస్తిమిరములవలె పరస్పరవిరుద్ధములైన భేదాభేదము లొకచోట నేలాగున నుండగలవు? భేదముకంటె అన్యమే అభేదమంటిరా రూపరస గంధాదులున్ను భేదముకంటె అన్యములైనందునఅవికూడ అభేదవ్యవహారయోగ్యములు కావలసియుండును. ఎచ్చట అభేదబుద్ధియుండునో అచ్చట భేదబుద్ధియుండదు. భేదాభేదములు పరస్పరబాధకములు గానుండ నొకపదార్థమునందు నుండనేరవు. ఈలాగున అంగీకరించనియెడల భేదాభేదములతోఁగూడియున్న పదార్థము ఈలోకమునందు ఏప్రమాణమునకు గోచరించనందున అప్రమాణికమని చెప్పవలయును. ద్రవ్యగుణాదుల యందు భేదాభేదములున్నందున సామానాధికరణ్యము కలిగినదని చెప్పుట అయుక్తము. 'సోఽయం దేవదత్తః' (ఆ దేవదత్తుఁడే యీదేవదత్తుఁడు) అనెడుస్థలమునందు దేవదత్తుని యందు అభేదముమాత్రము కలదుగాని భేదముకూడ లేదు. అయినను దేశకాలాది సంబంధముచేత భేదమును కల్పించుకొని సామానాధికరణ్యము ప్రవర్తించినది. ఆప్రకారమే ద్రవ్యగుణాదులయందును అభేదమేగాని భేదము లేదు. అయినను కల్పితభేదము నవలంబించి సామానాధికరణ్యము ప్రవర్తించినది. కనుక భేదాభేదములు రెండు పరమార్థరూపముగా నొకవస్తువునం దుండనేరవని భావము. ద్రవ్యగుణాదులయందు భేదమేగాని భేదము లేదనే విషయము శారీరకభాష్యము ౨ అధ్యాయము, ౨ పాదములో 'అప్రగ్రహాత్వంతమనపేక్షాయనే' అనుసూత్రములో విస్తారముగా ప్రతిపాదింపఁబడియున్నది. అది నిండ కఠినమైనందునను గ్రంథవిస్తరభీతిచే నిచ్చట వివరింపఁబడలేదు.

అవ. లోకములో ద్రవ్యగుణాదులయందు భేదాభేదములు సంభవించితే సంభవించునుగాక! పరబ్రహ్మయందుమాత్రము భిన్నాభిన్నోభయరూపత్వము సుతరాం (ఖండితముగా) సంభవించదని చెప్పుచున్నారు.

నాప్యస్తి నిష్ప్రమాణకమాశ్రీయతే తదప్యస్తి యది ద్వయోరపి పక్షయోర్దుఃఖం బ్రహ్మణః స్యాత్. ౨౦౦

౨౦-౫. అయినను ప్రమాణరహితమైన యర్థము ఆశ్రయింపఁబడెనేని అప్పుడున్ను భేదాభేదపక్షములను రెంటిని అంగీకరించినందున అభిన్నమను పక్షమునందు బ్రహ్మస్వరూపము దుఃఖములు కలది అగును.

తా. భిన్నాభిన్నోభయరూపమైనవస్తువు లోకములోనే లేదు. అయినను లోకములో కలదని అంగీకరించినను పరమాత్మ భిన్నాభిన్నోభయరూపమని చెప్పుటకు

ప్రమాణమే లేదు. శ్రుతియం దెచ్చటనైనను బ్రహ్మ భిన్నాభిన్నమని చెప్పినది చెప్పకపోయినను బ్రహ్మ భిన్నాభిన్నమని ఆప్రమాణముగ నంగీకరించితివా? బ్రహ్మ ప్రత్యగాత్మకంటె అభిన్నుఁడైనందున ప్రత్యగాత్మయొక్క దుఃఖమువలన యున్న దుఃఖములు కలవాఁ డగునని భావము.

అవ. ఈయర్థమును శ్లోకముతో వివరించుచు పూర్వపక్షవాదిని పరిహసిం నవతారికను చేయుచున్నారు.—

వాక్య. అత ఆహ.

దం-అ. ఆహేతువువలన నిట్లు చెప్పుచున్నారు.

తా. భిన్నాభిన్నవాదములో బ్రహ్మ అభేదాంశమునుబట్టి ప్రత్యగాత్మ దుఃఖములు కలవాఁడై యుండునుగనుక యీముందు చెప్పఁబోయెడు అర్థమును చున్నాము.

శ్లో. భిన్నాభిన్నం విశేషైశ్చే ద్దుఃఖి స్యా ద్బ్రహ్మ తే ధ్రువమ్,
అశేషదుఃఖితా చ స్యా దహో ప్రజ్ఞాత్వవాదినామ్. ౭౯

దం-అ. విశేషములతోటి సామాన్యములతోటి బ్రహ్మ భిన్నాభిన్నమే పక్షమునకు బ్రహ్మ దుఃఖములు గలవాఁడగును. ఇది వాస్తవము. ఇదిగాక సక యొక్క దుఃఖములు కలిగియుండుటయును సంభవించును. ఆత్మవాదులైన మీరె బుద్ధివిశేషము నిండా ఆశ్చర్యమైనది.

తా. ఈలోకములోనున్న విశేషపదార్థములతోటి సామాన్యపదార్థము బ్రహ్మకు అన్నిటితోటిన్ని బ్రహ్మకు భేదము అభేదమున్ను పరమార్థముగా గలవ చెప్పుచున్నావు. అప్పుడు ప్రత్యగాత్మతోటి అభిన్నమైయున్నందున బ్రహ్మ ప్రత్యగాత్మయొక్క దుఃఖములు యావత్తు కలదైయుండును, ఇదిగాక బ్రహ్మ త్యగాత్మయొక్క దుఃఖములు కలది గాదు. సర్వప్రత్యగాత్మలతోటి అభిన్నమైం దున సర్వప్రత్యగాత్మల సకలవిధమైన దుఃఖపుంజముకలదై యుండును. అం మోక్షసాధనముల ననుష్ఠించుపురుషుఁడు అంతకుముందు స్వకీయమైన దుఃఖ త్రము కలవాఁడైయుండి మోక్షమును బొందినపిదప బ్రహ్మతాదాత్మ్యమును బొంది సకలప్రత్యగాత్మలయొక్క అశేషదుఃఖములుకలవాఁడై యుండును. గనుక భే వాదియొక్కపక్షమునందు మోక్షముకంటె సంసారమే మంచిదిగానున్నది. ఆన నందస్వరూపుఁడని సకలవేదాంతములయందు ఘోషింపఁబడుచున్న పరమాత్మ దుఃఖసంబంధమును ప్రతిపాదించుచున్న భేదాభేదవాదులయొక్క ప్రజ్ఞ యెం

నీయమైయున్నదో పండితులైనవారు పరీక్షింపుడని భావము. ౭౨-వ శ్లోకములో భేదాభేదవాదనిరాకరణము జ్ఞానకర్మసముచ్చయమును నిరాకరించెడికొఱకు చేయఁబడినది. ఇచ్చట భేదాభేదముల కొకచోట సంగతి కలుగదని భేదాభేదవాదస్వరూపమే స్వతంత్రముగా నిరాకరింపఁబడినది. గనుక పౌనరుక్త్యములేదు. ఈభేదాభేదవాదులు సర్వపదార్థముల నైకాంతికములని ఒకవిధమైన స్వభావము వేటియందున్నలేదని చెప్పుచున్నజైనమతములోఁ జేరఁదగినవారై యున్నారు. గనుక జైనగంధివేదాంతు లని చెప్పఁదగియున్నారు.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. తస్మాత్సమ్యగేవాభిహితం జ్ఞానకర్మణోః న సముచ్చ
య ఇత్యుపసంహ్రియతే. ౨౦౩

దం-అ. ఆకారణమువలన జ్ఞానకర్మలకు సాంగత్యము లేదని సమీచీనముగానే చెప్పఁబడిన దని నిగమింపఁబడినది.

తా. భేదాభేదవాదమే అప్రమాణికమైనందున ఆ భేదాభేదవాదులచేఁ జెప్పఁబడిన జ్ఞానకర్మసముచ్చయవాదమున్ను యుక్తముగా నుండలేదని మేము చెప్పినది సరిగా నున్నదని సిద్ధాంతవాది జ్ఞానకర్మసముచ్చయవాదనిరాసమును సమాప్తినొందించుచున్నారని భావము.

శ్లో. తమోంగత్వం యథా భానో రగ్నేః శీతాంగతా యథా,
వారిణశ్శోష్ణతాయద్వద్జ్ఞాన స్యైవం క్రియాంగతా. ౭౫. ౨౦౪

దం-అ. సూర్యునకు అంధకారము అంగముగానుండుట ఎటువలెనో, వహ్నికి చల్లదనమంగముగానుండుట ఎటువలెనో, జ్ఞానమునకు కర్మ అంగముగా నుండుటయును జ్ఞానము కర్మ కంగముగాఁనుండుటయు నటువలెనే సంభవించదు.

తా. పరపరస్పరవిరుద్ధములై సూర్యాంధకారములకును, వహ్నిశైత్యములకును జలౌష్ణ్యముల కంగాంగీభావము అన్యోన్యముగా లేనటుల జ్ఞానమునకును కర్మకును పరస్పరాంగీభావము లేదని భావము.

అవ. ఓయీ! కేవలకర్మలుగాని జ్ఞానసహితకర్మలుగాని మోక్షసాధనములుగావని నిరాకరించినందువలన కేవలజ్ఞానమే మోక్షసాధనమని నిశ్చయింపఁబడెనుగదా. ఉత్తరగ్రంథము ప్రవర్తించుట కేమికారణమని తటస్థపురుషుఁడు శంకింపగా ప్రమేయమును ప్రతిపాదించినప్పటికిని పూర్వపక్షవాది చెప్పిన యుక్తుల నన్నింటిని నిరాకరించనియెడల సిద్ధాంతవాది మతమువలె పూర్వవాదియొక్కమతమున్ను యుక్తియుక్తమే యగునని

మందబుద్ధిగలవారు భ్రమ నొంది పూర్వపక్షవాదిమతమును గూడా ఆదరింతురు
నిటువంటిభ్రాంతి కలుగకయుండుటకొఱకు క్రమముగా పూర్వపక్షవాదియొక్క
క్తులను నిరాకరించుట కుత్తరగ్రంథము ప్రవర్తించుచున్నది యని తటస్థపురుషుని
పరిహరించుచున్నారు.—

వాక్య. యథోక్తోపపత్తిబలే నైవ పూర్వపక్షస్యోత్సారిత
త్వాద్వక్తవ్యం నావశేషిత మిత్యతః ప్రతిపత్తికర్మ
వత్పూర్వపక్షపరిహారాయ యత్కించిద్వక్తవ్యమిత్య
త ఇద మభిధీయతే, ౨౦౫

దం-అ. ఇంతవఱకు చెప్పినయుక్తులయొక్క సామర్థ్యముచేతనే పూర్వ
నిరసించఁబడినందున యింకను చెప్పవలసినవిషయము శేషించియుండలేదు.
ణముచేతనే ప్రతిపత్తికర్మవలె పూర్వపక్షమును పరిహరించెడికొఱకు యేదైనను
ము చెప్పవలసియున్నదని యిందువలన ఉత్తరగ్రంథము చెప్పఁబడుచున్నది.

తా. ౨౪ వ శ్లోకము మొదలుకొని ౭౮ వ శ్లోకమువఱకు చెప్పినయుక్తు
జ్ఞానకర్మసముచ్చయవాదము నిశ్శేషముగా నిరాకరింపఁబడినది. కనుక నింకవి
చెప్పవలసినవిషయములేదు. అయినను పూర్వపక్షవాది చెప్పిన యావత్తుయుక్తుల
డించినఁగాని జ్ఞానకర్మసముచ్చయవాదమునందు శ్రద్ధ బుట్టకుండనుండదు. గనుక
నిమిత్తమై ప్రతిపత్తికర్మవలె పూర్వపక్షయుక్తుల నన్నిటిని నిరసించుట కారంభి
న్నారమని భావము. ఒకకర్మయందు దుపయోగింపఁబడినద్రవ్యము (వస్తువు) ఆకర
త్తినొందినపిమ్మట పరిత్యజించుట ప్రతిపత్తికర్మ యనంబడు. ఇందుకు దృష్టాంతమ
చర్వితమైన తాంబూలమును బంగారు పొందానాయందుమియుట ప్రతిపత్తిక
లోకములోని దృష్టాంతము. యాగమునందు దీక్షనొందినయజమానునకు కండూతి
రణార్థమై కృష్ణమృగవిషాణము (లేడికొమ్ము) విధింపఁబడియున్నది. యాగదీక్ష
మందు కండూతినివారణకర్మయందు దుపయోగించినకృష్ణమృగవిషాణము దీక్ష
నొందినపిదప ఉపయోగించనందున స్వతః పరిత్యజించవలసినదై యున్నది.
నను 'చాత్వాలే కృష్ణవిషాణ ముత్సృజేత్' అని చాత్వాలదేశమునందు కృష్ణ
మును విడువవలయునని నియమము విధింపఁబడియున్నది. ఇచ్చట కృష్ణమృగ
మును చాత్వాలదేశమున విసర్జించుట ప్రతిపత్తికర్మనాఁబడు. ఈప్రకారమే సి
స్థాపనార్థమై ప్రతిపాదించిన పూర్వపక్షయుక్తులకు సిద్ధాంతస్థాపనానంతరమ
త్యాగము స్వతఃప్రాప్తమై యున్నప్పటికి దూషణకథనపూర్వకముగానే పరిహరి

ప్రతిపత్తికర్మ మంటిరి యని తెలియవలయును. కృష్ణమృగవిహీనమును చాత్వాలదేశమం దే నియమముగా పరిత్యజించుటకు ఫలము అపూర్వము. ప్రకృతమందు పూర్వపక్షయుక్తులకు దూషణ కలిగినపూర్వకముగా పరిహరించుటకు ప్రయోజనము మందబుద్ధిగలవారికి పూర్వపక్షవాదిమతమునందు శ్రద్ధపుట్టకయుండుట. చాత్వాలదేశమనఁగా యాగపశువును హింసించినచోటు.—

శ్లో. "ముక్తేః క్రియాభిస్సిద్ధత్వా"దిత్యాద్యనుచితం బహు,
యదభాణి తదన్యాయ్యం యథా తదధునోచ్యతే. ౮౦. ౨౦౬

దం-అ. మోక్షము కర్మలచేతనే సిద్ధించుచున్నందున జ్ఞానముతోటి ప్రయోజనము లేదు. అని ఇదిమొదలు అనుచితమైన యనేకమును దేనినిచెప్పెనో అది యెటువలె న్యాయముకాదో అది ఇప్పుడు చెప్పఁబడును.

తా. మోక్షము నిత్యనైమిత్తికకర్మలచేతనే ప్రాప్తించును. గనుక జ్ఞానము నిరర్థకమని ఇటువంటి అనేకములైన అయుక్తములను పూర్వపక్షవాది చెప్పియున్నాఁడు. ఆవిషయములన్నియు న్యాయయుక్తములుకావని లోఁచేలాగున ప్రతిపాదించుచున్నామని భావము.

అవ. అందులో ముందుగా ౧౦-వ శ్లోకములో చెప్పినయుక్తిని అనువదించి నిరాకరించుచున్నారు.—

వాక్య. యోఽయం కామ్యానాం ప్రతిషిద్ధానాంచ త్యాగః ప్రతి
జ్ఞాయతే స ప్రతిజ్ఞాతావన్న శక్యతేఽనుష్ఠాతుమ్. ౨౦౭

దం-అ. కామ్యకర్మలయొక్క నిషిద్ధకర్మలయొక్క యే సంపరిత్యాగము ప్రతిజ్ఞ చేయఁబడినదో ఆప్రతిజ్ఞ అనుష్ఠించుటకు శక్యము కాదు.

తా. పూర్వపక్షవాది ౧౦ వ శ్లోకములో మోక్షార్థియగువాఁడు జ్యోతిష్టోమాదికామ్యకర్మలను, సురాపానాది నిషిద్ధకర్మలను పరిత్యజించవలయునని ప్రతిజ్ఞ చేసియున్నాఁడుగాని దానిని అనుష్ఠించుటకు ఎవరికిని శక్యమైయుండదు. అనఁగా నిషిద్ధకర్మలను కామ్యకర్మలను నిశ్శేషముగా విడిచియుండుటకు యెటువంటివారికి కూడ సాధ్యము కాదని భావము.

అవ. పూర్వపక్షవాది శంకించు (ప్రశ్నచేయు) చున్నాఁడు.—

వాక్యం. కిం కారణమ్? ౨౦౮

దం-అ. ఏమి కారణము?

తా. కామ్యనిషిద్ధకర్మలను నిశ్శేషముగా విడిచియుండుట శక్యముకాదంటి
యెందువలన శక్యముకాదని భావము.

అవ. సిద్ధాంతవాది ప్రతివచనమును చెప్పుచు, మోక్షేచ్ఛగలపురుషుఁడు
మోక్షేచ్ఛగలుగకముందు తాను చేసినకామ్యనిషిద్ధములను విడువవలయునా?
మోక్షేచ్ఛగలిగినపిదప కామ్యనిషిద్ధములయొక్క అనుష్ఠానమును విడువవలయునా?
వికల్పించి ఇందులో మొదటిపక్షము శక్యముకాదని చెప్పుచున్నారు.

వాక్య. కర్మణో హి నివృత్తాత్మనో ద్వాభ్యాం ప్రకారా
భ్యాం నివృత్తిస్సంభవతి ఆరబ్ధఫలస్యోపభోగేన.అనా
రబ్ధఫలస్యాశుభస్య ప్రాయశ్చిత్తై రితి. ౨౦౯

దం-అ. ఉత్పత్తినొందిన స్వరూపముగల కర్మకు రెండుప్రకారముల (విధః
చేత నివృత్తి (వినాశము) సంభవించును. ఆరంభించినఫలముగలకర్మకు అనుభ
చేతను, ఉపక్రమింపఁబడని ఫలముగలపాపకర్మకు ప్రాయశ్చిత్తములచేతనని.

తా. పురుషులయొక్క మనోవాక్కాయవ్యాపారములచేత కామ్యకర
నిషిద్ధకర్మగాని స్వరూపమును లభించును. అనఁగా జన్మించునని యర్థము, జన్మి
పిదప నాకర్మలు ఆరబ్ధఫలములని ఆనారబ్ధఫలములని రెండువిధములుగా నేర్పఁ
తమతమఫలముల నిచ్చుట కారంభించిన కర్మ ఆరబ్ధఫలములని, తమఫలముల నిచ్చ
ముందు నిచ్చుటకు కనిపెట్టుకొనియుండునవి అనారబ్ధఫలములని చెప్పఁబడును. వీ
నారబ్ధఫలకర్మలు అనుభవముచేతనే నశించునుగాని మఱియొకదానిచేత నశించవు.
రబ్ధఫలకర్మలలో పాపకర్మలు శాస్త్రోక్తకృచ్ఛ్రచాంద్రాయణాదిప్రాయశ్చిత్తము
నశించును. పుణ్యకర్మలు ఎంతకాలమునకైనను ఆరబ్ధఫలములై అనుభవముచేతనే
చును, గనుక అనుభవప్రాయశ్చిత్తము లనెడి రెండుప్రకారములుతప్ప మఱియొక
రము లేదు గావున అనుష్ఠింపఁబడిన కామ్యనిషిద్ధకర్మలను విడిచియుండుట శ
దని భావము

అవ. ఓయీ! 'క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే'
శ్రుతి జ్ఞానముచేత కూడా సర్వకర్మలకు నివృత్తిచెప్పుచుండగా, అనుభవప్రాయ
ములకంటె మఱియొకప్రకారము కర్మనివర్తకమైనది లేదని యేలాగున చెప్ప
నని పూర్వపక్షవాది యాక్షేపించునని తలఁచి సిద్ధాంతవాది చెప్పుచున్నాఁడు —

వాక్య. తృతీయోఽపి త్యాగప్రకారః ఆత్మజ్ఞానబోధాత్.

స త్వాత్మజ్ఞానానభ్యుపగమాత్ భవతా నాభ్యు
గమ్యతే. ౨౧౦

దం-అ. మూఁడవకర్మత్యాగప్రకారము కర్తృత్వాదిసర్వకర్మశూన్యమైన పరమాత్మస్వరూపముయొక్క జ్ఞానమువలన సంభవించును. అది ఆత్మజ్ఞానము నంగీకరించనందున నీచేత నంగీకరింపఁబడదు.

**తా.** అనుభవప్రాయశ్చిత్తములకంటె మఱియొకసర్వకర్మనివర్తకమగు మూఁడవప్రకారము కలదు. అది సర్వోపాధ్యనవచ్ఛిన్నమై అనంతానందచిద్ఘనమై అద్వితీయమైన పరమాత్మయొక్క స్వరూపజ్ఞానమే. ఈపరమాత్మస్వరూపజ్ఞానము ఆరబ్ధఫలములకంటె నితరములైనయావత్కర్మలను అగ్నిజ్వాల దూదిపింజను దహించునటుల నిరవశేషముగా దహించును. అట్టి పరమాత్మజ్ఞానమును నీవు అంగీకరించలేదుగదా? కనుక నీయభిప్రాయముచేత అనుభవప్రాయశ్చిత్తములు రెండే కర్మనివర్తకములుగాని, మూఁడవది లేదని చెప్పినారమని భావము. కార్యకారణస్వరూపుఁడైన ఆపరమాత్మ సాక్షాత్కరింపఁబడగా నీముముక్షువుయొక్క సర్వకర్మలు క్షయించునని శ్రుత్యర్థము.

అవ. ఓయీ! రెండుప్రకారములచేతనే కర్మలకు నివృత్తి కలుఁగుగాక! అందువలన మా కేమిలోపము? అని పూర్వపక్షవాది ప్రశ్నచేయునని తలఁచి యిందువలన పూర్వపక్షవాదికి కలిగెడిలోపమును (హానిని) సిద్ధాంతవాది చూపించుచున్నారు —

వాక్య. తత్ర యాన్యనుపభుక్తఫలాన్యనారబ్ధఫలాని తానీ
శ్వరేణాపి కేనచిదపి న శక్యంతే పరిత్యక్తుమ్. ౨౧౧

దం-అ. వాటిలో, నేకర్మ లారంభింపఁబడని ఫలముకలవి గనుకనే అనుభవింపఁబడని ఫలముకలవైయుండునో ఆకర్మలు, ఈశ్వరునిచేతఁగూడా ఎవనిచేతఁగూడా పరిత్యజించుటకు శక్యములుగావు.

**తా.** కర్మలు తమతమఫలముల నిచ్చుట కారంభించితేగదా ఆకర్మలయొక్కఫలము లనుభవింపఁబడును. అనుభవించితేగదా కర్మలకు నివృత్తికలుగవలయును. కర్మలు తమఫలముల నిచ్చుట కారంభింపనపుడు ఆకర్మములయొక్క ఫలము లేలాగున అనుభవింపఁబడును? అనుభవము కలుఁగకముందు వాటిని పరిత్యజించుటకు పరమేశ్వరుఁడున్ను సమర్థుఁడుకాఁడు. మనవంటివా రేలాగున శక్తులగుదుము. కనుక మోక్షేచ్ఛగలవాఁడు కామ్యనిషిద్ధములన్నింటిని విడువవలయునని నీవు చేసినప్రతిజ్ఞ సిద్ధించకపోవుటయే నీకు లోపమని భావము.

అవ. ఓయీ! ఆరబ్ధఫలములైన కర్మలను విడువఁగూడదా యంటే అవియును శక్యముకాదని చెప్పుచున్నారు.

వాక్య. అథారబ్ధఫలాని త్యజ్యంతే తాన్యపి న శక్యంతే త్యక్తుమ్. ౨౧౨

దం-అ. మఱియొకపక్షమునందు ఆరబ్ధఫలములైనకర్మలు విడువఁబడు నంటిరా అవియును విడుచుటకు శక్యములు గావు.

తా. అనారబ్ధఫలకర్మలను విడుచుటకు శక్యము కాకపోయినప్పటికిని ఆరబ్ధఫల కర్మలను విడుచుట శక్యమైయుండదా యని మీరు తలఁచెదరేమో. అవియును నైత ము శక్యముకాదని భావము.

అవ. పూర్వపక్షవాది శంకించుచున్నారు.—

వాక్య. కిం కారణమ్? ౨౧౩

దం-అ. ఏమి హేతువు?

తా. అనారబ్ధఫలకర్మలు అనుపస్థితములైనందున (సమీపమునకు రాకయున్నం దున) త్యజించుట శక్యముకాదని యంటిరి. అది సరిగా నున్నది. ఆరబ్ధఫలకర్మలు ఫల మును ఆరంభించి యిచ్చుచున్నవి. కనుక ఉపస్థితములై (సమీపగతములై) కదా యున్నవి. వీటిని త్యజించుట సులభమైయుండఁగా వీటినిన్ని త్యజించుట శక్యముకాదని చెప్పుట కేమికారణమని భావము.

అవ. సిద్ధాంతవాది ముందుగా సంక్షేపమైనపరిహారమును చెప్పుచున్నారు.

వాక్య. అనివృత్తేః. ౨౧౪

దం-అ. నివర్తించనందువలన.

తా. ఉత్పన్నమైనకర్మకు అనుభవముగాని ప్రాయశ్చిత్తముగాని సంసిద్ధమైయుం న్నది. గనుక అనుభవము పూర్తిగాకమునుపు, ప్రాయశ్చిత్తమును చేసికొనకమునుపు ఆరబ్ధఫలకర్మ నివర్తించనందున త్యజించుటకు శక్యముకాదని భావము.

అవ. ఈచెప్పినయర్థమునే వివరించుచున్నారు.—

వాక్య. అనిర్వృత్తం హి చికీర్షితం కర్మ శక్యతే త్యక్తుం. ప్రవృత్తినివృత్తీ ప్రతి కర్తుస్స్వాతంత్ర్యాత్. నివృత్తే తు కర్మణి తదసంభవా ద్ధరనుష్ఠేయః ప్రతిజ్ఞాతార్థః. ౨౧౫

దం-అ. ప్రవృత్తినివృత్తులను గూర్చి కర్తకు స్వాతంత్ర్యము కలిగియున్నం దున, ఉత్పన్నముకాకయుండి చేయ నిశ్చయించఁబడుచున్నకర్మ విడుచుటకు శక్యమై

యుండును. కర్త ఉత్పన్నమైనపిదప త్యాగము సంభవింపనందున ప్రతిజ్ఞ చేయఁబడినవిషయము అనుష్ఠింప శక్యమైనదికాదు.

తా. ఒకపురుషుఁడు పుణ్యకర్మనుగాని పాపకర్మనుగాని చేయవలయునని ముందుగా సంకల్పించి పిదప తదనుకూలమైన వ్యాపారమునుచేసిన పుణ్యపాపకర్మ లుత్పన్నములగును. సంకల్పించినకాలమందు ఆపుణ్యపాపకర్మలు పుట్టనందున అప్పు డాకర్మలను విడువవలయునంటె విడువవచ్చును. ఎందువల్లనంటే ఒకకార్యమును చేయఁదలచినవాఁడు సంకల్పించినతరువాత నాకార్యమునందు ప్రవర్తించిచేయుటకుగాని ఆకార్యమునుంచి నివర్తించి మానుకొనుటకు స్వతంత్రుడైయుండును. గనుక సంకల్పించిన కాలమందే కర్మలను విడువవలయునంటే విడువవచ్చును. కర్మలు పూర్తిగాఁ జేయఁబడినతరువాత అనుభవప్రాయశ్చిత్తములచేతనే వాటిని విడువవలయునుగాని మఱియొక విధముగా విడుచుటకు శక్యముగాదు. కావున కామ్యనిషద్ధకర్మలను త్యజించవలయునని మీరు ప్రతిజ్ఞచేసిన అర్థము ఆచరించుటకు మాత్రము శక్యమైయుండదని భావము.

అవ. ౨౦౮ వ వాక్యములో వికల్పించిన రెండుపక్షములలో రెండవపక్షమును నిరసించుచున్నారు.—

వాక్య. అశక్యప్రతిజ్ఞానాచ్చ. ౨౧౬

దం-అ. శక్యముకాని యర్థమును ప్రతిజ్ఞచేసినందువలనను కామ్యనిషిద్ధకర్మానుష్ఠానపక్షము అసంగతమని అధ్యాహారము.

తా. కామ్యనిషిద్ధకర్మలను త్యజింపవలయునని మేము చెప్పలేదు. ఆకర్మల యొక్క అనుష్ఠానమును పరిత్యజింపవలయునని చెప్పినామని యంటిరా శక్యముకాని దానిని మీరుప్రతిజ్ఞచేసినందున కామ్యనిషిద్ధకర్మానుష్ఠానమును పరిత్యజింపవలయుననెడి పక్షమున్ను సంగతమైనదికాదు.

అవ. కామ్యనిషిద్ధకర్మానుష్ఠానపరిత్యాగము ఎందువలన శక్యముకాదంటే చెప్పుచున్నారు.

వాక్య. న చ శక్యతే ప్రతిజ్ఞాతుం యావజ్జీవం కామ్యాని ప్రతిషిద్ధాని చ కర్మాణి న కరిష్యామీతి. సునిపుణానా మపి సూక్ష్మాపరాధదర్శనాత్. ౨౧౭

దం-అ. బ్రతికియుండునంతవరకు కామ్యకర్మలు నిషిద్ధకర్మలు చేయనని ప్రతిజ్ఞ పట్టుటకు శక్యముకాదు. మిక్కిలి నేర్పరులకుఁగూడ సూక్ష్మములైనతప్పులు కానవచ్చుచున్నందున.

తా. ఈలోకములో మిక్కిలి పారమార్థికులై యుండి యథాశాస్త్రము
సంచరించవలయునని నిశ్చయించుకొని కొంచెమైనను ప్రమాదములేకుండా శ్రౌతస్మా
కర్మల నాచరించువారియందుకూడా కొన్ని అతిసూక్ష్మములైన అశాస్త్రీయ్య కృత్యము
సంభవించుచున్నవి. కావున బ్రతికియుండెడి కాలమంతయు కామ్యకర్మలను నిషిద్ధక
లను నేను జేయకయుందునని సంకల్పించి ఆప్రకారముగా నాచరించుట యో
వంటివారికిని శక్యముకాదని భావము.

అవ. ఈపక్షమునందే మఱియొకదూషణమును చెప్పుచున్నారు.—

వాక్య. ప్రమాణాభావాచ్చ. ౨౧౮

దం-అ. ప్రమాణములేనందువల్లనున్ను అనుష్ఠానపరిత్యాగపక్షము సంగత
కాదని అధ్యాహారము.

తా. ముముక్షువు కామ్యనిషిద్ధములను పరిత్యజించవలయునని శ్రుతిస్మృతుల
నొకవాక్యమైనను చెప్పినదిలేదు. గనుక కామ్యనిషిద్ధకర్మానుష్ఠానపరిత్యాగపక్షము
రించఁదగినది కాదని భావము.

అవ. చెప్పినఅర్థమును వివరించుచున్నారు.—

వాక్య. న చ ప్రమాణ మస్తి మోక్షకామో నిత్యనైమిత్తికే
కర్మణీ కుర్యా త్కామ్యప్రతిషిద్ధే చ వర్జయే దారబ్ధఫలే
చోపభోగేన క్షపయేదితి. ౨౧౯

దం-అ. మోక్షమును కోరినవాఁడు నిత్యనైమిత్తికకర్మలను చేయవలయును
కామ్యనిషిద్ధములను విడువవలయును. ఆరబ్ధఫలములైనకర్మలను అనుభవముచేత గడ
పలయును. అనిచెప్పెడి ప్రమాణము లేదు.

తా. స్వర్గమును కోరినపురుషుఁడు జ్యోతిష్టోమమును చేయవలయునని శా
వాక్యము చెప్పినటుల మోక్షమునం దిచ్ఛగలపురుషుఁడు నిత్యములైన సంధ్యావంద
గ్నిహోత్రాదికర్మలను నైమిత్తికములైన గ్రహణస్నానజాతేష్ట్యాదులను మాత్ర
నాచరింపవలయుననిన్ని కామ్యములై చిత్రాకారీరాదికర్మలను, ప్రతినిషిద్ధములైన సు
పానపరదారపరిగ్రహాదులను విడువవలయునని ఫలము నారంభించి వచుచున్నపుణ్యా
ఁలను అనుభవముచేత గడుపవలయునని శ్రుతిస్మృతులలో నొకచోటనైనను
యుండలేదు గనుక కామ్యనిషిద్ధకర్మానుష్ఠానపరిత్యాగపక్షము అనాదరణీయ
భావము.

ఆవ. సింహావలోకనన్యాయముగా మొదటిపక్షమును తిరిగిదూషించుచున్నా

వాక్య. అనంతత్వాచ్చ. ౨

దం-అ. అపరిమితత్వము కలిగియున్నందున అనుష్ఠితకర్మపరిత్యాగము శక్యము కాదని అధ్యాహారము.

తా. ఇంతవఱకు మన కనేకజన్మలు గడచియున్నవి. అందువలన ఆజన్మలయం దన్నిటియందును చేయబడినకర్మలు అసంఖ్యాతములై యుండును గనుగ వాటి నన్నిటిని విడువవలయునంటె యెంతమాత్రము శక్యమైయుండదని భావము. సింహము తానునడచునప్పుడు కొంతదూరముపోయి అచ్చట నిలిచి వెనుక తాను విడిచివచ్చినప్రదేశమును తిరిగిచూచును. ఇది సింహావలోకనన్యాయము.

అవ. చెప్పిన అర్థమును వివరించుచున్నారు.—

వాక్య. న చోపచితానాం కర్మణా మియత్తాస్తి సంసారస్యా
నాదిత్వాత్. ౨.౨౧

దం-అ. సంసారమునకాది లేనందున సంపాదింపఁబడినకర్మలకు పరిమితిలేదు.

తా. జననమరణప్రవాహరూపంబయిన సంసారమునకొక ఆది (మొదలు) లేనందున గడచిపోయిన జన్మలు అనంతములైయుండును గనుక అనంతజన్మలలో సంపాదింపబడినకర్మలు పుణ్యపాపరూపములై యుండును. అట్టివానిని ఒకజన్మలో విడుచుట కేలాగున శక్యము గనుక అనుష్ఠితకర్మపరిత్యాగపక్షము సుతరాం అసంగతమని భావము.

అవ. ఓయీ, బ్రహ్మాస్త్రము బ్రహ్మాస్త్రముతోడనే శాంతినొందునదేడిన్యాయప్రకారము కామ్యకర్మలచేత కామ్యకర్మలున్ను నిషిద్ధకర్మలచేత నిషిద్ధకర్మలున్ను శమించునని పూర్వవాది శంకించునని తలఁచి సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు—

వాక్య. న చ కామ్యైః ప్రతిషిద్ధైర్వా తేషాం నివృత్తి రస్తి.
శుద్ధ్యశుద్ధిసామ్యే సత్యవిరోధాదితి. ౨.౨౨

దం.అ. పరిశుద్ధత్వముగాని అపరిశుద్ధత్వముగాని సమానమైయుండగా విరోధములేనందున ఆకర్మలకు కామ్యకర్మలచేతగాని నిషిద్ధకర్మలచేతగాని నివారణము గలుగదు.

తా. జన్మాంతరమునందు చేయఁబడిన కామ్యకర్మలున్ను ఈజన్మయందు చేయఁబడుచున్న కామ్యకర్మములున్ను, పరిశుద్ధములైనందున వీటికొకదానితోనొకదానికి విరోధములేదు. విరోధములేనందున పూర్వజన్మయందు చేయఁబడినకామ్యకర్మలను ఈజన్మయందు చేయఁబడుచున్నకామ్యకర్మలు నివర్తింపజేయవు. పులికి మేకకువలె విరోధము ఉంటేగదా ఒకటి నివర్తకము (బాధకము) గా మఱియొకటి నివర్త్యము (బాధ్యము) గా నుండును. ఈప్రకారమే జన్మాంతరకృతనిషిద్ధములున్ను అపరిశుద్ధములై యున్నం

దున పరస్పరవిరోధములు కలవిగావు గనుక ఈజన్మయందు చేయఁబడుచున్న ని
పూర్వజన్మకృతనిషిద్ధములను నివర్తింపజేయఁజాలవు. బ్రహ్మాస్త్రముచేత బ్ర
శాంతించునని ప్రతిక్రియాకల్పములో చెప్పఁబడియున్నందున ప్రయో
కలిగియున్నందునను అస్త్రము అస్త్రముచేత క్షయించును. కామ్యనిషిద్ధములు
షిద్ధములచేత క్షయించునని యేశాస్త్రములోనున్న చెప్పఁబడకయున్నంద
వాటిచేతనే క్షయము కలదని భావము.

అవ. ఉపపాదించిన యర్థమును శ్లోకముతో జెప్పుట కవతారిక
చున్నారు—

వాక్య. అత ఆహ.

దం-అ. ఆయర్థము చెప్పుచున్నాడు.—

శ్లో. న కృత్స్నకామ్యసంత్యాగోఽనంతత్వాత్కర్తుమిష్యతే
నిషిద్ధకర్మణశ్చైత్తు వ్యతీతానంతజన్మసు. ౮౧

దం-అ. కడచిపోయిన అనేకజన్మలయందు అనంతములైయున్నందున
కామ్యకర్మములయొక్క పరిత్యాగమున్ను యావత్తునిషిద్ధకర్మలయొక్క ప
న్ను చేయుటకు శక్యమైనదికాదు.

తా. ఈశ్లోకముయొక్క తాత్పర్యము ౨౨౧ వ వాక్యముయొక్క
ముచేతనే స్పష్టము.

అవ. ఓయీ! జన్మాంతరకృతకర్మలకు నిత్యకర్మలచేత నివృత్తికలుగు
పక్షవాదియొక్క మతమును ఒకవాక్యముతోటి శ్లోకముయొక్క పూర్వార్థముచే
తవాది అనువదించుచున్నాడు.—

వాక్య. స్యాన్మతం వ్యతీతానంతజన్మోపాత్తానాం కర్మణామ్.

దం-అ. కడచిన అనేకజన్మలయందు సంపాదింపఁబడిన ఆకర్మలకు
త్తములచేత పాపమునకు వలె నిత్యకర్మలచేత వినాశము కలుగునని సమ్మతమ

తా. కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తముల నాచరించుటచేత
ములైన పాపములు నశించిపోవునటుల నిత్యకర్మల నాచరించుటచేత పూ
యందు సంపాదింపఁబడిన కామ్యకర్మలును, నిషిద్ధకర్మలునునశించునని మీరు
దరేమో యని భావము.

అవ. సిద్ధాంతవాది ఆమతమును నిరాకరించుచున్నారు.—

శ్లో. క్షయో నిత్యేన తేషాం చేత్ ప్రాయశ్చిత్తైర్యథైనస

దం-అ. నిత్యకర్మలు ఫలరహితములై నందువనే నిత్యకర్మలచేత కామ్యము మొదలగుకర్మలకు నిరాకరణము లేదు (సంభవించదు.)

తా. నిత్యకర్మల ననుష్ఠించుటచేత ఫలము లేదని మీ రంగీకరించియున్నందున నిత్యకర్మలకు జన్మాంతరసంపాదిత కామ్యనిషిద్ధములయొక్క వినాశము ఫలముకానేరదని భావము.

అవ మఱిన్ని నిష్ఫలమగుటచే పరిహరించుచున్నారు.—

శ్లో. నిష్ఫలత్వాచ్చ నిత్యేన కామ్యాదేర్నివారణమ్. ౧౨ . ౨౨౭

దం-అ. అనిత్యములగుటచే నిష్ఫలము లగుటవలన కామ్యనిషిద్ధకర్మలక్షయము యొక్క ఫలము పొందనేరదు.

అవ. కుమారిలస్వామి మొదలగుకర్మమీమాంసకులు పూర్వజన్మార్జితదురితక్షయముకొఱకు నిత్యకర్మ లాచరింపఁబడుచున్నవి యని యంగీకరించియున్నందున నిత్యకర్మల కుపాత్తదురితక్షయము ఫలమైయుండఁగా నిత్యకర్మలకు ఫలములేదని చెప్పుట న్యాయముకాదని పూర్వపక్షవాది యాక్షేపించు నని తలఁచి సిద్ధాంతవాది ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. ప్రమాణాభావాచ్చ. ౨౨౮

దం-అ. ప్రమాణము లేనందువలన నిత్యకర్మలకు కామ్యనిషిద్ధవినాశము ఫలమని చెప్పఁగూడదని అధ్యాహారము.

తా. ఉపాత్తదురితక్షయము నిత్యకర్మలకు ఫలమని కుమారిలభట్టాచార్యు లంగీకరించినది సత్యమే. అయినను నిత్యకర్మలకు దురితక్షయము ఫలమైతే అవునుగాక. కామ్యపుణ్యములయొక్క క్షయమున్ను నిత్యకర్మలకు ఫలమని చెప్పుటకు ప్రమాణము లేదని భావము.

అవ ప్రమాణము ఎందుకు లేదని పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కథమ్! ౨౨౯

దం-అ. ఏలాగున ప్రమాణము లేదని అధ్యాహారము.

అవ. సిద్ధాంతవాది ప్రమాణాభావమును సదృష్టాంతముగా చూపించుచున్నారు-

శ్లో. పాపాపనుత్తయే వాక్యాత్ ప్రాయశ్చిత్తం యథా తథా,
గమ్యతే కామ్యహాన్యర్థం నిత్యం కర్మ న వాక్యతః. ౧౩ ౨౩౦

దం-అ. పాపములయొక్క వినాశముకొఱకు ప్రాయశ్చిత్తము ఏలాగున వాక్య

మువలన తెలియఁబడుచున్నదో అలాగున నిత్యమైనకర్మ కామ్యముయొక్క
కొఱకు వాక్యమువలన తెలియఁబడినది లేదు.

తా. 'తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేనయజతే,య ఉ చైన మే
బ్రహ్మహాద్వాదశాబ్దాని కుటీం కృత్వా వనే వసేత్' ఇత్యాదిశ్రుతులు, స్మృతు
హత్యాదిపాపములయొక్క నివృత్తికొఱకు అశ్వమేధయాగాదిరూపములైన
త్తములను ప్రతిపాదించుచున్నవి. కావున ప్రాయశ్చిత్తకర్మకు పాపనివృత్తి ఫ
వచ్చును. ఈప్రకారమే కామ్యకర్మలనివృత్తికొఱకు నిత్యకర్మను విధించి
శ్రుతిస్మృతులలో నొకటియైనను కాన్పించలేదు. కనుక నిత్యకర్మలవల్ల కా
క్షయించునని చెప్పఁదగదని భావము. ఏపురుషుఁడు అశ్వమేధయాగముచే
చునో, యేపురుషుఁడు అశ్వమేధయాగము నుపాసించునో వాఁడు బ్రహ్మహ
టును (నివర్తింపఁజేసికొనునని యర్థము). బ్రహ్మహత్యఁ జేసినవాఁడు అర
పర్ణశాలను వేసికొని పండ్రెండుసంవత్సరములు నివసించవలయునని యర్థము.
ధోపాసనము బృహదారణ్యము, మూఁడవఅధ్యాయములోఁ జెప్పఁబడినది.

అవ. పూర్వపక్షవాది తిరుగ శంకించుచున్నాఁడు.—

వాక్య. అథాపి స్యాత్కామ్యై రేవ కామ్యానాం పూర్వ
న్మోపచితానాం క్షయో భవిష్యతీతి. ౧౩౦

దం-అ. అయినప్పటికి పూర్వజన్మలయందు సంపాదింపఁబడిన కామ్య
క్క వినాశము కామ్యకర్మలచేతనే కాఁగల దని మాయభిప్రాయము కావచ

తా. నిత్యకర్మలు కామ్యకర్మలను క్షయింపఁజేయునని ప్రతిపాదించె
ణము లేకపోయినప్పటికిని యీజన్మయందు చేయఁబడెడికామ్యకర్మలచేత
లయందుఁ జేయఁబడినకామ్యకర్మలకు నాశము కలుగవచ్చును. అని మా
ము కలిగియున్నదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును జెప్పుచున్నాఁడు.

వాక్య. తన్న. యతః. ౧౩౧

దం-అ. అది అట్లు కానేరదు ఎందువల్లననఁగా.—

శ్లో. పాప్మనా పాప్మభిర్నాస్తి యథై వేహ నిరాక్రియా,
కామ్యైరపి తథైవాస్తు కామ్యానామవిరోధతః. ౭౮

దం-అ. ఈలోకములో పాపకర్మలకు పాపకర్మలవలన వినా
లేదో, అట్లే కామ్యకర్మలకును కామ్యకర్మలతోటి విరోధము లేనందున విన

తా. జన్మాంతరకృతములైన సురాపానబ్రహ్మహత్యాది పాపకర్మలున్ను ఈజన్మయందు చేయఁబడుచున్న సురాపానాదికర్మలున్ను ఏకజాతీయములైనందున పరస్పర విరోధము కలవి కావు గనుకనే పూర్వపాపకర్మలకు ఉత్తరపాపకర్మలచేత నివృత్తిగలుగనేరదు గదా? ఈప్రకారమే పూర్వకామ్యకర్మలకు ఉత్తరకామ్యకర్మలకు ఏకజాతీయత్వముచే విరోధము లేనందున పూర్వకామ్యములకు ఉత్తరకామ్యములచేత క్షయము కలుగదనిభావము. ఈశంకాపరిహారములు ౨౨౮-వ వాక్యములోఁ జేయఁబడినప్పటికిని, వివరణముకొఱకు తిరిగి చెప్పఁబడినవి.

అవ. ఇంతవఱకు చెప్పిన అర్థమును అనువదించి ముగించి ఉత్తరగ్రంథమును అవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. ఏవం తావన్ముక్తేః క్రియాభిస్సిద్ధత్వా దితి నిరాకృతం.
అథాత్మజ్ఞానస్య సద్భావే ప్రమాణాసంభవ ఉక్తః.
తత్పరిహారాయాహ. ౨౩౪

దం-అ. ఈప్రకారము మోక్షము కర్మలచేతనే సిద్ధించుచున్నందున ఆత్మజ్ఞానము నిరర్థకమని చెప్పిన అర్థము నిరాకరింపఁబడినది; ఇఁకను ఆత్మజ్ఞానముయొక్క సద్భావమునందు ప్రమాణముయొక్క అభావము చెప్పఁబడినది. దానిని పరిహరించెడికొఱకు చెప్పుచున్నాఁడు.

తా. ఈప్రకారము 'ముక్తేః క్రియాభి స్సిద్ధత్వాత్ జ్ఞానం తత్ర కరోతి కిం' అనెడి ౯-వ శ్లోకములోఁ జెప్పినపూర్వవాదియొక్కయుక్తి నిరాకరింపఁబడినది. ఇఁకను వాక్యమునందును ౧౩-వ శ్లోకమునందును ఆత్మజ్ఞానము కలదని చెప్పుటకు ప్రమాణమే లేదని పూర్వపక్షవాది చెప్పినవిషయమును నిరాకరించుటకు ఆరంభించుచున్నారని భావము.

శ్లో. శ్రుతయః స్మృతిభి స్సాకం మానం త్వాత్మానిమాప్తిహ,
విదధత్యురుయత్నేన కర్మాణి బహుకామదం. ౧౫. ౨౩౫

దం-అ. ఈలోకములో ఫలాపేక్షకలవారలకు అనేకత్వము కలిగియున్నందున, ఆకారణమువల్లనే స్మృతులతోఁగూడియున్న శ్రుతులు కామముల నిచ్చుచున్న అనేకమైనకర్మలను మహాప్రయత్నములోఁడ విధించుచున్నవి.

తా. పుత్త్రపశ్వన్నాద్యైహికఫలములను, స్వర్గస్వారాజ్యాది పారలౌకికఫలములను కోరుచున్నపురుషులు ఈలోకములో బహుళముగా నున్నారు. ఆకారణమువల్లనే శ్రుతులు స్మృతులు పుత్త్రపశ్వన్నాదిఫలములకు సాధనములైన యాగదానాది

కర్మలనే విశేషముగా విధించుచున్నవి. ఇంతేకాని ఆత్మజ్ఞానమునందు ప్రమాణము చెప్పఁగూడదని భావము.

అవ. ఓయీ! కర్మలను ప్రతిపాదించెడి వేదవాక్యము లనేకములుగా ను ఆత్మజ్ఞానమును ప్రతిపాదించెడి వేదవాక్యము లత్యల్పములుగా నున్నవి. కావున వాక్యములకు కర్మలయందే తాత్పర్యముగాని, ఆత్మజ్ఞానమునందు తాత్పర్యము పూర్వపక్షవాదియొక్క అభిప్రాయమును శంకించుకొని సిద్ధాంతవాది పరిహా చెప్పుచున్నాఁడు.—

వాక్య. న చ బాహుళ్యం ప్రామాణ్యే కారణభావం ప్రతిపద్యతే.

దం-అ. బహుత్వము ప్రామాణ్యమునందు హేతుత్వమును పొందదు.

తా. ఏయర్థమునందైనను వాక్యములు అనేకములుగా నుండెనేని, అవి ప్ర ము లని, ఒకటిరెండుగా నుండెనా అవి ప్రమాణము కాదని చెప్పగూడదు.

వాక్య. అత ఆహ.

దం-అ. కనుక నీయర్థమును చెప్పుచున్నారు.

తా. అనేకత్వము ప్రామాణ్యము కాదనెడియర్థమును ప్రతిపాదించుచు భావము.

శ్లో. ప్రామాణ్యాయ న బాహుళ్యం నహ్యేకత్ర ప్రమాణతా
వస్తున్యటంతి మానాని త్వేకత్రైకస్య మానతా. ౭౬.

దం-అ. ప్రామాణ్యముకొఱకు అనేకత్వము అపేక్షింపఁబడదు. ఒక వా తోనే చెప్పినవిషయమున ప్రామాణ్యము లేదనిలేదు. ప్రమాణములు ప్రమేయ సంచరించును. ఒకయర్థమునం దొకవాక్యమునకు ప్రామాణ్యము కలదు.

తా. ప్రత్యక్షానుమానశాబ్దములనెడి ప్రమాణములు తాము ఒకఅర్థము పాదించునప్పుడు స్వతంత్రముగా ప్రతిపాదించుచుఁగాని మఱియొకప్రమాణము క్షించి ప్రతిపాదించవు. మఱియొకప్రమాణము ప్రతిపాదించినయర్థమును ప్ర చవు. అనఁగా ప్రత్యక్షప్రమాణము ఘటాదులను స్వయముగా ప్రకాశింపఁజే అనుమానమును, వేదమును అపేక్షించి ప్రకాశింపఁజేయదు. అనుమానము పర్వ తలయందు గల వహ్న్యాదులను బోధించునప్పుడు ప్రత్యక్షమును, వేదము క్షింపదు. వేదము స్వర్గాదులను ప్రతిపాదించునప్పుడు ప్రత్యక్షానుమా అపేక్షించదని అర్థము. వేదాంతులు మీమాంసకులు ఉభయులు ప్ర ములకు స్వతః ప్రమాణత్వము నంగీకరించినారు గాని పరాధీనప్రామాణ్యము

రించలేదు. కర్మకాండలోనున్న ఒకకర్మయందొకవాక్యమే ప్రమాణముగా నున్నదిగాని, అనేకవాక్యములు ప్రమాణములుగా నుండలేదు. 'చిత్రయా యజేత పశుకామః' అనెడు ఒకవాక్యమేగదా, చిత్రాయాగమును ప్రతిపాదించుచున్నది, 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అనెడి ఒకవాక్యమేగదా జ్యోతిష్టోమయాగమును ప్రతిపాదించుచున్నది. ఈప్రకారమే ఒక్కొక్కకర్మను ఒక్కొక్కవాక్యమే ప్రతిపాదించుచున్నదిగాని, అనేకవాక్యములు ఒక్కొక్కకర్మను ప్రతిపాదించుట లేదు. అయితే, కర్మలు అనేకములుగా నున్నందున అనేకవాక్యములు ప్రవర్తించినవి. వాక్యములందనేకత్వ ముండినదేగాని ప్రామాణ్యము గలుగదని చెప్పెడియెడల చిత్రాదివాక్యములకనేకత్వము లేనందున ప్రామాణ్యము లేకపోవును. కనుక అనేకత్వము ప్రామాణ్యమునకు కారణము గాదు. ఏకత్వము ఉన్నప్పటికి ప్రామాణ్యము కలిగియుండవచ్చును. వేదము లనేకశాఖలుగా నున్నందున ప్రతిశాఖయందు చిత్రాదియాగములు విధింపఁబడుచున్నవి. గనుక చిత్రాదియాగప్రతిపాదవాక్యములయందనేకత్వముకలదు గావున వాటికి ప్రామాణ్యముకలదు అనియంటిరా, వేదాంతములున్ను అనేకములుగా నున్నందున ఆత్మజ్ఞానప్రతిపాదకవాక్యములున్ను అనేకములుగా నున్నవి. కనుక వాటికిన్ని ప్రమాణము కలదని సంతోషించుమని భావము

అవ. వేదాంతములయందు విధిసంభవింపదు. కనుక ప్రామాణ్యములేదని పూర్వవాది చెప్పినయుక్తిని అనువదించి నిరసించుచున్నారు.—

వాక్య. యత్త్వోక్తం యత్నతో వీక్షమాణోఽపీతి తత్రాపి భవత ఏవాపరాధః. ౨౩౯

దం-అ. ప్రయత్నముతో చూచుచున్నవాఁడైనప్పటికి అనేకశ్లోకములలో ఏది జెప్పఁబడెనో దానియందున్ను నీయొక్క అపరాధమే కారణము.

తా. ఎంత ప్రయత్నముతో నాలోచించిచూచినను ఆత్మజ్ఞానప్రతిపాదకమైన వాక్యము శ్రుతిలోగాని స్మృతిలోగాని ఒకటియైనను కానవని ౧౫-వ శ్లోకములో పూర్వపక్షవాదివైన నీవు చెప్పినయుక్తియందు నీయొక్క దోషమే కారణముగాని మఱియొకటి కాదు. నీవు శ్రుతిస్మృతులను చక్కగా జాగ్రత్తతో విని చూచినవాఁడవు కావు అందువలననే ఈయుక్తిని చెప్పినావని భావము.

అవ. పూర్వవాది ప్రశ్నను చేయుచున్నాడు.—

వాక్య. కస్మాత్? ౨౪౦ యతః.

దం-అ. ఎందువల్లను.

తా. నేను చెప్పినయుక్తియందు నానేరమే కారణమనియే హేతువుప
చున్నారని భావము.

అవ. సిద్ధాంతవాది ప్రతివచనమును చెప్పుచున్నారు.—

శ్లో. పరీక్ష్య లోకా నిత్యాద్యా ఆత్మజ్ఞానవిధాయినీః,
నైష్కర్మ్యప్రవణా స్సాధ్వీః శ్రుతీః కిం న శృణోషి తా

దం-అ. ఆత్మజ్ఞానమును విధించుచున్న మోక్షమం దాసక్తిగల యీ
'పరీక్ష్య లోకాన్' ఇవి మొదలయిన ప్రసిద్ధమైనశ్రుతులను నీవు ఎందుకు వి

తా. ''పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నా
కృతేన. తద్విజ్ఞానార్థం సగురుమేవాభి గచ్ఛేత్ సమిత్పాణిం శ్రోత్రియం బ్ర
ఇత్యాదిశ్రుతులు ముండకాద్యుపనిషత్తులయందు ప్రసిద్ధములుగా వినఁబ
ఇవి ఆత్మజ్ఞానమును సంపాదించెడికొఱకు సద్గురుసన్నిధికి వెళ్లవలయునని విధి
వి. ఆత్మజ్ఞానమునకు సర్వాజ్ఞాననివృత్తిరూపమైన మోక్షమే ఫలమని తాత్పర్
ప్రతిపాదించుచున్నవి. స్పష్టముగా స్వార్థమును బోధించుచున్నవి. ఇటువంటి
నీవు బధిరుఁడవు కాఁబోలు గనుకనే యీశ్రుతులను నీవు వినక ఆత్మజ్ఞాన
వాక్యములు లేవని నీవు చెప్పుచున్నారని భావము. బ్రాహ్మణుఁడు కర్మలచేత స
బడిన స్వర్గాదిలోకములను అనిత్యము లని విచారించి నిర్వేదమును (నిష్ఫల
పొందును. అకృతమైన (నిత్యమైన) మోక్షము, కృతము (కర్మ) చేత లేదని
మును బొందును. ఆమోక్షసాధనమైన జ్ఞానముకొఱకు ఆబ్రాహ్మణుఁ డగ్నిహో
ల కుపకారకములైన సమిత్పుష్పకుశాదులను చేత పుచ్చుకొన్నవాఁడై సకలవే
వేదాంతములనెఱింగి నిరంతర బ్రహ్మానుభవపరుఁడైన సదాచార్యులను గూర్చి
నని శ్రుత్యర్థము.

అవ. పూర్వవాది శంకించుచున్నాఁడు —

వాక్య. నను ఆత్మేత్యేవోపాసీత, ఆత్మా వా౽రే ద్రష్టవ్యః ఇత్య
పూర్వవిధిశ్రుతేః పురుషస్య ఆత్మదర్శనక్రియాయాం
నియోగో౽వసీయత ఇతి. ౨౮

దం-అ. ఓయీ! 'ఆత్మేత్యేవోపాసీత'- ఆత్మావా౽రే ద్రష్టవ్యః' అని అ
వినఁబడుచున్నందున పురుషునకు ఆత్మదర్శన మనెడి క్రియయందు విధి ని
బడుచున్నది.

తా. 'ఆత్మేత్యేవోపాసీత' అనఁగా నాత్మనే యుపాసించవలయును వ
వారే ద్రష్టవ్యః' ఓమైత్రేయీ! ఆత్మ చూడఁదగినవాఁడు. ఇత్యాదిశ్రుతులం

ర్థమైన ఆత్మదర్శనమును విధించుచున్నవి. ప్రమాణాంతరములచేత ప్రతిపాదింపఁబడని యర్థముఅపూర్వార్థమనంబడు. అదియె విధింపఁదగియున్నది, ఉపాసీత, ద్రష్టవ్యః అనెడి పదములు విధ్యర్థబోధకములై యున్నవి. లోట్ తవ్య ప్రత్యయములు చేరియున్నవి. గనుక స్వర్గసాధనమైన జ్యోతిష్టోమయాగమును విధించినటుల నిచ్చట మోక్షసాధనమైన ఆత్మదర్శన క్రియ విధింపఁబడుచున్నది. జ్యోతిష్టోమము, స్వర్గసాధనమని ప్రమాణాంతరములు (ప్రత్యక్షానుమానములు) ప్రతిపాదింపనందున 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అనెడి శ్రుతి జ్యోతిష్టోమము స్వర్గసాధనమని విధించుచున్నది. అప్రకారమే ఆత్మదర్శనము మోక్షసాధనమని ప్రమాణాంతరములచేత తెలియఁబడనందున ఆత్మదర్శనము మోక్షసాధనమని 'ఆత్మేత్యేవోపాసీత' ఇత్యాది శ్రుతులు విధించినవి. యాగమునందువలె ఆత్మదర్శనమునందును విధియున్నందున ఆత్మజ్ఞానమున్ను కర్మలోనంతర్భూతమై యున్నదని నిశ్చయింపఁబడుచున్నదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.

వాక్య. నైవం. అపురుషతంత్రత్వాత్ వస్తుయాథాత్మ్యజ్ఞానస్య సకలానర్థబీజాజ్ఞానబోధోత్సారిణో ముక్తిహేతో రితి. ౨౭౩

వం-అ. యావదనర్థమునకు కారణమైన ఆత్మయొక్క అజ్ఞానమును నిరసించునదిన్ని, మోక్షమునకు సాధనమైనదిన్ని అయిన ఆత్మయాథార్థ్యజ్ఞానమునకు పురుషాధీనత్వము లేనందున ఆలాగున చెప్పఁగూడదు.

తా. కర్మలు ప్రమాణవాక్యములచేత ప్రతిపాదింపఁబడినవైనప్పటికి పురుషుని యొక్క ఇచ్ఛకు పరతంత్రములై యున్నందున చేయుటకు, చేయకపోవుటకు, మఱియొకవిధముగా చేయుటకున్ను వీలుగా నుండును. అది యెలాగంటె ఈలోకములో నొకపురుషుఁడు మఱియొకపురుషునిచేత నీవు రమ్యవస్తువులను చూచుటకొఱకిచ్ఛయుండెనేని మధురానగరమునకు పొమ్మని నియోగింపఁబడును. అప్పుడు నియోగింపఁబడిన పురుషునకు మధురానగరమునుక్రియ స్వాయత్తమైయుండును. గనుక ఆగమనక్రియ ఇచ్ఛకలిగెనేని, చేయుటకుగాని, ఇచ్ఛలేకపోయెనేని, చేయకపోవుటకుగాని, రథముమీదనైనను గుఱ్ఱముమీదనైనను నెక్కి చేయుటకుగాని వీలుగానుండును. అలాగుననే స్వర్గమును కోరినవాఁడు జ్యోతిష్టోమయాగమును చేయవలయునని వేదము నియోగించుచున్నది. అప్పుడు జ్యోతిష్టోమయాగము క్రియయైనందున పురుషునిచేత చేయఁతగి, ఆపురుషునకు స్వాయత్తమై యుండును. కనుక ఆపురుషుఁడు స్వర్గమును ఇచ్ఛయుంచె

నేని జ్యోతిష్టోమక్రియ చేయుటకు, ఇచ్ఛయించకపోయెనేని జ్యోతిష్టోమక్రియను చేయకమానుకొనుటకును అంగోపాంగముల నాచరించునప్పుడు భిన్నభిన్నప్రకారములుగా చేయుటకును వీలుగా నుండును. ఆత్మజ్ఞానము ఈసంసారమునకు కారణమైన ఆత్మస్వరూపవిషయమైన అజ్ఞానమును నిశ్శేషముగా నివర్తింపఁజేయుచు మోక్షమునకు సాధనమైయుండును. ఇట్టి ఆత్మజ్ఞానము తన కుత్పాదకమైన ప్రమాణమునకును, విషయమైన ప్రమేయమునకును, పరతంత్రమైయుండునుగాని పురుషునకు పరతంత్రమైయుండదు. అది యేలాగంటే లోకములో ఘటజ్ఞానము కలుగుచున్నది. ఇది చక్షురింద్రియమునకు ఘటముతోటి సంయోగము కలిగినప్పుడు జన్మించి చక్షురింద్రియమునకును ఘటమునకును పరతంత్రమైయుండును. పురుషునకు పరతంత్రమైయుండదు. అనఁగా చక్షురింద్రియము ఘటముతోటి సంయోగముకలిగినప్పుడు ఘటజ్ఞానము పుట్టునుగాని, కలుగనప్పుడు పురుషునిచేత పుట్టించుటకుగాని, కలిగినప్పుడు పురుషునిచేత పుట్టకుండా చేయుటకుగాని శక్యమైయుండదు. ఇదిగాక ఘటము నీలాకారముగా నుండెనేని జ్ఞానము నీలఘటాకారమై పుట్టును. పీతమైయుండెనేని పీతఘటాకారముగా పుట్టును. కాని నీలఘటమునందు పీతఘటాకారముగా, పీతఘటమునందు నీలఘటాకారముగా జ్ఞానము పురుషునిచేత పుట్టించుటకు శక్యమైయుండదుగదా? ఆప్రకారమే ఆత్మజ్ఞానమున్ను వేదాంతవాక్యములకును ఆత్మస్వరూపమునకును ఆధీనమైయుండి యథావస్థితాత్మస్వరూపమును గోచరింపఁజేయును గాని పురుషున కధీనమైయుండి వేదాంతవాక్యములు వినఁబడినను జ్ఞానమును పుట్టకుండా చేయుటకుగాని ఆత్మస్వరూపమును విపరీతముగాఁ గోచరింపఁ జేయుటకుగాని పురుషునకు శక్యమైయుండదు. గనుక పురుషపరతంత్రమైన కర్మకును ప్రమాణవిషయపరతంత్రమైన జ్ఞానమునకును సాజాత్యము కొంచెమైనను లేనందున ఆత్మజ్ఞానమును కర్మలలో నంతర్భవింపఁజేయఁదగదు. 'ఆత్మా వారే ద్రష్టవ్యః' ఇత్యాదిశ్రుతులయందు విధాయకములైనవిజాతివిభక్తులు వినఁబడుచున్నప్పటికిని అవి శ్రవణమును విధించునవిగాని, ఆత్మదర్శనమును విధించునవి గావని భావము.

అవ. ఓయీ! 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అని శ్రవణాదులయందు ప్రత్యేకముగా విధి వినఁబడుచున్నది. ద్రష్టవ్యః అని దర్శమునందు వేరుగా విధివినబడుచున్నది. కనుక ఉపాసీత, ద్రష్టవ్యః ఇత్యాదిపదములు శ్రవణాదులను విధించునవిగావు. ఆత్మజ్ఞానమునే విధించుచున్నవి గావున ఆత్మదర్శనము (జ్ఞానము) న్ను క్రియలో జేరఁదగినదే యని పూర్వవాది శంకించునని తలఁచి సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. విధ్యభ్యుపగమేఽపి నాపూర్వవిధి రయం. ౨౮౮

దం-అ. విధిని అంగీకరించినప్పటికిని ఇది అపూర్వార్థమును ప్రతిపాదించెడి విధి కాదు.

తా. ఏది పురుషప్రయత్నసాధ్యమో అదియే విధింపఁదగియుండును. పురుషప్రయత్నసాధ్యముగాని యర్థము విధింపఁదగియుండదు. ఆత్మదర్శనము ప్రమాణవస్తుపరతంత్రమైనందున పురుషప్రయత్నసాధ్యము కాదు గావున దర్శనము విధింపఁబడదు. విధియోగ్యముగాని దర్శనమందు వినఁబడుచున్నది. జాతి, విధి ప్రత్యయములు నిరర్థకములని కాని విధియోగ్యమైన వేదాంతవాక్యశ్రవణాదులయందు అన్వయించతగినవని గాని నిశ్చయించవలయును. ఒకపక్షమునందు ఉపాసీత, ద్రష్టవ్యః ఇత్యాదిపదములు విధ్యర్థములని అంగీకరించినను, ఈవిధి అపూర్వవిధి కానేరదు. ప్రమాణాంతరములచేత బోధింపఁబడని యర్థమును బోధించునది అపూర్వవిధి యనంబడు. 'స్వయం తీర్ణః పరాన్ తారయతి' యనెడి న్యాయప్రకారము అన్యవిషయముల నెఱుంగువాఁడు తన్నుఁదా నెఱుంగవలయునుగదా? కనుక నాత్మదర్శనము స్వతఃప్రాప్తమై యున్నది గావున ఆత్మదర్శనము అపూర్వము గాదు. ఇట్టి ఆత్మదర్శనమును విధించునట్టివాక్యము అపూర్వవిధి గానేరదని భావము.

అవ. శ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. అత ఆహుః ౨౮౯

దం-అ. అందువలన చెప్పుచున్నారు.

తా. లిఙాదివిధిప్రత్యయములు వినఁబడుచుండఁగా ఆత్మదర్శనమున విధి లేదని యేలాగున చెప్పవచ్చునని యంటే ఆశంకమీద నీశ్లోకము చెప్పుచున్నారు.

శ్లో. నియమః పరిసంఖ్యా వా విధ్యర్థోఽపి భవేద్యతః,
అనాత్మాదర్శనేనైవ పరాత్మాన ముపాస్మహే. ౮౮. ౨౯౦

దం-అ. నియమముగాని పరిసంఖ్యగాని విధిప్రత్యయమున కర్థము కావచ్చును. ఎందువల్లనంటే ఆత్మాతిరిక్తములైనవాటిని చూడకపోవుటచేతనే పరమాత్మను ఉపాసించుచున్నాము.

తా. లిఙాదివిధిప్రత్యయమునకు అపూర్వార్థమే విషయము కాదు. నియమము, పరిసంఖ్య యీరెండును విషయములై యున్నవి. 'విధి రత్యంతమప్రాప్తే నియమః పాక్షికే సతి, తత్ర చాన్యత్ర చ ప్రాప్తేః పరిసంఖ్యా నిగద్యతే' అని విధిప్రత్యయమునకు మూఁడర్థము లున్నవని చెప్పఁబడినవి. ప్రమాణాంతరముచేత సుతరాం తెలియఁ

బడని యర్థమును తెలియఁజేయు విధి ప్రత్యయము అపూర్వవిధి యనంబడు. ఇందుకు దృష్టాంతము అగ్నిహోత్రం 'జుహుయాత్స్వర్గకామః' ఇత్యాదివాక్యములు. ఇచ్చట స్వర్గమును కోరినవాఁడు అగ్నిహోత్రమును చేయవలయునని విధించఁబడియున్నది. అగ్నిహోత్రము స్వర్గసాధనమని ప్రమాణాంతరములచేతఁ దెలియఁబడియుండలేదు. గనుక ప్రమాణాంతరములచేత బొత్తిగా తెలియఁబడని స్వర్గసాధనాగ్నిహోత్రమును విధించుచున్న 'జుహుయాత్' అనెడి విధిపదము అపూర్వవిధి యనఁబడును. ఒక కార్యమును గూర్చి యనేకసాధనములు ప్రమాణాంతరముచేత తెలియఁబడి వాటిలో నొకటి ప్రసిద్ధముగా మఱియొకటి యప్రసిద్ధముగా నున్నయెడల, ఒకసాధనమును అనుష్ఠించవలయునని విధించుచున్నవిధిపదము నియమవిధి యనఁబడును. ఇందుకు దృష్టాంతము 'వ్రీహీ నవహంతి; ఇత్యాదివాక్యములు. ఇచ్చట దర్శపూర్ణమాసాదియాగములు ఆజ్యదధిపయఃపురోడాశద్రవ్యములతోటి అనుష్ఠించఁదగియున్నందున, దర్శపూర్ణమాసము మొదలగుయాగముల ననుష్ఠించుటకు ముందుగా పురోడాశద్రవ్యమును సంపాదించుటకొఱకు 'వ్రీహీ నవహంతి' వ్రీహులను (వడ్లను) దంచవలయునని వినఁబడుచున్నది. పురోడాశమనఁగా బియ్యపుపిండితో చేయఁబడు నొకద్రవ్యము. వ్రీహులలో(వడ్లలో) నుంచి బియ్యమును దీయుటకు లోకములో రెండుపాయములు గలవు. ఒకటి అవహననము, (దంచుట). రెండవది నఖవిదళనము (గోళ్లతో నొలుచుట) ఈరెండుపాయములలో నవహననము (దంచుట) ప్రసిద్ధోపాయము. నఖవిదళనము(గోళ్లతో నొలుచుట) అప్రసిద్ధోపాయము. 'ఈరెండుపాయములున్ను లోకమువల్లనే తెలియఁబడుచున్నందున శాస్త్రము విధించవలసిన అవసరములేదు. అయినప్పటికి పురోడాశద్రవ్యముకొఱకు బియ్యమును వడ్లనుదంచి తీయవలయునని లోకసిద్ధతండులసంపా(నిష్పా)దక అవహనన నఖవిదళనోపాయములు రెంటిలో నవహననము నియమింపఁబడుచున్నది. గనుక 'అవహంతి' యనెడివిధిపదము నియమవిధి యనఁబడును. ఒక కార్యమునుగూర్చి అనేకవిషయములు లోకమువల్లనే తెలియఁబడి ఆవిషయము లన్నియు సమానములైయుండగా ఒకవిషయము ననుష్ఠించవలయునని విధించుచున్నవిధిపదము పరిసంఖ్యయనబడు. ఇందుకు దృష్టాంతము 'ప్రాఙ్ముఖోఽన్నానిభుంజీత' ఇత్యాదివాక్యములు. ఇచ్చట ఆకలిగొన్నవారు భుజించవలయుననే విషయము లోకసిద్ధమైనందున భోజనమును శాస్త్రము విధించవలసినది లేదు. భోజనము చేయునప్పుడు నాలుగుదిక్కులలో నేదిక్కునకైనను అభిముఖుడై భోజనము చేయవచ్చును. గనుక తూర్పుదిక్కున కభిముఖుఁడై భోజనము చేయుటయును దక్షిణపశ్చిమాదిముఖుఁడై భోజనము చేయుటయును లోకమువలన సమానములుగా తెలియఁబడుచున్నవి.

అయినప్పటికి తూరుపుదిక్కునకే అభిముఖుఁడై భోజనము చేయవలయునని లోకసిద్ధములైనభోజనకాలీనప్రాఙ్ముఖత్వాదులలో ప్రాఙ్ముఖత్వమునే విధించుచున్నందున 'ప్రాఙ్ముఖోఽన్నాని భుంజీత' ఇత్యాదివిధిపదము పరిసంఖ్య యనంబడు. నియమపరిసంఖ్యలలో అన్యనిషేధమున్ను ఏకతరవిధాననియమనమున్ను (అనఁగా అవహనన, నఖవిదళనములలో అవహననమును విధించినప్పుడు నఖవిదళనముయొక్క నిషేధమున్ను, ప్రాఙ్ముఖత్వమును విధించినప్పుడు దక్షిణపశ్చిమాది ముఖత్వము యొక్క నిషేధమున్ను అని అర్థము). సమానముగా తోఁచినప్పటికి లోకసిద్ధములై అనేకవిషయములలో కొన్ని ప్రసిద్ధములుగా మఱికొన్ని అప్రసిద్ధములుగా నుండుట నియమవిధికి విశేషమనిన్ని, అన్ని సమానములుగా నుండుట పరిసంఖ్యకు విశేషమనిన్ని తెలియవలయును గనుక లిఙాదివిధివచనములకు అపూర్వమే విషయముగాను, నియమమైనను, పరిసంఖ్యయైనను విషయము కావచ్చును. కనుక ఆత్మజ్ఞానమును గోచరింపఁజేయుచున్న ద్రష్టవ్య ఇత్యాదివాక్యములు అపూర్వార్థములుగావు నియమార్థములని గాని పరిసంఖ్యార్థములని గాని చెప్పవచ్చును. అది యెట్లాగంటే 'అహం మనుష్యః' (నేను మనుష్యుఁడను) ఇత్యాది లోకవ్యవహారములయం దన్నిటియందును 'అహం' అని ఆత్మదర్శనమున్ను, 'మనుష్యః' అని అనాత్మదర్శనమున్ను కలిగియున్నందున ఈయాత్మానాత్మదర్శనములు రెండున్ను, లోకసిద్ధములని చెప్పవలయును. అందులో 'అహం' అనెడి యాత్మదర్శనము ఏకరూపమై అంతట ననుగతమై యున్నందున ప్రధానమై యున్నది. 'మనుష్యః' యనెడి అనాత్మదర్శనము అనేకరూపమై వ్యావృత్తమై యున్నందున అప్రధానమై యున్నది. ఇట్టిలోకసిద్ధములైన ఆత్మదర్శనానాత్మదర్శనములలో ఆత్మదర్శనమునే చేయవలయునని విధించుచున్నందున 'ఆత్మా వా రే ద్రష్టవ్యః' ఇత్యాదివిధివచనము నియమవిధి యని చెప్పఁదగియున్నది. లేదా, 'అహం మనుష్యః' ఇత్యాదిలోకానుభవమునందు 'అహం' అనెడి యాత్మదర్శనమును విషయముండ 'మనుష్యః' ఇత్యాద్యనాత్మదర్శనమున్ను సంభవించుచున్నందున ఆత్మదర్శనానాత్మదర్శనములు రెండు సమానము లని చెప్పవచ్చును. అప్పుడున్ను సమానములుగా లోకసిద్ధములైన ఆత్మదర్శనానాత్మదర్శనములలో ఆత్మదర్శనమునే చేయవలయునని విధించుచున్న 'ఆత్మా వా రే ద్రష్టవ్యః' ఇత్యాది వచనము పరిసంఖ్యావిధియని చెప్పఁదగియున్నది. ఏలాగున చెప్పినను ఆత్మదర్శనము లోకసిద్ధమైనందున అపూర్వార్థము కానేరదు. కనుక ఆత్మదర్శనము అగ్నిహోత్రాదికర్మములలో నంతర్భూతము కాదు. ఆత్మదర్శనము లోకసిద్ధమయినందున దానియందు విధిసంభవించక పోయినను ఆత్మోపాసనము లోకములోఁ దెలియఁబడనిదైనందున ఆయుపాసనమునందు విధిసంభవించవచ్చునని పూర్వపక్షవాదితలంచునేమో! అదియును ఆశామాత్ర

మే కాని వాస్తవముగా సిద్ధించదు. ఎందువల్లనంటే, అనాత్మదర్శనమును నిరాకరించి ఆత్మదర్శనమును అవిచ్ఛిన్నముగా సంపాదించుట ఆత్మోపాసన మనంబడు. ఆత్మదర్శనములు మాటిమాటికి స్వయముగానే ప్రాప్తించుచున్నందున వాటియందు విధి ప్రవర్తించదు. కనుక ఉపాసనాపక్షమునందును, నియమముగాని పరిసంఖ్యగాని సిద్ధించునేకాని అపూర్వవిధి సంభవించదని భావము. ప్రమాణాంతరములచేత బొత్తిగా తెలియబడని యర్థమునందు విధి ప్రవర్తించును. లోకసిద్ధము ప్రమాణాంతరసిద్ధములైన విషయములలో నొకటి అప్రధానమైనయెడల నియమము ప్రవర్తించును. రెండువిషయములయందు లోకసిద్ధత్వము సమానముగా నున్నచో పరిసంఖ్య ప్రవర్తించునని ఉదాహృతశ్లోకమున కర్థము.

అవ. పూర్వపక్షవాది చెప్పిన మఱియొకయుక్తి ననువదించి దూషించుచున్నారు—

వాక్య. యచ్చోక్తం "విశ్వాసో నాన్యతోఽస్తి న" ఇతి తదపి నిద్రాతురచేతసా త్వయా స్వప్నాయమానేన ప్రలపితమ్.

దం-అ. "విశ్వాసో నాన్యతోఽస్తినః" అని మఱియొకఅర్థమునందు మాకు నమ్మకము లేనవి యేది చెప్పఁబడెనో అదియును నిద్రచేత నిగుడింపఁబడునట్టి చిత్తముగలవాఁడవై కలవరించుచున్న నీచేత ప్రలపించఁబడుచున్నది.

తా. ౧౫ వశ్లోకములో నీవు శ్రుతిస్మృతిప్రమాణములచేత నేయర్థము చెప్పఁబడునో ఆయర్థమే మాకు నమ్మదగియుండునుగాని చెప్పఁబడని మఱియొక అర్థమునందు మాకు విశ్వాసములేదు అని చెప్పిన యుక్తిని యాలోచించగా నీవు నిద్రాక్రాంతచిత్తుఁడవై కలవరించుచు చెప్పినావని తోఁచుచున్నదిగాని బుద్ధితో నిశ్చయించి చెప్పినావని తోచలేదని భావము.

అవ. పూర్వవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కిం కారణమ్? ౨౮౭

దం-అ. ఏమి కారణము?

తా. నేను కలవరించి చెప్పినానని, బుద్ధితో చెప్పలేదని మీరు చెప్పుటకు హేతు వేమి. యని భావము.

అవ సిద్ధాంతవాది కారణమును చెప్పుచున్నారు.—

వాక్య. న హి వయం ప్రమాణబలే నైకాత్మ్యం ప్రతిపద్యామహే; ఐకాత్మ్యస్య స్వత ఏవానుభవమాత్రాత్మకత్వాత్. ౨౮౯

దం-అ. అద్వితీయమైన ఆత్మతత్త్వము స్వయముగానే, (అనుభవమే స్వరూపముగాఁగలిగి యున్నందున మేము ప్రమాణముయొక్క సామర్థ్యముచేతనే అద్వితీయాత్మతత్త్వమును తెలిసికొన్నవారము కాము.

తా. అద్వితీయమైన యాత్మస్వరూపము స్వభావముచేతనే అనుభవమాత్రముగానున్నది. కనుక అట్టి అద్వితీయాత్మస్వరూపము ప్రమాణములచేత సిద్ధించునది కాదు. కావున మేము ప్రమాణముల నవలంబించి ఆత్మస్వరూపమును తెలిసికొనినదిలేదు. స్వానుభవముచేతనే తెలిసికొనియుంటిమి. కనుక ప్రమాణముచేత ఏవస్తువు సిద్ధించునో, ఆ వస్తువు ప్రమాణము లేనియెడల నమ్మతగినదుండదు. సరే, ప్రమాణగమ్యముగాక స్వతస్సిద్ధమై సర్వదా ప్రకాశించుచున్న ఆత్మస్వరూపమునందు ప్రమాణము లేనందున మాకు విశ్వాసము లేదని నీవుచెప్పినది అసంగతమైయున్నందున నీవు కలవరించుచు చెప్పినావని నిశ్చయించితిమని భావము.

అవ. ఆత్మతత్త్వము ఏలాగున ప్రమాణగమ్యము కాదంటే చెప్పుచున్నారు.—

వాక్య. అత ఏవ సర్వప్రమాణాసంభవం వక్ష్యతి. ౨౫౦

దం-అ. కనుకనే సకలమైన ప్రమాణములయొక్క అసంభవమును చెప్పఁబోవుచున్నాఁడు.

తా. అద్వితీయమైన ఆత్మతత్త్వమునందు ప్రత్యక్షానుమానశ్రుతిస్మృత్యాది ప్రమాణములు ఏవియును ప్రవర్తించవని ముందరిప్రకరణములో చెప్పఁబోవుచున్నాము. కనుక అచ్చటనే ఆత్మతత్త్వముయొక్క సకలప్రమాణాగోచరత్వమునుగూర్చి ఉపపత్తి తెలుపఁబడునని భావము.

అవ. ఆత్మతత్త్వము ప్రమాణగమ్యము కాదనుటయందు దిచ్చటను గూడ నొకయుక్తిని చెప్పుచున్నారు.—

వాక్య. ప్రమాణవ్యవస్థాయాశ్చ అనుభవమాత్రాశ్రయత్వాత్ ౨౫౧

దం-అ. ప్రమాణములయొక్క సిద్ధి అనుభవమునే యాశ్రయించియున్నందున ప్రమాణములచేత నాత్మస్వరూపము తెలియఁబడదని అధ్యాహారము.

తా. ప్రత్యక్షాదిప్రమాణములు స్వతః జడములైనందున స్వయముగా ప్రవర్తింప శక్తిలేనివై అజడమైన అనుభవము నాశ్రయించి ప్రవర్తించుచున్నది. అజడమైన అనుభవమే ఆత్మస్వరూపము. ఇట్టి సర్వప్రమాణముల కాశ్రయమైన ఆత్మతత్త్వము ప్రమాణములచేత నేలాగున తెలియఁజేయఁబడును? అనగా ప్రమాణములు ప్రవర్తించుటకు ముందుగానే తాను ప్రకాశించుచుండి అజడమైన అనుభవము (ఆత్మత

త్త్వము) తనచేతఁ బ్రవర్తింపఁజేయఁబడుచున్న జడములైన ప్రమాణములచేత ప్రకాశింపఁజేయఁబడదు. కనుక ఆత్మతత్త్వప్రమాణము కానేరదని మేము నిశ్చయించితి మని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. అత ఆహ. ౨౫౨

తం-అ. ఈయర్థమును చెప్పుచున్నారు.

తా. ఇదివఱకు చెప్పినదూషణమును విశదముగా చెప్పుచున్నారని భావము.

శ్లో. వాక్యైకగమ్యం యద్వస్తు నాన్యస్మాత్తత్ర విశ్వసేత్,
నాప్రమేయే స్వతస్సిద్ధేఽవిశ్వాసః కథమాత్మని. ౮౯. ౨౫౩.

దం-అ. ఏవస్తువు వాక్యములచేతనే తెలియఁదగియున్నదో దానిని మఱియొకదానివలన విశ్వసింపఁగూడదు. ప్రమాణములకు గోచరించనిదిన్ని స్వయంసిద్ధమైనదిన్ని అయిన ఆత్మతత్త్వమునందు పురుషుఁడు విశ్వాసము లేనివాఁడు ఏలాగున అగును?

తా. ఏవస్తువు శ్రుతిస్మృత్యాదివాక్యములప్రమాణత్వముచేతనే ప్రతిపాదించఁబడునో, అట్టివస్తువువిషయమై ప్రమాణవాక్యములు లేనియెడల విశ్వాసమును చేయఁగూడదు. ఇది సత్యమే; ఏప్రమాణమునకు గోచరించక, ఏప్రమాణము నపేక్షింపక అనుభవరూపమై స్వయముగాఁగదా ఆత్మతత్త్వము ప్రకాశించుచున్నది. అట్టి ఆత్మవస్తువునుగూర్చి విశ్వాసమును అవశ్యముగా చేయవలయునుగాని యేపురుషుఁడైనను విశ్వాసము లేనివాఁ డేలాగున కావచ్చునని భావము.

అవ. పూర్వపక్షవాది చెప్పిన మఱియొకయుక్తిని అనువదించి దూషించుచున్నారు.—

వాక్య. యదప్యుక్త "మంతరేణ విధి" మితి తదప్యబుద్ధిపూర్వక మివ నః ప్రతిభాతి. ౨౫౪

దం-అ. "అంతరేణవిధిం" అనెడిశ్లోకములో నేదిచెప్పఁబడెనో, అదియును బుద్ధిపూర్వకముగా చెప్పినదికాదని మాకు తోఁచుచున్నది.

తా. ౧౬ వ శ్లోకములో నాత్మజ్ఞానమునందు విధి లేదనిన్ని, విధి లేనటువంటి సాధనమును అనుష్ఠించుటచేత ఫలము లేదనిన్ని, పూర్వపక్షవాదిచేత చెప్పఁబడినది. అదియును బుద్ధిపూర్వకముగా నాలోచించి చెప్పినటుల మాకు తోఁచలేదు. ఉన్మత్తవచనమువలె తోఁచుచున్నది అని భావము.

అవ. పూర్వవాదియొక్క వచనము అబుద్ధిపూర్వకమని తాము చెప్పినందులకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. యస్మాత్ కాలాంతరఫలదాయిషు కర్మస్వేతత్ ఘటతే,
ఆత్మలాభకాల ఏవ ఫలదాయిని త్వాత్మజ్ఞానేనైతత్
సమంజసమితి ౫౪౫

పం-అ. ఎందువల్లనంటే కాలాంతరమందు ఫలము నిచ్చునట్టి కర్మలయం దిది ఘటించును. తనయొక్క ఉత్పత్తికాలమునందే ఫలము నిచ్చుచున్న ఆత్మజ్ఞానమునం దిది మంచిది కాదు. కనుక అబుద్ధిపూర్వక మీవచనమని తోఁచుచున్నది.

తా. యాగదానాదికర్మలు స్వర్గాదిఫలముల నిచ్చునని శాస్త్రముచేత తెలియఁబడుచున్నదిగాని యాగదానాదికర్మలస్వరూపముచేతనే తెలియఁబడినది కాదు. ఇదిగాక యాగదానాదికర్మలు తమతమఫలములను కొంతకాలమునకు తరువాత నిచ్చును గాని తాము పుట్టినకాలమందే ఇయ్యవు గనుక ఇట్టికర్మలు విధిని వినాగా ననుష్ఠింపఁబడెనేని నిష్ఫలము లని చెప్పవచ్చును. భోజనాదికర్మలు ఆకలిని నివర్తింపఁజేయుట ఫలముగాగలవి యని భోజనాదులస్వరూపముచేతనే తెలియఁబడుచున్నది. కనుక భోజనాదులు విధిని వినాగా చేయఁబడినను క్షున్నివృత్త్యాదిఫలముల నిచ్చుచున్నవిగదా? ఆప్రకారమే ఆత్మజ్ఞానమున్ను అజ్ఞాననివృత్తి ఫలముగాగలది యని స్వరూపముచేతనే తెలియఁబడుచున్నది. ఇదిగాక ఆత్మజ్ఞానము ఎప్పుడు జన్మించునో అప్పుడే సర్వాజ్ఞాననివృత్తి లోకములో ననుభవసిద్ధమై యున్నది. కనుక ఇట్టి ఆత్మజ్ఞానము విధిలేకయే అనుష్ఠించినచో నిష్ఫలమని చెప్పుట ఉన్మత్తప్రలాపము.

అవ. శ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. అహ ౫౪౬

పం-అ. చెప్పుచున్నారు.

శ్లో. జ్ఞానాత్పూర్వే త్యాబాధే సిద్ధి నివృత్తిస్తే ఫలమాత్మని,
ఉదాహరణమ తస్మైతి స న్యాయ్యం భాతి నో వచః. ౫౦. ౫౪౭

పం-అ. సంసారమును నివర్తింపఁజేయుచున్న సత్ఫలము ప్రత్యక్షమై ఆత్మజ్ఞానమువలనఁ బొందఁబడుచుండగా ఆయాత్మజ్ఞానము ఉదాసీనము (ఫలము)లేనిదని కాదనెడివచనము మాకు న్యాయయుక్తమని తోఁచలేదు.

తా. ఆత్మతత్త్వజ్ఞానము పుట్టినమాత్రాన అజ్ఞానముతోఁగూడ కర్తృత్వభోక్తృత్వాదిరూపమైన సంసారము నివర్తించుచున్నటుల తత్త్వవేత్తలయందు మన కందఱకు

ప్రత్యక్షముగా తెలియఁబడుచుండగా విధిహీనమైనందున ఆత్మజ్ఞానము ఫలము దని చెప్పినమాట ప్రత్యక్షమునకు విరుద్ధముగా నున్నందున ఉపేక్షింపఁదగియ భావము.

అవ. పూర్వపక్షవాది చెప్పిన మఱియొకయుక్తిని అనువదించి ద చున్నారు.—

వాక్య. య దపి జైమినీయం వచన ముద్ఘాటయసి తదపి తద్వి వక్షాఽపరిజ్ఞానా దేవోద్భావ్యతే. ౨౫౮

దం-అ. జైమినిమహామునిచేఁ జెప్పఁబడినవచనమును ప్రకటించినా ఏది కలదో, అదియును ఆజైమినియొక్క అభిప్రాయమును తెలియనందువల్లనే రించఁబడినది.

తా. జైమినిమహాముని కర్మమీమాంసలో 'ఆమ్నాయస్య క్రియార్థ ఆనెడిసూత్రముచేత వేదము యావత్తు క్రియాప్రతిపాదకమనిన్ని, క్రియాప్ర ముకాని వేదభాగము నిరర్థకమని చెప్పినారని పూర్వపక్షవాదివైన నీవు జైమి మును నీవాదమునకు ప్రమాణముగా నుదాహరించితివి కాని జైమినియొక్క ఆ మును తెలియకయే ఉదాహరించినావని భావము.

అవ. పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కిం కారణమ్? ౨౫౯

దం-అ. ఏమి? కారణము.

తా. జైమినిమహామునియొక్క తాత్పర్యము నాకు తెలియలే దనుచ ఈలాగున చెప్పుట కేమికారణము? 'ఆమ్నాయస్య క్రియార్థత్వాత్' అనెడి నకు జైమిని అభిప్రాయము ఎటువంటిది? చెప్పుమని భావము.

అవ. జైమినియొక్కభావమును వచించుచున్నారు.—

వాక్య. యతః న జైమినేరయ మభిప్రాయః, ఆమ్నాయ స్సర్వ ఏవ క్రియార్థ ఇతి యది హ్యయ మభిప్రాయోఽభవిష్యత్ "అథాతో బ్రహ్మజిజ్ఞాసా జన్మాద్యస్య యత" ఇత్యేవ మాది బ్రహ్మవస్తుస్వరూపమాత్రయాథాత్మ్యప్రకాశ నపరం గంభీరన్యాయసందృబ్ధం సర్వవేదాంతార్థమీమాం సనం శ్రీమచ్ఛారీరకం నాసూత్రయిష్యత్. అసూత్ర యచ్చ. తస్మాత్ జైమినే రేవాయ మభిప్రాయో యద్వై

విధివాక్యానాం స్వార్థమాత్రే ప్రామాణ్య మేవ మైకా
త్మ్యవాక్యానా మప్యనధిగతవస్తు పరిచ్ఛేదసామ్యా
దితి. ౨౬౦

దం-ఆ. ఎందువల్లనంటే వేదము సమస్తమున్ను కర్మప్రతిపాదకమని ఈయభి ప్రాయము జైమినిమహామునికి లేదు. ఈయభిప్రాయమే కలిగియుండెనేని 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా, జన్మాద్యస్య యతః, అని ఇవి మొదలయిన సూత్రములుగలదియును, గంభీరములైన న్యాయములచేత కూర్చబడినదియును, సకలములైన వేదాంతములయొక్క తాత్పర్యములను విచారించునదియును, బ్రహ్మవస్తువుయొక్క స్వరూపయాథార్థ్యమును మాత్రమే ప్రతిపాదించునదియును, పూజ్యమైనదియును అయిన శారీరకశాస్త్రము సూత్రింపఁ(చేయఁ) బడకయే యుండును. సూత్రింపఁబడినది గదా? కనుక ప్రమాణాంతరములచేత తెలియఁబడనివస్తువును ప్రతిపాదించుట సమానమైయున్నందున విధి వాక్యములకు స్వార్థమునందు ఎటువలె ప్రామాణ్యము కలదో అద్వితీయాత్మవస్తువును ప్రతిపాదించెడి వాక్యములకున్ను ఈప్రకారమే యని ఇదియె జైమినియొక్క అభి ప్రాయము.

తా. వేదములు యావత్తు కర్మనే ప్రతిపాదించుచున్నవని జైమునిమామునికి అభి ప్రాయము లేదు. అటువంటిఅభిప్రాయమే జైమినిమహామునికి కలిగియున్నయెడల ఉప నిషత్తులున్ను వేదములలో నంతర్భూతములై యున్నందున వాటికిన్ని కర్మలను ప్రతి పాదించుటయందే తాత్పర్యమున్నది గనుక జైమినికృతమయిన కర్మమీమాంసాశాస్త్ర ములోనే ఉపనిషత్తులనున్ను విచారించియుండును. అప్పుడు వేదాంతములయం దొక్క తాత్పర్యమును విచారించుటకు శాస్త్రమును శ్రీవేదవ్యాసమహాముని ప్రత్యేకముగా నారంభించకనే యుండును. ఆరంభించియున్నారుగదా? శారీరకశాస్త్రము 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా-జన్మాద్యస్య యతః' ఆనెడిసూత్రములు మొదలుకొని 'అనావృత్తి శ్శబ్దాదనా వృత్తిశ్శబ్దాత్' ఆనెడి సూత్రమువఱకు ౪ అధ్యాయములు పదునారు ౧౬ పాదములు, నూటతొంబదియొక్క (౧౯౧) అధికరణములు, (౫౫౫) అయిదువందల యేబదియై దుసూత్రములు కలదిగా నున్నది. ఈశాస్త్రము యావత్తు మధ్యేమధ్యే ప్రాసంగికముగా సగుణబ్రహ్మస్వరూపమును, తదుపాసనమును, కర్మాంగోపాసనములను, తత్తత్ఫలవిశే షములను ప్రతిపాదించియున్నప్పటికి అతిగంభీరములగు యుక్తులను చెప్పి ముఖ్యముగా సకలవిశేషశూన్యమైన నిర్గుణబ్రహ్మస్వరూపముయొక్క యాథార్థ్యమునే ప్రతిపాదిం చుచున్నది. కనుక ప్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియఁబడని స్వర్గాదిఫలసాధనములైన

కర్మలను ప్రతిపాదించుచున్నందున పూర్వభాగముకర్మకాండలోనివిధివాక్యములు ఏలాగునస్వార్థమునందు (కర్మలయందు) ప్రామాణ్యముకలవై యున్నవో, ఆలాగుననే వేదాంతవాక్యములున్ను ప్రమాణాంతరములచేత ప్రతిపాదింపఁబడని బ్రహ్మస్వరూపమును ప్రతిపాదించుచున్నందున స్వార్థమునందు (బ్రహ్మమందు) ప్రామాణ్యముకలవై యుండునని జైమినియొక్క తాత్పర్యము స్పష్టముగా కనుపడుచున్నది యని భావము.

అవ. అయితే, 'ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ అనెడిసూత్రమున కేమి తాత్పర్యము? ఈసూత్రము వేదము కర్మపరమని కాదా చెప్పునది? అని పూర్వపక్షవాది శంకించునని తలచి ప్రత్యుత్తరమును చెప్పుట కారంభించుచున్నారు.—

వాక్య. అత ఇద మభిధీయతే. ౨౬౧

దం-అ. కనుక ఇది చెప్పఁబడుచున్నది.

తా. జైమినియొక్క అభిప్రాయము ఇదివఱకే మేము చెప్పినదే అయినందున 'ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ అనెడిసూత్రమునకు తాత్పర్యమును చెప్పుచున్నామని భావము.

శ్లో. అధిచోదనం య ఆమ్నాయః తస్యైవ స్యాత్ క్రియార్థతా, తత్త్వమస్యాదివాక్యానాం బ్రూత కర్మార్థతా కథమ్. ౯౧ ౨౬౨

దం-అ. విధిప్రకరణములో నున్న వేదము ఏది కలదో దానికే కర్మపరత్వము కలిగియుండుగాక. తత్త్వమసి మొదలగు వాక్యములకు కర్మపరత్వము ఏలాగున సంభవించును చెప్పుదురుగాక.

తా. జైమినిమహాముని తాను చేసిన కర్మమీమాంసాశాస్త్రములో ముందుగా ధర్మమును (కర్మను) విచారించెదనని ఆరంభించి విచారింపఁబడెడి ధర్మమునకు (కర్మకు) ప్రమాణము చోదనాశబ్దవాచ్యములైన వేదవాక్యములను ప్రతిపాదించిరి. అనంతరము వేదము కొంత విధిరూపముగా, కొంత అర్థవాదరూపముగా, మఱికొంత మంత్రరూపముగాఁ గదా యున్నది. పురుషప్రయత్నసాధ్యములైన యాగదానాదికర్మలయందు పురుషులను నియోగించునట్టి వేదము విధి యని దేవాసురయుద్ధాదిపూర్వవృత్తాంతములను జెప్పునట్టి వేదము అర్థవాదమునిన్ని, దేవతాస్వరూపదేవతాస్తోత్రాదిప్రతిపాదకమైన వేదము మంత్రమనిన్ని చెప్పఁబడును గనుక వేదము కర్మయందు ప్రమాణమని చెప్పెడియెడల విధిరూపమైన వేదభాగము క్రియాప్రతిపాదకమైనందున ప్రమాణమైనప్పటికి అర్థవాదరూపమైన వేదభాగము క్రియాప్ర

పాదకముగానందునను, సిద్ధరూపములైన దేవాసురయుద్ధాదివిషయములను ప్రతిపా
౦చుచున్నందునను, ప్రమాణముకాదని చెప్పవలయునని పూర్వపక్షవాదిచేసిన యాక్షే
మును ఆమ్నాయస్య క్రియార్థత్వాత్' అనెడి సూత్రముచేత ననువదించి, అనంతర
గాత్రముచేత అర్థవాదవాక్యములు విధివాక్యములతోఁటి ఏకవాక్యముగా చేరి
ధివాక్యములచేత ప్రతిపాదింపఁబడిన కర్మను స్తుతిచేయును అకర్మమందు
రుషులకు రుచినిపుట్టించును. కనుక అర్థవాదమునును కర్మపరములై యున్నందున
ప్రమాణములే అని సమాధానమునుచెప్పిరి. కావున విధివాక్యములయొక్క సన్నిధానమం
ందు పఠింపఁబడుచున్న అర్థవాదవాక్యములు కర్మపరములని 'ఆమ్నాయస్య క్రియార్థ
త్వాత్' అనెడిసూత్రముచేత చెప్పిరిగాని విధివాక్యసమీపమునందు పఠింపఁబడని 'తత్త్వ
సి- అయమాత్మా బ్రహ్మ' ఇత్యాదివాక్యములును కర్మపరములని చెప్పినవారు కారని
'వము.

అవ. పూర్వపక్షవాది ౧౮ వ శ్లోకములో 'కుర్వన్నేవేహకర్మాణి' యనెడి ఈశా
'స్యమంత్రము నుదహరించి యీమంత్రము పురుషునియొక్క యావత్తు ఆయుష్య
ను కర్మములయందే వినియోగింపఁజేయుచున్నందున కర్మములే మోక్షసాధనమని
రూపించెను. అది యుక్తముకాదు. ఎందువల్లనంటే ప్రత్యగాత్మ వాస్తవముగా కర్తృ
భోక్తృత్వాదివికారములు కలవాఁడుగానందునను, అట్టి ప్రత్యగాత్మతత్త్వమును తెలి
వానికి కర్మములయం దధికారము సంభవించనందునను, కుర్వన్నిత్యాదిమంత్రములను
నిపరముగా చెప్పవలసియున్నదని ప్రతిపాదించుట కారంభించుచున్నారు.

శ్లో. అపిచ ఏకాత్మపక్ష ఇవ అదృష్టార్థకర్మసు భవత్పక్షేఽపి
ప్రవృత్తిర్దుర్ఘటా. ౨౬౩

దం-అ. ఇదిగాక అద్వితీయాత్మవాదినైన నాయొక్కమతమునందువలె నీమతము
నను అదృష్టఫలములైన కర్మములయందు ప్రవృత్తిచూడ శక్యమైనదికాదు.

తా. మాపక్షమునందు విధిని అంగీకరించనందున కర్మములయందు ప్రవృత్తి
గున సంభవించదో ఆలాగుననే నీపక్షమునందును విధిని అంగీకరించినప్పటికిని స్వర్గాది
సాధనములైన కర్మలయందు ప్రవృత్తి సంభవించనేరదు.

అవ. పూర్వపక్షవాది ప్రశ్నమును చేయుచున్నాఁడు.

శ్లో. యతః. ౨౬౪

దం-అ. ఎందువలన.

తా. నాపక్షమందు కర్మలయందు ప్రవృత్తి ఏకారణమువల్ల సంభవించదని
ము.

అవ. సిద్ధాంతవాది యుత్తరమును చెప్పుచున్నాఁడు.

శ్లో. స్వర్గం యియాసుర్జుహుయా దగ్నిహోత్రం యథావిధి?
దేహాత్ వ్యుత్థాపితస్యైవం కర్తృత్వం జైమినేః కథమ్.

దం-అ. స్వర్గమును పొంద నిచ్ఛయించినపురుషుఁడు అగ్నిహోత్రమును యథా శాస్త్రముగా ననుష్ఠించవలయునని ఈప్రకారము దేహములోనుండి వేరుగాఁ జేయఁ బడినయాత్మకు కర్తృత్వము జైమినియొక్కపక్షమునం దేలాగున సంభవించును?

తా. వర్తమానదేహము నశించినతరువాత మఱియొకదేహమునొంది చంద్రలోకాదిదేవలోకములయం దనుభవింపఁదగిన స్వర్గమనుసుఖవిశేషము నిచ్ఛయించినవాఁడు అగ్నిహోత్రాదికర్మల నాచరించవలయునని వేదము విధించుచున్నది. ఇట్టివేదము కరచరణాద్యవయవములతోఁ గూడుకొని పంచభూతవికారమై, ప్రత్యక్షమైన యీశరీరముకంటే అత్యంతభిన్నమై ఆత్మస్వరూపముండిననేగాని ప్రవర్తించదు. దేహేంద్రియాది విలక్షణమైన యాత్మస్వరూపము అవయవములులేనందున స్పందనాదిక్రియలు లేనిదైయుండును. స్పందనాది (చలనా) క్రియలు లేనందున ఆత్మకు కర్తృత్వము సంభవించదు. చలనాదిక్రియలు లేకపోయినప్పటికి ప్రయత్నముకలిగియున్నందున కర్తృత్వముకలుగవచ్చునని యూహింపఁదగదు. ఎందువల్లనంటే, ప్రయత్నమనునది అంతఃకరణముయొక్క ధర్మముకావున ఆత్మయందు ప్రయత్నముగాని, తత్ప్రయుక్తమైన, కర్తృత్వముగాని సంభవింపదు. గనుక 'అగ్నిహోత్రంజుహుయాత్స్వర్గకామః' ఇత్యాది విధివాక్యములనుబట్టి ఆత్మ దేహేంద్రియాదులకంటె అత్యంతభిన్నుఁడనిగదా జైమిని మహాముని చెప్పుచున్నాఁడు. ఇట్టి దేహేంద్రియశూన్యుఁడైన ఆత్మయందు చలనాదిక్రియలు లేనందున కర్తృత్వముకలదని చెప్పుటకు జైమినికి ఏలాగున శక్యమైయుండు ననిభావము.

అవ. ఈప్రకారము దేహాదివిలక్షణమైన యాత్మయందు కర్తృత్వములేదని నిరాకరించి అధికారముకూడ లేదని నిరాకరించుచున్నారు.

వాక్య. న చ ప్రత్యాఖ్యాతాశేషశరీరాది కర్మసాధన స్వాభావ స్యాత్మమాత్రస్య కర్మస్వధికారః. ౨౮౮

దం-అ. నిషేధింపఁబడిన సకలమైనశరీరము మొదలగుకర్మసాధనములుంగల స్వభావముకలవాఁడు గనుకనే కేవలమైయున్న ఆత్మకు కర్మలయం దధికారములేదు.

తా. శరీరేంద్రియములతోఁగూడియుండిననేకదా కర్మల ననుష్ఠించును గనుక శరీరేంద్రియాదులు కర్మలకు సాధనములు. ఇట్టి కర్మసాధనములైన శరీరేంద్రియాదులు

తనవికావని స్వభావముచే నిరాకరించియున్న ఆత్మ కేవలముగానుండును. కనుక కర్మల యం దధికారమే కలవాఁడుకాదని భావము.

అవ. పూర్వపక్షవాది ప్రశ్నమును జేయుచున్నాఁడు.

వాక్య. యస్మాత్. ౨౬౫

దం-అ. ఎందువల్లను.

తా. ప్రత్యగాత్మకర్మలయం దధికారముకలవాఁ డెందువల్ల కానేరఁడని భావము.

అవ. సిద్ధాంతవాది ఉత్తరమును చెప్పుచున్నాఁడు.

శ్లో. సర్వప్రమాణాసంభావ్యో హ్యహం వృత్త్యేకసాధనః,
యుష్మదర్థమనాదిత్సుర్జైమినిః ప్రేర్య తేకథమ్. ౭౩ ౨౬౬.

దం-అ. సకలప్రమాణములచేత గ్రహింపఁబడనివాఁడును 'అహం' (నేను) అనెడివృత్తియొకటే సాధనముగాకలవాఁడును అంతఃకరణము మొదలయినపరాగర్థమును గ్రహించనివాఁడునైన జైమినిశరీరమందు కనఁబడుచున్న జీవుఁడు (ఆత్మ) విధిచేత నేలాగున ప్రేరేపింపఁబడును అని చెప్పుట దాని నుపాలంభనముచేయుట కొఱకే యనియధ్యాహారము.

తా. ఆత్మయనఁగా ప్రత్యక్షము మొదలగుప్రమాణములచేత తెలియఁబడునట్టివాఁడు కాఁడు. అహం నేను అనెడి అంతఃకరణవృత్తిచేతనే గ్రహింపఁబడును. ఇట్టి ప్రత్యగాత్మ, దేహము, ఇంద్రియములు, మనస్సు అహంకారము ఇవి మొదలగు ననాత్మపదార్థములతోటి సంబంధములేనివాఁడైయుండును. కనుక విధివచనములచేత కర్మలయందు ప్రవర్తింపఁజేయఁబడదని భావము. ఇచ్చట ప్రత్యగాత్మవిధివచనములతో ప్రవర్తింపఁజేయఁబడఁడని సామాన్యముగా చెప్పవలసినది ఆవశ్యకమైయుండగా జైమిని యేలాగున ప్రవర్తింపఁజేయఁబడునని చెప్పెనో అందులకు జైమినిని పరిహసించుట కొఱకని తెలియవలయును. అహంకారాద్యనాత్మవస్తువులతోటి సంయోగముకలిగియున్నప్పుడే ప్రత్యగాత్మను కర్మవిధులు ప్రవర్తింపఁజేయునుగాని కేవలముగా నున్నప్పుడు ప్రవర్తింపఁజేయఁజాలవు. జైమినియు, దేహేంద్రియాద్యనాత్మపదార్థములకంటె, ప్రత్యగాత్మవిలక్షణమైన వాఁడని చెప్పుచున్నప్పుడు, వానిని (ప్రత్యగాత్మను) విధులచేత నేలాగు ప్రవర్తింపఁజేయును అనితాత్పర్యము.

అవ. ఈప్రకారము ఆత్మకు కర్మలయందు కర్తృత్వము అధికారములేదని చెప్పి కర్మఫలములయందు భోక్తృత్వము లేదని చెప్పుచున్నారు.

వాక్య. ప్రవృత్తికారణాభావాచ్ఛ యస్మాత్. ౨౬౯

దం-అ. ప్రవర్తించుటకు కారణములేనందువల్లను కర్మలయందు ప్రవృత్తికలుగ నేరదు.

తా. కర్మలయందు ప్రవర్తించుటకు కారణము ఫలము, అనఁగా ఒకఫలమునం దొకనికి అభిలాషకలిగెనేని ఆఫలమునకు సాధనమైనకర్మలయందు ప్రవర్తించును. ప్రత్యగాత్మకు ఫలమే లేనందున కర్మలయందు ప్రవృత్తికలుగదని భావము.

అవ. ఎందువలన ఫలములేదంటే చెప్పుచున్నారు.

శ్లో. సుఖదుఃఖాదిభిర్యోగ ఆత్మనో నాహమేత్యతే,
పరాక్త్వాత్ ప్రత్యగాత్మత్వాత్ జైమినిః ప్రేర్యతే కథమ్.

దం-అ. ఎందువల్లనంటే ఆత్మకు సుఖదుఃఖాదులతోఁటి సంభంధములేదు. అహం (నేను) అని చెప్పెడియంతఃకరణముతోఁటి కనబడుచున్నది! సుఖదుఃఖాదులు దృశ్యములగుటవల్లను ఆత్మదృక్కు అగుటవలనను ఈరెంటికి సంబంధములేదుగనుక జైమిని ఏలాగున విధివచనములచేతఁ బ్రేరణఁజేయఁబడును.

తా. సుఖప్రాప్తి దుఃఖనివృత్తిఫలమని చెప్పఁబడును. ఇట్టిఫలము ఆత్మతోను సంబంధిచదు. ఎందువల్లననఁగా, సుఖాదివిషయములు జడములై దృశ్యములై యున్నవి ఆత్మ అజడమై దృగ్రూపుఁడై యున్నవాఁడు. దృక్దృశ్యములకును. జడాజడములకును సాజాత్యము లేనందున సంబంధములేదు. కనుక సుఖదుఃఖములు ఆత్మతో సంబంధము కలవికానందున, ఆత్మ, కర్మలయందు ప్రవర్తింపఁజేయఁబడఁదు. అయితే, నేను సుఖముకలవాఁడను, నేను దుఃఖముకలవాడును అని సుఖదుఃఖములు ఆత్మసంబంధము కలిగియున్నట్టు కనబడుచున్నదట యంటిరా ఆలాగు చెప్పఁగూడదు. అచ్చట నేను అనెడిశబ్దము అంతఃకరణమును చెప్పుచున్నదిగాని ఆత్మను చెప్పలేదు. అంతఃకరణము మును చెప్పుచున్నదిగాని ఆత్మనుచెప్పలేదు. అంతఃకరణముతోఁటి సుఖదుఃఖాదులు సంబంధించుచున్నవని మేమును చెప్పుచున్నాము. సుఖదుఃఖములు దృశ్యమైన అంతఃకరణముయొక్క పరిణామములైనందున అంతఃకరణధర్మములేగాని దృగ్రూపమైన ఆత్మయొక్కధర్మములు కాఁదగవు. కనుక శుద్ధమైన ప్రత్యగాత్మకు ఫలసంబంధమే లేనందున, జైమిని శరీరోపలక్షితమైన ఆత్మవిధిచేత నేలాగున ప్రవర్తింపఁచేయఁబడునని భావము. ఈశ్లోకములోను ఆత్మ ఏలాగున ప్రవర్తింపఁజేయఁబడునని తాత్పర్యము పూర్వశ్లోకమునందువలె నూహించవలయును.

అవ. మఱియొక హేతువుచేతకూడ ఆత్మకు సుఖాదులతోఁటి సంబంధములేదని చెప్పుచున్నారు.

శ్లో. నతావదస్య ఏవాస్తి శరీరేణాత్మనః సదా,
విషయై ర్దూరతో నాస్తి స్వర్గాదౌ స్యాత్కథం సుఖమ్, ౯౫ ౨౭౧

దం-అ. ఆత్మకు శరీరముతోఁటి సంబంధమే యెప్పటికిలేదు. విషయములతోఁటి సంబంధము దూరమందేలేదు. స్వర్గాదిలోకమందుగల సుఖమేలాగుకలుగును?

తా. ఇదిగాక మఱియొక హేతువుచేతగూడ ఆత్మకు భోక్తృత్వములేదు. సుఖదుఃఖాదిభోగములను సంపాదించెడిసాధనములతోఁటి ఆత్మకు సంబంధములేనందున ఆత్మ భోక్తకానేరఁడు. అదియేలాగంటే, ఆత్మ అసంగస్వభావముకలవాఁడైనందున ఆకాశము రజోధూమజలధారాదులతోఁటి సంబంధములేనిదైయున్నటుల అహం (నేను) అని చెప్పఁబడుచున్న దేహముతోనే సంబంధముకలవాఁడుకాఁడు. దేహముతోనే సంబంధములేనప్పుడు దేహానుబంధములైనశబ్దస్పర్శాదివిషయములతోఁటి సంబంధము బొత్తిగా నుండనేరదు. శబ్దస్పర్శాదివిషయములేగదా భోగములను సంపాదించుసాధనములు. అట్టివిషయములతో సంబంధములేనందున ఆత్మకు స్వర్గాదులయందు సుఖము సంభవింపదు. కనుక ఆత్మకు భోక్తృత్వములేదు. అందువలననే విధివాక్యములచేత ప్రవర్తింపఁజేయఁబడఁడని భావము.

అవ. ఈప్రకారము కర్తృత్వము, అధికారము, భోక్తృత్వము ఆత్మకు వాస్తవముగా సంభవించవు. కనుక అనాద్యజ్ఞానముచేత దేహేంద్రియవిషయములయందు నేనని నావియని యహంకారమమకారరూపమైన మిథ్యాభిమానముకలవానికే కర్మలయం దధికారముకలదని 'కుర్వ న్నేవ' అనెడిమంత్రము చెప్పుచున్నదని ఫలితార్థమును చెప్పుచున్నారు.—

వాక్య. యస్మా దన్యథా నోపపద్యతే (ఈవాక్యమునకు క్రింది శ్లోకముతోఁజేర్చి యర్థతాత్పర్యాదులు వివరింపఁబడియున్నది. కావున దీనిని ప్రత్యేకించి గణింపలేదు.

శ్లో. నరాభిమానినం తస్మా త్కారకా ద్యాత్మదర్శినమ్,
మంత్ర ఆహోరరీకృత్య కుర్వన్నితి న నిర్ద్వయమ్. ౯౬. ౨౭౨

దం-అ. ఏ హేతువువలన మఱియొకవిధముగా నుపపన్నముకాదో అందువలన మనుష్యత్వమునం దభిమానముకలవాఁడై కర్తృత్వాదిధర్మములయం దాత్మాభిమానము కరిగియున్నపురుషుని అంగీకరించి "కుర్వన్" అనుమంత్రమును చెప్పినదిగాని అద్వితీ

యుండైనవానినిగూర్చి చెప్పినదికాదు. అని వాక్యమును శ్లోకము నొకటిగా నన్వయించుము.

తా. కేవలుండై అద్వితీయుడైన ఆత్మకు కర్మలయందు ప్రవృత్తికలుగునని చెప్పుటకు వీలుకాదు. కనుక, కుర్వన్నే వేహకర్మాణి జిజీవిషేత్ శతగ్ంసమాః.'. అనెడి మంత్రము దేహమందుగల మనుష్యత్వబ్రాహ్మణత్వాదులను అజ్ఞానముచేత తనయందారోపించుకొని "నేను మనుష్యుఁడను" అని, "నేను బ్రాహ్మణుఁడను" అని వ్యవహరించుచు అంతఃకరణమందుగల కర్తృత్వభోక్తృత్వాదులను తనయం దారోపించుకొని నేను కర్తనని, నేను భోక్తనని మిథ్యాభిమానముగల జీవాత్మను ఉద్దేశించి బ్రతికినంత కాలము కర్మలనుచేయుమని చెప్పినదనిగాని, అభిమానహీనుఁడైన కేవలశుద్ధాత్మనుగూర్చి చెప్పినదికాదని భావము.

అవ. పూర్వపక్షవాదిచెప్పిన మఱియొకయుక్తిని అనువదించి దూషించుచున్నారు.

వాక్య. యచ్చోక్తం "విరహయ్యేతి"తదపి న సమ్యగేవ. ౧౩౭

దం-అ. విరహయ్య అని ఏది చెప్పఁబడెనో అదియును మంచిది కానేకాదు.

తా. "విరహయ్యక్రియాం" అనెడి ౧౯ వ శ్లోకమునందు, పూర్వపక్షవాది, క్రియాపదములేనిచో వాక్యము అన్వయించదు; గనుక క్రియాపదము అన్నివాక్యములయందు అవశ్యాపేక్షితమై యున్నదనియు, అట్టిక్రియాపదము పురుషప్రయత్నసాధ్యమైన అర్థమునే చెప్పుననియుం, అందువల్ల సర్వవాక్యములు క్రియాప్రతిపరపాదకములనియు", ప్రతిపాదించెను. అదియు యుక్తియుక్తమై యుండలేదు. ఎందువల్లనంటే "సోయం దేవదత్తః" (ఈదేవదత్తుఁ డాదేవదత్తుఁడనిన్ని), "సోయంగ్రామః" (ఈ గ్రామ మాగ్రామము) అనిన్ని, ఇవిమొదలుగు వాక్యములయందు క్రియాపదము లేక పోయినప్పటికిని వాక్యము లన్వయించి సంపూర్ణార్థము కలవైయున్నందున క్రియాపదము నన్నివాక్యములయందు నవశ్యాపేక్షితములని చెప్పుట న్యాయముకాదని భావము.

అవ. ఓయీ! "సోయం దేవదత్తః, సోయంగ్రామ" ఇత్యాదివాక్యములయందును 'పశ్య' (చూడుము), 'గచ్ఛ' (పొమ్ము) ఇత్యాదిక్రియాపదములుగలవు. ఈ క్రియాపదములు సోయమిత్యాదివాక్యమును వినువారికి స్పష్టముగా దోచుచున్నందున కంఠరవముగా ప్రయోగింపఁబడలేదుగాని, వీనిని అధ్యాహారము చేయవలసియున్నది. అని పూర్వపక్షవాది శంకించునని తలఁచి, సిద్ధాంతవాది ప్రత్యుత్తరమును చెప్పుచున్నాఁడు

వాక్య. తథాపి తు న యాకాచిత్క్రియా యత్ర క్వచాధ్యాహారణీయా కింతు యా యత్రాభిప్రేతసంబంధంఘటయితుం శక్నోతి ఆకాంక్షాంచ వాక్యస్య పూరయతి సైవాధ్యాహరణీయా ఏవం విశిష్టాచ క్రియా అస్మాభి రభ్యుపగతైవ. ౨౭౪

దం-అ. అయినప్పటికిని ఏదో ఒకక్రియ యెచ్చటనుండియో యొకదాని) అధ్యాహారించతగదు. ఇకనేమంటే యేక్రియ యెచ్చట ఇష్టమైనసంబంధమును ఘటింపచేయుటకున్ను సమర్థమైయుండునో, వాక్యముయొక్క ఆకాంక్షను (అపేక్షనుని పూర్ణముగాచేయునో ఆక్రియయే అధ్యాహారింపతగును. ఇటువంటిక్రియ మాచే నంగీకరింపఁబడియున్నది.

తా. ఈదేవదత్తుఁడే ఆదేవదత్తుఁడు ఇత్యాదివాక్యములయందు, "చూడుము" ఇత్యాదిక్రియాపదములు అధ్యాహారించఁబడియున్నవి. వాస్తవమే అయినప్పటికినిఏదో ఒకక్రియను అధ్యాహారించి వాక్యమునందు అన్వయించగూడదు.ఇఁక నెటువంటిక్రియాపదమును తెచ్చి యన్వయింపవలయునంటే, వాక్యమునకు ఏయర్థతాత్పర్యవిషయమైయున్నదో, ఆట్టియర్థము యెటువంటిక్రియాపదమును తెచ్చి అన్వయించితే ఘటించునో అట్టిక్రియాపదమును తెచ్చి అన్వయించవలయును. ఇదిగాక వాక్యము తాను ఏఅర్థమును చెప్పుచున్నదో ఆయర్థమును పూర్తిచేయుటకు, దేనిని ఆపేక్షించునో, దానిని పూర్తిచేయునట్టి క్రియాపదమును తెచ్చి అన్వయింపవలయును. కాని పురుషులను ఆయా కార్యములయందు ప్రవర్తింపఁ చేయవలయునట్టి, క్రియాపదములనెడి అన్నివాక్యములయందును తెచ్చి అన్వయించవలయుననెడి నియమములేదు. కనుకనే 'తత్త్వమసి అహంబ్రహ్మాస్మి' ఇత్యాదివేదాంతవాక్యములయందు 'అసి'=అయితివి, అస్మి''=అయితిని, ఇత్యాదిక్రియాపదములు ప్రయోగింపఁబడియున్నవి. వాటిని మేము అంగీకరించియున్నారమని భావము.

అవ. తత్త్వమస్యాదివాక్యములయందుగల అసీత్యాదిక్రియాపదముల నంగీకరించుటకు కారణము చెప్పుచున్నారు.

వాక్య. సాతు ఉపాదిత్సిత వాక్యార్థా విరోధిన్యేవ నా భూతార్థప్రాదుర్భావఫలేతి. ౨౭౫

దం-అ. ఆక్రియాపదమైతే ప్రతిపాదించ నిచ్ఛయింపఁబడిన వాక్యార్థమునకు అవిరుద్ధమైనదేగాని, లేనియర్థముయొక్క ఉత్పత్తిఫలముగా కలదికాదనెడి హేతువువలన అసీత్యాదిక్రియ మాచే నంగీకరింపఁబడినదని యన్వయము.

తా. తత్త్వమస్యాదిమహావాక్యములు ఉపక్రమోపసంహారాది తాత్పర్యలింగములచేత, ప్రత్యగాత్మ, పరమాత్మలయొక్క ఐక్యమును ప్రతిపాదించుచున్నవి. కనుక ప్రత్యగాత్మ పరమాత్మైక్యమే తత్త్వమస్యాదివాక్యములకు తాత్పర్యార్థము. ఇట్టితాత్పర్యార్థమునకు అస్మి' ఇత్యాదిక్రియాపదములు అనుకూలములైయున్నవిగాని, ప్రత్యగాత్మ, పరమాత్మలయందు సంభవించని ఉత్పత్తి, ఆప్తి, వికృతి, సంస్కారములని యెడిధర్మములను సంబంధింపఁజేయుననికావు. కనుక ఆటువంటిక్రియాపదములను మేము అంగీకరించినారమని భావము

అవ. చెప్పితయర్థమును వివరించుచున్నారు.—

వాక్య. షడ్భావవికారరహితాత్మవస్తునః నిర్ధూతాశేషద్వైతానర్థస్యాపరాధీన ప్రకాశస్య విజిజ్ఞాపయిషితత్వాత్ అసి, అస్మీత్యాదిక్రియాపదం స్వమహిమ సిద్ధార్థప్రతిపాదనసమర్థ మభ్యుపగంతవ్యం నవిపరార్థ ప్రతిపాదన పరమితి.

దం-అ. నిరసించఁబడిన సకలమైనభేదరూపమగు అనర్థముకలదియును, అన్యాధీనముకాని ప్రకాశముగలదియును, ఆఱుభావవికారములు లేనిదియునైన ఆత్మవస్తువు తెలియచేయ నిచ్ఛయింపఁబడియున్నందున, వాక్యప్రభావముచేత నేర్పడినయర్థమును ప్రతిపాదించుటయందు శక్తమై 'అసి, అస్మి. ఇనిమొదలగుక్రియాపదము లంగీకరింపఁదగియున్నది. విరుద్ధమైనయర్థమును ప్రతిపాదించుటయందు తాత్పర్యముగల క్రియాపదము లంగీంరింపఁబడదు.

తా. వేదాంతవాక్యములు ఆత్మతత్త్వమును ప్రతిపాదించుటకు ప్రవర్తించినవిగాని, మఱియొకవిషయములను ప్రతిపాదించుటకు ప్రవర్తించలేదు. కనుకనే అన్నియుపనిషత్తులు బ్రహ్మశబ్దమునుగాని, ఆత్మశబ్దమునుగాని మొదటివాక్యములో నుదహరించి, ఆబ్రహ్మాత్మస్వరూపము తెలియుటకుగాను, కొన్నివిషయములను మధ్యే ప్రతిపాదించి, చివరవాక్యములోనున్న బ్రహ్మాత్మశబ్దముల నుదహరించి నిగమించుచున్నవి. ఇట్టి సకలవేదాంతతాత్పర్యగోచరమైన ఆత్మతత్త్వము అనర్థరూపమైన కర్తృత్వభోక్తృత్వాది భేదపదార్థములను, భూతభౌతికదేహేంద్రియాదిభేదపదార్థముల దూరముగా పరిత్యజించినదై తాను జ్ఞానరూపమైనందున స్వయముగా ప్రకాశించుచున్నదై జన్మమరణవృద్ధిక్షయస్థితిపరిణామము లనెడిభావవికారములాఱున్ను లేనిదైయున్నది. అనఁగా అద్వితీయమై సకలానర్థశూన్యమై స్వయంప్రకాశమై జన్మాదివికారములులేనిదై యున్నదని యర్థము. ఈప్రకారము ఆత్మతత్త్వమును వేదాంతములు ప్రతిపాదించు చున్నవి.

ఈయర్థము వేదాంతవాక్యములయందు సరసముగా స్ఫురించుచున్నది. ఇట్టి వేదాంత వాక్యార్థమును 'అస్మి'=అయితివి, 'అస్మి'=అయితిని ఇత్యాదిక్రియాపదములు సమర్థించుచున్నవి. గనుక వీటిని అంగీకరించవచ్చును. వేదాంతవాక్యార్థమునకు విపరీతమైనఅర్థమును బోధించెడిక్రియాపదమును అంగీకరించతగదని భావము.

అవ. ఈచెప్పిన యర్థమును దృష్టాంతమును చెప్పి నిరూపించుచున్నారు.—

శ్లో. ధావే దితి న దానార్థే పదం యద్వత్ప్రియుజ్యతే,
ఏధీత్యాది తథా నేచ్ఛేత్స్వతః సిద్ధార్థవాచిని. ౯౭. ౨౭౭

దం-అ. దానము అర్థముగాగలవాక్యమునందు 'పరుగెత్తవలయు'నని క్రియాపదము ఎటువలె ప్రయోగింపఁబడదో అటువలె స్వయంసిద్ధమైనవస్తువును చెప్పుచున్న వాక్యమునందు 'వృద్ధినొందుము' ఇత్యాదిక్రియాపదమును ఇచ్ఛయింపఁదగదు.

తా. 'హిరణ్యం దద్యాత్' (బంగారమును ఇయ్యవలయును) అని దానమును ప్రతిపాదించెడివాక్యమునందు 'దద్యాత్' (ఇయ్యవలయును) అనుక్రియాపదము ప్రయోగింపఁదగునుగాని 'ధావేత్' (పరుగిడవలయును) అనెడిక్రియాపదము ప్రయోగింపఁదగియుండదుగదా? ఆప్రకారమే జనన, వృద్ధి, క్షయాదులగువికారములు లేనిదై, స్వతస్సిద్ధమైన ఆత్మవస్తువును ప్రతిపాదించుచున్న వేదాంతవాక్యములయందు ఆత్మస్వరూపమైనసత్తను ప్రతిపాదించునట్టి 'అసి, అస్మీ' త్యాదిక్రియాపదములు ప్రయోగింపఁదగియుండునుగాని, జనన, వృద్ధ్యాదివికారములను ప్రతిపాదించుచున్న 'ఏధి' (వృద్ధినొందుము) ఇత్యాదిక్రియాపదము ప్రయోగింపఁదగియుండదని భావము.

అవ. ఓయీ! 'తత్త్వమసీ'త్యాది వేదాంతవాక్యము స్వయంసిద్ధమైన ఆత్మవస్తువును బోధించునదిమాత్రముకాదు. 'ఆబ్రహ్మను నీవు అయితివి' అని ఉపాసించవలయునని ఉపాసనవిధిని బోధించుచున్నదిగదా యని పూర్వవాది శంకించునని తలఁచి సిద్ధాంతవాది పరిహారమునుచెప్పుచు ముందరిశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. న చ యథోక్తవస్తువృత్తప్రతిపాదన వ్యతిరేకేణ
'తత్త్వమస్యా'దివాక్యం వాక్యార్థాంతరం వక్తీతి శక్యమ
ధ్యవసాతు మిత్యాహ. ౨౭౮

దం-అ. 'తత్త్వమసి' ఇవిమొదలగువాక్యములు ఇదివఱకు చెప్పిన ఆత్మవస్తువుయొక్కయాథార్థ్యమును ప్రతిపాదించుటకంటె భిన్నముగా మఱియొకవాక్యార్థమును చెప్పుచున్నది యని నిశ్చయించుటకు శక్యముకాదని చెప్పుచున్నాఁడు.

తా. 'తత్త్వమస్యాదివాక్యములు నిత్యమై, నిర్వికారమై, సత్తామాత్రమై, స్వయం

ప్రకాశమై, పరమానందరూపమై, ప్రత్యగభిన్నమైన ఆత్మతత్త్వము
చున్నది యని ఉపక్రమోపసంహారాది తాత్పర్యలింగములచేత విస్పష్ట
చున్నది. ఇటులుండగా ఆత్మతత్త్వముకంటే భిన్నమైన జీవబ్రహ్మైక్య
ప్రతిపాదించునని నిశ్చయించుటకు శక్యము కాదు. ఉపాసనమును బోధిం
చెడిచో నుపక్రమము మొదలగుతాత్పర్యబోధకలింగములు బాధించున
తోటి చెప్పుచున్నారని భావము. ఉపక్రమోపసంహారతాత్పర్యలింగ
అధ్యాయములో వివరించెదము.

శ్లో. తత్త్వమస్యాదివాక్యానాం స్వతస్సిద్ధార్థబోధనాత్ ।
అర్థాంతరం న సంద్రష్టుం శక్యతే త్రిదశైరపి.

దం-అ. 'తత్త్వమసి' మొదలగువాక్యములకు స్వయంసిద్ధమైన
చుటకంటె మఱియొకయర్థమును చూచుటకు దేవతలచేతకూడా శక్య

తా. "తత్త్వమస్యాది'వాక్యములు స్వతస్సిద్ధమైన ఆత్మతత్త్వ
చుచున్నవి. ఇంతకంటే భిన్నమైనయర్థమును బోధించునని దేవతలుకూ
అని భావము.

అవ. పూర్వపక్షవాది 'అతస్సర్వాశ్రమాణాం' అనెడి ౨౧ - వ
నవిషయమును దూషించుచున్నారు.—

వాక్య. యస్మాదేవమ్.

దం-అ. ఏకారణమువలన ఈప్రకారము నిశ్చయింపబడెన
వలన సకలమైన యాశ్రమములయందుండువారికి చక్కగా నాచరి
మనస్సు శరీరము వీటియొక్కక్రియలచేత మోక్షములేదు. ఎందువ
క్షము జ్ఞానమువల్లనేగదా గలుగును. అని వాక్యమును శ్లోకమును ఒక
వలయును.

తా. "తత్త్వమస్యా"దివాక్యములు బ్రహ్మస్వరూపయాథార్థ్య
చున్నవిగాని ఉపాసనాదిక్రియావిశేషకార్యమును బోధించుటలేదు
గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమములయందుండువారు జననము మో
లను, ఉపాసనాదిమానసకర్మలను, యాగదానాదికాయికకర్మలను చ
నందువలన మోక్షముగలుగునని చెప్పగూడదు. మోక్షము తత్త్వమస్యా
యొక్క శ్రవణముచేతకలిగిన ప్రత్యక్బ్రహ్మైక్యజ్ఞానముచేతనే క
యొకసాధనముచేత కలుగదనిభావము.

అవ. సిద్ధాంతవాది సిద్ధాంతము నారంభించునపుడు పూర్వపక్షవాదిని పరిహసించెడిపొఱకు ౨౨ వ శ్లోకములో చెప్పినసోల్లుంఠన (పొడుపుడు) వచనమున్ను యుక్తమేనిచెప్పుచున్నారు.—

శ్లో. అత స్సర్వాశ్రమాణాంతు వాఙ్మనః కాయకర్మభిః,
స్వనుష్ఠితై ర్నముక్తిస్స్యాత్ జ్ఞానదేవతు సాయతః. ౯౯. ౨౧౧

దం-అ. కావుననే అన్నియాశ్రమములయందు వాఙ్మనఃకాయములచేఁ జేయఁబడిన కర్మలచేత మోక్షము కలుగనేరదు. జ్ఞానముచేతనే కలుగును.

తా. స్పష్టము.

వాక్య. తస్మాచ్చ కారణాత్ ఏతద ప్యుపపన్నమ్. ౨౧౨

దం-అ. ఆకారణమువల్లనే ఇదియును యుక్తమే.

తా. పూర్వపక్షవాదిచెప్పినయుక్తులన్నియు నసంగతములై దుష్టములైయున్నవి. కనుక మేము పూర్వపక్షవాదిని పరిహసించినవచనము న్యాయ్యముగానే యున్నది.

అవ. వెనుకచెప్పిన పరిహాసవాక్యమును జ్ఞాపకముచేయుచు నిగమించుచున్నారు.

శ్లో. స్వమనోరథసంక్లుప్త ప్రజ్ఞాధ్మాతధియామతః,
శ్రోత్రియేష్వేవవాచస్తాః శోభంతే నాత్మవేదిషు. ౧౦౦. ౨౧౩

దం-అ. తనమనోరథముచేత కల్పించుకొనఁబడిన పాండిత్యముచేత నిండియున్నబుద్ధిగల కర్మవాదులయొక్క ఆవచనములు ఛాందసులయందే ప్రకాశించునుకాని ఆత్మవేత్తలయందు ప్రకాశించవు.

తా. కర్మవాదులు కర్మానుష్ఠానమునందు విశేషశ్రద్ధకలవారై, వేదవాక్యములకుతమ ఇష్టానుసారముగా వాక్యార్థములను కల్పించుకొని అంతమాత్రముచేతనే తృప్తిపొంది గర్వించియున్నారు. గనుక వారియొక్కవచనములు కర్మజడులై నిరంతరకర్మానుష్ఠానముచేత పొగచూరిన దృష్టిగల శ్రోత్రియులవద్దచెప్పితే ప్రకాశించునుగాని, నిరస్తసకలకల్మషాంతఃకరణులై కోటిసూర్యప్రభాభాసమానపరమాత్మదర్శనరసికులైన తత్త్వవేత్తలయొద్ద చెప్పిన పరిహసించఁబడునని భావము.

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పూజ్యపాదశిష్య సురేశ్వరాచార్యకృతౌ నైష్కర్మ్యసిద్ధౌ సర్వవేదాంతసారసంగ్రహే ప్రథమోఽధ్యాయః.

ఇది సర్వవేదాంతసారసంగ్రహ వ్యాఖ్యానంబున
ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము.



అవ. ప్రథమాధ్యాయమునందు గతించిన యర్థమును ప్రతిపాదించుచు యాధ్యాయమునందు చెప్పఁబోయెడియర్థమును సంగ్రహముగా సూచించుచు

వాక్య. ప్రత్యక్షాదీనాం అనేవం విషయత్వాత్ తేషాం స్వా రంభకవిషయోపనిపాతితత్వాత్ ఆత్మనశ్చ అశేషప్రమే య వైలక్షణ్యాత్ సర్వానర్థైక హేత్వజ్ఞానాపనోది జ్ఞాన దివాకరోదయ హేతుత్వంవస్తుమాత్రయాథాత్మ్యప్రకా శనపటియ్యసః 'తత్త్వమస్యా' దేర్వచస ఏవేతి బహ్వాదిరుప పత్తిభిః ప్రదర్శితమ్, అతస్తదర్థా ప్రతిపత్తౌ యత్కార ణం తదపనయనాయ ద్వితీయోఽధ్యాయ ఆరంభతే. ౧

దం-అ. ప్రత్యక్షము మొదలగు నింద్రియములకు ఇటువంటివిషయము లే వల్లను, వాటికి తమనుపుట్టించినవిషయములయందు ప్రవేశించుట స్వభావమై దువల్లను, ఆత్మకు సకలప్రమేయములకంటే విలక్షణత్వము కలిగియుండుటవల్ల మైన అనర్థములకు కారణమైన అజ్ఞానమును నివర్తింపఁజేయుజ్ఞానమనెడి యొక్క ప్రాదుర్భావమునకు కారణత్వము వస్తుమాత్రముయొక్క యాథార్థ ప్రకాశింపఁజేయుటయందు సమర్థమైన 'తత్త్వమసి' మొదలగువాక్యములకేన ములైన యుక్తులచేత చూపింపఁబడినది. అటుతరువాత ఆయర్థము తెలియ యందు నేదికారణమో దానియొక్కనిరాసముకొఱకు రెండవయధ్యాయము పఁబడుచున్నది.

తా. ఇచ్చట ప్రత్యక్షశబ్దమునకు చక్షురింద్రియము, ఆదిశబ్దమునకు శ్రో యములని యర్థము. త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి అయిదు ఇంద్రి అద్వితీయమైన ఆత్మతత్త్వమును ప్రతిపాదించఁ (బోధించ) జాలవు. ఎందుః ఆయింద్రియములు అయిదు తాము ఏవిషయమువల్లపుట్టినవో ఆవిషయము ప్రవర్తించి వాటినే బోధించుచుండును. అనఁగా త్వగింద్రియము స్పర్శగుణ యువువల్లపుట్టినందున స్పర్శమునే బోధించు. చక్షురింద్రియము రూపగుణమ

వల్ల పుట్టినందున రూపమునే బోధించును. శ్రోత్రము శబ్దగుణముగల ఆకాశము పుట్టినందున శబ్దమునే బోధించును. జిహ్వ (రసనేంద్రియము) రసగుణముగల మువల్ల పుట్టినందున మధురాదిరసములనే బోధించును. ఘ్రాణేంద్రియము గంధగుణగల పృథివివల్లపుట్టినందున గంధమునే బోధించును అని యర్థము. ఆత్మవస్తువు సకలశేషశూన్యమైనందునను, సకలపదార్థములను ప్రకాశింపఁజేయునట్టి స్వభావముకలదైదునను, రూపరసాదివిశేషములతోఁగూడియున్న సకలపదార్థములకంటే విలక్షణమైయందును.గనుక చక్షురాదీంద్రియములవల్ల బోధింపఁబడదు.ఇఁక దేనివల్ల బోధింపఁనునంటే 'తత్త్వమస్యా'ది వేదాంతవచనములవల్లనే బోధింపఁబడును. ఈవేదాంతక్యము లఖండవాక్యములైనందున ఆత్మయొక్క సకలవిశేషశూన్యమైన స్వరూపార్థ్యమును ప్రతిపాదించుటయందుసమర్థములై యున్నవి. పదములచేత చెప్పఁబడెడిశేషణాంశములను పరిత్యజించి ప్రధానమైన విశేష్యమునుమాత్రము చెప్పునట్టివాక్యముండార్థకవాక్యము లనంబడు. ఇట్టివేదాంతవాక్యములవల్లఁబుట్టినతత్త్వజ్ఞానముసూర్యుఁ రాత్రియందుగల అంధకారమును నశింపఁజేసినటుల సకలానర్థములకు ముఖ్యకారణన, ఆత్మస్వరూపము నావరించియున్న అనాద్యజ్ఞానమును నిశ్శేషముగా నశింపఁజేయు ఈయర్థమును అనేకములైన యుపపత్తులను చెప్పి ప్రథమాధ్యాయములో చక్కగారూపించియున్నారము. 'తత్త్వమస్యా'ది వేదాంతవాక్యములు బోధించెడి అర్థమునుందఱు ముముక్షువులు చక్కగా తెలియఁజాలకయున్నారు. అందు కేమికారణమోకారణమును తన్నివర్తనోపాయమునున్ను ప్రతిపాదించెడికొఱకు రెండవఅధ్యాయమురంభింపఁబడుచున్నది. అని భావము.

అవ. 'తత్త్వమసీ'త్యాది వాక్యములయొక్క అర్థమును తెలియకపోవుటకు కారణమునుచెప్పుచు తన్నిరాకరణోపాయమును చెప్పెదమని ప్రతిజ్ఞను చేయుచున్నారు.

శ్లో. శ్రావితో వేత్తి వాక్యార్థం నచే త్తత్త్వమసీత్యతః,
త్వం పదార్థా నభిజ్ఞత్వాత్ అత స్తత్ప్రక్రియోచ్యతే. ౧. ౨

దం-అ. 'తత్త్వమసి'(నీవుబ్రహ్మవైతివి)అనివినుపింపఁబడినవాఁడయ్యును, 'త్వం'వు) అనెడి పదార్థమును నెఱుఁగనివాఁడౌటవల్ల నీవాక్యమువలన వాక్యార్థమును యకపోయినను, అందువల్ల ఆప్రకారము చెప్పఁబడును.

తా. ముముక్షువగుపురుషుఁడు సదాచార్యులసన్నిధానమునకుపోయి యథావిధి ననువర్తించి తనకు ఈసంసారానర్థమును నివారించఁదగిన తత్త్వము నుపదేశింపు ని ప్రార్థించఁగా నాసదాచార్యులు శిష్యునియందు పరమకృపఁగలవారై 'తత్త్వమసి'

యనెడి వేదాంతమహావాక్యము నుపదేశించి, ఓశిష్యా! నీవుసత్యజ్ఞానానందస్వరూపమై సకలవిశేషశూన్యమైన బ్రహ్మకంటె భిన్నమైనవాఁడవుకావు. ఆబ్రహ్మవే నీవై యున్నావు పని ఆమహావాక్యముయొక్క అర్థమును బోధించెదరు. శిష్యుఁడు అంతకుముందే 'తత్త్వమసి' యనువాక్యమునందుగల 'త్వం' అనెడి పదార్థమును అనగా జీవాత్మయొక్క నిష్కృష్టస్వరూపమును చక్కగా తెలిసియుండెనేని సదాచార్యోపదిష్టమైన మహావాక్యముయొక్క అర్థము సకృదుపదేశముచేతనే నిస్సంశయముగా మనస్సులో ప్రకాశించును. లేక, 'త్వం' పదార్థము నెఱుఁగనివాఁడై యుండెనేని గురూపదిష్టమగు జీవబ్రహ్మైక్యరూపమగు వాక్యముయొక్క వాక్యార్థమును ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధములై యున్నవని సంశయించుచుండును. గనుక 'త్వం' పదార్థమును ఏలాగున తెలియవలయునో ఆప్రకారమును ముందరిగ్రంథములో ప్రతిపాదించెదము. అని భావము. వాక్యార్థజ్ఞానము పుట్టకపోవుటకు కారణము 'త్వం' పదార్థజ్ఞానము లేక పోవుటయే గనుక 'త్వం'పదార్థజ్ఞానము కలిగెడియుపాయమును ప్రకటించెదమనిభావము-

అవ. వెనుకటివాక్యములో చెప్పినయర్థమును చెప్పుచు ముందరిశ్లోకముయొక్క అభిప్రాయమును చూపించుచున్నారు.—

వాక్య. యోఽయమహం బ్రహ్మేతివాక్యార్థః తత్ప్రతిపత్తిర్వాక్యా దేవేతి ప్రత్యక్షాదీనామనేవం విషయత్వాత్ ఇత్యవాదిషం, తస్య విశుద్ధ్యర్థమనైకాంతికత్వం పూర్వపక్షే నోపస్థాప్యతే. 3

దం-అ. నేను బ్రహ్మ యనెడివాక్యార్థము యేదికలదో దానియొక్కప్రతిపత్తి (పుట్టుక) వాక్యమువల్లనే నని ఈప్రకారము ప్రత్యక్షము మొదలగునింద్రియములకు ఇటువంటివిషయము లేకపోవుటవల్లననియే; వాక్యముచేతచెప్పితిని. ఆయర్థముయొక్క పరిశుద్ధికొఱకు నియమరాహిత్యము పూర్వపక్షముగా తేఁబడుచున్నది.

తా. 'అహంబ్రహ్మ' (నేను బ్రహ్మను)అనెడివాక్యార్థజ్ఞానము 'తత్త్వమసీ'త్యాది వాక్యములవల్లనే పుట్టునుగాని, మఱియొకసాధనముచేత కలుగదని ౧ వాక్యములో 'ప్రత్యక్షాదీనాం అనేవం విషయత్వాత్' అనెడిగ్రంథములో చెప్పియుంటిని. ఆయర్థమును దృఢముగాఁ జేయుటకుగాను నేను బ్రహ్మనెడివాక్యార్థము వాక్యమువల్లనే కలుగునసెడినియమములేదు. సాధనాంతరములచేతగూడా కలుగవచ్చునని ముందుగా పూర్వపక్షము చేయఁబడుచున్నదని భావము.

శ్లో. కృతాన్న నాత్మనివృత్తౌ చ కశ్చిదాప్నోతి నిర్వృతిమ్,

శ్రుతవాక్యస్మృతే శ్చాన్యః స్మర్యతే చ వచోపరః. ౨. ౪

దం-అ. ఒకానొకపురుషుఁడు సకలమైన అనాత్మపదార్థములయొక్క నివృత్తి యందు సుఖమును (ఏకత్వజ్ఞానమును) పొందును. మఱియొకపురుషుఁడు వినఁబడిన వాక్యమును స్మరించుటవలన ఏకత్వజ్ఞానమును పొందును. మఱియొకపురుషుఁడు వాక్యమును స్మరించును.

తా. 'అహం బ్రహ్మ' యనెడి ప్రత్యగభిన్నబ్రహ్మస్వరూపజ్ఞానము 'తత్త్వమస్యా' దివాక్యములవలననే కలుగునుగాని మఱియొకదానివలన కలుగదనెడి నియమములేదు. ఎందువల్లనంటే ఒకానొకపురుషుఁడు పూర్వజన్మసుకృతవిశేషపరిపాకముచేత అత్యంత నిర్మలమైన చిత్తముకలవాఁడై యుండెనేని సకలమైనభేదప్రపంచమునందు మిథ్యాత్వ బుద్ధి జనించి అద్వితీయబ్రహ్మాత్మజ్ఞానము కలవాఁడగును. ఇది హిరణ్యగర్భునియందు కనుపడుచున్నది. హిరణ్యగర్భుఁడు ఈకల్పాదియందు జన్మించినతోడనే 'నా కంటే మఱియొకవస్తువులే'దని నేను ఎందుకు భయపడవలయును' అని అనుసంధిం, చినట్టు బృహదారణ్యకోపనిషత్తులోఁ జెప్పఁబడినది. హిరణ్యగర్భున కుత్పత్త్యుత్తర కాలమందే అద్వితీయాత్మజ్ఞానము కలిగినందున ఇది వాక్యమువల్ల కలిగినదని చెప్పఁ గూడదుగదా? మఱియొకపురుషుఁడు సదాచార్యసన్నిధియందు ఒకవాక్యమును విని తరువాత కొన్నిసాధనముల ననుష్ఠించి అనంతరము వాక్యమును స్మరించి అద్వితీయాత్మజ్ఞానము కలవాఁడగును. ఇది భృగుమహామునియందు కాన్పించుచున్నది. వరుణపుత్త్రుఁడైన భృగుమహాముని బ్రహ్మస్వరూపమును తెలియ నిచ్ఛయించి తండ్రియగు వరుణునియొద్దకుపోయి, బ్రహ్మస్వరూపమును తనకుపదేశింపమని ప్రార్థింపగా, నావరుణుఁ డన్నప్రాణాదిపదార్థములు బ్రహ్మను తెలియుటకు ద్వారములనిన్ని, తపస్సును (మననము) జేసి బ్రహ్మను తెలియుమనిన్ని, ఈభూతము లెవనివలన పుట్టుచున్నవో, పుట్టినవి ఎవనిచే జీవించుచున్నవో, లయమును బొందునవి ఎవనియందు లీనములగుచున్నవో, అతఁడు బ్రహ్మయనిన్ని చెప్పగా విని, భృగుమహాముని తపస్సునుఁజేసి, అన్నాదిపదార్థములు కొన్నిటియందు జగజ్జన్మాది కారణత్వరూపమైన బ్రహ్మలక్షణము కలదని యోచించి అన్నాదిపదార్థములను ముందుగా బ్రహ్మయనితెలిసి, చివరకు ఆనందమే బ్రహ్మయని, ఆనందమందే బ్రహ్మలక్షణము సంఘటితమై యున్నదని నిశ్చయించినందున, భృగుమహామునికి వాక్యముకంటే భిన్నమైన వాక్యస్మరణముచేతనే బ్రహ్మతత్త్వజ్ఞానము కలిగినటుల తెలియఁబడుచున్నది. మఱియొకపురుషుఁడు వాక్యమును గురువుచే స్మరింపఁజేయఁబడి అసంభావనావిపరీత

భావనాదిచిత్తదోషములు నివర్తించినపిదప 'నేనే పరంబ్రహ్మ' నని వాక్యార్థమును తెలిసికొని ముక్తినొందును. ఇది శ్వేతకేతువను మహర్షియందు కాన్పించుచున్నది. శ్వేతకేతువనెడి మహర్షి తనతండ్రియగు నారుణివలన 'తత్త్వమసి' యనెడివాక్యమును తొమ్మిదిపర్యాయములు స్మరింపఁజేయఁబడి 'అహంబ్రహ్మాస్మి' యనెడి యపరోక్షజ్ఞానము కలవాఁడాయెనని ఛాందోగ్యమష్టములోఁ జూడఁబడుచున్నది. తైత్తిరియ్యములో శ్వేతకేతుభృగుమహామునులకు జ్ఞానము వాక్యస్మరణముచేత కలిగినదిగాని వాక్యశ్రవణముచే కలుగలేదు. భృగువు తనంతటతా నాలోచించుచుండగా వాక్యము స్ఫురికివచ్చి తత్త్వజ్ఞానము కలవాఁడాయెను. శ్వేతకేతువు మాటిమాటికి గురువుచేత స్మరింపఁజేయఁబడి తత్త్వజ్ఞానము కలవాఁడయ్యెను. ఇదియే వీరిరువురకును విశేషము. కనుక అద్వితీయపరమాత్మజ్ఞానము వాక్యమువల్లనే కలుగవలయుననెడి నియమములేదని భావము.

అవ. వాక్యస్మరణాదులచేత తత్త్వజ్ఞానము కలుగుచుండగా వాక్యమును తత్త్వజ్ఞానమునకు కారణమని యేలాగున సిద్ధాంతవాది తలంచుచున్నాఁడంటే దానికి ప్రతివచనమును చెప్పుచున్నారు.—

వాక్య. ఏతత్ప్రసంగేన శ్రోత్రంతరోపన్యాస ముభయత్రాపి సం
భావనాయాహ. ౫

దం-అ. ఈతత్త్వజ్ఞానముయొక్క ప్రస్తావనచేత వాక్యశ్రవణమును చేయునట్టి మఱియొకపురుషునియొక్క ఉపన్యాసమును (ప్రతిపాదమును) రెండుపక్షములయందు సంభావనము కలిగెడికొఱకు చెప్పుచున్నారు.

తా. తత్త్వజ్ఞానము ఏకారణమువల్ల జన్మించునని విచారించునప్పుడు తత్త్వజ్ఞానము ప్రస్తావములోనికి వచ్చినందున, తత్త్వజ్ఞానము పుట్టుటకు వాక్యస్మరణాదులే కారణముకాదు. వాక్యశ్రవణమున్ను కారణమేనని స్మరణశ్రవణపక్షములు రెండు ఊహింపఁదగియున్నవని తెలియఁజేయుటకొఱకు చెప్పుచున్నారని భావము.

శ్లో. వాక్యశ్రవణమాత్రాచ్చ పిశాచకవదాప్నుయాత్,
త్రిషుయాదృచ్ఛికీసిద్ధిః స్మర్యమాణే తు నిశ్చితా. 3. ౬

దం-అ. వాక్యమును వినినమాత్రమువల్లనే పిశాచముపలె పొందును. ముగ్గురియందు తత్త్వజ్ఞానముయొక్క ప్రాప్తి యదృచ్ఛచేతకలుగునది స్మరింపఁజేయఁబడెడివానియందు నిశ్చితమైనది.

తా. వాక్యశ్రవణముచేతకూడ తత్త్వజ్ఞానము పుట్టుచున్నది. ఇందుకు నుదాహరణము అర్జునుని రథధ్వజమునందున్న పిశాచమునొకకటిః; పాండుపుత్త్రుఁడైన యర్జు

నుఁడు భారతయుద్ధారంభమునందు బంధువధభీతుఁడై యుద్ధమునుచేయనని ధనుర్బాణ
ములను విడిచి రథంబుమీఁదకూర్చుని దుఃఖించుచుండగా శ్రీభగవంతుండైన శ్రీకృష్ణ
మూర్తి ఆతనికి సారథిగానుండి అర్జునునియొక్క శోకమోహముల నపనయింపంగోరి
ఆత్మతత్త్వము నుపదేశించెను. అప్పుడాయర్జునుని రథధ్వజాగ్రంబునందున్న హను
మంతునితోఁగూడి కొన్ని పిశాచంబులు రక్షకంబులై యుండఁగా వాటిలో నొక్కపిశాచ
మునకు భగవద్వచనశ్రవణంబుచే అద్వితీయాత్మతత్త్వజ్ఞానం బపరోక్షంబుగా గలిగె
నని జైమినీయమహాభారతములోఁ జెప్పఁబడియున్నది. వాసిష్ఠరామాయణముయొక్క
ఉపశమప్రకరణములో జనకరాజొక్కనాఁడుద్యానంబునకుఁబోయి విహరించుచునాత్మ
తత్త్వవేత్తలగు కొందఱు మహాపురుషు లేకాంతంబునం గూర్చుండి స్వానుభవప్రకా
శకంబులైన వాక్యంబుల ననుసంధించగా విని అపరోక్షజ్ఞానము కలవాఁడాయెనని వినఁ
బడుచున్నది. గనుక వాక్యశ్రవణమాత్రముచేతఁగూడ తత్త్వజ్ఞానము జన్మించును.
అయితే హిరణ్యగర్భునివలె జన్మాంతరానుష్ఠితకర్మోపాసనాపరిపాకముగలవానికిని, భృగు
వువలె గురూపదేశము ననుసరించి స్వయముగా నాలోచించువానికిని, అర్జునరథధ్వజ
వాసిపిశాచమువలె ఆత్మతత్త్వప్రతిపాదకవాక్యములను వినువానికిని, ఈముగ్గురికి తత్త్వ
జ్ఞానముకలిగినను కలుగును. లేదా, లేకపోవును. శ్వేతకేతువువలె ఆత్మతత్త్వప్రతిపాద
కవాక్యములను గురువుచేత స్మరింపఁజేయఁబడువానికిమాత్రము తత్త్వజ్ఞానము నిశ్చ
యముగా కలుగును. గనుక తత్త్వజ్ఞానము వాక్యశ్రవణముచేతనే కలుగును. మఱియొ
కదానిచేత కలుగదనెడి నియమము లేదని భావము.

అవ. ఇఁక నీయాక్షేపమునకు సిద్ధాంతవాది పరిహారమును జెప్పుచున్నాఁడు.-

వాక్య. నాయమప్యనైకాంతికో హేతుః, యతః. ౭

టం-ఆ. ఈహేతువు నియమము లేనిది కాదు.

తా. వాక్యమువల్లనే తత్త్వజ్ఞానము కలుగునని మేముచెప్పిన హేతువు వ్యభి
చారము కలది కాదు. నియమముకలిగినదై యున్నదని భావము.

అవ. అదియెలాగంటే నిరూపించుచున్నారు.—

శ్లో. సర్వోఽయం మహిమా జ్ఞేయో వాక్యస్యైవ యథోదితః,
వాక్యార్థం నహ్యృతే వాక్యాత్ కశ్చిత్ జానాతి తత్త్వతః. ౪.౮

టం-ఆ. ఎందువల్లనంటే చెప్పఁబడిన ఈసకలమైనప్రభావమున్ను వాక్యముయొ
క్క సంబంధమైనదనే తెలియవలయును. వాక్యమువల్ల వినాగా వాక్యార్థము నొకా
నొకఁడున్ను వాస్తవముగాఁ దెలియఁజాలఁడు.

21

తా. స్మరణమునకు తత్త్వజ్ఞానమును కలుగఁజేసెడిప్రభావము వాక్యమువల్ల కలిగినదిగాని కేవలముగాలేదు. వాక్యమును వింటేగదా వాక్యార్థము స్మరింపఁబడును. గనుక వాక్యస్మరణమువల్ల కలిగినతత్త్వజ్ఞానము వాక్యమువల్లనే కలిగినదని నిశ్చయము. హిరణ్యగర్భునివలె కొందఱికి తత్త్వజ్ఞానము సకలప్రపంచత్వమిథ్యాత్వజ్ఞానముచేతనే కలుగునని చెప్పఁదగదు. ఎందువల్లనంటే, సకలప్రపంచమిథ్యాత్వజ్ఞానమున్ను వేదాంతజ్ఞానమువల్లనే కలుగవలసియున్నది. కావున వాక్యమువినాగా నెట్టివారికి తత్త్వజ్ఞానము కలుగనేరదు. హిరణ్యగర్భునకు జన్మాంతరమునందుచేసిన వేదాంతవాక్యశ్రవణముచేత ఈజన్మమందు మొదటనే తత్త్వజ్ఞానముకలిగినది. వామదేవమహర్షికి గర్భమందే తత్త్వజ్ఞానము కలిగెను. ఇదియును పూర్వజన్మానుష్ఠితవేదాంతవాక్యశ్రవణముచేత నని నిశ్చయింపఁ దగియున్నది. గనుక వాక్యముచేతనే తత్త్వజ్ఞానము కలుగునని మేము చెప్పినది నియతమైయున్నదిగాని అనైకాంతికము కాదని భావము.

అవ. ఓయీ! వాక్యమున్ను ఇతరప్రమాణముతోటి సంవాదములేనిచో స్వార్థమును నిశ్చయించుటకు శక్తిగలదై యుండదుగదా? అదిఎటువలెనంటే, 'నద్యాస్తీరే పంచఫలానిసంతి' (నదీతీరమునం దైదుఫలములు గలవు) అనెడివాక్యమును వినినపిదప ఫలములు నదీతీరమున కలవా? లేవా? యని సంశయించుచు నదీతీరమునకుంబోయి అచ్చట ఫలములు కనుపడెనా, తాను వినినవాక్యము వాస్తవార్థమే నని విశ్వసించును. కనుపడకపోయెనా వాక్యము వాస్తవార్థముకాదని తలంచును గనుక వాక్యము ప్రమాణాంతరసంవాదములేనిదై స్వార్థమును బోధించఁజాలదు. అని పూర్వపక్షవాది శంకించునని తలఁచి సిద్ధాంతవాది చెప్పుచున్నారు.—

వాక్య. వాక్యంచ ప్రతిపాదనాయ ప్రవృత్తంసత్, ప్రతిపాద
యత్యేవ సర్వప్రమాణానా మప్యేవం వృత్తత్వాత్. ౯

దం-అ. సకలమైన ప్రమాణములకును ఇటువంటిస్వభావమే కలిగియున్నందువలన వాక్యమును ప్రతిపాదించుటకొఱకు ప్రవర్తించినదై ప్రతిపాదించనే ప్రతిపాదించును.

తా. ప్రత్యక్షము తాను ఘటాదిపదార్థములను ప్రతిపాదించు (ప్రకాశింపఁజేయు) నప్పుడు స్వతంత్రముగా ప్రకాశముచేయునుగాని అనుమానాదిప్రమాణముల యొక్క సంవాదమును అపేక్షింపదు. అనుమానమున్ను ఇటువలెనే గనుక వాక్యమున్ను తాను స్వార్థమును ప్రతిపాదించునపుడు ప్రత్యక్షాదిప్రమాణములయొక్క సంవాదమును అపేక్షించకయే ప్రతిపాదించును. 'నద్యాస్తీరే పంచఫలాని సంతి' యనెడి

వాక్యము స్వార్థమును ప్రతిపాదించునది అయినప్పటికి ఆస్వార్థము ప్రత్యక్షమునకు గోచరమైయున్నందున ప్రత్యక్షసంవాదము గోరియున్నది. వేదవాక్యము తాను ప్రతిపాదించెడియర్థము ప్రమాణాంతరగోచరము కానందున ప్రమాణాంతసంవాదము నపేక్షించదని భావము.

అవ. ఓయీ! వాక్యము, ప్రమాణాంతరముతో సంవాదములేనిచో, స్వార్థమును బోధించచాలదని మేము చెప్పముగాని ప్రమాణాంతరముతో విరుద్ధమైనచో స్వార్థమును బోధించచాలదని చెప్పుచున్నామని పూర్వపక్షవాది శంకించునని తలఁచి సిద్ధాంతవాది ఉత్తరమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. నాహం గ్రాహ్యేన తద్ధీనే నపతజ్ఞాపి దుఃఖినీ,
విరోధః సదసీ త్యస్మా ద్వాక్యాభిజ్ఞస్య జాయతే. ౫. ౧౦

దం-అ. వాక్యముయొక్క తాత్పర్యమును యెఱిఁగినవానికి 'తదసి' (ఆబ్రహ్మవు నీవై తివి) అనెడి ఈ వాక్యమువల్ల విరోధము 'అహం' (నేను) అని గ్రహింపఁబడుదానియందు పుట్టదు. దుఃఖముల ననుభవించునట్టి అంతఃకరణమునందు సైతము పుట్టదు.

తా. 'తత్త్వమసి' (ఆబ్రహ్మవు నీవై తివి) యనెడివాక్యముచేత ప్రతి పాదింపఁబడెడి యర్థము ప్రత్యక్షాదిప్రమాణములతో విరోధించునని, ఈవాక్యతాత్పర్య మెఱుంగనివాఁడు తలంచునేగాని యెఱింగినవాఁడు తలఁచఁడు. ఎందువల్లనంటే, 'అహం మనుష్యః' (నేను మనుష్యుఁడను) ఇత్యాదిప్రయోగములయందు 'అహం' శబ్దముచేత శరీరము గ్రహింపఁబడుచున్నది. ఈశరీరము 'తత్త్వమసి' వాక్యములోని 'త్వం' అనెడి పదమునకు అర్థముకాదు. అర్థమైనయెడల శరీరబ్రహ్మల కైక్యము ప్రత్యక్షవిరుద్ధమై యుండును. 'చక్షుషాపశ్యామి' (కంటితో చూచుచున్నాను) ఇత్యాదిప్రయోగముల యందు చక్షురాదీంద్రియములు దర్శనాదిక్రియలకు సాధనములుగా తెలియఁబడు చున్నందున 'అహం చక్షుః' (నేను చక్షుస్సును) అనెడిప్రయోగములేనందునను చక్షురాదీంద్రియములు 'అహం' అనెడిశబ్దముచేత గ్రహింపఁబడునవి కావు. అట్టి చక్షురాదీంద్రియములున్ను 'త్వం' అనెడి పదమున కర్థముకాదు. అర్థమైనయెడల చక్షురాదీంద్రియములకు బ్రహ్మకు నైక్యము ప్రత్యక్షవిరుద్ధమై యుండును. 'అహం' అని గ్రహింపఁబడుచున్నజీవుఁడు, 'త్వం' పదమునకు వాచ్యార్థమైయున్నాఁడు. ఇట్టి జీవునకును బ్రహ్మకును ఐక్యము, 'తత్త్వమసి' యనెడివాక్యము ప్రతిపాదించలేదు. ప్రతిపాదించినయెడల విరుద్ధముగానుండును. ఎందువలననంటే దేహాదివిశిష్టుఁడై, కించిజ్జ్ఞుఁడై, సుఖదుఃఖాదిభోక్తయై యున్నచేతనుఁడు, 'త్వం' పదమునకు వాచ్యార్థము.

వాచ్యార్థమనఁగా శబ్దము లోకప్రసిద్ధి ననుసరించి చెప్పునట్టియర్థము. సర్వజ్ఞుఁడై సకల జగత్కారణుఁడైన చేతనుఁడు, 'తత్' పదమునకు వాచ్యార్థము. ఈరెండువాచ్యార్థములకు పరస్పరవిరుద్ధగుణములు గలిగియున్నందున ఐక్యము సంభవించదు. గనుక తత్త్వదార్థంత్వంపదార్థములయందుగల 'సర్వజ్ఞత్వకించిత్ జ్ఞత్వా'ది విశేషణములను పరిత్యజించినయెడల కేవల చేతనులే శేషించియుండును. గనుక వారికి ఐక్యమును 'తత్త్వమసి' వాక్యము ప్రతిపాదించుచున్నది. ఇట్టి యైక్యము ప్రత్యక్షమునకు విరుద్ధము కానేరదు. ఆప్రకారమే 'అహం సుఖీ, అహం దుఃఖీ' (నేను సుఖముకలవాఁడను, నేను దుఃఖములు కలవాఁడను) ఇత్యాదులయందు 'అహం' శబ్దముచేత అంతఃకరణము గ్రహించఁబడుచున్నది ఇట్టి అంతఃకరణమున్ను 'త్వం' శబ్దమున కర్థముకాదు. అయినయెడల అంతఃకరణమునకు, బ్రహ్మకు నైక్యము అనుమానాదిప్రమాణములకు విరుద్ధమైయుండును. గనుక 'తత్త్వమసి' వాక్యముచేత ప్రతిపాదింపఁబడెడి ప్రత్యగ్బ్రహ్మైక్యము ప్రత్యక్షాదివిరుద్ధము కానందున తత్త్వమసీత్యాదివాక్యములు నిస్సంకటముగా స్వార్థమును బోధించగలవని భావము.

అవ. ఓయీ! వాక్యము ప్రమాణాంతరముతోటి సంవాదమును నపేక్షించునదికాదనిన్ని, ప్రమాణాంతరముతోటి విరోధించునదికాదనిన్ని చెప్పుచున్నారు. ఆలాగైతే సకలమైనవారలు వాక్యమును వినినమాత్రముచేతనే వాక్యార్థమును తెలియవలసియుండెను. ఎందువల్ల తెలియకయున్నారు? అని పూర్వవాది శంకించగా వైరాగ్యాదిగుణసంపత్తికలవారికే వాక్యము స్వార్థమును బోధించునుగాని అన్యులకు బోధించదు. గనుక అట్టిదోషమును శంకించఁగూడదని అందు శ్లోకములతోటి యుత్తరమును జెప్పుచున్నారు.—

శ్లో. నావిరక్తస్య సంసారాన్నివివృత్సా తతో భవేత్,
న చానివృత్తతృష్ణస్య పురుషస్య ముముక్షుతా. ౬. ౧౧

దం-అ. సంసారమువల్ల విరక్తిని పొందనివానికి ఆసంసారమువల్ల నివర్తించవలయుననెడి ఇచ్ఛకలుగదు. నివర్తించని ఆశగలపురుషునకు ముముక్షుత్వము (మోక్షేచ్ఛ) కలుగదు.

తా. సంసారమనఁగా తనది యని అభిమానింపఁబడిన పుత్త్రకళత్రధనగృహక్షేత్రాదిసంపద. ఇట్టిసంసారమందు విరక్తి (నిస్పృహ) లేనివానికి ఈసంసారమును విడువవలయుననెడి ఇచ్ఛకలుగదు. సంసారమును విడువవలయుననెడి ఇచ్ఛలేనివానికి పరమపురుషార్థమైన మోక్షమునం దిచ్ఛకలుగదని భావము.

శ్లో. న చాముముక్షోరర్థీహ గురుపాదోపసర్పణమ్,

న వినా గురుసంబన్ధం వాక్యస్య శ్రవణం భవేత్. ౭. ౧౪౭

పం-అ. మోక్షమునం దిచ్ఛలేనివానికి ఈలోకములో సదాచార్యులయొక్క పాదములను గూర్చి ఆశ్రయించుట కలుగనేరదు. గురువుయొక్క సంబంధములేనియెడల వాక్యముయొక్క శ్రవణము కలుగదు.

తా. మోక్షేచ్ఛలేనివాడు సద్గురువులయొక్క సన్నిధికి పోనేరడు. సద్గురువులసన్నిధికిపోయి వారికి సకలశుశ్రూషలనుచేసి వారికి తనయం దనుగ్రహము కలిగెడి బాగున ప్రవర్తించిననేగాని ఆగురువులు వేదాంతమహావాక్యములను వినిపించరు.

శ్లో. తథాపదపదార్థౌ న నరో వాక్యస్య తే క్వచిత్,
అన్వయ వ్యతిరేకౌ చ తౌ వ్యతే ప్తౌం సమాశ్రయౌ. ౮. ౧౪౮

పం-అ. ఆప్రకారమే వాక్యము వినఁబడనియెడల పదము, పదార్థము యెచ్చటను సంభవించవు. ఆపదపదార్థములు లేనియెడల అన్వయము, వ్యతిరేకము ఈరెండును వీటిని ఆశ్రయించినవై యుండవు.

తా. సదాచార్యసన్నిధియందు వేదాంతవాక్యములను శ్రవణముచేయనియెడల పదముగాని పదార్థముగాని తెలియఁబడదు అనఁగా వాక్యము పదసముదాయరూపమై యున్నందున వాక్యమును విననేగాని పదములు తెలియఁబడవు వాక్యార్థము పదార్థములతోఁ జేరియున్నందున వాక్యార్థమును వింటగాని పదార్థములు తెలియఁబడవని యర్థము. అన్వయవ్యతిరేకములనఁగా అనువృత్తార్థ వ్యావృత్తార్థములు.అవి పదపదార్థములను ఆశ్రయించియుండును.పదార్థములు తెలియఁబడనియెడల అనువృత్తార్థ వ్యావృత్తార్థము తెలియఁబడవు అని భావము. అనఁగా పదార్థము అనేకాంశములతోఁ గూడియుండును. ఆయంశములలోనే యంశములు సర్వకాలసర్వావస్థలయందు నవిచ్ఛిన్నముగా తెలియఁబడుచుండునో ఆయంశములు వ్యావృత్తార్థము లనఁబడును. ఇందుకు దృష్టాంతము మందాంధకారములోనున్న త్రాటిని చూచినప్పుడు ఇది సర్పము, ఇది నేలపగులు, ఇది జలధార యని మూఁడుప్రత్యయములు కలుగును, ఈమూఁటిలో నిది యనే యర్థము ఈమూఁడుప్రత్యయములలో వ్యవహరింపఁబడినందున అనువృత్తార్థమనఁబడు. సర్పాద్యర్థములు ఒకప్రత్యయమందే వ్యవహరింపఁబడి మిగిలిన రెండుప్రత్యయములందు వ్యవహరింపఁబడనందున వ్యావృత్తార్థములని తెలియవలయును. 'త్వం' పదార్థమం దన్వయవ్యతిరేకములు ముందుగ్రంథములో వివరింపఁబడుచున్నవి.

శ్లో. అన్వయవ్యతిరేకాభ్యాం వినా వాక్యార్థబోధనమ్,
న స్యాత్తేన వినా ధ్వంసో నాజ్ఞానస్యోపపద్యతే. ౯. ౧౪౯

శ్లో. వినా జ్ఞానప్రవాహేణేన పురుషార్థస్సుదుర్లభః. ౯౪.

దం-అ. అన్వయవ్యతిరేకములతో వినాగా వాక్యార్థజ్ఞానము క ర్థజ్ఞానము కలుగనియెడల అజ్ఞానముయొక్క వినాశము పుట్టినిది కాదు. కలుగనియెడల పురుషార్థము (మోక్షము) దుర్లభమై యుండును.

తా. అన్వయ వ్యతిరేకార్థములను చక్కగా విచారించి తెలియ ర్థజ్ఞానము ('అహం బ్రహ్మాస్మి' యనెడిజ్ఞానము) కలుగదు. వాక్యార్థజ్ఞా డల సంసారమునకు మూలకారణమైన అజ్ఞానము నశించదు. అజ్ఞానము స్వరూపావస్థానమైన మోక్షము సంభవించనేరదని భావము.

అవ. కావున ముముక్షువుల కవశ్యాపేక్షితమైన వాక్యార్థజ్ఞా కొఱకు అన్వయవ్యతిరేకములచేత 'త్వం' పదార్థమును శోధించి తెలి బోధించెడికొఱకు ఉత్తరగ్రంథసందర్భము ప్రవర్తించుచున్నదని చెప్పు

శ్లో. తస్మాద్యథోక్తసిద్ధ్యర్థం పరో గ్రంథోఽవతార్యతే.

దం-అ. ఆకారణమువలన ఇదివఱకుచెప్పిన అర్థము సిద్ధించె గ్రంథము అవతరింపఁజేయఁబడుచున్నది.

తా. వైరాగ్యముముక్షుత్వాదిగుణములు కలవారై సదాచార్యు నుపదేశమునుపొంది ఆవాక్యములయందుగల 'త్వం' 'అహం' ఇత అన్వయవ్యతిరేకములచేత విచారించి నిశ్చయించుకొనెడి యోగ్యతక ర్థము స్ఫురించును గనుక వాక్యార్థజ్ఞానము సిద్ధించెడికొఱకు 'త్వం' యవ్యతిరేకములచేత శోధించెడిప్రకారము ఉత్తరగ్రంథములో భావము.

అవ. ఈరెండవశ్లోకములో శరీరము, ఇంద్రియములు మొద దని, వాటికి ఆత్మత్వములేదని సూచించినయర్థమును ముందుగా విస్తరి

శ్లో. వర్చస్కం తద్వన్న కార్యత్వాద్యథా నాత్మేతి గవ
తద్భాగః సేంద్రియో దేహ స్తద్వత్కిమితి నేక్ష్య

దం-అ. పురీషము అన్నముయొక్క పరిణామమైనందున యెట తెలియఁబడుచున్నదో అటువలెనే ఆయన్నముయొక్క అంశమైన గూడియున్న దేహమున్ను యెందువలన చూడఁబడదు?

తా. మనుష్యులచేత భక్షింపఁబడెడియన్నము జఠరాగ్నిల ఆయన్నముయొక్క స్థూలభాగము పురీషముగా, సూక్ష్మభాగము

సూక్ష్మభాగము మనస్సుగా పరిణమించుననిన్ని, పుచ్చుకోఁబడిన జలముయొక్క స్థూల భాగము మూత్రముగా, సూక్ష్మభాగము రక్తముగా, అతిసూక్ష్మభాగము ప్రాణముగా పరిణమించుననిన్ని శాస్త్రములలో సయుక్తికముగా చెప్పఁబడియున్నది. ఇట్టి యన్నముయొక్క ఉదకముయొక్క పరిణామములైన పురీషమూత్రములు ఆత్మ కాదని సకలమైనవారలు అంగీకరించుచున్నారుగదా? ఆప్రకారమే అన్నోదకములపరిణామములైన మాంసరక్తములతోఁ గూడియుండు మనఃప్రాణాది సహితమైన శరీరమున్ను ఆత్మ కాదని నిస్సంశయముగా తెలియవచ్చునని భావము.

అవ. దేహము అన్నముయొక్క పరిణామమైనందున పురీషమువలె ఆత్మ కాదని యూహించుటమాత్రమే కాదు. అన్నస్వరూపమైనందునకూడా అన్నమువలె ఆత్మ కాదని ఊహించవలయునని చెప్పుచున్నారు.—

వాక్య. ఆద్యంతయో రనాత్మత్వే ప్రసిద్ధే మధ్యేఽపి కః
ప్రతిబంధః. ౧౭

దం-అ. ఆద్యంతములయందు ఆత్మ కాకపోవుట ప్రసిద్ధమైయుండగా మధ్యమునం దేమిప్రతిబంధము కలుగుచున్నది?

తా. మొదట అన్నముగానుండి భక్షింపఁబడి తుదకు పురీషరూపముగా బహిర్గతమగుచున్నదై, మధ్యకాలమునందు మాత్రము దేహరూపముగా కనుపడుచున్నది. ఇందులో మొదటకనుపడుచున్న అన్నమున్ను, చివరకనుపడుచున్న పురీషమున్ను, ఆత్మ కాదని నిశ్చయముగా ఊహించఁబడుచున్నదిగదా? మధ్యకాలమందు కనుపడుచున్నదేహముకూడా ఆప్రకారమే ఆత్మ కాదని నిశ్చయముగా నూహించవచ్చును. అలాగున ఊహించుట కేమిప్రతిబంధము కలదని భావము.

శ్లో. ప్రాగనాత్మైవ జగ్ధం స ద్దాత్మతా మేత్యవిద్యయా,
స్రగాలేపనవద్దేహం తస్మా త్పశ్యే ద్వివిక్తధీః. ౧౨. ౧౮

దం-అ. మొదట ఆత్మకాని అన్నము భక్షింపఁబడినదై అజ్ఞానముచేత నాత్మత్వమును పొందుచున్నది. గనుక విలక్షణమైన వస్తువును చూడదగిన బుద్ధిగలపురుషుఁడు పుష్పమాలికనువలె, చందనమువలె దేహమును చూడవలయును.

తా. అన్నము భక్షించకమునుపు ఆత్మయని తలంచఁబడదుకదా? భక్షించఁబడిన పిదప అజ్ఞానముచేత నాత్మయని భావింపఁబడుచున్నది. గనుక ప్రథమదశలో అన్నము ఏప్రకారము ఆత్మ కాదో ఆయన్నమే భక్షించినపిదప ఈదేహరూపముగా కనుపడుచున్నందున ఈదేహమున్ను ఆత్మ కానేరదు. అయినప్పటికి ఈదేహమును ఆత్మయని తలఁ

చుట అజ్ఞానకృత్యమని భావము. ఇదిగాక ఈదేహముతోటి నిత్యసంబంధములేకయేమి మధ్యేమధ్యే సంబంధించి నివర్తించుచున్న స్రక్చందనవస్త్రాభరణాదులు ఆత్మ కాదని, దేహమే ఆత్మయనిచెప్పెడి చార్వాకులున్ను చెప్పుచున్నారుగదా ? అప్రకారమే ఈదేహమున్ను జ్ఞానస్వరూపుఁడైన ఆత్మతోటి నిత్యసంబంధములేనిదై, మధ్యేమధ్యే ప్రాప్తించి నివర్తించుచున్నందున ఆత్మ కానేరదని బుద్ధిమంతుఁడు తెలిసికోవలయునని భావము.

అవ. ఈదేహము నశించిపోవుచున్నందువలనకూడా ఆత్మ కాదని ఊహించవలయును నని చెప్పుచున్నాఁడు.—

వాక్య. అద్యైవమపి మద్వచనం నాద్రియసే స్వయమేవ
తస్మాచ్ఛరీరాదశుచిరాశేర్నిరాశో భవిష్యసి. ౨౦

దం-అ. ఇఁక నీలాగైనప్పటికి నావాక్యమును ఆదరించకపోతివా, నీవు స్వయముగానే ఈయమేధ్యపుంజమైన శరీరమునుంచి (విరక్తిని పొందుచున్నావు.) ఆశలేనివాఁడవు కాఁబోవుచున్నావు.

తా. ఈదేహము ఆత్మ కాదని నేను నిశ్చయముగా చెప్పుచున్నానుగదా? అయినప్పటికి నామాటయందు నీకు నమ్మకములేకయున్నది. ఈశరీరము యావత్కాలమును నిత్యముగా నుండునదికాదు. కొంతకాలమునకు నశించిపోవును. అప్పుడు ఈశరీరము ఆత్మ కాదని నీకే తెలియును. ఈశరీరము నశించునట్టి స్వభావముకలదైయున్నందున ఆత్మ కాదని, నీవు స్వయముగానే తెలియుమని భావము.

శ్లో. మన్యసే తావదస్మీతి యావదస్మాన్న నీయసే,
శ్వభిః క్రోడీకృతే దేహే నైవం త్వమభిమంస్యసే. ౧౩. ౨౧

దం-అ. ఎంతవఱకు ఈశరీరములోనుంచి తీసికొనిపోఁబడవో అంతవఱకే నేనని యభిమానించుచుందువు. దేహము కుక్కలచేత గ్రసింపఁబడుచుండఁగా నీవు ఈప్రకారముగా నభిమానించవు.

తా. నీవు ఈశరీరములో నుండువఱకు ఈశరీరమును నీవు 'అహం' (నేను) అని అభిమానించెదవు. నీవు ఈశరీరములోనుంచి తొలఁగి స్వకర్మఫలభోగార్థమై లోకాంతరమునకుపోగా నీపుత్రకళత్రాదిబంధువులు ఒకనిమిషమైనను ఈశరీరము నింటిలోనుంచరు. తత్క్షణమునందే యెత్తికొనిపోయి శ్మశానములో పాఱవైచెదరు. అప్పుడీశరీరమును కుక్కలు పీకిపీకి భక్షించును. అట్టికాలమున ఈశరీరమును నీవు ఆత్మయని భావించవు. అని భావము.

శ్లో. శిర ఆక్రమ్య పాదేన భర్తృయత్యపరాన్ శునః,
దృష్ట్వా సాధారణం దేహం కస్మా త్సక్తోసి తత్ర భోః. ౧౮. ౨౨

దం-అ. ఒకకుక్క తనకాలిచేత శిరస్సును త్రొక్కిపట్టి, ఇతరములైనకుక్కలను కసరుచుండు గావున సామాన్యమైన ఈదేహమునుజూచి ఓయీ! నీవు ఆదేహమునందు ఏమికారణమువల్ల ఆసక్తికలవాఁడవైతివి?

తా. ఈదేహమునందు నీవు నాది యనెడిమమకారమును చేయకుము. ఈదేహము నీకొక్కనికే సొత్తుగా నుండలేదు. నీవు ఈదేహములో నుండువఱకు ఈదేహము నీదైయున్నప్పటికి నీవు విడిచిపోయినపిదప నీబంధువులు ఈ నీశరీరమును శ్మశానములోవైచెదరు. అప్పుడొకకుక్కవచ్చి ఈశరీరముయొక్క నెత్తిమీఁద కాలుబెట్టి త్రొక్కిపట్టి తనదని అభిమానించి మఱికొన్నికుక్కలీశరీరము నపేక్షించిరాగా, వానిని భుక్ భుక్ మని యఱచుచు బెదరించుచుండును. గనుక నీశరీరము కుక్కలకును మమకారవిషయమైయున్నందున సాధారణమైయున్నది. ఇట్టిస్థితి నీవుజూచి 'మమ'కారమును యేలచేసెదవని భావము.

అవ. దేహేంద్రియము లాత్మ కాదని కేవలయుక్తిచేత నే తెలియవలసినది కాదు. వేదవాక్యములున్ను ఈప్రకారమే చెప్పుచున్నవని కనుపఱుచుచున్నారు.—

వాక్య. శ్రుతి పరిప్రాపితోఽయమర్థః అనాత్మా బుద్ధ్యాది
దేహాంతఇతి. ౨౩

దం-అ. బుద్ధిమొదలుకొని దేహమువఱకుగలవస్తువు ఆత్మకాదని ఈయర్థము వేదముచేత పొందింపఁబడినది.

తా. బుద్ధి, మనసు, ప్రాణములు, ఇంద్రియములు, దేహములు ఇవియన్నియు ఆత్మకాదని శ్రుతియే చెప్పుచున్నదిగాని మే మూహించిచెప్పినది కాదని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. ఇద మాహ. ౨౪

దం-అ. దీనిని చెప్పుచున్నారు.

తా. బుద్ధ్యాదిదేహాంతవస్తువులు ఆత్మకాదని శ్రుతియెచ్చట చెప్పుచున్నదంటే దానిని చెప్పుచున్నారని భావము.

శ్లో. జనప్రీహి పలాలాంశై ర్బీజ మేకం త్రిధా యథా,
బుద్ధిమాంసపురీషాంశై రన్నం తద్వదవస్థితమ్. ౧౯. ౨౫

దం-అ. విత్తనము ఒకటియైనప్పటికి, చెత్త, గింజ, పొట్టు యీభాగములచేత మూఁడువిధములుగా నెటువలెనున్నదో, అన్నమున్ను బుద్ధి, మాంసము, పురీషము ఈ భాగములచే నటువలెనే యున్నది.

తా. ఈలోకములో పరివిత్తనము ఒకటిగానున్నప్పటికి అసారమైనభాగము చెత్తయని, కొంచెము సారమైనభాగము పొట్టని, నిండాసారమైనభాగము విత్తనము (బియ్యము) అని మూఁడువిధములుగా నేర్పడియున్నట్లు అన్నమున్ను అసారమైనభాగము పురీషమని, కొంచెము సారమైనభాగము మాంసమని, నిండాసారమైనభాగము బుద్ధి యనిన్ని మూఁడువిధములుగా నేర్పడియున్నది. గనుక అన్నపరిణామమైన పురీష మెటువలె యాత్మ కాదో, అటువలెనే యన్నపరిణామములైన మాంసబుద్ధులున్ను ఆత్మ కాదని ఛాందోగ్యములో చెప్పఁబడుచున్నదని భావము.

అవ. దేహము ఆత్మ కాదని తెలిసినందున కలిగెడిఫలమును చెప్పుటయే ఉత్తర శ్లోకములకు రెంటికి తాత్పర్యమని చెప్పుచున్నారు.—

వాక్య. యథోక్తార్థప్రతిపత్తౌ సత్యాం న రాగద్వేషాభ్యాం
విక్రియతే విపశ్చి దిత్యస్యార్థస్య ప్రతిపత్తయే దృష్టాంతః .౨౬

దం-అ. ఈచెప్పిన అర్థముయొక్కపరిజ్ఞానము కలుగగా విద్వాంసుఁడు రాగద్వేషములచేత వికారమును పొందఁడని ఈ యర్థమును తెలిసికొనెడికొఱకు దృష్టాంతము చెప్పఁబడును.

తా. దేహము అన్నపరిణామమైనందునను, ఆగంతుకమైనందునను, వినాశియైనందునను ఆత్మ కాదని చెప్పియున్నాము. ఈయర్థమును చక్కగా విశదముగా తెలిసిన పండితుఁడు రాగద్వేషములుకలవాఁడై యుండఁడు. అని దృష్టాంతపూర్వకముగ చెప్పుచున్నారని భావము.

శ్లో. వర్చస్కే సంపరిత్యక్తే దోషత శ్చావధారితే,
యది దోషం వదే త్తస్మై కిం తత్రోచ్ఛరితు ర్భవేత్. ౧౬. ౨౭

దం-అ. విడువఁబడినపురీషము దోషములవలన నిశ్చయింపఁబడియుండగా, ఆపురీషముకొఱకు, దోషమును చెప్పినచో దానియందు త్యజించినవాని కేమిహానికలుగును?

శ్లో. తద్వత్సూక్ష్మే తథా స్థూలే దేహే త్యక్తే వివేకతః,
యది దోషం వదే త్తాభ్యాం కిం తత్ర విదుషో భవేత్. ౧౭.౨౮

దం-అ. అటువలెనే సూక్ష్మమైనదేహమున్ను, ఆప్రకారమే స్థూలమైనదేహమున్ను వివేకమువల్ల విడువఁబడియుండగా, ఆరెండుదేహములకొఱకు దోషమును చెప్పిన

యెడల దానియందు వివేకికి యేమి హానికలుగును ? అని రెండుశ్లోకముల కొక్కటే యన్వయము.

తా. ఒకపురుషుఁడు తనగర్భమందున్న పురీషమును భూమియందు వదలి, అది దుర్గంధాదిదోషసహితమని, అసహ్యమని నిశ్చయించుకొనియుండును. అట్టి పురీషమును మఱియొకపురుషుఁడు దుర్గంధాదిదోషములుకలదని దూషించును. ఆలాగున దూషించగా పురీషమును వదలినవానికి యేమియును హానికలుగదు. దూషించినవానిని గూర్చి పురీషమును విడిచినవాఁడు 'ఛీ నాపురీషమును దూషించెదవా?' యని కోపమునున్ను చేయఁడుగదా? ఆప్రకారమే స్థూలదేహము, సూక్ష్మదేహము ఆత్మకాదని, ఆత్మకంటె అత్యంతబహిర్భూతములని చక్కగా విచారించి తెలిసికొని, వినాశిత్వదుఃఖిత్వాది బహుదోషములుఁ కలవని తాను నిశ్చయించి వీటియం దభిమానము విడిచినచో, నీదేహముల యందు అసుందరత్వ క్రూరత్వాదిదోషము లితరజను లుగ్గడించినను, వివేకముకలవాని కేమియును లోపముకలుగదు. దోషములనుచెప్పి దూషించిన జనులనుగూర్చి కోపమున్ను కలుగదని భావము. ఈదేహ మాత్మకాదనియును, హేయమనియును తెలిసినందున దీనియందు రాగద్వేషములు కలుగవు. కావుననే యీదేహము నన్యులు దూషించినారని కోపముగలుగదు. భూషించినారని యాదరముకలుగదు. ఇదియే, 'దేహము ఆత్మకాదని తెలిసినందున కలిగెడిఫలము' అని పరమభావము.

అవ. స్థూలసూక్ష్మదేహములయం దహంకారమమకారములను చేయుటయే వాక్యార్థజ్ఞానమునకు ప్రతిబంధకమైయున్నది. గనుక అట్టి యహంకారమమకారములను వివేకియగు పురుషుఁడు పరిహరించవలయునని చెప్పుచున్నారు.—

వాక్య. ఏతావదేవహ్యహం బ్రహ్మాస్మీతి వాక్యార్థాప్రతిపత్తౌ
కారణం యదుతబుద్ధ్యాదౌ దేహాంతే హ్యహం మమేతి
నిస్సంధిబంధనోగ్రహః. ౨౯

దం-అ. (నేను బ్రహ్మను అయితిని) 'అహం బ్రహ్మాస్మి' అనెడి వాక్యార్థమును తెలియకపోవుటయందు ఇంతమాత్రమే హేతువుయేదంటే బుద్ధిమొదలు దేహముపఱకు గల సముదాయమునందు 'నేను, నాది' యని కలుగుచున్ననిర్బాధకమైన అభిమానము.

తా. సర్వానర్థాత్మకసంసారమూలంబైన యజ్ఞానమును సవాసనగానశింపఁజేయునట్టిసామర్థ్యముకలది 'అహం బ్రహ్మాస్మి' యనెడివాక్యార్థజ్ఞానము. ఇట్టి వాక్యార్థజ్ఞానము సద్గురుసన్నిధానమునందు మహావాక్యోపదేశము కలుగగానే జన్మించవలసియున్నప్పటికి బుద్ధిమొదలు దేహముపఱకుగల స్థూలసూక్ష్మదేహములయందు 'అహం' నేను అనెడి

యభిమానమున్ను దృఢముగా నడచుచున్నందున జన్మించలేదు. ఇదియే వాక్యార్థజ్ఞానము కలుగకపోవుటకు ముఖ్యకారణము గనుక ముముక్షువులగువారందఱును దేహేంద్రియమనఃప్రాణబుద్ధిసంఘాతమునందు 'అహం' 'మమా'భిమానములను విశేషప్రయత్నములతోఁటి విడిచియుండవలయునని భావము.

అవ. దేహాదులయం దహంకార మమకారములనుచేయక, వివేకము కలిగియున్నందుకు తిరిగి మఱియొకఫలమును చెప్పుచున్నారు.—

వాక్య. తద్వ్యతిరేకేపి న కుతశ్చిత్ విభజ్యతే ఏకలఏవ
ప్రత్యగాత్మ న్యవతిష్ఠతే. 30

దం-అ. వాటికంటే భిన్నముగా నున్నయెడల, దేనివల్లను విభజింపఁబడఁడు. అద్వితీయుఁడై ప్రత్యగాత్మయందే నిలిచియుండును.

తా. ఎప్పుడు దేహేంద్రియము మనఃప్రాణబుద్ధిసంఘాతముకంటే తాను విలక్షణముగా నున్నట్టు తెలియునో, అప్పుడీయాత్మ యేపదార్థమువల్ల విభజింపఁబడఁడు. అనఁగా దేహేంద్రియాదిసంఘాతమును నేనని యభిమానించియున్నప్పుడు ఆత్మపరిచ్ఛిన్నుండైయుండును. ఆయభిమానమును విడువగానే పరిచ్ఛిన్నత్వము నివర్తించి అపరిచ్ఛిన్నమై సర్వను తానై అద్వితీయుఁడై కేవలస్వస్వరూపమునందుండి ముక్తుఁడగును. ఇదియే దేహాత్మవివేకమునకు ముఖ్యఫలమని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. ఇత్యాహ. 31

దం-అ. ఈప్రకారమును చెప్పుచున్నారు.

తా. వివేకఫలమును ఉత్తరశ్లోకములో వివరముగాఁ జెప్పుచున్నారని భావము.

శ్లో. రిపౌ బంధౌ స్వదేహే చ సమైకాత్మ్యం ప్రపశ్యతః,
వివేకినః కుతః కోపః స్వదేహావయవే ష్వివ. ౧౮. 32

దం-అ. శత్రువునియందు, బంధువునియందు, తనశరీరమునందును నిర్విశేషమై అద్వితీయమైన ఆత్మ ఒకటేకలదని చూచుచున్న వివేకముకలవానికి తనదేహావయవములందువలె కోపము యేకారణమువల్ల కలుగును?

తా. శత్రువులయొక్క శరీరములందు, పుత్త్రకళత్రాదిబంధువులయొక్క శరీరముయందు, తనశరీరమునందును, చిద్రూపుఁడైనయాత్మ ఒక్కఁడేయనిన్ని ఆయాత్మ అంతటనమునఁడనిన్ని, అద్వితీయుఁడనిన్ని, నిరవయవుఁడనిన్ని ఈప్రకారము ఆత్మయొక్క యాథార్థ్యమును తెలిసినవానికి అన్యులు తనకు అపకారముచేసినను, వారి

యందు కోపము, ఈర్ష్య, అసూయ, ద్వేషము మొదలగువికారములు కలుగవు. తన దేహములోని కరచరణాద్యవయవములయందు ఒక అవయవము మఱియొకయవయవమునకు బాధకముగానుండినను ఆ యవయవమునుగూర్చి తనకు కోపము కలుగదుగదా? ఆప్రకారమే సర్వదేహములయం దాత్మ ఒక్కఁడే అయినందున యేదేహమందును కోపాదులు జ్ఞానికి కలుగవని భావము.

అవ. మఱియొకహేతువునుచెప్పి దేహేంద్రియాదు లాత్మకాదని నిరూపించుచున్నారు.—

వాక్య. ఇతశ్చ అనాత్మా దేహాదిః. 33

దం-అ. ఈహేతువువల్లనున్ను దేహాదికము ఆత్మకాదు.

తా. స్పష్టము.

అవ. హేతువును చెప్పుచున్నారు.—

శ్లో. ఘటాదివచ్చ దృశ్యత్వాత్ తైరేవ కరణైర్దృశేః,
స్వప్నేచా నన్వయాత్ జ్ఞేయో దేహోఽనాత్మేతి సూరిభిః. ౧౯.

దం-అ. ఆయింద్రియములచేత నేచూడఁబడుచున్నశరీరము ఘటాదులవలె దృశ్యమై యున్నందువల్లను, స్వప్నమునందు సంబంధములేక యున్నందువల్లను, దేహము ఆత్మకాదని పండితులచేత తెలియఁదగినది.

తా. ఈలోకములోని వస్తువులు అనఁగా ఘటపటాదులు కంటితోఁ జూడఁబడుచున్నవి. ఈ దేహమున్ను కంటితోఁ జూడఁబడుచున్నది. గనుక ఘటాదివస్తువులవలె దేహమున్ను దృశ్యముగానున్నందున, ఘటాదివస్తువు లేప్రకారము ఆత్మకావో, ఆప్రకారమే దేహమున్ను ఆత్మకాదని తెలియవలయు. ఇదిగాక ఈదేహము జాగ్రదవస్థలో తెలియఁబడుచున్నదిగాని, స్వప్నావస్థలో కనుపడుటలేదు. అదియేలాగంటే, మనుష్యుఁడు స్వప్నములో తాను వ్యాఘ్రమైనటులఁ జూచి తదనుగుణవ్యాపారములను జేయుచుండి మెళకువరాగానే తాను వ్యాఘ్రముకాదనిన్ని మనుష్యుఁడననిన్ని వ్యవహరించును. గనుక మనుష్యశరీరము స్వప్నావస్థలో కనుపడలేదు. జాగ్రదవస్థలోమాత్రము ప్రకాశించుచు స్వప్నావస్థలో ప్రకాశించనిమనుష్యదేహము ఆత్మకాదని పండితులు తెలియఁగలరని భావము.

అవ. వివేకజ్ఞానము (తత్త్వజ్ఞానము) యొక్క ఫలమును చెప్పఁబోవుచున్నారు. ఈఫలమందు శ్రోతలకు శ్రద్ధకలుగఁజేయుటకొఱకు మిథ్యాజ్ఞాన తత్త్వజ్ఞానఫలములు పరస్పరము అత్యంతవిరుద్ధములై యున్నవని అనుభవముచేతనే చూపుచున్నారు.—

వాక్య. దేహాదికార్యకరణసంఘాత వ్యతిరేకావ్యతిరేకదర్శినః
ప్రత్యక్షతఏవ విరుద్ధం కార్య ముపలభ్యతే. ౩౭

దం-అ. దేహము మొదలగు కార్యకరణసముదాయముకంటే భేదమును అభేదమును చూచువానికి ప్రత్యక్షముచేతనే విరుద్ధమైనఫలము పొందఁబడుచున్నది.

తా. దేహము, ఇంద్రియములు వీటియొక్క సంఘాతమే దేహాదికము. ఇట్టి దేహాదులకంటే భిన్నమైన ఆత్మను తెలిసినవాఁడు వివేకి యనఁబడును. దేహాదులే యాత్మయని తెలిసినవాఁడు మిథ్యాజ్ఞాని యనఁబడును. వీర లిద్దఱకును కలిగెడిఫలము ఒకదానికంటె ఒకటి విరుద్ధముగా నున్నది. ఇది మనకందఱకును ప్రత్యక్షముగాఁ దెలియఁబడుచున్నదని భావము.

అవ. వివేకజ్ఞాన మిథ్యాజ్ఞానములకు విరుద్ధమైన ఫలము ఎటువంటిదంటే చూపుచున్నారు.—

శ్లో. చతుర్భి రూహ్యతే యత్త త్సర్వశక్త్యా శరీరకమ్,
తూలాయతే తదేవాహం ధియా ఘ్రాత మచేతసామ్. ౨౦. ౩౮

దం-అ. ఏశరీరము నలుగురుమనుష్యులచేత యావచ్ఛక్తితోటి మోయఁబడుచున్నదో ఆశరీరము వివేకవిహీనులయొక్క అహంబుద్ధిచేత స్పృశింపఁబడినదై దూదివలె చేయఁబడుచున్నది.

తా. ఈలోకములో సాధారణముగా ప్రతిమనుష్యునకు సుషుప్తికాలమందు దేహేంద్రియాదులయందు అహంబుద్ధి. (నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడ ననెడి యభిమానము) కలిగియుండదు. అట్టి సుషుప్తిదశలో ఆశరీరమును ఒకచోటినుంచి మఱియొకచోటికి చేర్చవలయునంటే నలుగురుమనుష్యులు తమయొక్క యావచ్ఛక్తిని ఉపయోగింపఁజేసి మోయవలసియుండును. ఆశరీరమే జాగ్రదవస్థలో అహం బుద్ధిచేత గ్రహింపఁబడియుండును. గనుక అన్యులయొక్క హస్తస్పర్శనముకూడ అపేక్షించక తనంతటతానే దూదిపింజవలె సంచరించుచుండును. ఇది మనకందఱకు ప్రత్యక్షముగాగదా నున్నది. గనుక సుషుప్తికాలమందున్న వివేకజ్ఞానముయొక్క ఫలము, జాగ్రత్కాలమందున్న మిథ్యాజ్ఞానముయొక్క ఫలమున్ను యెంతవిపరీతములై యున్నవో చూడుఁడని భావము.

అవ. చార్వాకులకంటే నితరులయినవాదులం (మతస్థులం)దఱును స్థూలదేహముకంటే యాత్మ, భిన్నమేనని నిర్వివాదముగా నంగీకరించియున్నందున, ఆయర్థమును ప్రతిపాదించుటయందు మేము విశేషముగా నభినివేశమును చేయమని చెప్పుచున్నారు-

వాక్య. ప్రసిద్ధత్వాత్ ప్రకరణార్థోపసంహారో యథా. ౩౭

దం-అ. ప్రసిద్ధమైయున్నందువలన ప్రకరణార్థము నుపసంహారించెడికొఱకు చెప్పుచున్నారు.

తా. స్థూలదేహముకంటె యాత్మ భిన్నమేనని లోకములో నంద అంగీకరించి యున్నారు. గనుక ఆవిషయమును విశేషముగా నిరూపించవలసిన అవసరములేదు గావున ప్రకృతమందు వాక్యార్థజ్ఞానము కలుగుట కుపయుక్తమని ప్రతిపాదించఁబడు చున్న 'త్వం' పదార్థశోధనమును నిగమించెడికొఱకు మఱియొకవిశేషమును చెప్పెద మని భావము.

అవ. ఈవాక్యమే ఉత్తరశ్లోకమున కవతారిక.—

శ్లో. స్థూలం యుక్త్యా నిరస్యైవం నభసో నీలతామివ,
దేహం సూక్ష్మం నిరాకుర్యాత్ అతోయుక్తిభి రాత్మనః. ౨౧. ౩౮

దం-అ. ఆకాశమువలన నీలత్వమునువలె స్థూలదేహమును యీవిధమైన యుక్తిచేత నిరసించి ఈముందు చెప్పఁబోవు యుక్తులచేత ఆత్మవల్లను సూక్ష్మమైన దేహమునున్ను నిరాకరించవలయును.

తా. శుద్ధమైన సకలరూపహీనమైన ఆకాశమునుచూచి తెలివిలేని మనుష్యులు ఆకాశము నల్లగానున్నదని వ్యవహారించెదరు. బుద్ధిమంతులగువారు ఆకాశము రూపరహితమైనందున నీలవర్ణముకలదిగాదని నిశ్చయించి ఆకాశమునందు నీలత్వము లేదనిన్ని దృష్టి బహుదూరముగా వ్యాపించినందున ఆఘాతనీలాకారమును గ్రహించుననిన్ని చెప్పెదరు. ఆప్రకారమే ఆత్మయున్ను శుద్ధమై నిర్విశేషమయినందున స్థూలదేహసంబంధము కలదిగాదని యిదివఱకు చెప్పియున్నయుక్తులచేత స్థూలదేహమును ఆత్మలోనుండి తొలఁగించి తరువాత యిఁకముందు చెప్పఁబోయెడి యుక్తులచేత సూక్ష్మదేహమునుకూడా ఆత్మలోనుండి నిరసించవలయునని భావము.

వాక్య. కథం సూక్ష్మం దేహం నిరాకుర్యాదితి ఉచ్యతే. ౩౯

దం-అ. సూక్ష్మదేహమును ఏలాగున నిరాకరించవలయునంటే చెప్పఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. అహం మమత్వ యత్నేచ్ఛాః నాత్మధర్మాః కృశత్వవత్,
కర్మత్వే నోపలభ్యత్వా దపాయిత్వాచ్చ వస్త్రవత్. ౨౨. ౪౦

దం-అ. విషయత్వముచేత పొందఁ(తెలియఁ)బడుచున్నందున, కృశత్వమువలె

నశించిపోవుచున్నందున, వస్త్రమువలె నహంకారము, మమకారము, ప్రయత్నము ఇచ్ఛ యివి ఆత్మధర్మములు కావు.

తా. కృశత్వము, పీనత్వము, దీర్ఘత్వము, వామనత్వము మొదలగు ధర్మములు ఆత్మచేత గ్రహింపఁబడెడుస్వభావము కలదైయున్నందున, యేప్రకారము ఆత్మధర్మములుకావో ఆప్రకారమే అహంకారము, మమకారము, ప్రయత్నము, బుద్ధి, ధర్మాధర్మేచ్ఛాదులును ఆత్మచేత గ్రహింపఁబడెడి స్వభావముకలవైనందున ఆత్మధర్మములు కానేరవు. ఆత్మ, నేను కృశత్వముకలవాఁడను, నేను ప్రయత్నముకలవాఁడ నని వ్యవహరించుచున్నందున కృశత్వప్రయత్నాదిధర్మములను ఆత్మ గ్రహించుచున్నాఁడు గనుక కర్తయనఁబడును. కృశత్వప్రయత్నాదులు ఆత్మధర్మములని చెప్పెడియెడల వీటికిన్ని ఆత్మకువలె కర్తృత్వమును చెప్పవలసియుండును. అది విరుద్ధము. కర్మకు కర్తృత్వముగాని,కర్తకు కర్మత్వముగాని ముఖ్యముగా కలుగదు.కర్తృకర్మలు పరస్పర విలక్షణము లయ్యేయుండును. కనుక కృశత్వాదులవలె అహంకారమమకారాదులున్ను ఆత్మధర్మములు కావు. ఇదిగాక అహంకారప్రయత్నాదులు ఆత్మయందు నిత్యముగా నుండునవియును కావు. ఒకకాలమునందుండి మఱియొకకాలమందు లేకయుండును. కనుక వస్త్రము ఒకకాలమందుండి మఱియొకకాలమందు లేకయున్నందున యేప్రకారమాత్మధర్మముకాదో, ఆప్రకారమే అహంకారప్రయత్నాదులున్ను ఆత్మధర్మములు కావని భావము. ఇచ్ఛాప్రయత్నధర్మాధర్మాదులు, ఆత్మధర్మములు కావని చెప్పినందున ఇచ్ఛాదిధర్మములుకల అంతఃకరణమే సూక్ష్మదేహము గనుక, అట్టిసూక్ష్మదేహము ఆత్మ కాదని ప్రతిపాదింపఁబడినది.

అవ. ఈలాగున చెప్పనియెడల బాధకము కలుగునని చెప్పుచున్నారు.—

వాక్య. వైధర్మ్యే దృష్టాంతః. ౪౧

దం-అ. విపరీతముగా చెప్పుటయందు దృష్టాంతము చెప్పఁబడును.

తా. ఇచ్ఛాప్రయత్నాదిధర్మములు ఆత్మధర్మములే యైనయెడల, వాటియందు దృశ్యత్వము కలుగనేరదని మేముచెప్పిన యర్థమును అంగీకరించక, ఆత్మధర్మములైనప్పటికి దృశ్యములుగా నుండవచ్చునని చెప్పెడియెడల లోకప్రసిద్ధములైన దృష్టాంతములనేకములు బాధకములై యుండునని భావము.

అవ. బాధకదృష్టాంతమును చూపుచున్నారు.—

శ్లో. నోష్ణిమానం దహ త్యగ్నిః స్వరూపత్వాత్ యథాజ్వలన్,
తథై వాత్మాత్మనో విద్యా దహం నైవా విశేషతః. ౨౩. ౪౨

దం-అ. అగ్ని మండుచున్నదైనప్పటికి స్వరూపమైనందున వేఁడిమి నెటువలె దహింపదో అటువలెనే యాత్మయందున్న తనయొక్క అహంభావమును తనకంటే విశేషముకలది కానందున (స్వరూపమైనందున) తెలియఁజాలదు.

తా. వేఁడిమి అగ్నికి స్వరూపమని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు ధర్మమని చెప్పుదురు. ఏలాగైనను అగ్ని తనవేఁడిమిని తాను దహింపఁజాలదుగదా? ఇందుకు కారణమేమంటే, వేఁడిమి అగ్నికి స్వరూపముగాగాని, ధర్మముగాగాని ఉండుటయే కారణము. గనుక యేది దేనికి స్వరూపమైగాని, ధర్మమైగాని యుండునో దానిని అది విషయీకరించఁజాలదని తోఁచుచున్నది. ఈలాగుననే అహంకారప్రయత్నేచ్ఛాదులు ఆత్మకు స్వరూపమైయుండినను, లేక ధర్మములై యుండినను ఆత్మచేత గ్రహింపఁబడవని చెప్పవలయును. అనఁగా నాత్మకు దృశ్యములు కావని యర్థము. ఆత్మచేత గ్రహింపఁబడుచున్నందున అహంకారమమకారాదు లాత్మధర్మములు కానేరవని భావము.

అవ. ఇచ్చట మతాంతరులయొక్క వాదమును చూపించుచున్నారు.—

వాక్య. ఏకస్యాత్మనః కర్మకర్తృభావః సర్వథా నోపపద్యత ఇతి శ్రుత్వా మీమాంసకః ప్రత్యవతిష్ఠతే. ౪౩

దం-అ. ఒకఁడైన ఆత్మకు కర్మత్వము కర్తృత్వము కూడా యెప్పటికిని ఉపపన్నముకాదని విని మీమాంసకుఁడు ప్రత్యవస్థానమును చేయుచున్నాఁడు.

తా. ప్రయత్నేచ్ఛాదులు దృశ్యములై యున్నవి. ఆత్మ ద్రష్టయై యున్నాఁడు. గనుక ప్రయత్నేచ్ఛాదులు ఆత్మధర్మములు కావనిన్ని, ఆత్మధర్మములే యైనయెడల దృశ్యత్వద్రష్టృత్వములను ఒకఆత్మకే చెప్పవలసివచ్చుననిన్ని, ఆలాగున చెప్పుట న్యాయము కాదనిన్ని, సిద్ధాంతవాది ప్రతిపాదించగా, మీమాంసకుఁడు విని, యాక్షేపించుటకు వచ్చుచున్నాఁడని భావము.

అవ. పూర్వమీమాంసకునియొక్క ఆక్షేపమును కనుపఱచుచున్నారు.—

వాక్య. 'అహంప్రత్యయ' గ్రాహ్యత్వాత్ గ్రాహక ఆత్మేతి. ౪౪

దం-అ. 'అహం ప్రత్యయము' చేత గ్రహింపఁబడుచున్నందున, ఆత్మ, గ్రాహకుఁడేను.

తా. 'అహం' (నేను) అనిగదా ఆత్మ తెలియఁబడుచున్నాఁడు. ఇట్టియాత్మను తెలిసికొనెడి మఱియొకయాత్మ లేఁడు. గనుక, అహం ప్రత్యయముచేత ఆత్మ గ్రహింపఁబడుననిన్ని, తన్నుతానే గ్రహించుననిన్ని అంగీకరించవలయును. ఇందువలన ఒకయాత్మయందే కర్తృత్వకర్మత్వములు రెండును కలవనిభావము.

వాక్య. తన్నివృత్త్యర్థ మాహ.

దం-అ. దానియొక్క నిరాకరణముకొఱకు చెప్పుచున్నారు.

తా. పూర్వమీమాంసకుఁ డీలాగున చేసినయాక్షేపమును సిద్ధా...
చున్నారని భావము.

శ్లో. యత్కర్మకో హి యో భావో నాసౌ తత్కర్తృ...
ఘటప్రత్యయవత్తస్మా న్నాహం స్యా ద్దృష్టృకర్మ...

దం-అ. ఏ ప్రత్యయము ఏదికర్మగా గలిగియుండునో, ఆప్ర...
గాఁగలిగి ఘటప్రత్యయమువలె నెందువలన నుండదో ఆ కారణ...
ప్రత్యయము ఆత్మకర్తగాగలది కాదు.

తా. ఈలోకమునందు 'అయంఘటః' (ఇది ఘటము) అనెడిజ్ఞా...
కర్మగా, పురుషుఁడు కర్తగా కనుపడుచున్నారుగాని, ఘటమే కర్మగా...
కనుపడుటలేదు. కనుక సర్వజ్ఞానములకున్ను ఇదియే న్యాయము. ...
కర్మ వేరే, కర్త వేరే యుండునుగాని, కర్మకర్తలు రెండు నొకటిగా ...
రమే 'అహం' అనెడిజ్ఞానమునకున్ను కర్మకర్తలు వేఱుగానుండవల...
యున్నందున 'అహం' అనెడి జ్ఞానమునకు ఆత్మ కర్తకానేరఁడని భా...

అవ. తిరిగి పూర్వపక్షమీమాంసకుఁ డాక్షేపించుచున్నాఁడు.

వాక్య. అత్రాహ, ప్రత్యక్షేణాత్మనః కర్మ కర్తృ...
పగమే తత్పాదోపజీవినా అనుమానేన ప్రత్య...
రణ మయుక్తమితి చోద్యమ్.

దం-అ. ప్రత్యక్షముచేత ఆత్మకు కర్మత్వకర్తృత్వములు అం...
గా దానియొక్క పాదముల నాశ్రయించియున్న అనుమానముచేత ప్ర...
చుట యుక్తముకాదని ఆక్షేపము నిచ్చట చెప్పుచున్నాఁడు.

తా. ప్రత్యక్షప్రమాణము సర్వదా శ్రేష్ఠమనిన్ని అనుమాన...
క్షప్రమాణము నాశ్రయించి దానికి అనుకూలముగా ప్రవర్తించునని...
నంగీకరించియున్నారుగదా? 'మా మహం జానామి' (నన్ను నేను...
అనెడిప్రత్యక్షప్రమాణము అస్మచ్ఛబ్దవాచ్యమైన ఆత్మకొక్కనికే
అనెడి ద్వితీయాంతపదముచేత కర్మత్వమును, 'అహం' (నేను) అనెడి...
చేత కర్తృత్వమును రెంటిని విశదముగా చెప్పుచుండగా, ఘట...
అహంప్రత్యయమునకును కర్తృకర్మలు వేఱుగా నుండవలయునని ...

పించి ఆయనుమానముచేత ప్రత్యక్షమును బాధించుట యుక్తముగాదు. కనుక, 'మామహం జానామి' యనెడి ప్రత్యక్షము ననుసరించి, ఆత్మకు కర్మత్వకర్తృత్వములు రెండుకలవు. అనుమానము ప్రత్యక్షబాధితమైనందున ప్రమాణము కానేరదని పూర్వమీమాంసకుఁడు ఆక్షేపించునని భావము.

వాక్య. తన్నిరాకరణాయ ప్రత్యక్షోపన్యాసః. ౪౦

దం-అ. దానిని నిరాకరించెడికొఱకు ప్రత్యక్షనిరూపణము చేయఁబడును.

తా. పూర్వమీమాంసకుఁడు చేసిన యాక్షేపము నిరాకరించెడికొఱకు సిద్ధాంతవాది ప్రత్యక్షమునే నిరూపించుచున్నారని భావము. అనఁగా కర్మకర్తృత్వములు రెండు ఆత్మకే కలవని చెప్పుచున్న ప్రత్యక్షమును మఱియొక ప్రత్యక్షముచేత దూషించుచున్నారు.

శ్లో. యత్ర యో దృశ్యతే ద్రష్ట్రా తస్యైవాసౌ గుణో న తు,
ద్రష్టృస్థం దృశ్యతాం యస్మాన్నైవేయాత్ ద్రష్టృబోధవత్. ౨౫.

దం-అ. ఏయంతఃకరణమునందు యే అహంప్రత్యయము సాక్షిచేతఁ జూడఁబడుచున్నదో ఆయంతఃకరణమునకే ఆ యహంప్రత్యయము ధర్మముగాని ఆత్మకు(సాక్షికి) ధర్మముకాదు. ఎందువల్లనంటే ద్రష్టయందున్న ధర్మము ద్రష్టయొక్క జ్ఞానమువలె దృశ్యత్వమును పొందనే పొందదు.

తా. అహం (నేను) అను ప్రత్యక్షమునందు అంతఃకరణము ఆత్మచేత ప్రకాశింపఁజేయఁబడుచున్నందునను, అహం ప్రత్యయమున్ను అంతఃకరణములో చేరియున్నందునను, అహంప్రత్యయము అంతఃకరణముయొక్క ధర్మమని చెప్పడమే యుక్తముగానున్నది. ఆత్మయొక్క ధర్మమని చెప్పెడియెడల అహంప్రత్యయము దృశ్యముకాకపోవును. కనుక అంతఃకరణమే అహంప్రత్యయసాక్షియగు ఆత్మచేత చూడఁబడుచున్నదిగాని, ఆత్మచూడఁబడినది కాదు. అనఁగా జడమైన అంతఃకరణమున్ను, స్వయంప్రకాశమైన ఆత్మయున్ను రెండుచేరి 'అహం' అని వ్యవహరింపఁబడుచున్నవి. కేవలాంతఃకరణముగాని, కేవలాత్మగాని, 'అహం' అని వ్యవహరింపఁబడుటలేదు. ఇందులో అంతఃకరణము జడమైనందున ఆత్మను చూడఁజాలదు. కనుక ఆత్మకు దృశ్యత్వము లేదు. ఆత్మ స్వయంప్రకాశమైనందున అంతఃకరణమును జూడఁగలదు. కనుక అంతఃకరణమునకు దృశ్యత్వముకలదు. అహంప్రత్యయమున్ను దృశ్యమైనందున అంతఃకరణములో నంతర్భవించియున్నదని భావము. అహంప్రత్యయము ఆత్మస్వరూపమే యైనచో దృశ్యముకాకపోవలయును. ఆత్మస్వరూపమైనజ్ఞానము దృశ్యము కాదుగదా! కనుక 'మ

మహం జానామి’ అనెడిప్రత్యక్షము అంతఃకరణవిశిష్టమైన ఆత్మను గోచరింపఁజేయుచున్నదిగాని, కేవలాత్మను గోచరింపఁజేయునదికాదు. అంతఃకరణవిశిష్టమైన ఆత్మకు దృశ్యత్వము కలుగవచ్చును. కనుక కేవలాత్మయందు దృశ్యత్వమును జెప్పెడిప్రమాణము లేదని భావము.

అవ. శ్లోకములో చెప్పినయుక్తివల్ల ఫలించినయర్థమును చెప్పుచున్నారు.—

వాక్య. ప్రత్యక్షేణైవ భవదభిమతస్య ప్రత్యక్షస్యాభాసీకృతత్వాత్ సుస్థమే వానుమానమ్. ౫౦

దం-అ. ప్రత్యక్షముచేతనే మీకు సమ్మతమైన ప్రత్యక్షము ఆభాసముగా చేయఁబడినందున అనుమానము నిర్దోషమైయున్నది.

తా. ఆత్మయందు కర్మత్వకర్తృత్వములు రెండుకలవని ‘మామహం జానామి’ అనెడిప్రత్యక్షము చెప్పుచున్నదని మీరు చెప్పితిరి. అహం అనెడిప్రత్యక్షము అంతఃకరణమునకే దృశ్యత్వముకలదని చెప్పుచున్నదికాని ఆత్మకు దృశ్యత్వమును చెప్పలేదని మేము చెప్పితిమి. అహం అనెడిప్రత్యక్షమును బట్టి యోచించగా మీరుచెప్పిన ప్రత్యక్షము అంతఃకరణవిశిష్టాత్మపరమని తోఁచుచున్నది. కనుక కేవలాత్మకు కర్తృత్వకర్మత్వములు సంభవించవు గావున మేముచెప్పిన అనుమానము నిర్దోషముగా నున్నదని భావము.

వాక్య. అతస్తదేవ ప్రక్రియతే. ౫౧

దం-అ. కనుక అదియే ఆరంభింపఁబడుచున్నది.

తా. ఆత్మచేత తెలియఁబడుచున్న అహంప్రత్యయము ఆత్మధర్మముకాదని మఱియొకవిధముగా ప్రతిపాదించుచున్నారని భావము.

వాక్య. తత్ర చ వికల్పదూషణాభిధానమ్. ౫౨

దం-అ. అందులో వికల్పించి దూషణమును చెప్పుట ముందరగాఁజేయఁబడును.

తా. అహంప్రత్యయము ఆత్మధర్మముకాదని దూషించునప్పుడు ముందుగా వికల్పించి దూషణము చెప్పఁబడునని తాత్పర్యము.

శ్లో. నాత్మనా నతదంశేన గుణః స్వస్థోవగమ్యతే,
అభిన్నత్వాత్సమత్వాచ్చ నిరంశత్వాదకర్మతః. ౨౬. ౫౩

దం-అ. ఆత్మయందుగలధర్మము ఆత్మచేతను గ్రహింపఁబడదు. ఆత్మయొక్క అంశముచేతను గ్రహింపఁబడదు. ఎందువల్లననంటే ఆత్మ అభిన్నుఁడైనందునను సముఁడైనందునను అవయవరహితుఁడైనందునను కర్మత్వము లేనివాఁడైయున్నందున.

తా. అహంప్రత్యయము ఆత్మధర్మమని చెప్పెడివారీయహంప్రత్యయము ఆత్మచేత గ్రహింపఁబడునందురా? లేక ఆత్మయొక్క అంశముచేత గ్రహింపఁబడునందురా? ఈరెండువిధములుగా చెప్పుటకు అనుకూలించదు. ఎందువల్లనంటే తనయందున్నధర్మమును గ్రహించునప్పుడు ముందుగా తనను గ్రహించవలయును. తాను తనకంటే అభిన్నమైయున్నందున గ్రహింపఁబడదు. గ్రాహ్యగ్రాహకభావమును చెప్పెడిచో యత్కించిద్విశేషమును చెప్పవలయును. ఆత్మ సమస్వభావముకలవాఁడైనందున అట్టివైశేష్యము సంభవించదు. ఇదిగాక ఆత్మనిరవయవుఁడైనందున తనయంశముచేతనున్ను తాను గ్రహింపఁబడఁడు. కనుక ఆత్మయందు దృశ్యత్వము (కర్మత్వము) లేనందున, దృశ్యమైన అహంప్రత్యయము ఆత్మధర్మము కానేరదని భావము.

అవ. ఉత్తరశ్లోకముయొక్క తాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. నయుగపన్నాపి క్రమేణోభయథా చైకస్య ధర్మిణో
గ్రాహ్యగ్రాహకత్వ ముపపద్యత ఇతి ప్రతిపాదానాయాహ. ౫౮

దం-అ. ఒకవస్తువునకు గ్రాహ్యగ్రాహకభావము (దృశ్యద్రష్టృభావము) ఏకకాలమునందుపపన్నము కాదు. క్రమముగానున్ను ఉపపన్నము కాదని ప్రతిపాదించెడిశ్లోకము చెప్పుచున్నారు.

తా. ఆత్మకు ద్రష్టృత్వదృశ్యత్వములు రెండుకలవని చెప్పెడివారు ఏకకాలమందే ద్రష్టృత్వదృశ్యత్వములు ఆత్మకు కలవని చెప్పుదురా? లేక, ఒకకాలమందు ద్రష్టృత్వము మఱియొకకాలమందు దృశ్యత్వము కలిగి యుండునని చెప్పుదురా? ఈ రెండువిధములుగాను చెప్పుటకు సంభవించదని ముందరిశ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. ద్రష్టృత్వే నోపయుక్తత్వాత్ తదైవాస్య న దృశ్యతా,
కాలాంతరేచే ద్దృశ్యత్వం న చ ద్రష్టృక మిష్యతే. ౨౭. ౫౫

దం-అ. ద్రష్టృరూపముచేత నుపయోగించియున్నందువలన అప్పుడే దృశ్యత్వము సంభవింపదు. ఇతరకాలమునందైతే ద్రష్టృశూన్యమైన దృశ్యత్వము అంగీకరింపఁబడదు గదా?

తా. ఆత్మయందు ద్రష్టృత్వదృశ్యత్వములు ఏకకాలమందే కలవని చెప్పఁగూడదు. ఎందువల్లనంటే ఆత్మ నిరవయవుఁడైనందున ఆత్మ ఆకారద్వయము కలవాఁడు కాఁడు. కనుక ద్రష్టగా నేర్పడినప్పుడు సంపూర్ణముగా ద్రష్టగా నుండునుగాని అప్పుడే దృశ్యముగాకూడ నుండఁజాలఁడు. ద్రష్టృత్వము ఒకకాలమందును

దృశ్యత్వము మఱియొకకాలమునందును సంభవించుననిన్ని చెప్పఁగూడదు. ఎందువల్ల నంటే ఆత్మ ఎప్పుడు దృశ్యముగా నుండునో అప్పుడు ద్రష్టలేనందున ఆత్మకు దృశ్యత్వము సంభవించదని లోకములోనున్న దృశ్యము ద్రష్టచేత సిద్ధించుచున్నది. ఆత్మకంటే మఱియొక ద్రష్ట లేఁడు అని మన మంగీకరించుచున్నందున ఆత్మకు దృశ్యత్వము ఏలాగున సిద్ధించునని భావము.

అవ. పూర్వమీమాంసకుఁడు తిరిగి యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. సంతు కామ మనాత్మధర్మా మమత్వాదయః యథోక్త
న్యాయబలాత్ అనాత్మతయైవచ తేషు వ్యవహారాత్ అ
హం రూపస్య తు ప్రత్యగాత్మసంబంధిత యైవ ప్రసిద్ధే
'అహం బ్రహ్మాస్మీ'తి శ్రుతే శ్చానాత్మధర్మత్వ మయుక్తమ్. ౫౭

దం-అ. ఇదివఱకుచెప్పిన యుక్తులయొక్క సామర్థ్యమువల్లను, వాటియందు ఆత్మభిన్నమైన ఆకారముచేతనే వ్యవహారము కలిగియున్నందునను, మమత్వము మొదలగునవి అంతఃకరణముయొక్క ధర్మములు యథేష్టముగా నవుగాక. అహంప్రత్యయమం నకు మాత్రము ప్రత్యగాత్మతోటి సంబంధముకలిగియుండుటచేతనే ప్రసిద్ధి యున్నం దువల్లను, 'అహంబ్రహ్మాసి' (నేనుబ్రహ్మను) అనెడి శ్రుతివల్లను అంతఃకరణధర్మత్వము యుక్తముకాదు.

తా. ౫౫ వ శ్లోకములో చెప్పినయుక్తిప్రకారము మమత్వము, ప్రయత్నము, ఇచ్ఛ, ధర్మము, అధర్మము మొదలగునవి అంతఃకరణధర్మములయితే కానేవచ్చును. ఇదిగాక మమత్వప్రయత్నాదు లాత్మధర్మములని చెప్పెడి మేమున్ను అవి ఆత్మకంటే భిన్నములనియే వ్యవహరించుచున్నాము. లోకములోనున్ను ఆత్మ భిన్నములుగానే వ్యవహరింపఁబడుచున్నవి. గనుక మమత్వాదు లంతఃకరణధర్మములే కావచ్చును. గాని అహంప్రత్యయము (అహంకారము) మాత్రము ఆత్మధర్మమే కావలయును. అంతఃకరణధర్మము కాదగినదికాదు. ఎందువల్లనంటే, అహంకారము వ్యవహారములోకూడా 'అహమాత్మా' (నేను ఆత్మను) అని ఆత్మలో నేకీభవించినట్టు కనుపడుచున్నది. ఇదిగాక, 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మనైతిని) అనెడిశ్రుతియందున్ను ఆత్మవాచకముగా ప్రయోగింపఁబడియున్నది. గనుక అహంప్రత్యయము అంతఃకరణధర్మమని చెప్పుట న్యాయముకాదని భావము.

అవ. సిద్ధాంతవాది మీమాంసకుని యాక్షేపమును నిరసించుట కారంభించుచున్నారు.—

వాక్య. ఇతిచేత్ తన్న. ౫౭

దం-అ. ఈలాగంటిరా అదికాదు.

తా. ఈలాగున మీమాంసకులు చెప్పుచున్నారుగాని అలాగున చెప్పకూడదని భావము.

శ్లో. అహం ధర్మస్త్వభిన్నశ్చేత్ అహం బ్రహ్మేతి వాక్యతః,
గౌరోఽహ మిత్యనైకాంతః వాక్యం తద్వ్యపనేతృతత్. ౭౮.

దం-అ. 'అహం' అనెడిధర్మము (అహంకారము), 'అహం బ్రహ్మ' (నేను బ్రహ్మను) అనెడివాక్యమువలన అభిన్నమైనయెడల 'గౌరోఽహం' (నేను పచ్చనివాఁడను) అనెడివాక్యమునందు వ్యభిచారము కలదియగును. కనుక ఆవాక్యము ఆయహంకారమును నిరాకరించుచున్నది.

తా. 'అహం బ్రహ్మ' అనెడివాక్యమునందు 'అహం' శబ్దము 'బ్రహ్మ' శబ్దముతోటి సమానాధికరణముగా వ్యవహరింపఁబడుచున్నందున, అహంశబ్దవాచ్యమైన అహంత్వము ఆత్మధర్మమని చెప్పెడియెడల 'గౌరోహం' అనెడివాక్యమునందున్న గౌరశబ్దము అహంశబ్దముతోటి సమానాధికరణముగా వ్యవహరింపఁబడుచున్నందున గౌరశబ్దవాచ్యమైన పీతవర్ణవిశిష్టదేహము ఆత్మధర్మము కావలసియుండును. అలాగున ఆత్మవాదు లెవ్వరును అంగీకరించినదిలేదు. కనుక అహంత్వము ఆత్మధర్మముకాదు. 'అహం బ్రహ్మాస్మి' యనెడివాక్యము బాధార్థమైన సమానాధికరణవాక్యముగాని, విశేషణార్థమైన సమానాధికరణవాక్యముకాదు. కనుక అహంకారము ఆత్మధర్మముకాదని నిరాకరించుచున్నదని భావము.

అవ. మీమాంసకుఁడు ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. కథంవాక్యం తద్వ్యపనేతృ తదితి. ౫౮

దం-అ. ఆవాక్యము ఆయహంకారమును నిరాకరించునని యేలాగున చెప్పఁబడెను?

తా. లోకములో నీల ముత్పలం(నల్లనికలువ), నీలోఘటః (నల్లనికుండ) ఇత్యాదివాక్యములు నీలత్వాదులు ఉత్పలాదులకు ధర్మమని ప్రతిపాదించుచు విశేషణార్థసమానాధికరణవాక్యములై కనుపడుచుండగా 'అహంబ్రహ్మాస్మి' అనెడి వాక్యము అహంకారము బ్రహ్మాత్మకు ధర్మమని ప్రతిపాదించదనిన్ని అహంకారము బ్రహ్మాత్మలోనుంచి నివర్తింపఁజేయుననిన్ని కనుకనే బాధార్థసమానాధికరణవాక్యమనిన్ని యేకారణమువల్ల చెప్పుచున్నారని భావము.

అవ. సిద్ధాంతవాది ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. ఉచ్యతే. ౬౦

దం-అ. చెప్పఁబడును.

తా. ఈప్రశ్న కుత్తరమును చెప్పుచున్నామని భావము.

శ్లో. యోఽయం స్థాణుః పుమానేష పుం ధియా స్థాణు ధీ రివ,
బ్రహ్మాస్మీతి ధియాఽశేషా మహం బుద్ధిం నివారయేత్. ౨౯. ౬౧

దం-అ. ఏ యీస్థాణువుకలదో ఇది పురుషుఁడు అనెడి స్థలమందు పురుషుఁడనెడి బుద్ధిచేత స్థాణువనెడిబుద్ధివలె బ్రహ్మాస్మి యనెడిబుద్ధిచేత సకలమైన అహంబుద్ధిని నివారించవలయును.

తా. సమానాధికరణవాక్యములు కొన్ని విశేషణార్థములుగా మఱికొన్ని బాధార్థములుగా నున్నవిగాని యావత్తువాక్యములు విశేషణార్థములేకావు. నీలముత్పల మిత్యాదివాక్యములు విశేషణార్థములైనప్పటికి స్థాణుః పురుషః (స్థాణువు పురుషుఁడు) ఇత్యాది వాక్యములు బాధార్థములై యున్నవి. ఇదివఱకు పురుషుఁడుగా కనఁబడినవస్తువు స్థాణువుగాని పురుషుఁడు కాఁడు అని 'స్థాణుఃపురుషః' అనెడువాక్యమున కర్థము గనుక స్థాణుజ్ఞానముచేత పురుషజ్ఞానము బాధింపఁబడినందున, 'స్థాణుఃపురుషః' అనెడివాక్యము బాధార్థసమానాధికరణవాక్యము. ఇదివఱకు అహముగా ప్రకాశించుచున్న నేను బ్రహ్మనుగాని, అహంకారమును గాను అని 'అహం బ్రహ్మాస్మి' యనెడివాక్యమున కర్థము గనుక బ్రహ్మజ్ఞానముచేత సకలమైన 'అహం' బుద్ధి నివరింపఁబడును. అందువల్లనే అహం బ్రహ్మాస్మి యనెడి వాక్యము బాధార్థసమానాధికరణవాక్యమై యున్నది. కనుకనే అహంత్వము ఆత్మధర్మముకాదు. 'అహమాత్మా' (నేను ఆత్మను) అనెడిలోకసిద్ధమైన ప్రయోగము వివేకియొక్క వ్యవహారములో బాధార్థమనిన్ని, అవివేకియొక్క వ్యవహారములో విశేషణార్థమనిన్ని నిశ్చయించవలయుననిభావము. అహం శబ్దార్థమును గూర్చి విశేషముగా చెప్పవలసియున్నది. గ్రంథవిస్తరభీతులమైనందున ఇచ్చట వివరించము. పంచదశప్రకరణములో తృప్తిదీపమును చూడవలయును.

అవ. ఈప్రకారము అహంకారము ఆత్మధర్మముకాదని నిరాకరించినందున ఫలించినయర్థమును చెప్పుచున్నారు.—

వాక్య. అహం పరిచ్ఛేదవ్యావృత్తౌ న కించిదవ్యావృత్తం ద్వై
తజాత మవశిష్యతే, ద్వితీయ స్సంబంధస్య తన్మూలత్వాత్. ౬౨

దం-అ. అహంకారము నివర్తించగా నివర్తించని ద్వైతసమూహము కొంచె

మైనను శేషించదు. రెండవవస్తువుయొక్క సంబంధము ఆయహంకారమే కారణముగా గలిగియున్నందున.

తా. అద్వితీయుఁడైన ఆత్మకు దేహేంద్రియాదిభేదవస్తువులు ప్రకాశించుటకు మూలము అహంకారమే అయియున్నది. మొట్టమొదట అంతఃకరణమునందు అహం అనెడి అభిమానమును చేయనియెడల దేహాదిప్రపంచము ప్రకాశించకనే యుండును. గనుక నిట్టిభేదప్రపంచప్రకాశకమైన అహంకారము నివర్తించగానే భేదప్రపంచము యావత్తు నివర్తించునుగాని కొంచెమైనను శేషించియుండదు. అని భావము.

అవ. ఈయర్థమును వివరించుచున్నారు.—

వాక్య. అత ఆహ. ౬౩

దం-అ. అందువలన చెప్పుచున్నారు.

తా. భేదసంబంధము ఆత్మకు అహంకారముచేతనే ప్రాప్తించినది. గనుక ముందటియర్థము చెప్పఁబడునని భావము.

శ్లో. నివృత్తా యా మహం బుద్ధౌ మమధీః ప్రవిలీయతే,
అహం బీజాహి సా సిద్ధ్యేత్ తమోఽభావే కుతః ఫణీ. ౩౦.౬౪

దం-అ. అహం అనెడిబుద్ధి (అహంకారము) నివర్తించగానే మమ అనెడిబుద్ధి న్ని (మమకారము) నివర్తించుచున్నది. ఆమమకారము అహంకారమే కారణముగా గలిగి నివర్తించునుగదా? అంధకారములేనియెడల, సర్పములాగున యెక్కడ సిద్ధించును?

తా. మమకారము తద్విషయములైన గృహక్షేత్రపుత్రకళత్రాదులున్ను అహంకారముచేతనే సిద్ధించినవిగనుక, అహంకారము నివర్తించగానే తత్క్షణమందే మమకారాదులు యావత్తు నశించిపోవును. అంధకారములో భ్రాంతిచే స్ఫురించుచున్న సర్పము, అంధకారము నివర్తించగానే నివర్తించునుగాని శేషించియుండదుగదా యని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. వివక్షిత దృష్టాంతాంశజ్ఞాపనాయ దృష్టాంతవ్యాఖ్యా. ౬౫

దం-అ. చెప్పఁదలఁచిన దృష్టాంతాంశమును తెలియఁజేయుటకొఱకు దృష్టాంతమునకు వ్యాఖ్యానము చేయఁబడును.

తా. అంధకారము లేనియెడల సర్పము యేలాగున సిద్ధించునని చెప్పినదృష్టాంతమువలన ప్రసిద్ధాంధకారము లేనిసమయమునందు సర్పము కనుపడదని తోఁచును.

అది విరుద్ధము. అంధకారములేని పగటియందును సర్పములు కనఁబడుచున్నవిగదా? గనుక దృష్టాంతము సరియైనదికాదని కొందఱు ఆక్షేపించుచున్నారు. అని తలఁచి దృష్టాంతమునం దెటువంటియర్థము వివక్షితమైనదో ఆయర్థమును ప్రకటించెడికొఱకు దృష్టాంతమునకు వ్యాఖ్యానము చేయఁబడునని భావము.

శ్లో. తమోహి భూతచిత్తో హి రజ్వాం పశ్యతి రోషణమ్,
భ్రాంత్యా భ్రాంత్యావినా తస్మా నోరగం ప్రజివీక్షతే. ౩౧. ౬౬

దం-అ. అజ్ఞానముచేత నాక్రమింపఁబడిన చిత్తముగల పురుషుఁడు భ్రాంతిచేత త్రాటియందు సర్పమును చూచుచున్నాఁడు. గనుక అజ్ఞానముచేత వినాగా త్రాటియందు సర్పమును చూడఁడు.

తా. అజ్ఞానము మనస్సు నాక్రమించియున్నసమయములో నెదుటనున్నత్రాటిని జూచి అది సర్పమని భ్రమించును గనుక నా యజ్ఞానము నివర్తించగానే త్రాడు త్రాటివలె నగుపడునుగాని, సర్పమువలె నగుపడదు. ఇది దృష్టాంతవాక్యమునకు మాతాత్పర్యముగాని, తమశ్శబ్దమునకు అజ్ఞానము అర్థమేగాని, ప్రసిద్ధాంధకారము అర్థముగాదని భావము.

అవ. మఱియొకయుక్తిని చెప్పి అహంకారము ఆత్మధర్మముకాదని ప్రతిపాదించెదరు.—

వాక్య. అనన్వయాచ్చనాత్మధర్మోఽహంకారః. ౬౭

దం-అ. అన్వయించకపోవుటవల్లను అహంకారము ఆత్మధర్మముకాదు.

తా. అహంకారము ఆత్మయొక్కధర్మమే అయినయెడల సర్వావస్థలయందును ఆత్మతోటి కలిసియుండవలయునేగాని, కలియకుండా నుండగూడదు. అహంకారము కొన్నియవస్థలయం దాత్మతోటి సంబంధించియుండనందున ఆత్మధర్మము కానేరదని భావము.

అవ. ఏయేదశల (అవస్థల) యం దహంకారము ఆత్మతోటి సంబంధము గలిగియుండలేదంటే చెప్పుచున్నారు.—

శ్లో. ఆత్మన శ్చే దహం ధర్మో యాయాన్ముక్తిసుషుప్తయోః,
యతో నాన్వేతి తేనాయ మన్యదీయో భవేదహం. ౩౨. ౬౮

దం-అ. అహంకారము ఆత్మయొక్కధర్మమే అయినయెడల మోక్షదశయందును సుషుప్తిదశయందును సంబంధించియుండును. ఎందుచేత సంబంధించలేదో, అందుచేత ఈయహంకారము మఱియొకదానికి సంబంధించియుండును.

తా. జాగ్రత్, స్వప్న, సుషుప్తి, మోక్షము లనెడి నాలుగుదశ లాత్మకు ప్రసిద్ధములై యున్నవి. ఈనాలుగింటిలో జాగ్రద్దశా స్వప్నదశలలో మాత్రము 'అహం జానామి' (నేను తెలియుచున్నాను), 'అహం పశ్యామి' (నేను చూచుచున్నాను) ఇత్యాద్యసంభవము కలిగియున్నందున, 'అహం' అని చెప్పఁబడెడి అహంకారము ఆత్మతోఁటి సంబంధించియున్నది. సుషుప్తిదశయందును, మోక్షదశయందు నహంకారము ఆత్మతోఁటి సంబంధించినట్లు కానము గనుక అహంకారము ఆత్మధర్మము కానేరదు. అంతఃకరణధర్మమే కావలయును. ఆత్మధర్మమే యైనయెడల సర్వదశలయందును సంబంధించి యుండవలయును గదా? అని భావము.

అవ. మఱియొకహేతువుచేతనున్న అహంకారము ఆత్మతత్వముకానేరదను చున్నారు.—

వాక్య. ఆత్మధర్మత్వాభ్యుపగమేఽపరిహార్య దోషప్రసక్తిశ్చ. ౬౯

దం-అ. ఆత్మధర్మత్వము నంగీకరించినయెడల పరిహరింప శక్యముకాని దోషముయొక్క ప్రసక్తియు కలుగును.

తా. అహంకారము ఆత్మధర్మమని అంగీకరించఁగూడదు. అలాగున అంగీకరించితిరా నివారింప శక్యముగాని దృఢమైన దోషము సంభవించునని భావము.

అవ. ఆ యపరిహార్యమైనదోష మేది యనఁగా వివరించుచున్నారు.—

శ్లో. యద్యాత్మధర్మోఽహంకారో నిత్యత్వం తస్య బోధవత్,
నిత్యత్వే మోక్షశాస్త్రాణాం వైయర్థ్యం ప్రాప్నుయాద్ధ్రువమ్. 33.

దం-అ. అహంకారము ఆత్మధర్మమే యైనయెడల ఆయహంకారమునకు జ్ఞానమునకువలె నిత్యత్వము సంభవించును. నిత్యత్వము సంభవించెనేని మోక్షశాస్త్రములకు నిష్ఫలత్వము ప్రాప్తించును. వాస్తవము.

తా. అహంకారము ఆత్మధర్మమే అయినపక్షమునందు ఆత్మధర్మమైనజ్ఞానము యేప్రకారము నిత్యమైయున్నదో ఆప్రకారమే అహంకారమున్ను నిత్యమై యుండవలయును. అహంకారము నిత్యమైనయెడల యెప్పటికిని నశించునది కానందున అహంకారము, తన్మూలములైన కర్తృత్వాదివికారములున్ను నిశ్శేషముగా నివర్తించుటయే మోక్షమని చెప్పెడిశాస్త్రములు అహంకారాది నివృత్తికొఱకు పరమహంసపరివ్రాజకాశ్రమాదిసాధనములను విధించెడిశాస్త్రములున్ను నిరర్థకములైపోవును. ఇది యథార్థము నిత్యమైన ధర్మము, ధర్మి, స్వరూపము నశించకమునుందు నశించుగదా యని భావము.

అవ. పూర్వవాది యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. స్యాత్ పరిహారః స్వాభావికధర్మత్వాభ్యుపగమేపి ఆమ్రాదిఫలవత్. ౭౧

దం-అ. ఇది పరిహారము కావచ్చును. స్వభావసిద్ధమైన ధర్మత్వము నంగీకరించినప్పటికి మామిడిపండ్లు మొదలగువాటికివలె నివృత్తికలుగును.

తా. ఏవస్తువునకు ఏదిధర్మమైయుండునో అది ఆవస్తువుండెడివఱకు నుండవలయును. మధ్యే వినాశమునొందకూడదని నియమములేదు. ఆమ్రదాడిమాది (మామిడిపండ్లు దాడిమపండ్లుమొదలగు) ఫలములయందు కనుపడుచున్న హరితపీతాది (ఆకుపచ్చ పసుపుపచ్చ మొదలగు) వర్ణములు ఆయాఫలములకు స్వాభావికధర్మములని లోకములో నంగీరింపఁబడియున్నవి. ఇప్పటికి ఆవర్ణములు ఆయాఫలము లుండెడివఱకు నిత్యములై యున్నట్టు కానము. మధ్యేమధ్యే మారిపోవుచు నివర్తించుచున్నవిగదా. ఆ ప్రకారమే అహంకారము, ఆత్మయొక్క స్వాభావికధర్మమైనప్పటికి సుషుప్తిమూర్ఛాదిదశలయందు నివర్తించవచ్చును. ఇంతమాత్రమున అహంకారము ఆత్మధర్మము కాకపోదని పరిహారము సులభముగా చెప్పవచ్చును.

అవ. పూర్వవాదిచెప్పిన పరిహారమును సిద్ధాంతవాది నిరాకరించుచున్నారు.—

వాక్య. ఇతి చేత్తన్న. ౭౨

దం-అ. ఈలాగంటివా అదికాదు.

తా. ఈప్రకారముచెప్పిన పరిహారము దృష్టాంతదార్ష్టాంతికముల కానురూప్యము లేనందున పరిహారమేకాదని భావము.

అవ. దృష్టాంతదార్ష్టాంతికములకానురూప్యము లేకపోవుటను చూపుచున్నారు.-

శ్లో. ఆమ్రాదేః పరిణామిత్వాత్ గుణహా నిర్గుణాంతరైః,
అవికారితు తత్ బ్రహ్మ నహి ద్రష్టు రితిశ్రుతేః. ౩౮. ౭౩

దం-అ. మామిడిపండు మొదలగువానికి పరిణామము కలిగియున్నందున ఇతరగుణములచేత గుణములకు నివృత్తికలుగవచ్చును. 'నహిద్రష్టుః' అనెడిశ్రుతివలన ఆ బ్రహ్మ వికారములేనిదిగదా?

తా. ఆమ్రాదిఫలములు పరిణమించెడి స్వభావముకలవైయున్నందున కాలవిశేషములచేత పీతాదిగుణములు పుట్టగానే పూర్వసిద్ధములైన హరితాదిగుణములు నివర్తించు. నుఇది పరిణామముగల పదార్థములయందు యుక్తమే, బ్రహ్మస్వరూపము ఆమ్రాది

ఫలములవలె పరిణామముగల వస్తువుగాదు. కాలవిశేషముచే నాకారాంతరమును బొందుట పరిణామము. ఇట్టి పరిణామము బ్రహ్మకులేదని 'నహి ద్రష్టుః దృష్టేః విపరిలోపో విద్యతే' అనెడిశ్రుతి విశదముగా చెప్పుచున్నది. కనుక పరిణామము స్వభావముగాగల ఆమ్రాదిఫలములను దృష్టాంతముగాఁ జెప్పి అహంకార మాత్మధర్మమని చెప్పుట న్యాయ్యముగాదు. కనుక నాత్మస్వరూపము నిత్యమైనందున తద్ధర్మమైన అహంకారమున్ను నిత్యమనియె చెప్పవలసియుండును. అప్పుడు అహంకారనివృత్తిప్రతిపాదకములైన మోక్షశాస్త్రములకు కలిగెడివిరోధము అపరిహార్యము అని భావము. ఆత్మయొక్క జ్ఞానమునకు అనఁగా స్వరూపమునకు నానావిధములైనలోపము (పరిణామము) లేదని శ్రుత్యర్థము.

అవ. ఇదివఱకు అహంకారము అనిత్యమైనందున నిత్యమైన ఆత్మకు ధర్మము కానేరదని చెప్పఁబడినది. ఇఁకను ఆత్మ నిత్యమైనందున అనిత్యమైన అహంకారమునకు ధర్మియని చెప్పుట న్యాయము కాదని చెప్పుచున్నారు.—

వాక్య. అహంకారస్యచాగమాపాయిత్వాత్తద్ధర్మిణశ్చ అనిత్యత్వం ప్రాప్నోతి. 28

దం-అ. అహంకారము వచ్చుచు పోవుచు నుండునట్టిదియైనందున దానికి ధర్మియగు నాత్మకును అనిత్యత్వము ప్రాప్తించును.

తా. ఆత్మ అహంకారమునకు ధర్మియని చెప్పెడియెడల అహంకారము జాగ్రదాది దశలయందు వచ్చుచు సుషుప్త్యాదిదశలయందు బోవుచు ననిత్యమైయున్నందున ఆత్మయున్ను అనిత్యత్వముఁ కలవాఁడే యగునని భావము.

శ్లో. ఆగమాపాయి నిష్ఠత్వా మనిత్యత్వమియాత్ దృశిః,
ఉపయ న్నపయన్ ధర్మో వికారోతి హి ధర్మిణమ్. ౩౫. 29

దం-అ. వచ్చుచుబోవుచుండెడి యహంకారమునకు ఆశ్రయమైనందున ఆత్మయున్ను అనిత్యత్వమును పొందును. ధర్మము తాను వచ్చుచుబోవుచుండి ధర్మమును వికరింపఁజేయును గదా?

తా. జాగ్రదాదిదశలయందు వచ్చుచు సుషుప్త్యాదిదశలయందు బోవుచున్నందున అహంకారము అనిత్యమైయున్నది. ఇట్టి యహంకారమునకు ఆశ్రయమైన ఆత్మయున్ను అనిత్యము కావలసియుండును. ఎందువల్లనంటే ఒకధర్మము తాను ఒకవస్తువునందు ప్రవేశించునప్పుడు ఆవస్తువున కొకవిధమైన యాకారమును, తాను నివర్తించునపుడు ఒకవిధమైన యాకారమును కలుగఁజేసి వికారమును బొందించుచుండును. కనుక

అహంకారము తానాత్మయందు ప్రవేశించునప్పుడు ఆత్మకొకవిధమైన ఆకారమునున్
తాను నివర్తించునప్పుడు మఱియొకవిధమైన ఆకారమునున్ను కలుగఁజేయును. కన
అనేకాకారయోగరూపమైన సతతపరిణామముగల యాత్మయున్ను ఆమ్రాదిఫలములవ
యనిత్యమే యగునని భావము.

అవ. ఇఁకను బౌద్ధుఁడు బౌద్ధమతము నిరూపించి సిద్ధాంతవాదిపక్షము ?
క్షేపించుచున్నాఁడు.—

వాక్య. అస్త్వనిత్యత్వం కముపాలభేమహి ప్రమాణోపపన్న
త్వాత్. ౭౬

దం-అ. అనిత్యత్వమే అగుగాక; ప్రమాణములచేత యుక్తమైయున్నంద
నెవరిని నిందించెదము?

తా. ఆత్మ అనిత్యమనే చెప్పవలయును. ప్రత్యక్షము, అనుమానము ఈరెంఁ
ప్రమాణములు ఆత్మయొక్క అనిత్యత్వమును తెలియఁజేయుచున్నవి. ప్రమాణము
యర్థము నేప్రకారముగఁ బ్రతిపాదించునో ఆయర్థము నాప్రకారముగనేగ
ప్రామాణికు లంగీకరించవలయును. కనుక ప్రత్యక్షానుమానములు సర్వపదార్థ
లను క్షణికములని తెలియఁజేయుచున్నందున, ఆత్మయున్ను క్షణికమే యైనందునన
ఆత్మ అనిత్యమని నిశ్చయమైయుండగా మనము యెవరినిన్ని ఆక్షేపింపఁదగదని భావమ
ఇచ్చట బౌద్ధమతముయొక్క స్వరూపమును తెలియనివారల కీవాక్యార్థము స్పష్టము
తెలియదు. కనుక బౌద్ధమతస్వరూపమును సంగ్రహముగా వివరించుచున్నారము. అ
లలోకధురీణుండైన నారాయణుండు శిష్టజనుల రక్షించుటకు,దుష్టజనుల శిక్షించుటకున
వేదవైదికమార్గంబుల సంస్థాపించుటకును ఆయాకాలంబులయందు హయగ్రీవ నా
సింహ దత్తాత్రేయ భార్గవరామ శ్రీరామ శ్రీకృష్ణ బౌద్ధాద్యవతారంబులగావించుచ
నొక్కసమయంబునం గొందఱు దైత్యదానవులు వేదవైదికమార్గములయం దత్యంతశ్ర
ద్ధాళువులై యథోక్తధర్మముల నాచరించుచు, స్వజాతిస్వభావంబుచే లోకరక్షణా
కృతులగు ఇంద్రాదిదేవతలకును, మునులకును బాధకులై ప్రవర్తించుచుండంజూ
యాదైత్యదానవులకు వేదవైదికమార్గంబుల విద్వేషంబు గలిగినంగాని దేవతలకు
మునులకును యోగక్షేమంబు గలుగదని యోచించి, మాయామోహాది నామంబ
లచే ననేకరూపంబుల పరిగ్రహించి దైత్యదానవాదులకు బుద్ధివ్యామోహవ
కలుగునటుల వేదబాహ్యంబులైన యుక్తుల నుడివి, శాస్త్రంబుల రచియించి
దైత్యదానవాదులకు వేదవైదికమార్గంబులయందు విద్వేషంబు బుట్టించి దేవతల
వారల వధింపఁజేసి దేవాదిసజ్జనుల రక్షించుచుండ యిక్కలియుగం బేతేర భ
వంతుండగు నారాయణుండు కీకట (మగధ) దేశంబులయందు జనకిపునానదీతీ

బున నొక్కనగరంబునందు గౌతమగోత్రోత్పన్నుండైన జినుం డనెడివానికి, భార్యా దేవియను తద్భార్యయందు బుద్ధుఁడనెడి నామంబుతో నవతరించి, దిగంబరత్వ భిక్షాన్న భోజన సర్వభూతహింసావర్జనాది ధర్మంబులచేఁ దనపరమవైరాగ్యంబు లోకులకు ప్రకటించి వారలకు తనయందు భక్తివిశ్వాసంబుల గలుగంజేసికొని, వేదబాహ్యంబులైన ధర్మంబుల నుపదేశించుచు వేదంబుల నిందించుచున్నంత యాబుద్ధమునికి అనేక జనులు శిష్యభావంబునొందిరి. వారలలో నలుగురు ప్రధానశిష్యులైయుండిరి. వారలలో నొకఁడు సౌత్రాంతికుఁడు; రెండవవాఁడు వైభాషికుఁడు, మూఁడవవాఁడు యోగాచారుఁడు; నాల్గవవాఁడు మాధ్యమికుఁడు. వీరు నలువురు బుద్ధునకు నానావిధశుశ్రూషలఁ గావించుచు బుద్ధుని సేవించుచుండగా నాబుద్ధముని వీరల కిట్లని యుపదేశంబు చేసెను. ఓశిష్యులారా! నేను దివ్యజ్ఞానముచేత నీలోకంబులయొక్క సుగతిదుర్గతుల నన్నిటిని యెఱుంగుదు. స్థిరమైన ఆత్మ లేనేలేదు. సర్వమున్ను శూన్యము. ఇదియే పరమార్థము. శూన్యము గాదనియు, ఆత్మ స్థిరమని యెఱుంగుటయే అజ్ఞానము. అని ఈలాగున నుపదేశించగా మాధ్యమికుం డనుశిష్యుండు తమగురువుచే నుపదేశింపఁబడిన యర్థంబు పరమార్థంబని యత్యంతశ్రద్ధతోటి విశ్వసించి తదనుకూలంబులైన యుక్తుల నెల్ల గురూపదేశంబుచే లభించి సర్వశూన్యవాదప్రధానంబైన యొక్కశాస్త్రంబు రచించె. ఇదియే మాధ్యమికమతంబని బౌద్ధమతంబులలో నొక్కటి. ఈమతంబున శుక్తియందులేని రజతంబును, రజ్జువునందులేని సర్పమును, ఆకాశంబునందులేని నైల్యమును, ప్రత్యక్షము తెలియఁజేయుచున్నందున ప్రత్యక్షప్రమాణముయొక్క స్వభావము శూన్యమును తెలియఁజేయునట్టిదై యున్నదనియుఁ, నేదికనుపడుచున్నదో యదియంతయుం శూన్యమేననియుం, స్వప్నదృష్టపదార్థములను దృష్టాంతముగాఁజేసికొని అనుమాన ప్రమాణమున్ను సర్వశూన్యమును స్థాపించుచున్నదనియును, గనుకనే ఆత్మయున్ను పృథివ్యాదిపదార్థములున్ను అన్నియు శూన్యములు (అనిత్యములు) అని ప్రతిపాదింపఁబడియున్నది. యోగాచారుం డనుశిష్యుండు సర్వము శూన్యమని, స్థిరమైన ఆత్మ లేనేలేదని బుద్ధమునిచేసిన యుపదేశమును విని, ఆత్మకంటే భిన్నమైన పదార్థములన్నియుం శూన్యములే యగును. ఆత్మమాత్రము శూన్యముకాదు. ఆత్మయున్ను శూన్యమేయైనచో శూన్యంబైనప్రపంచమునకు ప్రతిభాసం బెబ్భంగి సంభవించునని యోచించి యోస్వామీ! ఆత్మాతిరిక్తంబైన విశ్వంబు శూన్యంబె యగుగాక! ప్రపంచప్రకాశంబైన ఆత్మ ఏలాగున శూన్యంబగు? మీ రుపదేశించిన ఆత్మశూన్యత్వము, యోగము (ఉపచారము) గా నుండునని తోఁచెడి. గావున పరమార్థంబు విశదముగా నుపదేశింపుఁడని బుద్ధదేవుని ప్రార్థింప, యాబుద్ధముని వీఁడు పరిపూర్ణశ్రద్ధగలవాఁడు గానందున నిట్లి

సందేహంబుగలిగె గావున, వీనిబుద్ధికి యనుకూలంబైన మార్గంబున నుపదేశంబు గావింప వలయునని యెంచి యోగాచారునింగూర్చి, ఓయిశిష్యా! నీవు యోచించినది మంచిది గానే యున్నది. ఆత్మాతిరిక్తమైన ప్రపంచమాత్రమే శూన్యము. ఆత్మమాత్రము శూన్యముకాదుగాని క్షణిక మని చెప్పవలయును. క్షణికమనఁగా ప్రతిక్షణమునందు నుత్పత్తివినాశంబులు కలదియని యుపదేశించిన, యోగాచారుం డాయుపదేశంబు తనమనంబున కనుకూలంబని తోఁచఁగా సంతసించి గురూపదేశంబుచే తదనుకూలంబులైన యుక్తుల నెఱింగి యొక్కశాస్త్రంబు గావించి తనశిష్యులకెల్లబోధించె. ఇది విజ్ఞానవాదిమతంబని బౌద్ధమతంబులలో రెండవమతంబు. ఇందులో నాత్మ విజ్ఞానమాత్రస్వరూపుఁడనియు, ఘటజ్ఞానము నశించెను, పటజ్ఞానము పుట్టెననెడి ప్రత్యక్షానుభవముచేత నీవిజ్ఞానాత్మ ఉత్పత్తివినాశములు కలవాడైనందున అనిత్యమనియు, నీవిజ్ఞానాత్మయందనాద్యజ్ఞానముచేత ననేకవిధములైన ఘటపటాదివిషయాకారములు, వాసనారూపములు (సూక్ష్మరూపములు)గా చేర్చఁబడియున్నవనియు, స్వప్నమునందు కనుపడెడిపదార్థములు బాహ్యమునందు లేనివైనప్పటికి, బాహ్యమునందున్నవాటివలె కనుపడినట్టుల ఈవిజ్ఞాననిష్ఠములైన ఘటాదిపదార్థములున్ను, బాహ్యమునందున్నవాటివలె కనుపడుననియు, దృశ్యమానంబులైన పదార్థంబులన్నియు స్వప్నపదార్థంబులవలె నాంతరంబులేగాని, బాహ్యంబులుగావనే యనుమానమున్ను, శుక్తియందు రజతజ్ఞానము కలిగియుండుండగా శుక్తిస్వరూపము తెలిసినపిదప 'నేదం రజతం' (ఇది వెండికాదు) అని కలిగెడి బాధకప్రత్యక్షమున్ను, సర్వపదార్థము లాంతరములేగాని, బాహ్యములుగావని ప్రతిపాదించుచున్నవనియు విస్తారముగా ప్రతిపాదింపఁబడియున్నవి. ఇది రజతముకాద నెడి ప్రత్యక్షము, ఎదుటకనుపడుచున్న రజతమును నిషేధించుచున్నందున యెదుటనుండునది రజతముకాదనిన్ని అంతరమునందుండునదియే రజతమనిన్ని చెప్పుచున్నదని బౌద్ధుని యొక్క అభిమానము. సౌత్రాంతికుఁడను శిష్యుండు బుద్ధమునిజేసిన యుపదేశంబువిని ప్రతీయమానంబైన ప్రపంచంబు ఏలాగున శూన్యంబగు? జ్ఞానంబులేనిచో ప్రపంచం బేలాగున ప్రతిభాసించును. కావున జ్ఞానంబున తద్గోచరంబైన ప్రపంచంబును సత్యంబే కావలయునని యోచించి నిజగురుండైన బుద్ధునింజూచి, యోస్వామీ! ప్రతీతిసిద్ధంబైన ప్రపంచం బేలాగున శూన్యంబగు. ప్రతీతిజనకంబైన జ్ఞానంబును శూన్యంబు కానేరదు. అని విన్నపముచేసిన గురుండైన బుద్ధదేవుండు, వీనికి శ్రద్ధామాంద్యంబు అధికముగా కలిగియున్నయది. గనుకనే అస్మదుపదిష్టంబైన పరమార్థతత్త్వంబు బుద్ధిగోచరంబు గాకయున్నయది. కానిమ్ము. ఇతనిబుద్ధి ననుసరించెడి

యుపదేశమును చేసెదనని తలంచి సౌత్రాంతికునిజూచి ఓశిష్యుఁడా! నీవుచేసిన యాశ్షేపంబు సరిగా నేయున్నది. ప్రతీతిసిద్ధంబైన నీప్రపంచమంతయు సత్యంబైనను క్షణికంబని యెఱుంగుము. ఇదిగాక యనుమానంబుచేఁ దెలియంబడును గాని ప్రత్యక్షంబున తెలియఁబడదు. అని యుపదేశించిన సౌత్రాంతికుఁ డాయుపదేశంబు తనమనంబునకు యోగ్యంబని తోఁపగా ముదంబంది బుద్ధదేవుని యుపదేశంబున తదనుకూలయుక్తులనెల్ల నెఱింగి యొక్క శాస్త్రంబు నిర్మించి నిజశిష్యుల కుపదేశించె. ఇది సౌత్రాంతికమతమని బౌద్ధమతములలో మూఁడవది. ఈమతంబులో రూపదర్శనంబుచే చక్షురింద్రియమున్ను, శబ్దశ్రవణముచే శ్రోత్రేంద్రియమున్ను ఊహించినటుల ఘటముకలదు. పటముగలదు అని ఇత్యాదివ్యవహారంబుచే ఘటాదిపదార్థము లూహింపఁబడుచున్నందున సర్వపదార్థములును అనుమానగమ్యములేగాని ప్రత్యక్షగమ్యములు కావనియు, ఘటపటాదిపదార్థములన్నియు ప్రతిక్షణోత్పత్తి వినాశములు కలవైనందున క్షణికంబులనియు, విజ్ఞానస్వరూపంబైన యాత్మయును విజ్ఞానవాది చెప్పినవిధంబుగా నుత్పత్తివినాశంబులు కలిగియున్నందున క్షణికంబై యనిత్యమే యనియును ఘటాదిపదార్థములయొక్క క్షణికత్వము, ఇది ఘటము ఇది పటము అనుధారావాహికప్రత్యక్షముచేతను అర్థక్రియాకారిత్వముగలపదార్థములు మెఱపులవలె క్షణికములై యుండుననెడి అనుమానముచేతను తెలియఁజేయఁబడుచున్నదనియును విస్తారముగ నిరూపింపఁబడియున్నది. ఒక పదార్థము నుద్దేశించి నిరంతరము నాలుగైదుపర్యాయములు గలిగెడు జ్ఞానము ధారావాహికజ్ఞాన మనంబడు. ఈజ్ఞానములో ఘటము విశేష్యము. ఇది యనుశబ్దము విశేషణము. ఇది యనఁగా ముందరనుండునదియని యర్థము. తనకాశ్రయమైనవస్తువు ఇతర విశేషణముల కాశ్రయమైన వస్తువులకంటె భిన్నమని బోధించుట విశేషణములయొక్క స్వభావమైనందున నిచ్చట ఇది యనువిశేషణము తన కాశ్రయమైన ఘటము విశేషణాంతరముల కాశ్రయమైన పూర్వోత్తరకాలగోచరము లయిన ఘటములకంటె భిన్నమని తెలియచేయుచున్నందున ధారావాహికజ్ఞానమునందు ప్రతిపర్యాయము జ్ఞానమునకు గోచరించుచున్నఘటములును, ఆయాఘటములను గోచరింపఁజేయుచున్న జ్ఞానములును, పరస్పరభిన్నములు కావున, ప్రతిక్షణోత్పత్తివినాశములు గలిగి క్షణికములై యున్నవని నిశ్చయింపవలయును. అర్థక్రియాకారిత్వ మనఁగా ప్రయోజనమునుచేయుట. మెఱపులు ప్రకాశమనే ప్రయోజనమును చేయుచున్నవి. క్షణికములై యున్నవి. కనుక ఘటాదిపదార్థములున్ను జలాహరణాదిప్రయోజనమును చేయుచున్నందున క్షణికములై యున్నవి. ఆత్మస్వరూపమైన విజ్ఞానమున్ను ప్రతిక్షణోత్పత్తివినాశంబులుగలిగి అనిత్యంబైయున్నచో, నిన్నటిరోజున వినిన నేనే ఈరోజున

చూచుచున్నాననే వ్యవహారముచేత తెలియఁబడుచున్న ఆత్మనిత్యత్వ మేలాగున సిద్ధించు ననిన సాదృశ్యముచేత సిద్ధించును. ఒకపురుషుఁ డొకదీపమును వెలిగించియుంచుకొని నిదురపోవుచుండగా దీపము ఆరిపోవును. మఱియొకపురుషుఁడు తిరిగి వెలిగించును. నిద్రపోవువాఁడు లేచి యాదీపము మునుపటిదేయని తలంచును. ఇది మనకందఱకును తెల్లంబేకదా ? ఇచ్చట దీపద్వయమునకు భేదము కలిగియున్నప్పటికిని భేదములేదని ఏకమని తలంచుటకు సాదృశ్యమే కారణమైయున్నది. ఆప్రకారమే శ్రవణదర్శన క్రియలయందు ఆత్మ భిన్నుఁడై యున్నప్పటికి ఏకమని తలంచుట సాదృశ్యమూలమైన భ్రమయనిన్ని ఈప్రకారముగా ఆత్మయొక్కయు ఘటాదిపదార్థములయొక్కయు క్షణికత్వమును ప్రతిపాదించుట కనేకయుక్తులు చెప్పఁబడియున్నవి. ఇది గాక పదార్థము బాహ్యమని ఆంతరమని రెండువిధములు. అందులో బాహ్యము భూతమని, భౌతికమని, యాంతరము చిత్తము, చైత్తము అని రెండు రెండువిధములుగా నున్నవి. భూతమనఁగా పృథివి జల తేజోవాయువులు నాలుగు. భౌతికమనఁగా రూపరసగంధాదులును, చక్షురాదీంద్రియములును రూపవిజ్ఞానవేదనా సంజ్ఞాసంస్కారములనెడి అయిదుస్కంధములు. ఇవియె చిత్తచైత్తములనంబడు. కాఠిన్యస్వభావముగల పృథివీపరమాణువులు పృథివీరూపముగా సంఘాతమునొందును. స్నేహస్వభావముగల జలపరమాణువులు జలరూపముగా సంఘాతము నొందును. ఉష్ణస్వభావముగల తేజః పరమాణువులు తేజోరూపముగా సంఘాతమునొందును. చలనస్వభాముగలవాయువు పరమాణువులు వాయురూపముగా సంఘాతము నొందును. ఆకాశము అభావమేగాని భూతములలోఁ జేరినదికాదు. విషయములతో గూడియున్నయింద్రియమును రూపస్కంధమనంబడును. ఇది భౌతికమైనప్పటికి దేహమునందు సంబంధించియున్నందున ఆంతరములలో నెంచఁబడుచున్నది. (అహం)=నేను అని కలిగెడిజ్ఞానము విజ్ఞానస్కంధమనంబడు. ఇదియే చిత్తమని, ఆలయవిజ్ఞానమని వ్యవహరింపఁబడుచున్నది. అశ్వము, మహిషము ఇత్యాదిశబ్దములచేత వ్యవహరించునది సంజ్ఞాస్కంధ మనంబడు. సుఖదుఃఖాదులు వేదనాస్కంధ మనంబడు. రాగద్వేషాదులు సంస్కారస్కంధ మనంబడు. ఈపంచస్కంధములు దేహములోపల సంఘాతముగాఁ జేరి సర్వవ్యవహారములకు కారణంబులైయుండు. ఈచెప్పిన భూతభౌతికచిత్త చైత్రములన్నియు ప్రతిక్షణోత్పత్తివినాశంబులైనందున క్షణికంబులుగాని స్థిరంబులుగావు. వీనియొక్క క్షణికత్వమునుగూర్చి సాధకప్రమాణంబుల నిదివఱకే చెప్పితిమి. సర్వపదార్థములయొక్క వినాశము ప్రతిసంఖ్యావినాశమని, అప్రతిసంఖ్యావినాశమని రెండువిధములుగా నున్నది. కలిగియున్నఘటాదులను లేనివానినిగా జేసెదనని తలంచి బుద్ధిపూర్వకముగా దండాదిప్రహారంబులచే ఘటాదు

లకుం గలుగఁజేయువినాశంబు ప్రతిసంఖ్యావినాశం బనంబడు. ఘటాదిపదార్థంబులకు స్వభావముగా ప్రతిక్షణమునందు కలుగువినాశము అప్రతిసంఖ్యావినాశం బనంబడు. సర్వపదార్థంబులు క్షణికంబులని యుక్త్యనుభవములచేఁ దెలిసి, యమనియమాది సాధనంబులతోఁగూడ నిరోధసమాధి ననుష్ఠించిన విజ్ఞానసంతానంబునకు ప్రతిసంఖ్యావినాశంబు గలుగు. ఇదియే మోక్షంబు. అని యివ్విధంబున ననేకప్రమేయంబులు ప్రతిపాదింపఁబడియున్నవి. వైభాషికుం డనుశిష్యుండు నిజగురుండైన బుద్ధదేవుఁడుచేసిన యుపదేశంబు విని యింద్రియగోచరంబుగాని యర్థంబు అనుమేయమైన నగుంగాక. చక్షురాదీంద్రియములకు స్ఫుటంబుగా గనఁబడుచున్న ఘటపటాదిప్రపంచం బేలాగున ననుమేయం బగునని యోజించి, నిజగురునితోఁ దనకు గలిగిన సంశయంబు విన్నవించిన, బుద్ధదేవుండు వైభాషికుంజూచి, వీని బుద్ధియు నతిమూఢంబై యున్నయది. కావున తదనుగుణంబుగా నుపదేశించెదనని తలంచి యోవైభాషికా! నీవితర్కం బనుభవంబునకు సరియైయున్నయది. ఈప్రపంచంబంతయు యథాయోగ్యంబుగా ప్రత్యక్షానుమానంబులకు గోచరంబైయున్నది. కాని అనుమానమాత్రంబునకు గోచరంబుగాదు. అయినను విజ్ఞానంబునకు తద్విషయంబులై భూతభౌతికంబులును క్షణికంబులుగాని స్థిరంబులుగావు. అని బోధించిన వైభాషికుండు సంతసించి తదనుకూలంబులైన యుక్తులనెల్ల నిజగురూపదేశంబులచే గ్రహించి యొక్కశాస్త్రంబు రచించి నిజశిష్యులకెల్ల బోధించె. ఇది బౌద్ధమతంబులలో వైభాషికమతంబని నాలవమతంబు. ఈమతంబునందు సౌత్రాంతికమతంబులో ప్రతిపాదింపఁబడియున్న యర్థములే ప్రతిపాదింపఁబడియున్నయవి. సౌత్రాంతికమతంబున పదార్థంబులనుమేయంబులు. వైభాషికపక్షంబున ప్రత్యక్షసిద్ధంబులు. ఇదియే సౌత్రాంతిక వైభాషికమతంబులకుంగల విశేషంబు. ఇవ్విధంబున బౌద్ధమతంబు నాలుగువిధంబులై ప్రవర్తిల్లె. ఇట్లని బోధిచిత్తవివరణమను గ్రంథములో 'దేశనాలోకనాథానాం సత్వాశయవశానుగా' యని చెప్పఁబడియున్నది. లోకనాథులగు బుద్ధదేవునియొక్క ఉపదేశము శిష్యులయొక్క బుద్ధి ననుసరించి ప్రవర్తించెనని యర్థము. ఈచెప్పిననాలుగు బౌద్ధమతములలో 'ఆత్మ' ప్రతిక్షణోత్పత్తివినాశములు కలవాఁడే అనినిశ్చయించి యున్నందున, 'ఆత్మ' అనిత్యమే గనుక ఆత్మానిత్యత్వమును దోషముగా నుద్ఘాటించ తగదని భావము.

అవ. సిద్ధాంతవాది బౌద్ధవాదమును నిరాకరింప నారంభించుచున్నాఁడు.—

వాక్య. ఇతి చేత్ తన్న. ౨౨

దం-అ. ఈలాగని చెప్పినచో నది కానేరదు.

తా. ప్రమాణసిద్ధమైనందున ఆత్మానిత్యత్వము దోషముకాదని చెప

భావము.

శ్లో. సదా విలుప్తసాక్షిత్వం స్వతస్సిద్ధం నపార్యతే,
అపహ్నోతుం ఘటస్యేవ కుశాగ్రీ య్యాధియాత్మనః. ౩౬

దం-అ. ఆత్మయొక్క స్వాభావికములు ఎప్పటికిని లోపించకయుండెడి శమానత్వమును, ఘటముయొక్క సహజములు ఎప్పటికిని లోపించియున్న మానత్వమునువలె కుశాగ్రమువంటిబుద్ధిగల నీచేత ఆచ్ఛాదించెడికొఱకు శక్య బడదు.

తా. ఘటము సహజముగా ప్రకాశములేనిదై యెప్పటికిని జడమైంత ఇట్టి ఘటముయొక్క జడత్వము సర్వానుభవసిద్ధమైయున్నందున నివారించుటస మైయుండదుగదా? అనఁగా ఘటము జడముకాదని చెప్పుటకు శక్యముకాదనిఁ ఆప్రకారమే ఆత్మయొక్క ప్రకాశమైనస్వరూపమున్ను నిత్యమై సహజమైఁ దున దానిని నివారించుటకు (అనిత్యమని నిరూపించుటకు) కుశాగ్రమువంటి అ మైన బుద్ధిగల నీకు సాధ్యముకాదని భావము. ఇచ్చట బౌద్ధునిగూర్చి కుశ గల నీకు సాధ్యముకాదని భావము. ఇచ్చట బౌద్ధునిగూర్చి కుశాగ్రబుద్ధిగలవా చెప్పినది పరిహాసము, అత్యంతమందబుద్ధి యని అభిప్రాయము. ఎందువల్లనంతే చేసినకార్యమును ఈదినము జ్ఞాపకమునకు తెచ్చుకొనుచున్నందున పూర్వోత్త లయం దాత్మ ఒక్కఁడే యని నిశ్చయింపఁదగియున్నది. ఈప్రకారమే ఈ పుట్టినదిమొదలు నశించెడివఱకు పూర్వపూర్వకాలములయందు చేసినకృత్యముఁ డీకార్యమును చేసినాను, ఇప్పు డీకార్యమును చేయుచున్నాను అని యనుః చున్నందున ఆత్మ ఒక్కఁడే యని తెలియఁబడుచున్నది. నిన్నటిఆత్మ వేఱ ఆత్మవేఱని చెప్పెడియెడల, నిన్నటిదినము చేసినకార్యము ఈదినము జ్ఞాపకమ యుండును. ఒకఁడుచేసినకార్యమును మఱియొకఁడు దానిని చూడనివాఁడు ధింపచాలఁడుగదా? కనుక ఆత్మ, ఒక్కఁడేనని అంగీకరించవలయును. ఈలోకములో కొందఱు పూర్వజన్మజ్ఞానముకలవారై యున్నారు. ఇందుచే ఆత్మ నిత్యుఁడని తెలియుచున్నది. ఆత్మఉత్పత్తివినాశముకలిగి వేఱువేఱుగా ను చెప్పెడియెడల, ఒక ఆత్మచేసినపుణ్యపాపము లాయాత్మతోనే నశించును. బుట్టిన యాత్మకు సంభవించుచున్నసుఖదుఃఖములు నిష్కారణముగా ప్రాప్తి చెప్పవలసియుండును. అది యుక్తముకాదు కావున ఆత్మ నిత్యుఁడు. ప్రతిప

ప్రతిక్షణోత్పత్తి వినాశములు కలదైయుండుననిన్ని వానియం దేకత్వజ్ఞానము సాదృశ్యముచేత నేర్పడినదనిన్ని చెప్పినది సరికాదు. అన్నిపదార్థములయొక్క స్థిరత్వము అనుభవసిద్ధమైయుండఁగా దృష్టాంతముచేత అస్థిరత్వమును సాధించతగదు. జలము శీతముగా ననుభవింపఁబడుచుండగా, వహ్నిదృష్టాంతముచేత ఉష్ణమని సాధించవచ్చునా? కనుక సర్వపదార్థములు స్థిరములని వానిని ప్రకాశింపఁజేయుచున్న ఆత్మస్వరూపము, వానికంటె అత్యంతస్థిరమనిన్ని ప్రత్యక్షానుమానములచే తెలియఁబడుచుండఁగా వానిని చక్కఁగా విచారించఁజాలక ఆత్మానిత్యత్వము ప్రామాణికమని చెప్పిన బౌద్ధుని బుద్ధి యెంతసూక్ష్మమో చూడుఁడని పరిహసించుచున్నారు.

అవ. నడుమ అడ్డమువచ్చినబౌద్ధుని నిరాకరించి ప్రకృతార్థమును సాధించెదరు.—

వాక్య. ఏతస్మాచ్చ హేతో రహంకారస్యా నాత్మధర్మత్వమ
వసీయ్యతామ్. ౨౯

దం-అ. ఈహేతువువల్లనున్ను అహంకారమునకు అనాత్మధర్మతత్వము నిశ్చయింపఁబడుగాక.

తా. ఈముందు చెప్పఁబోయెడికారణముచేతగూడ అహంకారము ఆత్మతత్త్వము కాదనిన్ని, జడవస్తువైన అంతఃకరణముయొక్క ధర్మమనిన్ని నిశ్చయింపవలయునని యభిప్రాయము.

అవ. హేతువును నిరూపించుచున్నారు.—

శ్లో. ప్రమాణై శ్చావగమ్యత్వాత్ ఘటాదివదహం దృశేః,
యతోఽర్థాద్ధిః ప్రమాణానాం సకథం తైః ప్రసిధ్యతి. ౩౭. ౨౦

దం-అ. అహంకారము ప్రమాణములచే తెలియఁబడుచున్నందున ఘటాదికము వలె ఆత్మయొక్కధర్మము కానేరదు. ప్రమాణములు ఎవనివల్ల కలుగుచున్నవో ఆయాత్మ ప్రమాణములచేత ఏలాగున సిద్ధించును?

తా. ఘటాదిపదార్థములు ప్రత్యక్షాదిప్రమాణములచేత గ్రహింపఁబడుచున్నందున నేప్రకారము ఆత్మయొక్క ధర్మములుకావో ఆప్రకారమే అహంకారమున్ను ప్రమాణములకు గోచరించుచున్నందున ఆత్మధర్మము కాదు. అనఁగా ఘటపటాదివస్తువులు ఆత్మధర్మములు కావని మనమందఱము ఒప్పుకొనుచున్నాము. అందుకు కారణము ఘటాదివస్తువులు చక్షురాదిప్రమాణములచేత గ్రహింపఁబడుచుండుటయేగదా? ఆప్రకారమే అహంకారమున్ను ప్రమాణములచేత గ్రహింపఁబడుచున్నందున ఆత్మధర్మము

కాదని యర్థము. ఆత్మయున్న ప్రమాణములచేత గ్రహింపఁబడుచుండుటలేదా యని శంకించతగదు. చక్షురింద్రియాదులద్వారా విషయదేశమునందు వ్యాపించుచున్న అంతఃకరణవృత్తులు ప్రమాణము లనంబడు. ఇట్టిప్రమాణములు స్వతః జడములైనందున ప్రకాశములేనివై ఆత్మచేత ప్రకాశింపఁజేయంబడి భాసించును. ఈలాగున ప్రమాణములు పుట్టుటకుముందుగానే ప్రకాశించుచు, ప్రమాణములను ప్రకాశింపఁజేయుచున్న ఆత్మస్వరూపము ప్రమాణములచేత ప్రకాశింపఁజేయఁబడునది కాదు గనుక ప్రమాణాగమ్యముగాని యాత్మకు ప్రమాణగమ్యమైన అహంకారము ధర్మముకాదని భావము.

అవ. ఇంతవఱకు దర్శనక్రియనుగూర్చి, ఆత్మ కర్తగా నున్నందునను, అహంకారము కర్మగా నున్నందునను ఆత్మాహంకారములకు ధర్మిధర్మభావము ఘటించదని చెప్పఁబడినది. ఇఁకను ఆత్మ చిద్రూపుఁడై అహంకారము జడరూపమై యుండున్నందున శీతోష్ణములవలె పరస్పరవిరుద్ధములై యున్నందున ఆత్మాహంకారములకు ధర్మిధర్మభావము సిద్ధించదని చెప్పుచున్నారు.—

వాక్య. ధర్మధర్మిణోశ్చ ఇతరేతర విరుద్ధాత్మకత్వాత్ అసంగతిః. ౮౧

దం-అ. ధర్మధర్మపదార్థములకు పరస్పరవిరుద్ధములైన స్వభావములు కలిగి యున్నందున సాంగత్యము (సంబంధము) లేదు.

తా. అహంకారము, ధర్మము, ఆత్మ, ధర్మి. ఈరెంటిలో ఆత్మ, జ్ఞానస్వరూపుఁడు; అహంకారము జడస్వరూపము గనుక, శీతము ఉష్ణము ఏప్రకార మన్యోన్యవిరుద్ధములో ఆప్రకారము ఆత్మాహంకారములు అన్యోన్యవిరుద్ధములై యుండున్నవి కనుక ఆత్మాహంకారములు ధర్మ, ధర్మి భావసంబంధము కలవిగావని భావము.

అవ. చెప్పిన అర్థమును వివరించుచున్నారు.—

శ్లో. ధర్మిణశ్చ విరుద్ధత్వాత్ నదృశ్యగుణసంగతిః,
మారుతాందోలితజ్వాలం శైత్యం నాగ్నిం సిస్పృక్షతి. ౩౮-౮౨

దం-అ. ధర్మిపదార్థమునకు దృశ్యమైన ధర్మముయొక్క సంబంధమును లేదు. వాయువుచేత కదలింపఁబడుచున్న జ్వాలలుగలనిప్పును, శీతత్వము స్పృశింప నిచ్ఛయింపదు.

తా. మంచిగాలిచేత చక్కఁగా ప్రజ్వలించుచున్న అగ్నిని, చల్లదనము ఏప్రకారము ముట్టదో ఆప్రకారము ఆత్మను దృశ్యమైన యహంకారము ముట్టదు. ఇందుకు కారణము అన్యోన్యవిరోధము. ఇది వహ్నిశైత్యములకు ఉన్నట్టు చిజ్జడములకు కూడ

గలదు గనుక చిద్రూపమైన ఆత్మను జడరూపమైన అహంకారము సంశ్లేషించదని భావము.

అవ. ఇంతవఱకు చెప్పిన యుక్తులయొక్క సామర్థ్యముచేత ద్రష్టృత్వము, దృశ్యత్వమున్ను భిన్నస్థానములయం దుండఁదగినవి కాని, ఒకచోట నుండఁదగినవి కావు అని నిగమించుచున్నారు.—

వాక్య. తస్మాద్విస్రబ్ధ ముపగమ్యతామ్. ౮౩

దం-అ. ఆ కారణమువలన నమ్మకముగా నంగీకరింపఁబడుఁగాక.

తా. ద్రష్టృదృశ్యములకు పరస్పరసంబంధములేనని ఇంతవఱ కనేకయుక్తులను చెప్పియున్నాము. కనుక నీముందుచెప్పఁబోయెడి అర్థమును నిస్సంశయముగా నంగీకరించవలయునని భావము.

శ్లో. ద్రష్టృత్వం దృశ్యతా చైవ నైకస్మిన్ ఏకదా క్వచిత్,
దృశ్యదృశ్యో నచద్రష్టా ద్రష్టృ దర్శి దృశి ర్నచ. ౩౯. ౮౮

దం-అ. ద్రష్టృత్వము దృశ్యత్వమున్ను ఒకదానియం దొకటే సమయమునందు నెప్పటికిని సంభవించవు. ఇదిగాక ద్రష్ట, దృశ్యముచేతఁ జూడఁబడునది కాదు. దృక్కు ద్రష్టను చూచునదిన్ని కాదు.

తా. ద్రష్టృత్వమనఁగా చూచునట్టిస్వభావము. దృశ్యత్వమనఁగా చూడఁబడెడి స్వభావము. ఈరెండు నొకపదార్థమునందు ఒకసారి సంభవించవు. అని నిశ్చయముగా నమ్మవలెను. అనఁగా ద్రష్టృత్వదృశ్యత్వములు రెండును ఆత్మయందుగాని, అహంకారమందుగాని ఏక కాలమందు సంభవించవు. అని యర్థము. ఇదిగాక తనచేతఁ జూడఁబడెడి విజ్ఞానము (అంతఃకరణవృత్తి) చేత ద్రష్టయగు నాత్మ చూడఁబడఁడు. విజ్ఞానము ద్రష్టను చూచునది కాదు. ఎందువల్లనంటే ద్రష్టయగు నాత్మకు దృశ్యత్వమును చెప్పునప్పుడు తనకు తానే దృశ్యమనిగాని, మఱియొకదృశ్యముచేత దృశ్యమనిగాని, దర్శనము (విజ్ఞానము) చేత దృశ్యమనిగాని చెప్పవలయును. ద్రష్టృ, దర్శన, దృశ్యములకంటె మఱియొకవస్తువు లేదుగదా? కర్తృత్వకర్మత్వము లొకచోట సంభవించవు కనుక ద్రష్టయగు నాత్మ తనకు తానే దృశ్యముకానేరదు. ద్రష్టకంటే భిన్నములగు వస్తువులన్నియు జడములైనందునను, జడమునకు మఱియొకదానిని ప్రకాశింపఁజేయు సామర్థ్యము లేనందునను, మఱియొకదృశ్యవస్తువునకు ఆత్మ దృశ్యము కానేరదు. దర్శనమునకు (విజ్ఞానమునకు) దృశ్యమును గ్రహించెడిస్వభావమేగాని, ద్రష్టను గ్రహించెడి స్వభావము లేనందున విజ్ఞానమునకును ఆత్మ దృశ్యము కానేరదు. గనుక నాత్మ

యందు దృశ్యత్వ మెప్పటికిని సంభవించదు గావున ఆత్మస్వరూపము నిత్యస్వప్రకాశ మని సిద్ధము.

అవ. ద్రష్టయగు నాత్మకు దృశ్యత్వముకలదని దృక్కును (విజ్ఞానమునకు) ద్రష్టను చూచెడిస్వభావముకలదని చెప్పినయెడల దోషమును చూపుచున్నారు.——

వాక్య. సర్వసంవ్యవహారలోపశ్చ ప్రాప్నోతి. ౨౫

దం-అ. సకలమైనవ్యవహారములకు లోపమున్ను ప్రాప్తించును.

తా. నేను ఘటమును చూచుచున్నాను. ఇత్యాదివ్యవహారములన్నియుం లోపించు నని భావము.

వాక్య. యస్మాత్. ౨౬

దం-అ. ఎందువల్లను.

తా. ఏకారణమువల్ల వ్యవహారములు లోపించునని పూర్వపక్షవాది ప్రశ్నము చేయుచున్నాఁడని భావము.

అవ. సిద్ధాంతవాది ఉత్తరమును చెప్పుచున్నాఁడు.——

శ్లో. ద్రష్టాపి యది దృశ్యాయాః ఆత్మీయా త్కర్మతాం ధియః,
యౌగపద్య మదృశ్యత్వం వైయర్థ్యం చాప్నుయాత్ శ్రుతిః.

దం-అ. ద్రష్టయగు నాత్మయున్ను, దృశ్యమైనబుద్ధికి కర్మత్వమును (గోచరించుటను) పొందెనేని ఏకకాలీనత్వమున్ను, దృశ్యత్వము లేకపోవుటయున్ను ప్రాప్తించును. వేదవాక్యమున్ను నిరర్థకమును పొందును.

తా. ద్రష్టయగు నాత్మ, తనచేత చూడఁబడెడిబుద్ధికి గోచరించినయెడల ద్రష్టకు దృశ్యత్వము సంభవించదుగదా? అప్పుడు బుద్ధికిని ఆత్మకును ఈరెంటికిని ఒకకాలమందే ద్రష్టృత్వము సంభవించును. అందుచేత దృశ్యమే లేకపోవును. కనుక ద్రష్టృ, దర్శన, దృశ్యము లనేత్రిపుటి ననుసరించి ప్రవర్తించుచున్నవ్యవహారము లోపించును. ఇదిగాక ఆత్మ, బుద్ధికి దృశ్యమే యైనయెడల ఆత్మస్వరూపము, కూటస్థనిత్యమని చెప్పుచున్నశ్రుతియున్ను నిరర్థకమైపోవును. అని భావము.

వాక్య. కుతః. ౨౭

అవ. శ్రుతికి నిరర్థకత్వము వచ్చెడిప్రకారమును ప్రశ్నపూర్వకముగా వివరించుచున్నారు.——

వాక్య. యస్మాత్. ౨౮

దం-అ. ఎందువల్లను.

తా. శ్రుతి యెందువలన నిరర్థకమగునని చెప్పుచున్నారని పూర్వవాది ప్రశ్నను చేయుచున్నాఁడని భావము.

అవ. సిద్ధాంతవాది యుత్తరమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. నాలుప్తదృష్టేః దృశ్యత్వం దృశ్యత్వే ద్రష్టృతా కుతః,
స్యాచ్చేత్ దృగేకం నిర్ద్రశ్యం జగద్వా స్యాదసాక్షికమ్. ౮౧.

దం-అ. లోపము నొందనిజ్ఞానముకలదానికి దృశ్యత్వములేదు. దృశ్యత్వముకలిగియుండెనా ద్రష్టృత్వము ఏలాగున సంభవించును? సంభవించెనేని దృశ్యరహితమైన దృక్కు ఒక్కటేయుండును. లేదా, ప్రపంచము ఒక్కటద్రష్టృరహితమై యుండును.

తా. జ్ఞానహీనమైన (జడమైన) ఘటాదికమందు దృశ్యత్వము నియతమై యున్నది. ఆత్మకు దృశ్యత్వమును చెప్పెడియెడల, ఆత్మయున్ను జ్ఞానహీనమై (జడమై) యుండవలయు. అప్పుడు 'నహి ద్రష్టుః దృష్టేర్విపరి లోపోదృశ్యతే' అనుశ్రుతి వ్యర్థమై పోవును. నన్ను నేను తెలిసికొనుచున్నానే యనుభవముచేత ఆత్మకు ద్రష్టృత్వదృశ్యత్వములు రెండున్ను కలిగియున్నవని శంకింపతగదు. ద్రష్టృత్వదృశ్యత్వములు రెండునొక ఆత్మయందే సంభవించెడియెడల ద్రష్టృత్వదృశ్యత్వములకు పరస్పరవిరోధము లేనందున దృశ్యమగుప్రపంచము, ద్రష్టృకోటిలోనే చేరును. కనుక,దృశ్యమగుప్రపంచము లేకపోగా, ద్రష్టయొక్కఁడే నిలిచియుండును. లేదా, ద్రష్టకు దృశ్యత్వమున్ను సంభవించును. కనుక ద్రష్టలేకపోయి దృశ్యప్రపంచ మొక్కటే నిలిచియుండును. అప్పుడు సర్వవ్యవహారములు లోపించును. కనుక, నన్ను నేను తెలిసికొనుచున్నాననే యనుభవము ముఖ్యముగాదు అని భావము. ద్రష్టయగు నాత్మయొక్క జ్ఞానమునకు లోపములేదని శ్రుత్యర్థము.

అవ. ఈచెప్పినయుక్తి నిర్మూలముగాదని చెప్ప నారంభించుచున్నారు.—

వాక్య. ఉక్తయుక్తిం దృఢీకర్తుం ఆగమోదాహరణోపన్యాసః. ౯౧

దం-అ. చెప్పినయుక్తిని దృఢముగా చేయుటకొఱకు వేదవాక్యముల ఉపన్యాసము చేయఁబడును.

తా. ఆత్మాహంకారములకు సంబంధములేదని నిరూపించుట కింతవఱకు చెప్పిన యుక్తులు వేదవాక్యముల ననుసరించి చెప్పఁబడినవిగాని నిరాధారముగాఁ జెప్పఁబడినవి గావు. కనుకనే పూర్వపక్షవాదికి దుర్భేద్యములై యున్నవని చెప్పెడికొఱకు ప్రకృతయుక్తులకు మూలభూతములైన శ్రుతుల నుపన్యసించుచున్నారని భావము.

శ్లో. అర్త మన్యత్ దృశేః సర్వం 'నేతినేతీతి' చాసకృత్,

వదంతీ నిర్గుణం బ్రహ్మ కథం శ్రుతి రుపేక్ష్యతే. ౮౨. ౯౨

దం-అ. దృక్కుకంటె నితరమైనదంతయు వినాశముకలదని, ఇటువంటిదికాదు ఇటువంటిదికాదు, అని అనేకపర్యాయములు నిర్గుణమైన బ్రహ్మమును చెప్పుచున్న శ్రుతి ఏలాగున నుపేక్షింపఁబడును?

తా. బృహదారణ్యకములో 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా' అని యారంభించి 'అతోఽన్యదార్తం' అనెడిశ్రుతి ద్రష్టయగు నాత్మకంటె మఱియొకటిలేదని, ఈయాత్మకంటె భిన్నమైనవస్తువులన్నియు, నశించుస్వభావముకలవైనందున, ద్రష్టతోటి సంబంధము కలవు కావనిన్ని చెప్పఁబడియున్నది. 'స ఏష నేతి నేత్యాత్మా' యనుశ్రుతియందును మూర్తప్రపంచము, అమూర్తప్రపంచము ఈరెండు ఆత్మతోటి సంబంధించునవి కావని మూర్తామూర్తప్రపంచసంబంధములేక నిత్యనిర్వికారమైనజ్ఞానమే పరంబ్రహ్మ యని చెప్పుచున్నది. ఈప్రకారముగ ననేకశ్రుతులు సర్వసంబంధశూన్యమైన నిర్గుణమైన ఆత్మతత్త్వమును పరమతాత్పర్యముతోటి ప్రతిపాదించుచున్నందున మేమీశ్రుతుల ననుసరించి ద్రష్టృదృశ్యములకు సంబంధములేదని యుక్తిచేత ప్రతిపాదించినారమని భావము.

అవ. చెప్పిన అర్థమునందు స్మృతివచనముగూడ ప్రమాణముగా చూపించుచున్నారు.—

శ్లో. "మహాభూతా న్యహంకార" ఇత్యేతత్ క్షేత్ర ముచ్యతే,
నదృశేః ద్వైతయోగోఽస్తి విశ్వేశ్వరమతాదపి. ౮౩. ౯౩

దం-అ. మహాభూతములు, అహంకారము ఇవియన్నియు క్షేత్రమని చెప్పఁబడును. అనిచెప్పిన భగవంతుని మతమువల్లనున్ను దృక్కుకు ద్వైతప్రపంచముతోటి సంబంధములేదు.

తా. శ్రీభగవద్గీత ౧౩-వ యధ్యాయములో 'మహాభూతా న్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ' యని మొదలు 'ఇతి క్షేత్రం సమాసేన సవికార ముదాహృతం' అనువఖకు పృథివ్యాదిపంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, ఇంద్రియములు పదకొండు, శబ్దాదివిషయములైదు, ఇచ్ఛాద్వేషసుఖదుఃఖాదులున్ను ఇవి క్షేత్రమనిన్ని, వీనినన్నిటిని ప్రకాశింపఁజేయు చిదాత్మ క్షేత్రజ్ఞుఁడనిన్ని శ్రీకృష్ణమూర్తి యర్జునున కుపదేశించియున్నారు. ఇందులో అహంకారాదిక్షేత్రము భిన్నమని తత్ప్రకాశకమైన యాత్మ వేరనిన్ని, వీనికి రెంటికి పరస్పరసంబంధము వాస్తవముగా లేదనిన్ని, క్షేత్రక్షేత్రజ్ఞులవిభేదము తెలిసినంగాని మోక్షము కలుగదనిన్ని, చెప్పఁబడి

యున్నది. కనుక సర్వలోకేశ్వరుఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క అభిప్రాయమునుబట్టి చూచినను ఆత్మాహంకారములకు సంబంధములేదని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను జేయుచున్నారు.—

వాక్య. అధునా ప్రకృతార్థోపసంహారః. ౯౪

దం-అ. ఇప్పుడు ప్రకృతార్థముయొక్క ఉపసంహారము చేయఁబడును.

తా. స్పష్టము.

శ్లో. ఏక మేతత్ హిరుక్ జ్ఞేయం మిథ్యాసిద్ధ మనాత్మకమ్,
మోహమూలం సుదుర్బోధం ద్వైతం యుక్తిభి రాత్మనః. ౪౪.

దం-అ. ఈప్రకారము మిథ్యగాఁ గాన్పించుచున్న స్వరూపశూన్యమైన అజ్ఞానమే కారణముగాగల తెలియ శక్యముగాని యద్వైతప్రపంచము ఆత్మకంటే భిన్నమైనదని యుక్తులచేత నెఱుంగఁదగును.

తా. దృశ్యమానంబైన యీద్వైతప్రపంచంబంతయు ఆకాశనైల్యమువలె మిథ్యగా భాసించి నిస్స్వరూపంబై యిటువంటిదని నిశ్చయింప శక్యముగాక కేవలాజ్ఞానముచేఁ బుట్టి మరుమరీచికాజలము (యెండమావులు)వలె చూడఁబడుచున్నది. ఇది పరమార్థసత్యమై నిత్యనిర్వికారమైన చిదాత్మకంటె అత్యంతభిన్నమై యున్నదని ఇది వఱకు మేముచెప్పిన యుక్తులవలన తెలియవలయునని భావము.

అవ. సిద్ధాంతవాది తానుచెప్పిన ప్రపంచమిథ్యాత్వమును సహింపక సాంఖ్యవైశేషికాదులుచేయు నాక్షేపము ననువదించి ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. కుతో మిథ్యా సిద్ధత్వం ద్వైతస్యేతిచేత్. ౯౫

దం-అ. ద్వైతప్రపంచమునకు మిథ్యగా భాసించుట యేలాగని యంటివా చెప్పుచున్నాను.

తా. ద్వైతప్రపంచము ఆత్మకంటె భిన్నమైతే యగుఁగాక! మిథ్యయని యేలాగున చెప్పనగును? ప్రత్యక్షానుమానాగమప్రమాణములు మూఁడును ద్వైతప్రపంచమును తెలియఁజేయుచున్నవిగదా? యని సాంఖ్యవైశేషికులాక్షేపణము. దానికి పరిహారమును చెప్పుచున్నామని భావము.

శ్లో. న పృథక్ నాత్మనా సిద్ధి రాత్మనోన్యస్యవస్తునః,
ఆత్మవత్ కల్పిత స్తస్మా దహంకారాదిరాత్మని. ౪౫. ౯౬

దం-అ. ఆత్మకంటె భిన్నమైనవస్తువునకు భేదముగాగాని, అభేదముగాగాని

ఆత్మకువలె సిద్ధి (స్థితి) లేదు. అందువలన అహంకారము మొదలగునవి ఆత్మయందు కల్పింపఁబడినది.

తా. సత్తాప్రకాశములు ఆత్మస్వరూపములైనందున ఆత్మకంటే మఱియొకదాని యందు సంభవించవు. అహంకారాదిదృశ్యప్రపంచము ఆత్మకంటె భిన్నమైనయెడల జడాజడములకు సంబంధములేనందున అభేదమే సిద్ధించదు. ఇదిగాక నిత్యముగా నుండ వలయు ప్రపంచము నిత్యముగాదని ప్రత్యక్షము శ్రుతివాక్యము అనేకములుగా ఘోషించుచున్నవి. కనుక అహంకారాదిదృశ్యప్రపంచము ఆత్మయందు అజ్ఞానముచేత కల్పింపఁబడియున్నది. కనుకనే శుక్తిరజతసర్పాదులవలె మిథ్యారూపమని నిశ్చయింపఁబడినది. ప్రత్యక్షానుమానాగమములు ప్రపంచమును గోచరింప చేయుచున్నప్పటికి సత్యమని చెప్పినది లేదని భావము.

అవ. ఫలితార్థమును చెప్పుచున్నారు.—

వాక్య. తస్మా దజ్ఞానవిజృంభిత మేతత్. ౯౭

దం-అ. అందువలన నిదియంతయు నజ్ఞానముచేత నేర్పడినది.

తా. స్పష్టము.

అవ. అజ్ఞానముచేత నేర్పడినది ఏదియంటే ప్రతిపాదించుచున్నారు.—

శ్లో. దృశ్యాః శబ్దాదయః క్లృప్తాః ద్రష్టృచ బ్రహ్మ నిర్గుణమ్,
అహం తదుభయం బిభ్రత్ భ్రాంతి మాత్మని యచ్ఛతి. ౭౬. ౯౮

దం-అ. శబ్దము మొదలగు దృశ్యపదార్థములు కల్పితములైయున్నవి. ద్రష్టయగు బ్రహ్మ నిర్గుణమైయున్నది. అహంకారము ఈరెంటిని ధరించుచు నాత్మయందు భ్రాంతిని గలుగఁజేయుచున్నది.

తా. శబ్దాదివిషయములు దృశ్యములై అనృతములై యున్నందునను, బ్రహ్మ ద్రష్టయై సత్యమైయున్నందునను, ఆత్మానాత్మలకు పరస్పరసంబంధము వాస్తవముగా లేదు. అయినను అహంకారము, శబ్దాదివిషయములను ఆత్మను ఈరెంటిని తనయందు ప్రతిబింబింపఁజేసికొని పరస్పరసంబంధము కలిగియున్నట్టు కనుపరచుచున్నందున, భ్రాంతి చేతనే 'నేను కర్తను, నేను భోక్తను' అనేవ్యవహారములు ప్రవర్తించుచున్నవి. ఇందు లోకదృష్టాంతమును చెప్పెదను. చంద్రబింబమునందు రక్తగుణములేదు. చంద్రబింబజపాకుసుమములకు సంబంధములేదు. అయినను దర్పణమున జపాకుసుమ చంద్రబింబములు ప్రతిబింబించినప్పుడు, జపాకుసుమగతరక్తిమకును, చంద్రబింబమునకును సంబంధము కలిగియున్నట్టు భాసించుచున్నందున, చూచువారలు భ్రాంతిచే చంద్ర

బింబ మెఱ్ఱిగానున్నదని వ్యవహరించెదరు. ఆప్రకారమే యాత్మానాత్మలకు అహంకారములో ప్రతిబింబము కలిగినప్పుడు అనాత్మధర్మము లాత్మయందు ప్రతిబింబించి యున్నవని తలంచి 'నేను కర్తను, నేను భోక్తను' అని ఈలాగున వ్యవహరించుచున్నారు. కనుక శుద్ధమై, నిర్గుణమైన యాత్మయందు కర్తృత్వాదిప్రతీతిభ్రాంతి సిద్ధమైనందు: అజ్ఞాన విజృంభితమని భావము.

అవ. అహంకారము ప్రతిబింబించినందున కలిగెడి మఱియొకవిశేషమును గూడ కనుపరచుచున్నారు.—

వాక్య. తత ఏవేయ మభిన్నస్యాత్మనో భేదబుద్ధిః. ౧౦౦

దం-అ. అందువల్లనే అద్వితీయమైన (ఏకమైన) ఆత్మకు ఈ అనేకత్వబుద్ధి యును కలిగినది.

తా. ఆత్మ ఒకఁడైయున్నప్పటికి ఒక్కొకశరీరమునం దొక్కొక్కఆత్మ కలఁడనే బుద్ధియును ఈయహంకారమునందు ప్రతిబింబించినందువల్లనే కలిగినదనిభావము.

అవ. చెప్పినయర్థమును వివరించుచున్నారు.—

శ్లో. దృగేకా సర్వభూతేషు భాతి దృశ్యై రనేకవత్,
జలభాజనభేదేన మయూఖస్రగ్విభేదవత్. ౪౭. ౧౦౧

దం-అ. జలపూర్ణఘటముల భేదముచేత సూర్యునియొక్క భేదమువలె సకల భూతములయం దొక్కటైయున్న ఆత్మ దృశ్యములచేత అనేకముగ ప్రకాశించుచున్నది.

తా. ఆకాశమున ప్రకాశించుచుండుసూర్యుఁ డొక్కఁడే అయినను, జలముతోనిండియున్న అనేకఘటములయందు ప్రతిబింబించుటచే అనేకములుగా ప్రకాశించుచున్నాఁడుగదా! ఆప్రకారమే చిద్రూపుఁడైన ఆత్మ సర్వదేహములయం దొక్కటై యున్నప్పటికిని, ఆయాశరీరములయందుగల అంతఃకరణములయందు ప్రతిబింబించుట చేత ప్రతిశరీరమునందును ఆత్మ వేర్వేఱుగా నున్నాఁడని ఆత్మయందు భేదబుద్ధియున్ను కలుగుచున్నదని భావము.

అవ. చిదాత్మకు స్వతః భేదము లేక పోయినప్పటికి అంతఃకరణోపాధిచేత కల్పింపఁబడినదని చెప్పినందుకు స్పష్టమైన దృష్టాంతమును చెప్పెదమని చెప్పుచున్నారు.—

వాక్య. యథోక్తార్థస్య ప్రతిపత్తయే దృష్టాంతః. ౧౦౨

దం-అ. ఇదివఱకుచెప్పిన అర్థముయొక్క ప్రతిపత్తికొఱకు దృష్టాంతము చెప్పఁబడును.

తా. ఇదివఱకు చెప్పినయర్థము విశదముగా తెలిసెడికొఱకు దృష్టాంతము చెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. మిత్రోదాసీనశత్రుత్వం యథైకస్యాన్యకల్పనాత్,
అభిన్నస్య చితే స్తద్వత్ భేదోఽంతఃకరణాశ్రయః. ౭౮. ౧౦౩

దం-అ. అన్యపురుషులయొక్క కల్పనలవలన ఒకపురుషునకు మిత్రత్వము, ఉదాసీనత్వము, శత్రుత్వము ఎటువలె సంభవించుచున్నదో అటువలెనే ఒక్కఁడైన చిదాత్మకు భేదము అంతఃకరణము నాశ్రయించినదై యుండును.

తా. ఈలోకములో దేవదత్తుఁడను పురుషుఁ డొకఁడైనప్పటికి, ఒకనియొక్క బుద్ధిచే మిత్రుఁడని, మఱియొకని బుద్ధిచే శత్రువని, ఇంకొకనిబుద్ధిచే నుదాసీనుఁడని (మధ్యస్థుఁడు) కల్పింపఁబడి యేప్రకారము వ్యవహరింపఁబడుచుండునో ఆప్రకారమే చిదాత్మ తాను ఒక్కఁడైనప్పటికి అనేకశరీరములలోనున్న అనేకాంతఃకరణముల నాశ్రయించియున్నందున అనేకముగా వ్యవహరింపఁబడునని భావము.

అవ. ఓయీ! నిరాధారుఁడై సర్వపరిపూర్ణుఁడైన ఆత్మకు అంతఃకరణములయందు ప్రతిబింబించుటయును, అంతఃకరణధర్మములు కలిగియుండుటయును యుక్తముగాదని పూర్వవాది శంకించగా పరిహారమును చెప్పుచున్నారు.—

శ్లో. అపహారో యథాభానో స్సర్వతో జలపాత్రకైః,
తత్క్రియాకృతిదేశాప్తి స్తథా బుద్ధిభిరాత్మనః. ౭౯. ౧౦౪

దం-అ. సూర్యునకు అంతటనున్న జలపూర్ణఘటములచేత అపహరించుటయును వానియొక్క కార్యములను, ఆకారములను, ప్రదేశములను పొందుటయును, నెటువలె కలిగియుండెనో ఆత్మకున్ను అటువలెనే అంతఃకరణములచేఁ గలిగియున్నది.

తా. సూర్యుఁడు తానుండెడిప్రదేశములో నున్నప్పటికి, భూమియందు పెట్టఁబడెడిజలపూర్ణఘటములచేత తమయం దున్నట్టుగా ప్రకాశింపఁజేయఁబడి, ఆజలఘటములయందు కలిగియున్నచలనాదిక్రియలను, స్వచ్ఛత్వమలినత్వాద్యాకారములను భూమ్యాదిదేశములను పొందినవానివలె నేలాగున కనఁబడుచుండునో, ఆలాగుననే తమయం దున్నట్టు ప్రకాశింపఁజేయఁబడును. అందుచేత నాయంతఃకరణములయందుగల ధ్యానాదిక్రియలు స్వచ్ఛత్వమలినత్వాద్యాకారములుగలిగి అంతఃకరణములు ఈశరీరములో హృదయప్రదేశమునందుండును గనుక ఆత్మయున్ను హృదయప్రదేశమునందుండునటుల వ్యవ-

హరింపఁబడుచున్నది. ఇంతియేగాక, వాస్తవముగానంతఃకరణములయందు చేరియుండుట గాని, అంతఃకరణధర్మములతోఁ గలిసియుండుటగాని ఆత్మకు లేదని భావము.

అవ. ఓయీ! సర్వభూతములయందు నాత్మ ఒక్కఁడే యైనయెడల పరస్పర విరుద్ధములైన సుఖదుఃఖములు రాగద్వేషములు, భ్రాంతిజ్ఞానసమ్యక్జ్ఞానములు మొదలగుధర్మములు ఆయాత్మకు ఏకకాలమునందే ప్రసక్తములైయున్నవని చెప్పవలసియుండును. అలాగున చెప్పుట న్యాయముకాదుగదా? కనుక సర్వభూతములయందును చిదాత్మ ఒక్కఁడే యని ఏలాగున చెప్పితిరని పూర్వపక్షవాది శంకింపఁగా పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. న చ విరుద్ధధర్మాణా మేకత్రా నుపపత్తిః. ౧౦౫

దం-అ. విరుద్ధములైన ధర్మములకు ఒకచోట ఉపపత్తి లేకపోవుట.

తా. చిదాత్మ యొక్కఁడేయైనను రాగద్వేష, సుఖదుఃఖాదివిరుద్ధధర్మములు కలిగియుండవచ్చును. ఆసందర్భ మేమియు లేదని భావము.

అవ. సిద్ధాంతవాదియొక్క అభిప్రాయ మెఱుంగక పూర్వవాది ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. కిం కారణమ్? ౧౦౬

దం-అ. ఏమికారణము?

తా. విరుద్ధకర్మములకు సంబంధము అనుపపన్నములుగావని, యేకారణమువల్ల చెప్పుచున్నారని భావము.

అవ. సిద్ధాంతవాది తనయభిప్రాయమును దృష్టాంతముద్వారా వివరించుచున్నాఁడు.—

శ్లో. కల్పితానామవస్తుత్వాత్ స్యాదేకత్రాపి సంభవః,
కమనీయ్యాఽశుచిః స్వాద్వీ త్యేకస్యామివ యోషితి. ౫౦.

దం-అ. రమ్యత్వము, అపవిత్రత్వము, స్వాదుత్వము (రుచ్యత్వము) ఇవి ఒక స్త్రీయందువలె కల్పింపఁబడినధర్మములకు వాస్తవత్వము లేనందువలన ఒక ఆత్మయందును సంభవము (ప్రాప్తి) కలిగియుండును.

తా. పరస్పరవిరుద్ధధర్మములు వాస్తవముగా నున్నయెడల ఒకచోట నొకకాలమందు చేరియుండుట అనుపపన్నమే నని చెప్పవలయును. కల్పింపఁబడినధర్మములు వాస్తవములు కానందున, అవి పరస్పరవిరుద్ధములుగా కనఁబడుచున్నప్పటికి ఒకచోట్ల ఒకకాలమున సంభవింపవచ్చును. అదియేలాగంటే స్త్రీశరీరమొక్కటియైయున్నప్పటికి

దానియందు కాముకుఁ డగుపురుషుఁడు రమ్యాత్వమును, భోగ్యత్వమును ఆరోపించి చూచును. పరమనిరక్తుఁడైన సన్న్యాసి, శవమువలె అపవిత్రమని అస్పృశ్యమని భావించి దూరముగా తొలఁగిపోవును. పాలుత్రావుబాలుఁడు రుచ్యమని తలంచి నోరూరగా నా స్త్రీదగ్గిరికిపోవును. ఈరమ్యాత్వ అపవిత్రత్వ రుచ్యత్వములు, కాముక, సన్న్యాసి, బాలకులచేత క్రమముగా కల్పింపఁబడినందున వాస్తవములు కావు. గనుక పరస్పర విరుద్ధములుగా, కనఁబడుచున్నప్పటికి, ఒక స్త్రీశరీరమం దొకకాలమందే వ్యవహరింపఁ బడుచున్నవి. ఆప్రకారమే రాగద్వేషసుఖదుఃఖాదులు చిదాత్మయందు స్వతఃలేనివై అంతఃకరణములచేత కల్పింపఁబడినందున, పరస్పరవిరుద్ధములైనప్పటికి ఒకకాలమందే చిదాత్మయం దుండుటకు విరోధము లేదని భావము.

అవ. ఓయీ! పరస్పరవిరుద్ధములగు రాగద్వేషాదిధర్మములు చిదాత్మయందు కల్పనచేతనైనను సంభవించెడియెడల, నాచిదాత్మ అసంగుఁడని చెప్పుట యుక్తముకాదని పూర్వవాది చెప్పఁగా (శంకించగా) ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. నచాయం క్రియాకారకఫలాత్మకః ఆభాస ఈషదపి
పరమార్థవస్తుస్పృశతి తస్యమోహ మాత్రోపాదన
త్వాత్. ౧౦౮

దం-అ. ఆప్రపంచమునకు అజ్ఞానమాత్రమే కారణముగాఁ గలిగియున్నందున ఈక్రియాకారకఫలరూపంబైన ప్రపంచము కొంచెమైనను పరమార్థవస్తువును స్పృశించదు.

తా. ప్రత్యక్షానుమానములచేత ప్రకాశించుచున్న ఈప్రపంచము కొంతక్రియారూపకముగను, మఱికొంతఫలరూపముగ నున్నది. క్రియ యనఁగా చేయఁబడెడిపని. కారకమనఁగా నాపనిని నిర్వహించెడికొఱకు కావలసినసాధనములు. ఫలమనఁగా క్రియచేత సంభవించెడిప్రయోజనము. ఇవియంతయు నజ్ఞానముచేతనే పుట్టింపఁబడినది. కనుక పరమార్థస్వరూపమైన యాత్మవస్తువును కొంచెముగానైనను స్పృశించదు. అజ్ఞానకల్పితమైన ద్వైతప్రపంచముయొక్క సంబంధముచేత చిదాత్మయందుగల అసంగత్వము బాధింపఁబడదు. అవివేకులగు జనులు ఆకాశము నల్లగానున్నదని, పచ్చగానున్నదియని కల్పించినందున ఆకాశముయొక్క నిర్మలత్వమునకు బాధలేదుగదా?

శ్లో. అభూతాభినివేశేన స్వాత్మానం వంచయత్యయం,
అసత్యపి ద్వితీయేఽర్థే సోమశర్మపితా యథా. ౫౧ ౧౦౯

దం-అ. ఈజనుఁడు రెండవపదార్థము లేకపోయినప్పటికి సోమశర్మయొక్క

తండ్రివలె లేనివానియందు అభినివేశము (మనోరథము)ను చేయుటచేత తన్ను పంచించుచున్నాఁడు.

తా. ఆత్మకంటె భిన్నమైన ప్రపంచంబంతయు నజ్ఞానకల్పితంబు గావున లేనే లేదు. అయినను ఈజనులు మిథ్యాభూతంబులైన పదార్థంబులయందు మనోరథముచేసి యభినివేశంబుగలవారై, నేను సుఖవంతుఁడను, నేను దుఃఖవంతుఁడ నని భావించుచు వ్యర్థముగా పరితాపమును పొందుదురు. పూర్వకాలమునం దొకబ్రాహ్మణుఁడు మిక్కిలి దరిద్రుఁడైయుండి యొకగ్రామములో బిచ్చమెత్తుకొనుచుండెను. అప్పు డొకధార్మికుఁ డీబ్రాహ్మణుని బిలచి యొకపిండిపిడతను దానమిచ్చెను. అంత నాబ్రాహ్మణుఁడు పిండిపిడతను తీసికొని మార్గమునఁబోవుచు శ్రాంతుఁడై యొకవృక్షచ్ఛాయయందు శయనించి పిండిపిడతను ప్రక్కలో నుంచుకొని ఇట్లని చింతించెను. పరమదరిద్రుఁడనైన నాకు భగవంతుఁడు దయచేసి ఈపిండిపిడతను లభింపఁజేసెను. దీనిని నేను విక్రయించి కొంతసొమ్మును జేర్చి యొకమేకపిల్లను కొనియెదను. ఆమేకపిల్ల సంవత్సరములోపల నాలుగుపిల్లలను పుట్టించును. వాటిని విక్రయించి ఆవునొకటిని కొనియెదను. ఆయావు నాలుగుసంవత్సరములకు నాలుగుకోడెదూడల నీనును. తరువాత కొంత భూమిని సంపాదించి దాని నీకోడెలచేత దున్నించి నానావిధములైన సస్యములను వేసెదను. ఆసస్యములు విశేషముగా ఫలించును. అందుచేత నేను బహుధాన్యసమృద్ధికలవాఁడనై యుండి ప్రతిసంవత్సరము కృషిచేయుటచేత గొప్పధనికుఁడ నగుదును. అపిమాది మంచియోగ్యుఁడైన బ్రాహ్మణుఁడు తనకన్యను నాకిచ్చి వివాహము చేయును. వివాహమైన పిదప నేనును నాభార్యయును పరమసౌఖ్య మనుభవించుచుండెదము. అనంతరము నాభార్య గర్భవతియై నొకకుమారుని గనును. వానికి సోమశర్మయను పేరుబెట్టి మహాప్రేమతోటి పెంచుచుండెదను. సోమశర్మ ఆఁకలిగొని పాలిమ్మని యేడ్చుచు తల్లివెంటనే దోగియాడుచుంబోయి పయిటచెంగుపట్టియీడ్చును. అప్పుడు తల్లి ఇంటిలోనుండు పనితొందర వలన సోమశర్మను కసరితిట్టును. అదివిని నేను కోపగించుకొని నాభార్యను చేతితో నొకదెబ్బకొట్టెదను. అని చింతించుచు తలక్రింద నుంచుకొని యుండినచేతిని విసరెను. అందుచేత ప్రక్కలోనున్న కుండపగిలి, కుండలోనిపిండి యంతయు గాలికి ఎగిరి పోయెను. అపిమాది యాబ్రాహ్మణుఁడు మిగుల చింతించెను. గనుక ఈప్రకారముగనే యవాస్తవములైన సుఖదుఃఖాదివిషయములను మనోరథములచేత కల్పించుకొని వాటి యందు అభినివేశమునొంది యీలోకములో జనులందఱు సోమశర్మయొక్క తండ్రివలె నిరర్థకముగా పరితపించుచున్నారని భావము.

అవ. కల్పనము విపరీతముగా వ్యవహరించుటకు కారణమైయుండునని దృష్టాంతమును చూపించుచున్నారు.—

వాక్య. వస్తుయాథాత్మ్యానవబోధపటలాంధదృష్టిస్సన్. ౧౧౦
శ్లో. సుభ్రూః సునాసా సుముఖీ సునేత్రా చారుహాసినీ,
కల్పనామాత్ర సమ్మోహా ద్రామేత్యాలింగతేఽశుచిమ్. ౫౨.

దం-అ. వస్తువుయొక్క యాథార్థ్యమును తెలియకపోవుట అనేపటలదోషము చేత నాచ్ఛాదింపఁబడిన నేత్రములుగలవాఁడై మంచికనుబొమలు కలదని, మంచిముక్కుగలదని, మంచిముఖముకలదని, మంచినేత్రములుకలదని, సుందరమైన చిఱునవ్వులుకలదని, కల్పనచేతనే కలిగిన మోహముచేత మనోహరమైనదని అపవిత్రమైన దానిని కౌఁగలించుకొనును.

తా. ఉల్లిపొరవలె నేత్రములయందు పుట్టినది పటలదోషమనంబడు. ఇట్టి పటలదోషముకలవారు ప్రతివస్తువును యథార్థముగా తెలియఁజాలక విపరీతముగాఁ జూచుచుందురు. ఆప్రకారము ఈజనులు అజ్ఞానముచేత నావరింపఁబడిన బుద్ధికలవారై, ఆయావస్తువులయొక్క యాథార్థ్యము నెఱుఁగంజాలక వృథాభిమానముంజేసి ప్రవర్తింపుచుందురు. అదియేలాగంటే స్త్రీలయొక్కశరీరము మలమూత్రపూర్ణమై, మాంసాస్థిరక్తబంధురమై అత్యంతహేయమైగదా యున్నది. ఇట్టిశరీరమును జూచి అజ్ఞానులు దానియాథార్థ్యమును తెలియంజాలక మంచికనుబొమలు కలదని, సంపెగపూవువంటి నాసికకలదని, చంద్రబింబమువంటి ముఖముకలదని, సద్యోవికసితకమలపత్రముల రమణీయత విశాలతగలనేత్రములు కలదని, వెన్నెలవంటి మందస్మితముకలదని, అతిమనోహరదివ్యాకారముగలదని, అభూతములైన గుణములను కల్పించుకొని వ్యామోహమునొంది మిగుల అపవిత్రమగు నాశరీరమును కౌఁగలించుకొని ఆనందించుచుందురు. గనుక కల్పనమే విపరీతముగా వ్యవహరించుటకు కారణమని సిద్ధము.

అవ. ౪౭వ శ్లోకములో 'అహం తదుభయం బిభత్ భ్రాంతిమాత్మని యచ్ఛతి' అహంకార మారెంటిని భరించుచు భ్రాంతిని ఆత్మయందు కలుగఁజేయునని చెప్పిన యర్థమును వివరించుచున్నారు.—

వాక్య. సర్వస్యానర్థజాతస్య జిహాసితస్య మూలమహంకార ఏవ. ౧౧౨

దం-అ. విడువఁదగిన సకలమైన అనర్థసముదాయమునకు కారణము అహంకారమేను.

తా. సకలదుఃఖములు సంపాదించుచున్నందున, అందఱకు పరిత్యజించ తగియున్న దేహాదిప్రపంచము, నిత్యనిర్వికారుఁడైన చిదాత్మకు సంభవించుటకు కారణము అజ్ఞానకల్పితమగు అహంకారమేకాని మఱియొకటిగాదు. అనఁగా అజ్ఞానకల్పితమగు అహంకారముచేతనే చిదాత్మకు దేహేంద్రియాది సంబంధము ప్రాప్తించినదని భావము.

అవ. అందుకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. తస్యాత్మా నాత్మోపరాగాత్.     ౧౧౩

దం-అ. ఆయహంకారమునకు ఆత్మతోటిన్ని యనాత్మతోటిన్ని సంబంధము కలిగియున్నందున.

తా. అహంకారమనఁగా నాత్మానాత్మలగ్రంథియేగదా? అందువలన అహంకారమునం దాత్మయును, అనాత్మయును కలిసియున్నవి. అందుచేత అహంకారము ఆత్మయం దనాత్మనున్ను, దానిధర్మములగు సుఖదఃఖాదులనున్ను ప్రకాశింపఁజేయుచుండునని భావము.

అవ. ఓయీ ఆత్మస్వరూపము సర్వవ్యాపకమై యున్నందున అహంకారము లేకపోయినప్పటికి అన్నిటిలో సంబంధము సంభవించును. గనుక అనర్థము స్వయముగానే కలుగును. కావున అహంకారము కలుగఁజేయవలసినపనియేమి యని పూర్వవాది ఆక్షేపించగా సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. నతు పరమార్థతః ఆత్మనోఽవిద్యయా తత్కార్యేణ
వా సంబంధో భూ దస్తి భవిష్యతివా.     ౧౧౪

దం-అ. ఆత్మకు వాస్తవముగా నవిద్యతోటిగాని, దానియొక్క కార్యముతోటిగాని సంబంధము ఆయినదిలేదు- అవుచున్నదిలేదు- కాఁబోవునదిలేదు.

తా. అహంకారసంబంధములేని కేవలచిదాత్మకు అజ్ఞానసంబంధముగాని అజ్ఞానకల్పితదేహేంద్రియాదులతోటి సంబంధముగాని యిదివఱకు కాలేదు. ఇఁకను కాఁబోదు. ప్రస్తుతము అగుచున్నదిలేదు. కాలత్రయమునందును లేదని భావము. అనఁగా నాత్మ సర్వవ్యాపకమై యున్నప్పటికిని, అహంకారముతో సంబంధించినపుడే అనర్థముల నొందునుగాని, తనంతట తాను వ్యాపించినప్పుడు అనర్థముల నొందఁడు. సూర్యప్రకాశము ఆకాశమందంతట వ్యాపించియున్నప్పటికి అద్దపు బిళ్లలయందు ప్రవేశించినప్పుడే దుర్నిరీక్షమైయుండును. ఆప్రకారమే ఆత్మయును నని తాత్పర్యము.

అవ. అందుకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. తస్యాపరిలుప్త దృష్టిస్వాభావ్యాత్. ౧౧౫

దం-అ. ఆయాత్మకు వినాశము లేనిజ్ఞానమే స్వభావముగా గలిగియున్నందున.

తా. ఎప్పటికిని నశించనిజ్ఞానమే చిదాత్మకు స్వరూపమై యున్నది. గనుక చిదాత్మకు నిరుపాధికముగా ననర్థసంబంధము కలుగదని భావము.

శ్లో. దృశ్యానురక్తం తత్ ద్రష్టృ దృశ్యం ద్రష్ట్రనురంజితమ్,
అహం మృత్యోర్భయం రక్తం తన్నాశేఽద్వైతతాత్మనః. ౫౩.

దం-అ. దృశ్యములతోఁడిసంబంధించిన అంతఃకరణము ద్రష్టగా నేర్పడును. ఆత్మచేత ప్రకాశింపఁజేయఁబడి దృశ్యముగా నేర్పడును. అహంకారముచేత నీరెండును సంబంధించును. ఆయహంకారము నశించగా నాత్మకు అద్వితీయత్వము సిద్ధించును.

తా. అంతఃకరణము జడమైనందున ద్రష్టృత్వము కలదిగాదు. తనయందు ప్రతిబింబించిన చిదాత్మయొక్క ప్రకాశముకలదై, శబ్దస్పర్శాదిదృశ్యపదార్థములతో సంబంధించినప్పుడు ద్రష్ట యనఁబడును. ఆయంతఃకరణమే ఆత్మచైతన్యముచే ప్రకాశింపఁజేయఁబడుచు దృశ్యత్వము నొందును. ఈప్రకారముగా ద్రష్టృదృశ్యములకు పరస్పరసంబంధము కొంచెముగానైనను లేకయుండగా అహంకారము 'అహ మిదం జానామి' (నేను దీనిని తెలియుచున్నాను) అనేప్రకారము ద్రష్టదృశ్యములకు సంబంధమును కలుగఁజేయుచున్నది. గనుక అహంకారమే సర్వానర్థసంబంధము ఆత్మకు కలుగఁజేయుచున్నది. అహంకారము నశించెనేని చిదాత్మ అద్వితీయుఁడై సర్వానర్థరహితుఁడై ప్రకాశించునని భావము.

అవ. పూర్వపక్షవాదమును చూపించుచున్నారు.—

వాక్య. ఇహ కేచి చ్చోదయంతి యోయ మన్వయ వ్యతిరేకాభ్యాం అనాత్మతయోత్సారితోఽహంకారః వాక్యార్థ ప్రతిపత్తయే సోయం విపరీతార్థః సంవృత్తః యస్మాదహం బ్రహ్మాస్మీతి బ్రహ్మాఽహం పదార్థయోః సమానాధికరణశ్రవణాత్ అనాత్మార్థేన సామానాధికరణ్యం ప్రాప్నోతి వక్తవ్యాచ ప్రత్యగాత్మని తస్య వృత్తిరితి. ౧౧౭

దం-అ. ఇచ్చటను కొంద రాక్షేపించుచున్నారు. వాక్యార్థమును తెలియుటకొఱకు యే ఈయహంకారము కాదని అన్వయవ్యతిరేకములచేత నిరసింపఁబడెనో ఆ ఇది విపరీతమైన అర్థముకలది అయినది. ఎందువల్లనంటే 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మ

నైలిని) అని బ్రహ్మపదార్థ అహంపదార్థములకు సామానాధికరణ్యము వినఁబడుచున్నం దున అనాత్మ ప్రతిపాదకమైన అహంపదముతోఁటి సామానాధికరణ్యము ప్రాప్తించు చున్నది. గనుక ఆ 'అహం' పదమునకు ప్రత్యగాత్మయందు వృత్తిచెప్పవలసియున్నది.

తా. తత్త్వమస్యాదివాక్యములకు అర్థమును నిస్సంశయముగా తెలియఁజేయుట కొఱకు అహంకారము ఆత్మ కాదని, అన్వయవ్యతిరేకములనే యుక్తులచేత నిరాకరించితిరి. ఆలాగున నిరాకరించుట విరుద్ధముగా నున్నది. ఎందువల్లనంటే 'అహంబ్రహ్మాస్మి' యనెడి వేదాంతవాక్యమునందు శుద్ధచిద్రూపప్రతిపాదకమగు బ్రహ్మపదార్థమును,అహం పదార్థమును రెంటిని సమానాధికరణములుగా ప్రయోగింపఁబడియున్నవి.అహం పదము అనాత్మప్రతిపాదకమైనయెడల, బ్రహ్మపదముతోఁటి సమానాధికరణముగా ప్రయోగించుట యుక్తముకాదుగదా? గనుక అహంపదమునకు చిదాత్మయందు ప్రవృత్తికలదని చెప్పవలసియున్నది గావున, అహంకారమును అనాత్మ యని నిరాకరించుట తగదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. సోచ్యతే ప్రసిద్ధలక్షణా గుణవృత్తిభిః. ౧౧౮

దం-అ. ముఖ్యవృత్తిచేతను, లక్షణావృత్తిచేతను, గుణవృత్తిచేతను ఆప్రవృత్తి చెప్పఁబడుచున్నది.

తా. అహంపదము ముఖ్యవృత్తిచేతను ప్రత్యగాత్మను ప్రతిపాదించుచున్నది; లక్షణావృత్తిచేతను ప్రతిపాదించుచున్నది; గౌణవృత్తిచేతను ప్రతిపాదించుచున్నది. ఈమూఁడువృత్తులచేతను ప్రత్యగాత్మ యేలాగున ప్రతిపాదింపఁబడునో, ఆప్రకారమును నిరూపించుచున్నారము. అందుచేత అహంకారము ఆత్మ కాదని నిరాకరించినందులకు తాత్పర్యము మీకే తెలియునని భావము. ఇచ్చట నీయర్థము తెలియఁదగియున్నది. శబ్దమునకు అర్థమును బోధించెడివ్యాపారము వృత్తియనంబడు. ఆవృత్తి సామాన్యముగా మూఁడు విధములు. ముఖ్యవృత్తియని, లక్షణావృత్తియని, గౌణవృత్తియని. ప్రసిద్ధమైన అర్థమును బోధించునది ముఖ్యవృత్తి. ఇది ఘటాదిశబ్దములయందు గలదు. ప్రసిద్ధార్థముతో సంబంధముగల అర్థమును బోధించునది లక్షణావృత్తి. ఇది జహల్లక్షణ యని, అజహల్లక్షణయని, జహదజహల్లక్షణయాని మూఁడువిధములు. ఇందులో ప్రసిద్ధార్థమును బొత్తిగా నడఁచి ప్రసిద్ధార్థసంబంధము గల యర్థమును మాత్రమే బోధించునది జహల్లక్షణయనంబడు. ఇందుకు దృష్టాంతము. 'గంగాయాం ఘోషః'(గొల్లపల్లె గంగయందున్నది) ఇత్యాదివాక్యములు. ఇచ్చట గం

రించుట న్యాయమైయున్నది. 'అయోదహతి' (ఇనుము కాల్చుచున్నది) అనే ప్రయోగమునందు అయశ్శబ్దమునకు ముఖ్యార్థము ఇనుము. ఇనుమునకు దహించెడిస్వభావము లేనందున అయశ్శబ్దమునకు ఇనుము అర్థము చెప్పదగదు. ఇనుముతో సంబంధించియున్న అగ్ని అర్థమని చెప్పవలయు. ఆప్రకారమే సుషుప్తిదశలో నహంకారము లేనందున అహంశబ్దమున కహంకార మర్థమని చెప్పఁదగదు. అహంకారముతో సంబంధించియున్న చిదాత్మయే అర్థమని చెప్పవలయు. 'అహం బ్రహ్మాస్మి' యనుశాస్త్రీయ వ్యవహారమునందును బ్రహ్మశబ్దముతోటి అహంశబ్దము సమానాధికరింపఁబడుచున్నందునను శుద్ధచిద్రూపమైన బ్రహ్మతోటి జడమైన అహంకారమునకు అభేదము సిద్ధించనందునను, అహంశబ్దమునకు ముఖ్యార్థమును అంగీకరించఁదగదు. గనుక లక్షణావృత్తి నవలంబించి ప్రత్యగాత్మయే అర్థమని చెప్పవలయునని భావము.

అవ. ఇఁకను అహంశబ్దమునకు ప్రత్యగాత్మను గౌణవృత్తిచేత ప్రతిపాదించుచున్నారు.—

శ్లో. ప్రత్యక్త్వా దతిసూక్ష్మత్వా దాత్మదృష్ట్యనుశీలనాత్,
అతోవృత్తి ర్విహాయాన్యా హ్యహం వృత్త్యోపలక్ష్యతే. ౫౫.

దం-అ. ప్రత్యగ్రూపముగా నుండుటవల్లను, మిక్కిలి సూక్ష్మముగా నుండుటవల్లను ఆత్మయనెడిబుద్ధిచేత విచారింపఁబడుచున్నందునను, ఈహేతువులవల్లను ఇతరశబ్దములను విడిచి అహంశబ్దముచేత ప్రతిపాదింపఁబడుచున్నది.

తా. అహంకారము తనకంటే, ఇతరములైన దేహాదులకంటే అంతరమైయున్నది. అహంకారము శబ్దస్పర్శాది శూన్యమైనందున పరమసూక్ష్మమై యున్నది. ఆత్మయున్న అందుచేతనే పరమసూక్ష్మమైయున్నది. అహంకారము ఆత్మయేమోననే బుద్ధిచేత అన్నమయకోశము మొదలుకొని విచారింపఁబడుచున్నది. ఆత్మయున్న అప్రకారమే విచారింపఁబడుచున్నది. గనుక అహంకారమునందుగల గుణములు, ఆత్మయందున్న సంభవించియున్నందున అహంకారమును చెప్పుచున్న అహంశబ్దము గౌణవృత్తినియవలంబించి ఆత్మను చెప్పుచున్నది. ఘటాదులయందుగల గుణము ఆత్మయందు లేనందున ఘటాదిశబ్దము లాత్మను చెప్పఁజాలవని భావము.

అవ. ఇఁకను అంతఃకరణముతోఁగూడియున్న ఆత్మను అహంశబ్దము ముఖ్యవృత్తిచేత ప్రతిపాదించుచున్నదని చెప్పుచున్నారు.—

శ్లో. ఆత్మనా చావినాభావ మథవా విలయం వ్రజేత్,
న తు పక్షాంతరం యాయా దతశ్చాహం ధియోచ్యతే. ౫౬.

దం-అ. ఆత్మతోటి అవినాభావమును (విడిచియుండక పోవుటను) పొందును, లేదా, వినాశమును పొందును. మఱియొకపద్ధతిని పొందదు, గనుక అహంశబ్దముచేతఁ జెప్పఁబడుచున్నది.

తా. అహంకారము తాను ఉండెనేని ఆత్మను విడిచియుండదు. నశించెనేని ఆత్మను విడిచి నశించదు. ఆత్మయందే నశించును. అనఁగా కల్పితములైన వస్తువులు శుక్తిరజతాదులు తమ అధిష్ఠానమందేయుండి అచ్చటనే నశించునుగాని, అధిష్ఠానమును వదలి మఱియొకచోట యుండికిగాని, నాశముగాని లేకయుండునుగదా? ఆప్రకారమే అహంకారమున్ను ఆత్మయందు కల్పింపఁబడినందున, ఆత్మ నాశ్రయించి స్థితి నాశములం పొందునుగాని స్వతంత్రముగా నుండనేరదని యర్థము. గనుక అహంశబ్దము అహంకారవిశిష్టమైన ఆత్మను ముఖ్యవృత్తిచేత చెప్పునని భావము. అహంశబ్దము ముఖ్యవృత్తిచేత అహంకారవిశిష్టమైన ఆత్మను చెప్పును. లక్షణావృత్తి గౌణవృత్తుల చేత శుద్ధమైన ఆత్మను చెప్పును. 'ఘట మహం జానామి' (నేను ఘటము నెఱుంగుదు) ఇత్యాదిలోకవ్యవహారములయందు అహంశబ్దము అంతఃకరణవిశిష్టాత్మను చెప్పును. 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది శాస్త్రీయవ్యవహారములయందు అహంశబ్దము కేవలమాత్మనే చెప్పును. గనుక వాక్యార్థప్రతిపత్తికొఱకు అహంకారము ననాత్మ నిరసించినది. అహంశబ్ద ముఖ్యార్థమునేగాని అహంశబ్ద లక్ష్యార్థమును గాదని పిండితార్థము.

అవ. ఈప్రకారము అహంశబ్దముయొక్క ముఖ్యార్థమును (వాచ్యార్థమును) చెప్పి లక్ష్యార్థమును గనుపఱచెడికొఱకు పూర్వవాదియొక్క ప్రశ్నను చూపించుచున్నారు.—

వాక్య. కీదృక్ పునర్వస్తు లక్ష్యమ్. ౧౨౨

దం-అ. ఎటువంటి పదార్థము లక్ష్యము?

తా. అహంకారవిశిష్టమైన ఆత్మ అహంశబ్దమునకు వాచ్యార్థము. అయితే లక్ష్యార్థము యెటువంటివస్తువుగా నుండును? అని భావము.

అవ. ఉత్తరమును చెప్పుచున్నారు.—

శ్లో. నామాదిభ్యః పరో భూమా నిష్కలోఽకారకో క్రియః,
స ఏవాత్మవతా మాత్మా స్వతస్సిద్ధ స్స ఏవనః. ౫౭. ౧౨౩

దం-అ. నామము మొదలగువాటికంటె విలక్షణమై, వ్యాపకమై, సాధ్యముకానిదై, సాధనములు లేనిదై, క్రియాశూన్యమైన ఆవస్తువే తత్త్వవేత్తలకు లక్ష్యార్థము. ఆయాత్మ మాకు స్వయంప్రకాశమై యున్నది.

తా. ఛాందోగ్యములోని భూమవిద్యలో నామము, ఆశ మొదలగు కొన్ని

పదార్థములు బ్రహ్మయని భావించఁదగినవి కొన్ని చెప్పఁబడియున్నవి. వాటికన్నిటికం టె పైఁగా భూమపదార్థము చెప్పఁబడియున్నది. భూమ యనఁగా బహుళమైన పదార్థము. అనఁగా వ్యాపకమైన వస్తువని యర్థము. భూమపదార్థము క్రియగాని, క్రియాసాధనములుగాని, క్రియాఫలములుగాని, ఇంకా ఇతరవిశేషములుగాని కలది కాదనిన్ని సత్యమనిన్ని చెప్పఁబడియున్నది. అట్టినిత్యమై, నిర్విశేషమై, శుద్ధమైన చిత్స్వరూపమే మాకు 'అహం బ్రహ్మాస్మి' యనువాక్యమునందుగల అహంపదమునకు లక్ష్యార్థము. లోకములో ప్రత్యక్షసిద్ధమైన తీరము గంగాపదమునకు లక్ష్యార్థమైయున్నదికదా? ఆలాగుననే అహంపదమునకు లక్ష్యార్థమైన ఆత్మస్వరూపమున్ను ప్రమాణసిద్ధము కావలదా యని యాక్షేపించఁదగదు. శబ్దముకంటే మఱియొకదానిచేత సిద్ధించినపదార్థము లక్ష్యమగును. తీరము జడమైనందున ప్రమాణాంతరముచేత సిద్ధించవలసిన అవసరము లేదని భావము.

అవ. పూర్వగ్రంథము తాత్పర్యము ననువదించుచు ఉత్తరగ్రంథతాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. అజ్ఞానోత్థబుద్ధ్యాది కర్తృత్వోపాధి మాత్మానం
పరిగృహ్యైవ అన్వయ వ్యతిరేకాభ్యా మహం సుఖీదుః
ఖీ చేత్యహంకారాదే రనాత్మధర్మత్వ ముక్తం కేవలాత్మా
భ్యుపగమే అశక్యత్వాత్ ఫలాభావాచ్చ-అథేదానీంమవి
ద్యాపరికల్పితం సాక్షిత్వ మాశ్రిత్య కర్తృత్వా ద్యశే
ష పరిణామప్రతిషేధా యాహ. ౧౨౪

దం-అ. కేవలమైన ఆత్మ నంగీకరించినయెడల శక్యము కానందువల్లను, ప్రయోజనములేనందువల్లను, అజ్ఞానమువల్లబుట్టిన అంతఃకరణాదులనెడి కర్తృత్వోపాధిగల ఆత్మనంగీకరించి, అన్వయవ్యతిరేకములచేత 'నేను సుఖవంతుఁడను, దుఃఖవంతుఁడ'నని అహంకారము మొదలగుదానికి ఆత్మధర్మత్వములేదని చెప్పఁబడినది. పిదప నిప్పుడు అజ్ఞానముచేత కల్పింపఁబడిన సాక్షిత్వము నాశ్రయించి కర్తృత్వము మొదలగు సకల వికారములను నిషేధించెడిగొఱకు చెప్పుచున్నారు.

తా. కేవలమైన ఆత్మస్వరూపము నిర్దోషమైనందున యుక్తులచేత విచారించుటకుగాని, విచారముచేత నొకప్రయోజనము నచ్చుట కలుగఁజేయుటకుగాని శక్యము గాదు. కనుక అజ్ఞానకల్పిత అంతఃకరణాదుల నుపాధిగా నొందినయాత్మను అనఁగా నంతఃకరణాద్యుపాధికుఁడై ద్రష్టయగు నాత్మను గ్రహించి అన్వయవ్యతిరేకయుక్తు

లను విచారించి 'అహం సుఖీ' ఇత్యాద్యనుభవములచేత కనుపడుచున్న అహంకారసుఖదుఃఖాదులు అనాత్మధర్మములేకాని ద్రష్టయొక్కధర్మములు కావని ఇంతకుముందు గతించినగ్రంథములో చెప్పఁబడినది. అనాద్యజ్ఞానోపాధిచేత కల్పింపఁబడిన సాక్షిత్వముగల ఆత్మను గ్రహించి అన్వయవ్యతిరేకములను కనుపఱచి, కర్తృత్వము మొదలగు సకలవికారములను ఆత్మయందు నిషేధించుటకుగాను ఉత్తరగ్రంథ మారంభింపఁబడుచున్నది. అనఁగా సాక్షియగు నాత్మ సర్వవ్యవహారములయందు ననువర్తించియున్నందున, సాక్ష్యములగు కర్తృత్వాదులు కొన్నివ్యవహారములయందుమాత్ర మనువర్తించి, మఱికొన్నివ్యవహారములయం దనువర్తించక యున్నందునను, కర్తృత్వాదులు సాక్షిధర్మము కావని ప్రతిపాదింపఁబడునని భావము.

శ్లో. ఏష సర్వధియాం నృత్త మవిలుప్తైకదర్శనః,
వీక్షతేఽవీక్షమాణోఽపి నిమిష త్త్వద్ధ్రువోఽద్రువమ్. ౫౮. ౧౨౫

దం-అ. లోపమునుబొందని అద్వితీయమైన చైతన్యమే స్వభావముగల ఈయాత్మ సకలమైన బుద్ధులయొక్క అజడమైన నాట్యమును చూడనివాఁడై నప్పటికి చూచును. తాను నిత్యుఁడైయుండి అనిత్యమైన నాట్యమును చూచును.

తా. ఆత్మ యెప్పటికిని నశించక పరిణామమును పొందక అద్వితీయమైన చైతన్యమే స్వరూపముగాఁగలవాఁడు. ఇట్టి ఆత్మ, జడమగుబుద్ధి నాట్యముచేయుచున్నదానివలె అనేకవిధములుగా పరిణమించుచుండ, నాపరిణామములను సాక్షియైయుండిచూచుచుండును. ఈలాగు చూచుచున్నందున ఒకవికారమును పొందఁడు. ఇదిగాక తాను నిత్యుఁడైయుండి అనిత్యముగానున్న బుద్ధియొక్కనాట్యమును (పరిణామమును) చూచుచుండును. గనుక బుద్ధియొక్క పరిణామముచేత కలుగుచున్నజడములయి, అనిత్యములైయున్నకర్తృత్వాదులు, చిద్రూపమై, నిత్యమైయున్న ఆత్మయొక్క ధర్మములు కావని భావము.

అవ. పూర్వపక్షవాది ఆక్షేపించుచున్నాఁడు.—

వాక్య. నను సర్వసిద్ధాంతానా మపి స్వస్వదృష్ట్యపేక్షయా
ఉపపన్నత్వాత్ ఇతరేతరదృష్ట్యపేక్షయా చ దుస్థితత్వాత్
సిద్ధికత్వాత్ నైకత్రాపి విశ్వాసం పశ్యామః, న చ సర్వ
తార్కికై రదూషిత మసమర్థితం చ, అతః నసర్వతార్కి
కోపద్రవాపసర్పణాయ వర్త్మ సంభావయామః. ౧౨౬

థం-అ. ఓయీ! సకలమైనసిద్ధాంతములకు తమతమ అభిప్రాయములచేత సుప

ప్త్తికలిగియున్నందున పరస్పరాభిప్రాయముచేత నిలువఁజాలని స్థితి కలిగియున్నందునను, ఒకసిద్ధాంతమునందును నమ్మకమును జూడకయున్నాము. అందఱు తార్కికులచేత దూషించఁబడనిదిన్ని, సమర్థింపఁబడనిదిన్ని లేదు. గనుక సకలతార్కికులయొక్క ఉపద్రవమును దాఁటుటకొఱకు మార్గమును తెలియకయున్నాము.

తా. ఈలోకములో నన్నిమతములవారు తమతమమతము నిర్దోషమని అన్యమతములు దుష్టములని తలంచెదరు. అన్నిమతములవారిచే సమ్మతింపఁబడిన విషయము ఒకటియైనను లేదు. అలాగున నుండెనేని దానిని విశ్వసించవచ్చును. గనుక అన్నిమతములవారు చెప్పెడిదూషణములకు చిక్కక తప్పించుకొని పోవుటకు మంచిమార్గమొకటి కలదని యూహించి శక్యమై యుండలేదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. ఉచ్యతే విస్రబ్ధైః సంభావ్యతాం అనుభవమాత్ర
శరణత్వాత్ సర్వతార్కికప్రస్థానానామ్. ౧౨౭

దం-అ. చెప్పఁబడును. సకలమైనతార్కికులయొక్క మార్గములకు అనుభవము మాత్రమే గతిగా నున్నందున నమ్మకముగలవారిచేత సంభావింపఁబడుగాక.

తా. అందఱు తార్కికులకు సమ్మతమైన విషయ మొకటి లేదని చెప్పతగదు. అందఱు తార్కికులు తమకు సమ్మతమైన విషయముల నుపపాదించుటకుగాను అనుభవము నంగీకరించియున్నారు. అనుభవ మనఁగా జ్ఞానము. జ్ఞానమువిషయమై యేమతమువారికిని ప్రతిపత్తిలేదు. అట్టిజ్ఞానమునే మేము ఆత్మయని చెప్పినారము. కనుక మేము చెప్పిన ఆత్మతత్త్వము సర్వతార్కికుల ఉపద్రవమును దాఁటియున్నది.అని నిండావిశ్వాసముకలవారై అంగీకరించవలయునని భావము.

వాక్య. తదభిధీయతే. ౧౨౮

దం-అ. అది చెప్పఁబడును.

తా. జ్ఞానము సర్వతార్కికప్రతిపన్నమని చెప్పెదమని భావము.

శ్లో. ఇమం ప్రాశ్నిక ముద్దిశ్య తర్క జ్వర భృశాతురాః,
త్వాచ్ఛిరస్కవచో జాలైః మోహయంతీతరేతరమ్. ౫౯.౧౨౯

దం-అ. తర్కమనెడి జ్వరముచేత మిక్కిలి బాధింపఁబడుచున్నవాదులు ఈయనుభవము నుద్దేశించి 'త్వాత్' అనుశబ్దము శిరస్సునందుగల యుక్తివాక్యములయొక్క గుంపులచేత నొకరినొకరు మోహింపఁజేయుచున్నారు.

తా. ప్రతితార్కికుఁడున్ను ఒకఅర్థమునందు గుణమునుగాని దోషమునుగాని చెప్పునప్పుడు ముందుగా తమ అనుభవముచేత నిశ్చయించుకొని పిదప నిరూపించెదరు. కనుక అనుభవము గుణదోషములకు సాక్షిగానున్నందున ప్రాశ్నిక మనఁబడును. ఇట్టి ప్రాశ్నికము (అనుభవము)ను తార్కికు లందఱు ముందుగా నొప్పుకొనుచు 'పర్దం రూప త్వాత్ ఇత్యాదిత్వాత్' శబ్ద శిరస్కములగు యుక్తివచనములచేత నొకరినొకరు మోహింపఁజేయుచున్నారు గాని అనుభవము నంగీకరించకయే యుక్తులను చెప్పునది లేదు. కనుక అనుభవము అందఱు తార్కికులచేత అంగీకరింపఁబడియున్నది. అనుభవ మనఁగా జ్ఞానము. జ్ఞానమే ఆత్మస్వరూపము. ఇట్టి యాత్మస్వరూపమునందు అవిశ్వాస మును చేయఁదగదని భావము.

అవ. తిరిగి పూర్వపక్షవాదియొక్క ఆక్షేపమును కనుపఱచుచున్నారు.—

వాక్య. అత్రాపిచోదయంతి, అనుభవాత్మనోపి విక్రియా
భ్యుపగమే అనుభ్యుపగమేపి దోష ఏవ. ౧౩౦

దం-అ. అనుభవరూపమైన ఆత్మకున్ను వికారము నంగీకరించినను అంగీక రించకపోయినను దోషమే కలదు.

తా. ఆత్మ అనుభవరూపమైనప్పటికి ఆయాత్మయందున్ను తార్కికులు వివాద మును పొందుచున్నారు. కొంద ఱాత్మను సవికారుఁడనెదరు. మఱికొందఱు నిర్వికారుఁ డనెదరు. రెండుపక్షములయందున్ను దోషముకలదు. గనుక అన్నిమతములవారికి నిర్వివా దముగా సమ్మతమైనవిషయమే లేదని భావము.

అవ. ఆత్మ నిర్వికారమన్నను, సవికారమన్నను దోషముకలదని చెప్పిన దాని వివరించెదరు.—

వాక్య. యస్మా దాహ. ౧౩౧

దం-అ. ఎందువల్లనంటే చెప్పుచున్నాఁడు.

తా. అనుభవరూపమగు నాత్మకు వికారము నంగీకరించినను, అంగీకరించక పోయినను దోషముకలదని ఏకారణమువల్ల చెప్పినారంటే ఆకారణమును ముందఱి శ్లోకముతో చెప్పుచున్నారని భావము.

శ్లో. వర్షాతపాభ్యాం కిం వ్యోమ్న శ్చర్మ ణ్యేవ తయోః ఫలమ్,
చర్మోపమ శ్చే త్సోఽనిత్యః ఖతుల్య శ్చే దసత్సమః. ౬౦. ౧౩౨

దం-అ. ఆకాశమునకు వర్షముచేతను ఎండచేతను ఏమికలుగును? ఆ రెంటియొక్క

ఫలము చర్మమునందే కలుగును. చర్మముతో సమానుఁడాయెనేని ఆయాత్మ నిత్యుఁడగును. ఆకాశముతో సమానుఁడాయెనేని శూన్యముతో తుల్యుఁడగును.

తా. వికారమును సంపాదించెడికారణ మున్నప్పటికి కొన్నిటికి వికారము కలుగును. మఱికొన్నిటికి వికారము కలుగదు. ఆర్ద్రత్వవికారమును పుట్టించెడివర్షము, శుష్కత్వవికారత్వమును పుట్టించెడిఎండయు కలిగియున్నప్పటికి చర్మమునకే యార్ద్రత్వశుష్కత్వములు కలిగియున్నవి గాని ఆకాశమునకు కలుగలేదుగదా? ఆప్రకారము ఆత్మకు చర్మమునకువలె వికారము కలదా? ఆకాశమునకువలె లేదా? వికారమున్నదంటిరాచర్మమువలె ఆత్మనిత్యుఁడగును. లేదంటిరా, ఆకాశమువలె శూన్యుఁడగును. శూన్యమైనయెడల ప్రపంచప్రతిభాసమే లేకపోవును. అని ఈలాగున తార్కికులయొక్క వివాదము ఆత్మయందున్ను కలదని భావము.

అవ. ఈశ్లోకార్థమును వివరించుచున్నారు.—

శ్లో. బుద్ధిజన్మని పుంసశ్చ వికృతి ర్య ద్యనిత్యతా,
అథా వికృతిరేవాయం ప్రమాతేతి న యుజ్యతే. ౬౧. ౧౩౩

దం-అ. జ్ఞానము పుట్టినప్పుడు పురుషునకు (ఆత్మకు) వికారముకలిగెనేని అనిత్యత్వము సంభవించును. అటుగాక వికారము లేకయుండెనేని ఆత్మ, ప్రమాత యని చెప్పుట యుక్తముకాదు.

తా. ఆత్మకు ఘటాదివస్తువులవిషయముగా నొకజ్ఞానము అప్పుడప్పుడు కలుగుచుండునుగదా? ఆజ్ఞానము కలుగునప్పుడు పూర్వస్థితికంటె యత్కించిద్విశేషము ఆత్మకు కలుగునా? కలుగదా? కలుగునంటిరా, ఆత్మవికారము కలవాఁడైనందున అనిత్యమని చెప్పవలయును. కలుగదంటిరా ప్రమాతృత్వము సంభవించదు. ప్రమాతృత్వ మనఁగా ప్రమాణముచేత బుట్టినజ్ఞానమున కాశ్రయమై యుండుట. ఇట్టి జ్ఞానాశ్రయత్వములేనిచో నాత్మ ఘటాదివిషయముల నేలా గెఱుంగును? అని ఈలాగంటివివాదములు అనుభవమందుకూడఁగలదు. కనుక అనుభవము సర్వతార్కికోపద్రవాతీత మని చెప్పుటకు శక్యముకాదని భావము.

అవ. సిద్ధాంతవాది ప్రతిబంధకముగా నుత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. అస్య పరిహారః. ౧౩౪

దం-అ. దీనికి పరిహారము.

తా. ఈలాగున పూర్వవాదిచేసిన యాక్షేపమునకు పరిహారమును చెప్పుచున్నారని భావము.

శ్లో. ఊర్ధ్వం గచ్ఛతి ధూమే ఖం భిద్యతే స్విన్నభిద్యతే,
నభిద్యతేచేత్ స్థాస్నుత్వం భిద్యతేచేత్ భిదాస్యకా. ౬౨. ౧౩౫

దం-అ. పొగ పైకిఁబోవునపుడు ఆకసము భేదింపఁబడునా? లేక భేదింపఁబడదా? భేదింపఁబడకపోయెనేని ధూమమునకు స్థిరత్వము గలుగును. భేదింపఁబడెనేని ఈయాకాశముయొక్క అభేదము ఎటువంటిది?

తా. భూమిమీఁదినుండి పొగ ఊర్ధ్వమునకు బోవునుగదా? అప్పు డాకాశము ధూమము పైకిఁబోవుటకు తగిన అవకాశము నిచ్చునా? ఇయ్యదా? ఇయ్యదంటిరా, ధూమము పైకిఁబోవుటకు వీలులేక భూమిమీఁదనే స్థిరముగా నిలిచియుండును. అవకాశము నిచ్చునంటిరా ఆయవకాశ మెటువంటిదిగా నుండును? ధూమము పైకిపోకముందు ఆకాశ మెటువంటిదిగా నుండెనో అటువంటిస్థితికంటె విశేషస్థితి ఆకాశమునందు ధూమము పైకిపోవునప్పుడున్ను కనుపడనందున ఆకాశముచేత నియ్యఁబడెడి అవకాశము నిరూపింప శక్యమై యుండదు. గనుక ఆకాశము స్వరూపముచేతనే అవకాశస్వరూపముగా నున్నదని చెప్పవలయునని భావము.

అవ. ఆకాశదృష్టాంతమును చెప్పినందున ప్రకృతమందు పూర్వవాదిచేసిన ఆక్షేపమునకు ఏమిపరిహారము వచ్చినదంటే చెప్పుచున్నారు.—

వాక్య. ఇత్యేతత్ప్రతిపత్త్యర్థ మాహ. ౧౩౬

దం-అ. ఈలాగంటి ఈయర్థమును తెలియుటకొఱకు చెప్పుచున్నారు.

తా. ఆకాశమను ప్రతిబందిగా చెప్పినందున యేయర్థము సిద్ధించెనో ఆయర్థమును తెలియఁజేయుచున్నారని భావము.

శ్లో. ఆవిక్రియస్య భోక్తృత్వం స్యా దహం బుద్ధి విభ్రమాత్,
నౌ యాన విభ్రమాద్యద్వ న్నగేషు గతికల్పనమ్. ౬౩. ౧౩౭

దం-అ. ఓడయొక్క గమనముచేత గలిగినభ్రమవల్లను, వృక్షములయందు గమనకల్పన మెటువలెనో అటువలెనే యావికారుఁడైన ఆత్మకు అహంకారముచేత గలిగినభ్రాంతివల్లను భోక్తృత్వము గలుగును.

తా. ఓడమీఁద యెక్కిపోవునప్పుడు ఓడయొక్కగమనముచేత నేత్రముల కొకభ్రాంతికలిగి, అందువలన దరియందున వృక్షములు నడుచుచున్నట్టు కల్పింపఁబడును. ఆప్రకారమే ఆత్మ స్వతఃవికారశూన్యుఁడైనప్పటికి అహంకారముయొక్క సంబంధముచేత కలిగెడిభ్రాంతివలన సుఖదుఃఖాదిభోక్తృత్వమును తనయందు కల్పించుకొనును. గనుక నాత్మకు ప్రమాతృత్వ, కర్తృత్వ, భోక్తృత్వాది వికారములు వాస్తవముగా

నెప్పటికిని లేవని భావము. ఆత్మయొక్క సవికారత్వనిర్వికారత్వములనుగూర్చి తార్కికులు వివాదమును పొందుచున్నారుకాని ఆత్మస్వరూపమునుగూర్చి వివాదమును పొందుటలేదు. చార్వాకులున్ను ఆత్మ కలదని యంగీకరించి అది దేహముకంటే భిన్నమా? అభిన్నమా? యని విచారించుచున్నారు. గనుక అనుభవరూపమైన ఆత్మ సర్వతార్కికులయొక్క వివాదములకు గోచరించక సంప్రతిపన్నమై యున్నదని భావము.

అవ. పరమాత్మ తాను నిర్వికారుఁడుగానే యుండి అహంకారాదిద్వైతప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నాఁడుగాని వికారమును బొందుటలేదని చెప్పినందుకుమఱియొకదృష్టాంతమును చెప్పుచున్నారు.—

వాక్య. యథోక్తార్థావిష్కరణాయ దృష్టాంతాంతరోపాదానమ్.

దం-అ. ఇదివఱకుచెప్పిన అర్థమును ప్రకటించెడికొఱకు మఱియొకదృష్టాంతము గ్రహింపఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. యథా జాత్య మణేః శుభ్రా జ్వలంతీ నిశ్చలాశిఖా,
సన్నిధ్య సన్నిధానేషు ఘటాదీనా మవిక్రియా. ౬౪. ౧౩౯

దం-అ. జాతియందుబుట్టిన మాణిక్యముయొక్క స్వచ్ఛమై, ప్రకాశించునదియై, చలించనిదియైయున్న అగ్రము ఘటాదులయొక్క సన్నిధానమునందుగాని, అసన్నిధానమునందుగాని వికారములేనిదై యెటువలెనుండునో అటువలెనే యాత్మయును అని శేషము.

తా. మంచిజాతియందు జన్మించిన మాణిక్యముయొక్కకాంతి తనచేత ప్రకాశింపఁజేయఁబడెడి ఘటాదిపదార్థములు ఉన్నా, లేకపోయినా, ఒకటేవిధముగా నుండునుగాని, కొంచెము విశేషమైనను పొందదుగదా? అటువలెనే ఆత్మయున్ను అహంకారాదిప్రపంచము కలిగియున్న కాలమందుకాని లేనికాలమందుకాని ఏకరూపముగా నుండును. వికారమును పొందుటలేదు.

అవ. ఓయీ! మాణిక్యముయొక్కశిఖ (అగ్రము) తేజోమాత్రలయొక్క పరిణామమైనందున ఘటాదులవలె సవికారమేగాని నిర్వికారముగాదని కొందఱు శంకించెదరని తలంచి మాణిక్యశిఖాదృష్టాంతముతో దార్ష్టాంతికమున కుపయుక్తముగా వివక్షితమైన యర్థమును చెప్పుచున్నారు.—

వాక్య. అయమత్రాంశో వివక్షిత ఇతి జ్ఞాపనా యాహ. ౧౪౦

దం-అ. ఈదృష్టాంతమందు వివక్షితమైనభాగము ఇదియని తెలియచేయుటకొఱకు చెప్పుచున్నారు.

తా. స్పష్టము.

శ్లో. యదవస్థా వ్యనక్తీతి తదవస్థైవ సా పునః,
భణ్యతే న వ్యనక్తీతి ఘటాదీనా మసన్నిధౌ. ౬౫. ౧౪౧

దం-అ. అది యేస్థితికలదై ప్రకాశింపఁజేయుచున్నదని చెప్పఁబడుచున్నదో ఆస్థితి కలదై యుండియేసుమా ఘటాదులయొక్క అసన్నిధానమునందు ప్రకాశింపఁజేయలేదని చెప్పఁబడుచున్నది.

తా. మాణిక్యశిఖ యెటువంటిస్థితికలదైయుండి ఘటాదులను ప్రకాశింపఁజేయుచున్నదని చెప్పఁబడుచున్నదో, అటువంటిస్థితికలదై యుండియే ఘటాదులను ప్రకాశింపఁజేయలేదని చెప్పఁబడుచున్నదిగాని, ఘటాదులను ప్రకాశింపఁజేయునప్పు డొకవిధముగానుండి ప్రకాశింపఁజేయనప్పుడు మఱియొకవిధముగానుండునది కాదుగదా? ఆప్రకారమే ఆత్మయున్ను ఘటాదివిషయములను ప్రకాశింపఁజేయునప్పుడున్ను, ప్రకాశింపఁజేయనప్పుడున్ను ఒకటేవిధముగా నుండును. ఇదియే మాణిక్యశిఖాదృష్టాంతమునందు దార్ష్టాంతికమునకు ఉపయోగముగా చెప్పిన అంశముగాని పరిణామాది వికారాంశము గాదు. గనుక ఆత్మకు సర్వవిక్రియాశూన్యత్వము సిద్ధమని భావము.

అవ. దృష్టాంతములో చెప్పినఅర్థమును దార్ష్టాంతికమునందు కనుపఱచుచున్నారు-

వాక్య. తత్రచ.

శ్లో. సర్వధీ వ్యంజక స్తద్వ త్పరమాత్మా ప్రదీపకః,
సన్నిధ్య సన్నిధానేషు ధీవృత్తీనామ విక్రియః. ౬౬. ౧౪౨

దం-అ. అందులో, ప్రకాశస్వరూపుఁడైన పరమాత్మయున్ను అటువలెనే బుద్ధివృత్తులయొక్క సన్నిధానమునందును,అసన్నిధానమునందును వికారరహితుఁడై సకలమైన బుద్ధివృత్తులను ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

తా. మాణిక్యశిఖవలె ప్రకాశరూపుఁడైన పరమాత్మయున్ను అంతఃకరణవృత్తులు కలిగియుండినను, లేకపోయినను తాను నిర్వికారుఁడైయుండు సకలాంతఃకరణవృత్తులను ప్రకాశింపఁజేయుచుండు నని భావము.

అవ. ఈయర్థమునే వివరించుచున్నారు.——

శ్లో. నప్రకాశక్రియా కాచి దస్య స్యాత్మని దృశ్యతే,

ఉపచారాత్ క్రియా సాస్య యః ప్రకాశ్యస్య సన్నిధిః. ౬౭

దం-అ. ఈచిదాత్మకు తనయందు ప్రకాశక్రియ యనునది యొకటిలేదు. ప్రకాశింపఁబడెడి వస్తువుయొక్క సన్నిధాన మేదికలదో అదియే ఈయాత్మకు ప్రకాశక్రియ అని ఉపచారముగా చెప్పఁబడుచున్నది.

తా. ఆత్మ నిత్యనిర్వికారుఁడైనందున ఆయాత్మయందు ప్రకాశక్రియకలదని చెప్పకూడదు. ప్రకాశక్రియ కలదనిచెప్పెడిచో క్రియ కాశ్రయమైనందున కర్తృత్వము కలవాఁడని చెప్పవలయును. అందువలన ఆత్మ సవికారుఁడగును. అయితే ఆత్మయందుప్రకాశక్రియలేనిచో 'ప్రకాశయతి' ప్రకాశింపఁజేయుచున్నాఁడని కర్తృత్వమేలాగున వ్యవహరింపఁబడుచున్నదంటే, ప్రకాశింపఁజేయఁబడెడివస్తువులు సమీపించినందున ఉపచారముగా ప్రకాశింపఁజేయుచున్నాఁడని కర్తృత్వము చెప్పఁబడుచున్నదిగాని ముఖ్యముగాలేదు. సూర్యుఁడు సతతప్రకాశముకలవాఁడైనప్పటికి ప్రకాశింపఁజేయఁదగినవస్తువులు సంబంధించినప్పుడు సూర్యుఁడు ప్రకాశింపఁజేయుచున్నాఁడని ప్రకాశక్రియాకర్తృత్వము సూర్యునియం దుపచారముగా వ్యవహరింపఁబడునటుల నాత్మయందు నుపచారముగా వ్యవహరింపఁబడుచున్నదని భావము.

అవ. ఓయీ! ఆత్మకానివస్తువే (ప్రధానమే) సంసారమును పొందుచున్నది కాని ఆత్మపొందలేదు. ఆత్మ అయితేనో చిన్మాత్రస్వరూపము. అది సకలబుద్ధివృత్తులకు సాక్షిగానుండి సకలసంసారధర్మములను (సుఖదుఃఖాదులను) అతిక్రమించి కేవలుఁడై యుండునని సాంఖ్యమతములో చెప్పఁబడియున్నది. నీవున్ను ఆయర్థమునే ప్రతిపాదించుచున్నావు. గనుక సాంఖ్యసిద్ధాంతమునే నీవు స్వసిద్ధాంతముగ నంగీకరించితివా? యని పూర్వవాదిచేసిన యాక్షేపమును అనువదించి దూషించుచున్నాఁడు.-

వాక్య. మైవం శంకిష్ఠా సాంఖ్యరాద్ధాంతోయమితి. ౧౨౨

దం-అ. ఇది సాంఖ్యసిద్ధాంతమని ఈలాగున శంకించవలదు.

వాక్య. యతః.

శ్లో. యథా విశుద్ధ ఆకాశే సహసై వాభ్రమండలమ్,
భూత్వా విలీయతే తద్వత్ ఆత్మనీహాఖిలం జగత్. ౬౮. ౧౨౫

దం-అ. ఎందువల్లనంటే, స్వచ్ఛమైన ఆకాశమునందు శీఘ్రముగానే మేఘమండలము యెటువలె పుట్టి లయించుచున్నదో, ఆటువలెనే ఈయాత్మయందు సకల ప్రపంచమున్ను పుట్టి లయించును.

తా. అతిస్వచ్ఛమైన ఆకాశమునందు ఇంద్రజాలికునియొక్క మాయచేతవిద్యుల్లతాళని 'నిర్ఘోషఘుంఘుంఘూవాయుభీషణం'బైన ఘనఘనాఘనమండలం బాకస్మికంబుగా నొక్కనిమిషంబులో నావిర్భవించి లయంబునొందునో, ఆలాగుననే నిత్యనిర్వికారుండైన చిదాత్మయం దీప్రపంచంబంతయు ననాద్యజ్ఞానంబుచే నావిర్భవించి లయంబునొందుచుండును. ఇది మాసిద్ధాంతంబు. సాంఖ్యు లీవిధంబుగాఁ జెప్పరు. సత్వరజస్తమోగుణాత్మకమై ప్రధాన మొకటికలదని, అదియే ప్రపంచమునకు కారణమని అది అచేతనమైనప్పటికి స్వతంత్రముగా ప్రపంచమును రచించునని ప్రపంచము పరమార్థమనిన్ని చెప్పుచున్నారు. ఇది మాకు సమ్మతంబుకాదు. గనుక సాంఖ్యులకు మాకు చాలావైషమ్యముగలదని భావము.

అవ. శ్లోకములో 'భూత్వావిలీయతే' (పుట్టి లయించును) అని చెప్పినందున ద్వైతప్రపంచము లయించకముందు ఆత్మను సంబంధించునని తోఁచును. అట్టిసందేహమును నిరసించెడికొఱకు చెప్పుచున్నారు.—

వాక్య. తస్మాదేషకూటస్థః నద్వైతం మనాగపి స్పృశతి, యతః. ౧౮౬

దం-అ. కనుక నిత్యనిర్వికారుఁడైన యీఆత్మ ద్వైతప్రపంచమును కొంచెముగానైనను స్పృశించఁడు.

తా. ఈచిదాత్మ నిత్యనిర్వికారుఁడైనందున ద్వైతప్రపంచమును లేనికాలమునందువలె, ఉన్నకాలమునందుగూడా నాప్రపంచముతోటి సంబంధముకలిగియుండఁడని భావము.

అవ. అందుకు కారణమును ప్రశ్నరూపకముగా నిరూపించుచున్నారు.—

శ్లో. శబ్దాద్యాకారనిర్భాసాః క్షణప్రధ్వంసినీః దృశా,
నిత్యోక్రమదృగాత్మైకో వ్యాప్నోతీవ ధియోఽనిశమ్. ౭౯.

దం-అ. ఎందువల్లనంటే నిత్యుఁడై నిత్యజ్ఞానస్వరూపుఁడైన ఒక్కఁడే శబ్దాదిస్వరూపములను ప్రకాశింపఁజేయుచున్న నిమిషములో నశింపఁజేయుచున్న బుద్ధులను జ్ఞానముచేత నిరంతరము వ్యాపించియుండును.

తా. ఆత్మస్వరూపము యెప్పటికి నశించక నిత్యమైయుండును. ఇదిగాక యెప్పటికి సంకోచవికాసములులేక యేకకాలమునందే సర్వార్థములను ప్రకాశింపఁజేయు సామర్థ్యముగల చైతన్యమే స్వరూపముగాగలిగి అద్వితీయమైయుండును. ఇట్టియాత్మ శబ్దాదివిషయములను తెలియఁజేయుచు ఉత్పత్తివినాశములు కలిగియున్న బుద్ధివృత్తులను, తనయొక్క స్వరూపజ్ఞానముతోటి సర్వకాలములయందును వ్యాపించియుండును.

గనుక నీయాత్మ సకలభేద ప్రపంచముయొక్క స్పర్శములేనివాఁడైయుండునని భావము. జ్ఞానస్వరూపంబైన ఆత్మ, సర్వకాలములయందు నేకరూపంబుగా వ్యాపించియున్నందున ప్రపంచములేనికాలమందువలె, ఉన్న కాలమందున్ను ప్రపంచస్పర్శము లేనివాఁడే నని తాత్పర్యము.

అవ. ఆత్మ స్వరూపము నిత్యనిర్వికారమై యుండెనేని ఘటాదిజ్ఞానరూపముగా పరిణమించునది యేది? యని శంకించఁగా సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. ఏవంచ సతి బుద్ధేః పరిణామిత్వం యుక్తమ్. ౧౪౮

దం-అ. ఈలాగుననుండఁగా బుద్ధికి పరిణామము యుక్తము.

తా. ఆత్మ నిత్యనిర్వికారుఁడైయున్నందున పరిణామము (ఘటాదివిషయరూపముగా వికారమునొందుట) కలవాఁడు కాఁడు. కనుక ఘటాదివిషయాకారముగా పరిణామము బుద్ధికి (అంతఃకరణమునకే) కలదని చెప్పుట యుక్తముగ నున్నదని భావము.

అవ. బుద్ధికే పరిణామముకలదని చెప్పినందుకు కారణమును కనుపఱుచుచున్నారు.—

శ్లో. అతీతానాగతే హ్యర్థాన్ యుగపత్సర్వగోచరాన్,
వేత్త్యాత్మవన్నధీర్యస్మాత్తే నేయం పరిణామినీ. ౭౦. ౧౪౯

దం-అ. భూతభవిష్యద్వర్తమానకాలగతములగు సర్వవిషయములను, బుద్ధి ఆత్మవలె ఏకకాలమందు యేకారణమువల్ల తెలియఁజాలదో ఆ కారణముచేతనే ఈబుద్ధి పరిణామముకలది.

తా. చిద్రూపమైన ఆత్మ సర్వదా సర్వవ్యాపకమైయున్నందున భూతకాలంబున గలించిపోయిన ఘటాదివిషయములను, భవిష్యత్కాలమున రాబోవువిషయములను, వర్తమానకాలమున కలిగియుండువిషయములను అన్నిటిని ఒక్కటేపర్యాయము ప్రకాశింపఁజేయును. అంతఃకరణము ఆలాగున ప్రకాశింపఁ జేయఁజాలదు. వర్తమానకాలమందు తనకెదురుగానున్న విషయములను మాత్రము ప్రకాశింపఁజేయును. అనఁగా ఘటము బుద్ధికి గోచరించినప్పుడు పటము గోచరించదు. పటము గోచరించినప్పుడు ఘటము గోచరించదు. గనుక బుద్ధి క్రమముగా విషయములను ప్రకాశింపఁజేయునని అర్థము ఇందువల్లనే బుద్ధికేఘటాదిజ్ఞానరూపముగా పరిణామము కలిగియున్నదని, ఆత్మకు లేదని నిశ్చయించినారమని భావము.

అవ. ఫలితార్థమును చెప్పుచున్నారు.—

వాక్య. తతశ్చైతత్సిద్ధమ్. ౧౫౦

దం-అ. అందువలన ఈయర్థము సిద్ధించినది.

తా. ఆత్మపరిణామములేనివాఁడని, బుద్ధి పరిణామము లేనివాఁడని నిశ్చయించి నందున ఈముందుచెప్పఁబోవు అర్థము సిద్ధించినదని భావము.

శ్లో. అపశ్యన్ పశ్యతీం బుద్ధి మశృణ్వం శృణ్వతీం తథా,
నిర్యత్నోఽవిక్రియోఽనిచ్ఛన్ ఇచ్ఛంతీం చాప్యలుప్తదృక్. ౭౧.

దం-అ. ఆత్మ తాను చూడనివాఁడైయుండి చూచుచున్నబుద్ధినిచూచును. తాను విననివాఁడైయుండి వినుచున్నబుద్ధిని చూచును. తాను ప్రయత్నములేనివాఁడై, వికారములేనివాఁడై, నిత్యజ్ఞానస్వరూపుఁడైయున్న ఆత్మ, తాను ఇచ్ఛయించనివాఁడైయుండి ఇచ్ఛయించుచున్న బుద్ధిని చూచును. ఇచ్చట 'పశ్యతి' (చూచును) అనెడిపదమును ఆయిదవశ్లోకమునందుండి తెచ్చి యన్వయించుకొనవలయు.

శ్లో. ద్విషంతీ మద్విష న్నాత్మా కుప్యంతీం చాప్యకోపనః,
నిర్దుఃఖో దుఃఖినీం చైవ నిస్సుఖః సుఖినీ మపి. ౭౨. ౧౫౨

దం-అ. ఆత్మ తాను ద్వేషములేనివాఁడైయుండి ద్వేషమును పొందుచున్నబుద్ధిని చూచుచుండును. తాను కోపములేనివాఁడై యుండి కోపముగలిగియున్న బుద్ధిని చూచుచుండును. తాను దుఃఖములేనివాఁడైయుండి దుఃఖముగలిగియున్నబుద్ధిని చూచుచుండును. తాను సుఖములేనివాఁడైయుండి సుఖముగలిగియున్నబుద్ధిని చూచుచుండును.

శ్లో. అముహ్యమానో ముహ్యంతీం కల్పయంతీ మకల్పయన్,
స్మరంతీ మస్మరంశ్చైవ శయానా మస్వపన్ ముహుః. ౭౩. ౧౫౩

దం-అ ఆత్మతాను మోహమును పొందనివాఁడైయుండి మోహమును పొందుచున్నబుద్ధిని చూచుచుండును. తాను కల్పించనివాఁడైయుండి కల్పించుచున్న బుద్ధిని చూచుచుండును. తాను స్మరించనివాఁడైయుండి స్మరించుచున్నబుద్ధిని చూచుచుండును. తాను నిద్రించనివాఁడైయుండి మాటిమాటికి నిద్రించుచున్నబుద్ధిని చూచుచుండును.

శ్లో. సర్వాకారాం నిరాకారః సార్థో ఽస్వార్థాం నిరింగనః,
నిస్త్రికాలః త్రికాలస్థాం కూటస్థః క్షణభంగురామ్. ౭౪. ౧౫౪

దం-అ. ఆత్మతాను ఆకారరహితుఁడైయుండి అన్నియాకారముల నొందుచున్న బుద్ధిని చూచుచుండును. తాను స్వతంత్రుఁడై నిశ్చలుఁడైయుండి పరతంత్రమైయున్న బుద్ధిని చూచుచుండును. తానుమూఁడుకాలములయందును సంబంధములేనివాఁడైయుండి కాలత్రయసంబంధముకలిగియున్నబుద్ధిని చూచుచుండును. తాను నిత్యనిర్వికారుఁడై

యుండి ప్రతిక్షణమునందును వికారమునుపొందుచున్న (పరిణామమును పొందుచున్న) బుద్ధినిచూచుచుండును. ఇచ్చట ఆత్మ అసంగస్వభావుఁడైనందున కాలత్రయసంబంధము లేనివాఁడని చెప్పఁబడినది.

శ్లో. నిరపేక్షశ్చ సాపేక్షాం పరాచీం ప్రత్యగద్వయః,
సావధిం నిర్గతే యత్తః సర్వదేహేషు పశ్యతి. ౨౫. ౧౫౫

దం-అ. ఆత్మ తాను ఒక యపేక్ష లేనివాఁడైయుండి యితరముల నపేక్షించుచున్న బుద్ధిని చూచుచుండును. తాను అన్నిటికంటె లోపలనుండి, అద్వితీయుఁడైయుండి తనకంటె వెలుపలనున్నబుద్ధిని చూచుచుండును. తాను పరిచ్ఛేదములేనివాఁడైయుండి పరిచ్ఛేదముకలబుద్ధిని సకలదేహములయందు చూచుచుండును. ఇచ్చట ఆత్మ స్వయంప్రకాశుఁడైనందున నిరపేక్షుఁడని, బుద్ధి ఆత్మాధీనప్రకాశముకలదైనందున సాపేక్షమని చెప్పఁబడినది.

తా. ఆత్మ తాను దర్శన శ్రవణ ప్రయత్నేచ్ఛా ద్వేష కోప దుఃఖ సుఖ మోహ కల్పనాస్మరణ నిద్రారూప పారతంత్ర్య త్రికాలసంబంధ ప్రతిక్షణవినాశిత్వాదిదోషములు కొంచెమైనను లేనివాఁడై యీచెప్పినసర్వదోషములను పొందుచు సర్వశరీరములయందు వేర్వేఱుగా ప్రవర్తించుచున్నబుద్ధిని, తానొక్కఁడై యుండి సర్వకాలములయందుసాక్షిగా చూచుచుండునని అయిదుశ్లోకములకు సముదాయతాత్పర్యము.

అవ. ఆత్మ సుఖదుఃఖాదివికారములకు సాక్షియైయున్నందున సుఖదుఃఖాదివికారరూపముగా పరిణమించువాఁడు కాఁడని చెప్పుచున్నారు.—

వాక్య. ఏతస్మాచ్చ కారణా దయమర్థో వ్యవసీయ్యతామ్. ౧౫౬

దం-అ. ఈహేతువువలన నీయర్థము నిశ్చయింపఁబడుగాక.

తా. ముందఱిశ్లోకము చెప్పఁబోవు హేతువునుబట్టి ముందుచెప్పఁబడు అర్థమును నిశ్చయించవలయునని భావము.

శ్లో. దుఃఖీ యది భవే దాత్మా కస్సాక్షీ దుఃఖినోభవేత్,
దుఃఖినః సాక్షితాఽయుక్తా సాక్షిణో దుఃఖినా తథా. ౨౬. ౧౫౭

దం-అ. ఆత్మ తాను దుఃఖముకలవాఁడే యైనయెడల ఆదుఃఖముకలవానికి సాక్షి యెవ్వఁడగును? దుఃఖముకలవానికి సాక్షిత్వముయుక్తమైనదికాదు. సాక్షికి దుఃఖముకలిగియుండుటయు ఆప్రకారమే యుక్తమైనదికాదు.

తా. ఆత్మకే దుఃఖముకలదని చెప్పెడిచో నితఁడు దుఃఖము ననుభవించుచున్నాఁడని తెలిసికొని చూచువాఁడు మఱియొకఁడు లేకపోవును. ఎందువల్లనంటే ఆత్మ

యొక్కఁడే జ్ఞానస్వరూపుఁడు. ఆత్మకంటె ఇతరములన్నియు జడస్వరూపములు. జడస్వరూపములను ఆత్మయే చూచుచుండును. జడము లాత్మను చూడఁజాలవు గనుక ఆత్మకే దుఃఖముకలిగినచో దీనిని జూచునట్టిసాక్షి మఱియొకటి లేదని యర్థము. ఆత్మయొక్క దుఃఖిత్వమును చూచునట్టిసాక్షి లేనియెడల ఆత్మకు దుఃఖముకలదని నిశ్చయించుట సాధ్యము కాదు. ఆత్మ తానే తన దుఃఖమునకు సాక్షియని యంటిరా, అది విరుద్ధము. సాక్షిగా నుండువానికి దుఃఖిత్వమును, దుఃఖము గలవానికి సాక్షిత్వమును చెప్పుట న్యాయము కాదు. లోకములో నిద్దఱు జగడమాడి జయాపజయములనొంది వాటివలన సుఖదుఃఖములను పొందుచుండఁగా ఆసుఖదుఃఖములను తానుపొందక నిర్వికారుఁడై చూచువాఁడేకదా సాక్షియనంబడు? సుఖదుఃఖముల నొందినవారలు సాక్షియని చెప్పఁబడరు కదా? ఆప్రకారమే ఆత్మ, తానే సాక్షియైనయెడల దుఃఖికాకయుండును. దుఃఖియైనయెడల సాక్షిగాకయుండును. కనుక ఆత్మ దుఃఖి అయినయెడల సాక్షిలేకపోవును. అందువలన ఆత్మ, దుఃఖియని తెలియుట దుర్లభమైయుండుంగావున, ఆత్మ సుఖదుఃఖాది వికారరూపముగాఁ బరిణమించువాఁడు కాఁడని భావము.

అవ. ఉత్తరశ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. పూర్వస్యైవ వ్యాఖ్యానార్థ మాహ. ౧౫౬

దం-అ. పూర్వముచెప్పిన అర్థమునకే వ్యాఖ్యానముకొఱకు చెప్పుచున్నాఁడు.

తా. ఇదివఱకుచెప్పిన ఆత్మయొక్క అవికారిత్వమును విస్పష్టముగా ప్రతిపాదించుచున్నామని భావము.

శ్లో. నర్తేస్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః,
ధీవిక్రియాసహస్రాణాం సాక్ష్యతోఽహ మవిక్రియః. ౭౭. ౧౫౭

దం-అ. వికారమునువిడిచి దుఃఖముకలవాఁడు కాఁడు. వికారముగలవానికి సాక్షిత్వము ఏది? బుద్ధియొక్క అనేకవికారములకు సాక్షియైన నేను, అందువల్లనే వికారములు లేనివాఁడను.

తా. దుఃఖముకలిగియుండుట అనఁగా వికారముకలిగియుండుటయేగదా? వికారము ఆత్మకు లేనియెడల దుఃఖిత్వము సంభవించదు. ఆత్మకు వికారముకలిగియుండెనేని సాక్షిత్వము సంభవించదు. బుద్ధియందు ప్రతిక్షణము సంభవించుచున్న సుఖదుఃఖరాగద్వేషాదివికారములకు నేను సాక్షిగానున్నాను. ఇందువల్లనే నేను సర్వవికారరహితుఁడనని భావము.

అవ. ఈప్రకారముగా చెప్పఁబడిన ఆత్మయొక్క సర్వవికారరాహిత్యము కేవల

యుక్తిచేతనే సిద్ధించినదికాదు. ఆత్మవేత్తలయొక్క అనుభవముచేతకూడా సిద్ధించుచున్నదని చెప్పుచున్నారు.—

వాక్య. ఏవం సర్వస్మిన్ వ్యభిచారిణ్యాత్మవ స్త్వేవ అవ్యభి
చారీ త్యనుభవతో వ్యవస్థాపనా యాహ. ౧౬౦

దం-అ. ఈప్రకారము అంతయు వ్యభిచారముకలదైయుండఁగా, ఆత్మవస్తువే వ్యభిచారములేనిదై యుండునని అనుభవముచేత నిర్ణయించుటకొఱకు చెప్పుచున్నాఁడు.

తా. ఆత్మకంటె ఇతరములైనవిషయములన్నియు నొకకాలమునందుండి మఱియొకకాలమునందు లేకపోవునుగాని, ఆత్మమాత్రము సర్వకాలములయందు నేకరూపముగానుండును. ఈయర్థమును స్వానుభవముచేతకూడా ప్రతిపాదించెదమని భావము.

శ్లో. ప్రమాణ తన్నిభేష్వస్యా నోచ్ఛిత్తి ర్మమసంవిదః,
మత్తోఽన్యద్రూప మాభాతి య త్తత్ స్యాత్ క్షణభంగిహి. ౭౮.

దం-అ. ప్రమాణములు, ప్రమాణాభాసములును నశించుచున్నను, జ్ఞానస్వరూపుఁడనైన ఈ నాకు వినాశములేదు. నాకంటే మఱియొకవస్తువు యేది ప్రకాశించుచున్నదో, అది నిమిషములో నశించునుకదా?

తా. ప్రమాణములనఁగా ఘటాదివస్తువులనురూపముగా బుట్టుచున్న అంతఃకరణవృత్తులు. ప్రమాణాభాసములనఁగా శుక్తి రజత, మరుమరీచికాజల, రజ్జుసర్పాదిరూపముగా బుట్టుచున్న అంతఃకరణవృత్తులు. ఇవి యావత్తు బుద్ధివృత్తుల కుపలక్షణము. బుద్ధియందు ఆయావస్తురూపముగా బుట్టుచున్నవికారములు యావత్తు ప్రతిక్షణమందు మాఱిపోవుచున్నవి. ఇది మనకందఱకు అనుభవసిద్ధమేకదా? ఈవృత్తులయం దన్నింటియందు వ్యాపించియుండి, వృత్తులను వాటికి గోచరించుచున్న ఘటాదిపదార్థములను ప్రకాశింపఁజేయుచున్న జ్ఞానస్వరూపమైన ఆత్మ మాఱిపోవుటలేదు. అనఁగా సుఖదుఃఖాదివృత్తులు పుట్టి నశించుచున్నవిగాని ఆత్మ నశించుటలేదని యర్థము. గనుక జ్ఞానస్వరూపమైన నా(ఆత్మ)కంటే వేఱుగా యేవస్తువుకలదో అదియంతయు నశించునుగాని నేను (ఆత్మ)మాత్రము నశించుటలేదని భావము.

అవ. ఈచెప్పినయర్థమును దృష్టాంతముచేత నుపపాదించుచున్నారు.—

శ్లో. ఉత్పత్తి స్థితిభంగేషు కుంభస్య వియతో యథా,
నోత్పత్తి స్థితినాశాః స్యు ర్బుద్ధే రేవం మమాపిచ. ౭౯. ౧౬౨

దం-అ. ఘటమునకు జన్మస్థితినాశములు కలుగుచుండఁగా, ఆకాశమునకు జన్మస్థితి

వినాశములు యెటువలెలేదో, ఈప్రకారమే బుద్ధికి జన్మస్థితినాశములు కలుగుచుండఁగా సాక్షు (ఆత్మకు)న్ను ఉత్పత్తివినాశములు లేవు.

తా. మృద్వికారమగు ఘటమునకు జన్మస్థితినాశములు కలుగుచుండఁగా, ఆకాశమునకు జన్మస్థితినాశములు యెటువలెలేదో, అవ్విధముననే బుద్ధికి, జన్మస్థితినాశములు కలవుగాని సాక్షు (ఆత్మకు) ఉత్పత్తి, స్థితి, నాశములు లేవు.

అవ. సుఖదుఃఖాదిపరిణామవృత్తులు అనాత్మధర్మములు గావున ప్రత్యక్షప్రమాణముచే ననుభవసిద్ధములని చెప్పుచున్నారు.—

వాక్య. సుఖదుఃఖసంబంధానాం చ ప్రత్యక్షత్వా న్నశ్రద్ధా
మాత్రగ్రాహ్యమేతత్. ౧౬౩

దం-అ. సుఖదుఃఖములును తత్సంబంధవృత్తులును అనుభవసిద్ధమగుటవలన దీనిని శ్రద్ధాపూర్వకముగ గ్రహించఁగూడదు.

తా. సుఖదుఃఖములును తత్సంబంధవృత్తులును అనుభవసిద్ధమగుటవలన నవి అనాత్మధర్మములు. నిర్వికారుఁడును, నిర్గుణుఁడు నగు ఆత్మయొక్క ధర్మములు కాఁజాలవు గనుక దీనిని ఆత్మధర్మములని శ్రద్ధాపూర్వకముగ గ్రహించకూడదని భావము.

అవ. సుఖదుఃఖాదులకు అహంకారసంబంధమువలన, నేను సుఖిని, నేను దుఃఖిని అను ప్రత్యక్షానుభవమును చెప్పుచున్నారు.—

శ్లో. సుఖదుఃఖాదిసంబంధాం యథా దండేన దండినమ్,
సాధకో వీక్షతే బుద్ధిం సాక్షీ తద్వదసంహతః. ౮౦. ౧౬౪

దం-అ. సాధకుఁడు (ద్రష్ట) దండముతోఁ గూడుకొననివాఁడై దండయుక్తుఁడగుదండిని యేలాగు చూచుచున్నాఁడో, ఆప్రకారమే సాక్షిస్వరూపుఁడగు ఆత్మ సుఖదుఃఖాదిసంబంధము లేనివాఁడై సుఖదుఃఖాదిసంబంధమగు బుద్ధిని చూచుచున్నాఁడు.

తా. మధ్యస్థుఁడు (ద్రష్ట) దండముతోఁ గూడుకొననివాఁడై, దండముతోఁ గూడుకొనినవానిని, తటస్థుఁడై యేలాగు చూచుచున్నాఁడో, ఆలాగుననే సుఖదుఃఖాదివృత్తులతోఁ గూడుకొననిపరమాత్మ సాక్షిస్వరూపుఁడై, సుఖదుఃఖాదివృత్తులతోఁ గూడుకొనినబుద్ధినిఁ జూచుచున్నాఁడు. అనఁగా బుద్ధి సుఖవృత్తితోఁ గూడినప్పుడు నేను సుఖిననిన్ని, దుఃఖవృత్తితోఁ గూడినప్పుడు నేను దుఃఖిననిన్ని అనుభవసిద్ధముగనున్నది. సుఖదుఃఖాదులు జడాత్మకములగు బుద్ధిధర్మములు తప్ప ఆత్మధర్మములు కావని భావము.

అవ. "అతీతానాగతేహాత్యా…" అనుశ్లోకమునందు బుద్ధికి పరిణామిత్వము చెప్పఁబడెను. బుద్ధికి క్రమముగా కొన్నివిషయములు గోచరమగునని వివరించుచున్నారు.—

వాక్య. ఏతస్మాచ్చ హేతో ర్ధియః పరిణామిత్వం యుక్తమ్. ౧౬౫

దం-అ. ఈకారణమువలన బుద్ధికి పరిణామిత్వము కలుగుట యుక్తము.

తా. బుద్ధి సుఖవృత్తితోఁగూడినప్పుడు నేను సుఖిననిన్ని, దుఃఖవృత్తితోఁగూడినప్పుడు నేను దుఃఖిననిన్ని, అనుభవసిద్ధమగు నీకారణమువలన బుద్ధికి పరిణామము కలుగుట యుక్తమేను. నిత్యనిర్వికారుఁడైన ఆత్మకు పరిణామిత్వము లేదని భావము.

అవ. బుద్ధికి ఏకకాలమందు ఏకవిషయమగు వృత్తిగోచరముతప్ప అనేకవిషయమగు వృత్తిగోచరము లేదనిన్ని క్రమముగా కొన్నివిషయములుమాత్రము గోచరమగుననిన్ని చెప్పుచున్నారు.—

శ్లో. ఏనైవాస్యా భవేద్యోగః సుఖకుంభాదినా ధియః,
తం విదంతీ తదైవాన్యం వేత్తి నాతో వికారిణీ. ౮౧. ౧౬౬

దం-అ. ఈబుద్ధికి ఎప్పుడు బాహ్యమగు ఘటాదులతోను, అంతరమగుసుఖదుఃఖాదులతోను సంయోగముకలుగునో, అప్పుడు అది ఘటమనిన్ని, సుఖమనిన్ని తెలిసికొనుచు, ఆదేకాలమందు అన్యవిషయమును గురుతెఱుంగఁజాలదు. ఆకారణమువలన వికారత్వము కలదియగును.

తా. బుద్ధి యెప్పుడు బాహ్యములగు ఘటాదులతోను అంతరములగు సుఖదుఃఖాదులతోను సంయోగముకలుగుచు, అప్పుడు అది ఘటమనిన్ని, సుఖమనిన్ని గురుత్తెఱుఁగుచు, ఆదేకాలమునందు తద్వ్యతిరిక్తములగుపటాదులనున్ను, దుఃఖాదులనున్ను గురుత్తెఱుంగఁజాలదో, ఆకారణమువలన బుద్ధికి పరిణామిత్వముకలదని తెలియఁబడుచున్నది. వర్తమానకాలికవిషయమును, తత్పూర్వకాలికవిషయమును క్రమముగా కొన్నిటినిమాత్రము బుద్ధి గ్రహించునుగాని ఆత్మవలె సర్వతోవ్యాపకముకలిగి, త్రైకాలికవిషయములను సంపూర్ణముగా గ్రహించుటలేదు. గనుక బుద్ధికి పరిణామిత్వము కలదనిన్ని, ఆత్మకు పరిణామిత్వము లేదనిన్ని భావము.

అవ. ఏప్రమాణముచేత బుద్ధికి పరిణామిత్వముకలదని తెలియఁబడుచున్నదని శంకించగా సమాధానమును చెప్పుచున్నారు —

వాక్య. అస్యాశ్చ క్షణభంగురత్వే స్వయమేవాత్మాసాక్షీ,
నహి కూటస్థావబోధమంతరేణ బుద్ధే రావిర్భావ తిరోభావాదిసిద్ధిరస్తి. ౧౬౭

దం-అ. ఈబుద్ధికి క్షణభంగురత్వము కలుగుచుండఁగా స్వయముగా ఆత్మయే సాక్షియగును.

అవ. బుద్ధి స్వయముగా ఆవిర్భావతిరోభావములను తెలిసికొనుచుండఁగా సాక్షివలన నేమిప్రయోజనమని శంకించి, స్వభావవస్తువునకు స్వగ్రాహ్యత్వమునందు కర్మకర్తృవిరోధ ప్రసంగమువలనను, స్వభావవస్తువునకు స్వసాధకత్వమునందు సుషుప్తి లేకపోవుటవలనను, ఆత్మయే సర్వకల్పనాధిష్ఠానత్వముచేత సాక్షియని చెప్పుచున్నారు.-

పైవాక్యములో (౧౬౭-లో) రెండవభాగమునకు దండాన్వయము.

దం-అ. పరమాత్మ భాసలేక బుద్ధికి ఆవిర్భావతిరోభావాదులు సిద్ధించుటలేదు.

తా. బుద్ధికి పరిణామిత్వము కలుగుచుండఁగా తద్విషయమగు ఆత్మకును పరిణామిత్వము కలుగుచున్నదని శంకించగా, సమాధానమును చెప్పుచున్నారు. ఈబుద్ధికి క్షణభంగురత్వము కలుగుచుండగా, తద్వృత్తులకన్నిటికి ఆత్మయే సాక్షియగును. బుద్ధియే స్వకీయావిర్భావతిరోభావములను గుర్తెఱుంగుచున్నది; సాక్షివలన నేమిప్రయోజనమని శంకించగా, స్వభావవస్తువునకు స్వగ్రాహ్యత్వమునందు, కర్మ, కర్తృప్రసంగము వలనను, స్వభావవస్తువునకు స్వసాధకత్వమునందు సుషుప్తి లేకపోవుటవలనను, ఆత్మయే సర్వకల్పనాధిష్ఠానత్వముచేత సాక్షియగుచున్నాఁడు. పరమాత్మప్రకాశమువినా, బుద్ధికి ఆవిర్భావతిరోభావాదులు సిద్ధించుటలేదు. గాన సర్వవృత్తులకును, పరిణామరహితుఁడగు ఆత్మయే సాక్షియగుచున్నాఁడనిన్ని, బుద్ధికి పరిణామిత్వము లేదనిన్ని తాత్పర్యము.

శ్లో. పరిణామి ధియాం వృత్తం నిత్యాక్రమదృగాత్మనా,
షడ్భావ విక్రియా మేతి వ్యాప్తం భేనాంకురో యథా. ౧౬౭.

దం-అ. ఏప్రకారము ఆకాశముచేత వ్యాప్తమైన అంకురము షడ్భావవికారమును బొందుచున్నదో, ఆప్రకారము, ఎల్లప్పుడు ఆక్రమింపఁబడినదృష్టిగలిగిన పరమాత్మచేత, పరిణమించుబుద్ధులయొక్క స్వరూపము వ్యాప్తమై షడ్భావవికారమును బొందుచున్నది.

తా. ఏప్రకారము ఆకాశముచేత వ్యాప్తమైన అంకురము షడ్భావవికారమును (జన్మ, మరణ, వృద్ధి, క్షయ, స్థితి, పరిణామములను) బొందుచున్నదో, ఆప్రకారము నిత్యజ్ఞానస్వరూపుఁడైన పరమాత్మచేఁ బరిణమించుబుద్ధులయొక్కస్వరూపము, వ్యాప్తమై షడ్భావవికారములను బొందుచున్నది. బుద్ధివృత్తులు పరిణామవికారమును జెందుచున్న వనిన్ని, వీనికి నిర్వికారుఁడును, నిత్యజ్ఞానస్వరూపుఁడును, అగుపరమాత్మ సాక్షిభూతుఁ

డనిన్ని, పరమాత్మభాసచే బుద్ధి ప్రకాశించుచున్నదనిన్ని తాత్పర్యము. ఈకారణముల వలన ఆత్మ, బుద్ధిపరిణామసాధకుఁడని భావము.

అవ. ఈప్రకారము బుద్ధికి వికారత్వము నుపపాదించి, ఇప్పుడు ఆత్మకు నిర్వికారత్వము నుపపాదించుచున్నారు.—

వాక్య. సత ఆత్మన శ్చావికారిత్వే బుద్ధిః. ౧౬౯

దం-అ. సచ్చిదానందస్వరూపుఁడు అగునాత్మకు నిర్వికారత్వమందు యుక్తి కలదు.

తా. ఈచెప్పఁబోవుశ్లోకమున నిర్వికారత్వము తెలియఁబడును.

శ్లో. స్మృతి స్వప్న ప్రబోధేషు న కశ్చి త్ప్రత్యయో ధియః,
దృశాఽవ్యాప్తోఽ స్త్యతో నిత్య మవికారీ స్వయం దృశిః. ౭౩.

దం-అ. బుద్ధియొక్క ప్రత్యయములగుస్మృతి, స్వప్న, ప్రబోధములయం దొకటియైనను జ్ఞానస్వరూపుఁడగు ఆత్మచే వ్యాపించకుండునదిలేదు. ఆకారణమువలన స్వయంప్రజ్ఞుఁడగు ఆత్మ ఎల్లప్పుడు నిర్వికారుఁడగును.

తా. బుద్ధియొక్క ప్రత్యయములగు స్మృతి, విపర్యాస ప్రమాణములయం దొకటియైనను పరమాత్మభాసచే వ్యాపించకుండునదిలేదు. ఆకారణమువలన స్వయం ప్రజ్ఞకల పరమాత్మ నిత్యనిర్వికారుఁడనిన్ని, బుద్ధివృత్తులు పరమాత్మ వెలుఁగుచే ప్రకాశించుచున్నవనిన్ని, పరమాత్మ స్వయంప్రకాశకుఁడగుటచే పరిణామరహితుఁడనిన్ని తాత్పర్యము.

అవ. ఈప్రకారము 'పరిణామిధియావృత్తం'అనుశ్లోకము మొదలు సాంఖ్యసిద్ధాంతము నవలంబించి బుద్ధియే పరిణామస్వరూపముకలదనియు, ఆత్మ కూటస్థుఁడనియు, పరిణామిత్వము లేనివాఁడనియు యుక్తులచే చూపఁబడెను. ఇప్పుడు ఆత్మకు పరిణామిత్వముకలదని యొప్పికొనినను, ఆత్మ మాయామయుఁడగుటవలన, ఆయన కేలాటి దోషములేదని స్వసిద్ధాంతము నవలంబించి చెప్పుచున్నారు.—

వాక్య. ఏవం తావత్పరాభ్యుపగత ప్రక్రియా ప్రస్థానేన నిర
స్తాశేష వికారైకాత్మ్యం ప్రతిపాదిత ముపపత్తిభిః అథా
ధునా శ్రౌతీం ప్రక్రియా మవలంబ్యోచ్యతే. ౧౭౧

దం-అ. ఈప్రకారము పరమాత్మకు తటస్థించినపరిణామాదులును ప్రక్రియావిశేషముచేతను, ఉపపత్తులచేతను నిరసింపఁబడి,నిత్యనిర్వికారుఁడనియు, జ్ఞానస్వరూపుఁడని ప్రతిపాదింపఁబడెను. ఇప్పుడు శ్రౌతీప్రక్రియ నవలంబించి చెప్పఁబడును.

తా. ఈప్రకారము బుద్ధికి విషయభూతుఁడగు పరమాత్మకు పరిణామాదులవలన నని కొందఱు వాదించినను, అట్లుండిన యవి మాయాసంబంధమైనవనిన్ని, ఆత్మ సంబంధముకానివనిన్ని, ప్రక్రియావిశేషముచేతను, యుక్తులచేతను నిరసింపఁబడి, ఆత్మ నిర్వికారుఁడనిన్ని, జ్ఞానస్వరూపుఁడనిన్ని, దేశకాలవ్యవచ్ఛేదములచే భిన్నుఁడుకాఁడనిన్ని ప్రతిపాదింపఁబడెను. ఇప్పుడు శ్రౌతీప్రక్రియ నవలంబించి ఆత్మ పరిణామస్వరూపుఁడు కాఁడని చెప్పుచున్నారు.

శ్లో. అస్తువా పరిణామోఽస్య దృశేః కూటస్థరూపతః,
కల్పితోఽపి మృషైవాసౌ దండస్యే వాప్సువక్రతా. ౧౭౨

దం-అ. ఈపరమాత్మకు పరిణామము కల్పితమగుగాక; నీళ్ళయందు దండమునకు వంకరవలె, కూటస్థరూపుఁడగుటవలన, ఈపరిణామము మిథ్యయేను.

తా. లోపలను, వెలుపలనగు ఆత్మయొక్క పరిణామము, కల్పింపఁబడినదైనను అంగీకరింపఁబడుగాక; అట్లయిన ఆత్మ కూటస్థరూపుఁడగుటవలన నీపరిణామము అవిద్యాసంబంధమైనదేను. యథార్థముగ పరిణామములేదు. ఉదకములయందుండు దండమునకు వంకరలేకపోయినను, వంకరయున్నట్లు ఏప్రకారము కాన్పించుచున్నదో, ఆలాగున, ఆత్మకు యథార్థముగ పరిణామము లేకపోయినను, అవిద్యాసంబంధమువలన పరిణామ మున్నట్లు కాన్పించుచున్నదని భావము.

శ్లో. షట్సు భావవికారేషు నిషిద్ధే ష్వేవ మాత్మని,
దోషః కశ్చి దిహా సక్తుం నశక్య స్తార్కికశ్వభిః. ౧౭౩

దం-అ. నిషిద్ధములగు షడ్భావవికారములలో నొకదోషమునైనను ఆత్మయందు ఆరోపించుటకు తార్కికశునకములచే శక్యముకాదు.

తా. నిషిద్ధములగు షడ్భావవికారములలో (జన్మ, మృతి, వృద్ధి, క్షయ, స్థితి, పరిణామములలో) నొకదోషమునైనను నిర్వికారుఁడును,జ్ఞానస్వరూపుఁడునగు పరమాత్మయందారోపించుటకు తార్కికాధములచే శక్యముకాదు ఈప్రకార మాత్మకు షడ్భావవికారములులేవని ప్రతిపాదించుటచేత కర్తృత్వ,భోక్తృత్వాదిసర్వానర్థసంబంధములు నిరసింపఁబడినవని భావము.

వాక్య. ప్రకృతమే వోపాదాయ బుద్ధేః పరిణామిత్వ మా
త్మనశ్చ కూటస్థత్వం యుక్తిభి రుచ్యతే. ౧౭౪

దం-అ. ప్రకృతమగుశ్రౌతమతము నవలంబించియే, బుద్ధికి పరిణామిత్వమున్ను, ఆత్మకు కూటస్థత్వమున్ను చెప్పఁబడును.

తా. ప్రకృతమగు శ్రౌతమతమనఁగా సాంఖ్యసిద్ధాంతము నవలంబించియే, బుద్ధికి పరిణామిత్వమున్ను, కూటస్థస్వరూపుఁడగుటవలన నాత్మకు నిర్వికారత్వమున్ను యుక్తులచేత చెప్పఁబడునని తాత్పర్యము.

శ్లో. ప్రత్యర్థంతు విభిద్యంతే బుద్ధయో విషయోన్ముఖాః,
నభిదాఽవగతే స్తద్వత్ సర్వా స్తాశ్చిన్నిభాయతః. ౮౬. ౧౭౫

దం-అ. ఏ ప్రకారము విషయాసక్తమగు బుద్ధివృత్తులు, ప్రతివిషయమందును భేదింపఁబడుచున్నవో, ఆ ప్రకారము జ్ఞానస్వరూపుఁడగు ఆత్మకు భేదములేదు. ఏ కారణమువలన ఆబుద్ధివృత్తులన్నియుం ఆత్మతుల్యము లగుచున్నవియో.

తా. ఏ ప్రకారము విషయాసక్తములగు బుద్ధివృత్తులన్నియుం ప్రతివిషయమందును, స్వతస్సిద్ధముగా భేదింపఁబడుచున్నవో, ఆ ప్రకారము జ్ఞానస్వరూపుఁడగు ఆత్మకు భేదములేదు. ఏకారణమువలన బుద్ధివృత్తులన్నియుం నాత్మతుల్యము లగుచున్నవో ఆకారణమువలన ఆత్మ ఏకాకారమేను. ఘటపటాదులు భిన్నమైనను, తదుపాధిభూతమగు ఆకాశమునకు భిన్నత్వములేక ఏకాకారముగనున్నదో, ఆ ప్రకారము బుద్ధివృత్తులు భిన్నముగానున్నను, తదుపాధిభూతమగునాత్మ భిన్నత్వములేక ఏకాకారము కలిగియుం న్నందున పరిణామరహితమైన దని తాత్పర్యము.

వాక్య. స్వసంబంధార్థ ఏవ. ౧౭౬

దం-అ. స్వసంబంధప్రయోజనముకలది గనుకనే.

తా. బుద్ధికి పరిణామిత్వలక్షణధర్మసంబంధము ప్రతిపాదించుటకొఱకు పైశ్లోకమును చెప్పుచున్నారు. ఆత్మసంబంధప్రయోజనమును కలది గనుకనే పరిణామిత్వము కలదని తాత్పర్యము.

శ్లో. సావశేష పరిచ్ఛేది న్యత ఏవ న కృత్స్నవిత్,
నోచే త్పరిణమే ద్బుద్ధిః సర్వజ్ఞా సాత్మవద్భవేత్. ౮౭. ౧౭౭

దం-అ. ఏకారణముచేత బుద్ధి కొన్నివస్తువులను తెలిసికొనుటచేతనే పరిచ్ఛేదింపఁబడినదై సార్వజ్ఞత్వము లేనిదగుచున్నది. బుద్ధి పరిణమించనియెడల సర్వజ్ఞత్వము కలదియుం నాత్మతుల్యము నగును.

తా. ఏకారణమువలన బుద్ధి భూతభవిష్యద్వర్తమానకాలికవిషయములను కొన్నిటినిమాత్రమే తెలిసికొనుటచేత పరిచ్ఛేదింపఁబడినదైనదో, ఆకారణమువలన ఏకకాలమందు త్రైకాలికవిషయములను గుర్తెఱుఁగుసార్వజ్ఞత్వముకలదిగా నుండలేదు. బుద్ధికి పరిణామములేనియెడల సార్వజ్ఞత్వముకలదియుం, నాత్మతుల్యముకలదియుం నగుచున్నది.

ఎందువలన బుద్ధికి సార్వజ్ఞత్వములేదో, ఆకారణమువలన పరిణామస్వరూపముకలదని తాత్పర్యము.

వాక్య. అతో ఽవగతే రేకత్వాత్. ౧౭౮

దం-అ. ఆకారణమువలన ఆత్మకు ఏకత్వము కలుగుటవలన.

తా. ఆకారణమువలన జ్ఞానస్వరూపుఁడును, సర్వజ్ఞుఁడునగు నాత్మకు ఏకత్వము కలుగుటవలన పరిణామము లేదనిన్ని, బుద్ధికి పరిణామిత్వము కలదనిన్ని తాత్పర్యము.

అవ. అనేకత్వప్రతీతి కలుగుటవలన, సిద్ధిభేదమును చెప్పుచున్నారు.—

శ్లో. చండాలబుద్ధే ర్య ద్ద్రష్టృ తదేవ బ్రహ్మ బుద్ధిదృక్,
ఏకం తదుభయో ర్జ్యోతి ర్భాస్య భేదా దనేకవత్. ౮౮. ౧౭౯

దం-అ. చండాలబుద్ధికి నేది ద్రష్టయగునో, అదియే బ్రహ్మబుద్ధికిని ద్రష్టయగును. ఆరెండింటియొక్క జ్యోతియొక్కటియే; ప్రకాశించెడు భేదములవలన ననేకములుగా నున్నది.

తా. చండాలునిబుద్ధికి యేదిద్రష్టయో ఆదియే బ్రహ్మజ్ఞానిబుద్ధికిని ద్రష్టయగును ఆరెండుబుద్ధులయందును ప్రతిఫలించెడు జ్యోతిస్సొక్కటియే. ప్రకాశించెడు భేదము వలన ననేకములుగా నున్నట్లు ప్రతీతికలుగుచున్నది. గాని వాస్తవమందు ఆత్మజ్యోతి స్సేకాకారమైనది. సూర్యునితేజస్సు నదీతటాకాదులయందును, మూత్రాదికల్మషోద ప్రవాహములయందును, ప్రతిఫలించుచుండగా,ఆధారగతగుణదోషములే వ్యవహరింప బడుచున్నవిగాని, ఆధేయమగుసూర్యతేజస్సు నిర్దుష్టమై ఏకాకారమగునట్లు, ఆత్మ జ్యోతిస్సు యీ ఏకాకారమనిన్ని పరిణామములేదనిన్ని తాత్పర్యము.

వాక్య. కస్మాత్. ౧౮౦

దం-అ. ఏకారణమువలన?

తా. భేదమునకు వాస్తవత్వ మేకారణమువలన లేదని శంకించి, జ్యోతిస్సేక కారమనిన్నీ భేదకాభావమనిన్నీ చెప్పుచున్నారు.

శ్లో. అవస్థాదేశకాలాది భేదో నా స్త్యనయో ర్యతః,
తస్మా జ్జగద్ధియాం వృత్తం జ్యోతిరేకం సదేక్షతే. ౮౯. ౧౮౧

దం-అ. ఏకారణమున నీరెండు (చండాల,బ్రహ్మ)బుద్ధులకు కారణమైన ఆత్మకు అవస్థా దేశ కాలాదిభేదములులేవో, ఆకారణమువలన, లోకమునందుండు సమ బుద్ధులయొక్క వ్యాపారమును ఏకాకారమగు ఆత్మజ్యోతిస్సు సాక్షిభూతమై చూచు చున్నది.

తా. ఏకారణమువలన చండాలబుద్ధి, బ్రహ్మబుద్ధి యీరెండింటికారణభూతమగు ఆత్మకు, అవస్థాదేశకాలగుణాది భేదములులేవో, ఆకారణమువలన లోకమందుండు సమస్తబుద్ధులయొక్క వ్యాపారమును, ఏకాకారమగు నాత్మజ్యోతిస్సు సాక్షిభూతమై చూచుచున్నది. అవస్థాదేశకాలగుణాదులకు సాక్షీభూతమగుటవలన సాక్షికి నానాత్వములేదనిన్ని, ఏకాకారమనిన్ని తాత్పర్యము.

అవ. ఏకారణమువలన ఒకానొకదేహమందుండు మనస్సునందు దేవ్వనికి బ్రహ్మత్వము ప్రకాశించుచున్నదో ఆకారణమువలన దేహాంతరమందుండు మనస్సునందు బ్రహ్మప్రకాశము లేమిచే,అచ్చటకలిగిన దుఃఖాదిసంబంధమువలన దుఃఖియగును అని శంకించగా చెప్పుచున్నారు.—

వాక్య. సర్వదేహేష్వాత్మైకత్వే ప్రతిబుద్ధపరమార్థతత్త్వస్యాప్యప్రతిబుద్ధ దేహసంబంధా దశేష దుఃఖసంబంధ ఇతిచేన్న. ౧౮౨

దం-అ. సర్వదేహములయందు, ఆత్మకు ఏకత్వముకలుగచుండగా, పరమార్థతత్త్వము తెలిసినవానికైనను, అజ్ఞానాత్మిక దేహసంబంధమువలన విశేషదుఃఖము కలుగుచున్నదని ఆక్షేపింపగా నట్లుకాదని చెప్పుచున్నారు.

తా. సర్వదేహములయందును ఆత్మకు ఏకత్వముకలుగుచుండఁగా, పరమార్థతత్త్వమును తెలిసినవానికైనను జడాత్మకమగు దేహసంబంధమువలన, విశేషదుఃఖము కలుగుచున్నదని యాక్షేపింపఁగా నట్లు కాదనుచున్నారు. సమస్తకల్పనాబీజభూతమగు అజ్ఞానమువలన అన్యగతములగు దుఃఖములను తా ననుభవించుచున్నట్లు భావించుచున్నాఁడు. బ్రహ్మాత్మైక్యాపరోక్షజ్ఞానముచే మూలమగు నవిద్య నశించి, నేను దుఃఖినిగాననిన్ని, సచ్చిదానందస్వరూపుఁడననిన్ని భావించుచున్నాఁడు.అందువలన ఆత్మ నిత్యజ్ఞానానందస్వరూపుఁడనిన్ని, ఏకత్వముకలవాఁడనిన్ని, దుఃఖములన్నియు అవిద్యవలన కలిగినవనిన్ని తాత్పర్యము.

శ్లో. బోధాత్ప్రాగపి దుఃఖిత్వం నాన్యదేహోత్థమస్తినః,
బోధాదూర్ధ్వం కుతస్తత్స్యా ద్యత్ర స్వగతమప్యసత్. ౯౦.

దం-అ. ఏ ఆత్మయందు జ్ఞానముకంటే పూర్వకాలమందు కలిగినదుఃఖము అన్యదేహమువలనఁ బుట్టినదికాదో, ఆయాత్మయందే జ్ఞానోదయానంతరము అవిద్యాసంబంధమగు దుఃఖ మెట్లుండును?

తా. ఏఆత్మయందు జ్ఞానోదయమునకంటె పూర్వమందు స్వగతత్వముచేత ప్రకాశించుచున్న దుఃఖము ఇప్పుడు నేను సచ్చిదానందస్వరూపుఁడనైతి ననెడి జ్ఞానోదయముచేత నశించుచున్నదో, అయ్యది అన్యదేహోత్పన్నమైనది కాదు. అది ఆదేహమందే అవిద్యవలన కలిగినది. జ్ఞానోదయానంతరము అవిద్య నశింపఁగనే దుఃఖము నశించినది. ఈకారణమువలన ఆత్మకు దుఃఖాదిపరిణామములు లేవనిన్ని, ఏకాకారుఁడై యాత్మయున్నాఁడనిన్ని భావము.

అవ. బుద్ధి పరిణామస్వరూపముగలది. ఆత్మ కూటస్థుఁడు. పరిణామరహితుఁడని ప్రతిపాదింపఁబడిన విషయమేదికలదో, అది తార్కికులవలె, మాచేత తర్కయుక్తులచే ప్రతిపాదింపఁబడక సిద్ధాంతీకరింపఁబడును.—

వాక్య. నచేయం స్వమనీషికేతి గ్రాహ్యం,కుతః,శ్రుత్యవష్టంభాత్.

దం-అ. ఈవిషయము స్వబుద్ధికల్పితమని గ్రహింపకూడదు. ఎందువల్లననిన, శ్రుతిప్రమాణము కలదగుటవలన.

తా. బుద్ధి పరిణామస్వరూపముగలది ఆత్మకూటస్థుఁడగుటవలన పరిణామ రహితుఁడని ప్రతిపాదింపఁబడినవిషయ మేదికలదో, అయ్యది తార్కికులవలె మాచేత స్వబుద్ధికల్పితమగు తర్కయుక్తులచే ప్రతిపాదింపఁబడక శ్రుతిప్రమాణముచే సిద్ధాంతీకరింపఁబడును. అనఁగా ఈవిషయము స్వబుద్ధికల్పితమని గ్రహింపఁగూడదు. శ్రుతిప్రమాణముచే ప్రతిపాదింపఁబడునని తాత్పర్యము

శ్లో. శబ్దాద్యాకార నిర్భాసా హానోపాదన ధర్మిణీ,
భాస్యేత్యాహ శ్రుతి ర్దృష్టి రాత్మనోఽపరిణామినః. ౯౧.౧౮౫

దం-అ. శబ్దాదివిషయములను ప్రకాశింపఁజేయునదియు,విడుచుట గ్రహించుట యీరెండు ధర్మములు కలదియునగు అంతఃకరణవృత్తి, పరిణామరహితుఁడగు ఆత్మవలన ప్రకాశింపఁబడుచున్నదని శ్రుతిపలికెను.

తా. దృష్టి అనఁగా అంతఃకరణవృత్తి. శబ్ద స్పర్శ రూప రస గంధములు మొదలగువిషయములను ప్రకాశింపఁజేయునదియు, విడుచుట, గ్రహించుట ఈరెండుధర్మములుకలదియునై పరిణామరహితుఁడగు ఆత్మవలన ప్రకాశింపఁబడుచున్నదని శ్రుతిపలికెను. ఆత్మవలన, అంతఃకరణవృత్తి ప్రకాశించుచున్నది, గాని అంతఃకరణవృత్తివలన ఆత్మ ప్రకాశించుటలేదు. దృష్టిఅనఁగా జ్ఞానము. పారమార్థిక జ్ఞానమనియు, అపారమార్థికజ్ఞానమనియు రెండువిధములు. అందు పారమార్థిక జ్ఞానము ఆత్మయొక్కస్వరూపమును దెలియఁజేయునదియును,అపారమార్థికజ్ఞానము శబ్దాదివిషయములను ప్రకాశింపఁ

జేయునదియుం, నుత్పత్తినాశములుకలదియునై యున్నది. ఈ అపారమార్థికజ్ఞానముచే స్వరూపజ్ఞానము ప్రకాశింపఁబడుటలేదని తాత్పర్యము.

వాక్య. కా త్వసౌ శ్రుతిః. ౧౮౬

దం-అ. ఆశ్రుతి యెట్టిది?

తా. ముందు అర్థమును వర్ణించి పిదప శ్రుతిని చెప్పుచున్నారు.

శ్లో. దృష్టే ర్ద్రష్టార మాత్మానం నపశ్యే ర్దృశ్యమానయా,
"విజ్ఞాతారమరే కేన విజానీయాద్ధి" యాం పఠిమ్. ౯-౨. ౧౮౭

దం-అ. ఈచూడఁబడుబుద్ధిచేత (అపారమార్థికజ్ఞానముచేత) అంతఃకరణవృత్తికి సాక్షిభూతుఁడగు పరమాత్మను చూడకుము. సర్వాంతఃకరణవృత్తులకు నధిపతియైన విజ్ఞానస్వరూపుఁడగు నాత్మను దేనిచేత గుర్తెఱుఁగును.

తా. ఈచూడఁబడుబుద్ధిచేత (అపారమార్థికజ్ఞానముచేత) అంతఃకరణవృత్తికి సాక్షిభూతుఁడగు పరమాత్మను చూడకుము. సర్వాంతఃకరణవృత్తులకు నధిపతియును, విజ్ఞానస్వరూపుఁడగునాత్మను దేనిచేత గుర్తెఱుఁగును. "న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః", "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" అను నీరెండుశ్రుతులున్ను ప్రమాణము. ఇందువలన బుద్ధి పరిణామస్వరూపముకలదనిన్ని, ఆత్మ నిర్వికారుఁడనిన్ని, పరిణామాత్మకాంతఃకరణచేత ఆత్మ చూడఁబడఁడనిన్ని తాత్పర్యము.

అవ. ఈ ప్రకారము శ్రుతిస్మృతివిద్వత్ప్రత్యక్షానుమానాదులచే నొప్పుచుండఁగా వేదాంత సిద్ధాంతమందు విశ్వాసము లేకుండుట తగదని అభిప్రాయపడి చెప్పుచున్నారు.—

వాక్య. యస్మా త్సర్వప్రమాణోపపన్నోఽయమర్థ స్తస్మా ద
త్రోఽన్యథావాదినో జాత్యంధా ఇవానుకంపనీయా ఇ
త్యాహ. ౧౮౮

దం-అ. ఏకారణమువలన సర్వప్రమాణములచే నొప్పుచుండిన యీవిషయము (బుద్ధిపరిణామస్వరూపముకలది) మనోహరమైనదో, ఆ కారణమువలన, దీనిని అన్యవిధముగా వాదించువారలు పుట్టుకగ్రుడ్డివారివలెనే, కనికరింపఁదగినవారలని చెప్పుచున్నారు.

తా. ఏకారణమువలన శ్రుతి స్మృతి విద్వత్ ప్రత్యక్షానుమానాదులచే నొప్పుచుండిన యీవిషయము (బుద్ధిపరిణామస్వరూపముకలది, ఆత్మపరిణామరహితుఁడు) సర్వప్రమాణసమ్మతమో, ఆకారణమువలన దీనిని అన్యవిధముగా వాదించువారలు (ఆత్మపరి

ణామస్వరూపుఁడని) పుట్టుకగ్రుడ్డివారివలెనే కనికరింపఁబడఁదగినవారలు. అనఁగా పుట్టుకగ్రుడ్డివారలు, స్వకరస్పర్శముచేత నాయావస్తువులను స్పృశించి, వానిస్వరూపము తెలియక, ఏదో యొకవిధముగ భావించుచుండఁగా, జ్ఞానులగువారు వీరికి భగవంతుఁడు నయనేంద్రియము నియ్యలేదని యేప్రకారము దుఃఖించుచున్నారో, ఆలాగున వీరికి యథార్థజ్ఞానములేక, మిథ్యాజ్ఞానముచేత నాత్మస్వరూపమును గుర్తెఱుంగక అన్యథా వాదముచేయుచున్నారని పశ్చాత్తాపపడుచున్నారు. జాత్యంధులున్ను అన్యథావాదులున్ను సమానులని తాత్పర్యము.

శ్లో. తదేత దద్వయం బ్రహ్మ నిర్వికారం కుబుద్ధిభిః,
జాత్యంధగజదృష్ట్యేవ కోటిశః పరికల్ప్యతే. ౯౩. ౧౮౯

దం-అ. ఆకారణమువలన, ఒక్కటిగానైనటువంటిన్ని, పరిణామరహితమైనదియును నగుపరబ్రహ్మము కుత్సితబుద్ధిగలిగిన నాస్తికాదులచేత "జాత్యంధగజదృష్టి" న్యాయమువలె నానావిధములుగ కల్పింపఁబడుచున్నది.

తా. "జాత్యంధగజదృష్టి" న్యాయమనఁగా పుట్టుకగ్రుడ్డివారు ఏనుఁగును చూడ నిచ్ఛయించినవారలై తమతమకరస్పర్శచేత ఏనుఁగుతొండమును దాకి యిదే ఏనుఁగు అనిన్ని, పాదమును దాకి యిదే ఏనుఁగు అనిన్ని, ఇతరావయవములనుదాకి యిదే ఏనుఁగు అనిన్ని ఏలాగుకల్పించుకొనుచున్నారో, ఆలాగు దుష్టతర్కయుక్తులచే, మలినమైన బుద్ధిచేత, చార్వాకాదులు తర్కాభాసప్రమాణములచే కూటస్థుఁడైనవాఁడును, అద్వితీయుఁడును, పరిణామరహితుఁడును నైనపరమాత్మను నానావిధములుగ కల్పించుకొనుచున్నారు. జాత్యంధులు ఏప్రకారము జ్ఞానహీనులై గజస్వరూపమును గ్రహింపలేక పోయిరో, ఆప్రకారము కుత్సితబుద్ధిగల నాస్తికాదులు మలినాంతఃకరణముచేత పరబ్రహ్మమును కనుగొనలేక అనేకవిధములుగ కల్పించుకొనుచున్నారు. కావున వీరివాక్యము లప్రమాణములని తాత్పర్యము.

అవ. వార లేలాగున అగుదురు; కేవలమూర్ఖులుగదా జాలిపొందఁదగినవారలని శంకించుకొని ఉత్తరమును చెప్పుచున్నారు —

వాక్య. ప్రమాణోపపన్నస్యార్థస్య అసంభావనాత్తదనుకం
పనీయత్వసిద్ధిః. ౧౯౦

దం-అ. ప్రమాణములచేత నిరూపింపఁబడినయర్థమునకు కేవలయుక్తిచేత సంభవములేనందున, వారలు జాలిపొందఁదగినవారనే యర్థము సిద్ధించెను.

తా. నిర్దోషమైన శ్రుతిప్రమాణముచేతను, అందుకు అనుకూలమైన యుక్తిచేత ను, నిర్ణయింపఁబడిన యర్థము కేవల శుష్కయుక్తికి గోచరించదు గనుక, చార్వాకా దులు శ్రుతివాక్యముల నాదరించక, స్వకపోలకల్పితశుష్కయుక్తిచేతనే, ఆత్మతత్త్వ మును నిర్ణయింపఁదలఁచి ప్రవర్తించుచున్నందున, నిండాపొడవైన మనుష్యులే, దోటీ గడలచేత నందుకొనుచుండు మ్రానిపండ్లను, చేతులచేతనే అందుకొనుటకు యత్నించు చున్న పొట్టివాండ్రవలె బుద్ధిమంతులకు జాలినొందఁదగినవారే యని భావము.

అవ. శ్రుతియుక్తులచేత నిర్ణయింపఁబడినయర్థమును నిరూపించుచున్నారు.—

వాక్య. తదేతదాహ. ౧౯౧

దం-అ. ఆయీయర్థమును చెప్పుచున్నారు.

తా. స్పష్టము.

శ్లో. యద్య ద్విశేషణం దృష్టం నాత్మాన స్తదనన్వయాత్,
స్వస్య కుంభాదివ త్తస్మా దాత్మాస్యా న్నిర్విశేషణః. ౯౪. ౧౯౨

దం-అ. ప్రతి యేయేవిశేషణము చూడఁబడుచున్నదో, అది ఆత్మతోటి సంబం ధించనందున, ఆత్మయొక్క సంబంధమైనదికాదు గనుక ఆత్మ విశేషణములు లేనివాఁ డేయగును.

తా. ఘటాకాశము కలశాకాశము అని వ్యవహరించునప్పుడు, ఆకాశమునకు విశేషణములుగా గాన్పించుచున్నఘటాదులు, ఆకాశముతో వాస్తవముగా సంబంధిం చనిదై, యున్నందున, ఆకాశము యేలాగున నిర్విశేషమో (సకలవిశేషశూన్యమైయున్న దో), ఆలాగుననే 'ఘటోఽస్తి ఘటోభాతి' (ఘటముకలదు, ఘటము ప్రకాశించుచున్న ది) అనేవ్యవహారమునందు సత్తాప్రకాశరూపమైన పరమాత్మకు, ఘటాదులు విశేషణ ములు కనుపడుచున్నను, ఘటాదులకు ఆత్మతోటి సంబంధము వాస్తవముగాలేనందున, ఆత్మస్వరూపము నిర్విశేషమే నని సకలశ్రుతులు నిర్ణయించుచున్నవని భావము. "శ్లో. అస్తి భాతి ప్రియం రూపం నామచేత్యంశపంచకం, ఆద్యత్రయం బ్రహ్మ రూపం జగద్రూపం తతోద్వయమ్" అని. అస్తి (కలదు), భాతి (ప్రకాశించు చున్నది), ప్రియం (ఇష్టమైనది), రూపం (పృథుబుధ్నోదరాద్యాకారము), నామ (ఘటపటాదినామము), ఈయైదు ప్రపంచములో వ్యవహరింపఁబడుచున్నవి. వీటిలో మొదటిసత్తాప్రకాశేష్టములు (సత్తాప్రకాశానందములు) మూఁడును పరమాత్మయొక్క స్వరూపము అని పూర్వాచార్యులు నిశ్చయించియున్నారు. గనుక 'ఘటోఽస్తి, ఘటో

భాతి' ఇత్యాదివ్యవహారములయందు అస్తి,భాతి శబ్దములచేఁ జెప్పఁబడుచున్న సత్తాప్రకాశములు పరమాత్మస్వరూపమని యెఱుంగవలయు.

అవ. శ్రుతినిర్ణయించిన అర్థమునకు యుక్తికూడా కలదని చెప్పుచున్నారు.—

వాక్య. అత శ్చాత్మనో భేదా సంస్పర్శో భేదస్య మిథ్యాస్వాభావ్యాత్. ౧౬౩

దం-అ. భేదమునకు మిథ్యాత్వమే స్వభావమైయున్నందున, ఆకారణమువల్ల ఆత్మకు భేదములతోటి సంబంధము లేకయున్నది.

తా. నామరూపములనే భేదప్రపంచము కేవల మిథ్యగానున్నందున కేవలమైన ఆత్మతోటి అభేదప్రపంచము సంబంధము కలిగియుండనేరదని భావము.

అవ. ఆత్మకు భేదప్రపంచసంబంధము లేకపోవుటయందు మఱియొకయుక్తి చెప్ప నారంభించుచున్నారు.—

వాక్య. అత ఆహ. ౧౬

దం-అ. అందువల్లనే చెప్పుచున్నారు. మఱియొకయుక్తి అని శేషము.

తా. స్పష్టము.

శ్లో. అవగత్యాత్మనో యస్మా దాగమాపాయి కుంభవత్,
సాహంకార మిదం విశ్వం తస్మా త్తత్స్యా త్కచాదివత్. ౯

దం-అ. ఏకారణమువలన జ్ఞానస్వరూపుఁడైన, ఆత్మయొక్క సన్నిధానముచే అహంకారసహితమైన యీప్రపంచము ఘటమువలె నుత్పత్తివినాశములు కలదైయున్నదో, ఆకారణమువల్లనే ఆప్రపంచము కేశోండ్రకమువంటిది యగును.

తా. బుద్ధీంద్రియదేహఘటాదిప్రపంచము స్వతః లేనిదై చిదాత్మయొక్క వల్లనే ఉత్పత్తిని, వినాశమును పొందుచున్నది. అందువల్లనే ఘటాదివస్తువులు అనిత్యమైయున్నది. ఈహేతువువల్లనే యీ ప్రపంచమంతయు కేశోండ్రకమువలె యని చెప్పఁదగియున్నదని భావము. కనులను చీకిరించి చూచునప్పుడు చిన్నివెం చుట్టవలె గుండ్రమైన కొన్నియాకారములు ఆకాశమునందు ఆకాశఫలాదులవలె న్పించును. అవి కేశోండ్రకము లనంబడును.

అవ. ఓయీ! అన్వయవ్యతిరేకానుమానములచేత, చిదాత్మ తెలియఁబడుచుండఁగా, చిదాత్మ స్వయంప్రకాశుఁడని, ప్రమాణాంతరములకు గోచరించనివాఁడని చెప్పుట యుక్తముకాదని శంకించగా ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. సర్వస్యై వానుమాన వ్యాపారస్య ఫలమియదేవ యద్వివేకగ్రహణమ్. ౧౯౫

దం-అ. వివేకమును గ్రహించుట యేదికలదో యదియే సకలమైన అనుమానముయొక్క ప్రవృత్తికి ప్రయోజనము.

తా. చిదాత్మ ఘటాదివస్తువులకంటే యేప్రకారము విభిన్నమైయున్నదో, ఆ ప్రకారమే దేహేంద్రియ మనఃప్రాణబుద్ధులకంటే కూడా విభిన్నమైయున్నదని తెలియఁజేయుటమాత్రమే అన్వయవ్యతిరేకానుమానములకు శక్యమైయుండునుగాని ఆత్మయొక్కస్వరూపమును తెలియఁజేయుట శక్యమైయుండదు గనుకనే, చిదాత్మ స్వయంప్రకాశమని-ప్రమాణాంతరములకు గోచరించనిదని చెప్పినది యుక్తముగానే యున్నదని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. తదుచ్యతే. ౧౯౬

దం-అ. అది చెప్పఁబడును.

తా. ఆత్మయొక్క దేహేంద్రియాదివైలక్షణ్యమును, అనుమానము చెప్పునట్టి ప్రకారమును విశదముగా చెప్పుచున్నారని భావము.

శ్లో. బుద్ధే రనాత్మధర్మత్వ మనుమానాత్ప్రసిద్ధ్యతి,
ఆత్మనో ప్యద్వితీయత్వ మాత్మత్వా దేవసిద్ధ్యతి. ౯౬. ౧౯౭

దం-అ. బుద్ధియొక్క అనాత్మధర్మత్వము (బుద్ధి ఆత్మధర్మము కాదనేవిషయము) అనుమానమువల్ల సిద్ధించును. ఆత్మయొక్క అద్వితీయము ఆత్మత్వమువల్లనే సిద్ధించును.

తా. బుద్ధి జడమైనందున ప్రకాశ్యము. అందుచే అజడమై ప్రకాశకమైన చిదాత్మయొక్క ధర్మము కానేరదని అనుమానముచేత నిశ్చయింపఁ దగియున్నది. చిదాత్మ అద్వితీయమని, నిరంజనమని తెలియుట ఆత్మస్వభావమువల్లనే యగుచున్నదిగాని అనుమానముచేత కానేరదు అని భావము.

అవ. వేదాంతసిద్ధాంతము సాంఖ్యసిద్ధాంతముతోటి సమానమై యున్నదని శంకించుచున్నారు.—

వాక్య. యద్యప్యయం గ్రహీతృ గ్రహణ గ్రాహ్య గృహీతి తత్ఫలాత్మకః బ్రహ్మాది స్తంబపర్యంతః సంసారః అన్వయ వ్యతిరేకాభ్యా మనాత్మతయా నిర్ధార్యవదపవిద్ధః. ౧౯౮

దం-అ. విచారించగా ప్రమాత, ప్రమాణము, ప్రమేయము, ప్ర
య ప్రకాశము అనేపదార్థపంచకముకలిగి, బ్రహ్మమొదలు పిపీలికవఱకుగల
రము అన్వయవ్యతిరేకయుక్తులచేత ఆత్మకంటే భిన్నమని నిర్మాల్యమువలె
బడినది.

తా. బ్రహ్మమొదలు పిపీలికవఱకు అనేకనీచోచ్చజంతువులతో ని
ఈప్రపంచము ప్రమాత, ప్రమాణ, ప్రమేయవిషయములయొక్క స్ఫురణ
అయిదుభాగములుకలదై యున్నది. ఇట్టిప్రపంచము (సంసారము) నిత్యనిర్వి
తామరాకువలె నిర్లేపమైయున్న చిదాత్మకంటె అత్యంతభిన్నమని,అన్వయవ్య
మానములచేత నిశ్చయించి, ధరించివిడిచిన పుష్పమాలనువలె సాంఖ్యులున్ను
మును హేయమని చెప్పుచున్నారు. వేదాంతులున్ను ఈప్రకారమే చెప్పుచ
కనుక సాంఖ్యమతములు రెండున్ను ఒకటిగా కనుపడుచున్నదని భావము.

అప సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. తథాపి తు నైవాసౌ స్వతస్సిద్ధ ఆత్మ వ్యతిరిక్తా నాత్మ
ప్రకృతి పదార్థవ్యపాశ్రయః సాంఖ్యానా మివ కిం తర్హి
స్వతస్సిద్ధా నుదితా న స్తమిత కూటస్థాత్మప్రజ్ఞానమాత్ర
శరీర ప్రతిబింబితావిచారిత సిద్ధాత్మా నవబోధాశ్రయ
ఏవ. ౧౯౯

దం-అ. అయినప్పటికి ఈసంసారము సాంఖ్యులకువలె స్వయంప్ర
చిదాత్మకంటె భిన్నమై, జడమైన ప్రధానమనేపదార్థము నాశ్రయించి
కాదు. ఇఁక నేమంటే స్వయంప్రకాశమై ఉత్పత్తిలయములులేనిదై,నిత్యనిర్వి
చిన్మాత్రస్వరూపంబైన చిదాత్మయొక్క ప్రతిబింబముకలిగి, అనిర్వచనీయమై
నాశ్రయించియున్నఅజ్ఞానమునే ఆశ్రయించియున్నది.

తా. సంసారము ఆత్మకంటె అత్యంతవిలక్షణమని, నిర్మాల్యమువలె ప
మని చెప్పినది సాంఖ్యులకు మాకు సమానమైయున్నదిగాని, మాటయొకగొప్ప
ముగలదు. అదియేదంటే సాంఖ్యులు సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రధ
చిదాత్మకంటే భిన్నమై, స్వతంత్రమై, సత్యమై, ప్రమాత్రాదిపంచకముగల ఈ
మును రచించునని, సంసారము అట్టి ప్రధానమునే ఆశ్రయించియుండునని,
అసంగనిర్వికారస్వరూపుఁడైనప్పటికి, అద్వితీయుఁడుగాఁడని, చిదాత్మ లన
రనియు నంగీకరించుచున్నారు. వేదాంతులమైన మేము, తేజోభిన్నా

అవ్యాకృతమని చెప్పఁబడుచున్న అజ్ఞానమే యీసంసారమును కల్పించుచున్నదని,ఇట్టి అజ్ఞానము, చిదాత్మనే ఆశ్రయించియుండి, చిదాత్మయొక్క ప్రతిబింబముకలిగి ఈచిదాత్మకు పరతంత్రమై, సత్యమనిగాని, అసత్యమనిగాని చెప్పుటకు శక్యముగాక, అనిర్వచనీయమై, బ్రహ్మాత్మజ్ఞానముకలుగగానే,నశించేస్వభావము కలదై యుండుననిన్ని, ఇట్టి యజ్ఞానమునే, సంసార మాశ్రయించియుండుననిన్ని, చిదాత్మ అద్వితీయుఁడనిన్ని అంగీకరించియున్నారము. గనుక సాంఖ్యమతమునకును మాకును చాలా భేదముకలదని భావము.

అవ. సంసారము అజ్ఞానము నాశ్రయించియుండు ననుటకు కారణము చెప్పుచున్నారు.—

వాక్య. తదుపాదనత్వా త్తస్యేతి. ౨౦౦

దం-అ. ఆసంసారమునకు ఆయజ్ఞానమే ఉపాదానకారణముగా నున్నందున.

తా. ప్రమాత్రాదిసంసారము అజ్ఞానముచేతనే కల్పింపఁబడియున్నందున అజ్ఞానమునే యాశ్రయించియుండునని భావము.

అవ. ఉత్తరగ్రంథమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. ఇతీయ మర్థం నిర్వక్తుకామ ఆహ. ౨౦౧

దం-అ. ఈప్రకారముగ నీయర్థమును నిరూపింపఁదలఁచినవాఁడై చెప్పుచున్నాఁడు.

తా. సంసారము అజ్ఞానమాత్రోపాదానకమని చెప్పినయర్థమును విస్పష్టముగా చెప్పుచున్నారని భావము.

శ్లో. ఋతే జ్ఞానం న సంత్యర్థా అస్తి జ్ఞానమృతేఽపి తాన్,
ఏవంనియో హిరుగ్జ్యోతి ర్వివిచ్యా దనుమానతః. ౯౭. ౨౦౨

దం-అ. ద్రష్టనువదలి విషయములులేవు. ఆవిషయములు లేకపోయినను ద్రష్టయుండును. ఈప్రకారము అనుమానమువలన, ప్రకాశస్వరూపమైన ఆత్మను బుద్ధికంటె విభిన్నముగ విభజింపవలయును.

తా. ఇచ్చట జ్ఞానశబ్దము జానాతీతి (తెలుసుకొనేవాఁడు గనుక) జ్ఞానం, అనేవ్యుత్పత్తిచేత ద్రష్టనుచెప్పుచున్నది. ద్రష్టయనఁగా చూచునట్టివాఁడు. ద్రష్టలేని విషయములో, ఘటపటాదివిషయములు ప్రకాశించవు. అనఁగా సుషుప్తి, మూర్ఛాది సమయములయందు ద్రష్టలేకయున్నందున, ఘటపటాదిపదార్థములు ప్రకాశించుట లేదని యర్థము. ఘటాదిపదార్థములు ప్రకాశించకపోయినప్పుడును, ద్రష్ట ప్రకాశించు

చుండును. సమాధిదశలో సమాహితచిత్తులకు, ఘటాదిపదార్థములు భాసించకపోయినప్పటికి, ద్రష్టమాత్రము ప్రకాశించుచుండునని యర్థముగనుక, ఘటాదిపదార్థములు తమ యొక్క సత్తాప్రకాశములయందు, నిత్యము చిదాత్మ నపేక్షించియున్నందున, చిదాత్మ తనయొక్క సత్తాప్రకాశములయం దన్యవిషయముల నపేక్షించనందునను, స్వప్రకాశ స్వరూపమైన చిదాత్మ, బుద్ధ్యాదిపదార్థములకంటె నత్యంతవిలక్షణమైనవాఁడని యుక్తిచేత విభజించి తెలియవలయును దృశ్యప్రపంచముకంటె చిదాత్మ భిన్నమని నిష్కర్షించినందున ప్రపంచము స్వతంత్రముగా సిద్ధించదు గనుక, అజ్ఞానముచేతనే కల్పింపఁబడినదని, అజ్ఞానమునే ఆశ్రయించియున్నదని నిశ్చయింపఁదగియున్నది. లోకములో భ్రాంతిచేత కనుపడుచున్నరజతము, నేత్రదోషమును విడచి ప్రత్యేకముగా నుండనందున, నేత్రదోషముచేతనే కల్పింపఁబడి, నేత్రదోషమునే యాశ్రయించి యుండునుగదా? ఆప్రకారమే దృశ్యప్రపంచమున్ను అజ్ఞానకల్పితమై, అజ్ఞానమునే యాశ్రయించియుండుననిభావము.

అవ. ఇందుచేత చిదాత్మయొక్క అప్రమేయత్వము సాధించఁబడినదని చెప్పుచున్నారు.—

వాక్య. యస్మా త్ప్రమాణ ప్రమేయ వ్యవహారః ఆత్మానవబోధాశ్రయ ఏవ తస్మా త్సిద్ధ మాత్మనోఽప్రమేయత్వం, నైవ హి కార్యం స్వకారణ మతిలంఘ్య అన్యత్ర ఆకారక ఆస్పద ముపనిబధ్నాతి. ౨౦౩

దం-అ. ఎందువలన ప్రమాణమని, ప్రమేయమని చేయఁబడే వ్యవహారము, ఆత్మసంబంధియైన అజ్ఞానమునే ఆశ్రయించియున్నదో, అందువలన, చిదాత్మకు అప్రమేయముకంటే, విలక్షణత్వము సిద్ధమైనది; ఎందువల్లనంటే కార్యవస్తువు తనయొక్క కారణమునుదాఁటి మరియొక కారణము గానిదానియందు స్థితిని పొందనేరదు.

తా. ప్రత్యక్షాదిప్రమాణములు, వాటిచేత నిశ్చయింపఁబడుచున్న ఘటాదిప్రమేయములు ఇవియన్నియు చిదాత్మనిష్ఠమైన అజ్ఞానముచేతనే కల్పింపఁబడి, అజ్ఞానమునే ఆశ్రయించియున్నవి. చిదాత్మస్వరూపము అజ్ఞానముచేత కల్పింపఁబడినదికాదు. అజ్ఞానము నాశ్రయించినదిసైతముకాదు. ఇఁక నెటువంటిదనఁగా, అజ్ఞానమున కధిష్ఠానమై, అజ్ఞానమున కాశ్రయమైయుండును గనుకనే, ప్రమేయమని చెప్పఁదగినదికాదు. అనఁగా అజ్ఞానకల్పితములగువాటికే ప్రమేయత్వము కలదిగాని, అజ్ఞానకల్పితము గాక, నిత్యసిద్ధమైన చిదాత్మకు, ప్రమేయత్వములేదని భావము. ప్రమాణ ప్రమేయ

ములు, అజ్ఞానమునే ఆశ్రయించియుండుట యేమంటే లోకములో కార్యవస్తువులగు ఘటాదులు, తమకు కారణమైనమృత్తిక నాశ్రయించి యుండునుకాని, కారణము గాని తంతువుల నాశ్రయించి యుండనేరవుగదా? ఆప్రకారమే ప్రమాణప్రమేయ ములకు, అజ్ఞానమే కారణమైనందున, అవి యజ్ఞానమునే ఆశ్రయించియుండునుగాని, వేరొకదానిని ఆశ్రయించియుండవని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను జేయుచున్నారు.—

వాక్య. అత ఆహ.

దం-అ. అందుకు చెప్పుచున్నారు.

తా. ఆత్మయొక్క అప్రమేయత్వమును (ప్రమేయత్వము లేకపోవుటను) గూర్చి మఱియొకయుక్తి చెప్పఁబడునని భావము.

శ్లో. వ్యవధీయంత ఏవామీ బుద్ధిదేహఘటాదయః,
ఆత్మత్వాదాత్మనః కేన వ్యవధానం మహాగపి. ౯౮. ౨౦౫

దం-అ. ఈబుద్ధి, శరీరము, ఘటము మొదలగునవి వ్యవధానమును బొందుచునే యున్నవి ఆత్మకు ఆత్మత్వము కలిగియున్నందునే కొంచెమైనా వ్యవధానము దేని చేతకలుగును?

తా. బుద్ధి తాను జడమైనందున స్వయముగా ప్రకాశించఁజాలక, ఆత్మచైతన్య ము నపేక్షించి ప్రకాశించుచుండును గనుక అన్యము నపేక్షించకనే స్వయముగా ప్రకాశించుచున్న ఆత్మస్వరూపమును పట్టిచూడగా వ్యవహితమైయుండును. దేహము న్ను ఇంద్రియములున్ను జడములే గనుక, తాము ప్రకాశించేవిషయమై బుద్ధివృత్తి నపేక్షించి ప్రకాశించుచుండును కనుక, బుద్ధికంటే వ్యవహితములైయుండును. ఘట పటాదివస్తువులున్ను జడములైనందున స్వయముగా ప్రకాశించఁజాలక, దేహేంద్రియ ములద్వారా బహిర్నిర్గతములగుచున్న బుద్ధివృత్తులచేత ప్రకాశించుచున్నందున, దేహేం ద్రియములకంటే వ్యవహితములై యున్నవి. ఈలాగున వ్యవధానముగలపదార్థములన్నియు ప్రమేయములై యున్నవి. చిదాత్మ తాను స్వయంప్రకాశమైనందున తనయొక్క ప్రకాశ మునందు మఱియొకదాని నపేక్షించదు. గనుకనే, దేనిచేతనూడా వ్యవధానము కలది కాదు. అందువల్లనే ప్రమేయముకానిదై (ప్రమేయకోటిలో చేరనిదై) యున్నదని భావము.

అవ. బుద్ధిదేహేంద్రియాదులు వ్యవహితములని చెప్పినందులకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. స్వయ మనవగమాత్మకత్వాత్ అనవగమాత్మకత్వం
చ మోహమాత్రోపాదనత్వాత్. ౨౦౬

దం-అ. తాను అచిద్రూపమైనందువలన, అచిద్రూపమున్ను అజ్ఞానమే కారణముగాగలది గనుకనున్ను.

తా. బుద్ధిదేహేంద్రియాదులు అచిద్రూపములైనందువలన వ్యవహితములై యున్నవి. అచిద్రూపములై యుండుటకు కారణము అజ్ఞానమువలన పుట్టుటయే అనఁగా బుద్ధ్యాదులు అజ్ఞానముచేత పుట్టింపఁబడినందున, అజ్ఞానమువలెనే అచిద్రూపములై యున్నవి. అచిద్రూపములైనందుననే, అవ్యవహితముగా ప్రకాశింపఁజాలక, బుద్ధిచిదాభాసముల నపేక్షించి, ప్రకాశించుచు వ్యవహితములై యున్నవని భావము.

శ్లో. ప్రమాణ మంతరే ణైషాం బుద్ధ్యాదీనా మసిద్ధతా,
అనుభూతి ఫలార్థిత్వా దాత్మాజ్ఞః కి మపేక్షతే. ౯౯. ౨౦౭

దం-అ. ఈబుద్ధి మొదలగువాటికి ప్రమాణములేక సిద్ధి (ప్రకాశము) లేదు. జ్ఞానస్వరూపుఁడగు నాత్మ యనుభవస్వరూపుఁడైనందున, దేని నపేక్షించును?

తా. బుద్ధ్యాదిపదార్థములు స్వతః జడములైనందున చిత్ప్రతిబింబితవృత్తియనే ప్రమాణములేనియెడల ప్రకాశించనేరవు. అందువల్లనే యవి వ్యవహితములనంబడును. చిదాత్మ స్వతః జ్ఞానస్వరూపుఁడైనందున, తాను ప్రకాశించేవిషయమై, మఱియొకదానిని యపేక్షింపఁడు. అందువల్లనే ఆత్మ వ్యవహితుఁ డనంబడును. "తం త్వౌపనిషదం పురుషం" ఇత్యాదిశ్రుతులవల్లను చిదాత్మయున్ను తాను ప్రకాశించుటయం దుపనిషద్వాక్యప్రమాణము నపేక్షించునని వినఁబడుచున్నది గాని, చిదాత్మ, అనాదికాలము నుండి అజ్ఞానముచేత నావరింపఁబడియున్నందున, అజ్ఞాననివృత్తికొఱకు, ఉపనిషద్వాక్యప్రమాణము నపేక్షించునుగాని, స్వరూపప్రకాశముకొఱకు అపేక్షించదనిభావము. ఉపనిషత్తులచేతనే తెలియఁబడేపురుషుని యడుగుచున్నానని పైననుదహరింపఁబడియుండు శ్రుత్యర్థము.

అవ. ఉత్తరగ్రంథమున కవతారికను చేయుచున్నారు.—

వాక్య. వక్ష్యమాణేతరేతరాధ్యాస సిద్ధ్యర్థ ముక్త వ్యతిరేకానువాదః. ౨౦౮

దం-అ. ముందుచెప్పఁబోయ్యే అన్యోన్యాధ్యాసము సిద్ధించేకొఱకు, ఇదివఱకు చెప్పినవైలక్షణ్యము అనువదింపఁబడుచున్నది.

తా. చిదాత్మకును అంతఃకరణాదులకును, అన్యోన్యాధ్యాసము ముందు చెప్పఁబడుచున్నది. అధ్యాసము అనఁగా నొకదానినిఁజూచి మఱియొకటి యని భ్రమించుట. ఇందుకు దృష్టాంతము శుక్తినిజూచి రజతమని భ్రమించుట. ఆత్మానాత్మలకు అధ్యాసము చెప్పఁదలచి ముందుగా నాయీయాత్మానాత్మల కిదివఱకుచెప్పిన విలక్షణస్వభావము ననువదించుచున్నారని భావము. అనఁగా నాత్మయును నంతఃకరణాద్యనాత్మయుఁను, పరస్పరము అత్యంతవిలక్షణమైన స్వభావముకలవై నందున, వాటికి సంయోగసంబంధముగాని, సమవాయసంబంధముగాని, తాదాత్మ్యసంబంధముగాని సంభవించదు. సంబంధములేనియెడల చిదాత్మకు ప్రకాశకత్వము, అంతఃకరణాదులకు ప్రకాశ్యకత్వమును చెప్పఁగూడదు. కనుక ఆత్మానాత్మలకు అధ్యాససిద్ధమైన సంబంధ మొకటికలదని చెప్పవలసియుఁన్నది. అధ్యాసము పరస్పరభేదముగలవస్తువులకు, అభేదము నెఱుంగనందున కలుగుచున్నది. గావున ఆత్మానాత్మల కిదివఱకు చెప్పినభేదమునే (విలక్షణత్వమునే) అధ్యాసనిరూపణత్వముకొఱకు అనువదించుచున్నారని తాత్పర్యము. రెండుద్రవ్యములకు కలుగుచున్న సంబంధము సంయోగసంబంధ మనఁబడు. ఇది ఘటపటములయొక్క సంబంధము. విశేషణవిశేష్యములు మొదలగువాటికి గలుగుచున్నసంబంధము సమవాయసంబంధ మనంబడు. ఇది నీలఘటములకు, తంతుపటములకు గలసంబంధము. ఈసంబంధమునే సాంఖ్యులు తాదాత్మ్యసంబంధమని, వైష్ణవులు అపృథక్సిద్ధసంబంధమని వ్యవహరించెదరు. ఈవిషయమైన విభాగమును ప్రకృతమునం దుపయోగించనందునను, గ్రంథవిస్తరభీతిచేతను, ఉపరమింపఁబడుచున్నది.

శ్లో. ఘటబుద్ధేర్ఘటాచ్చార్థాత్ ద్రష్టు ర్యద్వద్విభిన్నతా,
అహం బుద్ధే రహంగమ్యా ద్దుఃఖినశ్చ తథాదృశః ౧౦౦.౨౦౯

దం-అ. ఘటజ్ఞానముకంటే, ఘటరూపమైనవిషయముకంటే, ఘటమునుచూచునట్టిద్రష్టకు యేలాగున భేదముకలదో, ఆలాగుననే అహం (నేను) అనే జ్ఞానముకంటే అహం (నేను) అని చెప్పఁబడేదుఃఖముగల ద్రష్టకంటే దృక్కునకు (సాక్షిచైతన్యము) భేదముకలదు.

తా. లోకములో ఘటమును చూచుచున్నద్రష్ట, దృశ్యమైనఘటముకంటే, ఘటజ్ఞానముకంటెను, విలక్షణమైయున్నటుల, 'అహం' అని వ్యవహరింపఁబడుచున్నద్రష్టను ప్రకాశింపఁజేయుచున్న సాక్షిచైతన్యమున్ను, ద్రష్టకంటెనున్ను, ద్రష్టను విషయీకరించుచున్నజ్ఞానముకంటెనున్ను విలక్షణమై యుండునని భావము.

అవ. ఈప్రకారము ఆత్మానాత్మలయొక్క విలక్షణత్వమును (భేదమును) కాన్పించి, ఇట్టి భేదమును తెలియనందున సంభవించుచున్న అధ్యాసమును చూపించుచున్నారు.—

వాక్య. ఏవ మేతయో రాత్మానాత్మనోః స్వతః పరతః సిద్ధయో లౌకిక రజ్జు సర్పాద్యారోపవదవిద్యాశ్రయ ఏవేతరేతరాధ్యారోప ఇత్యేతదాహ. ౨౧౦

దం-అ. ఈప్రకారము స్వయంప్రకాశమై పరాధీనప్రకాశమైయున్న ఈయాత్మానాత్మలకు లోకములోనున్న రజ్జుసర్పముల కధ్యాసమువలె పరస్పరాధ్యాసము అజ్ఞానముచేతనే కల్పింపఁబడియున్నదని ఈయర్థమును చెప్పుచున్నారు.

తా. ఈలోకములో రజ్జువుకు (త్రాటికి) సర్పమునకు పరస్పరభేదము సుప్రసిద్ధమైయున్నప్పటికి అవి మందాంధకారములో నున్నప్పుడు ఆభేదము తెలియనందున, త్రాటినిజూచి సర్పమనిగాని, సర్పమునుజూచి రజ్జువనిగాని, అధ్యాసము (ఆరోపము) చేయఁబడుచున్నదిగదా? ఆప్రకారమే చిద్రూపమైనందున స్వతస్సిద్ధమై (స్వయంప్రకాశమై) యున్న చిదాత్మకున్ను జడమైనందున పరతస్సిద్ధమై (పరాధీనప్రకాశమై) యున్న అంతఃకరణాద్యనాత్మకున్ను, పరస్పరభేదము సుప్రసిద్ధమైయున్నప్పటికి, ఆభేదము తెలియక ఆత్మానాత్మలు ఒకదానియందొకటి అధ్యసింపఁబడుచున్నవి. ఈయర్థమును విశదముగా ముందటిశ్లోకములోఁ జెప్పుచున్నామని భావము.

శ్లో. అభ్రయానం యథా మోహాత్ శశభృత్యధ్యవస్యతి,
సుఖిత్వాదీన్ధియో ధర్మాన్ తద్వదాత్మని మన్యతే. ౧౦౧.౨౧౧

దం-అ. మేఘముయొక్క గమనమును అజ్ఞానమువలన చంద్రునియందెటువలె నధ్యసించుచున్నాఁడో, అటువలెనే బుద్ధియొక్క ధర్మములైన సుఖిత్వము మొదలగువానిని ఆత్మయందు తలంచుచున్నాఁడు.

తా. ఆకాశమునందు మేఘము నడచుచుండును. చంద్రబింబము నడువనిదై, యొక్కచోటనే యుండును. ఇట్టి స్వభావభేదము. మేఘచంద్రబింబముల కున్నప్పటికిని ఈభేదమెఱుంగక లోకములో మూఢులగుమనుజులు మేఘముయొక్క నడకను చంద్రబింబమునం దారోపించి చంద్రుఁడు నడచుచున్నాఁడని వ్యవహరించుచున్నారు. అటువలెనే అంతఃకరణము సుఖదుఃఖాదిధర్మములుకలదై యున్నది. చిదాత్మ సర్వధర్మశూన్యమైయున్నది ఇట్టి స్వభావభేద మెఱుంగక అజ్ఞానముచేత బుద్ధియొక్క సుఖదుఃఖాదిధర్మములను చిదాత్మయం దారోపించి చిదాత్మయే సుఖదుఃఖాదులుకలవాఁడని మూర్ఖుఁడు వ్యవహరించుచుండును. ఇదిగాక అగ్నియందు దాహకత్వము కలదు. అయఃపిండమందులేదు. ఇట్టిభేదము నెఱుంగక అజ్ఞానముచేత దాహకత్వము అయఃపిండమునం దారోపించి, అయఃపిండము దహించుచున్నదని మూఢుఁడు వ్యవహరించును.

అటులే చైతన్య మాత్మయందు కలదు. అంతఃకరణమున లేదు. ఈభేదము నెఱుంగక ఆత్మయొక్క చైతన్యమును అంతఃకరణమునం దారోపించి, 'అహం జానామి' (నేనె ఱుంగుచున్నాను) అని వివేకహీనుఁడు వ్యవహరించుచుండుననిభావము. అనఁగా ఆత్మా నాత్మలయొక్క పరస్పరస్వభావభేదము తెలియనందున, అంతఃకరణమునందుగల సుఖ దుఃఖాది ధర్మములను, ఆత్మయం దారోపించి, ఆత్మయందుగల చైతన్యమును, (జ్ఞాన మును) అంతఃకరణమునం దారోపించి 'అహం సుఖీ, అహం జానామి' (నేను సుఖ వంతుఁడను, నేను తెలిసికొనుచున్నాను) ఇత్యాదివ్యవహారములు ప్రవర్తించుచున్నవని తాత్పర్యము.

అవ. ఉత్తరశ్లోకముయొక్క తాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. సర్వ ఏవాయమాత్మా నాత్మవిభాగః ప్రత్యక్షాదిప్ర మాణవర్త్మన్యనుపనిపతితోఽవిద్యోత్సంగవర్త్యేవ న పర మాత్మవ్యపాశ్రయః అస్యాశ్చావిద్యాయాః సర్వానర్థ హేతోః కుతో నివృత్తి రితిచే త్తదాహ. ౧౧౩

దం-అ. ప్రత్యక్షము మొదలగుప్రమాణములయొక్క మార్గమునందు ప్రవర్తిం చని ఈయాత్మానాత్మవిభాగమంతయుఁ నజ్ఞానముయొక్క ఒడియం దుండునదియే. పర మాత్మ నాశ్రయించినది కాదు. సమస్తమైన యనర్థములకు కారణమైన యీయజ్ఞాన మునకు నివృత్తి దేనివలన కలుగుననఁగా దానిని చెప్పుచున్నారు.

తా. ఆత్మానాత్మలయొక్క పరస్పరాధ్యాసముల నవలంబించి ప్రవర్తించుచున్న యీవిచిత్రమును, నానావిధమును నగుసుఖదుఃఖాదిసంసారమును ప్రత్యక్షాదిప్రమాణము లకు గోచరించునది కాదు. స్వానుభవమునకే గోచరించుచున్నది. ఇట్టి సంసారము అజ్ఞా నమునే యాశ్రయించియున్నదిగాని చిదాత్మ నాశ్రయించియుండలేదు. పరమాత్మను ఆశ్రయించియున్నయెడల పరమాత్మ నిత్యమైనందున, తదాశ్రితమైనసంసారమున్ను నిత్యమైయుండును. అవిద్య నాశ్రయించియున్నందున, అవిద్య అనిత్యమైనందున, తదా శ్రితమైన సంసారమున్ను నశించిపోవుటకు తగియున్నది. అయితే సర్వానర్థములకు మూలకారణమైన యీ యవిద్య దేనివలన నశించుననఁగా దానిని నిరూపించి చూపె దమని భావము.

శ్లో. దుఃఖరాశే ర్విచిత్రస్య సేయం భ్రాంతి శ్చిరంతనీ,
మూలం సంసారవృక్షస్య తద్బాధ స్తత్త్వదర్శనాత్. ౧౧౩.

దం-అ. అనాదిసిద్ధమైన ఆయీయధ్యాసమే నానావిధమైన దుఃఖసముదాయము గల సంసారవృక్షమునకు మూలకారణమైయున్నది. ఈయధ్యాసముయొక్క వినాశము తత్త్వజ్ఞానమువల్ల కలుగుచున్నది.

తా. ఇదివరకే చెప్పఁబడినది గనుక ఊహ్యము.

అవ. పూర్వవాదియొక్క ప్రశ్న ననువదించి పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. తద్బాధ స్తత్త్వ దర్శనా దితి కుతః సంభావ్యత ఇతి చే దత ఆహ. ౨౧౫

దం-అ. దానియొక్క వినాశము తత్త్వజ్ఞానమువల్ల కలుగునని యెందుకు నూహింపఁబడుచున్నదనఁగా దానిని చెప్పుచున్నారు.

తా సంసారమునకు మూలమైన అవిద్య తత్త్వజ్ఞానముచేత నివర్తించునని యెందువలన నూహించుచున్నారనఁగా నట్టియూహకు నిమిత్తమును చెప్పుచున్నారని భావము.

వాక్య. ఆగోపాలావిపాలపండిత మియ మేవ ప్రసిద్ధిః. ౨౧౬

దం-అ. గోపాలకులు మొదలున్న గొఱ్ఱెలను కాచేవాఁడు మొదలున్న, పండితులవఱకు నిది ప్రసిద్ధముగనే యున్నది.

తా. ఆవులను, గొఱ్ఱెలను కాచే అతిమూర్ఖులగు మనుజులు మొదలుకొని, సర్వశాస్త్రపరిజ్ఞానముగలిగి యూహాపోహకుశలులగు పండితులవఱకు అందఱకు నీయర్థము సుప్రసిద్ధముగా తెలిసియున్నదనిభావము.

అవ. ఏయర్థము సుప్రసిద్ధమైయున్నదనఁగా దానిని వివరించిచెప్పుచున్నారు.-

శ్లో. అప్రమోత్థం ప్రమోత్థేన జ్ఞానం జ్ఞానేన బాధ్యతే,
అహిరజ్జ్వాదివద్బాధో దేహా ద్యాత్మమతే స్తథా. ౧౦౪. ౨౧౭

దం-అ. భ్రాంతిచేత పుట్టినజ్ఞానము యథార్థముగా పుట్టినజ్ఞానముచే బాధింపఁబడుచున్నది. సర్పము రజ్జువు మొదలగువాటికివలె శరీరాదులయందు కలిగినయాత్మబుద్ధికిన్ని బాధగలుగుచున్నది.

తా. యథార్థజ్ఞానముచేత మిథ్యాజ్ఞానము (భ్రాంతిజ్ఞానము) బాధింపఁబడుచున్నది. అనఁగా రజ్జుజ్ఞానము యథార్థజ్ఞానము. రజ్జువునుజూచి యిదిసర్పమని తలంచుట మిథ్యాజ్ఞానము. ఇట్టి మిథ్యాజ్ఞానము యథార్థమైన రజ్జుజ్ఞానముచేత బాధింపఁబడుచున్నదని యర్థము. ఈప్రకారమే యథార్థజ్ఞానముచేత తెలియఁబడుచున్న రజ్జువు, మిథ్యాజ్ఞానముచేత గ్రహింపఁబడుచున్న సర్పమునకు బాధకమైయున్నది. ఇది సర్వలోక

ప్రసిద్ధమేకదా? ఇటులే దేహేంద్రియాదులయందు కలుగుచున్న ఆత్మజ్ఞానము మిథ్యాజ్ఞానమైనందున, శుద్ధాత్మస్వరూపమును గ్రహించుచున్న తత్త్వజ్ఞానముచేత బాధింపఁబడునని నిశ్చయించుచున్నామని భావము.

అవ. ఓయీ! తత్త్వజ్ఞానమనఁగా, శుద్ధమైనచిదాత్మను గ్రహించుచున్నజ్ఞానమేగదా? ఇందుచేత వేదాంతవాక్యప్రమాణమువల్ల కలిగినజ్ఞానమునకు, చిదాత్మస్వరూపము గోచరించుచున్నదని మీచేతనే అంగీకరింపఁబడినది. ఇందువలన చిదాత్మస్వరూపము స్వతస్సిద్ధమే (స్వయంప్రకాశమే)గాని ప్రమాణగోచరముకాదని పూర్వము మీరుచెప్పినది విరుద్ధముగదా యని పూర్వవాది శంకించగా సిద్ధాంతవాది పరిహరించుచున్నాఁడు.—

వాక్య. లౌకికప్రమేయవైలక్షణ్యాదాత్మనో నేహానధిగతాధిగమః ప్రమాణఫలమ్. ౨౧౭

దం-అ. ఆత్మకు లోకమందుగలప్రమేయముల (విషయముల) కంటె విభేదము కలిగియున్నందువలన, ఇచ్చట తెలియనిదానిని తెలియచేయుట ప్రమాణమునకు ఫలము కాదు.

తా. చిద్రూపమైన ప్రత్యగాత్మస్వరూపము, ఈలోకములో ప్రత్యక్షాదిప్రమాణములచేత, తెలియఁజేయఁబడుచున్న ఘటపటాదివిషయములవంటివి కాదు. వాటికంటె యధికతరవిలక్షణమైనది గనుక, చిదాత్మయందు ప్రవర్తించేప్రమాణము, తెలియనిదానిని తెలియఁజేయుటనదిగాదు. అనఁగా లోకములోనుండు ఘటాదివస్తువులు జడములైనందున, స్వయముగా ప్రకాశించునవి కావు గనుక, ప్రమాణజ్ఞానముచేత ప్రకాశింపఁజేయఁబడును. అందువలన ప్రమాణజ్ఞానమునకు, అదివఱకు తెలియఁబడని వాటిని తెలియఁజేయడము ప్రయోజనముగా నుండును. చిదాత్మ స్వయముగా ప్రకాశించుచున్నందున ప్రమాణజ్ఞానము ప్రకాశింపచేయవలసిన ఆవశ్యకము కలదిగాదు. గనుక ప్రమాణజ్ఞానము చిదాత్మకంటె ఇతరవిషయములయందు, అనధిగతార్థబోధకమైనప్పటికి, చిదాత్మయం దట్టిదికాదు కావున, చిదాత్మ ప్రమాణగోచరముకాదని పూర్వము మేముచెప్పినది విరోధించదని భావము.

అవ. అయితే వేదాంతవాక్యప్రమాణమునకు, చిదాత్మయందు ఎట్టిప్రయోజనము కలదనఁగా చెప్పుచున్నారు.—

శ్లో. అవిద్యా నాశమాత్రంతు ఫలమి త్యుపచర్యతే,
నాజ్ఞాతజ్ఞాపనం న్యాయ్య మవగత్యేకరూపతః. ౧౦౩. ౨౧౮

దం-అ. అవిద్యయొక్క వినాశముమాత్రమే ఫలమని యుపచరింక్నది. కేవలజ్ఞానస్వరూపుఁడగుటవలన తెలియనిదానిని తెలియఁజేయుట న కాదు.

తా. చిదాత్మస్వరూపమును అనాదికాలమునుండి యావరించియున్న మును నివర్తింపఁజేయుటమాత్రమే వేదాంతప్రమాణమునకు ఫలమని ఉప చెప్పఁబడునుగాని, ముఖ్యముగాఁ జెప్పఁబడదు. చిదాత్మస్వరూపము స్వప్ర స్వరూపమైనందున, నిత్యము తెలియఁబడియేయున్నది గనుక, నచ్చట జ్ఞానము అజ్ఞాతజ్ఞాపకమని చెప్పుట యుక్తముకాదని భావము. అనఁగా జ్ఞానము ఘటాదివిషయములయందు వ్యాపించి, తాను వ్యాపింపకముందు వి యముల నాచ్ఛాదించియున్న అజ్ఞానమును నశింపఁజేసి ఘటాదివిషయము శింపఁజేయును. కావున ప్రమాణజ్ఞానముల కన్నింటికి అజ్ఞాతజ్ఞాపనము (అ నివర్తింపఁజేయుటయును,విషయమును ప్రకాశింపఁజేయుటయును)ముఖ్యఫల దును. చిదాత్మస్వరూపము స్వయంప్రకాశమైనందున, ప్రమాణజ్ఞానముచే శింపఁబడునదికాదు. అందుచే ప్రమాణజ్ఞానము చిదాత్మ నావరించియున్న నుమాత్రము నివర్తింపఁజేయును గనుక, అజ్ఞాననివర్తి ప్రమాణజ్ఞానమునకు అముఖ్యముగా వ్యవహరింపఁబడుచున్నదని తాత్పర్యము. అజ్ఞాననివృత్తి, విష శములు రెండును ప్రమాణజ్ఞానమునకు ఫలమైయుండఁగా అజ్ఞాననివృత్తినిమా మని చెప్పుట ఉపచారమని పరమార్థము.

అవ. చిదాత్మ ప్రమాణవేద్యము గాదనుటకు మఱియొక హేతువు చున్నారు —

వాక్య. యస్మా ద్దాత్మానవబోధమాత్రోపదానాః ప్రమా త్రాదయ స్తస్మాత్ ౨.౨౦

దం-అ. ప్రమాత మొదలగునవి ఏహేతువువలన చిదాత్మయందున మునే ఆశ్రయించియున్నదో అందువలన ముందటిశ్లోకముతో నన్వయము.

శ్లో. న విదం త్యాత్మనః సత్తాం ద్రష్ట్రాదర్శన గోచరాః,
న చాన్యోన్యమతోఽమీషాం జ్ఞేయత్వం భిన్నసాధనమ్

దం-అ. ప్రమాత, ప్రమాణము, విషయములు ఇవి తమయొక్క స గవు. పరస్పరమునైనను ఎఱుఁగవు. కావున వీనియొక్క జ్ఞేయత్వము (తె ధముండుట) మఱియొకటి సాధనముగా గలిగియున్నది.

తా. ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయములు (ద్రష్టృ, దర్శ, దృశ్యములు) అజ్ఞానముచేత కల్పింపఁబడినందున జడములై యున్నవి. గనుక తమతమస్వరూపములను తామే స్వతంత్రముగాఁ జూడలేవు. మఱియును వీనియందొకదానియొక్క స్వరూపమును మఱియొకటియును తెలియఁజాలదు. అనఁగా ద్రష్టయొక్క స్వరూపమును దర్శనము, దర్శనముయొక్క స్వరూపమును ద్రష్ట, ద్రష్టృదర్శనములయొక్క స్వరూపమును దృశ్యము, దృశ్యముయొక్క స్వరూపమును ద్రష్టదర్శనములున్ను చూడఁజాలవని యర్థము. గనుక జడములైన ద్రష్టృదర్శనదృశ్యములయొక్క స్వరూపమును, వీటికంటె విలక్షణమైన చిదాత్మ (సాక్షిచైతన్యము) తెలియుచుండును. అనఁగా ద్రష్టృ, దర్శన, దృశ్యములయొక్క ప్రకాశము వాటికంటె భిన్నమైన సాక్షిచైతన్యముచేత కలుగుచుండునని భావము.

అవ. ఓయీ! ద్రష్టృ, దర్శన, దృశ్యములకంటే భిన్నమై సాక్షిచైతన్యము మాకు ప్రసిద్ధముగా కాన్పించలేదని, తార్కికులు శంకించెదరని తలఁచి సాక్షిచైతన్యము నుపపాదించేకొఱకు ద్రష్టృ, దర్శన, దృశ్యములయొక్క లక్షణమును చెప్పుచున్నారు —

వాక్య. ద్రష్ట్రాదేరసాధారణరూపజ్ఞాపనాయాహ. ౨౨౨

దం-అ. ద్రష్టృమొదలగువానియొక్క అసాధారణమైన రూపాకారమును తెలియఁజేయుటకొఱకు చెప్పుచున్నారు.

తా. స్పష్టము.

శ్లో. బాహ్యాకారవాన్ గ్రాహ్యో గ్రహణం నిశ్చయాదిమత్,
అన్వయ్యహ మితిజ్ఞేయః సాక్షీ త్వాత్మా ధ్రువస్సదా. ౧౦౭.

దం-అ. బహిర్భూతమగు నాకారముగలది దృశ్యమనంబడు. నిశ్చయజ్ఞానము మొదలగునది దర్శనమనంబడు. అనుసరించియుండునది ద్రష్టయనంబడు. ఎప్పటికి సత్యమైన ఆత్మ సాక్షియనంబడు.

తా. నానావిధసంస్థానములుగలిగి, ఇదియని వ్యవహరింపఁబడుచున్న దేహేంద్రియఘటపటాది పదార్థములు దృశ్యములని చెప్పఁబడును. ఒకద్రష్టయందు విభిన్నముగాఁ గనుపడుచు నిశ్చయము స్మరణము సంశయము మొదలగుచిత్తవృత్తి దర్శనమనఁబడును. భిన్నభిన్నములైన నిశ్చయాదివృత్తులయందన్నిటియందు నేకముగా ననువర్తించుచు 'అహం' నేను అని చెప్పఁబడునది ద్రష్ట యనఁబడును. అనఁగా 'అహం శృణోమి, అహం స్మరామి, అహం నిశ్చినోమి' (నేను వినుచున్నాను,

నేను స్మరించుచున్నాను, నేను నిశ్చయించుచున్నాను) ఇత్యాది వ్యవహారమ
యందు శ్రవణాదివృత్తులొక్కొక్క వ్యవహారమునందే పర్యవసించి, స్మరణాదివ్యవః
రాంతరములయందు వేరేయుండగా, అన్ని వ్యవహారములయందును, 'అహం' అవ
(నేను నేను) అని సంబంధించియున్న అహమర్థము (నే ననేపదముచే వ్యక్తమగునః
ద్రష్ట యని తాత్పర్యము. జాగ్రత్స్వప్నదశలయం దీద్రష్టృ, దర్శన, దృశ్యమ
యొక్క సద్భావమును, సుషుప్తి, కైవల్యదశలయం దీమూఁటియొక్క అభావము
తెలియఁజేయుచు, నన్నిదశలయం దనువర్తించి, నిత్యమై, నిర్వికారమై యున్నచై
న్యము సాక్షియనఁబడును.' ఇట్టి సాక్షిచైతన్యమును తార్కికులు బలాత్కారముగనై
నంగీకరింపవలయును. అంగీకరింపనిచో, ద్రష్టృ, దర్శన, దృశ్యములు జాగ్రత్స్వః
ములయందు కలవని, సుషుప్తిదశలయందు లేవని తెలియుట శక్యమైయుండదనిభావవ
ఈద్రష్టృ, దర్శన, దృశ్యములయొక్కభావములను విస్పష్టముగా నీగ్రంథకర్తయే బృ
దారణ్యకవార్తికమునందు చెప్పియున్నారు. అదియెట్లనిన-శ్లో. "విభిన్నో బ
రాభాతి జాతిరూప క్రియాదిమాన్, నిభిన్నోఽనుభవా దేవ జ్ఞాతుర్ జ్ఞానా త్స
చరః." అని దృశ్యలక్షణము. దీని తాత్పర్యము. అనేకవిధమై ఇది యని ఆత్మకం
వెలుపల భాసించునదియై, ఘటత్వమనుష్యత్వాదిజాతులు, నీలపీతాదిరూపములు, చలి
దిక్రియలు, ఘటాదినామములుకలదై, ద్రష్టృదర్శనములకంటె భిన్నముగా, స్వా
భవమువల్లనే తెలియఁబడుచున్నపదార్థము దృశ్యమని (విషయమని) చెప్పఁబడు
'శ్లో. స్మరణాది విభాగేన జ్ఞాతి ర్యేకత్ర యత్ పృథక్, ప్రథతే ఽనేకరూపాః
తద్భాసం జ్ఞాతృకర్తృకమ్.' అని దర్శనలక్షణము, దీనియర్థము: స్మరణము (పూర్వా
భూతవిషయమును స్మరించుట), శ్రవణము (వినుట), ఇత్యాదిభేదముగలిగి, అహః
చెప్పఁబడే ద్రష్టను (అహం కర్తను), ఆశ్రయించి వేర్వేఱుగా, ననేకరూపములు
ప్రకాశించునట్టిపదార్థము దర్శనమనంబడు. అనఁగా శ్రోత్రాదీంద్రియములలోనుం
బహిర్నిర్గతము లగుచున్న శ్రవణాద్యంతఃకరణవృత్తులు దర్శనమనంబడు. 'శ్లో. స్మ
నిశ్చితి సంశీతి రాగాదిహి రుగాత్మసు, అహం రూపేణ యోఽన్వేతి సప్రమాతా ప
మతః.' అని ద్రష్టృలక్షణము. దీనికర్థము: స్మరణము, నిశ్చయము, సంశయః
రాగము, ద్వేషము మొదలగుచిత్తవృత్తులు వేర్వేఱుగా ప్రవర్తించుచుండ, వ
యన్నిటియందును ఏది 'అహం' (నేను) అని ఏకరూపముగా సంబంధించి వ్యవహ
పఁబడుచుండునో అది ద్రష్టయనంబడు.

అవ. చిదాత్మను సాక్షియని చెప్పినందున, అతనికి అసంసారిత్వమున్ను సా
పఁబడినదని చెప్పుచున్నారు.—

వాక్య. సర్వకారకక్రియా ఫలవిభాగాత్మక సంసారశూన్య
ఆత్మేతి గమ్యతే. ౨౨౪

దం-అ. సకలమైనసాధనములు, క్రియలు, ఫలములు, ఈమూఁడు భేదములు స్వరూపముగాఁగల సంసారములేనివాఁడు చిదాత్మయని తెలియఁబడుచున్నది.

తా. సంసారమనునది త్రిపుటిగానున్నది. అనఁగా మూఁడుభాగములుగలదై యున్నది. ఒకభాగము సాధనము. (అనఁగా ఘటాద్యుత్పత్తికి దండ, చక్ర, కులాలాద్యులు సాధనములు. యాగాదులకు చరు, పురోడాశాదులు సాధనములు.) రెండవభాగము క్రియ. (అనఁగా ఘటాద్యుత్పత్తి, యాగాదులున్ను) మూఁడవభాగముఫలము. (అనఁగా జలాహరణాదులు, స్వర్గాదులున్ను) ఈమూఁడువిధములుగానుండు సంసారము చిదాత్మయందు లేదుగనుక చిదాత్మ, సర్వసంసారరహితుఁడని భావము.

అవ. ఇందుకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. కారకక్రియా ఫలవిభాగ సాక్షిత్వా దాత్మనః. ౨౨౫

దం-అ. సాధనము, క్రియ, ఫలము ఈమూఁటికిని ఆత్మ, సాక్షియైనందున.

తా. వెనుకచెప్పిన కారక, క్రియా, ఫలములు మూఁటికి చిదాత్మ సాక్షియైనందున, చిదాత్మకు కారకాది సంబంధములు లేవని భావము. లోకములో సాక్షియగు వానికి, తనచేత చూడఁబడుచున్న వ్యవహారములోని సంబంధము లేదుగదా? అలాగే చిదాత్మయున్ను, సంసారమునకు సాక్షిగానున్నందున, సంసారసంబంధము కలవాఁడు కాదని తాత్పర్యము.

అవ. ఈయర్థమునే ఉత్తరశ్లోకము వివరించుచున్నదని చెప్పుచున్నారు.—

వాక్య. తదాహ. ౨౨౬

దం-అ. దానిని చెప్పుచున్నారు.

తా. స్పష్టము.

శ్లో. గ్రాహక గ్రహణ గ్రాహ్య విభాగే యోఽవిభాగవాన్,
హానోపాదానయో స్సాక్షీ హానోపాదానవర్జితః. ౧౦౮. ౨౨౭

దం-అ. ద్రష్టృ, దర్శన, దృశ్యములమూఁటియొక్క భేదమునందెవ్వఁడు భేదములేనివాఁడైయుండి, వానిభావాభావములకు సాక్షిగా నుండునో, అతను హేయోపాదేయరూపమైన సంసారములేనివాఁడై యుండును.

తా. ద్రష్టృ, దర్శన, దృశ్యములమూఁటిని ఏది తా నొక్కటిగానుండి ప్రకాశము జేయుచు, నా ద్రష్టృ, దర్శన, దృశ్యములయొక్క సత్తను, అసత్తను సాక్షిగా

నుండి చూచుచుండునో, ఆచిదాత్మ తాను సాక్షిగా నున్నందువల్లనే హేయోపాదేయరూపమైన సంసారముయొక్క సంబంధములేనివాఁడై, కేవలముగా నుండును.

అవ. తార్కికులుచేయు నాక్షేపము ననువదించి పరిహరించుచున్నారు.—

వాక్య. గ్రాహకాదినిష్ఠైవ గ్రాహకాదిభావాభావ విభాగ సిద్ధిః కస్మాన్నేతిచేత్తదాహ. ౨౨౮

దం-అ. ద్రష్టాదులయొక్క సత్తాసత్త్వవిభాగము సిద్ధించుట, యెందువలన ద్రష్టాదులయందే యుండగూడదనఁగా దానిని చెప్పుచున్నారు.

తా. ద్రష్టాదులభావాభావములు, సాక్షిచైతన్యము లేనిచో సిద్ధించవు. కావున ద్రష్టాదులసిద్ధికి (ప్రకాశమునకు) సాధకముగ సాక్షిచైతన్యమున్నదని సాధించుట యుక్తముకాదు. ద్రష్టాదులభావాభావములు వానిచేతనే సిద్ధించుచున్నవి. సాక్షిచైతన్యముతోటి ప్రయోజనమేమి? అని కొందఱు తార్కికు లాక్షేపించెదరు. అది యుక్తముకాదని శ్లోక ముత్తరముచే చెప్పఁబడును.

శ్లో. స్వసాధనం స్వయం నష్టః ననాశం వేత్త్యభావతః,
అత ఏవ న చాన్యేషాం మతోఽసౌ భిన్నసాక్షికః.౧౦౯. ౨౨౯

దం-అ. నశించినవాఁడు తాను లేనందువలన, సాధనమును, తననాశమును తాను తెలియఁజాలఁడు. అన్యులయొక్క సాధననాశములనున్ను నెఱుంగఁజాలఁడు. అందువల్లనే ఇది తనకంటే భిన్నమైన సాక్షిగలది.

తా. ద్రష్టగాని, దర్శనముగాని, దృశ్యముగాని తాను నశించినపిదప తాను లేకపోవును గనుక, తాను దేనివలన పుట్టెనో, ఆసాధనమును, తనకు నాశము ఏలాగున కలిగెనో దానిని యెఱుంగఁజాలఁడు. తాను లేకపోవుటచేతనే అన్యపదార్థముల సాధననాశములనున్ను యెఱుంగజాలఁడు. సుషుప్తిమూర్ఛాదిదశలయందు ద్రష్టాదుల నాశము మనకందఱకు ననుభవసిద్ధమై యున్నది. కావున ద్రష్టాదులు తమకంటె భిన్నమైన సాక్షిచైతన్యము కలవై యున్నవని నిశ్చయింపవలయునని భావము.

అవ. పూర్వపక్షవాది మరల యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. గ్రాహకాదే రన్యసాక్షిపూర్వకత్వసిద్ధేః స్వసాక్షిణోఽపి అన్యసాక్షిపూర్వకత్వా దనవస్థా. ౨౩౦

దం-అ. ద్రష్ట మొదలగువానికి మఱియొకసాక్షి పూర్వమందు కలిగియున్నటుల సిద్ధించినందున, సాక్షిచైతన్యమునకున్ను, మఱియొకసాక్షిచైతన్యము పూర్వమందు కలిగియుండును గనుక, అనవస్థాదోషము సంభవించును.

తా. సర్వమును జూచుచున్న ద్రష్ట, సాక్షిచేతఁ జూడఁబడుచున్నందున దృశ్య మని చెప్పేయెడల, ద్రష్టృదర్శనాదుల నన్నిటిని, ప్రకాశింపఁజేయుచున్నసాక్షి యున్ను మఱియొకసాక్షిచేత ప్రకాశింపఁజేయఁబడునని చెప్పవలసియుండును. ఆలాగునచెప్పిన యీసాక్షి మఱియొకసాక్షిచేత, అది యింకొక్కసాక్షిచేత ప్రకాశింపఁజేయఁబడునని అనవస్థాదోషము సంభవించును గనుక ద్రష్టకు ప్రకాశకమైన మఱియొకసాక్షి కలదని చెప్పఁదగదని భావము.

అవ. ఆక్షేపమును పరిహరించుచున్నారు.—

వాక్య. ఇతి చేత్తన్న సాక్షిణో వ్యతిరిక్తహేత్వనపేక్షత్వాత్. ౨౩౧

దం-అ. ఇటులనని యంటిరా, సాక్షిచైతన్యము తనకంటె భిన్నమై సాధనమును అపేక్షించనందువలన ఆలాగున చెప్పకూడదు.

తా. సాక్షిచైతన్యము శుద్ధచిద్రూపమైనందున స్వయముగా ప్రకాశించునుగాని తనకంటే మఱియొకదానిని యపేక్షించి ప్రకాశించదు గనుక, అనవస్థాదోషము సంభవించునని యాక్షేపించఁదగదని భావము.

వాక్య. అత ఆహ. ౨౩౨

దం-అ. దానిని చెప్పుచున్నారు.

తా. ఉత్తరశ్లోకములో నీయర్థమును విశదముగా చెప్పుచున్నారని భావము.

శ్లో. ధీవన్నాపేక్షతే సిద్ధిమాత్మా న్యస్మాదవిక్రియః,
నిరపేక్షమపేక్ష్యైవ సిద్ధ్యం త్యన్యే న తు స్వయమ్.౧౧౦.౨౩౩

దం-అ. చిదాత్మ (సాక్షిచైతన్యము) వికారములు లేనిదైనందున, అంతఃకరణమువలె మఱియొకదానివలన సిద్ధిని (ప్రకాశమును) అపేక్షించదు. అన్యవస్తువులు నిరపేక్షవస్తువును అపేక్షించియే సిద్ధించునుగాని స్వయముగా సిద్ధించవు.

తా. అంతఃకరణాదులనఁగా ద్రష్టృదర్శనదృశ్యములు జడములైనందున తాము స్వయముగా ప్రకాశింపఁజాలక సాక్షిచైతన్యము నపేక్షించి ప్రకాశించుచుండును. సాక్షిచైతన్యము తాను చిద్రూపమైనందున, స్వయముగా ప్రకాశించును గావున అంతఃకరణాదులవలె మఱియొకసాక్షిచైతన్యము నపేక్షించదని భావము.

అవ. ఇఁకను ఇదివఱకు సాధించిన ఆత్మానాత్మల అన్యోన్య అధ్యాసము యొక్క ఫలము నుపసంహరించుచున్నారు.—

వాక్య. యతో గ్రాహకాదిష్వాత్మ భావోఽనిబంధనఏవతస్మా
దన్వయవ్యతిరేకాభ్యాం విభజ్యా నాత్మనః స్వయమ్.

దం-అ. ఏకారణమువలన ద్రష్ట మొదలగువాటియందు, ఆత్మ బుద్ధి
నిమిత్తముగా కలదైయున్నదో, ఆకారణమువలన, అన్వయవ్యతిరేకములచేత,
కంటె వేఱుగా విభజించి నీవు, అని ముందటిశ్లోకముతో నన్వయము.

శ్లో. ఉత్పత్తిస్థితినాశేషు యోఽవగత్యైవ వర్తతే,
జగతోఽవికారయావేహి తమస్మీతి ననశ్వరమ్. ౧౧౧.

దం-అ. ప్రపంచముయొక్క ఉత్పత్తి, స్థితి, వినాశములయం
రమైన జ్ఞానస్వరూపముతోనే వర్తించుచున్నాఁడో ఆఈశ్వరుఁడను నే
యెఱుంగుము. నశించేపదార్థముల నెఱుఁగకుము.

తా. ఇదివఱకు చెప్పినప్రకారము ఆత్మానాత్మలకు, అన్యోన్యాధ్యాస
గియున్నందునను, జడములై అనాత్మలైన ద్రష్ట, దర్శన, దృశ్యములయందు
నేబుద్ధి అజ్ఞానముచే నేర్పడియున్నందునను, సాక్షియైన చిదాత్మ ద్రష్టదర
ములకంటె విలక్షణమై శుద్ధమైనదని యుక్తులచే నిష్కర్షించి, అట్టి సాక్షి
మైన నీవే, ప్రపంచము ఉత్పత్తిస్థితివినాశములనొందుచుండఁగా తాను నిర్వి
జ్ఞానము స్వరూపముగాగలిగియున్న యేపరమేశ్వరుఁడుగలఁడో అట్టిపరమేశ్వరు
తెలియుము. నశించిపోవుస్వభావముగల ద్రష్ట, దర్శన, దృశ్యములను నేనని
మని భావము. ఈశ్లోకములోని మూఁడవపాదములో నొకయక్షర మధికము
దున నీ వృత్తము 'భురిగనుష్టుప్' అని చెప్పవలసియున్నది. భరతాచార్యు
భురిక్ అనే ఛందములు వేదమందే కాదు, లోకమందుకూడా కలవని చె
రు గనుక నిచ్చట ఛందోభంగదోషముకలదని కొందఱు చేసిన యాక్షేపము
సితము.

అవ. 'తమస్మీత్యవేహి' ననశ్వరం (ఆయీశ్వరుఁడను నే నైతినని
నశించుదానిని నేనని తెలియకుము) అని పూర్వశ్లోకములో చెప్పినందున
నితరమైనవస్తువుకలదని యంగీకరింపఁబడినది గనుక అద్వైతమునకు హానిక
కించగా పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. స్వతస్సిద్ధాత్మచైతన్య ప్రతిబింబితా విచారిత సి
కాత్తా ననవబోధోత్థేతరేతర స్వాభావాపేక్ష సిద్ధత
త్స్వతశ్చాసిద్ధే రనాత్మనో ద్వైతేంద్రజాలస్య.

శ్లో. నస్స్వయం స్వస్యనానాత్వం నాగపత్త్యాత్మనాయ్యతః,
నోభాభ్యా మప్యతః సిద్ధ మద్వైతం ద్వైతబాధయా. ౧౧౨.

దం-అ. ఆత్మ భిన్నమైన ద్వైతప్రపంచమనే ఇంద్రజాలము స్వతస్సిద్ధమైన ఆత్మ చైతన్యముచేత ప్రతిబింబింపఁబడి అనిర్వచనీయమైన ఆత్మనిష్ఠాజ్ఞానమువల్ల నుదయించి అన్యోన్యస్వభావము నపేక్షించి సిద్ధించుచున్నందునను, స్వయముగా సిద్ధించనందునను, అద్వైతప్రపంచేంద్రజాలమునకు భేదము యేకారణమువల్ల తనచేతను లేదో, చిద్భ్రా మువల్లను లేదో, రెంటిచేతను లేదో, ఆహేతువువలన ద్వైతనివృత్తిచేత అద్వైతము సిద్ధమైయున్నది. అని వాక్యశ్లోకముల కొక్కటే యన్వయము.

తా. అజ్ఞానము ఆపాతముగా కనుపడుచున్నదేగాని, విచారించగా లేనిదేను. ఇదిగాక స్వతస్సిద్ధమై పరమార్థమైన ఆత్మచైతన్యముయొక్క ప్రతిబింబము కలదైయున్నది. ఇట్టి అజ్ఞానముచేత నీద్వైతప్రపంచము పుట్టింపఁబడినది. అందుచే ద్వైతప్రపంచము ఇంద్రజాలమువంటిది. మఱియును ద్వైతమనఁగా భేదము. ఇది ప్రతియోగి జ్ఞానము నపేక్షించియుండును. ఇది యన్యోన్యాశ్రయదోషమనంబడు. అనఁగా ఘటము పటముకంటె భిన్నమైనది. అనేవ్యవహారమునందు, ఘటమునందు గలభేదమునకు పటము ప్రతియోగియనంబడు. ముందుగా ఘటమునందు భేదము సిద్ధించితే పటమునకు ప్రతియోగిత్వము సిద్ధించును. పటమునందు ప్రతియోగిత్వము సిద్ధించితేగాని ఘటమునందు భేదము సిద్ధించదు. ఈప్రకారమే ప్రపంచము బ్రహ్మకంటె భిన్నమనేవ్యవహారమందు ప్రపంచమునందు గలభేదమునకు బ్రహ్మప్రతియోగియనంబడు. ముందుగా ప్రపంచమునందు భేదము సిద్ధించిననే బ్రహ్మయందు ప్రతియోగిత్వము సిద్ధించును. బ్రహ్మయందు ప్రతియోగిత్వము సిద్ధించిననే ప్రపంచమందు భేదముసిద్ధించుననుట అన్యోన్యాశ్రయదోషమునకు అర్థము. ఇట్టి యన్యోన్యాశ్రయదోషము కలిగియున్నందునను, అజ్ఞానముచేత కల్పింపఁబడినందునను, ఈద్వైతప్రపంచము తాను జడమైనందున, తనయొక్క భేదమును తానుసాధించుకోఁజాలదు. జడమైన ప్రపంచమునకు, అజడమైన చిదాత్మకు సంబంధములేనందున చిదాత్మచేతనున్ను ప్రపంచమునందు భేదము సాధింపఁబడదు. చిదాత్మప్రపంచములకు సంయోగసమవాయాది సంబంధములు సంభవించవు గనుకనే చిదాత్మప్రపంచములురెంటిచేతనున్ను ప్రపంచముయొక్క భేదము సాధింపఁబడదు. కనుక, ఏవిధమునఁ జూచినను ద్వైతప్రపంచమును సాధించే ప్రమాణములేనందున ద్వైతప్రపంచము సుతరాం తుచ్ఛమైయున్నది. ద్వైతశూన్యమై అద్వితీయపరమార్థమైన బ్రహ్మస్వరూపము నిర్బాధకముగ సిద్ధించుచున్నదని భావము.

అవ. చిదాత్మయందు కర్తృత్వాది ద్వైతప్రపంచము లేదని చెప్పినందుకు శ్రుతివాక్యమును ప్రమాణముగా నుదహరించెద మని చెప్పుచున్నారు.—

వాక్య. యథోక్తార్థ ప్రతిపత్తి ద్రఢిమ్నే శ్రుత్యుదాహరణోపన్యాసః (క్రియతే.) ౨౩౭

దం-అ. ఇదివఱకు చెప్పినయర్థమును నిశ్చయముగా తెలియుటకొఱకు శ్రుతివాక్యోపన్యాసము చేయఁబడుచు.

తా. స్పష్టము.

శ్లో. నిత్యావగతిరూపత్వా త్కారకాది ర్న చాత్మనః,
అస్థూలం నేతినేతీతి న జాయత ఇతి శ్రుతిః ౧౧౩. ౨౩౮

దం-అ. చిదాత్మస్వరూపము నిత్యమైనజ్ఞానమే స్వరూపముగాఁ గలిగియుం న్నందున కర్తృత్వకర్మత్వాది వికారము చిదాత్మకు లేదు. 'అస్థూలం' అనే శ్రుతియు, 'నేతి నేతి' అనే శ్రుతియుం 'నజాయతే' అనే శ్రుతియును ఈ యర్థమును చెప్పుచున్నవి.

తా. ఆత్మతత్త్వము నిష్కళంకశుద్ధ చైతన్యస్వరూపుఁడై యున్నందున, ఆయాత్మకు కర్తృత్వాదివికారములు కొంచెమైనను లేవు. 'అస్థూలమనణ్వహ్రస్వ'మిత్యాదిశ్రుతివాక్యమును, 'స ఏష నేతి నేత్యాత్మా' అనే శ్రుతివాక్యమును, 'నజాయతే మ్రియతే వా విపశ్చిత్' అనేకఠవల్లి శ్రుతివాక్యమున్ను ఈయర్థమును విశదముగా చెప్పుచున్నవి గనుక ఆత్మత్వము కర్తృత్వాదిధర్మశూన్యమని, మేముచెప్పిన విషయమును నమ్మవలయుం నని భావము. అక్షరమని చెప్పఁబడినపరబ్రహ్మ స్థూలమైనదిగాదు, సూక్ష్మమైనదికాదు, పొట్టిదిగాదు. అనఁగా స్థూలాదిదేహధర్మములు గలదిగాదని యర్థము. ఈచెప్పఁబడిన యాత్మ, మూర్తామూర్తములులేనిదని తాత్పర్యము. మరిన్ని సకలవిశేషశూన్యమనియర్థము. అసంకుచితజ్ఞానస్వరూపుఁడైన ఆత్మ పుట్టేవాఁడుకాఁడు; నశించువాఁడుకాఁడు. అనఁగా జన్మాదిషడ్భావవికారములు లేనివాఁడని యర్థము.

అవ. దేహాదిపదార్థములు ఆత్మకంటే భిన్నమని చెప్పినందులకు ఫలమును చెప్పుచున్నారు.—

వాక్య. సర్వస్యాస్య గ్రాహకాదేః ద్వైతప్రపంచస్య ఆత్మానవబోధ మాత్రోపాదానస్య స్వయం సేద్ధు మశక్యత్వాత్ ఆత్మసిద్ధే శ్చానుపాదేయత్వాత్. ౨౪౦

దం-అ. ఆత్మనిష్ఠమైన అజ్ఞానమే ఉపాదానకారణముగాగల సకలమైన ఈ ద్రష్టమొదలగు భేదప్రపంచము స్వయముగా సిద్ధించుటకు శక్యముగానందువల్లనున్ను, ఆత్మసిద్ధించినదనుట అంగీకరించఁదగియుండనందువల్లను.

శ్లో. ఆత్మనశ్చే న్నివార్యంతే బుద్ధి దేహ ఘటాదయః,
షష్ఠగోచర కల్ప్యాస్తే విజ్ఞేయాః పరమార్థతః. ౧౧౪. ౨౪౧

దం-అ. అంతఃకరణము, శరీరము, ఘటము మొదలగువస్తువులు ఆత్మవలన నిశ్చయముగా నివారింపఁబడుచున్నవి గనుక ఇవి వాస్తవముగా ఆఱవ ఇంద్రియముయొక్క విషయములవంటివని తెలియఁదగినవి. అని వాక్యశ్లోకముల కొక్కటే యన్వయము.

తా. ద్రష్టృ దర్శన దృశ్యరూపమైన ప్రపంచమంతయును నాత్మనిష్ఠాజ్ఞానముచే తనే కల్పింపఁబడినందున జడమైయున్నది. కావున తనంత తాను సిద్ధించనేరదు. ఆత్మచైతన్య మసంగతమైనందున ద్వైతప్రపంచమును సిద్ధింపఁజేయదు. కనుక జడమైన ప్రపంచమునకు మిథ్యాత్వము నిస్సంశయముగా సిద్ధించినది. ఇదిగాక అంతఃకరణము, దేహము, ఘటము మొదలగు ననాత్మపదార్థములు చిదాత్మస్వరూపములో చేరినవి కావనిన్ని, చిదాత్మసంబంధములుగావనిన్ని నిరాకరించినందువలన, బుద్ధ్యానాత్మపదార్థములును, ఆఱవఇంద్రియము,ఆఱవవిషయము యేప్రకారము మిథ్యాభూతములో ఆప్రకారమే మిథ్యాభూతములని తెలియవలయును. అనఁగా నింద్రియము లైదని వాటియొక్క విషయములైన శబ్దాదులైదని లోకములో ప్రసిద్ధములై యున్నవిగాని ఆఱవఇంద్రియము, దానియొక్కవిషయము మఱియొకటి కలదని ప్రసిద్ధిలేదు. అందువలన ఆవిమిథ్యాభూతములు. అటువలెనే అంతఃకరణాద్యనాత్మపదార్థములును మిథ్యాభూతములే నని భావము.

అవ. ఓయీ! అంతఃకరణాదిద్వైతప్రపంచము ప్రత్యక్షాదిప్రమాణములచేత ప్రకాశించుచున్నదిగదా? ఇట్టిద్వైతప్రపంచము షష్ఠేంద్రియతుల్యప్రపంచమని, షష్ఠేంద్రియవిషయతుల్యమని యేలాగున చెప్పవచ్చునని పూర్వవాది శంకించుచున్నాఁడు.

వాక్య. కుతో న్యాయ బలాదేవం నిశ్చితం ప్రతీయతే యస్మాత్.

దం-అ. నిశ్చితమైన ప్రపంచము యుక్తిసామర్థ్యముచేత నీప్రకార మెందువలన తోఁచఁబడును?

తా. ప్రత్యక్షము కాన్పించుచున్నందున వాస్తవమని నిశ్చయింపఁబడుచున్న ద్వైతప్రపంచమును యుక్తిబలముచే మిథ్యయని యెట్లుచెప్పనగు? యుక్తికంటేప్రత్యక్షము ప్రబలముకదా? అని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

శ్లో. నిత్యాం సంవిద మాశ్రిత్య స్వతః సిద్ధా మవిక్రియామ్,
సిద్ధాయంతే ధియో బోధా స్తాం శ్చాశ్రిత్య ఘటాదయః. ౧౧౫

దం-ఆ. ఎందువల్లననఁగా, నిత్యమై స్వతస్సిద్ధమై నిర్వికారమైన చైతన్య నాశ్రయించి బుద్ధియొక్క వృత్తులు ప్రకాశించుచున్నవి. ఆవృత్తుల నాశ్రయించి ఘ దివిషయములు ప్రకాశించుచున్నవి.

తా. ఆత్మచైతన్యము నిత్యమై, నిర్వికారమై మతియొక ప్రకాశకము నశే చక స్వయముగా ప్రకాశించుచున్నది. ఈయర్థము 'యత్సాక్షా ద్భృహ్మా' అనే యును ఇందుకు అనుకూలమైనయుక్తియును ప్రతిపాదించుచున్నవి. ఇట్టిస్వయంప్ర కమైన ఆత్మచైతన్యమునందు అవివేకముచేత నధ్యవసింపఁబడినందున అంతః వృత్తులు స్వయముగా ప్రకాశింపుచున్నవిగాని, స్వయముగా భాసించుటలేదు ఇట్టిఅం కరణవృత్తులయందు సంబంధించినందున ఘటాదివిషయములు అపరోక్షములుగా నుం కేవల జడములైనందున వాస్తవముగా నపరోక్షములుకావు గనుక శ్రుతులచేతను, కూలయుక్తులచేతను, బుద్ధ్యాదివిషయములు మిథ్యగా నిశ్చయింపఁబడినందున ష్టేంద్రియతుల్యములే యని నిశ్చయముగా నమ్మవలయునని భావము.

అవ. ప్రపంచమిథ్యాత్వమును ఉపసంహరించుచున్నారు.—

వాక్య. యస్మా న్న కయాచిదపి యుక్త్యాత్మనః కారకత్వం, క్రియాత్వం, ఫలత్వంచ ఉపపద్యతే తస్మా దాత్మవస్తు యాథాత్మ్యా నవబోధమాత్రోపాదానత్వా న్నభసీవ రజో ధూమతుషార నీహార నీలత్వా ద్యధ్యాసో యథోక్తాత్మ ని సర్వోయం క్రియాకారక ఫలాత్మక సంసారః అహం మమత్వం యత్నేచ్ఛాది మిథ్యా ధ్యాస ఏవేతి సిద్ధమ్.

దం-అ ఏకారణమువల్లనొకానొక యుక్తిచేతనుగూడా చిదాత్మకు కర్తృత్వ క్రియాత్వము, ఫలత్వము సంభవించదో ఆకారణమువల్ల ఆత్మతత్త్వముయొ యాథార్థ్యమును తెలియకపోవుటమాత్రమే (అజ్ఞానమే) కారణముగా కలిగియు దున, సకలమైన క్రియాకారక ఫలరూపమైన ఈసంసారమున్ను, అహంకారవ రప్రయత్నసంకల్పాదిధర్మములున్ను ఇదివఱకు నిరూపింపఁబడిన సచ్చిదానందరూ పరమాత్మయందు పరాగము, ధూమము, జలశీకరములు, మంచు, నీలత్వము మొ నవి ఆకసమునం దధ్యవసించఁబడినటుల అధ్యవసించఁబడినవే నని సిద్ధమైనది.

తా. ఏయుక్తివిచారించిచూచినను చిదాత్మయందు కర్తృత్వాదిసంసారధర్మ వాస్తవముగా కలవని చెప్పుట ఉపపన్నమై యుండలేదు గనుక, క్రియాకారక

రూపమైన ఈసంసారమున్ను, అహంకారమమకార ప్రయత్నేచ్ఛాదిధర్మములున్ను నిర్వికారమై, నిత్యమై, శుద్ధమైన చిదాత్మయందు మిథ్యగా నధ్యవసింపఁబడియున్నవని నిశ్చయింపఁబడుచున్నది. ఈవిధమున నధ్యవసించుటకు కారణమేమనఁగా, ఆత్మవస్తువుయొక్క యాథార్థ్యమును తెలియక పోవడమనే అనాద్యజ్ఞానమే కారణము. లోకములోనున్న కొందఱు అవివేకులు, స్వచ్ఛమైన ఆకసమును జూచి దానియందు ధూళిధూమాదివిశిష్టత్వమును నీలపీతాద్యాకారములను, ఆకసముయొక్క స్వరూపమును యథార్థముగా తెలియక ఆయజ్ఞానముచేత నధ్యవసించుచున్నారుగదా? ఆప్రకారమే చిదాత్మయందును కర్తృత్వాదిప్రపంచము నారోపించుచున్నారని భావము.

వాక్య. ఇమ మర్థ మాహ. ౨౮౫

దం-అ. ఈయర్థమును చెప్పుచున్నారు.

తా. ఈవాక్యములో చెప్పఁబడినయర్థము శ్లోకముతో విశదముగా చెప్పఁబడు నని భావము.

శ్లో. అహం మిథ్యాభిశాపేన దుఃఖార్తా తదృభుత్సయా,
ఇతః శ్రుతిం తయా నేతీ త్యుక్తో కైవల్య మాస్థితః.౧౧౬. ౨౮౬

దం-అ. అహంకారమనే మిథ్యాపవాదముచేత దుఃఖముగలిగియున్నవాఁడై చిదాత్మ దానినెఱుంగవలయుననే ఇచ్ఛచేత శ్రుతిని యాశ్రయించినవాఁడై ఆశ్రుతిచేత ఇటువంటివాఁడవు కాదని చెప్పఁబడినవాఁడై స్వాస్థ్యమును పొందును.

తా. లోకములో నొకపురుషుఁడు నిర్దోషిగా నున్నప్పటికి, మిథ్యాపవాదమును బొంది మిక్కిలి దుఃఖించుచున్నవాఁడై ఆమిథ్యాపవాదము తనకు ఏలాగున ప్రాప్తించెనో తెలియఁదలఁచి, తనకు మిక్కిలి విశ్వాసపాత్రమైన తల్లినిగాని, తండ్రినిగాని యాశ్రయించి, వారివలన నీవు ఇటువంటిదోషము గలవాఁడవుగావు. జనులు అజ్ఞానముచేత నీయందీదోషము నారోపించినారు. అనిబోధింపఁబడినవాఁడై, దుఃఖమునువదలి స్వస్థతనొంది సుఖించును. ఆప్రకారమే చిదాత్మయును తాను నిత్యము నిర్వికారుఁడైయున్నప్పటికి అనాద్యజ్ఞానముచేత తనయందు ఆరోపింపఁబడినందున బహుదుఃఖముల ననుభవించుచు ఈయహంకారాదికము తన కేలాగున ప్రాప్తించెనో తెలియవలయునని, విశ్వసించతగిన శ్రుతిని ఆశ్రయించగా 'నేతి నేత్యాత్మా, అగృహ్యోనహి గృహ్యతే' ఇత్యాదివాక్యములచేత చిదాత్మకు సర్వదుఃఖములను పరిత్యజించి పరమానందరూపమైన స్వస్వరూపమును బొంది కేవలుఁడై యుండునని భావము.

అవ. ఓయీ! శ్రుతివాక్యముయొక్క బోధచేత చిదాత్మ కైవల్యము నొందునని చెప్పితే శ్రుతివాక్యము దాని నుపదేశించునట్టి గురువున్ను యథార్థమని చెప్పవలయును గదా? శ్రుతివాక్యమున్ను గురువున్ను మిథ్యలైనయెడల, దుఃఖనివర్తకమైన యథార్థజ్ఞానము ముముక్షువు కేలాగున గలుగును? యథార్థవస్తువుచేత యథార్థవస్తువు పుట్టును గాని అయథార్థవస్తువుచేత యథార్థవస్తువు పుట్టదుగదా? లోకములోనున్ను వాస్తవధూమజ్ఞానముచేత వహ్నిజ్ఞానము గలుగునుగాని, బాష్పధూమజ్ఞానముచేత యథార్థధూమజ్ఞానము కలుగుటలేదు. కావున శ్రుతి, గురువులు యథార్థమని చెప్పవలయును. అందుచేత అద్వైతమునకు హానికలుగుచున్నదని పూర్వపక్షవాది శంకించగా పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. తస్యాస్య ముముక్షోః శ్రౌతాద్వచసః స్వప్ననిమి
త్తోత్సారితనిద్రస్యేవేయం నిశ్చితార్థా ప్రమాజాయతే. ౭౭

దం-అ. ఆఈముముక్షువునకు శ్రుతిసంబంధమైనవాక్యమువలన స్వప్నమందు కనుబడిన నిమిత్తముచేత నివారింపఁబడిన నిద్రకలవానికివలె యీ నిశ్చయింపఁబడినవిషయముగల యథార్థజ్ఞానము పుట్టుచున్నది.

తా. అహంకారాదిదోషము లేలాగున ప్రాప్తించెనో యెఱిఁగి, వానిని నివర్తింపఁజేసికొన తలఁచి, శ్రుతివాక్యముల నాశ్రయించిన ముముక్షువునకు 'తత్త్వమసీ'త్యాది శ్రుతివాక్యములచేత ఆత్మతత్త్వవిషయమైన యథార్థజ్ఞానమే పుట్టును. శ్రుతివాక్యము దాని నుపదేశించిన ఆచార్యులు అయథార్థమైనప్పటికి వాటివలన యథార్థజ్ఞానము పుట్టుటకు విరోధములేదు. ఎటువలెననఁగా నిద్రబోవుచున్నవానికి స్వప్నములో సర్పవ్యాఘ్రాదులు కనుపడుటచేత, అనిద్ర నివర్తించి భయకంపాదులు కలుగుచున్నవి. అచ్చట స్వప్నదృష్టములైన సర్పవ్యాఘ్రాదులు మిథ్యలైనప్పటికి జాగ్రదవస్థలో కూడ ననుభవింపఁబడుచున్నందున భయకంపాదులు యథార్థములేగదా? అటులే శ్రుతియును ఆచార్యులు మిథ్యలైనప్పటికి వాటివలన కలిగినజ్ఞానము యథార్థమే కానగు. శ్రుత్యాచార్యులు మిథ్యలైనందున అద్వైతమునకు హానిలేదని భావము.

అవ. వేదాంతవాక్యములవల్ల నెట్టియథార్థజ్ఞానము కలుగునో చెప్పుచున్నారు-

శ్లో. నాహం న చ మమాత్మత్వాత్సర్వదా నాత్మవర్జితః,
భానావివ తమోధ్వాన్తోఽపహ్నవశ్చ తథా మయి. ౭౧౭.౭౮

దం-అ. నాకు జ్ఞానముమాత్రమే స్వరూపముగా గలిగియున్నందున నెప్పటికిని నేను అనాత్మసంబంధములేనివాఁడను. సూర్యునియందు అంధకారములయొక్క ఆరోపము అపవాదమువలె, నాయందును అహంకారములేదు, మమకారములేదు.

తా. సూర్యునియందు అంధకారము ఆరోపింపఁబడినటుల విశుద్ధజ్ఞానస్వరూపుఁడనైన నాయందు అహంకారాదు లారోపింపఁబడినవి. అవి నివర్తించగనే, నేను సకలవిశేషశూన్యమైన కేవల చిద్రూపుఁడనే నని యథార్థజ్ఞానము కలుగుచున్నది. అహంకారాదులయొక్క నివృత్తియున్ను కల్పితమైనందున, ఆత్మస్వరూపము నిర్విశేషమనుటకు విరోధములేదు. అనఁగా ప్రచండప్రకాశముగల సూర్యబింబమందు అంధకారసంబంధము కాలత్రయమందుకూడా లేనందున, సూర్యునియం దంధకారముకలదని చెప్పుట యెను, యెటుల మిథ్యయో అటులే చిదాత్మయందు అహంకారాదులు కలవని, లేవని చెప్పుట మిథ్యయే నని భావము.

అవ. ఈప్రకారము శ్రుతిస్మృతివాక్యములను వినుటచేత అహంకారమమకారాది సంసారము నివర్తించగా అంతకుమునుపు సాంసారిక సుఖలేశములచే నాకర్షింపఁబడిన చిత్తముగలిగి యింతకాలము ప్రమత్తుఁడనైయుంటిని, ఎంతకష్టముపడితి నని తత్త్వవేత్త మిక్కిలి పరితాపమును పొందునని చెప్పుచున్నారు.—

వాక్య. సోఽయమేవం ప్రతిపన్నస్వభావ మాత్మానం ప్రతిపన్నోఽనుక్రోశతి.  ౨౮౯

దం-అ. ఆయీముముక్షువు యీప్రకారము నిశ్చయింపఁబడిన స్వభావముగల స్వస్వరూపమును తెలిసికొనినవాఁడై ఖేదము నొందును.

తా. ముముక్షుపురుషుఁడు సాధనచతుష్టయసంపత్తిపూర్వకముగా సద్గురుసన్నిధానంబునకుం బోయి వేదాంతమహావాక్యము లుపదేశింపఁబడి నిర్విశేషచిన్మాత్ర పరబ్రహ్మ నేనే నని సమ్యక్జ్ఞానముకలవాఁడై గతించినకాలమునకు తనకు కలిగిన మూర్ఖత్వమును ద్దేశించి యీలాగున పరితపించునని భావము.

అవ. ఏమని పరితపించునో చెప్పుచున్నారు.—

శ్లో. యత్ర త్వస్యేతి సాటోపం కృత్స్నద్వైత నిషేధినీమ్,
ప్రోత్సారయంతీం సంసార మయ్యశ్రౌషం న కిం శ్రుతిమ్. ౧౧౭

ద-అ. సంరంభముతో కూడుకొన్నటుల, సకలమైన ద్వైతప్రపంచమును నిషేధించునదియుం, సంసారమును నిరాకరించినదియు నైన 'యత్ర త్వస్య' అనే శ్రుతిని యేలవినకపోయితిని?

తా. 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్ కేన కం పశ్యేత్' అనే శ్రుతి భేదప్రపంచమంతయుం మిథ్యయని, అహంకారాదిసంసారము కాలత్రయమందుకూడా

ఆత్మయందు లేదనిన్ని నిశ్శంకముగా ఘోషించుచున్నదే. ఇట్టిశ్రుతిని నేను ఇం
దు ఏలవిననైతిని; వినియుందునా? ఇంతయనర్థముల ననుభవించకనేయుందునని
పరితాపమును పొందునని భావము.

ఎప్పుడు ఈముముక్షువునకు సర్వముచిదాత్మగానే భాసించునో, అనఁగా ఆ
థార్థ్యజ్ఞానముకలుగునో అప్పుడు దేనిచేత దేనిని చూచును. అనఁగా సర్వానర్థ
న ద్రష్టృ, దర్శన, దృశ్యప్రపంచము నివర్తించునని శ్రుత్యర్థము.

అవ. ఇపుడు ఆత్మతత్త్వజ్ఞానముయొక్క ఫలమును చూపించు నధ్యా
నుపసంహారించుచున్నారు.—

శ్లో. ఇత్యోఙ్మిత్యవబుద్ధాత్మా నిష్ఫలోఽకారకోఽక్రియః,
విరక్త ఇవ బుద్ధ్యాదే రేకాకిత్వముపేయివాన్. ౧౧౯.

దం-అ. ఈప్రకారము ఓం అని తెలియఁబడిన ఆత్మకలవాఁడై ఫలము,
త్వము, క్రియ ఈమూఁటిని నివర్తింపఁజేసికొనినవాఁడై వైరాగ్యముగలవానివ
మొదలగుదానివలన వ్యుత్థానమునొంది అద్వితీయత్వము నొందినవాఁడగును.

తా. సదాచార్యులచే నుపదేశింపఁబడిన వేదాంతమహావాక్యములయొక్క
ర్థ్యమును ఓమ్ అనే ప్రణవము ననుసంధించి ధ్యానించుచు స్వస్వరూపయాథార్థ
చక్కఁగా తెలిసికొని క్రియాకారకఫలరూపమగు సంసారములోనుండి ని
ంతఃకరణాదులను పరిత్యజించి విరక్తునివలె కైవల్యమునొందును. అనఁగా వైరా
లపురుషుఁడు పుత్త్రమిత్రకళత్రాదుల నందఱునుపదలి, గృహక్షేత్రాదులయందుగ
మానమును విడిచి, పరమహంసపరివ్రాజకాశ్రయము నంగీకరించి ఏకాకిగా నెట్లు
రించునో అటులే సదాచార్యోపదిష్టమహావాక్యార్థము సుప్రణవానుసంధాన ఫ
ముగా ననుభవించి, అంతఃకరణాది పరిత్యాగపూర్వకముగా స్వస్వరూపమునంద
కైవల్యము నొందునని భావము.

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పూజ్యపాదశిష్య శ్రీసురేశ్వరాచార్యకృతా
ర్మ్యసిద్ధౌ సంబంధాఖ్యాయాం ద్వితీయోఽధ్యాయః.

ఇది సర్వవేదాంతసారసంగ్రహ వ్యాఖ్యానంబున
ద్వితీయాధ్యాయము.

# తృతీయాధ్యాయము



అవ. ఇఁక రచింపఁబోవు నధ్యాయమునకు నిదివఱకు మునుపు రచించిన యధ్యాయమునకును సంబంధమును చూపుటకై రెండవయధ్యాయములో చెప్పఁబడినవిషయమును సంగ్రహముగా చెప్పుచున్నారు.—

వాక్య. సర్వోఽయం ప్రమితృ ప్రమాణ ప్రమేయ ప్రమాతృలక్షణః ఆబ్రహ్మస్తంబపర్యన్తో మిథ్యాధ్యాస ఏవేతి బహుశః ఉపపత్తిభి రతిష్ఠిపమ్, ఆత్మాచ జన్మాది షడ్భావవికారవర్జితః కూటస్థబోధ ఏవేతి స్ఫుటీకృతమ్. ౧

దం-అ. ప్రమా, ప్రమాణము, ప్రమేయము, ప్రమాత, ఈరూపముగానున్న బ్రహ్మమొదలు సూక్ష్మజంతువువఱకు నేర్పడియున్న సకలమైన ఈప్రపంచము మిథ్యారూపమై యారోపింపఁబడినది యని అనేకవిధములుగా యుక్తులచేత స్థాపించితిని. చిదాత్మయును జన్మమొదలగు షడ్భావవికారములు లేనివాఁడనియు, నిర్వికారమైన జ్ఞానమే స్వరూపముగ గలవాఁడని స్పష్టముగఁ జెప్పఁబడినది.

తా. గడచిన రెండవయధ్యాయములో, ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయ, ప్రమారూపమైయుండి బ్రహ్మమొదలు పిపీలికవఱకుగల అనేకజంతువులతో కూడుకొని, బాహ్యాధ్యాత్మిక భేదభిన్నమైన యీనానావిధప్రపంచము, చిదాత్మయందు అనాద్యజ్ఞానముచేత నారోపింపఁబడి, మరుమరీచికాజలశుక్తిరజతాదులవలెమిథ్యగా ప్రకాశించుచున్నదని అనేకయుక్తులను జెప్పి నిరూపించి స్థాపించినారము. ఇదిగాక చిదాత్మమాత్రము జన్మమరణ, స్థితిపరిణామ, వృద్ధిక్షయము లనేభావవికారము లాఱును లేనిదనియు, నిత్యనిర్వికారమైన జ్ఞానమే స్వరూపముగాగలదనియు, సుస్పష్టముగ నిరూపించినారము. మూఁడవయధ్యాయములోఁ జెప్పఁబోవు వాక్యార్థజ్ఞానమున కుపయోగించు పదార్థజ్ఞానముకొఱకు ప్రపంచమిథ్యాత్వచిదాత్మపారమార్థికత్వములు రెండవయధ్యాయములో స్పష్టముగా నిరూపింపఁబడినవని భావము.

అవ. ఓయీ! రెండవయధ్యాయములో పదార్థశోధనముచక్కఁగా చేయఁబడినదిగదా? పదపదార్థముల నెఱింగినవానికి స్వయముగానే వాక్యార్థజ్ఞానము కలుగును

గనుక మూఁడవయధ్యాయము నెందుల కారంభించవలయునని పూర్వపక్షవాది శంకించఁగా సిద్ధాంతవాది యుత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. తయోశ్చ మిథ్యాధ్యాసకూటస్థాత్మనోనాంతరేణాజ్ఞానం సంబంధః. 2

దం-అ. ఆమిథ్యారూపమైన అధ్యాసమునకును, నిర్వికారమైన చిదాత్మకును అజ్ఞానములేకనే సంబంధము కలుగదు.

తా. ఆరోపింపఁబడిన మిథ్యారూపమైన సంసారమునకును, అధిష్ఠానమైన నిర్వికారచిదాత్మకును సంబంధము అధిష్ఠానగోచరమైన అజ్ఞానముచేతనే గలుగుచున్నది. అదియెటులన, లోకములో నిది రజతమని యధ్యవసింపఁబడుచున్న రజతమునకును, దానికి అధిష్ఠానమైన శుక్తికిని సంబంధము శుక్తిగోచరమైన అజ్ఞానముచేతనేగదా కలుగుచున్నది. అటులే సంసారచిదాత్మలకు సంబంధము అజ్ఞానముచేతనే కలుగుచున్నదిగాని, అజ్ఞానమువినాగా సంబంధము సంభవించదు. కనుక అజ్ఞానము 'అహమిదం, మమేదం' (నేను మనుష్యుఁడను, ఇది నాది) అని వ్యవహరింపఁబడుచున్న ఆత్మానాత్మలకు సంబంధమును కలుగఁజేయుచున్నదని అంగీకరించవలయును. ఇట్టి యజ్ఞానము నివర్తించినగాని పురుషార్థము (మోక్షము) సిద్ధించదు. అజ్ఞాననివృత్తి ముందు చెప్పఁబోవు ప్రకారము వాక్యార్థజ్ఞానముచేతగాని కలుగదు కనుక వాక్యార్థజ్ఞానసంపాదనార్థమై మూఁడవయధ్యాయారంభ ముచితమైయున్నదని భావము.

అవ. అధిష్ఠానారోప్యములకు సంబంధము అజ్ఞానము లేకపోయినను కొన్నిస్థలములయందు కలుగుచున్నదని శంకించగా పరిహారమును చెప్పుచున్నారు —

వాక్య. అన్యత్ర చోదనా పరిప్రాపితాత్ యథా "ఇయమేవ ర్గగ్నిః సామే"తి. 3

దం-అ. విధివాక్యములచేత విధింపఁబడిన విషయముకంటే మఱియొకచోట లేదు. "ఈభూమియే ఋగ్వేదము, అగ్నియే సామవేదము" అని శ్రుతియెట్లో అట్లే.

తా. ఉపాసనములను విధించువాక్యములు ఒకదానియందు మఱియొకదానిని యారోపించి యుపాసించవలయునని విధించును. అట్టిస్థలములయందు అజ్ఞానములేకనే అధిష్ఠానారోప్యములకు సంబంధముకలదు. అది యెచ్చటననఁగా, "ఇయ మేవ ర్గగ్నిస్సామ" ఇత్యాదివాక్యములు. ఈభూమియే ఋగ్వేదమని అగ్నియే సామవేదమని ఉపాసించవలయునని విధించుచున్నవి. ఇచ్చట పృథివి అగ్నియు అధిష్ఠానములు. ఋగ్వేద

సామవేదము లారోప్యములు. ఈరెంటికినిసంబంధము విధివాక్యముచేతఁ జేయఁబడినది గాని, అజ్ఞానముచేత కలుగఁజేయఁబడినది కాదు. కావున విధిప్రాప్తస్థలములయందుతప్ప ఇతరస్థలములయందు అధిష్ఠానారోప్యములకు సంబంధము అజ్ఞానకల్పితము సిద్ధమని భావము.

అవ. నివర్తింపఁజేయఁబడే అజ్ఞానమునకును, నివర్తింపఁజేయు జ్ఞానమునకును ఆశ్రయము ఒకటియై యుండవలయు ననునియమము, ఇది రజతము, ఇది శుక్తి యనే వ్యవహారములయందు కాన్పించుచున్నయది. అనఁగా నిది రజతమని రజతప్రతీతిని కలుగఁజేసిన అజ్ఞానము ఎచ్చటనున్నదో యచ్చటనే ఇది శుక్తియని శుక్తిజ్ఞానము కలుగుచున్నది. కనుక శుక్తిజ్ఞానము రజతప్రతీతిజనగా జ్ఞానమును నివర్తింపఁజేయుచున్నది. గావున, నివర్తకజ్ఞాన,నివర్త్యాజ్ఞానములు రెండునొకచోటనుండవలయుననే నియమము కలదు.గనుక బ్రహ్మజ్ఞానమున్ను ఆత్మయందుండు అజ్ఞానమున్ను సమానాశ్రయములని కాన్పింపవలయును. దానిని కనుపఱచునిమిత్తమై ఉత్తరగ్రంథము నారంభించుచున్నారు.-

వాక్య. తచ్చాజ్ఞానం స్వాత్మమాత్రనిమిత్తం న సంభవతీతి కస్యచి త్కస్మింశ్చిద్విషయే భవతీ త్యభ్యుపగంతవ్యమ్.౪

దం-అ. ఆయజ్ఞానము తనస్వరూపముమాత్రమే నిమిత్తముగాఁగలిగినదిగా సంభవించదు గావున, మఱియొకదానికిని, మఱియొక విషయమునందును అంగీకరించవలయును.

తా. అజ్ఞానము ఎప్పటికిని పరతంత్రముగానే కనుపడుచున్నందున, తాను సత్తగలిగియుండుటయందుగాని, తాను ప్రకాశించుటయందుగాని, తానే నిమిత్తమైయుండదు గనుక, అజ్ఞానమునకు, ఆశ్రయమును, విషయమును నిరూపింపవలసియున్నది. ఆలాగున నిరూపించగా అజ్ఞానముయొక్క ఆశ్రయవిషయములు జ్ఞానముయొక్క ఆశ్రయవిషయములతోటి సమానములే యగునని భావము.

అవ. ఓయీ! ఇంతమాత్రముచేతనే జ్ఞానాజ్ఞానములయొక్క విషయాశ్రయములు సమానములగునా యని శంకించగా పరిహారమును చెప్పుచున్నారు.——

వాక్య. ఇహ చ పదార్థద్వయం నిర్ధారిత మాత్మానాత్మా చ. ౫

దం-అ. ఇచ్చట ఆత్మయని అనాత్మయని రెండుపదార్థములు నిరూపింపఁబడినవి.

తా. ఈవేదాంతశాస్త్రమునందు చిదాత్మ యనే పదార్థము ఒకటి, అనాత్మ యనేపదార్థము ఒకటి ఈరెండుపదార్థములే నిర్ణయింపఁబడినవి అని భావము.

అవ. ఆత్మానాత్మపదార్థములు రెండును నిర్ణయింపఁబడినమాత్రముచే జ్ఞానాజ్ఞానములకు సమానాశ్రయవిషయత్వ మేలాగున సిద్ధించునో చెప్పుచున్నారు.—

వాక్య. తత్రానాత్మనస్తావన్నజ్ఞానేనాభిసంబంధః. ౬

దం-అ. అందులో ననాత్మకు అజ్ఞానముతోటి సంబంధము లేదు.

తా. వేదాంతశాస్త్రములో నిర్ణయింపఁబడిన ఆత్మానాత్మపదార్థములు రెంటిలో నేది యజ్ఞానమునకు విషయముగను, నాశ్రయముగను నుండునో దానిని విచారించెదము. అజ్ఞానము అనాత్మతోటి విషయివిషయసంబంధము, ఆశ్రయాశ్రయిసంబంధమున్ను లేదు. అనఁగా ననాత్మవస్తువు అజ్ఞానమునకు నాశ్రయము కాదు. విషయమున్ను కాదని భావము.

అవ. అనాత్మపదార్థము అజ్ఞానమునకు విషయము ఆశ్రయము కాకపోవుటకు హేతువు ఏమనఁగా చెప్పుచున్నారు.—

వాక్య. తస్యహి స్వరూపమేవహి అజ్ఞానమ్. ౭

దం-అ. దానియొక్క స్వరూపమే అజ్ఞానముగదా?

తా. అనాత్మయొక్క స్వరూపమే అజ్ఞానమైనందున, అజ్ఞానము అజ్ఞానమునకాశ్రయమని చెప్పుట యుక్తము కాదని భావము.

అవ. అనాత్మపదార్థ మజ్ఞానమైనప్పటికి అజ్ఞానమున కాశ్రయ మేలకాఁగూడదు? విరోధమేమంటే వినుము. చెప్పుచున్నాను.—

వాక్య. నహి స్వతః అజ్ఞానస్యాజ్ఞానం ఘటతే. ౮

దం-అ. అజ్ఞానమునకజ్ఞానము స్వయముగా ఘటించదుకదా?

తా. శుక్తియందారోపింపఁబడినరజతము అజ్ఞానపరిణామమైనందున అజ్ఞానాత్మకముగదా? అట్టి అజ్ఞానాత్మకమైన శుక్తిరజతము అజ్ఞానమునకాశ్రయము కాదుగదా? అటులే జడమైనందున అజ్ఞానస్వరూపమైయున్న అనాత్మపదార్థము అజ్ఞానమునకాశ్రయము కానేరదని భావము. అజ్ఞానరూపమైన యనాత్మవస్తువు అజ్ఞానమునకాశ్రయమని చెప్పితే, అనాత్మవస్తువు అజ్ఞానమునకాశ్రయము కానేరదు. ఎందువలన ననఁగా నజ్ఞానరూపమైనందున-ఎటువలెననఁగా శుక్తిరూప్య, రజ్జుసర్పాదులవలెనను అనుమానప్రమాణము విరోధించునని తాత్పర్యము.

అవ. అనాత్మ అజ్ఞానాశ్రయము కాదనుటకు మఱియొక హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. సంభవ దప్యజ్ఞానస్వభావే అజ్ఞానం క మతిశయం జనయేత్.

దం-అ. అజ్ఞానస్వరూపమైనదానియందు అజ్ఞానము సంభవించినప్పటికి ఏమి అతిశయము పుట్టించును?

తా. సంశయవిపర్యయములు ఎచ్చటనుండునో (అచ్చట అజ్ఞానము ఆశ్రయించియుండును. ఘటాదులకు సంశయవిపర్యయములు లేవు. గనుకనే వాటిని అజ్ఞానము ఆశ్రయించియుండలేదు. చేతనులయందు సంశయవిపర్యయములు కలవు. వారిని అజ్ఞానము ఆశ్రయించియున్నది. గనుక అనాత్మవస్తువు సంశయవిపర్యయము కలదికానందుననే అజ్ఞానమున కాశ్రయముకాదు. అనఁగా నజ్ఞానము దేనిని ఆశ్రయించియుండునో దానియందు సంశయవిపర్యయములు పుట్టించును. అనాత్మయందుసంశయవిపర్యయములు పుట్టుటలేదు. గనుక అది అజ్ఞానమున కాశ్రయముకాదని తాత్పర్యము.

అవ. మఱియొక హేతువును పూర్వోక్తార్థమున చెప్పుచున్నారు.—

వాక్య. న చ తత్ర జ్ఞానమస్తి యేన తత్ప్రతిషేధాత్మక మజ్ఞానం స్యాత్. ౧౦

దం-అ. ఆ అనాత్మయందు జ్ఞానములేదు. ప్రతిషేధించుటయే స్వరూపముగాఁగల అజ్ఞానము సంభవించునో.

తా. ఈలోకములో శుక్తియం దజ్ఞానముచేరి, రజతమును ప్రకాశింపఁజేయుచుండఁగా శుక్తితత్త్వజ్ఞానమనే సమ్యక్ జ్ఞానమా శుక్తియందే చేరి తన్నిష్ఠాజ్ఞానమునునివర్తింపఁజేయుచున్నది. గనుక అజ్ఞానసమ్యక్ జ్ఞానము లేకాశ్రయములుగా నుండుట నియతమైయున్నది గావున అనాత్మవస్తువునందు సమ్యక్ జ్ఞానము లేనందున అజ్ఞానమున్ను అనాత్మయందు లేదని భావము. ఆత్మవస్తువిషయమైన సమ్యక్ జ్ఞానముచేతపురుషార్థము కలదని శాస్త్రములు చెప్పుచున్నవి. గనుక అనాత్మవిషయమగు సమ్యక్ జ్ఞానముచేత పురుషార్థముకలదని చెప్పియుండలేదు గనుక, అనాత్మవస్తువు సమ్యక్ జ్ఞానమున కాశ్రయముకాదు. అందువల్లనే అజ్ఞానమున కాశ్రయముకాదని తాత్పర్యము.

అవ. పూర్వోక్తార్థమునందే మఱియొక హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. అనాత్మన శ్చాజ్ఞానప్రసూతత్వాత్. ౧౧

దం-అ. అనాత్మవస్తువు అజ్ఞానముచేతనే పుట్టినందున అజ్ఞానమున కాశ్రయము కాదని శేషము.

తా. కార్యము కారణము నాశ్రయించియుండునుగాని కారణము కార్యము నాశ్రయించియుండదు. అజ్ఞానముచేతనే యనాత్మవస్తువు జన్మించినది గనుక అజ్ఞానమున కాశ్రయము కానేరదని భావము.

అవ. అజ్ఞానముయొక్క స్వభావము నాలోచించినప్పటికి అజ్ఞాన మహంకారాద్యనాత్మవస్తువుల నాశ్రయించి యుండునని చెప్పుట యుక్తముకాదనుచున్నారు.—

వాక్య. నహి పూర్వసిద్ధం సత్తతో లబ్ధాత్మలాభస్య సేత్స్య
తః ఆశ్రయస్య ఆశ్రయిభవతి. ౧౨

దం-అ. అజ్ఞానము తాను పూర్వమందే కలదై తనచేతనే పొందఁబడినస్వరూపలాభముకలిగి, సిద్ధించుచు, అజ్ఞానమున కాశ్రయమని ఎన్నఁబడుచున్న అనాత్మకాశ్రయము కలదికాదు.

తా. అజ్ఞానమనునది అనాత్మవస్తువులన్నిటికి కారణమైనందున అనాత్మవస్తువుల ఉత్పత్తికి పూర్వముననే తాను సిద్ధమైయున్నది. అహంకారాద్యజ్ఞానవస్తువు లాయజ్ఞానమువల్లనే పుట్టి దానివల్ల సత్తకలదై యున్నందున, అజ్ఞానాధీనసిద్ధి కలదై యున్నదికాని స్వతంత్రముగ లేదు. ఇట్టి అనాత్మవస్తువు అజ్ఞానమున కాశ్రయమని మీరు తలంచుచున్నారు. అనాత్మవస్తువుయొక్క ఉత్పత్తికి పూర్వమందే సిద్ధమైయుండి అనాత్మవస్తువునుపుట్టించి వాటికి ఆశ్రయముగానుండే అజ్ఞానము అనాత్మవస్తువుల నాశ్రయించియుండునని చెప్పుట సర్వకారణవస్తువులకును, అజ్ఞానస్వభావమునకును విరుద్ధమని భావము.

అవ. మఱియొక హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. తదనపేక్షస్య చ తస్య నిస్స్వభావత్వాత్. ౧౩

దం-అ. అజ్ఞానము నపేక్షించని యనాత్మవస్తువు నిస్స్వరూపమైనందున అజ్ఞానమున కాశ్రయముకానేరదు. అని శేషము.

తా. లోకములో నాధారములైన (ఆశ్రయములైన) ఘటాదులు ఆధేయములైన (తమ్మునాశ్రయించియున్న) దధితండులాదిద్రవ్యముల నపేక్షించక స్వతంత్రముగానున్న ఆకారముచేతనే దధితండులాదుల కాధారములైయున్నవిగాని దధితండులాదుల నపేక్షించియున్న ఆంకారముచేత వాటికి ఆధారములై యున్నది లేదు. ప్రకృతమందు అజ్ఞానమున కాధారమని చెప్పఁబడుచున్న అనాత్మవస్తువునకు అజ్ఞానము నపేక్షించని ఆకారమేలేదు. ఎట్లనఁగా ననాత్మవస్తువు అజ్ఞానవికారమైనందున, తంతువుల నపేక్షించని ఆకారము పటమునకువలె, మృత్తిక నపేక్షించని ఆకారము ఘటమునకువలె

అజ్ఞానము నపేక్షించని ఆకారము ఆనాత్మవస్తువునకు లేనేలేదు. గనుక అనాత్మవస్తువు అజ్ఞానమున కాధారము (ఆశ్రయము) కానేరదని భావము.

అవ. ఓయీ! అనాత్మవస్తువు అజ్ఞానమున కాశ్రయముకాక పోనిమ్ము; విషయముకావచ్చునే యని శంకించగా నుత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. ఏతేభ్య ఏవ హేతుభ్యో నానాత్మ విషయ మజ్ఞా
నం సంభవతీతి గ్రాహ్యమ్. ౧౪

దం-అ. ఈ చెప్పినహేతువులవల్లనే అజ్ఞానము, అనాత్మవస్తువు విషయముగాఁ గలదై సంభవించదని గ్రహించవలయును.

తా. అనాత్మవస్తువు అజ్ఞానమున కాశ్రయము కాదనుటకు యే హేతువులను చెప్పితిమో, వాటివల్లనే అజ్ఞానమున కాత్మవస్తువు విషయమున్ను కాదని తెలియవలయునని భావము. ఇందువలన అజ్ఞానమునకు అనాత్మవస్తువు, ఆశ్రయముగాగాని, విషయముగాగాని కాదని భావము.

అవ. పారిశేష్యన్యాయమువల్ల 'అజ్ఞానమునకు ఆత్మవస్తువే ఆశ్రయమని, విషయమని నిగమించుచున్నారు.—

వాక్య. ఏవం తావ న్నానాత్మనః అజ్ఞానిత్వం నాపి తద్విష
యం అజ్ఞానం పారిశేష్యాదాత్మన ఏవా స్త్వజ్ఞానమ్. ౧౫

దం-అ. ఈప్రకారము అనాత్మవస్తువునకుఅజ్ఞానము కలిగియుండుటయును లేదు. అజ్ఞానము ఆ అనాత్మవస్తువు విషయముగాగలదిన్ని లేదు. పారిశేష్యమువల్ల ఆత్మవస్తువునకే అజ్ఞానము-అని సిద్ధమైనదని శేషము.

తా. వేదాంతశాస్త్రమునందు ప్రతిపాదింపఁబడిన పదార్థములు ఆత్మయని, అనాత్మయని రెండుగానున్నవి. అందులో అజ్ఞానమున కేది ఆశ్రయముగా, విషయముగా నుండునని విచారించగా పూర్వోక్తహేతువువలన అనాత్మ కాదని నిశ్చయింపఁబడినది. గనుక శేషించినది ఆత్మవస్తువే కావున ఆత్మవస్తువే అజ్ఞానమునకు ఆశ్రయమని, విషయమని భావము.

అవ. ఈయర్థము అనుభవసిద్ధ మనుచున్నారు.—

వాక్య. తస్య అజ్ఞోస్మీ త్యనుభవదర్శనాత్. ౧౬

దం-అ. ఆయాత్మకు నేనజ్ఞుఁడనని అనుభవము కనుపడుచున్నందున అజ్ఞానము ఆత్మాశ్రయమని శేషము.

తా. అనాత్మ అజ్ఞానమున కాశ్రయము కాకపోయినమాత్రమున ఆత్మ ఆశ్రయమని చెప్పినదికాదు. లోకములో నేను అజ్ఞుఁడనని అనుభవముకూడా కాన్పించుచున్నది. ఇచ్చట అజ్ఞానము నే నని చెప్పఁబడిన చిదాత్మను ఆశ్రయించియున్నట్లు స్పష్టమేకదా. గనుక అనుభవ ప్రమాణముచేతగూడా అజ్ఞానము ఆత్మాశ్రయమని నిశ్చయింపఁబడినదని భావము.

అవ. శాస్త్రమున్ను అజ్ఞానమాత్రాశ్రయమనే అర్థమును ప్రతిపాదించుచున్నదని చెప్పుచున్నారు.—

వాక్య. "సోఽహం భగవో మంత్రవిదే వాస్మి నాత్మవిది"
తి శ్రుతేః. ౧౭

దం-అ. "సోఽహం భగవోమంత్రవిదే వాస్మినాత్మవిత్" అను శ్రుతివాక్యమువల్లనున్ను అజ్ఞాన మాత్రాశ్రయమని చెప్పఁబడుచున్నది.

తా. ఛాందోగ్యోపనిషత్తులో నారదమహాముని సనత్కుమారుని సన్నిధికిఁబోయి, 'ఓ ఋషివర్యా! నేను ఋగ్వేదాదిశాస్త్రముల నన్నింటిని చదివియున్నాను. ఇట్టినేను శాస్త్రముల నెఱింగినవాఁడనే కాని ఆత్మతత్త్వము నెఱుంగను. అందుచే మిక్కిలి దుఃఖినైయున్నాను. నాదుఃఖములు నశించునట్లు నాకు నాత్మతత్త్వము నుపదేశింపుఁడు' అని విన్నపము చేసికొనినట్లు వినఁబడుచున్నది. అందువలన ఆత్మస్వరూపమే అజ్ఞానమున కాశ్రయమని తెలియఁబడుచున్నదని భావము. "శ్లో. ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతిం గతిం, వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవా నితి" అనఁగా భూతములయొక్క ఉత్పత్తివినాశములను పరలోకగమనాగమనములను జ్ఞానాజ్ఞానములను ఈ యాఱింటిని తెలిసినవాఁడు భగవంతుఁ డనఁబడుననే పైశ్లోకప్రకారము షడ్గుణసంపత్తుగల యో సనత్కుమారఋషివర్యా! ఋగ్వేదాదుల నన్నింటిని ఎఱింగిన నేను, మంత్రములమాత్రమే ఎఱింగినవాఁడను కాని ఆత్మ నెఱింగినవాఁడను కానని శ్రుత్యర్థము.

అవ. అజ్ఞానమున కనాత్మవస్తువు ఆశ్రయమని విషయమని చెప్పిననేదోషములు ప్రాప్తించునో ఆదోషములు ఆత్మవస్తువు, ఆశ్రయమని విషయమనిచెప్పినచో ప్రాప్తించవు గనుక, అజ్ఞానమున కాత్మవస్తువే ఆశ్రయము విషయము అని అంగీకరించవలయునని చెప్పుచున్నారు.—

వాక్య. న చాత్మనః అజ్ఞానస్వరూపతా తస్య చైతన్యమాత్ర
స్వభావాత్. ౧౮

దం-అ. ఆయాత్మకు చైతన్యమే స్వరూపముగా గలిగియున్నందున ఆత్మకు అజ్ఞానస్వరూపము లేదు.

తా. అనాత్మవస్తువు అజ్ఞానమే స్వరూపముగా గలిగియున్నందున, అజ్ఞానమున కాశ్రయము కాకపోయినది. ఆత్మవస్తువును జ్ఞానమే స్వరూపముగా గలిగియున్నది గనుక అజ్ఞానస్వరూపము కాదు. అందువలన అజ్ఞానమున కాశ్రయము గాఁదగియున్నదని భావము.

అవ. అజ్ఞానమువలన కలుగువిశేషమున్ను ఆత్మయందు సంభవించుననుచున్నారు.-

వాక్య. అతిశయశ్చ సంభవతి జ్ఞాన విపరిలోపః. ౧౯

దం-అ. జ్ఞానముయొక్క లోపమనే అతిశయమును సంభవించుచున్నది.

తా. ఆత్మవస్తువు నిత్యమై, శుద్ధమై బుద్ధమై (స్వయంప్రకాశమై) అద్వితీయమై గదా యున్నది. ఇట్టిస్వరూపముతో నాత్మ ప్రకాశింపవలసియుండఁగా ఆలాగు ప్రకాశించకపోవుటయును, అందుకు విపరీతముగా ప్రకాశించుటయును, (అనఁగా అనిత్యమని, అశుద్ధమని, అబద్ధమని, సద్వితీయమని స్ఫురించుట) జ్ఞానవిపరిలోపమని చెప్పఁబడును. ఇట్టి జ్ఞానలోపమనే అతిశయము చిదాత్మయం దజ్ఞానముచేత కలుగుచున్నది కావున చిదాత్మ అజ్ఞానమున కాశ్రయము కాఁదగినదని భావము.

అవ. ఓయీ! చిదాత్మయందు అజ్ఞానజనితమైన విశేషము కలిగిన కలుగుగాక. చిదాత్మ కూటస్థుఁడై (నిర్వికారుఁడై) యున్నందున, అతనియం దాగంతుకమైన (మధ్యే సంభవించునట్టి) అజ్ఞాననివర్తకమైన సమ్యక్జ్ఞానము యేలాగున సంభవించును? సమ్యక్జ్ఞానమున కాశ్రయమైనవస్తువే గదా అజ్ఞానమునకున్ను ఆశ్రయమైయుండవలయునని శంకించగా సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. జ్ఞాన ప్రాప్తేశ్చ సంభవః. ౨౦

దం-అ. జ్ఞానప్రాప్తికికూడా సంభవముకలదు.

తా. అజ్ఞాననివర్తకమైన సమ్యక్జ్ఞానమున్ను, చిదాత్మయందు సంభవించుచున్నది గనుక అజ్ఞానాశ్రయము కాదగునని భావము.

అవ. చిదాత్మయందు జ్ఞాన మెట్లు ప్రాప్తించు ననఁగా నందులకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. తస్య జ్ఞానకారిత్వాత్. ౨౧

దం-అ. ఆయాత్మకు జ్ఞానమును చేయుట స్వభావమైయున్నందున, అనఁగా జ్ఞానప్రాప్తికి సంభవముకలదని పూర్వముతో సంబంధము.

తా. అంతఃకరణము నానావిధవృత్తిరూపముగ పరిణమించుచుండును. ఆవృత్తులయందు చిదాత్మప్రతిబింబించును. చిదాత్మ ప్రతిబింబించుటచేతనే, వృత్తులు జ్ఞానములనంబడు. ఈజ్ఞానములు చిదాత్మయందు క్వాచిత్కములై సంభవించుచుండును. వేదాంతమహావాక్యముల శ్రవణముచేత అంతఃకరణమునం దొకవృత్తి చిదాత్మ ప్రతిబింబముకలదై పుట్టును. ఇదియే సమ్యక్జ్ఞానంబడు. ఈసమ్యక్జ్ఞానమే అజ్ఞానవివర్తకము. ఇట్టి సమ్యక్జ్ఞానమున కాశ్రయమైనందున చిదాత్మ అజ్ఞానమున కాశ్రయమనగునని భావము.

అవ. అనాత్మనువలె ఆత్మకు అజ్ఞానకార్యత్వ మనేదోషము లేదని చెప్పుచున్నారు.—

వాక్య. న చాజ్ఞానకారిత్వం కూటస్థాత్మ స్వాభావ్యాత్. ౨౨

దం-అ. నిర్వికారచైతన్యమే స్వరూపముగా కలిగియున్నందున చిదాత్మకు అజ్ఞానకార్యత్వమున్ను లేదు.

తా. ఆత్మవస్తువు కేవలచిద్రూపమై యున్నందున అజ్ఞానముచేత రచింపఁబడినదికాదు. అనాత్మపదార్థములైన అహంకారాదులు, అజ్ఞానముచేత కల్పింపఁబడి అజ్ఞానకార్యములై యున్నందున, అజ్ఞానమున కాశ్రయములు కాకపోయినవి. చిదాత్మ అట్లు అజ్ఞానకార్యము కానందున అజ్ఞానమున కాశ్రయము కావచ్చునని భావము. చిదాత్మ అజ్ఞానకార్యముకాదని ఉభయవాదు లంగీకరించియున్నారని తాత్పర్యము.

అవ. అజ్ఞానము నపేక్షించనిచో నవాత్మకు స్వరూపమే లేకపోవునని పూర్వమందు చెప్పినదోషము చిదాత్మయందు సంభవించదని చెప్పుచున్నారు.—

వాక్య. అజ్ఞానా నపేక్షస్య చాత్మనః స్వతఏవ స్వరూపసిద్ధే
ర్యుక్తమాత్మన ఏవ అజ్ఞానాశ్రయత్వమ్. ౨౩

దం-అ. అజ్ఞానము నపేక్షించనిచిదాత్మకు, స్వయముగానే స్వరూపము సిద్ధించుచున్నందున చిదాత్మకే అజ్ఞానాశ్రయత్వము యుక్తముగా నున్నది.

తా. అనాత్మ, అజ్ఞానపరిణామమైనందున, అజ్ఞానము నపేక్షించి స్వరూపసిద్ధి కలదై యున్నదిగనుక అజ్ఞానసిద్ధస్వరూపముతోటి అజ్ఞానమున కాశ్రయము కానేరదు. ఆత్మవస్తువుయొక్క స్వరూపము అజ్ఞానము నపేక్షించినదికాదు, స్వతస్సిద్ధమైనది కనుక అజ్ఞానమున కాశ్రయము కావచ్చును. ఈహేతువుల నన్నింటిని యోచించగా చిదాత్మయే అజ్ఞానమునకు ఆశ్రయమని చెప్పుట యుక్తముగా నున్నదని భావము.

అవ. ఓయీ! ఆత్మ అజ్ఞానమున కాశ్రయమైన కానిమ్ము. విషయముమాత్రము కానేరదు. లోకములో జ్ఞానము, ఇచ్ఛ, రాగము మొదలగు వాటికి ఆశ్రయము

వేఱుగా, విషయము వేఱుగాకదా కాన్పించుచున్నది. కావున అజ్ఞానాత్మకమైన ఆత్మన అజ్ఞానమునకు విషయము కానేరదని యాక్షేపించుచున్నారు —

వాక్య. కిం విషయం పున స్తదాత్మనః అజ్ఞానమ్. ౨౮

దం-అ. ఆత్మయొక్క అజ్ఞానము విషయముకలదికాదు; ఇచ్చట 'కిం' శబ్దమునకు ఆక్షేపము అర్థము.

తా. ఆత్మాశ్రయమైన అజ్ఞానమునకు ఆత్మయే విషయమని చెప్పఁదగదు. ఏలనన, ఆత్మ, అజ్ఞానమున కాశ్రయమైనపుడు, ప్రతీయమానరూపముకలవాఁడై యుండవలయు. విషయమగునపుడు అప్రతీమానారూపముకలవాఁడై యుండవలయునుగదా? ఇట్టిరూపద్వయము, అద్వితీయమై, నిరాకారమైన చిదాత్మయందు సంభవించదు కనుక చిదాత్మ అజ్ఞానమునకు విషయము కానేరదని భావము.

అవ. సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. ఆత్మవిషయ మితి బ్రూమః. ౨౯

దం-అ. ఆత్మయే విషయముగాఁగలది యని చెప్పెదము.

తా. 'మా మహం జానామి' (నన్ను నే నెఱుంగుదును), 'మా మహం నజానామి' (నన్ను నే నెఱుంగను) ఇత్యాదిలోకవ్యవహారములలో జ్ఞానాజ్ఞానములు రెండును నొకటే యాశ్రయమునుగలిగి యొకటే విషయముగాఁగలిగికూడా యున్నట్టు కాన్పించుచున్నది; అనఁగా 'మా మహం జానామి' అనేవ్యవహారమునందు, 'జానామి' యని చెప్పఁబడేజ్ఞానమునకు, 'అహం' అని చెప్పఁబడే ఆత్మయే విషయమనిన్ని చూడఁబడుచున్నది. 'మా మహం నజానామి' యనేవ్యవహారమునందును, 'జానామి' యని చెప్పఁబడే యజ్ఞానమునకు, 'అహం' అని చెప్పఁబడే ఆత్మ ఆశ్రయమని, 'మాం' అని చెప్పఁబడే ఆత్మయే విషయమనిన్ని చూడఁబడుచున్నది గనుక, జ్ఞానాజ్ఞానములు ఏకాశ్రయవిషయములని యర్థము. ఇదిగాక ఆత్మకు వాస్తవముగా రెండాకారములు లేకపోయినప్పటికి, వ్యవహారముచేత రెండాకారములున్ను కలవు. 'అహం' నేను అని సామాన్యముగా కనఁబడినట్టి యాకారము ఒకటియున్నది. ఇదియే జ్ఞానాజ్ఞానముల కాశ్రయమై యున్నది అద్వితీయ సచ్చిదానందాకారము మఱియొకటియున్నది. ఇది శాస్త్రగమ్యమైనందున అప్రతీయమానము. ఈయాకారము జ్ఞానాజ్ఞానములకు విషయమైయున్నది. కనుక చిదాత్మ జ్ఞానాజ్ఞానములకు ఆశ్రయముగాను, విషయముగానున్నట్టు ప్రత్యక్షసిద్ధమైనందునను, ప్రతీయమానాప్రతీయమానాకారద్వయము కలిగి యున్నందునను, అజ్ఞానమునకు ఆత్మ ఆశ్రయమును అగును; విషయమును అగును. అని భావము.

దం-అ. కనుక ఆయజ్ఞానము నివృత్తమయ్యేనేని భేదప్రపంచరూపమైన అనర్థము లేకపోవును.

తా. స్పష్టము.

అవ. ఈప్రకారము అగుగాక. ద్వితీయాధ్యాయమునందు చెప్పినయుక్తులచేతనే ద్వైతప్రపంచము మిథ్య యని దాని కధిష్ఠానమైన చిదాత్మ సత్యమనిన్ని తెలియఁబడినందున అనర్థరూపమైన ద్వైతము నివృత్తమగుచున్నది గదా? వాక్యార్థమును మరల నిరూపించుటకు తృతీయాధ్యాయము నారంభించవలసినదేమి? యని శంకించగా సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. తదపనోదశ్చ వాక్యాదేవ. 30

దం-అ. ఆయజ్ఞాననివృత్తి వాక్యమువల్లనే కలుగును.

తా. ఆయజ్ఞాననివృత్తివాక్యమువల్లనే కలుగునుగాని ద్వితీయాధ్యాయోక్తులచేత కలుగదు. ఆయుక్తులు వాక్యమునకు సహాయమైయుండును. స్వతంత్రముగా నొకఅర్థమును నిశ్చయింపఁజాలవనిభావము.

అవ. ఓయీ! ఈమూఁడవయధ్యాయమే ఆరంభింపఁబడుగాక; గడచినద్వితీయాధ్యాయముతో నేమిప్రయోజన మనఁగాఁ జెప్పుచున్నారు.—

వాక్య. తత్పదపదార్థాభిజ్ఞస్య. 31

దం-అ. ఆవాక్యజ్ఞానము పదపదార్థముల నెఱింగినవానికే కలుగును.

తా. అజ్ఞాననివర్తకమైన వాక్యార్థజ్ఞానము పదపదార్థజ్ఞానము కలవానికే కలుగునుగాని అన్యునకు కలుగదు. గనుక పదపదార్థజ్ఞానసంపాదనార్థమై ద్వితీయాధ్యాయము ఆవశ్యకమే నని భావము.

అవ. ఈప్రకారము ప్రయోజనము కలదైనందునను పూర్వము ప్రతిపాదింపఁబడని అర్థముకలదైనందునను, మూఁడవయధ్యాయము ఆరంభింపఁదగినదని నిగమించుచున్నారు.—

వాక్య. అతో వాక్యవ్యాఖ్యానాధ్యాయ ఆరభ్యతే. 33

దం-అ. కావున వాక్యమును వ్యాఖ్యానముచేయుటకొఱకు మూఁడవ అధ్యాయము ప్రారంభింపఁబడుచున్నది.

తా. స్పష్టము.

అవ. ఈమూఁడవఅధ్యాయములో వివరింపఁబడుచున్న వాక్యార్థజ్ఞానమునకు

ప్రయోజనమును కాన్పించుచున్న ఉత్తరశ్లోకమునకు అపేక్షితమైన అర్థమును ప్రతిపాదించుచు శ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. తత్ర యథోక్తేన ప్రకారేణ తత్త్వమస్యాది వాక్యోపనివిష్ట పదపదార్థయోః కృతాన్వయవ్యతిరేకః. ३४

శ్లో. యదా నా తత్త్వమస్యాదే ర్బ్రహ్మాస్మీ త్యవగచ్ఛతి,
ప్రధ్వస్తాహ మ్మమో నైతి తదా గీర్మనసోః సృతిమ్. ౧.

దం-అ. అందులో వెనుకచెప్పినప్రకారము తత్త్వమసి మొదలగువాక్యములందుగల పదపదార్థములయందు చేయఁబడిన అన్వయవ్యతిరేకములుగల పురుషుఁడు ఎప్పుడు తత్త్వమస్యాదివాక్యమువలన బ్రహ్మను ఐతినని తెలిసికొనుచున్నాఁడో, అప్పుడే నశించిన అహంకారము మమకారములు గలవాఁడై వాఙ్మనస్సులయొక్క మార్గమును బొందఁడు. అని వాక్యశ్లోకముల కేకాన్వయము.

తా. ద్వితీయాధ్యాయములో చెప్పినప్రకారము తత్త్వమస్యాదివాక్యములయందు వినఁబడుచున్న 'తత్' 'త్వం' ఇత్యాదిపదపదార్థములను అన్వయవ్యతిరేకయుక్తులచేత ఏపురుషుఁడు శోధించి నిష్కర్షించునో అట్టిపురుషుఁడు 'తత్త్వమస్యా'దివాక్యమువలన 'నేను జీవుఁడను కాను, పరబ్రహ్మను' అని నిస్సంశయముగను ప్రత్యక్షముగను తెలియును అప్పుడే అహంకారమమకారాదిసర్వానర్థములు నశించి అవాఙ్మానసగోచరమైన కైవల్యమును పొందునని భావము.

అవ. చెప్పిన అర్థము ననువదించి హేతువు నడుగుచున్నారు.—

వాక్య. యద్వైవ తదర్థం త్వమర్థేఽవైతి తద్వైవావాక్యార్థతాం ప్రతిపద్యతే గీర్మనసోః సృతిం న ప్రతిపద్యత ఇతి కుత ఏతదధ్యవసీయతే. ३५

దం-అ. ఎప్పుడు'తత్'పదార్థమును 'త్వం' పదార్థమునందు తెలియునో అప్పుడే అఖండార్థమును పొందును. వాఙ్మనస్సులయొక్క మార్గమును పొందఁడని ఇదియే హేతువువలన నిశ్చయింపఁబడుచున్నది.

తా. తత్ పదార్థమైన పరబ్రహ్మను, త్వంపదలక్ష్యార్థమైన శోధితసాక్షిచైతన్యమునందు యేక్షణమున తెలియుచున్నాఁడో, అనఁగా తత్, త్వం పదార్థముల కైక్యమును తెలియుచున్నాఁడో ఆక్షణముననే దేశాంతర, కాలాంతర, సాధనాంతరముల నపేక్షించకనే పదార్థసంయోగశూన్యమైన అఖండైకరసత్వమును పొంది మనోవాగ్వ్యవ

హారముల నన్నిటిని దాఁటి కేవలుఁడై యుండునని నిశ్చయించితిరి. ఇందులకేమికారణ మని భావము.

అవ. ప్రశ్న కుత్తరమును చెప్పుచున్నారు —

వాక్య. యస్మాత్. 3౬

దం-అ. ఎందువలన ననఁగా చెప్పెదము.

తా. స్పష్టము.

శ్లో. తత్పదం ప్రకృతార్థం స్యా త్త్వంపదం ప్రత్యగాత్మని,
నీలోత్పలవదేతాభ్యాం దుఃఖా నాత్మత్వవారణే. ౨.

దం-అ. 'తత్' అనేపదము ప్రస్తుతమైన అర్థముకలది యగుచున్నది. 'త్వం' అనే పదము జీవాత్మయందు వర్తించుచున్నది. ఈరెండుపదములచేతను నీలోత్పలవాక్యమందు వలె దుఃఖిత్వముయొక్క అనాత్మత్వముయొక్క నివారణములు సంభవించుచున్నవి.

తా. తత్త్వమసి అనేమహావాక్యమందు 'తత్' అనేపదము ప్రకృతమై విధింపఁ దగియున్న అద్వితీయబ్రహ్మస్వరూపమును ప్రతిపాదించుచున్నది. 'త్వం' అనేపదము ఉద్దేశింపఁబడిన ప్రత్యగాత్మను ప్రతిపాదించుచున్నది. ఈరెండుపదములు సామానాధికరణ్యముచేత, అన్యోన్యవిశేషణవిశేష్యస్వభావములుకలవై 'తత్' పదార్థమునందు ప్రసక్తమైన అనాత్మత్వమును, 'త్వం' పదము నివారించుచున్నది. 'త్వం' పదార్థమునందు ప్రసక్తమైనదుఃఖిత్వము 'తత్' పదము నివారించుచున్నది. ఎటువలెననఁగా, 'నీల ముత్పలం' (నల్లనికలువ) అనువాక్యములోని, నీలశబ్దోత్పలశబ్దములు సామానాధికరణ్యముకలవైయుండి, నీలశబ్ద ముత్పలమునందు ప్రసక్తమగు రక్తత్వాదులను, ఉత్పలశబ్దము నీలమందు ప్రసక్తములగు ఘటాదులను నివారించుచున్నది. అటులే తత్ త్వంపదములున్నవని భావము. అద్వితీయబ్రహ్మస్వరూపము "సదేవ సోమ్యేదమగ్ర ఆసీ దేక మేవా ద్వితీయం" అనేవాక్యము మొదలుకొని ప్రతిపాదింపఁబడినందున ప్రకృతమైయున్నది. ప్రమాణాంతరములకు గోచరము కానందున విధింపఁదగియున్నది. ప్రత్యగాత్మస్వరూపము 'అహం' అనేప్రత్యక్షమునకు గోచరించుచున్నందునఉద్దేశింపఁ దగియున్నది. వాక్యము ఒకపదముచేత ఒకయర్థము నుద్దేశించి, మఱియొకపదముచేత ఒకయర్థమును విధించును. విధింపఁబడేయర్థము ప్రమాణాంతరములకు గోచరముకానిదై యుండవలయును. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' (స్వర్గమునుకోరినవాఁడు జ్యోతిష్టోమముచేత యజించవలయును) ఈవాక్యమునందు స్వర్గకాముని యుద్దేశించి జ్యోతిష్టోమము విధింపఁబడుచున్నది. ఆటులే 'తత్త్వమసి' వాక్యమునందును 'త్వం' అనుపదముచేత

ప్రత్యగాత్మను ఉద్దేశించి, అతనికి 'తత్' పదముచే బ్రహ్మత్వము విధింపఁబడుచున్నది. యుష్మదస్మచ్ఛబ్దములు (నీవు, నేను అనుశబ్దములు) ప్రత్యగాత్మబోధకములని, అన్యశబ్దములు అనాత్మబోధకములని సామాన్యముగా నియమముకలిగియున్నందున తత్పదార్థమైన అద్వితీయపరమానందరూపబ్రహ్మయందు అనాత్మత్వము ప్రాప్తించినది. 'తత్' పదమునకు 'త్వం'పదము విశేషణమైనందున, తత్పదార్థమునందుగల అనాత్మత్వము నివర్తించుచున్నది. 'త్వం'పదము దేహేంద్రియాదివిశిష్టమైన ఆత్మను చెప్పుచున్నందున, ప్రత్యగాత్మయందు పరిచ్ఛిన్నత్వదుఃఖిత్వాదులు ప్రాప్తించుచున్నవి. 'త్వం' పదమునకు 'తత్' పదము, విశేషణమైనయెడల, 'త్వం'పదార్థమునందు ప్రాప్తించిన పరిచ్ఛిన్నత్వదుఃఖిత్వాదులు నివర్తించుచున్నవి.

అవ. ఇంతవఱకుచెప్పిన యర్థమును విస్తారముగా ప్రతిపాదించేకొఱకు అనువదించుచున్నారు.—

వాక్య. ఏవం కృతాన్వయవ్యతిరేకః వాక్యాదేవ అవాక్యార్థం ప్రతిపద్యత ఇత్యుక్తమ్. 32

దం-అ. ఈప్రకారము చేయఁబడిన అన్వయవ్యతిరేకములుగలపురుషుఁడు వాక్యమువల్లనే అఖండరసైకత్వమును పొందునని చెప్పఁబడినది.

తా. రెండవ అధ్యాయములో చెప్పిన అన్వయవ్యతిరేకయుక్తులను విచారించి 'త్వం' పదార్థమును చక్కగా శోధించినవానికి 'తత్త్వమసి' వాక్యమును వినఁగానే 'అహం బ్రహ్మాస్మి' అనే అఖండజ్ఞానము కలుగునని చెప్పినారమని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను జేయుచున్నారు.—

వాక్య. అతస్తద్వ్యాఖ్యానాయ సూత్రోపన్యాసః. 33

దం-అ. కనుకదానియొక్కవివరణముకొఱకు సూత్రముపన్యసింపఁబడుచున్నది.

తా. వాక్యమువల్ల అఖండార్థము స్ఫురించునని చెప్పినయర్థమును విస్తారముగా నిరూపించుచున్నారము. అందుకొఱకు ముందుగా నొకశ్లోకమును సంగ్రహముగ చెప్పుచున్నామని భావము.

శ్లో. సామానాధికరణ్యం చ విశేషణ విశేష్యతా,
లక్ష్యలక్షణసంబంధః పదార్థప్రత్యగాత్మనామ్. 3.

దం-అ. పదములకు పదార్థములకు ప్రత్యగాత్మకును క్రమముగా సామానాధికరణ్యమున్ను విశేషణవిశేష్యభావమున్ను లక్ష్యలక్షకసంబంధమున్ను అగుచున్నది.

తా. 'తత్త్వమస్యా'ది మహావాక్యములలో 'తత్' 'త్వం' అనేపదములకు ముఖ్య

దుగా సామానాధికరణ్యము గలుగుచున్నది. సామానాధికరణ్యమనఁగా ఏకభక్తినిర్దేశము. తరువాత తత్ పదార్థ త్వం పదార్థములకు విశేషణవిశేష్యభావము సిద్ధించుచున్నది. విశేషణవిశేష్యములయిన తత్ పదవాచ్యార్థ, త్వం పదవాచ్యార్థములకు ముఖ్యాభేదము విరుద్ధముగా కనఁబడుచున్నందున, తత్త్వం పదవాచ్యార్థములకును లక్ష్యలక్షకభావము సిద్ధించుచున్నది గనుక అఖండైకరసార్థము సిద్ధించుటకు లోపములేదు. అని భావము. అనఁగా వాచ్యార్థములయందు వివక్షగల సమానాధికరణవాక్యముల కసంసర్గవాక్యార్థముగాని లక్ష్యార్థమందు వివక్షగల 'సోఽయం దేవదత్తః' (ఈ దేవదత్తుఁడా దేవదత్తుఁడేను) ఇత్యాదిసమానాధికరణవాక్యములకు అఖండార్థమే ఘటించును. 'తత్త్వమస్యా'ది వాక్యములున్ను లక్ష్యార్థవివక్షగల వాక్యములు గనుక వాటికి అఖండైకరసార్థమే వాక్యార్థమని భావము.

అవ. పూర్వపక్షమును ఆరంభించుచున్నారు.—

వాక్య. అస్మిన్ సూత్రే ఉపన్యస్తే కశ్చిత్ చోదయతి. ౩౯

దం-అ. ఈసూత్రముపన్యసింపఁబడగా నొకానొక పూర్వపక్షవాది ఆక్షేపించుచున్నాఁడు.

తా. తత్త్వమస్యాదివాక్యములు అఖండార్థములని ప్రతిపాదించుటకు సంగ్రహవాక్యమును ముందుగా చెప్పగా పూర్వపక్షవాది యాక్షేపించుచున్నాఁడని భావము.

అవ. "యోఽయం వాక్యార్థ ప్రతిపత్తౌ" అనేవాక్యము మొదలుకొని "నకశ్చిద్దోష ఇతి" అనేవాక్యమువఱకు పూర్వపక్షము చెప్పఁబడుచున్నది.—

వాక్య. యోఽయం వాక్యార్థ ప్రతిపత్తౌ పూర్వాధ్యాయే
నాన్వయవ్యతిరేకలక్షణో న్యాయః సర్వకర్మ సన్న్యాస
పూర్వకోఽభిహితః కిమయం విధి ప్రాపితః కిం వాస్వ
రసత ఏవాత్ర పుమాన్ ప్రవర్తత ఇతి. ౪౦

దం-అ. వాక్యార్థమును తెలిసికొనుటయందు గడచిన అధ్యాయములో అన్వయవ్యతిరేకరూపమైన యే యీన్యాయము సర్వకర్మపరిత్యాగ పూర్వకముగా చెప్పఁబడినదో ఇది విధిచేత బొందింపఁబడినదా? లేక పురుషుఁడు దీనియందు రాగముచేతనే ప్రవర్తించునా? యని విచారించెదము.

తా. సర్వానర్థనిదానమైన అజ్ఞానము నివర్తించేకొఱకు వాక్యార్థజ్ఞానము అవశ్యసంపాద్యమనిన్ని దానికిగాను ముందుగా సర్వకర్మసన్న్యాసమును చేసి పదార్థజ్ఞానమును అన్వయవ్యతిరేకములచేత సంపాదించవలయుననిన్ని పూర్వాధ్యాయములో

రాన్వయరూపమైన భేదము వాక్యార్థముగా నున్నది. నీలముత్పలం' (నల్లనికలువ) ఇత్యాద్యభిన్నవిభక్తికవాక్యములయందు (సామానాధికరణవాక్యములయందు) సంసర్గము వాక్యార్థముగా నున్నదిగాని అఖండరూపమైన మూఁడవ వాక్యార్థము కనుపడలేదు. ఈలాగుననుండ వాక్యశ్రవణముచేత నఖండైకరసార్థము తెలియఁబడునని ఏలాగున చెప్పవచ్చును? అని శంకించగా అందుకు సమాధానము చెప్పుటకొఱకు రెండవపక్షమున కిట్టిదోషము రానేరదని చెప్పుచున్నారు.—

వాక్య. యది పునర్యదృచ్ఛాతః ప్రవర్తతే తదా న కశ్చి
ద్దోష ఇతి. ౪౪

దం-అ లేక స్వేచ్ఛవల్లనే ప్రవర్తించినచో నవ్వు డొకదోషమున్ను లేదు.

తా. ముముక్షువు పదార్థవిచారమునందు స్వేచ్ఛచేతనే ప్రవర్తించి ఆత్మసాక్షాత్కారమునకు పదార్థవిచారమును చేసినచో ఫలము సిద్ధించును. మధ్యన నివర్తించినచో అనర్థము ఘటించదు. జన్మాంతరమునకైనను ఫలించును. ఇది విచారమునకు ఫలమని భావము.

అవ. ఈప్రకారము పూర్వపక్షవాది చెప్పఁగా సిద్ధాంతవాది విధిపక్షము నంగీకరించి సమాధానము చెప్పుచున్నారు.—

వాక్య. విధి పరిప్రాపిత ఇతి బ్రూమః. ౪౫

దం-అ. విధిచేత పొందింపఁబడినదని చెప్పెదము.

తా. అన్వయవ్యతిరేకపూర్వమైన పదార్థవిచారము వాక్యార్థజ్ఞానమునకు సాధకముగాగదా యున్నది. దానియందు ముముక్షువునకు ప్రవృత్తి విధిచేతనే కలుగుచున్నదిగాని స్వేచ్ఛచేత కలుగదని భావము.

వాక్య. యత ఆహ. ౪౬

దం-అ. యెందువల్లనంటే చెప్పుచున్నారు.

తా. విధిలేక పోయినను స్వేచ్ఛచేతనే జ్ఞానసాధనములయందు ప్రవర్తించునని చెప్పితిమి గదా? విధిచేత ప్రవర్తించుననుట కేమికారణమంటే ఆకారణమును చెప్పుచున్నారమని భావము.

అవ. ఇందుకు హేతువును చెప్పుటకు శ్లోకమునుఅవతరింపఁజేయుచున్నారు.—

శ్లో. శమాదిసాధనః పశ్యే దాత్మ న్యాత్మాన మంజసా,
అన్వయవ్యతిరేకాభ్యాం త్యక్త్వా యుష్మ దశేషతః ౪.

దం-అ. శమము మొదలగు సాధనములుగలవాఁడై అన్వయవ్యతిరేకములచేత అనాత్మపదార్థమును నిశ్శేషముగా విడచి ఆత్మయందు ఆత్మను సాక్షాత్తుగా చూడవలయును.

తా. "శాంతో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వాత్మ న్యే వాత్మానంప శ్యేత్" అనే శ్రుతియందు ఆత్మదర్శనము విధింపఁబడియున్నప్పటికి ఆత్మదర్శనము ఫలమైనందున, విధియోగ్యముకాదు. కనుక శమాదిసాధనములుగలవాఁడై ఆత్మదర్శనమును చేయవలయునని శమాదిసాధనములయందే విధి పర్యవసించుచున్నందున, జ్ఞానసాధనములయందు ప్రవృత్తి విధిమూలమని చెప్పవలయును. ఇదిగాక "శ్రోతవ్యో మంతవ్యః" ఇత్యాది శ్రుతులున్ను జ్ఞానసాధనమైన శ్రవణమును విధించుచున్నవి. గనుక జ్ఞానసాధనములయందు ప్రవర్తించుటకు విధియే మూలము. ఆత్మయందు అధ్యవసింపఁబడిన ఆత్మను అన్వయవ్యతిరేకములచేత పరిత్యజించి శమదమాదిగుణసంపత్తిగలవాఁడై 'త్వం' పదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మను 'తత్' పదలక్ష్యార్థమైన అద్వితీయబ్రహ్మగా నెఱుంగవలయును అని భావము. బహిరింద్రియనిగ్రహముకలవాఁడై, అంతరింద్రియనిగ్రహముకలవాఁడై, లౌకికవైదికసర్వకర్మలను పరిత్యజించినవాఁడై, శీతోష్ణాది ద్వంద్వమును సహించువాఁడై, ఏకాగ్రచిత్తముగలవాఁడై, గురుశాస్త్రములయందు విశ్వాసముగలవాఁడై ప్రత్యగాత్మయందు పరమార్థమును చూడవలయునని శ్రుత్యర్థము.

అవ. ఓయీ! వాక్యము నపేక్షించని కేవల అన్వయవ్యతిరేకములచేతనే ఆత్మసాక్షాత్కారముకలుగునా యనఁగా కలుగదని చెప్పుచున్నారు.—

శ్లో. యుష్మదర్థే పరిత్యక్తే పూర్వోక్తై ర్హేతుభిః శ్రుతిః,
వీతోపన్నస్య కోఽస్మీతి తత్త్వ మిత్యాహ సౌహృదాత్. ౫.

దం-అ. పూర్వముచెప్పిన హేతువులచేత ననాత్మపదార్థము పరిత్యజింపఁబడిన తరువాత 'నే నెవఁడను' అని పరిశీలనము చేయుచున్నవానికి శ్రుతి స్నేహమువలన 'ఆ బ్రహ్మవు నీవ'ని చెప్పుచున్నది.

తా. అహం అనేపదమునకు స్థూలదేహము, ఇంద్రియములు, సూక్ష్మదేహము, అహంకారము మొదలగు అనాత్మపదార్థము లర్థముకాదని పూర్వాధ్యాయములో కాన్పించిన హేతువులచేత నిశ్చయింపఁబడినపిదప ముముక్షుపురుషుఁడు 'నే నెవఁడను' అని నిర్ణయింపఁబడని తనయసాధారణాకారము గలవాఁడైనందునను, అద్వితీయపరమానంద బ్రహ్మస్వరూపము అనాద్యజ్ఞానతిరోహితమైనందునను పర్యాలోచనము చేయుచుండును. ఇట్టి అధికారినిగూర్చి 'మాతాపితృసహస్రేభ్యో వత్సలతరం హి శాస్త్రం' అనే

న్యాయప్రకారము, జీవులయందు పరమకృపగలిగియున్న శ్రుతి 'నీవా బ్రహ్మావే' నని సకలాజ్ఞాననివర్తికలిగేలాగున నుపదేశించుచున్నది గావున వాక్యనిరపేక్షముగా, నన్వయవ్యతిరేకములు, అజ్ఞాననివర్తకమగుజ్ఞానమును పుట్టించఁజాలవని భావము.

అవ. మరల సాంఖ్యు లాక్షేపించుచున్నారు.—

వాక్య. అత్రాపి చోదయంతి సాంఖ్యాః. ౪౭

దం-అ. ఇచ్చటనున్న సాంఖ్యులు ఆక్షేపించుచున్నారు.

తా. ఆత్మానాత్మవివేకము కలిగినప్పటికి అజ్ఞానము నివర్తించదు గనుక, తన్నివృత్త్యర్థమై వాక్యము ప్రవర్తించుచున్నదనిసిద్ధాంతవాది నిరూపింపఁగా నీవిషయమునందు సాంఖ్యు లాక్షేపించుచున్నారని భావము.

అవ. సాంఖ్యులయొక్క ఆక్షేపమును 'శరీరేంద్రియేత్యాది విభాగఇతి' అనే పఱకు కనుపఱచుచున్నారు.—

వాక్య. శరీరేంద్రియమనోబుద్ధి ష్వనాత్మ స్వాత్మేతి నిస్సంధిబంధనం మిథ్యాజ్ఞానం అజ్ఞానం. ౪౮

దం-అ. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అనే యనాత్మవస్తువులయందు భేదజ్ఞానరహితముగా 'నేను' అని కలిగే మిథ్యాజ్ఞానమే అజ్ఞానము.

తా. ఆత్మ వ్యతిరిక్తములయి అనేకములుగానున్న శరీరేంద్రియమనోబుద్ధులయందు అనేకత్వమును తెలియనియ్యక ఏకత్వమును గ్రహించుచున్న 'అహం' (నేను) అనే జ్ఞానమే అజ్ఞానముగాని, ఇంతకు విలక్షణమైన అజ్ఞానము లేనేలేదు అని భావము. అనేకవస్తువులను ఏకముగా గ్రహించుచున్నందున 'అహం' అనేజ్ఞానము మిథ్యాజ్ఞానమనంబడు.

అవ. అనర్థములకు కారణముగా ప్రసిద్ధమైయున్న అజ్ఞానము, మఱియొకటి కలదనఁగా దానికి ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. తన్నిబంధనో హ్యాత్మనః అనేకానర్థసంబంధః. ౪౯

దం-అ. ఆత్మకు అనేకములయిన అనర్థములయొక్క సంబంధము ఆయజ్ఞానమే మూలముగా సంభవించినది. ఇది ప్రసిద్ధము.

తా. ఆత్మ సంభవించియున్న అనర్థమునకు ఆయజ్ఞానమే కారణముగాని మఱియొకఅజ్ఞానము కారణముగాదు. అట్టి అజ్ఞానము లేనున్నలేదు. అని భావము.

అవ. అజ్ఞానాంతరము లేకపోఁగాక; అందువలన నీకేమిలాభము కలుగును? అని ప్రశ్నించఁగా చెప్పుచున్నారు.—

వాక్య. తస్య చాన్వయ వ్యతిరేకాభ్యా మేవ నిరస్తత్వా
న్నిర్విషయం 'తత్త్వమస్యా'ది వాక్యం ప్రాప్తమ్. ౫౦

దం-అ. ఆయజ్ఞానమునకు అన్వయవ్యతిరేకములచేతనే నివృత్తికలిగినందున 'తత్త్వమస్యా'దివాక్యము విషయశూన్యమైనదని ప్రాప్తించినది.

తా. అన్వయవ్యతిరేకములచేత పదార్థజ్ఞానము కలిగినపిదప,అజ్ఞాననివర్తకమైన జ్ఞానమును 'తత్త్వమస్యా'దివాక్యము గలుగఁజేయుననిగదా మీరు చెప్పుచున్నారు. చిదాత్మనిష్ఠమైన అజ్ఞానముకంటె మఱియొకఅజ్ఞానము లేదని నిశ్చయించినందున, చిదాత్మనిష్ఠమైన అజ్ఞానము, అన్వయవ్యతిరేకములచేతనే నివృత్తమగుచున్నది గనుక, 'తత్త్వమస్యా'దివాక్యము మఱియొకజ్ఞానమును పుట్టించవలసినదిలేదు, అని భావము.

అవ. అయితే 'తత్త్వమస్యా'ది వాక్యములు వ్యర్థమా? అనిన, కాదని చెప్పుచున్నారు.—

వాక్య. తస్మా ద్వాక్యస్య చైష మహిమా యోఽయమా
త్మా నాత్మనో ర్వ్విభాగ ఇతి. ౫౧

దం-అ. కావున వాక్యముయొక్క ప్రభావ మిది ఆత్మానాత్మలయొక్క వివేక మేదికలదో; ఇతి శబ్దము సాంఖ్యమతసమాప్తిద్యోతకము.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము నిర్భయము కాకూడదు. కనుక దానికి ప్రయోజనమును ఈలాగున చెప్పవలయును.'తత్త్వమస్యా'ది వాక్యము అన్వయవ్యతిరేకములతో చేరి, మిథ్యాజ్ఞానమును నిరసించి, ఆత్మానాత్మవివేకమును సంపాదించునుగాని మఱియొకయజ్ఞాననిరసనము చేయదని భావము.

అవ. ఈప్రకారము సాంఖ్యుఁడు చెప్పినయాక్షేపమును పరిహరించేకొఱకు సిద్ధాంతవాది శ్లోకమును అవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. తన్నిరాకరణీ యేద ముచ్యతే. ౫౨

దం-అ. దానిని నిరాకరించేకొఱకు దీనిని చెప్పుచున్నారు.

తా.. సాంఖ్యుఁడుచెప్పిన ఆక్షేపమును పరిహరించుటకొఱకు ఈముందరిశ్లోకము చెప్పఁబడుచున్నది.

శ్లో. భేద సంవిదిదం జ్ఞానం భేదాభావశ్చ సాక్షిణి,
కార్య మేతదవిద్యాయా జ్ఞాత్మనా త్యాజయే ద్వచః. ౬౽

దం-అ. ఈజ్ఞానము భేదజ్ఞానము; సాక్షియందు భేదములేదు; అవిద్యయొక్క కృత్యమైన ఈజ్ఞానమును, వాక్యము బ్రహ్మాకారముచేత విడిపించును.

తా. అన్వయవ్యతిరేకములచేత కలుగుచున్న ఆత్మానాత్మవివేకజ్ఞానము, ఆత్మ, అనాత్మ, అనేరెండుపదార్థముల నవలంబించి పుట్టినందున భేదరూపమైయున్నది. కావున నసే ఇది భ్రమజ్ఞానమని చెప్పఁదగియున్నది. 'తత్త్వమస్యా'దివాక్యములకు తాత్పర్య విషయమైన సాక్షిస్వరూపము 'ఏకధైవానుద్రష్టవ్య' మిత్యాదిశ్రుతులచేత నిర్భేదముగా చెప్పఁబడుచున్నది. కావున భేదరూపమైన వివేకజ్ఞానము, భేదశూన్యమైన సాక్షియందు భ్రమసిద్ధమైనందున వాక్యజన్యము కానేరదు. కావున వాక్యము అద్వితీయబ్రహ్మజ్ఞానమును సంపాదించి సర్వాజ్ఞానమును నివారించును. అని భావము. పదార్థజ్ఞానమును సంపాదించినతర్వాత, ఆపదార్థజ్ఞానము ననుసరించి పరమాత్మను ఒకటిగానే (అఖండముగానే) చూడవలయునని శ్రుత్యర్థము.

అవ. మఱియొకయాక్షేపమును కనుపఱచుచున్నారు.—

వాక్య. జ్ఞాత్మనా త్యాజయేద్వచ ఇత్యుపశ్రుత్యాహ కశ్చిత్. ౫౩

దం-అ. వాక్యము బ్రహ్మాకారవృత్తిచేత అజ్ఞానమును త్యజింపఁజేయునని విని మఱియొకవాది చెప్పుచున్నాఁడు.

తా. స్పష్టము.

వాక్య. మిథ్యాజ్ఞానవ్యతిరేకేణ ఆత్మాన మవబోధస్యాభావాత్ కిం వాక్యేన నివర్త్యతే, అజ్ఞానం హి నామ జ్ఞానాభావః. ౫౪

దం-అ. మిథ్యాజ్ఞానముకంటే వేఱుగ మఱియొక ఆత్మాజ్ఞానము లేనందువల్ల వాక్యముచేతనే నివర్తిచేయఁబడును? అజ్ఞాన మనఁగా జ్ఞానముయొక్క అభావమే గదా?

తా. అజ్ఞానమనఁగా జ్ఞానముయొక్క ప్రాగభావమేగాని మఱియొక భావరూపపదార్థముగాదు. అట్టి భావరూపాజ్ఞానము కలదనుటకు ప్రమాణము లేదు. అట్టి జ్ఞానాభావరూపమైన అజ్ఞానము, పదార్థజ్ఞానము పుట్టగానే నశించుచున్నది. కనుక వాక్యమునకు ప్రయోజనములేదని భావము.

అవ. ఇదిగాక ఇట్టి జ్ఞానాభావము అనర్థహేతువుకానందున నివర్తింపఁజేయఁదగినది కాదని చెప్పుచున్నారు.—

వాక్య. తస్య చాభావస్య స్వాభావ్యా త్కుతః సంసారకారణత్వం నహ్యసతః సజ్జన్మేష్యతే "కుతస్తు ఖలు సోమ్యైవం స్యాదితి కథమసతః సజ్జాయేతే" తిశ్రుతేరితి. ౫౫

దం-అ. అజ్ఞానమునకు భావరూపత్వము లేనందున సంసారహేతుత్వము ఎచ్చట నుంచి సంభవించినది? అభావమువల్ల భావమున కుత్పత్తి అంగీకరింపఁబడదుగదా? "కుతస్తు ఖలు సోమ్యైవం స్యాదితి కథమసతః సజ్జాయేత" అనిన్ని శ్రుతులవలన నని మఱియొకవాది యాక్షేపించుచున్నాఁడని ౫౭౫ వాక్యముతోఁ సంబంధము.

తా. ఆత్మకు సంసారమేగదా అనర్థము. ఈయనర్థము జ్ఞానాభావరూపమైన అజ్ఞానముచేత పుట్టింపఁబడినదని చెప్పకూడదు. సంసారము భావరూపమై యున్నం దున అభావముచేత పుట్టనేరదు "కుతస్తు ఖలు కథమసతః" అనేశ్రుతులు అభావమువల్ల భావపదార్థము పుట్టదని ప్రతిపాదించుచున్నవి గనుక అజ్ఞానమును నివర్తింపఁజేయుంట యావశ్యకము కానందున వాక్యము నిష్ప్రయోజనమని భావము. ఓసోముఁడా! ఎందు వలన నీలాగున అగును; అసద్వస్తువలన సద్వస్తువు ఏలాగున పుట్టునని శ్రుత్యర్థము.

అవ. ఈయాక్షేపమునకు సమాధానముగా శ్లోకము నవతరింపఁ జేయుచున్నారు.—

వాక్య. అత్రోచ్యతే. ౫౭౬

దం-అ. ఇచ్చట చెప్పఁబడుచున్నది.

తా. ఈయాక్షేపణకు సమాధానము చెప్పఁబడును.

శ్లో. అజ్ఞాతఏవ సర్వోఽర్థః ప్రాగ్యస్మాద్ బుద్ధిజన్మనః,
ఏకేనైవ సతాసంశ్ఛన్నజ్ఞాతో భవేత్తతః. ౭.

దం-అ. ఏకారణమువల్ల అంతఃకరణవృత్తి (ప్రమాణజ్ఞానము) యొక్క ఉత్పత్తికి పూర్వమందు సకలపదార్థముల దెలియఁబడనిదై(అజ్ఞానావృతమై)యున్నదో, ఒక సత్తుచేత నేసత్తకలదైయున్నదో, ఆకారణమువల్ల సద్వస్తువుఅజ్ఞాతము (అజ్ఞానావృతము) అగుచున్నది.

తా. అజ్ఞానమనఁగా నొకభావరూపమైన పదార్థమేకాని, జ్ఞానముయొక్క అభావముకాదు. ఎందువల్లననఁగా నిద్రించినవాఁడు "ఏతావంతంకాలం నకించి దవా మవేదిషం"—ఇంతఱకు నేనేమిన్ని ఎఱుఁగక నేయుంటిని—అని వ్యవహరించునుగదా? ఈవ్యవహారమువలన నిద్రాకాలమందు సకలవిషయముల నావరించియున్న అజ్ఞానము అనుభవింపఁబడినదని తోఁచుచున్నది. ఇట్టి అజ్ఞానము ప్రతియోగిస్మరణములేకనే అయి నయెడల ప్రతియోగిస్మరణము అవశ్యమై యుండును. ప్రతియోగిస్మరణములేనిది లోక ములోనభావము అనుభవింపఁబడుట అప్రసిద్ధము-ఘటాభావము, పటాభావము ఇత్యాద్య భావములకు ఘటాదులు ప్రతియోగిస్మరణము లనంబడు. ఘటాద్యభావము అనుభవింపఁ బడునప్పుడు, ప్రతియోగిభూతఘటాదులు స్మరింపఁబడునుగాని, వాటిస్మరణములేకనే

ఘటాద్యభావములు అనుభవింపఁబడదు. (ఇహ భూతలే ఘటో నాస్తి—ఈభూమి
ఘటములేదని). ఈప్రకారము ఘటాభావము అనుభవింపఁబడునుగాని వాటిస్మ
లేకనే ఘటాద్యభావములు అనుభవింపఁబడవు. (ఇహ భూతలే ఘటో నాస్తి—ఈ
యందు ఘటములేదని) ఈప్రకారముగ ఘటాభావము అనుభవింపఁబడునుగాని,
లము, 'నాస్తి నాస్తి'-'లేదు లేదు' అని ఈప్రకారముగా ననుభవింపఁబడదని
ము. కనుక సుషుప్తికాలమం దనుభవింపఁబడుచున్న అజ్ఞానము అభావరూపమే
యెడల దానికిప్రతియోగియైనప్రమాణజ్ఞానము(అంతఃకరణవృత్తిస్మరింపఁబడవలె
డును. సుషుప్తికాలమునందు అజ్ఞానముతప్ప మఱియొకప్రమాణజ్ఞానము స్మరింప
చున్నట్లు కానము. కావున సుషుప్తికాలమునం దనుభవింపఁబడుచున్న అజ్ఞానము
రూపమేగాని అభావరూపముకాదు. అని అర్థము. సుషుప్తికాలమందు అజ్ఞానము
పదార్థముల నావరించియుండునని చెప్పితే ఆత్మ ఒక్కటే అజ్ఞానమునకు విష
ఇదివఱకు చెప్పినది విరుద్ధము కాదా? అని యనిన, కాదు; నామరూపాత్మకమై
పంచమంతయును మహాప్రళయమందువలె సుషుప్తియందును సన్మాత్రమందు ల
సత్తామాత్రరూపమై యుండునని వేదాంతములయొక్క సిద్ధాంతము. "యదా
స్స్వప్నం నకంచన పశ్యతి అథా అస్మిన్ ప్రాణఏవైకధాభవతి తథైవం వాక్సర్వై
మభి స్సహాప్యేతి" అని ఆరంభించి 'స యదా ప్రతిబుధ్యతే యథాగ్నేః జ్వలతః
దిశో విస్ఫులింగా రవిప్రతిష్ఠ రన్నేవ మేవైతస్మాదాత్మనః సర్వేప్రాణా యథా యతన
తిష్ఠంతే ప్రాణేభ్యో దేవాః దేవేభ్యో లోకాః" అనే శ్రుతిసుషుప్తికాలమందు సర్వప్ర
సన్మాత్రబ్రహ్మయందు లయించునని, ప్రబోధకాలమందు అసన్మాత్రబ్రహ్మవల్లనే
వించునని స్పష్టముగా చెప్పుచున్నది. ఇదిగాక కల్పితమైన రజతము శుక్తికం
ముగాలేనట్టిద్వైతప్రపంచమున్ను అజ్ఞానకల్పితమైనందున స్వాధిష్ఠానసన్మాత్రబ్ర
వ్యతిరేకముగాలేదు. కావున సుషుప్తికాలమందు సర్వప్రపంచము సన్మాత్రమైనం
ఆత్మస్వరూపమే సన్మాత్రమైనందునను, అసన్మాత్రమే అజ్ఞాతమైయున్నందునను, అ
నకు విషయము ఆత్మచైతన్యమేగాని, మఱియొకటిగాదని మే మిదివఱకే చెప్పినది వి
కాదు. ఇదిగాక 'భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః', 'అజ్ఞానే నావృతం
ఇత్యాది శ్రుతిస్మృతివాక్యములవలనకూడా అజ్ఞానము భావరూపమైయున్నట్లు
చున్నది. ఈయజ్ఞానముచే ననర్థరూపమైన సంసారము కల్పింపఁబడినందున ఈ
మవశ్యము నివర్తింపఁజేయఁదగియున్నది. దీనిని నివర్తింపఁ జేయునది వాక్య
కావున, వాక్యమునకు ప్రయోజనముకలదని భావము పైనుదహరించిన 'యదా
స్స్వప్నం' అనుదానికి అర్థము—నిద్రించువాఁడు యెప్పుడు ఒకానొకస్వ

కూడా చూడఁడో అనఁగా స్వప్నావస్థనుదాఁటి సుషుప్త్యవస్థను బొందునో అని-అప్పుడు ఈప్రసిద్ధమైన పరమాత్మయం దేకీభవించును. అప్పుడు వాగింద్రియము తనవిషయములైన శబ్దములతోఁగూడా ఈపరమాత్మనుగూర్చి లయమునుపొందును; 'స యదా ప్రతిబుధ్యతే' అని పైనుదహరించిన శ్రుత్యర్థము-ఎప్పుడు ఈపురుషుఁడు ప్రబోధమునొందునో అప్పుడు మండుచున్న అగ్నివలన మిణుగురు లెట్లు నానాదిక్కులనుగూర్చి ఎగిరిపోవునో అటులే ఈపరమాత్మవలననుండి సకలమైనఇంద్రియములు తమతమస్థానములగూర్చి వెడలిపోవును. ఇంద్రియప్రాణములతరువాత ఇంద్రియాధిష్ఠానదేవతలు వెడలిపోవుదురు. ఆదేవతల పిదప శబ్దాదివిషయములు వెడలిపోవును. అనఁగా నామరూపాత్మకప్రపంచము సుషుప్తిదశలో పరమాత్మయందు లయించును. ప్రబోధదశయందు పరమాత్మవల్ల ఇంద్రియదేవతావిషయాదిప్రపంచము యథాపూర్వముగా నావిర్భవించునని తాత్పర్యము. మఱియును పైనుదహరించిన 'భూయశ్చాంతే' అనుదానికర్థము వాక్యజన్యజ్ఞానము కలిగినపిదప సకలమైనమాయయున్ను (అజ్ఞానమున్ను) నివర్తించును-'అజ్ఞానేనావృతం జ్ఞానం' అనఁగా జ్ఞానస్వరూపము అజ్ఞానముచేత నావరింపఁబడియున్నదని యర్థము.—

అవ. ఉత్తరశ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. సన్నజ్ఞాతో భవేత్తత ఇత్యుక్తమథ స్తనేన శ్లోకేన
కోఽసౌ సన్నజ్ఞాత ఇత్యపేక్షాయాం తత్స్వరూపప్రతి
పాదానాయాహ. ౫౬

దం-అ. కనుక సద్రూపము అజ్ఞానముచేత నావరింపఁబడియున్నదని పూర్వశ్లోకముతో చెప్పఁబడినది అజ్ఞానావృతమైన యాసద్రూప మేదియని యడుగగా దానియొక్కస్వరూపమును ప్రతిపాదించుటకు చెప్పుచున్నారు.—

తా. అజ్ఞానావృతసత్స్వరూప మెట్టిదనఁగా చెప్పుచున్నారని భావము

శ్లో. ప్రమిత్సాయాం య ఆభాతి స్వయం మాతృప్రమాణయోః,
స్వమహిమ్నా చ యః సిద్ధః సోఽజ్ఞాతార్థోఽవసీయతామ్. ౭

దం-అ. పదార్థములను తెలియ నిచ్ఛయించినదశయందును యేది ప్రమాతయందును ప్రమాణమునందును స్వయముగా భాసించునో, ఏది స్వసామర్థ్యముచేతనే సిద్ధమైయున్నదో అది అజ్ఞాతమైన అర్థమని నిశ్చయింపఁబడుఁగాక

తా. ఘటాదిపదార్థములను తెలియవలయునని యెప్పుడు ఇచ్ఛయించునో అప్పుడు ఘటాదిపదార్థములను తెలిసికొనే నేను (ప్రమాతను) ప్రకాశించుచున్నాను. ఘటాది

ప్రమేయములను తెలియచేసేప్రమాణము (చక్షురాదింద్రియము) ప్రకాశించుచున్న అని ముందుగా నిశ్చయించి ప్రవర్తించును. ఈనిశ్చయములో ప్రమాతృప్రమాణ లను యేది ప్రకాశింపుచున్నదో అది అజ్ఞాతమైన సత్పదార్థమని తెలియవలయును. గాక ఈయజ్ఞాతమైన సత్పదార్థము ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయము లేనప ఈమూఁటియొక్క అభావమును ప్రకాశింపఁజేయుచుండును. అనఁగా జాగ్రద్ద ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయములను సుషుప్త్యాదిదశలయందు ప్రమాణాద్యభావ ప్రకాశింపఁజేయుచున్న సాక్షిచైతన్యమే అజ్ఞాతార్థమని భావము.

అవ. మఱియొకపూర్వపక్షము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. అత్ర కేచి దాహుః.

దం-అ. ఇచ్చట కొందఱు చెప్పుచున్నారు.

తా. అఖండైకరసార్థము తత్త్వమస్యాదివాక్యముచేతనే కలుగునని సిద్ధాంత చెప్పినది యుక్తముకాదు. మఱియొకసాధనముచేతకూడా అఖండైకరసార్థము సి చున్నదని కొందఱు పూర్వపక్షమును చెప్పుచున్నారని భావము.

వాక్య. యత్కించి దిహ వాక్యం లౌకికం వైదికం వా తత్స ర్వం సంసర్గాత్మకమేవ వాక్యార్థం గమయతి అత స్త త్త్వమస్యాదివాక్యేభ్యః సంసర్గాత్మక మహం బ్ర హ్మేతి విజ్ఞాయ తావన్నిదిధ్యాసీత యావదవాక్యార్థా త్మకః ప్రత్యగాత్మవిషయో ఽవబోధోఽహం బ్రహ్మేతి సముభిజాయతే. ౫౮

దం-అ. ఇచ్చట లోకసంబంధమైన వాక్యముగాని, వేదసంబంధమైన వా గాని యేదికలదో అదియంతయు సంసర్గరూపమైన వాక్యార్థమునే తెలియఁజే న్నది. గనుక 'తత్త్వమస్యా'దివాక్యములవల్ల 'అహం బ్రహ్మ' నేను బ్రహ్మను అనే రూపమైన వాక్యార్థమును తెలిసికొని అంతకాలమువఱకు ధ్యానమును చేయవలఁ ఎంతకాల మావాక్యార్థరూపమైన ప్రత్యగాత్మయందు సంబంధించిన 'అహం అనే జ్ఞానము కలుగునో.

తా. 'గామానయ' (గోవును తోలుకొనిరా) ఇత్యాది లోకసిద్ధవాక్యము 'స్వర్గకామోయజేత' (స్వర్గమును కోరినవాఁడు యాగమును జేయవలఁ ఇత్యాది వైదికవాక్యములుగాని, అన్నివాక్యములున్ను సంసర్గరూపమైన వాక్యా బోధించుచున్నవి. గనుక 'తత్త్వమస్యా'ది వాక్యములున్ను సంసర్గరూపమైన

ర్థమునే బోధించుచున్నవి. అఖండైకరసార్థమును బోధించనేరవు. అయితే అఖండార్థము దేనివలన కలుగుననఁగా నిదిధ్యాసనమువలన (ధ్యానమువల్ల) కలుగునుగనుక ప్రత్యగాత్మయందు 'అహం బ్రహ్మ' అనే అఖండార్థజ్ఞానము కలుగుటకుగాను ముందుగా తత్త్వమస్యాదివాక్యములవల్ల సంసర్గవాక్యార్థమునెఱింగి ఆయర్థమును నిదిధ్యాసనమును చేయవలసినది. నిదిధ్యాసనమువలన ప్రత్యగ్ బ్రహ్మైక్యరూపమైనజ్ఞానము సంభవించుననిభావము.

అవ. ఇదిగాక వాక్యజన్యమైనజ్ఞానము మోక్షసాధనము కానేరదని చెప్పుచున్నారు.—

వాక్య. తస్మాదేవ విజ్ఞానాత్కైవల్య మాప్నోతీతి. ౫౯

దం—అ. అజ్ఞానమువల్లనే కైవల్యమునుపొందును అని కొందఱు చెప్పెదరని వాక్యముతోఁటి యన్వయము.

తా. ధ్యానజన్యమైన విజ్ఞానమువల్లనే కైవల్యము పొందఁబడునుగాని వాక్యజన్యమైన విజ్ఞానమువల్ల పొందఁబడదు గనుక వాక్యమువల్లనే అఖండార్థజ్ఞానము నియమములేదు. వాక్యజన్యజ్ఞానమువల్ల మోక్షమున్ను లేదని భావము.

అవ. ఈప్రకారముగా చెప్పినపూర్వపక్షవాదిని నిరాకరించేకొఱకు సిద్ధాంతవాది శ్లోకమును అవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. తన్నిరాకరణాయేద ముచ్యతే. ౬౦

దం—అ. దానిని నిరాకరించుటకొఱకు ఈశ్లోకము చెప్పఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. సామానాధికరణ్యాదేః ఘటేతరఖయోరివ,
వ్యావృత్తేః స్యా దవాక్యార్థః సాక్షాన్న స్తత్త్వమర్థయోః. ౯.

దం—అ. ఘటాకాశమహాకాశములకువలె 'తత్' పద 'త్వం' పదములయొక్క వాచ్యార్థములకు సామానాధికరణ్యము మొదలగుదానివలన నివృత్తికలుగుచున్నందున మాకు అఖండార్థము సాక్షాత్తుగా కలుగుచున్నది.

తా. విచారించగా నీలముత్పలం (నల్లనికలువ) ఇత్యాదివాక్యములయందు పదములకు సామానాధికరణ్యమున్ను, పదార్థములకు విశేషణవిశేష్యభావములున్ను కలిగియున్నందున వాక్యార్థము సంసర్గరూపముగానే భాసించుచున్నది. అయినప్పటికి ఘటాకాశోమహాకాశః (ఘటాకాశమే మహాకాశము) ఇత్యాదివాక్యములయందు పదములకు సామానాధికరణ్యము, పదార్థములకు విశేషణవిశేష్యభావమున్ను కలిగియున్నప్ప

టికి వాక్యార్థము సంసర్గరూపమని చెప్పతగదు. ఘటవిశిష్టమైన
పరిచ్ఛిన్నమైనందున మహత్త్వవిశిష్టమైన ఆకాశముతోటి సంసర్గము
విరుద్ధమైగదా యున్నది. ఎచ్చట పదార్థద్వయము అన్యోన్యసంసర్గ
కనుకూలమైయుండునో, అచ్చటనే వాక్యార్థము సంసర్గరూపమై
గనుక ఘటవిశిష్టాకాశమునందుగల పరిచ్ఛిన్నత్వమును, మహాకాశమున
త్వమును పరిత్యజించి, ఆకాశస్వరూపముమాత్రము లక్షణచేత వివక్షిత
ఈవాక్యార్థము పదార్థసంసర్గములేనిదైయున్నందున అఖండార్థమని చె
ఈప్రకారమే 'తత్' 'త్వం' పదములకు సామానాధికరణ్యమున్ను పదార్థ
షణవిశేష్యభావమున్ను కలిగి యున్నప్పటికి 'త్వం' పదార్థమైన అంతఃకరణ
చైతన్యమునకును 'తత్'పదార్థమైన సర్వజ్ఞత్వాదివిశిష్టచైతన్యమునకును పరస
విరుద్ధమైనందున సంసర్గవాక్యార్థము సిద్ధించదు గనుక 'త్వం' పదార్థమందు
రణ్య యన్యత్వాద్యంశమును తత్ పదార్థమందుగల సర్వజ్ఞత్వాపరోక్షత
పరిత్యజించి చైతన్యమాత్రములకు అభేదము భాగత్యాగలక్షణచేత వివక్షి
గాపున 'తత్త్వమస్యాది' వాక్యములవల్లనే ఆవాక్యార్థము (అఖండైకరసా
చుచున్నది. గనుక ఆవాక్యార్థసిద్ధికొఱకు నిదిధ్యాసనము అపేక్షించవ
భావము.

అవ. శంకాపూర్వకముగా నుత్తరశ్లోకమును అవతరింపఁజేయుచు

వాక్య. కుతః అవాక్యార్థోఽవసీయత ఇతి చే త్తత్ప
త్త్వర్థం విశేషణ విశేష్యయోః సామర్థ్యోక్తిః.

దం-అ. అఖండైకరసార్థము నిశ్చయింపఁబడుచున్నదని యెందుచ
న్నారనఁగా దానిని తెలియఁజేయుటకొఱకు విశేషణవిశేష్యములయొక్క
చెప్పఁబడుచున్నది.

తా. అనేక పదములతో ఘటింపఁబడియుండునది వాక్యమనంబడ
కలది వాక్యముగాదు. ఆ అనేకపదములు ఏకార్థములైనయెడల పు
ఘటించును. కనుక భిన్నార్థకములని చెప్పవలయును. భిన్నార్థకములగు
ములు) ఆకాంక్షాయోగ్యతాసన్నిధానములచేత పరస్పరసంసర్గమును బో
ంబడు గావున సంసర్గమే వాక్యార్థము. అనేకార్థకములై
కార్థమును బోధించుట శక్యముకానందున అఖండార్థమే వాక్యార్థ
చెప్పవచ్చునని కొందఱాక్షేపించుచున్నారు. ఆయాక్షేపమును పరిహా

అఖండార్థ మే ప్రకారముగఁ దెలియఁబడునో ఆ ప్రకారమును నిరూపించుటకై సిద్ధాంతవాది విశేష్యవిశేషణములయొక్క సామర్థ్యమును చెప్పుచున్నాఁడు అని భావము.

శ్లో. నిర్దుఃఖిత్వం త్వమర్థస్య తదర్థేన విశేషణాత్
ప్రత్యక్త్వాచ తదర్థస్య త్వంపదేనాస్య సన్నిధేః. ౧౦.

దం-అ. 'తత్' పదార్థముతోఁటి విశేషింపఁబడినందున 'త్వం' పదార్థమునకు సర్వదుఃఖరాహిత్యము సిద్ధించినది. 'త్వం' పదార్థముతోఁటి యీ'తత్'పదార్థమునకు సన్నిధానము కలిగినందువలన ఆత్మత్వము (అపరోక్షత్వము) సిద్ధించినది.

తా. దేహేంద్రియాది విశిష్టమైన చైతన్యము 'త్వం' పదార్థము. ఇట్టి 'త్వం' పదార్థము దేహేంద్రియాదిసంబంధముచేత ఆధ్యాత్మికాదిదుఃఖములు కలిగియున్నట్లు తెలియఁబడుచున్నది. 'సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ' 'విజ్ఞాన మానందం బ్రహ్మ' 'ఏకమేవా ద్వితీయం' ఇత్యాదిశ్రుతులచేత అద్వితీయ సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మమే తత్పదార్థము. ఇట్టి 'తత్' పదార్థము'అహం' అని ప్రత్యక్షముగా ప్రకాశించనందున పరోక్షమైనట్లు తెలియఁబడుచున్నది. ఇందులో 'తత్త్వమసి' వాక్యమునందు 'త్వం' పదార్థమునకు 'తత్' పదార్థము విశేషణముకాఁగానే 'త్వం' పదార్థమునందు తోఁచఁబడుచున్న దుఃఖిత్వము నివర్తించును. అనఁగా పరమానంద స్వరూపమైన పరబ్రహ్మవు నీవే యనగానే జీవునియందు తోఁచఁబడుచున్న దుఃఖాదులు వాస్తవములు కావని తోఁచి నివర్తించునని అర్థము. ఈప్రకారమే 'తత్' పదార్థమునకు'త్వం' పదార్థము విశేషణము కాగానే 'తత్'పదార్థమునందు తోఁచఁబడుచున్న పరోక్షత్వము (అనాత్మత్వము) నివర్తించును. అనఁగా నిత్యాపరోక్షమైన ఆత్మయే పరబ్రహ్మయనిచెప్పఁగానే పరబ్రహ్మయందు తోఁచఁబడుచున్నపరోక్షత్వము (అనాత్మత్వము) నివర్తించునని అర్థము గనుక 'తత్' 'త్వం' అనేపదములయొక్క సామర్థ్యము ఇట్టిదిగానున్నందున పదములకు పౌనరుక్త్యదోషములేదు. అఖండార్థప్రతీతియున్ను కలదని భావము.

అవ. గలెంచిన యర్థము ననువదించుచు నుత్తరగ్రంథము నవతరింపఁ జేయుచున్నారు.—

వాక్య. ఉక్తం సామానాధికరణ్యం విశేషణవిశేష్యభావశ్చ
సంక్షేపతః అథ లక్ష్యలక్షణవ్యాఖ్యానాయాహ. ఉ॥

దం-అ. సామానాధికరణ్యమున్ను విశేషణ విశేష్యభావమున్ను సంగ్రహముగఁ జెప్పఁబడినది. అనంతరము లక్ష్యలక్షణసంబంధమును వ్యాఖ్యానముచేయుటకొఱకు చెప్పుచున్నారు.

నని అతిదేశించుటచేత బుద్ధితోటి సామ్యమును చెప్పుటవలన భేదము ప్రసక్తముకాగా దానిని నిషేధించుటకొఱకు చెప్పఁబడుచున్నది.

తా. గతించినశ్లోకములో బుద్ధియొక్క జ్ఞాతృత్వ ప్రత్యక్త్వము లెట్లు పరస్పర మభిన్నములో అటులేఆత్మయొక్క కూటస్థబోధప్రత్యక్త్వములున్ను పరస్పరమభిన్నము లేనని చెప్పినందున ఆత్మయున్ను బుద్ధితో సమానుఁడని సిద్ధించినది. అందువలన బుద్ధికి జ్ఞాతృత్వప్రత్యక్త్వములకు ధర్మిధర్మరూపమైన భేదము కలిగియుండునట్లు ఆత్మకున్ను కూటస్థబోధ ప్రత్యక్త్వములకున్ను, ధర్మిధర్మరూపభేదము కలిగియుండునని తోఁచుచున్నది. అట్టిభేదమును నిరాకరించుటకొఱకు ముందఱిశ్లోకము ప్రవర్తించినదని భావము.

శ్లో. ధర్మధర్మిత్వభేదోఽస్యాః సోఽపి నైవాత్మనో యతః,
ప్రత్యగ్జ్యోతి రతోఽభిన్నం భేదహేతో రసంభవాత్. ౧౩.

దం-అ. ఈబుద్ధికి ధర్మధర్మిభావరూపమైన భేదముకలదు, ఆభేదమున్ను ఆత్మకు ఏహేతువువలనలేదో, అందువల్ల భేదమునకు హేతువులేనందునను ప్రత్యగాత్మస్వరూపము అభిన్నమైనది.

తా. బుద్ధివేద్యమై (తెలియఁబడునదై) యున్నందున, ధర్మిధర్మభావరూపమైన భేదముకలిగియున్నది. అనఁగా బుద్ధి దృశ్యవర్గములో చేరినది కావున, జ్ఞాతృత్వప్రత్యక్త్వములు ధర్మములుగా తాను ధర్మిగానుండి భేదమును సహించియున్నదని యర్థము. ఆత్మ అవేద్యమైనందున(దృశ్యవర్గములో జేరినవాఁడు కానందున)కూటస్థబోధప్రత్యక్త్వములు ధర్మముగా, తాను ధర్మిగా నుండి తాదృశభేదము కలవాఁడుగాఁడు. ఇదిగాక కూటస్థబోధ ప్రత్యక్త్వములకు ఆత్మకును, భేదమును గ్రహించేకారణసామగ్రికూడా లేనందున ప్రత్యక్స్వప్రకాశజ్ఞానస్వరూపుఁడైన ఆత్మ, అఖండైకరసమేగాని భేదము కలవాఁడు కాదని భావము.

అవ. భేదగ్రాహకమగు సామగ్రి కలదని శంకించగా దానికిపరిహారార్థముగ నుత్తరశ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. భేదహేత్వసంభవం దర్శయన్నాహ. ఉ॥

దం-అ. భేదకారణములయొక్క అసంభవమును చూపించుచు చెప్పుచున్నారు.

తా. భేదగ్రాహకసామగ్రికూన్యత్వరూపమైన హేతువును కనుపఱచుచున్నారని భావము.

శ్లో. న కస్యాం చిదవస్థాయాం బోధప్రత్యక్త్వయోర్భిదా,
వ్యభిచారోఽథవా దృష్టో యథాహం తద్విదో స్సదా. ౧౪.

దం-అ. ఏసమయమునందును, జ్ఞానప్రత్యక్త్వములకు భేదముగాని, వ్యభిచారము (ఒకటియున్నప్పుడు మఱియొకటి లేకపోవుట) గాని, అహంకారసాక్షిచైతన్యములకువలె కనుపడలేదు.

తా. అహంకారము జడమై దానిసాక్షి అజడమైనందున అహంకారసాక్షిచైతన్యములకు స్వరూపభేదము స్పష్టమైయున్నది. ఇదిగాక సుషుప్తిమూర్ఛాదికాలములయందు అహంకారము లేకపోయినను, సాక్షిచైతన్యము ప్రకాశించుచున్నందున వానికి వ్యభిచారమున్ను కలదు. ఇట్లు జ్ఞానమునకును, ప్రత్యక్త్వమునకును స్వరూపభేదము కాన్పించలేదు. జ్ఞానమును విడిచి ప్రత్యక్త్వముగాని, ప్రత్యక్త్వమునువదలి జ్ఞానముగాని ప్రకాశించుటయును కనుపడదు. కావున ప్రత్యగాత్మ అఖండైకరసమని నిశ్చయింపఁబడుచున్నదని భావము. "ప్రతీకం దేహేంద్రియాది వైలక్షణ్యం అంచతీతి ప్రత్యక్." అనే వ్యుత్పత్తిచేత జడములయిన దేహేంద్రియాదులకంటె అజడమైనందున, విలక్షణమైన వస్తువు 'ప్రత్యక్' అనఁబడును. జ్ఞానమునుఁగా అజడము గనుక జ్ఞానప్రత్యక్త్వములకు భేదములేదని తాత్పర్యము.

అవ. ఉత్తరశ్లోకముచేత ఫలితార్థము చెప్పఁబడునని చెప్పుచున్నారు.—

వాక్య. యస్మాదజ్ఞానోపాదానాయా ఏవ బుద్ధేర్భేదో నాత్మన స్తస్మా దేతత్సిద్ధమ్. ౬౬

దం-అ. ఎందువలన అజ్ఞానము కారణముగాఁగలబుద్ధికే, భేదముకలదో ఆత్మకు లేదో, అందువలన నీయర్థము సిద్ధించినది.

తా. ఇదివఱకుచెప్పిన గ్రంథమువలన అజ్ఞానకల్పితమైన బుద్ధికిమాత్రము భేదముకలదుగాని, స్వతస్సిద్ధమైన చిదాత్మకు భేదములేదని యేర్పడినది. అందువలన ఫలమేమి కలిగినదనఁగా నది ముందఱిశ్లోకమున చెప్పఁబడునని భావము.

శ్లో. కూటస్థబోధతోఽద్వైతం సాక్షాత్త్వం ప్రత్యగాత్మనః,
కూటస్థబోధాత్ బోద్ధృధీః స్వతో హీయం వినశ్వరీ. ౧౫౬

దం-అ. ప్రత్యగాత్మకు కూటస్థజ్ఞానమువలన అభేదమున్ను, అపరోక్షత్వమున్ను సిద్ధించినది. బుద్ధి కూటస్థజ్ఞానమువలనే జ్ఞాతృత్వము కలదై యున్నది. స్వయముగా నీబుద్ధి నశించే స్వభావముకలది.

తా. ప్రత్యగాత్మ నిత్యనిర్వికారమైన జ్ఞానమే స్వభావముగా కలిగియున్నందున సర్వదేహములయందొక్కఁడే నని, సర్వదా అసంకోచముగా ప్రకాశించుచుండునని సిద్ధించినది. ఇదిగాక జడమైన బుద్ధికి కూటస్థచైతన్యసంబంధముచేతనే జ్ఞాతృత్వము కలి

గినదని ఇంద్రియముగా ననేకవిధపరిణామములు కలిగినదని, నశించే స్వభావముకలదని సిద్ధించినదని భావము.

అవ. ఈ ప్రకారము పరిణామస్వభావముగల బుద్ధిచేత (అహంకారముచేత) కూటస్థజ్ఞానస్వరూపుఁడైన ప్రత్యగాత్మ లక్షింపఁబడుచున్నాఁడని చెప్పఁబడినది. అహంకార ప్రత్యగాత్మలకు లక్షణ మెట్టిదను దానిని చెప్పుట కారంభించుచున్నారు.—

వాక్య. అథాధునా ప్రకృతస్యైవ పరిణామినః కూటస్థస్య చ లక్షణముచ్యతే. ౬౭

దం-అనంతరము ఇప్పుడు ప్రకృతమై పరిణామముగలబుద్ధికిని కూటస్థుఁడైన ఆత్మకును, లక్షణము చెప్పఁబడును.

తా. స్పష్టము.

అవ. ముందుగా నహంకారముయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది.—

శ్లో. విశేషం కంచిదాశ్రిత్య యత్స్వరూపం ప్రతీయతే,
ప్రత్యభిజ్ఞా ప్రమాణేన పరిణామీ సదేహవత్. ౧౬

దం-అ. దేనియొక్క స్వరూపము ఒకానొకవిశేషమును అవలంబించి దేహమువలె ప్రత్యభిజ్ఞాప్రమాణముచేత ఏకముగా తెలియఁబడునో అది పరిణామి (అహంకారము) అని చెప్పఁబడును.

తా. 'ఘట మహం జానామి,' 'పట మహం జానామి,' 'అహం సుఖీ,' 'అహం దుఃఖీ,' (నేను ఘటమును తెలిసికొనుచున్నాను, నేను పటమును తెలియుచున్నాను, నేను సుఖిని, నేను దుఃఖిని) అని ఘటపటాదివిశేషములు కలిగియున్నప్పటికిని 'య ఏవాహం దుఃఖీ స ఏవాహం సుఖీ' (ఏ నేను దుఃఖవంతుఁడనై యుంటినో ఆ నేనే ఇప్పుడు సుఖవంతుఁడనై యున్నాను) అని ప్రత్యభిజ్ఞచేత నేది ఏకముగా (ఒకటిగా) తెలియఁబడుచున్నదో అయ్యది అహంకారమని చెప్పఁబడును. విశేషములు కలిగియున్నచో నేకముగా నెట్లు తెలియఁబడు ననఁగా, బాల్య, యౌవన, వార్ధకాదిభేదములు కలిగియున్నప్పటికి దేహము ఒకటిగా నెటువలె తెలియఁబడుచున్నదో, అటువలె సుఖదుఃఖాదివిశేషములు కలదైనప్పటికి అహం అని తెలియఁబడు అహంకారము ఏకముగా తెలియఁబడునని భావము.

అవ. కూటస్థాత్మయొక్క లక్షణమును నిర్దేశించుచున్నారు.—

శ్లో. సామాన్యాచ్చ విశేషాచ్చ స్వమహిమ్నైవ యో భవేత్,
వ్యావృత్తో యాప్యవికారీ స్యాత్కుంభాకాశాదివత్తు సః ౧౭

దం-అ. ఏది ఘట ఆకాశాదులవలె, సామాన్యమువల్లను విశేషమువల్లను భేదమును పొంది తనస్వభావముచేత నే ప్రకాశించుచుండునో ఆది అవికారి (కూటస్థచైతన్యము) అని చెప్పఁబడును.

తా. అనువృత్తవస్తువు సామాన్యమని వ్యావృత్తవస్తువు విశేష్యమని చెప్పఁబడును. 'అహం సుఖీ, అహం దుఃఖీ' (నేను, సుఖవంతుఁడను నేను దుఃఖవంతుఁడను) అనే స్థలములయందు 'అహ' మని చెప్పఁబడువస్తువు అనువృత్తము ఇదియే సామాన్యము సుఖదుఃఖాదులు వ్యావృత్తములు. ఇవియే విశేషములు. ఇట్టి సామాన్యవిశేషములకంటె విలక్షణమై,ఏది స్వమహిమ (తనయొక్క ప్రకాశము) చేతనే ప్రకాశించుచుండునో అది కూటస్థచైతన్యము (సాక్షి) యనఁబడును. అనువృత్తవ్యావృత్తవస్తువుల నతిక్రమించి స్వప్రకాశముచే నేలాగున ప్రకాశించునన, ఆకాశఘటకరకాద్యుపాధులలో చేరి యున్నప్పటికి వాటికంటె విలక్షణముగానుండి, ఘటాదులయందుగల స్థౌల్యధూమాది వికారముల నంటక, స్వస్వభావముచేత నే యెట్లు ప్రకాశించుచుండునో, అట్లే సాక్షిచైతన్యము అహంకారసుఖదుఃఖాదులకంటె విలక్షణమై, అహంకారాదిగతవికారముల నంటక స్వప్రకాశముచేతనే కేవలముగ ప్రకాశించుచుండు నని భావము.

అవ. ఈప్రకారము లక్ష్యలక్షణములయిన కూటస్థాత్మబుద్ధులయొక్క లక్షణము చెప్పఁబడినది. ఇఁకను ఆకూటస్థాత్మబుద్ధులకు ఎట్టిబోధ ప్రత్యక్త్వములనే యసాధారణాకారములు చెప్పఁబడినవో వాటి లక్షణమును చెప్పుటకొఱకు ఉత్తరశ్లోకములు ప్రవర్తించుచున్నవని చెప్పుచున్నారు.—

వాక్య. ఆత్మనో బుద్ధేశ్చ బోధప్రత్యగాత్మత్వ మభిహితం
తయోరసాధారణ లక్షణాభిధానార్థ మాహ. ౬౮

దం-అ. ఆత్మకును, బుద్ధికిని బోధయును ప్రత్యక్త్వమును స్వరూపమని చెప్పఁబడినది. ఆబోధ ప్రత్యక్త్వములకు అసాధారణలక్షణము చెప్పుచున్నారు.

తా. స్పష్టము.

అవ. ముందు ఆత్మబుద్ధులయొక్క ప్రత్యక్త్వములకు గలవిశేషమును చెప్పుచున్నారు.—

శ్లో. బుద్ధేర్య త్ప్రత్యగాత్మత్వం తత్స్యా ద్దేహా ద్యుపాశ్రయాత్,
ఆత్మనస్తు స్వరూపం తన్నభసః సుషిరతా యథా. ౧౭

దం-అ. బుద్ధియొక్క ప్రత్యక్త్వ మెద్దియో, అది దేహము మొదలగువానియొక్క సంబంధముచేత కలిగినది. ఆత్మయొక్క ప్రత్యక్త్వము ఆకసమునకు ఛిద్రమువలె స్వరూపముగ నున్నది.

తా. దేహేంద్రియాదుల నపేక్షించి బుద్ధికి ప్రత్యక్త్వము కలిగియున్నది. అనగా దేహేంద్రియాదిపదార్థములలో కొన్నిటికంటె అంతరమైయుండి, చైతన్య ప్రతిబింబితమై, దేహేంద్రియాదులకంటె విలక్షణముగ భాసిల్లుచున్నందున బుద్ధికి ప్రత్యక్త్వము సంభవించినదని యర్థము. చిదాత్మ, 'య ఆత్మా సర్వాంతరః'(ఏయాత్మ దేహేంద్రియాదుల కన్నింటికిని అంతరమందు (లోపల)ఉండెనో ఆయాత్మను నాకు తెలియునట్లు చెప్పుము) అనే శ్రుతివల్ల దేహేంద్రియాదిపదార్థముల కన్నింటికిని అంతరమందుండి సర్వవిలక్షణముగా ప్రకాశించుచున్నందున ఆచిదాత్మయొక్క ప్రత్యక్త్వము స్వరూపమైయుండునది యెటులనగా నాకసమునకు ఛిద్రము యెటుల స్వరూపమై యున్నదో యటులే ప్రత్యక్త్వము ఆత్మకు స్వరూపమైయున్నదని భావము. బుద్ధియొక్క ప్రత్యక్త్వము దేహేంద్రియాదుల నపేక్షించియున్నందున ఔపాధికము ఆత్మయొక్క ప్రత్యక్త్వము నిరపేక్షమైనందున స్వాభావికమని తాత్పర్యము.

అవ. ఇంకను ఆకూటస్థాత్మలయొక్క జ్ఞాతృత్వబోద్ధృత్వమునందుగల విశేషమును చెప్పుచున్నారు.—

శ్లో. బోద్ధృత్వం తద్వదేవాస్యాః ప్రత్యయోత్పత్తిహేతుతః,
ఆత్మనస్తు స్వరూపం తత్తిష్ఠంతీవ మహీభృతః. ౧౯

దం-అ. అట్లు ఈబుద్ధికి, జ్ఞానముల (వృత్తుల) యొక్క ఉత్పత్తికి కారణమైనందున బోద్ధృత్వము సంభవించినది. ఆత్మకు జ్ఞాతృత్వము పర్వతములు నిలచియున్నట్లుగా స్వరూపమై యున్నది.

తా. ఘటాది నానావిధవిషయములను ప్రకాశింపజేయుచున్నవృత్తులను పుట్టించుటచేత బుద్ధికి జ్ఞాతృత్వము కలుగుచున్నది. కాన నది ఔపాధికమై యున్నది. ఆత్మకు జ్ఞాతృత్వము స్వరూపమైయున్నది కావున నిరుపాధికము. ఎటులనగా పర్వతములు నిలచియున్నవని చెప్పుట యెట్లు నిరుపాధికమో, అటులే ఆత్మయందు జ్ఞాతృత్వమున్ను నిరుపాధికము. అని భావము. మనుష్యమృగాదిజంతువులు సంచరించుచుండును గనుక, అవి సంచరించకనుండుసమయములో నిలచియున్నవి. అని గతిని, వృత్తిని బోధించేశబ్దము ముఖ్యార్థమైయుండును. పర్వతములు స్థావరములైనందున వాటి కెప్పటికిని సంచారమును లేదు. అందుచే గతిని, వృత్తిని బోధించే తిష్ఠంతి (నిలచియున్నవి) అనేశబ్దము ముఖ్యార్థము కాలేదు. ఒకప్పుడు సంచారమున్నకదా ప్రస్తుతసమయమందు లేదని చెప్పవచ్చును. కావున పర్వతములయందు 'పర్వతాః తిష్ఠంతి' (పర్వతములు నిలచియున్నవి) అని చెప్పుటకు ముఖ్యార్థమున్న వాటియొక్క స్వభావ

మున్ను చెప్పినట్లైయున్నది. అటులే ఆత్మయందున్ను జ్ఞానక్రియాకర్తృత్వము లేనందున 'విజ్ఞాతారమరే కేన విజానీయాత్' (విజ్ఞాతను ప్రత్యగాత్మను దేనివలన తెలియనగు), 'జానాత్యేవాయంపురుషః' (ఈపురుషుఁడు తెలిసికొంటునే యున్నాఁడు) ఇత్యాదిశ్రుతులయందు తెలియఁజేయఁబడిన జ్ఞాతృత్వము, జ్ఞానక్రియాకర్తృత్వమనే ఉపాధినిబట్టి ప్రవర్తించినదికాదు. జడవిలక్షణమైన నిత్యజ్ఞానస్వరూపమునుబట్టి ప్రవర్తించినది గనుక, జ్ఞాతృత్వము ఆత్మకు స్వాభావికమైన స్వరూపమని తాత్పర్యము.— ఇందువలన జ్ఞాతృశబ్దమందు కర్తృత్వమును బోధించేప్రత్యయము అవివక్షితమని జ్ఞానమాత్రమును బోధించే జ్ఞాధాత్వర్థమే వివక్షితమని తెలియవలయు.

అవ. ఓయీ! లక్ష్యలక్షణములగు ఆత్మాహంకారములకు సంబంధముకలదా! లేదా? కలదంటివా ఆత్మ నిర్విశేషము కాకపోవును. లేదనిన లక్ష్యలక్షణభావము లేకపోవును అని శంకించగా నట్లు చెప్పఁగూడదు. వాస్తవసంబంధము లేకపోయినప్పటికి, అధ్యాససిద్ధసంబంధమును అంగీకరించినచో, దాన రెండుదోషములు ప్రసక్తములు గావు అని చెప్పఁబడుచున్నది.—

వాక్య. తయోః కూటస్థపరిణామినోః ఆత్మానవబోధ ఏవ సం
బంధహేతుః నపునర్వాస్తవః కశ్చిదపి సంబంధ ఇత్యాహ. ౬౯

దం-అ. ఆకూటస్థచైతన్యాహంకారములయొక్క సంబంధమునకు కారణము ఆత్మసిద్ధమగు నజ్ఞానమే యగును. మఱియొకవాస్తవమైనసంబంధము యుక్తముకాదని చెప్పుచున్నారు.

తా. కూటస్థాత్మకు అహంకారమునకు వాస్తవమైన సంబంధములేదు. అజ్ఞానకల్పితమగుసంబంధము (ఆధ్యాసికసంబంధము) కలదు. అట్టిసంబంధము కలిగియున్నందుచేతనే లక్ష్యలక్షణము ఆత్మాహంకారములకు కలుగుచున్నది. వాస్తవసంబంధములేనందున ఆత్మయొక్క నిర్విశేషత్వమునకు హానిలేదు. ఈయర్థము ముందటిశ్లోకములోఁ జెప్పఁబడెనని భావము.

శ్లో. సమ్యక్సంశయ మిథ్యాత్మైర్ధీరేవేయం విభజ్యతే,
హానోపాదానతామేషాం మోహాదధ్యస్యతే దృశౌ. ౭౦

దం-అ. సమ్యక్జ్ఞానముచేతను, సంశయజ్ఞానముచేతను, మిథ్యాజ్ఞానముచేతను, ఈబుద్ధియే విశేషింపఁబడుచున్నది. ఈజ్ఞానములయొక్క సత్తయును, అసత్తయును, సాక్షిచైతన్యమందు అజ్ఞానమువలన నారోపింపఁబడుచున్నది.

తా. ఇది ఘటము ఇది పటము, ఇత్యాదినిశ్చయవృత్తిసమ్యక్ జ్ఞానము. కనుచీకటిలోఁ కనుపడుచున్న అది రజ్జువా? లేక సర్పమా? అనేవృత్తిసంశయజ్ఞానము. శుక్తి నిజూచి ఇది రజతము అనుజ్ఞానము మిథ్యాజ్ఞానము. ఈమూఁడుజ్ఞానములు బుద్ధియొక్క ధర్మములు గావున, బుద్ధియే వీటిచేత విశేషింపఁబడుచుండును. బుద్ధి ధర్మములయిన ఈసమ్యక్ జ్ఞానాదులయొక్క భావాభావములను నిర్వికారమైన కూటస్థాత్మయందు, అనాద్యజ్ఞానముచేత నారోపించుచున్నారు. గావుననే ఆత్మ సవిశేష మని తోఁచుచున్నదిగాని వాస్తవముగా సవిశేషముగాదు. ఆరోపితసంబంధమువలన ఆత్మాహంకారములకు లక్ష్యలక్షణభావమున్ను కలదని భావము.

అవ. పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కుతః కూటస్థాత్మసిద్ధిః. ౭౦

దం-అ. నిర్వికారమైన ఆత్మసిద్ధి యెందువలన కలిగినది?

తా. బుద్ధియనే యుపాధితో సంబంధములేనిచో నాత్మయందు జ్ఞానత్వము చూడఁబడుటలేదు. కావున ఆత్మకు కూటస్థత్వము సిద్ధించదని భావము.

అవ. ఇట్లు చేయఁబడినశంకను పరిహరించుటకొఱకు శ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. ఇతిచేత్. ౭౧

దం-అ. ఇట్లు చెప్పినచో నట్లు చెప్పరాదు.

తా. ఈలాగున పూర్వపక్షవాది శంకించగా, నిట్లు శంకించఁగూడదని సిద్ధాంతవాది పరిహారమును చెప్ప నారంభించుచున్నారని భావము.

వాక్య. యతః. ౭౨

దం-అ. ఎందువలన ననఁగా?

తా. ఎందువలన చెప్పకూడదో యాకారణమును చెప్పెదమని భావము.

శ్లో. నహానం హానమాత్రేణ నోదయోఽపీయతా యతః,
తత్సిద్ధిః స్యాత్తు తద్ధీనే హానాదాన విధర్మకే. ౫౧

దం-అ. అభావము అభావమాత్రముచేతనే సిద్ధించదు. సద్భావమున్ను ఇంతమాత్రముచేతనే సిద్ధించదు. ఏలననఁగా భావాభావధర్మశూన్యమై, అవికారములులేని కూటస్థచైతన్యమునందు ఆరోపింపఁబడుటచేత అభావాభావములయొక్క సిద్ధియగుచున్నది.

తా. బుద్ధియొక్క ఆభావమున్ను, బుద్ధివృత్తులయొక్క అభావమున్ను జడములైనందుననే, స్వయముగా సిద్ధించ నేరవు. మఱియెట్లు సిద్ధించుననఁగా బుద్ధితద్వృత్తిసంబంధములేనిదై ఉత్పత్తివినాశములులేక నిర్వికారమై యున్న కూటస్థచైతన్యమందు బుద్ధితద్వృత్తులున్ను, వాటిభావాభావములున్ను అధ్యసింపఁబడియున్నది గనుక చైతన్యాభాసముచేతనే సిద్ధించుచున్నవి. బుద్ధ్యాదిసర్వవిషయములయొక్క సత్తాసత్తలను ప్రకాశింపఁజేయుచున్న కూటస్థచైతన్యమునకు జ్ఞాతృత్వము బుద్ధిసంబంధముచేత కలుగుచున్నదని చెప్పఁగూడదని భావము.

అవ. అన్వయవ్యతిరేకములతోఁగూడి వాక్యమే అజ్ఞానమును నివర్తింపఁజేయునుగాని, కేవలమైన అన్వయవ్యతిరేకములు అజ్ఞాననివర్తకములు గావని యుపసంహరించుచున్నారు ——

వాక్య. ఏవమ్ = ఈ ప్రకారము. 23

శ్లో. ఆగమాపాయిహేతుభ్యాం ధూత్వా సర్వాననాత్మనః,
తత స్తత్త్వమసీత్యేతత్ హంత్యస్మది నిజం తమః. ౨౨

ప్ర-అ. అన్వయవ్యతిరేకహేతువులచేత సకలమైన అనాత్మలను విడిచియున్నపురుషునకు అనంతరము 'తత్త్వమసి' యనేవాక్యము, అస్మదర్థమందుగల స్వీయమైన అజ్ఞానమును నశింపఁజేయుచున్నది.

తా. వ్యతిరేకవ్యాఖ్యాయములలోఁ జెప్పిన అన్వయవ్యతిరేకములనే యుక్తులను చక్కఁగా నాలోచించి ఆత్మయొక్క స్వరూపమిట్టిది యని, అనాత్మయొక్క స్వరూపమిట్టిది యని విభజించి తెలిసికొనియున్నవానికి, 'తత్త్వమసి' యనే ఈమహావాక్యము ప్రత్యగాత్మయొక్క సకలసంసారమునకు కారణమైన అనాద్యజ్ఞానమును నిశ్శేషముగా నివర్తింపఁజేయునని భావము.

అవ. ఈ ౨౨ వ శ్లోకములోఁ జెప్పినయర్థము ఇదివఱకు ౧, ౬, శ్లోకములలోనున్ను చెప్పఁబడియున్నది. కావున పునరుక్తిదోషము సంభవించునని శంకించగా పరిహారమును చెప్పుచున్నారు.——

వాక్య. ఇత్యాది పునః పునరుచ్యతే గ్రంథలాఘవాద్బుద్ధి
లాఘవం ప్రయోజక మితి. 24

ప్ర-అ. గ్రంథముయొక్క లాఘవమువల్ల బుద్ధికి లాఘవముకలుగుట ప్రయోజనమనే కారణముచే నిది మొదలగునర్థము మాటిమాటికి చెప్పఁబడుచున్నది.

తా. ఈయధ్యాయమున చెప్పఁబడుచున్నవాక్యార్థము అత్యంతసూక్ష్మమైనం దున, బుద్ధి త్వరగా ప్రవేశించదు గనుక, అనేకపర్యాయములు చెప్పవలసియున్నది. ఒకచోటనే యనేకపర్యాయములు చెప్పినచో గ్రంథము బహుళమై బుద్ధికి విసుగు బుట్టి ప్రకృతార్థమును గ్రహించలేనిమాంద్యము కలుగును. అచ్చటచ్చట కొద్దిగ్రంథ ముతో ప్రతిపాదించినయెడల బుద్ధి సౌకర్యమునుబొంది ప్రకృతార్థమును నిశ్చయించి గ్రహించును. ఇట్టి ప్రయోజనము కలుగుటకుగాను ప్రకృతార్థము ఒక్కటే మాటి మాటికి చెప్పఁబడినది గనుక పునరుక్తిదోషము రానేరదు. ఎచ్చట నొకయర్థము నిష్ప్ర యోజనముగా మాటిమాటికి చెప్పఁబడునో అచ్చటనే పునరుక్తిదోషము సంభవించునని భావము.

అవ. ఈలాగుననే కానిమ్ము. ఉత్తరగ్రంథముచేత నేది వివరింపఁబడునో చెప్పు చున్నారు.—

వాక్య. తత్ర యద్యపి 'తత్త్వమస్యా'ది వాక్యాదుపాది త్సితా ద్వితీయాత్మార్థవత్పారోక్ష్య సద్వితీయార్థః ప్రతీ యతే. తథాపి తు నైవాసావర్థః శ్రుత్యా తాత్పర్యేణ ప్రతిపిపాదయిషతః ప్రాగప్యేతస్య ప్రతీతత్వాదితి ఇమ మర్థమాహ. ౭౫

దం-అ. ఆపూర్వగ్రంథమందు విచారించగా 'తత్త్వమసి' మొదలగువాక్యముల వలన గ్రహింపఁదగిన అద్వితీయమైన చిదాత్మరూపమైన అర్థమువలె, పరోక్షమై సద్వి తీయమైన అర్థమున్ను తెలియఁబడుచున్నది. అయినప్పటికి ఈయర్థము శ్రుతిచేత తాత్పర్యముతో ప్రతిపాదింప నిచ్ఛయించినది కానేరదు. ఎందువల్లననఁగా పూర్వము నందు సైత మీయర్థము తెలియఁబడియున్నది అని ఈయర్థమును చెప్పుచున్నారు.

తా. 'తత్త్వమసి' యనే వాక్యమునందు 'తత్, త్వం' అనే రెండుపదములకు సామానాధికరణ్యము కలిగియున్నందున, సామానాధికరణ్యము ఏకార్థనిష్ఠమని తలంచి, లక్షణావృత్తిచేత, ప్రత్యగద్వితీయపరమాత్మస్వరూపము 'తత్, త్వం' పదములకు అర్థమని ప్రతిపాదింపఁబడినది. ఈప్రకారమే ముఖ్యవృత్తిచేత, పరోక్షమై సద్వితీయ మైన, ఆత్మస్వరూపము 'తత్, త్వం' పదముల కర్థమని తెలియఁబడుచున్నది గనుక, 'తత్త్వమసి' వాక్యమునకు సద్వితీయాత్మస్వరూపమున్ను ప్రతిపాద్యార్థము కానగు నని, కొందఱు శంకించెదరుగాని, అది యుక్తముకాదు. ఎందువల్లననఁగా, సద్వితీయా త్మస్వరూపమును ప్రతిపాదించవలయుననే తాత్పర్యము శ్రుతికిలేదు. 'ఏకమేవాద్వి

తీయం' అని యారంభములోనే, సజాతీయ, విజాతీయ, స్వగతభేదశూన్యమైనది ఆత్మ స్వరూపమని ప్రతిపాదించియున్నది. అందులకు విరుద్ధముగా నుపసంహారమందున్న 'తత్త్వమసి' వాక్యములో సద్వితీయాత్మస్వరూపమును ప్రతిపాదించెనని చెప్పుట యుక్తముకాదు. ఇదిగాక ప్రమాణాంతరములచేత ప్రతిపాదింపఁబడనియర్థమును ప్రతిపాదించుటయే శాస్త్రమునకు స్వభావము. పరోక్షసద్వితీయాత్మస్వరూపము శాస్త్ర విచారముకంటె పూర్వమందే ప్రత్యక్షాదిప్రమాణములచేత తెలియఁబడుచున్నది గనుక, 'తత్త్వమసి' వాక్యమునకు ప్రతిపాద్యార్థముగా నుండదని ఈయర్థము ముందరి రెండు శ్లోకములతో ప్రతిపాదింపఁబడుచున్నదని భావము.

శ్లో. తదిత్యేతత్పదం లోకే బహ్వర్థప్రతిపాదకమ్,
అపరిత్యజ్య పారోక్ష్య మభిధానోత్థ మేవ తత్. ౨౩

దం-అ. 'తత్' అనే ఈపదము అప్రత్యక్షమును పరిత్యజించక లోకములో ననేకార్థములను ప్రతిపాదించుచున్నది గావున, అపరోక్షత్వము శబ్దసామర్థ్యముచేత కలిగియున్నది.

తా. 'తత్' అనేపదము సర్వనామశబ్దమైనందునను, విశేషాకారమును ప్రతిపాదించనందునను, దేశకాలవ్యవహితములై, అప్రత్యక్షములుగానున్న అనేకార్థములను ప్రతిపాదించుచున్నది. గనుక, అప్రత్యక్షత్వము 'తత్' పదముయొక్క అభిధాశక్తి (సామర్థ్యము) చేతనే సామాన్యముగా తెలియఁబడుచున్నది. గాని తాత్పర్యశక్తిచేత తెలియఁబడునది, కాదని భావము.

శ్లో. త్వమిత్యపి పదం తద్వత్ప్రత్యక్షార్థవాచి తు,
సంసారితామసంత్యజ్య సాపి స్యాదభిధానజా. ౨౪

దం-అ. అటువలెనే 'త్వం' అనేపదమున్ను సంసారత్వమును వదలక ప్రత్యక్షమైన ప్రమాతను చెప్పుచున్నది. ఇదియును శబ్దసామర్థ్యముచేత పుట్టినది.

తా. 'తత్' పదమువలెనే 'త్వం' పదమున్ను కర్తృత్వభోక్తృత్వాది సంసారధర్మములు కలిగియున్నందున సద్వితీయుఁడై 'అహం, అహం' అని నిత్యము అవ్యవహితముగా ప్రకాశించుచున్నందున అపరోక్షమైయున్న ప్రమాతను (అంతఃకరణవిశిష్టచిత్తును) తెలియఁజేయుచున్నది. ఇట్టి యర్థము 'త్వం' పదసామర్థ్యముచేత తెలియఁబడుచున్నదిగాని, తాత్పర్యముచేత ప్రతిపాదింపబడినదిగాదు అని భావము. అనఁగా 'తత్' పదస్వభావముచేత పరోక్షార్థమున్ను 'త్వం' పదస్వభావముచేత సద్వితీయార్థమున్ను తెలియబడుచున్నదిగాని 'తత్, త్వం' పదములయొక్క తాత్పర్యముచేత తెలియబడునది

కాదు. వాక్యము పురుషార్థసాధకమైన అర్థమును ప్రతిపాదించునుగాని, నిర
ర్థమును ప్రతిపాదించదు. సద్వితీయ పరోక్షార్థములను ప్రతిపాదించినందు
ములేదు. ప్రతిపాదించినయెడల ఉపక్రమోపసంహారాది షడ్విధతాత్పర్య
నిశ్చయింపఁబడుచున్న అద్వితీయాపరోక్షాత్మ తత్త్వార్థమునకు విరుద్ధము
గనుక 'తత్త్వమసి' వాక్యమునకు లక్షణావృత్తిచేత సిద్ధమైన అద్వితీయ
స్వరూపమే ప్రతిపాద్యముగాని అభిధావృత్తిచే సిద్ధమైన సద్వితీయపరోక్ష
ము ప్రతిపాద్యముకాదని పండితార్థము.

అవ. మఱియొక హేతువుచేతకూడా పరోక్షత్వ సద్వితీయత్వముల
విషయములు కావని చెప్పుచున్నారు.—

వాక్య. విరుద్ధోద్దేశనత్వాచ్చ పరోక్ష్యదుఃఖిత్వయో రవి
క్షిత త్త్వ మిత్యాహ. ౭

దం-అ. విరుద్ధమైన ఉద్దేశము కలుగుటవల్లనున్ను పరోక్షత్వదుః
తాత్పర్యగోచరత్వము లేదనిచెప్పుచున్నారు.

తా. 'తత్, త్వం' అనేపదములు పరస్పరాన్వయయోగ్యములుకా
లైనరూపములను నిర్దేశించుచున్నందున పరోక్షత్వదుఃఖిత్వములు వివక్షిత
ముందఱిశ్లోకములోఁ జెప్పబడునని భావము.

శ్లో. ఉద్దిశ్యమానం వాక్యస్థం నోద్దేశన గుణాన్వితమ్
ఆకాంక్షితపదార్థేన సంసర్గం ప్రతిపద్యతే.

దం-అ. వాక్యమందున్న ఉద్దేశింపఁబడినపదార్థము ఉద్దేశింపఁబడిన
కూడుకొన్నదై ఆకాంక్షింపఁబడుచున్న (విధింపఁబడుచున్న పదార్థముతో న
పొందదు.

తా. వాక్యము ఉద్దేశ్యోపాదేయములు కలదైయుండునని ఇదివరకే
నిరూపించియున్నారము. 'తత్త్వమసి' వాక్యములో 'త్వం' పద ము
'తత్' పద ముపాదేయపదము. ఇందులో ఉద్దేశ్య 'త్వం' పదార్థమైనవ
దశలో తనయందు దాపాతముగాఁదోచుచున్న సుఖిత్వదుఃఖిత్వాదిధర్మములతో
గానిదై సకలసంసారధర్మశూన్యముగా విధింపబడుచున్న 'తత్' పదార్థము
ర్గమును పొందనేరదు. ఈప్రకారమే 'తత్' పదార్థమైనవస్తువు పరోక్షత
లలో కూడుకొనియున్నదై సాక్షాదపరోక్షమైన 'త్వం' పదార్థములోటి
పొందుటకు యోగ్యమైయుండదు. గనుక 'తత్' 'త్వం' పదములు రెంటియ

స్వరసంసర్గవిరోధులైన సంసారిత్వ పరోక్షత్వాదిధర్మములు వివక్షితములుగావని భావము.

అవ. ఓయీ! నీల ముత్పలం (నల్లనికలువ) ఇత్యాదివాక్యములయందు (విశేషణవిశేష్యభావము విశిష్టార్థపరమైయున్నదిగదా? ప్రకృతమైన 'తత్త్వమసి' వాక్యమందున్న విశేషణవిశేష్యభావము విశిష్టార్థపరమేనని అంగీకరించవలయునుగాని, లక్షణావృత్తి నవలంబించి అఖండార్థపరమని అంగీకరించఁదగదని యాక్షేపింపఁబడి సిద్ధాంతవాది వివక్షితార్థమునకు విరుద్ధమైయున్నందువలన 'మంచాః క్రోశంతి' (మంచాలరచుచున్నవి) ఇత్యాదివాక్యములయందు లక్షణావృత్తిని యంగీకరించుచున్నందున, 'తత్త్వమసి' వాక్యమునందుకూడ లక్షణావృత్తి నవలంబించి వివక్షితార్థానుగుణముగా విశేషణవిశేష్యభావమునకు అఖండార్థపరత్వము నే అంగీకరించవలయున నే యభిప్రాయముతో చెప్పుచున్నారు.

వాక్య. యత ఏతదేవ మతోఽనుపాదిత్సితయోరపి తత్త్వమర్థయో ర్విశేషణ విశేష్యభావో భేదసంసర్గరహితతా వాక్యార్థలక్షణ యై వేత్యుపసంహారః. ౭౫

దం-అ. ఎందువలన ఇది యిట్లు అగుచున్నదో అందువలన అవివక్షితములగు 'తత్ త్వం' పదములయొక్క వాచ్యార్థములకు విశేషణవిశేష్యభావము కలదు. భేదసంసర్గశూన్యమైన వాక్యార్థము లక్షణావృత్తిచేతను కలుగుచున్నదని పర్యవసానము.

తా. వివక్షితార్థమునకు విరుద్ధమైన అర్థమును గ్రహించకూడదు గనుక అవివక్షితములైన వాచ్యార్థములకు విశేషణవిశేష్యభావము 'నీలోత్పల' వాక్యమునకువలె సంభవించవచ్చును భేదసంసర్గరహితమైన అఖండైకరసార్థము లక్షణచేతనే సిద్ధించుచున్నదని నిశ్చయింపఁబడుచున్నదని భావము.

అవ. ఓయీ! అట్లాగున నే కానిమ్ము. అయినప్పటికి విశేషణపదమేది? విశేష్యపదమేది? అని యడుగ చెప్పుచున్నాడు.

శ్లో. తదో విశేషణార్థత్వం విశేష్యత్వం త్వమ స్తథా,
లక్ష్యలక్షణసంబంధః తయోః స్యాత్ప్రత్యగాత్మనా. ౭౬

దం-అ. 'తత్' పదమునకు విశేషణత్వము ఆప్రకారమే 'త్వం' పదమునకు విశేష్యత్వము కలిగియున్నది, ఆరెంటికి సంబంధము ప్రత్యగాత్మచే నగుచున్నది.

తా. 'తత్త్వమసి' వాక్యములో 'తత్'పదార్థము విశేషణమైయున్నది. 'త్వం' పదార్థము విశేష్యమైయున్నది, 'త్వం' పదార్థము సామాన్యముగా 'అహం' అని తెలి

యఁబడుచున్న ఆత్మయని ప్రసిద్ధమైయున్నది. ఇట్టియాత్మ దేహేంద్రియాది విలక్షణుని తెలియఁబడుచున్నది. ఇంతమాత్రపు ఆత్మస్వరూపమును తెలియుటచేత పురుషార్థము సంపూర్ణమగునని తెలియబడదు. 'బ్రహ్మవిదాప్నోతి పరమి'త్యాదిశ్రుతులు అద్వితీయ బ్రహ్మస్వరూపసాక్షాత్కారము చేతనే పురుషార్థసమాప్తికలుగుననిబోధించుచున్నవి. గనుక అద్వితీయబ్రహ్మస్వరూపబోధకమైన 'తత్' పదముచేత దేహేంద్రియాది విలక్షణాత్మబోధకమైన త్వంపదము విశేషింపఁబడుచున్నది. 'తత్' పదార్థ 'త్వం' పదార్థములు అన్యోన్యవిరుద్ధధర్మాక్రాంతములై యున్నందున, వివక్షితమైన అర్థము సిద్ధించదు గావున లక్షణావృత్తినవలంబించి 'తత్' 'త్వం' పదార్థములయందుగల పరోక్షత్వసద్వితీయ్యాది విరుద్ధాంశములను పరిత్యజించి అఖండైకరసమైన ప్రత్యగాత్మస్వరూపము 'తత్ త్వం' పదములచేత లక్షింపఁబడుచున్నది గనుక తత్త్వమసి' వాక్యములో'తత్' త్వం' పదములకు విశేషణవిశేష్యభావము కలిగియున్నప్పటికి నీవిశేషణవిశేష్యభావము ఇప్పుడు చెప్పినప్రకారము అఖండార్థపరమేగాని 'నీలోత్పల' వాక్యమందువలె విశిష్టార్థపరముగాదని భావము.

అవ. ఓయీ! 'గంగాయాం ఘోషః ప్రతివసతి' (గంగయందు గొల్లపల్లె యున్నది.) ఇత్యాదివాక్యములయందు గంగాశబ్దము లక్షణచేత తీరమును బోధించుచున్నను, గంగాశబ్దమునకు వాచ్యార్థమైన ప్రవాహము అవివక్షితముకాదు.గొల్లపల్లెకాశ్రయమైన తీరము పవిత్రమైనదని తెలియచేయుటకుగదా గంగాశబ్దము గ్రహింపఁబడినది గంగాశబ్దార్థము అవివక్షితమైనయెడల తీరమునకట్టి పవిత్రత్వము సిద్ధించదు. గనుక గంగాపదవాచ్యార్థము అవివక్షితముకాదు. ఇదిగాక గంగాశబ్దవాచ్యార్థము లక్ష్యార్థమునకు విరుద్ధమైనదియునుగాదు. ప్రవాహతీరములకవినాభావసంబంధముగదా కలిగియున్నది. అవినాభావసంబంధమనఁగా నొకదానినివదలి మఱియొకటి యుండుట తటస్థించదు. ప్రవాహమునువదలి తీరము, తీరమునువదలి ప్రవాహము ఉండదు గనుక వాచ్యార్థలక్ష్యార్థములకు విరోధములేదని యర్థము ఇదిగాక వాచ్యార్థలక్ష్యార్థములకువిరోధములేనందుననే లక్ష్యార్థమునందు దృష్టిని నిలపి వాచ్యార్థమును నిరసించుటయును లేదు. అనఁగా లక్ష్యార్థమైన తీరము నవలంబించి. వాచ్యార్థమైనప్రవాహమును పరిత్యజించుటయు లేదని యర్థము 'తత్త్వమసి' వాక్యములో లక్షణను అంగీకరించినయెడల 'త్వం' పదవాచ్యార్థమైన అహంకారము పురుషార్థము కానందున వివక్షితముకాదు. అనృతజడదుఃఖాత్మకమైనందున అవిరుద్ధముకాదు. లక్ష్యార్థజ్ఞానమువల్ల బాధింపఁబడుచున్నందున అపరిత్యాజ్యమున్ను కాదు. గనుక 'తత్త్వమసి' వాక్యమునందు లక్షణావృత్తి నంగీకరింపఁదగదు అనిపూర్వపక్షవాది యాక్షేపించుచున్నాఁడు.

వాక్య. కథం పునరవివక్షిత విరుద్ధ నిరస్యమానస్యలక్షణా
ర్థత్వమ్. ౭౬

దం-అ. అవివక్షితవిరుద్ధమై బాధ్యమైనదానికి లక్షణాశబ్దమునందు వాచ్యార్థత్వము యేలాగున సంభవించును?

తా. 'గంగాయాం ఘోషః' ఇత్యాదిలక్షణావాక్యములయందు లక్ష్యార్థమైనతీరమందు పవిత్రత్వము బోధించుచున్నందున వివక్షితమై తీరముతోటి అవినాభావసంబంధముఁ కలదైనందున అవిరుద్ధమై అవిరుద్ధమైనందువలననే లక్ష్యతీరజ్ఞానముచేత బాధింపఁబడనిదైయున్న జలప్రవాహము గంగాపదమునకు వాచ్యార్థమైయున్నది. 'తత్త్వమసి' వాక్యమునందు 'త్వం' పదవాచ్యార్థమైన అహంకార మిట్టిదికాదు. అహంకారము పురుషార్థముకానందున అవివక్షితమైయున్నది. అనృతజడదుఃఖాత్మకమైనందున లక్ష్యార్థంబైన సత్యజ్ఞానానందాత్మస్వరూపమునకు విరుద్ధమైయున్నది. విరుద్ధమైయున్నందుననే లక్ష్యార్థజ్ఞానముచేత బాధింపఁబడుచున్నది. ఇట్టి అహంకారము 'త్వం' పదమునకు వాచ్యార్థము కానేరదు. గనుక తత్త్వమసివాక్యమునందు లక్షణావృత్తి నంగీకరించఁదగదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

శ్లో. లక్షణం సర్పవత్ రజ్జ్వాః ప్రతీచః స్యాదహం తథా,
తద్బాధేనైవ వాక్యార్థం వేత్తిసోఽపి తదాశ్రయాత్. ౭౭

దం-అ. రజ్జువునకు సర్పమువలె ప్రత్యగాత్మకు అహంకారము లక్షణమైయున్నది. అటులే ఆసర్పముయొక్క ఆశ్రయమువల్లను, ఆసర్పముయొక్క బాధచేతనే వాక్యార్థము నెఱుంగును. ఆప్రత్యగాత్మయున్ను అహంకారము నాశ్రయించుటవల్ల ఆయహంకారముయొక్క బాధవల్లనే వాక్యార్థము నెఱుంగును.

తా. సర్పము రజ్జువునకు యేలాగున లక్షణమైయున్నదో ఆలాగుననే అహంకారము ('త్వం' పదార్థము) ప్రత్యగాత్మకు లక్షణమైయున్నది. సర్పద్వారా రజ్జుప్రతిపత్తి యేలాగున కలుగుచున్నదో, రజ్జుప్రతిపత్తిచేత సర్పము యేలాగున బాధింపఁబడుచున్నదో అటువలెనే అహంకారద్వారా ప్రత్యగాత్మ ప్రతిపత్తికలుగుచున్నది. ప్రత్యగాత్మజ్ఞానముచేత అహంకారము బాధింపఁబడుచున్నది గనుక అహంకారము 'త్వం' పదమునకు వాచ్యార్థముకావచ్చును. 'తత్త్వమసి' వాక్యమునందు లక్షణావృత్తి నంగీకరింపవచ్చునని భావము. అనఁగా 'యోఽయంసర్పః, సారజ్జుః (ఏయీసర్పముగలదో అది రజ్జువు) ఇత్యాదివాక్యమునందు సర్పము, జలప్రవాహము వివక్షితమైనట్లు వివక్షిత

మైనదికాదు. ప్రవాహము తీరముతో నవిభావసంబంధము కలదైయున్నట్లు రజ్జువుతో అవినాభావసంబంధమును కలిగియుండుకాదు. రజ్జుజ్ఞానముచేత బాధింపఁబడినదియును అయినప్పటికి, తనకధిష్ఠానమైన రజ్జువునకు లక్షణమైయున్నదికదా? ఏది సర్పముగా కనుపడుచున్నదో అది రజ్జువు అనే ఆప్తవాక్యముచేతగదా రజ్జుజ్ఞానము కలుగుచున్నది. ప్రకాశముగా కనుపడుచున్నసర్పము నుద్దేశించనియెడల ఆప్రకాశమానమైనరజ్జువు తెలియఁబడదు గనుక, సర్పము రజ్జువుకు లక్షణమైయున్నది. ఇటులే అహంకారము అవివక్షితమైనను, లక్ష్యార్థముతో సంబంధములేనిదైనను, లక్ష్యార్థజ్ఞానముచేత బాధింపఁబడునదైనను, తన కధిష్ఠానమైన ప్రత్యగాత్మకు లక్షణమైయున్నది. ఆరోపితమై ప్రకాశముగా కనుపడుచున్న అహంకారము ననువదించనియెడల, అప్రకాశమానమైన ప్రత్యగాత్మస్వరూపము వాక్యముచేత వాస్తవముగా తెలియఁబడదు. 'సర్పో రజ్జుః' (సర్పమే రజ్జువు) అనేవాక్యార్థము సర్పము ననువదించుటచేతను, సర్పమును బాధించుటచేతను, యేవిధముగఁ గలుగుచున్నదో, ఆవిధముగనే 'అహం బ్రహ్మ' (నేను బ్రహ్మను) అనేవాక్యార్థము అహంకారము ననువదించుటచేతను, అహంకారమును బాధించుటచేతను, కలుగుచున్నది గనుక, లక్షణావాక్యమునందు వాచ్యార్థము వివక్షితమై, అవిరుద్ధమై, అబాధ్యమై యుండవలయును అనే నియమములేదని తాత్పర్యము.

అవ. ఈప్రకారము వాక్యమువలన అఖండార్థజ్ఞానము కలుగునని చెప్పఁబడినది. అయితే కొందఱు వాక్యమువినియును అఖండార్థమును తెలియఁజాలరు. అది ఎందువల్లనో చెప్పుచున్నారు.—

వాక్య. ఇయంచా వాక్యార్థ ప్రతిపత్తి రన్వయ వ్యతిరేకాభిజ్ఞస్యైవ. ౭౭

దం-అ. ఈ అఖండార్థజ్ఞానము అన్వయవ్యతిరేకముల నెఱింగినవానికే కలుగును.

తా. ద్వితీయాధ్యాయములో చెప్పిన అన్వయవ్యతిరేకములను ఎవఁడు లెస్సగా తెలియునో, వానికే అఖండార్థజ్ఞానము కలుగునుగాని, అన్యులకు కలుగదు. గనుక వాక్యమును శ్రవణము చేసినను, అఖండార్థప్రతిపత్తి కలుగకపోవుటకు అన్వయవ్యతిరేకజ్ఞానము లేకపోవుటయే కారణము అని భావము.

వాక్య. యస్మాత్. ౭౮

దం-అ. ఎందువల్లనంటే.

తా. అన్వయవ్యతిరేకజ్ఞానము కలవానికే అఖండార్థప్రతిపత్తి కలుగుననుటకు కారణమును చెప్పెదమని భావము.

శ్లో. యావద్యావన్నిరస్యాయం దేహాదీన్ ప్రత్యగంచతి.
తావత్తావ త్తదర్థోఽపి త్వమర్థం ప్రవివక్షతి. ౨౮

దం-అ. ఈపురుషుఁడు శరీరము మొదలగువానిని యెంతయెంతగా నిరసించి ప్రత్యగాత్మను పొందునో 'తత్'పదార్థమున్ను అంతంతగా 'త్వం'పదార్థమునుగూర్చి ప్రవేశిం-(ఇచ్ఛయిం)చును.

తా. సాధనచతుష్టయసంపత్తి గలముముక్షువు భ్రాంతిచేత నాత్మగా గ్రహింపఁబడియున్న దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యహంకారములను అన్వయవ్యతిరేకములచేత విచారించి క్రమక్రమముగా నొక్కొక్కదానిని యనాత్మ కాదని నిశ్చయించుచు, ప్రత్యగాత్మను యెంతగా తెలియుచుండునో అంతగా 'త్వం'పదార్థమైన ప్రత్యగాత్మ 'తత్' పదార్థమైన పరమార్థయే నని నిశ్చయింపఁబడునని భావము. ప్రత్యగాత్మస్వరూప మెటువంటిదో యని విచారించగా విచారించగా ప్రత్యగాత్మయే పరమాత్మయని తెలియఁబడునని తాత్పర్యము.

అవ. పూర్వపక్షవాది యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య తస్మాత్ పునఃకారణాత్ దేహాద్యనాత్మత్వ ప్రతిప
త్త్యావేవాత్మా తదర్థమాత్మత్వే నాభిలింగతే నవిపర్యయ
ఇతి. ౨౯

దం-అ. దేహము మొదలగువాటియొక్క అనాత్మత్వము తెలియుటయందే ఆత్మ 'తత్'పదార్థమును స్వరూపముగా తెలియును. ప్రకారాంతరమందు తెలియనేరదని యేకారణమువల్ల చెప్పఁబడుచున్నది?

తా. దేహేంద్రియాదులు ఆత్మ కాదని చక్కఁగా విచారించి తెలిసికొనిన, ప్రత్యగాత్మ పరమాత్మయని తెలియఁబడును. మఱియొకవిధముగా తెలియఁబడదని నిశ్చయించుట కేమికారణము? అనఁగా లోకములో భ్రాంతిచేత నారోపింపఁబడిన సర్పాదులను విచారించి, ఇది సర్పముకాదని తెలిసినయెడల ఆసర్పమున కధిష్ఠానమైన రజ్జుస్వరూపము చక్కఁగా తెలియునేగాని, రజ్జువుకు మఱియొకపదార్థరూపత్వము తెలియఁబడుటలేదుగదా? కావున దేహేంద్రియాదులకు అధిష్ఠానమైన ప్రత్యగాత్మస్వరూపము విశదముగా తెలియునుగాని ఆప్రత్యగాత్మకు పరబ్రహ్మస్వరూప మేలాగున తెలియబడును. తెలియఁబడునెదరా! దేహేంద్రియాదిపదార్థములు బ్రహ్మకార్యములయినందున, బ్రహ్మాత్మకములే గనుక, దేహేంద్రియాదిస్వరూపము నెఱిఁగిన మాత్రాన ఆదేహేంద్రియాదులకే బ్రహ్మత్వము యేల తెలియఁబడకూడదు? దేహేంద్రియాదుల

వాక్య. తస్మా దుచ్యతే. ౭౮

దం అ. కావునచెప్పఁబడుచున్నది.

తా. ఆత్మత్వానాత్మత్వబుద్ధులు అజ్ఞానకల్పితములు గావున నీయర్థము ముందఱి శ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. దేహాదివ్యవధానత్వా త్తదర్థం స్వయమవ్యతః
పరోక్ష్యేణైవ జానాతి సాక్షా త్త్వం తదనాత్మనః. ౭౯

దం-అ. దేహముమొదలగుదానియొక్క వ్యవధానమువలన స్వాత్మస్వరూపమైన 'తత్' పదార్థమును పరోక్షముగానే తెలిసికొనుచున్నాఁడు. కావున వానియొక్క అనాత్మత్వబుద్ధిచేత అపరోక్షత్వము అగుచున్నది. (తెలియఁబడుచున్నది.)

తా. 'తత్' పదార్థమైన బ్రహ్మ ప్రత్యగాత్మస్వరూపమే అయినప్పటికి దేహేంద్రియమనోబుద్ధి అహంకారములచేత వ్యవధానమును పొందింపఁబడియున్నందున అప్రత్యక్షముగా గ్రహింపఁబడుచున్నది. అనఁగా నవ్యవహితమైనప్పటికి వ్యవహితమైనదానివలె, ఆత్మస్వరూపమైనప్పటికి ఆత్మస్వరూపము కానిదానివలె గ్రహింపఁబడుచున్నది కావున, ఆదేహేంద్రియాదులు నాత్మభూతములని అన్వయవ్యతిరేకములచే తెలిసినచో 'తత్' పదార్థమైన బ్రహ్మకు అపరోక్షము సిద్ధించునని భావము.

అవ. ఓయీ! స్వాత్మభూతుఁడైన బ్రహ్మ స్వాత్మస్వరూపము ప్రకాశించుచుండగా అపరోక్షముగా ప్రకాశించునేగాని పరోక్షముగా నెట్లు ప్రకాశించుననుటకు చెప్పుచున్నారు.

వాక్య. యథోక్తార్థ ప్రతిపత్తి సౌకర్యాయ దృష్టాంతోపాదానమ్. ౭౯

దం-అ. ఇదివరకుచెప్పినయర్థమును సుకరముగా తెలియఁజేయుటకొఱకు దృష్టాంతముగ్రహింపఁబడుచున్నది.

తా. స్వతః అపరోక్షమైన బ్రహ్మస్వరూపము పరోక్షముగా భాసించునని చెప్పిన యర్థమును విశదీకరించుటకై దృష్టాంతము చెప్పబడుచున్నదని భావము.

శ్లో. ప్రత్యగుద్భూతపిత్తస్య యథా బాహ్యార్థపీతతా
చైతన్యం ప్రత్యగాత్మీయం బహిర్వద్దృశ్యతే. తథా. ౩౦

దం-అ. అంతఃకరణమునందు బుట్టిన పిత్తరోగములుగలవారికి బాహ్యార్థముల యందు పీత్వము (పశిమి) యెట్లు కనుపసునో అటులే ప్రత్యగాత్మయందుండే చైతన్యము బాహ్యమందున్నదానివలె కనుపడుచున్నది.

తా. నేనని యభిమానింపబడినశరీరములో నేక దేశమందుండునది అంతఃకరణము. అట్టి అంతఃకరణమునందు పైత్యముబుట్టినచో నాపైత్యము తానాంతరము నందున్నప్పటికి ఆంతరమునందున్నట్లు ప్రకాశించక చక్షురింద్రియద్వారా బహిర్నిర్గతమై బాహ్యమందున్న ఘటాదులయందుచేరి తాను బాహ్యమందున్నదానివలె ప్రకాశించుచున్నది. కావుననే పైత్యముదోషముకలవాఁడు తెల్లనిశంఖమును, జూచి 'పీతశ్శంఖః' (శంఖము పచ్చగానున్నది) అని వ్యవహరించును. ఇటులే ప్రత్యగాత్మస్వరూపమగు 'తత్' పదార్థము (బ్రహ్మచైతన్యము)న్ను తాను స్వతః అపరోక్షమైనప్పటికి మాయాది అవ్యాకృతాదిసంబంధముచేత పరోక్షముగా భాసించుచున్నదని భావము.

అవ ఇంతవరకు చెప్పినయర్థము నుపసంహరించుచున్నారు —

వాక్య. యస్మా దేవమతో విశుద్ధ మవసీయతామ్. ౨౬

దం-అ. ఎందువలన నీతీరునసిద్ధించెనో అందువలన నిస్సంశయముగా నిశ్చయింపఁబడుగాక.

తా. ఇదివరకుచెప్పిన యుక్తులచేత, 'తత్త్వమస్యా'దివాక్యము అఖండార్థబోధకము అనుట విరుద్ధముకాదని సిద్ధించినది. కావున వాక్యమువలన అఖండైకరసార్థము సంభవించునని నిస్సంశయముగా నిశ్చయింపవలయునని భావము.

అవ. అఖండార్థజ్ఞానమును వాక్యమువలన సంపాదించేక్రమమును సంగ్రహముగ చెప్పుచున్నారు.

శ్లో. పదాన్యుద్ధృత్య వాక్యేభ్యో హ్యన్వయవ్యతిరేకతః,
పదార్థా న్లోకతో బుద్ధ్వా వేత్తివాక్యార్థమంజసా. ౩౧

దం-అ. వాక్యములవల్ల పదములను అన్వయవ్యతిరేకములచే లేవనెత్తి పదముల యర్థమును లోకమువల్ల తెలిసికొని పిదప వాక్యార్థమును ఋజువుగా (సులభముగా తెలియుచున్నాఁడు.

తా. వాక్యార్థము నేలాగున తెలియుననఁగా ముందుగా వాక్యములోనున్నపదములకు ప్రయోగభేదములయం దావాపోద్వాపములచేత నాయాఅర్థవిశేషములయందు శక్తిగలదని నిశ్చయించుకొనవలయును. (అనఁగా ప్రయోజ్య ప్రయోజకవృద్ధవ్యవహారములవలన శబ్దార్థజ్ఞానము కలుగుచున్నది). ఆజ్ఞాపింపబడి పనిచేయువాఁడు ప్రయోజ్యవృద్ధు ఆజ్ఞాపించి పనిచేయించువాఁడు ప్రయోజకవృద్ధు, వీరిలో ప్రయోజకవృద్ధు 'గామానయ' (గోవును తోలుకొనిరా)అనేవాక్యమును చెప్పును. ప్రయోజ్యవృద్ధు ఆవాక్యమునువిని లేచిపోయి గోవును తోలుకొనివచ్చును. ఈ ప్రయోజక ప్రయోజ్యులవ్యా

పారములనుచూచి ఆసమీపమునందుండు ఒకబాలుఁడు ప్రయోజకవృద్ధుచెప్పిన 'గామానయ' అనేవాక్యమునకు ప్రయోజ్యవృద్ధుచేసిన ఈగోవును తోలుకొనివచ్చుట అర్థము కాఁబోలు. కానిచో ప్రయోజకవృద్ధవాక్యమును వినగానే, లేచి ప్రయోజ్యవృద్ధుఁడీకార్యము నేలచేయునని యూహించి 'గామానయ' అనేవాక్యమునకు 'గవానయనము' (గోవును తోలుకొనివచ్చుట) అర్థమని తెలియునుగాని 'గామానయ' అనేవాక్యమునందు రెండుపదములుకలవని అందులో 'గాం' నేపదమునకు అర్థ మిదియని, 'ఆనయ' అనేపదమున కర్థ మిదియని తెలియఁజాలడు. పిదప క్రమక్రముగా ప్రయోజ్యప్రయోజకవృద్ధులయొక్కవ్యాపారములను చూచుచుండగా నొకప్పుడు 'గామానయ' అని ఒప్పుడు 'గాంబధాన' (గోవును కట్టివేయుము) అని మఱియొకప్పుడు 'గాంవిసృజ' (గోవును విడువుము)అని ఈలాగున ప్రయోజకవృద్ధువాక్యములను చెప్పుచుండగా, ప్రయోజ్యవృద్ధు ఆయావాక్య శ్రవణానంతరమందు తదనుకూలము వేర్వేఱుపనులను చేయుచుండగా చూచి బాలుఁడు 'గాం' అనేపదము గో (ఆవును) వ్యక్తిని చెప్పుటయందు శక్తి కలదని 'ఆనయేత్యాది' పదములు ఆనయనాది క్రియావిశేషములను చెప్పుటయందు శక్తికలవని, నిశ్చయించుకొనును. కావున వాక్యములోని పదములను ఆయావాక్యప్రయోగములయందుగల ఆవాపోద్వాపములచేత నిశ్చయించుకొనవలయునని యర్థము, వాక్యములయం దొకపదమునుంచుట ఆవాపమని, ఒకపదము నెత్తివేయుట ఉద్వాపమనఁబడును. 'గామానయ' అనువాక్యములోని రెండుపదములలో 'గాం' అనేపదము 'గాంబధాన' అనేవాక్యములో నుంచఁబడయున్నది. 'ఆనయ' అనేపదము ఎత్తివేయబడియున్నది. ఈలాగుననే అన్నివాక్యములలో తెలియవలయును. ఇచ్చటబహువిచారము చేయవలసియున్నది. అందుచే గ్రంథవిస్తారమగును. కాన నాభయముచే నుపరమించి. ప్రస్తుతార్థమును నిరూపించుచున్నారము. ఈప్రకారము పదములను తెలిసికొని అవి యేయే యర్థములు చెప్పగలిగియున్నవో దానిని లోకప్రయోగమువల్ల తెలిసికొని పిదప వాక్యముయొక్క తాత్పర్యమును అనుసరించి వాక్యార్థమును తెలియవలయునని భావము. ఈయర్థమును ఇచ్చట చేర్చి అనుసంధించవలయును. వాక్యము ఏఅర్థమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము కలిగియున్నదో దానిని తెలియుటకు కొన్నిగురుతులు కలవు. అవి తాత్పర్యలింగము లనంబడు. అవి ౧ ఉపక్రమోపసంహారములు, అభ్యాసము. 3 అపూర్వత్వము, ౪ ఫలము, ౫ అర్థవాదము, ౬ ఉపపత్తి యని ఆఱువిధములు వీటియొక్కలక్షణములను ప్రకృతమైన 'తత్త్వమసి' వాక్యమునే దృష్టాంతముగాఁ గైకొని చెప్పుచున్నాను. ఆరంభవాక్యము ఉపక్రమమని, సమాప్తి

ాక్యము ఉపసంహారమని చెప్పఁబడును. ఉపక్రమోపసంహారములు యేయర్థమును
్రతిపాదించునో ఆయర్థము వాక్యమునకు తాత్పర్యార్థమై యుండును. 'తత్త్వమసి'
ాక్యము ఏప్రకరణములో పఠింపఁబడుచున్నదో ఆప్రకరణముయొక్క ఉపక్రమోప
ంహారవాక్యములు అభేదమును బోధించుచున్నవి గనుక, 'తత్త్వమసి' వాక్యమునకు
ప్రత్యగ్బ్రహ్మైక్యము తాత్పర్యమైయున్నది. ఎటులనఁగా, 'సదేవ సోమ్యేదమగ్ర
సీత్ ఏకమేవాద్వితీయం' అనేవాక్యము ఉపక్రమవాక్యము. ఇది సజాతీయ విజా
య స్వగతభేదశూన్యమైన పరమాత్మను చెప్పుచున్నది గనుక, అద్వైతమును బోధిం
చున్నది. 'ఐతదాత్మ్యమిదం సర్వం' అనేవాక్యము ఉపసంహారవాక్యము. ఇదియును
ప్రపంచమంతయు బ్రహ్మాత్మకమని చెప్పుచున్నందున, అద్వితీయబ్రహ్మతత్త్వమును
ోధించుచున్నది. ఈ చెప్పఁబడిన ఉపక్రమోపసంహారవాక్యములు అద్వితీయబ్రహ్మ
రూపమును బోధించుచున్నందున, తన్మధ్యవర్తియగు 'తత్త్వమసి' వాక్యము ప్రత్య
బ్రహ్మైక్యపరమై యున్నదని నిశ్చయింపవలయును. మాటిమాటికి చెప్పుట అభ్యాస
నంబడు. దేనిని మాటిమాటికి చెప్పునో దానియందు తాత్పర్యము కలిగియుండున
ు సుప్రసిద్ధము. ఇచ్చట 'తత్త్వమసి' యని ప్రత్యగ్బ్రహ్మైక్యము తొమ్మిదిపర్యా
ములు చెప్పఁబడినది. గనుక 'తత్త్వమసి' వాక్యమునకు ప్రత్యగ్బ్రహ్మైక్యమునందు
త్పర్యము కలదని తెలియఁబడుచున్నది. 3 మఱియొక ప్రమాణముచేత ప్రతిపాదిం
ఁడనిదైయుండుట అపూర్వత్వమనంబడు. ప్రత్యగ్బ్రహ్మైక్యము ప్రత్యక్షాది
మాణములచేత ప్రతిపాదింపఁబడనిదై యున్నందున అపూర్వమై యున్నవి. ఇట్టి
పూర్వార్థమును ప్రతిపాదించుచున్నందున 'తత్త్వమసి' వాక్యమునకు ఐక్యమునందే
త్పర్యము కలదని నిశ్చయింపఁదగియున్నది. 4 ఫలమనఁగా ప్రయోజనము. ప్రతిపా
ఁబడుచున్న అర్థమునకు ఫలము చెప్పఁబడినయెడల ఆప్రతిపాదింపఁబడేయర్థము
ు వాక్యమునకు తాత్పర్యము కలిగియుండును. ఫలమును చెప్పినయెడల తాత్పర్యము
యుండును. ప్రస్తుతమందు 'తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్య
ని ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానము కలవానికి దేహపాతానంతరమందు విదేహకైవల్యము
నని ఫలము చెప్పఁబడియున్నది. కనుక 'తత్త్వమసి' వాక్యమునకు ప్రత్యగభిన్న
్మయందు తాత్పర్యము గలదు. 5. ప్రతిపాదింపఁబడే యర్థమును విశదముగా తెలి
జేయుటకుగాను చెప్పఁబడేకథ అర్థవాదమనంబడు. ప్రకృతమందు అద్వితీయబ్ర
్మరూపము అద్వితీయమని ఆరంభించి, ఆయర్థమును నిరూపించుటకుగాను 'సేయం
దైక్షత హంతాహ మిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే

వ్యాకరవాణి' అని యొకకథ చెప్పఁబడినది. ఈకథయందు పృథివ్యాదిభూతములసృష్టించిన పరమాత్మ తానే పృథివ్యాదిభూతములయందును, ఆభూతములచేత రచియింపఁబడిన సర్వదేహములయందును జీవరూపముగా ప్రవేశించి నామరూపములను ప్రకటించెనని చెప్పుచున్నందున జీవాత్మపరమాత్మలకు భేదమేలేదని తెలియఁబడుచున్నది కనుక ప్రత్యగ్బ్రహ్మైక్యము 'తత్త్వమసి'వాక్యమునకు తాత్పర్యమైయున్నది. ౬. ఉపపత్తియనఁగా యుక్తి. ఇది 'యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం' ఇత్యాది వాక్యములచేత చెప్పఁబడినది. ఈవాక్యములయందు చిదచిదాత్మకమైన ప్రపంచము భిన్నముగా కాన్పించుచుండ పరబ్రహ్మ అద్వితీయమని యెట్లు చెప్పనగుననుశిష్యుని యొక్క అభిప్రాయము నెఱింగి శ్రుతి ఈలాగున చెప్పుచున్నది. మృత్పిండమునందు కల్పింపఁబడిన ఘటశరావాదివస్తువులు మృత్పిండముకంటె భిన్నములు కావుగదా? అటులే పరమాత్మయందు కల్పింపఁబడిన చిదచిదాత్మకమైనప్రపంచము పరమాత్మకంటె భిన్నముకానేరదు గనుక, పరబ్రహ్మ అద్వితీయమనిచెప్పవచ్చునని ప్రతిపాదింపఁబడియున్నది. గనుక 'తత్త్వమసి' వాక్యమునకు అద్వితీయాఖండపరబ్రహ్మస్వరూపమునందు తాత్పర్యముకలదని నిశ్చయింపఁదగియున్నది. ఈతాత్పర్యలింగము లాఱింటిలో ఒకటి, రెండు, మూఁడులింగములు కలిగియున్నప్పటికి వాక్యతాత్పర్యమును వీటిననుసరించి నిశ్చయింపవలసియుండును ఇఁక ప్రకృతము ననుసరించెదము.

అవ. పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కుతః పునస్సామాన్యమాత్రవృత్తేః పదస్య వాక్యార్థప్రతిపత్తిహేతుత్వమితి. ౧౭

దం-అ. సామాన్యమైన అర్థమునందు మాత్రము ప్రవర్తించిన పదమునకు వాక్యార్థజ్ఞానకారణత్వము యెందువలన కలుగుచున్నది.

తా. పదములకు ఏయర్థమును బోధించుటయందు శక్తికలదో దానిని లోకమువల్ల (ప్రయోజ్యప్రయోజక వృద్ధవ్యవహారమువల్ల) తెలిసికొని పిదప వాక్యార్థమును తెలిసికొనవలయునని చెప్పినది విరుద్ధముగానున్నది. ఎందువల్లననఁగా పదార్థమే వాక్యార్థముగాదు. పదార్థసంసర్గమున్ను వాక్యార్థముగాదు. ఇఁక నేమనగా పదార్థ సంసర్గరహితమైన అఖండార్థము వాక్యార్థమని గదా మీరుచెప్పియున్నారు. ఇట్టి యలౌకికమైన వాక్యార్థమును లౌకికార్థబోధనమందు శక్తిగల పదములు ప్రతిపాదింపఁజాలవు కావున పదములు వాక్యార్థజ్ఞానమునకు హేతువులు కానేరవని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. బాధం. ౮౮

దం-అ. అవును.

తా. సామాన్యార్థమును (లౌకికార్థమును) బోధించుటయందు శక్తిగల పదములు వాక్యముచేత బోధింపఁబడే విశేషార్థమునకు (అలౌకికార్థమునకు) కారణములు కావచ్చునని భావము.

అవ. ఏలాగున కావచ్చునో వివరించి చెప్పుచున్నారు.—

శ్లో. సామాన్యం హి పదం బ్రూతే విశేషో వాక్యకర్తృకః,
శ్రుత్యాది ప్రతిబద్ధం స ద్విశేషార్థం భవేత్పదమ్. ౩౭

దం-అ. పదము సామాన్యార్థమును చెప్పును. విశేషార్థము వాక్యముచేఁ జేయఁబడును. పదము శ్రుతి మొదలగువానిచే ప్రతిబంధింపఁబడి విశేషార్థము కలదియగును.

తా. పదములు లోకసిద్ధమైన అర్థమునే చెప్పుచుండును. అయినప్పటికిని వాక్యము అలౌకికార్థమును బోధించుచుండును. అనఁగా అలౌకికార్థమునందు తాత్పర్యము కలిగియుండును. వాక్యమనఁగా పదసమూహాత్మకముగదా? పదములు సామాన్యార్థమును బోధించుచుండగా, పదసమూహాత్మకమైన వాక్యము విశేషార్థము నేలాగున బోధించునని శంకించవలదు. పదము సాధారణముగా సామాన్యార్థమును బోధించుచున్నప్పటికి శ్రుతిలింగాది ప్రమాణములచేత నియమింపఁబడి వాక్యరూపముగా నేర్పడినప్పుడు విశేషార్థమును తాత్పర్యముతో చెప్పుచుండును. అది యేలాగున ననఁగా "సర్వాన్ బ్రాహ్మణాన్ భోజయ" (బ్రాహ్మణుల నందఱను భోజనము చేయించుము) ఇత్యాదివాక్యము నందు సర్వశబ్దము సాధారణముగా భూమియందుగల బ్రాహ్మణులనందఱను చెప్ప సామర్థ్యము కలదై యున్నప్పటికి అది (సర్వబ్రాహ్మణ భోజనము) అశక్యమైనందునను, అప్రకృతమైనందునను, ప్రతిబంధింపఁబడి పిలువఁబడిన బ్రాహ్మణులను మాత్రము చెప్పుచున్నది. అటులే 'తత్' మొదలగు పదములు వ్యుత్పత్తిదశయందు సామాన్యార్థమును బోధించినప్పటికి, వాక్యార్థదశయందు తాత్పర్యలింగాను గుణముగా విశేషార్థమందు పర్యవసించును గనుక పదములు వాక్యార్థజ్ఞానమునకు కారణములు అగునని తెలియవలయును.

అవ. ఓయీ! ఇదివరకు చెప్పిన అన్వయవ్యతిరేకములచేత 'తత్, త్వం' పదార్థములను శోధించి తెలిసికొనినవానికి, అఖండార్థజ్ఞానము కలుగుచుండగా, వాక్యము నిరర్థకమే గదా యని శంకించగా, అలాగున చెప్పతగదు. ప్రమాణములేనియెడల కేవల

యుక్తిచేత, అజ్ఞానము నివర్తించదు. కావున అజ్ఞాన నివర్తక జ్ఞానోత్పత్తికొఱకు వాక్యము నాశ్రయించవలయునని ఇదివరకుచెప్పిన యర్థమును నిగమించుచున్నారు.—

వాక్య. అన్వయవ్యతిరేకపురస్సరం వాక్యమేవ సామానాధికరణ్యాదినా, అవిద్యాపటల ప్రధ్వంసద్వారేణ ముముక్షుం స్వారాజ్యే అభిషేచయతి నత్వన్వయవ్యతిరేకమాత్ర సాధ్యోఽయమర్థ ఇత్యాహ. ౮౯

దం-అ. అన్వయవ్యతిరేకములను పురస్కరించుకొని, వాక్యమే సామానాధికరణ్యము మొదలగువానిచేత అజ్ఞాన సముదాయమును నశింపఁజేయుచు ముముక్షువైన పురుషుని మోక్షమునందు అభిషేకించును. ఈయర్థము కేవలములైన అన్వయవ్యతిరేకములచేత సాధింపతగినది కాదని చెప్పుచున్నారు.

తా. 'తత్త్వమస్యా'ది అన్వయవ్యతిరేకములను సహాయముగానుంచుకొని, సామానాధికరణ్యము, విశేషణ విశేష్యభావము, లక్ష్యలక్షణభావము వీటిచేత అఖండరూపమైన 'అహంబ్రహ్మాస్మి'యనే జ్ఞానమునుపుట్టించి, అనాదిసిద్ధమై నిరూఢమైన, అజ్ఞానసమూహమును నిశ్శేషముగా నశింపఁజేసి మోక్షేచ్ఛగల పురుషుని కైవల్యమునందు పట్టాభిషేకమును చేయునుగాని, అన్వయవ్యతిరేకములు, వానిచేతనేర్పడు పదార్థజ్ఞానము ఇంతకార్యమును చేయజాలదు గనుక అజ్ఞాననివర్తకజ్ఞానోత్పత్తిద్వారా, స్వస్వరూపావస్థానమనే కైవల్యసామ్రాజ్యము ననుభవించుటకు వాక్యమునే శరణముగా నాశ్రయించవలయునని మందటిశ్లోకముతో చెప్పఁబడు నభిభావము.

శ్లో. బుద్ధ్యాదీనామనాత్మత్వం లింగాదపి చ సిధ్యతి,
నివృత్తి స్తావతా నేతీత్యతో వాక్యం సమాశ్రయేత్. ౩౩

దం-అ. బుద్ధిమొదలగువానియొక్క అనాత్మత్వము, యుక్తివల్లనున్ను సిద్ధించుచున్నది. అంతమాత్రముచేత వినాశము లేదు గనుక, వాక్యము నాశ్రయించవలయును.

తా. దేహేంద్రియ మనఃప్రాణబుద్ధులు ఆత్మ కాదనే యర్థము ఇదివరకు చెప్పిన యన్వయవ్యతిరేకమనే యుక్తిచేత నైతము సిద్ధించునుగాని, అంతమాత్రముచేత ఆదేహేంద్రియాదులు నివర్తించవు. వాటికి కారణమైన అజ్ఞానము నశించలేదుగదా? అజ్ఞానము నశించినగదా తత్కార్యములైన దేహేంద్రియాదులు నశించును. అజ్ఞానము ప్రత్యక్షమైయున్నందున ప్రత్యక్షముగానుండే జ్ఞానముచేత నశించునుగాని, అప్రత్యక్షమైన యౌక్తికజ్ఞానముచేత నశించదు. ప్రత్యక్షముగా కనుఁబడుచున్న అజ్ఞానకల్పితమైన రజ్జుసర్పము, ప్రత్యక్షరజ్జు జ్ఞానముచేత నశించునుగాని అప్రత్యక్షయౌక్తిజ్ఞానము

చేత నశించదుగదా? కావున ప్రత్యక్షముగా నాత్మ తత్త్వజ్ఞానమును పుట్టించే వాక్యమునే ఆశ్రయించవలయును. వాక్యముచేత గాని తత్త్వజ్ఞానము జనించదు. తత్త్వజ్ఞానము చేతగాని అజ్ఞానము నిశ్శేషముగ నశించదు. అజ్ఞానము నశించినగాని బుద్ధ్యాద్యనాత్మ వర్గము నివర్తించదు. బుద్ధ్యాద్యనాత్మవర్గము నివర్తించినగాని కైవల్యసామ్రాజ్యము లభించదని భావము.

అవ. మఱియొక హేతువువల్లను అజ్ఞాననివృత్తికొఱకు వాక్యమునే ఆశ్రయించ వలయునని చెప్పుచున్నారు.

వాక్య. నకేవల మనుమానైకశరణః అభిలషితమర్థం న ప్రా
ప్నోతీత్యనర్థంచ ప్రాప్నోతీత్యాహ. ౯౦

దం-అ. యుక్తినిమాత్రము ఆశ్రయించినవాఁడు ఇష్టార్థమును పొందఁడనుట మాత్రమేకాదు. అనర్థమునున్ను పొందుననుచున్నాఁడు.

తా. వాక్యమును ఆశ్రయించక కేవలయుక్తులనే ఆశ్రయించితే మోక్షముసిద్ధించకపోవుటమాత్రమే గాదు అనర్థమున్నైతము ప్రాప్తించును గావున అజ్ఞాననివర్తిపూర్వకకైవల్యప్రాప్తిని కోరువాఁడు వాక్యమునే యాశ్రయించునని ముందఱిశ్లోకములోఁ జెప్పఁబడునని భావము.

శ్లో. అనాదృత్య శ్రుతిం మోహా దతో బౌద్ధాస్తమస్వినః,
ఆపేదిరే నిరాత్మత్వ మనుమానైకచక్షుషః. ౩౮

దం-అ. తమోగుణభూయిష్ఠులైనబౌద్ధులు అజ్ఞానమువలన శ్రుతిని ఆచరించక యుక్తిమాత్రమే దృష్టిగాగలవారై ఆత్మాభావమును బొందిరి.

తా. బౌద్ధులు సత్కర్మానుష్ఠానములేనందున, తమోగుణముచేత నాక్రమింపఁబడిన చిత్తముకలవారై, అతీంద్రియార్థమునుఅత్యంతవిశదముగా ప్రతిపాదించునట్టిశ్రుతిని అజ్ఞానముచేత నాదరించక యుక్తినిమాత్రము నవలంబించి ఆయుక్తిచేతనే ఆత్మస్వరూపమును నిశ్చయించెదమని పూనుకొని, ఆత్మస్వరూపము స్థిరముగాలేదని సర్వము శూన్యమని నిశ్చయించి నాస్తికులై మహానరకగర్తములయందు ప్రవేశించిరి. గనుక శ్రుతివాక్యములకు అన్వయవ్యతిరేకములను సహాయముగా గ్రహించవలయునేగాని, స్వతంత్రముగా గ్రహించకూడదు. గ్రహించినచో బౌద్ధులవలె ఆత్మస్వరూపమును యథార్థముగా నెఱుంగక అనర్థములను జెందుదురని భావము.

అవ. లోకములో ప్రమాణభూతమైనవాక్యము ప్రమాణాంతరము నపేక్షించి యున్నట్లు కాన్పించుచున్నది. వేదము అపౌరుషేయమైనందున ప్రమాణాంతరము నపే

క్షించినదిగాదు గనుక వేదము చెప్పినఅర్థమునందు మాకు ఆదరణములేదు. అని బౌద్ధులు శంకించగా వేదము నాదరించకపోవుటకు హేతువులేనందున అలాగున చెప్పఁగూడదనుచున్నారు.—

వాక్య. న చానాదరే కారణ మస్తి. ౯౧

దం-అ. ఆదరించకపోవుటయందు కారణములేదు.

తా. స్పష్టము.

అవ. ఆదరించకపోవుటయందు కారణ మెందువలనలేదనఁగా చెప్పుచున్నారు.

వాక్య. యస్మా త్సర్వత్రైవా నాదరనిమిత్తం ప్రమాణస్య ప్రమాణాంతర ప్రతిపన్నప్రతిపాదనం వా విపరీత ప్రతిపాదనం వా సంశయితప్రతిపాదనం వా నవా ప్రతిపాదనమితి, న చైతేషా మన్యతమదపి కారణమస్తి. ౯౨

దం-అ. ఎందువల్లననఁగా మఱియొక ప్రమాణముచేత తెలియఁబడినయర్థమును ప్రతిపాదించుటకుగాని, విరుద్ధమైన అర్థమును ప్రతిపాదించుటకుగాని, సందిగ్ధార్థమును ప్రతిపాదించుటకుగాని, యేయర్థమును ప్రతిపాదించకనుండుటకుగాని, అన్నిప్రమాణములయందు ననాదరమునకు కారణమైయున్నది. ఈనాలుగింటిలో ఒకకారణమైనను లేదు.

**తా.** అన్నిప్రమాణములయందు విశ్వాసము (వాస్తవార్థమును జెప్పుచున్నవి యనేనమ్మిక) నుంచకపోవుటకు నాల్గుకారణములు గలవు. అందులో నొకటి మఱియొక ప్రమాణముచేత ప్రతిపాదింపఁబడినయర్థమును ప్రతిపాదించుట. ఇది 'నద్యాస్తీరేపంచఫలాని సంతి (నదీతీరమందైదుఫలములు కలవు) ఇత్యాదిలౌకికవాక్యములయందున్నను, 'వాయుర్వై క్షేపిష్ఠాదేవతా' (వాయువు వేగముగా నడచునట్టిదేవత) ఇత్యాదివేదవాక్యములయందును కాన్పించుచున్నది. నదీతీరమునందు ఫలములు కలిగియుండుటయును, వాయువుయొక్క శీఘ్రగమనమును ప్రత్యక్షసిద్ధమైనందున ఈవాక్యములు ప్రమాణాంతరసిద్ధార్థప్రతిపాదకములై యున్నవి. గనుక వీటియం దాదరములేకపోవచ్చును. రెండవది ప్రమాణాంతరములకు విరుద్ధమైనఅర్థమును ప్రతిపాదించుట ఇది "అంబుని మజ్జంత్యలాబూని గ్రావాణః ప్లవంతే" (సొరకాయబుఱ్ఱలు నీటిలో మునుఁగుచున్నవి. రాళ్లు తేలుచున్నవి) ఇత్యాదిలౌకికవాక్యములయందును. "ఆదిత్యోయూపః" (సూర్యుఁడే యూపస్తంభము)ఇత్యాది వేదవాక్యములయందును కనుపడుచున్నవి.సొరకాయబుఱ్ఱలు నీటిలో మునుఁగుటయును, పాషాణములు తేలుటయును ప్రత్యక్షమునకు విరుద్ధమైయుం

న్నది. యాగములయందు పశువులను కట్టునట్టి స్తంభము యూపమనఁబడు. ఇట్టియూపము దారునిర్మితమై యుండును. కావున సూర్యుఁడే యూపమని చెప్పుటయును ప్రత్యక్షవిరుద్ధమైయున్నది. ప్రత్యక్షవిరుద్ధార్థమును బోధించే యీవాక్యములయం దాదరములేకపోవచ్చును. మూఁడవది సందిగ్ధార్థమును ప్రతిపాదించుట. ఇది "స్థాణుర్వాపురుషోవా" (స్థాణువుగానుండునా? లేక పురుషుఁడుగనుండునా?)ఇత్యాదిలౌకికవాక్యములయందును"కోహితద్వేదయద్యముష్మిన్ లోకేఽస్తివా న వా"(పరలోకమునం దేదికలదో ఏదిలేదో దాని నెవఁ డెఱుంగును?)ఇత్యాదివేదవాక్యములయందును కాన్పించుచున్నది. ముందఱ కనుపడేవస్తువు స్థాణువా? లేకపురుషుఁడా? పరలోకమునం దేదికలదో? ఏదిలేదో? ఎవ్వరెఱుంగుదురు అనిచెప్పినయర్థము సంశయముగాఁగదా నున్నది. ఇట్టి సందిగ్ధార్థమును ప్రతిపాదించేవాక్యములందు ఆదరము లేకపోవచ్చును. నాల్గవది యేయర్థమును ప్రతిపాదించకపోవుట. అనఁగా అర్థశూన్యత్వము. ఇది లోకములో శంఖభేరీశబ్దములయందును, వేదములో'హుంఫట్,వౌషట్' ఇత్యాదిశబ్దములయందున్ను కనుపడుచున్నది. శంఖభేర్యాదివాద్యములవల్ల పుట్టేధ్వనులకున్ను, 'హుంఫట్' ఇత్యాదిశబ్దములకున్ను ఏయర్థమున్ను లేదు. కనుక, ఇవి యర్థశూన్యములు. వీటియందును ఆదరములేకపోవచ్చును. ఈయనాదరకారణములు నాల్గింటిలో నొకకారణమైనా ఆత్మస్వరూపనిర్ణాయికములైన వేదాంతవాక్యములయందు లేదు.గనుక వేదాంతములను బౌద్ధులు ఆదరించకపోవుటకు అజ్ఞానమే కారణము అని భావము.

అవ. అనాదరకారణములలో నొకటియైనను వేదాంతములయందు లేదని యేలాగున తెలిసినదనఁగా చెప్పుచున్నారు.

వాక్య. యత ఆహ. ౯౩

దం-అ. ఎందువల్లననఁగా చెప్పుచున్నారు.

తా. అనాదరకారణ మొకటియైనను లేదనుటకు హేతువు ముందఱిశ్లోకములో చెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. మానాంతరానవష్టబ్ధం నిర్దుఃఖం త్వాసమంజసా,
బోధయంతీశ్రుతిః కేన న ప్రమాణమితీర్యతే. ౩౫

దం-అ. ప్రమాణాంతరముచేత నాక్రమింపఁబడనిదై దుఃఖశూన్యమైన ఆత్మను అకుటిలముగా బోధించుచున్నశ్రుతి ప్రమాణము కాదని ఎవనిచేత చెప్పఁబడును?

తా. "అపహతపాప్మావిజరోవిమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః"ఇత్యాదిశ్రుతి ఆత్మస్వరూపము దుఃఖజరామరణాదిసర్వసంసారధర్మశూన్యమని పరమానందరూప

మని ప్రతిపాదించుచున్నది. ఇట్టి ఆత్మస్వరూపము ప్రత్యక్షముచేతగాని, అనుమా చేతగాని ప్రతిపాదింపఁబడియుండలేదు. గావున ఇట్టి ఆత్మస్వరూపము ప్రతిపాదక శ్రుతిప్రమాణము కాదని చెప్పఁదగదు. ఇదిగాక యథోక్తాత్మస్వరూపము కాన శ్రుతి తద్విరుద్ధార్థమును ప్రతిపాదించుటయును కాదు. అనఁగా "ఆదిత్యోయూ ఇత్యాదిస్థలములయందు ఆదిత్యుఁడు వేరుగా, యూపము వేరుగా ప్రత్యక్షమైయుం దున అందుకు విరుద్ధముగా యూపాదిత్యైక్యమును చెప్పుశ్రుతి అప్రమాణము చ్చును "అహం దుఃఖీ" త్యాది ప్రత్యక్షము దేహాదివిశిష్టమైన ఆత్మను ప్రతిపా చున్నది. కావున శ్రుతి ప్రత్యక్షములు రెండును భిన్నవిషయములైనందున ప్రత్యక్ష ద్ధమైన యర్థమును శ్రుతి చెప్పినది కాదు. గనుక ప్రమాణాంతరప్రతిపాదితాత్మస్వ మును గాని, ప్రమాణాంతరవిరుద్ధాత్మస్వరూపమును గాని, శ్రుతి ప్రతిపాదించనందున అప్రమాణమని చెప్పఁగూడదని భావము.

అవ. ఓయీ! ప్రమాణాంతరప్రతిపాదితప్రమాణాంతరవిరుద్ధార్థమును పాదించకపోయినచో పోనిమ్ము. సంశయార్థమును ప్రతిపాదించుచున్నందున అ ణమని చెప్పెదమని యనెదవా యీలాగున సైతము చెప్పకూడదు. అని చెప్పుచున్నా

వాక్య. న చ సంశయితవ్యమవగమయతి.

దం-అ. సంశయించఁదగినయర్థమునున్ను తెలియఁజేయదు.

తా. స్పష్టము.

వాక్య. యతః.

దం-అ. ఎందువల్లననఁగా.

తా. ఇందుకు కారణము చెప్పెదమని భావము.

శ్లో. సర్వసంశయహేతౌ హి నిరస్తే కథమాత్మని,
జాయతే సంశయో వాక్యాదనుమానేన యుష్మది.

దం-అ. సకలసంశయములకు కారణమైన యుష్మదర్థము (అహంకారము తైనది) యుక్తిచేత నిరసింపఁబడగా వాక్యమువల్ల ఆత్మయందు సంశయ మేలా కలుగును?

తా. అన్నిటియందు నానావిధసంశయములు పుట్టుటకు కారణము అహంకా మొదలగు ననాత్మసముదాయమేగదా? అట్టి యహంకారాదికము ద్వితీయాధ్యా క్తములైన అన్వయవ్యతిరేకములచేత నిరసింపఁబడిన పిదపగదా, వాక్యమువల్ల ఆ త్మస్వరూపము తెలియఁబడుచున్నది. ఇట్టి ఆత్మస్వరూపమునందు సంశయము ఏలా

కలుగును? గనుక శ్రుతివాక్యము నిస్సంశయముగా నాత్మస్వరూపమును ప్రతిపాదించు చున్నది గావున అప్రమాణమని చెప్పతగదని భావము.

వాక్య. అపిచ.　　౮౬

దం-అ. ఇదియునుంగాక.

తా. మఱియొక కారణముచేతనున్ను శ్రుతిసందిగ్ధార్థమును చెప్పదని ప్రతిపాదించెదమని భావము. అనఁగా ప్రమాణస్వభావము నాలోచించగా శ్రుతిసందిగ్ధార్థమును చెప్పదని నిశ్చయించినారము. ఇఁకను ప్రమేయస్వభావము నాలోచించి నాశ్రుతిసందిగ్ధార్థమును చెప్పునది కాదని నిరూపించెదమని భావము.

శ్లో. యత్ర స్యాత్సంశయో నాసౌ జ్ఞేయ ఆత్మేతి పండితైః,
న యతః సంశయప్రాప్తి రాత్మనోఽవగతిత్వతః.　　౩౭

దం-అ. ఎచ్చట సంశయము కలిగియుండునో అది ఆత్మ కాదని తెలియవలయునని పండితులచేత చెప్పఁబడినది. ఎందువలన ననఁగా ఆత్మజ్ఞానస్వరూపుఁడైన సంశయ సంబంధము లేదు.

తా. సర్వసంశయశూన్యమైనదియే ఆత్మ కాని, సంశయములుకలది ఆత్మ కాదని తెలియవలయునని పండితులు చెప్పుచున్నారు. ఇది యుక్తముగానే యున్నది. ఎందువల్లననగా ఆత్మ యనఁగా కేవలజ్ఞానస్వరూపుఁడును, స్వయంప్రకాశుఁడును, నిత్యము అపరోక్షముగా నుండువాఁడును; ఇట్టి యాత్మ సంశయింపఁదగినవాఁడు కాఁడు. దృశ్యమైన దేహఘటాదిప్రపంచము ఆరోపితమైనందున సంశయించఁదగియున్నప్పటికి, సర్వసంశయనిరాసకమైన ఆత్మస్వరూపమునందు సంశయము కలుగనేరదు. తాదృశాత్మస్వరూపప్రతిపాదకమైన శ్రుతి సందిగ్ధార్థము కానేరదు. కావున శ్రుతియం దప్రామాణ్యము నాలోచించి అనాదరణమును చేయఁదగదని భావము.

అవ. ఓయీ! సంశయార్థమును ప్రతిపాదించనిదైనప్పటికి శ్రుతి యేయర్థమునున్ను బోధించనిదై యున్నది. కనుక నిరర్థకమని (అర్థశూన్యమని) చెప్పవచ్చును. అందువలన అప్రమాణమని తలచెదమంటిరా అట్లు చెప్పఁగూడదని ప్రతిపాదించుచున్నారు.—

వాక్య. అనవబోధకత్వం తు దూరోత్సారిత మేవ.　　౮౭

దం-అ. అర్థమును బోధించలేకపోవుట దూరముగా నిరసింపఁబడినదేను.

తా. శ్రుతి యేయర్థమును బోధించనేరదు. భేరీశబ్దాదులవలె అర్థశూన్యమై యున్నది. అనిచెప్పుటకు ఎంతమాత్ర మవకాశములేదని భావము.

అవ. ఓయీ! శ్రుతివాక్యములను వినినప్పటికి అనేకపురుషులకు జ్ఞానము పుట్టినట్లు కానము. కనుక శ్రుతి అర్థబోధకముగాదని చెప్పుటకు శక్యముగాదనుట కేమి కారణమని శంకించగా సమాధానమును చెప్పుచున్నారు.—

వాక్య. అత ఆహ. ౭౮

దం-అ ఎందువల్లననఁగా చెప్పుచున్నారు.

తా. శ్రుతి అర్థబోధకముకాదని చెప్పుటకు ఎందువల్ల శక్యముకాదంటే ఉత్తర శ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. బోధ్యేఽప్యనుభవో యస్య న కథంచన జాయతే,
తం కథం బోధయే చ్ఛాస్త్రం లోష్టం నరసమాకృతిమ్. ౭౮

దం-అ. సులభముగా తెలియఁదగినదానియందున్న జ్ఞానము ఎవనికి ఏవిధముగాకూడా కలుగదో మనుష్యునితో సమానముగాగల ఆమట్టిగడ్డను శాస్త్రము ఏలాగున బోధించగలదు?

తా. సులభముగా తెలియుటకు యోగ్యమైనవిషయముగూడా యెవనికి తెలియదో అట్టిమనుష్యుఁడు అత్యంతమూర్ఖుఁడైనందున మట్టిగడ్డవంటివాఁడు. అట్టివానికి శాస్త్రము అర్థజ్ఞానమును కలుగఁజేయదు. కాని కొంతబుద్ధిమంతులకందఱకును అర్థజ్ఞానమును కలుగఁజేయఁగలదని భావము. అనఁగా నత్యంతమూఢుఁడగు పురుషుఁడు తెలిసికొనదగినవిషయమునుకూడా తెలియఁజాలఁడు గావున, వాఁడు ఆత్మతత్త్వమును తెలియుటకు అధికారియే కాఁడు. అట్టి అనధికారివాక్యము ఎన్నిమార్లు వినినను అర్థజ్ఞానముగలవాఁడు కానేరఁడు. అధికారికి వాక్యము అర్థజ్ఞానమును కలుగఁజేయునుగాని అనధికారికిఁ గలుగఁజేయదు. అంతమాత్రముచేత శ్రుతివాక్యము అర్థబోధకము కాకపోదు. వేణువీణాదిధ్వని ఆహ్లాదకరమైనప్పటికి చెవిటివానికి వినే యోగ్యత లేనందున, ఆహ్లాదకరము గాకయున్నది. వినే యోగ్యతకలవానికి ఆహ్లాదకరమై యున్నది. అటువలెనే శ్రుతివాక్యమున్ను తన అర్థమును తెలిసికొనే యోగ్యతకలవానికి అర్థబోధకమై యున్నది. యోగ్యతలేనివానికి అర్థబోధకము కాకయుండును. ఇంతమాత్రముచేత శ్రుతి అబోధకము అని చెప్పఁదగదని భావము.

అవ. ఓయీ! అన్వయవ్యతిరేకములనే తర్కము(యుక్తి) పదార్థములను శోధించి తద్వారా వాక్యార్థజ్ఞానమునకు కారణమై యుండునని గదా చెప్పితిరి. తర్కమనగా పురుషులయొక్క ఊహాయేగదా? పురుషులు వెవ్వేఱుస్వభావములు కలవారై యున్నందున వారలయొక్క తర్కము (ఊహయున్ను) వెవ్వేఱుగా నుండును గాని

ఏకవిధముగా నుండదు. ఇట్టి వెవ్వేఱురూపమైన తర్కముచేత పదార్థము వెవ్వేఱుగా నిశ్చయింపఁబడును. వాక్యార్థజ్ఞానమున్ను వేఱువేఱుగా కలుగునుగాని ఏకవిధముగా కలుగదు. అని శంకించగా కేవల పురుషబుద్ధిమూలమైన తర్కమును మేము పదార్థ విచారసాధనముగా నంగీకరించలేదు. ఆయా వేదాంతములయందు సృష్టిప్రళయాదిప్రతిపాదకవాక్యములయందు సూచింపఁబడియున్న తర్కములే పదార్థవిచారమునకు సాధనము లని యంగీకరించితిమి. పదార్థనిశ్చయము ఏకవిధముగానే కలుగును. వాక్యార్థజ్ఞానమున్ను ఏకరూపముగా పుట్టుననే అభిప్రాయముతోటి సిద్ధాంతవాది ఉత్తరమును చెప్పచున్నారు....

వాక్య. అన్వయవ్యతిరేకపురస్సరం వాక్యమేవా వాక్యార్థ రూపమాత్మానం ప్రతిపాదయతీత్యస్య పక్షస్య ద్రఢిమ్నే శ్రుత్యుదాహరణ ముపన్యస్యతి. ౯౯

దం-అ. అన్వయవ్యతిరేకములను పురస్కరించుకొని వాక్యమే అఖండార్థరూపమైన ఆత్మస్వరూపమును ప్రతిపాదించునని చెప్పిన ఈపక్షమునకు దార్ఢ్యము కలిగేకొఱకు శ్రుతిప్రమాణము నుపన్యసించు చున్నాఁడు.

తా. స్పష్టము.

అవ. అందులో ముందుగా ఛాందోగ్యమునందు వినఁబడుచున్న మహావాక్యమును దానికి శేషమైయున్న అవాంతరవాక్యమున్ను ఉదహరించుచున్నాఁడు—.

శ్లో. జిఘ్రామీద మహం గంధమితి యో వేత్త్యవిక్రియః,
స ఆత్మా తత్పరంజ్యోతిః శిరసీదం వచః శ్రుతేః. ౩౯

దం-అ. "నేను ఈగంధమును ఆఘ్రాణించుచున్నానని వ్యవహరించువానికి యెప్పుడు నిర్వికారుఁడైయుండి తెలియుచున్నాఁడో అతను ఆత్మ; అతఁడే పరబ్రహ్మ;" అని శ్రుతియొక్కశిరస్సునందు ఈవచనము వినఁబడుచున్నది.

తా. ఛాందోగ్యోపనిషత్తుయొక్క అష్టమప్రపాఠకములోని ప్రజాపతివిద్యలో "అథయోవేదేదం జిఘ్రాణీతి సాత్మా", ఇత్యాద్యవాంతరవాక్యము గంధమును ఆఘ్రాణించుచున్నాను, శబ్దమును వినుచున్నాను, రూపమును చూచుచున్నానని వ్యవహరించునట్టిప్రమాతను (అంతఃకరణావచ్ఛిన్నచైతన్యమును) అతనిచేత గ్రహింపబడుచున్నగంధాదివృత్తులను ఎవ్వఁడు సాక్షిగానుండి ప్రకాశింపజేయునో అతఁడే ఆత్మ అని 'త్వం' పదార్థమును అన్వయవ్యతిరేకములచేత నిశ్చయించినపిదప "పరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః," అనే మహావాక్యము 'త్వం' పదార్థమైన

ప్రత్యగాత్మకు "తత్"పదార్థమైన పరబ్రహ్మతోఁటి అభేదమును చెప్పుచున్నది. గనుక అన్వయవ్యతిరేకములను సహాయముగా చేసికొని మహావాక్యము అఖండార్థమును బోధించునని మేము చెప్పినందుకు యీ శ్రుతి సాక్షిగా నున్నదని భావము.—కేవల 'త్వం' పదార్థస్వరూపమును ప్రతిపాదించువాక్యము అవాంతరవాక్యమని 'త్వం' పదార్థమునకు 'తత్' పదార్థమునకు ఐక్యమును ప్రతిపాదించేవాక్యము మహావాక్యమని తెలియవలయును. పైన ఉదహరించిన మొదటిశ్రుత్యర్థము దీనిని ఆఘ్రాణించుచున్నానని వ్యవహరించువానిని ఎవ్వఁడెఱుంగునో వాఁడే ఆత్మ. రెండవశ్రుత్యర్థము పరబ్రహ్మను పొంది స్వస్వరూపముతోఁటి ఆవిర్భవించును. ఆస్వరూపావిర్భావమును పొందినప్రత్యగాత్మయే పరబ్రహ్మ.

అవ. ఛాందోగ్యోపనిషత్తులోని "తత్త్వమసి" అనేమహావాక్యమునకు శేషముగా అవస్థాత్రయసాక్షియగు ప్రత్యగాత్మను ('త్వం' పదార్థమును) అన్వయవ్యతిరేకములచేత శోధించి నిరూపించుచున్నవాక్యము ఏలాగున వినఁబడినదో ఆలాగుననే బృహదారణ్యములోని 'అహం బ్రహ్మాస్మి' అనేవాక్యమునకు శేషముగా "యో యం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః"ఇత్యాదివాక్యము వినఁబడుచున్నది. ఈప్రకారమే ప్రతిఉపనిషత్తులోను అన్వయవ్యతిరేకములచేత ప్రత్యగాత్మను నిరూపించేవాక్యములను చూడనగును. అనే అభిప్రాయముతోఁటి చెప్పుచున్నాఁడు. ఈఅవతారికలో ఉదహరింపఁబడిన శ్రుత్యర్థము ఉత్తరశ్లోకములో విశదముకాఁగలదు.

> వాక్య. యథా "తత్సత్యం స ఆత్మా తత్త్వమసీ" త్యస్య శేషత్వేన అన్వయవ్యతిరేక శ్రుతిర్యథా "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత" ఇత్యాద్యా "అథ యో వేదేదం జిఘ్రాణీ" త్యంతా తథా "హం బ్రహ్మాస్మీ" త్యస్య శేషః. ౧౦౦

దం-అ. "తత్సత్యం," "సఆత్మా", "తత్త్వమసి," అనే మహావాక్యమునకు శేషముగా "యఏషోఽక్షిణి పురుషోదృశ్యతే, ఏష ఆత్మేతి హోవాచ," అని మొదలుకొని "అథయో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా" అనేవఱకు అన్వయవ్యతిరేకములను ప్రతిపాదించునట్టి శ్రుతి ఎట్లు వినఁబడుచున్నదో అట్లే "అహం బ్రహ్మాస్మి" అనేవాక్యమునకు "యోయమి"త్యాది శ్రుతి అని ముందరిశ్లోకములో చేర్చవలయును.

తా. "తత్సత్యం" "స ఆత్మా," "తత్త్వమసి," అనే మహావాక్యము ఛాందోగ్యషష్ఠపాఠకములో నున్నది ఇది ప్రత్యగాత్మపరమాత్మలయొక్క అభేదమును చెప్పుచు

న్నందున మహావాక్యమని చెప్పఁబడినది. ఈమహావాక్యములోని "త్వం" పదార్థమును విచారించి నిశ్చయించుటకుగాను ఆఛాందోగ్యముయొక్క అష్టమప్రపాఠకములోని ప్రజాపతివిద్యలో పఠింపబడుచున్న "అథయ ఏషోఽక్షిణి పురుషోదృశ్యతే" అనే వాక్యము మొదలుకొని "అథయోవేదం జఘ్రాణీతి స ఆత్మా" అనేవాక్యమువఱకు గల శ్రుతి ప్రవర్తించినది. ఇదికేవలప్రత్యగాత్మస్వరూపమును నిష్కర్షించినందున అవాంతర వాక్యమని చెప్పఁబడినది. మహావాక్యార్థముయొక్క నిశ్చయమునకు అవాంతరవాక్యార్థము అపేక్షితమై యున్నందున శేషమని చెప్పఁబడినది. ఈప్రకారము బృహదారణ్యములో "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యముగలదు. దానికి శేషమైన అవాంతర వాక్యము బృహదారణ్యములోనే చెప్పఁబడియున్నది. అని భావము.

శ్లో. అహమః ప్రత్యగాత్మార్థో నిరస్తాశేష యుష్మదః,
బంభణీతి శ్రుతిర్వ్యాఖ్యా యోఽయ మిత్యాదినాఽసకృత్.

దం-అ. నిరాకరింపఁబడిన సకలమైన అనాత్మవర్గముగల అహం ప్రత్యయమునకు ప్రత్యగాత్మ (సాక్షిచైతన్యము) అర్థమని యుక్తితోకూడియున్న 'యోఽయం' ఇత్యాదిశబ్దములచేత చేరియున్నశ్రుతి అనేకపర్యాయములు చెప్పుచున్నవి.

తా. 'యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతః జ్యోతిః పురుషః' (ప్రాణములయందును, హృదయమునందును,లోపలను, యేబుద్ధిప్రధానుఁడైన జీవాత్మకలఁడో వాఁడు స్వయంప్రకాశుఁడైన సాక్షియే; అనఁగాప్రాణాద్యుపాధికుఁడైన చిదాత్మ ప్రాణాదిసంబంధశూన్యమై ప్రాణాది ప్రకాశకమైన సాక్షిచైతన్యమే నని అహ మర్థమును నిష్కర్షించుచున్నది) ఇత్యాదివాక్యము అన్వయవ్యతిరేకమును కనుపరచి "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యములో 'అహం'శబ్దమునకు అనాత్మసంబంధములేని కేవలమైన సాక్షిచైతన్యము అర్థము అని అనేకపర్యాయములు బోధించుచున్నది. గనుక ఈ 'యోఽయం' ఇత్యాదివాక్యము 'అహం బ్రహ్మాస్మి' అనేమహావాక్యమునకు శేషమైయున్నదని భావము.

అవ. పూర్వపక్షవాది ప్రశ్నఁజేయుచున్నాఁడు.

వాక్య. కథం పునరయమర్థోఽవసీయతే అహం వ్యాజే నా
త్రాత్మార్థో బుబోధ ఇషిత ఇతి. ౧౦౧

దం-అ. ఈవాక్యమునందు అహం శబ్దవ్యాజముచేత ఆత్మయనే యర్థము బోధింప నిచ్ఛయింపఁబడినదని ఈయర్థము ఏప్రకారము నిశ్చయింపఁబడినది.

తా. "అహం బ్రహ్మాస్మి" అనేవాక్యమునందుగల 'అహం'శబ్దము వాచ్యార్థమైన అహంకారమును పరిత్యజించి లక్షణావృత్తిచే నిత్యనిర్వికారమైన సాక్షిచైతన్యమును బోధించుచున్నదని ఏలాగున తెలియఁబడినదని భావము.

అవ. వాక్యశేషమునుబట్టి తెలియఁబడినదని సిద్ధాంతవాది ప్రతివచనమును చెప్పుచున్నాఁడు.

వాక్య. యతః. ౧౦౨

దం-అ. ఎందువల్ల దీనిని ఉత్తరశ్లోకముతో నేకముగా నన్వయించవలయు.

శ్లో. ఏష ఆత్మా స్వయంజ్యోతీ రవిసోమాగ్ని వాక్షు సః,
ఇతేష్వస్తం దృగేవాస్తే భాసయన్ చిత్తచేష్టితమ్. ౪౧

దం-అ. సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, వాక్కు ఇవి యస్తమించియుండఁగా, స్వయంప్రకాశమై దృగ్రూపమైన ఈయాత్మ, యేచిత్తముయొక్క వ్యాపారములను ప్రకాశింపఁజేయుచుండునో (అందువల్ల నని శేషము).

తా. 'అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య,చంద్రమస్యస్తమితే,శాంతే అగ్నౌ,శాంతాయాం వాచి కింజ్యోతిః' (ఓ యాజ్ఞవల్క్యమహాముని! లోకములోని పదార్థములను ప్రకాశింపఁజేయునవి సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, శబ్దము ఇవియేగదా? ఇవి లయమును బొందినకాలమునందు అనఁగా సుషుప్తికాలమునందే ఏది ప్రకాశకమై యుండును). అని యారంభించి 'ఆత్మైవాస్యజ్యోతిర్భవతి, ఆత్మనైవా యం జ్యోతిషాస్తే' (ఈసుషుప్తి పురుషునకు ప్రకాశకము ఆత్మగానే యుండును. ఇతఁడు ప్రకాశకమైన స్వస్వరూపముతో నుండును.) అని ఇట్టివాక్యములచేత బుద్ధ్యాది సర్వపదార్థములకు ప్రకాశకమై నిత్యనిర్వికారమైన సాక్షిచైతన్యమును ప్రతిపాదించుచున్నది. ఈకారణముచేతనే 'అహం'శబ్దము వాచ్యార్థమును పరిత్యజించి లక్షణావృత్తిచేత కూటస్థాత్మనే బోధించుచున్నదని తెలియఁబడినదని భావము.

అవ. ఇదిగాక బృహదారణ్యషష్ఠాధ్యాయములోని జనకయాజ్ఞవల్క్యసంవాదము యొక్క స్వభావము నాలోచించినను 'అహం' శబ్దము కూటస్థాత్మనే చెప్పుచున్నదని ప్రతిపాదించుచున్నారు.

వాక్య. నిర్ణేనేక్తి చ పృష్టోమునిః. ౧౦౩

దం-అ. యాజ్ఞవల్క్యమహాముని అడుగఁబడినవాఁడై విశేషముగ నిర్ణయించుచున్నాఁడు.

తా. యాజ్ఞవల్క్యముని జనకరాజుచేత ప్రశ్నఁజేయఁబడి ఆత్మస్వరూపమును నిస్సంశయముగా నిర్ణయించిరి. దానిని బట్టిచూడఁగా కూటస్థాత్మస్వరూపమే అహంశబ్దమునకు వివక్షితమై యున్నదని భావము.

అవ. జనకరాజు ఏమని ప్రశ్నఁజేసిరి. యాజ్ఞవల్క్యముని యేమని ఆత్మస్వరూపమును నిర్ణయించిరి యనఁగా చెప్పుచున్నారు.

శ్లో. ఆత్మనైవేత్యుపక్రిత్య కోఽయమాత్మేత్యుదీరితే,
బుద్ధేః పరం స్వతో ముక్తమాత్మానం మునిరభ్యధాత్. ౪౨

దం-అ. ఆత్మచేతనే నని విని ఈయాత్మ ఎవఁడని యడుగగా బుద్ధికంటె విలక్షణమై స్వయముగానే ముక్తమైన ఆత్మను యాజ్ఞవల్క్యముని చెప్పిరి.

తా. యాజ్ఞవల్క్యముని జనకమహారాజునకు ఆత్మతత్త్వము నుపదేశించునప్పుడు 'ఆత్మనైవాయం జ్యోతిషాస్తే' (ఈపురుషుఁడు ప్రకాశస్వరూపమైన ఆత్మతోనే యుండెను). అని విషయకప్రకాశములైన అగ్ని చంద్రాదులు అస్తమించిన కాలమందు ఆత్మయే ప్రకాశకమై యుండునని, యాజ్ఞవల్క్యముని యుపదేశించగా, జనకమహారాజు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములయందును, ఆత్మశబ్దము ప్రయోగింపఁబడుచున్నది. గనుక మీరుచెప్పిన ఈయాత్మ, పంచకోశములలో నొకటైయుండునా? అనే యభిప్రాయముతోటి 'కతమ ఆత్మ' (ఆత్మయనగా నెవఁడు) అని ప్రశ్నచేయఁగా యాజ్ఞవల్క్యముని ఆత్మస్వరూపమును 'యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః' అనేవాక్యముచేత నిస్సంశయముగా నిశ్చయించిరి. అందులో 'యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు' (నాచేత చెప్పఁబడిన యేయాత్మ కలఁడో అతఁడు విజ్ఞానమయుఁడు,ఇంద్రియములయందు ప్రాణములయందు నున్నవాఁడు) అని చెప్పినందున, దేహము ఇంద్రియములు ఆత్మకాదని నిశ్చయించిరి. హృది (హృదయమందున్నవాఁడు) అనిచెప్పినందున, ఇంద్రియాధిష్ఠానదేవత లాత్మకాదని, నిశ్చయించిరి ఇంద్రియాధిష్ఠానదేవత లింద్రియములయందుందురుగాని హృదయమునం దుండరుగదా? అంతః (లోపలనుండువాఁడు) అని చెప్పినందున, విజ్ఞానమయశబ్దముచేత చెప్పఁబడినబుద్ధి, ఆత్మకాదని నిశ్చయించిరి. బుద్ధిహృదయమందుండునుగాని హృదయమునకు లోపల నుండునదికాదుగదా? జ్యోతిః (ప్రకాశరూపముగా నుండువాఁడు). అనిచెప్పినందున దేహేంద్రియాదిజడపదార్థములకన్నింటికి నుపాదానకారణమైన అవ్యాకృతము ఆత్మకాదని నిశ్చయించిరి. అవ్యాకృతము సర్వకారణమైనందున, సర్వాంతరమైనప్పటికి జడమైనందున ప్రకాశరూపముకాదు.

పురుషః (సర్వశరీరములయందు వ్యాపించియున్నందున పరిపూర్ణుఁడు) అని చెప్పినందున, అంతఃకరణప్రతిబింబితమైన చైతన్యము అనఁగా చిదాభాసుఁడు ఆత్మకాదని నిశ్చయించిరి. చిదాభాసుఁడు అంతఃకరణములో ప్రతిబింబించియున్నందున పరిచ్ఛిన్నుఁడు గాని పరిపూర్ణుఁడుగాఁడు. ఈప్రకారము దేహేంద్రియాదులకంటె, ఇంద్రియాధిష్ఠాన దేవతలకంటె, బుద్ధికంటె, అవ్యాకృతముకంటె, చిదాభాసునికంటె, విలక్షణమై, సర్వపరిపూర్ణమై, సర్వప్రకాశకమై, స్వభావముగా అవిద్యాకామకర్మవాసనాది సర్వబంధశూన్యమైన చిద్ధాతువు ఆత్మ యని నిశ్చయించి ప్రతిపాదించిరి గనుక, 'అహం బ్రహ్మాస్మి' యనేవాక్యమందుగల 'అహం' శబ్దము వాచ్యార్థమును పరిత్యజించి లక్షణచేత కూటస్థ చైతన్యమునే చెప్పుచున్నదని నిశ్చయించితిమని భావము.

అవ. ఉత్తరశ్లోకమునకు తాత్పర్యమును చెప్పుచున్నారు.

వాక్య. యస్మాచ్చాత్మాత్రాహం వ్యాజేన ప్రత్యక్ మా
త్రో జిగ్రాహయిషత స్తస్మా దహంవృత్తిః స్వరూప
స్య విలయేనైవ వాక్యార్థావగమాయ కారణత్వం ప్రతి
పద్యత ఇతీ మమర్థమాహ. ౧౦౪

దం-వి. ఏహేతువువలన ఇచ్చట 'అహం' అనేవ్యాజముచేత ప్రత్యక్ (సాక్షి చైతన్యము) మాత్రమే ఆత్మయని గ్రహింపచేయ నిశ్చయింపఁబడినదో, ఆహేతువువలన 'అహం' శబ్దము స్వరూపముయొక్క వినాశముచేతనే వాక్యార్థము తెలియుటకు కారణమైయుండునని యీయర్థమును చెప్పుచున్నారు.

తా. అహంకారము లక్షణమైయున్నందున స్వరూపసత్తకలదై యుండును. అందువలన లక్ష్యమైన కూటస్థాత్మస్వరూపము అద్వితీయము గాఁజేరదు. స్వరూపసత్త లేనిదైయుండునని నచో లక్షణమే లేనందున లక్ష్యస్వరూపము సిద్ధించకపోవును; అని కొందఱాక్షేపించెదరుగాని, ఆయాక్షేపము యుక్తముగాదు. ఎందువల్లనంటె లక్షణమనునది (౧) విశేషణమని (౨) ఉపలక్షణమని రెండువిధములు. అందులో విశేషణము లక్ష్యస్వరూపమును తెలియచేసి, లక్ష్యస్వరూపముతో సంబంధించి నియతముగా నుండునది. ఇచ్చట నహంకారముకూటస్థాత్మ స్వరూపమునకు ఉపలక్షణముగాని విశేషణము కాదు. గనుక అహంకారము లక్ష్యస్వరూపము ననుసంధించియుండి, లక్ష్యస్వరూపజ్ఞానమును కలుగఁజేసి తాను కూటస్థాత్మయందు కల్పింపఁబడినదైనందున, కూటస్థాత్మజ్ఞానము కలిగిన సమకాలమందే నశించిపోవును. గనుక కూటస్థాత్మకు అద్వితీయము భంగము నొందదు. అని ఉత్తరశ్లోకమునకు తాత్పర్యము. అని భావము. అనఁగా ముముక్షువు

'అహం బ్రహ్మాస్మి' అని అఖండరసమైన పరబ్రహ్మను అహంకారము నవలంబించియే తెలిసికొనుచున్నాఁడు కావున, అహంకారము తాను బాధింపఁబడియే, బ్రహ్మస్వరూపప్రతిపత్తికి కారణమై యుండును. రజ్జువునందు కల్పింపఁబడిన సర్పము తాను బాధింపఁబడియే రజ్జుస్వరూపజ్ఞానమునకు కారణమై యుండునటుల నని ముందటిశ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. అహం వృత్త్యైవ తద్బ్రహ్మ యస్మా దేషోఽవగచ్ఛతి,
మత్స్వరూప లయేనాతః కారణం స్యాదహంకృతిః ౪౩

టం-అ. ఈముముక్షువు అహంకారముచేతనే ఆకూటస్థమైన బ్రహ్మను తెలియుచున్నాఁడు. గనుక అహంకారము అహంస్వరూపముయొక్క నాశముచేతనే బ్రహ్మస్వరూపముయొక్క జ్ఞానమునకు హేతువై యుండును.

తా. ముందుగానే చెప్పఁబడినది.

అవ. 'తత్త్వమస్యా'దిమహావాక్యార్థమునందు ప్రత్యక్షాదిప్రమాణములయొక్క విరోధములేదని రెండవయధ్యాయములోనే యర్థము ప్రతిజ్ఞచేయఁబడినదో యాయర్థము యుక్తులచేత ప్రతిపాదింపఁబడినదని ఉపసంహరింపఁబడుచున్నదని చెప్పుచున్నారు.—

వాక్య. అత ఏవ చ యః ప్రతిజ్ఞాతోఽర్థో నాహం గ్రాహ్యో
న తద్ధీనః ఇత్యాదిః సయుక్తిభిరుపపాదిత ఇతి కృత్వో
పసంహ్రియతే. ౧౦౫

టం-అ. కావుననే ''నాహం గ్రాహ్యో న తద్ధీనో'' (ద్వితీయాధ్యాయము-౫-వ శ్లోకము) ఆనేశ్లోకములోనే యర్థము ప్రతిజ్ఞచేయఁబడినదో యాయర్థము యుక్తులచేత నుపపాదింపఁబడినదని యెర్చుఅచుకొని యుపసంహరింపఁబడుచున్నది.

తా. స్పష్టము.

శ్లో. గృహీతాహం పదార్థశ్చే త్కస్మాత్ జ్ఞో న ప్రపద్యతే,
ప్రత్యక్షాదివిరోధాచ్చేత్ ప్రతీచ్యుక్తిర్న యుష్మది. ౪౪

టం-అ. ముముక్షువు గ్రహింపఁబడిన అహంపదముయొక్క అర్థముకలవాఁడైనచో నెందువలన పొందఁడు? ప్రత్యక్షాదిప్రమాణములయొక్క విరోధమువల్ల నన్నయెడల, 'తత్త్వమస్యా'దివచనము ప్రత్యగాత్మయందుగాని యుష్మదర్థమైన పరాత్మునందు కానేరదు.

తా. ద్వితీయాధ్యాయమునందు కాన్పించిన అన్వయవ్యతిరేకములను విచారించి 'అహం' అనేపదార్థమును చక్కఁగా తెలిసికొనినయెడల 'అహం బ్రహ్మాస్మి' యనే అఖండాకారజ్ఞానము ఎందువల్ల కలుగకయుండును? అనఁగా 'అహం' పదార్థజ్ఞానము లేనియెడల అఖండాకారజ్ఞానము కలుగదుగాని, 'అహం' పదార్థజ్ఞానము కలిగియుండినచో నఖండాకారజ్ఞానము కలుగుటకు సంశయములేదని యర్థమయితే ప్రత్యక్షాది ప్రమాణములు విరుద్ధములుగా నున్నందున కలుగనేరదని కొందఱు శంకించెదరు. అది అజ్ఞానవిలసితము. ఏలననఁగా, 'తత్త్వమస్యా'దివాక్యము కూటస్థమైన శుద్ధ చిదాత్మయందు ప్రవర్తించుచున్నదిగాని, యుష్మదర్థమైన అహంకారాద్యనాత్మ వర్గమునందు ప్రవర్తించునదిగాదు ప్రత్యక్షాదిప్రమాణములు అహంకారాదులయందు ప్రవర్తించుచున్నదిగాని, కూటస్థాత్మయందు ప్రవర్తించునవికావు. గనుక, 'తత్త్వమస్యా'ది వాక్యము ప్రత్యక్షాదిప్రమాణములున్ను భిన్నవిషయములైనందున 'తత్త్వమస్యా'ది వాక్యజన్యజ్ఞానమును ప్రత్యక్షాదిప్రమాణములు ప్రతిబంధించచాలవని భావము.

అవ. ఉత్తరశ్లోకతాత్పర్యమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. పూర్వస్యైవపదార్థస్య విస్పష్టార్థ మాహ. ౧౦౬

దం-అ. వెనుకటిపదార్థముయొక్క విస్పష్టమైన యర్థమును చెప్పుచున్నాడు.—

తా. వెనుకటిశ్లోకములోని 'ప్రతీచ్యుక్తిర్నయుష్మది' అనేపదములకు వ్యాఖ్యానము చేయఁబడునని భావము.

శ్లో. పరాంచ్యేవ తు సర్వాణి ప్రత్యక్షాదీని నాత్మని,
ప్రతీచ్యేవ ప్రవృత్తం తత్సదాసీతి వచోఽంజసా. ౭౫

దం-అ. ప్రత్యక్షము మొదలగునవి పరాక్కులేగాని ఆత్మయందులేవు. 'తత్త్వమసి' యనేవాక్యము ప్రత్యగాత్మయందే ఋజువుగా ప్రవర్తించినది.

తా. ప్రత్యక్షాదిప్రమాణములు దేహేంద్రియఘటపటాదిపరాగ్వస్తువులయందు ప్రవర్తించి వాటిని తెలియఁజేయుచున్నవిగాని, ప్రత్యగాత్మయందు ప్రవర్తించి ఆప్రత్యగాత్మను తెలియఁజేయునవికావు. 'తత్త్వమసీ'త్యాదివాక్యము ప్రత్యగాత్మయందే ప్రవర్తించి ఆప్రత్యగాత్మనే బోధించుచున్నది. అని భావము.

అవ. 'త్వం' పదార్థమును చక్కఁగా శోధించి తెలిసికొనినవానికి వాక్యార్థజ్ఞానము కలుగుటయందు ప్రమాణాంతరములు విరోధించవు గనుక 'తత్' పదముచేత నద్వితీయబ్రహ్మజ్ఞానము కలుగుటకు సంశయమే లేదని నిగమించుచున్నారు.—

వాక్య. తస్మా త్త్రిమాత్ర ప్రమాణ ప్రమేయేభ్యో హీయమానోపాదీనుమానేభ్యో ఽన్వయవ్యతిరేకాభ్యాం ముంజేషీకావద శేషబుద్ధివిక్రియా సాక్షితయాత్మానం నిష్కృష్య 'తత్త్వమస్యా'దివాక్యేభ్యోఽపూర్వాదిలక్షణ మాత్మానం విజానీయాత్. ౧౦౭

దం-అ. ఆ కారణమువలన విడువఁబడుచు గ్రహింపఁబడుచున్న ప్రమాతృప్రమాణప్రమేయములవలన, అన్వయవ్యతిరేకములచేత ముంజతృణమునందుగల కాడనువలె, నాత్మను సకలమైన బుద్ధివికారములకు (వృత్తులకు) సాక్షిగా నిష్కర్షించి 'తత్త్వమస్యా'దివాక్యములవలన అపూర్వత్వము మొదలగులక్షణములుగల పరమాత్మను తెలియవలయును.

తా. ప్రమాతృప్రమాణప్రమేయములు మూఁడు జాగ్రత్స్వప్నములయందు వర్తించియుండును. సుషుప్తిదశయందు వ్యావర్తించియుండును. ఇట్టి ప్రమాత్రాదిత్రిపుటికంటెఁ చిదాత్మ విలక్షణమైయుండునని అన్వయవ్యతిరేకయుక్తులచేత ముంజగడ్డియొక్క పైపొరలను తీసివైచి లోపలనుండే కాడను వేరుగాఁజేసి చూచినటుల నిశ్చయించి చూచి, పిదప తత్త్వమస్యాదివాక్యములను విని 'అపూర్వమనపరమనంతరమ్ బాహ్యాం ప్రజ్ఞానఘనఏవ' (పూర్వదిక్కులేనివాఁడు, పడమరదిక్కులేనివాఁడు, లోపలలేనివాఁడు, వెలుపలలేనివాఁడు, కేవలజ్ఞానస్వరూపుఁడు) ఇత్యాదిశ్రుతులచేతను, సత్యజ్ఞానాదివాక్యములచేతను, ప్రతిపాదింపఁబడిన అఖండజ్ఞానాకారమైన పరమాత్మను అపరోక్షముగా తెలియవలయునని భావము.

వాక్య. తదేతదాహ. ౧౦౮

దం-అ. ఆ యీయర్థమును చెప్పుచున్నాఁడు.

తా. ఈచెప్పినయర్థము శ్లోకముతోఁ జెప్పఁబడునని భావము.

శ్లో. అహం దుఃఖీ సుఖీ చేతి యేనాయం ప్రత్యయోఽద్రువః,
అవ గత్యంత ఆభాతి సమ ఆత్మేతి వాక్యధీః. ౪౬

ద-అ. నేను దుఃఖవంతుఁడను, నేను సుఖవంతుఁడను అనే అనిత్యమై, యథార్థజ్ఞానము అంతమందుగలజ్ఞానము ఏసాక్షిచేత ప్రకాశించుచున్నదో అది నాయొక్క ఆత్మయని వాక్యమువల్ల బుట్టేజ్ఞానము.

తా. సుఖదుఃఖాదిజ్ఞానము పుట్టుచు నశించుచున్నందున అనిత్యమైయుండును. ఇట్టి సుఖదుఃఖాదిజ్ఞానము సర్వవిషయములయందు కలుగుచున్న యథార్థజ్ఞానమున్ను

విజ్ఞానముచేత ప్రకాశించుచున్నదో అజ్ఞానము (కూటస్థచైతన్యమే) నాయొక్క ఆత్మ-అనే జ్ఞానము తత్త్వమస్యాదివాక్యములవల్ల కలుగుచున్నదని భావము. అనఁగా సర్వవిషయ ప్రకాశకమై అవస్థాత్రయసాక్షిస్సైన కూటస్థాత్మ యేదికలదో అదియే సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు అట్టి పరమేశ్వరుండ 'నేనే' ననేజ్ఞానము, 'తత్త్వమస్యా'దివాక్యములవలన కలుగుచున్నదని తాత్పర్యము.

అవ. ఇంతవఱకుచెప్పిన అర్థము ననువదించుచున్నారు.—

వాక్య. ప్రమాణాంతరానవష్టబ్ధం నిరస్తాశేషకార్యకారణాత్మకద్వైతప్రపంచం సత్యజ్ఞానానందలక్షణమాత్మానం తత్త్వమస్యహం బ్రహ్మాస్మీత్యాదివాక్యం సంశయితమిథ్యాజ్ఞానాజ్ఞానప్రధ్వంసముఖేన సాక్షాదపరోక్షాత్కరతలన్యస్తామలకవత్ప్రతిపాదయత్యేవేత్యసకృదభిహితమ్. ౧౦౯

దం-అ. 'తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి' ఇత్యాదిమహావాక్యములు ప్రమాణాంతరములచేత ప్రతిపాదింపఁబడినదై, సకలమైన దేహేంద్రియాదిరూపభేదప్రపంచముయొక్క నివృత్తికలదై, సత్యజ్ఞానానందములు స్వరూపముగాఁగలదై, యున్న ఆత్మస్వరూపమును సంశయజ్ఞానమిథ్యాజ్ఞానాజ్ఞానములను నివర్తింపఁజేయుచు, అరచేతిలో నుంచఁబడిన ఉశిరికకాయనువలె నవ్యవహితప్రత్యక్షముగా ప్రతిపాదించుచున్నదని అనేకపర్యాయములు చెప్పఁబడినది.

తా. 'తత్త్వమసి,' 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాదిమహావాక్యములు ఆత్మస్వరూపమును అతిస్పష్టముగా ప్రతిపాదించుచున్నవి. ఎట్టి యాత్మస్వరూపమును ప్రతిపాదించుచుననఁగా, ప్రత్యక్షాదిప్రమాణములకు గోచరించక, దేహేంద్రియాదిద్వైతప్రపంచముతో సంబంధము లేశముగానైనను లేనిదై, కాలత్రయాబాధ్యమై, స్వప్రకాశమై, పరమానందస్వరూపమై, అఖండమై, అద్వితీయమైయున్న ఆత్మతత్త్వమును బోధించుచున్నది. ఏమియొనర్చిబోధించుచునన, ఇదియగునా? కాదా? యనే సంశయజ్ఞానమును, ఇదికాదు, మఱియొకటియనే మిథ్యాజ్ఞానమును, ఇదియేమో తెలియదనే అజ్ఞానమును, నిశ్శేషముగా నశింపఁజేసి బోధించును. ఎట్లు బోధించుచునన, అరచేతిలోనుంచిన ఉశిరికకాయను చక్షురింద్రియము ఎంతప్రత్యక్షముగా ప్రకాశింపఁజేయునో నంతప్రత్యక్షముగా నవ్యవహితముగా, బోధించును. అని ఇదివరకు గతించినగ్రంథములో ననేకపర్యాయములు చెప్పఁబడినదని భావము.

ఉత్తర గ్రంథముయొక్క ఆరంభమునకు ముందుగా పూర్వపక్షవాదుల
క్షేపమును కాన్పించుచున్నారు.—

తత్ర కేచిదాహుః. ౧౧౦

ం. ఆయర్థమునందు కొందఱు చెప్పుచున్నారు.
'తత్త్వమస్యా'దిమహావాక్యములు అద్వితీయాత్మస్వరూపమును సాక్షాత్తుగా
ఖగా ననఁగా ప్రమాణాంతరసహాయము నపేక్షించకయే) ప్రతిపాదించు
ాది చెప్పినయర్థమును సహించక కొందఱు పూర్వపక్షవాదులు ఆక్షేపించు
వము.

ఆక్షేపప్రకారమును కాన్పించుచున్నారు.—

తత్త్వమస్యాదివాక్యైర్యథావస్థితవస్తుయాథాత్మ్యా
ఖ్యానినిష్ఠైః న యథోక్తోఽర్థః ప్రతిపత్తుం శక్యతే.

. సిద్ధమైన వస్తువుయొక్క వాస్తవస్వరూపమును అనువదించుటయందు
'తత్త్వమస్యా'దివాక్యములచేత ఇదివరకు చెప్పినయర్థము తెలియుటకు

తత్త్వమస్యాది'వాక్యములు క్రియావిలక్షణమైన ఆత్మయొక్క నిజమైన
వదించుచున్నదిగాని, ప్రతిపాదించునవిగావు. కనుకనే మీకు అభిమత
రసాద్వితీయబ్రహ్మస్వరూపము ఆవాక్యములవలన దెలియుటకు శక్యము
ు.

ద్ధవస్తుస్వరూపము ననువదించునట్టి వాక్యములచేత అద్వితీయబ్రహ్మచైత
యు శక్యము కాదనఁగా చెప్పుచున్నారు.—

అభిధాశ్రుతిత్వాత్తేషాం. ౧౧౨

ఆవాక్యములు విధిపదములేని శ్రుతులగుటవలన శక్యము కాదని శేషము.
ధిపదఘటితములైన "అగ్నిహోత్రంజుహుయాత్స్వర్గకామః" (స్వర్గమును
గ్నిహోత్రహోమముచు జేయును.) ఇత్యాదివాక్యములు క్రియారూప
ర్థమును ప్రతిపాదించుచున్నవి. విధిపదశూన్యములయిన "అగ్నిర్హిమస్య
మంచుకు వైద్యము) ఇత్యాదివాక్యములు సిద్ధరూపమైన అగ్నియొక్క
మును అనువదించుచున్నవి. "తత్త్వమస్యా"దివాక్యములున్ను విధిపద
చే సిద్ధవస్తువు ననువదించునవియే గాని ప్రతిపాదించునవికావు. గనుక

అఖండైకరసబ్రహ్మస్వరూపము "తత్త్వమస్యా"దివాక్యమువల్ల తెలియ శక్యము కాదని భావము.

అవ. 'తత్త్వమస్యా'దివాక్యములు ప్రమాణాంతరప్రతిపాదితము, గాని అర్థమును ప్రతిపాదించుచున్నందున ప్రమాణములే యని శంకించుకొని పరిహారమును చెప్పుచున్నారు.

వాక్య. నహి లోకేఽభిధాశ్రుతేః ప్రమాణాంతరనిరపేక్షాయాః నద్యాస్తీరే ఫలాని సంతీత్యాదికాయాః ప్రామాణ్యమభ్యుపగతమ్. ౧౧౩

దం-అ. లోకమునందు ప్రమాణాంతరము నపేక్షించని "నదీతీరమునందు ఫలములు కలవ"ను విధిరహితవాక్యమునకు ప్రామాణ్యము (వాస్తవార్థబోధకత్వము) అంగీకరింపఁబడలేదుగదా?

తా. లోకములో "నద్యాస్తీరేఫలానిసంతి" ఇత్యాదివాక్యములు విధివిభక్తిశూన్యములై యున్నవి. ఈవాక్యములు ప్రత్యక్షప్రమాణమున కనుకూలముగ నుండినచో ప్రమాణములని యంగీకరింపఁబడినవి. గాని, ప్రత్యక్షమునకు విరుద్ధముగ నుండినచో వాటికి ప్రామాణ్యము అంగీకరింపఁబడియుండలేదు. అనఁగా నదీతీరమునందు ఫలములున్నట్లు ప్రత్యక్షముగఁ దెలియఁబడెనా 'నద్యాస్తీరేఫలాని సంతి'యనువాక్యము ప్రత్యక్షసిద్ధమైన అర్థము ననువదించుచున్నందున, ప్రమాణ మనఁబడును. ప్రత్యక్షముచేత తెలియఁబడకపోయినచో, ఆవాక్యము అప్రమాణమని చెప్పఁబడునుగదా? ఆప్రకారమే 'తత్త్వమస్యా'ది మహావాక్యములున్ను, విధివిభక్తిశూన్యములైనందున, ప్రమాణాంతరము నపేక్షించి యుండును. ఈవాక్యములచేత ప్రతిపాదింపఁబడే అద్వితీయబ్రహ్మతత్త్వము, ప్రమాణాంతరగోచరము కానందున, ఈవాక్యములు ప్రమాణములు కానేరవని భావము.

అవ. అయితే ఈవాక్యములకు ఏవిధముగ ప్రామాణ్యమును చెప్పనగునన చెప్పుచున్నారు.—

వాక్య. అతః నియోగముఖేనైవ అభిధాశ్రుతేః ప్రామాణ్యమ్ యుక్తం ప్రమాణాంతర నిరపేక్షత్వాన్నియోగస్య. ౧౧౪

దం-అ. కావున విధిహీనవాక్యమునకు ప్రామాణ్యము క్రియాద్వారముచేతనే,

యుక్తమైయున్నది. క్రియారూపమైన అర్థము ప్రమాణాంతరమును అపేక్షించి యుండదు గనుక.

తా. విధిహీనవాక్యమునకు సిద్ధార్థమందు ప్రామాణ్యము సంభవింపదు గావున, క్రియాపరమైన వాక్యముతో నేకముగా నన్వయించి ఇదిన్ని క్రియావిశేషమును బోధించునని చెప్పినచో ప్రామాణ్యము సంభవించును. క్రియావిశేషము సిద్ధార్థమువలె ప్రమాణాంతరగోచరమై యుండదని భావము. అనఁగా ఉపాసనాదిక్రియావిశేషములు ప్రత్యక్షాదిప్రమాణాంతరగోచరములుకావు. కేవల వేదవచనములచేతనే ప్రతిపాదింపఁబడుచున్నవి; గనుక, ఉపాసనాదిక్రియాబోధకములగు ''ఆత్మానముపాసీత'' (ఆత్మను ఉపాసింపవలయును).ఇత్యాదివాక్యములు ప్రమాణములైయున్నవి. ఇట్టివాక్యములతో 'తత్త్వమస్యా'దివాక్యముల నేకముగాచేర్చి అన్వయించితే 'తత్త్వమస్యా'దివాక్యములున్ను క్రియాపదములగును. అందువలన అవియును ప్రమాణములు కావచ్చును; గనుక, 'తత్త్వమస్యా'దివాక్యములకు క్రియాపరత్వముచేతనే ప్రామాణ్యమును చెప్పుట యుక్తముగానుండును; అని తాత్పర్యము.

అవ. ఈప్రకారము పూర్వపక్షవాదిచేసిన యాక్షేపణకు పరిహారమును ఉత్తరశ్లోకములతో చెప్పుచు వాటితాత్పర్యమును ముందుగా చెప్పుచున్నారు.

వాక్య. అస్య పరిహారార్థమశేషప్రత్యక్షాదిప్రమేయత్వనిరా
కరణద్వారేణాతీంద్రియార్థ విషయత్వాదభిధా శ్రుతేః
ప్రామాణ్యం సుషుప్తపురుషప్రబోధకవాక్యస్యేవవక్తవ్యమ్.

దం-అ. దీనియొక్క పరిహారముకొఱకు సకలమైన ప్రత్యక్షాదిప్రమాణములయొక్క గోచరత్వమును నిరాకరించుచు ఇంద్రియగోచరముగాని యర్థమును ప్రతిపాదించుటవలన విధిరహితవాక్యమునకు ప్రామాణ్యమును నిద్రబోవువానిని లేపునట్టి వాక్యమునకువలె చెప్పఁదగియున్నది.

తా. ఈప్రకారముగా పూర్వపక్షవాదిచేసిన యాక్షేపమునకు పరిహారమును చెప్పవలసియున్నది. విధిరహితములయిన 'తత్త్వమస్యా'దివాక్యములు ప్రత్యక్షాదిప్రమాణములచేత గ్రహింపఁబడుచున్న స్థూలత్వాణుత్వాదిధర్మములను నిరాకరించి సర్వేంద్రియగోచరముకాని కూటస్థాత్మస్వరూపమును బోధించుచున్నందున ప్రామాణ్యముకలవై చెప్పవలసియున్నది. అనఁగా సిద్ధార్థమును బోధించేవాక్యములన్నియు ప్రమాణాంతరము నపేక్షించి ప్రమాణములగుననిన్ని, క్రియాపదములైనవాక్యములు ప్రమాణాంతరము నపేక్షించకనే స్వతంత్రముగా ప్రమాణములగుననిన్ని నియమములేదు. క్రియా

పదములయిన 'గామానయ' (గోవును తోలుకొనిరమ్ము) ఇత్యాదివాక్యములున్ను మాణాంతరము నపేక్షించియేగదా, ప్రామాణ్యము నొందుచున్నవి; గనుక, సిద్ధప బోధకవాక్యముగాని, క్రియాబోధకవాక్యముగాని, ఏదియైనను సరే పౌరుషేయమై (లోకములోనిపురుషులచే రచింపఁబడినదై) యుండినచో, ప్రమాణాంతరము న క్షించియుండుననిన్ని, అపౌరుషేయమైనచో ప్రమాణాంతరము నపేక్షించియుం దనిన్ని నిశ్చయింపఁవలసియున్నది. వేదాంతవాక్యము లపౌరుషేయములై నందున ప్రమాణాంతరగోచరముగాని విషయమును ప్రతిపాదించుచున్నందునను, బో ప్రమాణాంతరము నపేక్షించవు. నిద్రించునట్టివానిని మేలుకొలుపునట్టివాక్యము స్వగ పదపదార్థములయందు తాత్పర్యము లేనిదై మేలుకొలుపఁబడుచున్న పురుషునిమాత్ర ను ద్దేశించి ప్రవర్తించుచు నిద్రించువానియొక్క నిద్రను నివర్తింపఁజేయుటచేత యె ప్రమాణమైయుండునో. అటులే, 'తత్త్వమస్యా'దివాక్యమున్ను స్వగతపదపదార్థమ యందు తాత్పర్యములేనిదై చిదాత్మను మాత్రము నుద్దేశించి బోధించుచు చిదా నిష్ఠమైన అజ్ఞానమును నివర్తింపచేయుటచేత ప్రమాణమైయుండునని తాత్పర్యము.

అవ. ఈచెప్పిన అర్థమందు రెండుశ్లోకముల నవతరింపఁజేయుచున్నారు.

వాక్య. ఇత్యయమారంభః. ౧౧

దం-అ. ఇందువలన ఈగ్రంథ మారంభింపఁబడుచున్నది.

తా. ఇట్టి యభిప్రాయముతోటి ఉత్తరమందు రెండుశ్లోకములు వర్తించుచు వని భావము.

శ్లో. నిత్యావగతిరూపత్వా దన్యమానా నపేక్షణాత్,
శబ్దాదిగుణహీనత్వా త్సంశయా నవతారతః. ౧
తృష్ణా స్నిష్ఠీవనైర్నాత్మా ప్రత్యక్షాద్యైః ప్రమీయతే,
ప్రత్యగాత్మత్వ హేతోశ్చ స్వార్థత్వా దప్రమేయతః. ౨

దం-అ. నిత్యమైనజ్ఞానమే స్వరూపముగా గలిగియున్నందునను, ప్రమాణాం ము నపేక్షించనిదై యున్నందునను, శబ్దము మొదలగు గుణములులేనిదైయున్నం సంశయము ప్రవర్తించనిదైయున్నందునను, సర్వాంతరమైన ప్రత్యగాత్మ స్వరూ మై యున్నందునను, వ్యవధానము లేనిదైయున్నందునను, అనుమానప్రమాణ గో రముకానందునను, ఆశచేత ప్రవర్తించుచున్న ప్రత్యక్షాదిప్రమాణములచేత, చిదా బోధింపఁబడదు.

తా. లోకములో, స్వభావముగా, జ్ఞానస్వరూపముగాని పదార్థము ప్రమాణాంతరముచేత ప్రకాశించుచుండును. అనఁగా ఘటాదిపదార్థములు స్వభావముగా జడములైనందున తమకంటే భిన్నములైన ప్రమాణములచేత ప్రకాశించుచుండునని అర్థము. కూటస్థమైన ఆత్మస్వరూపము సర్వదాజ్ఞానైకరూపమైనందున ప్రమాణాంతరము నపేక్షింపకనే స్వయముగానే ప్రకాశించుచుండును. ఇవి ఘటాదిపదార్థములు పరాగ్రూపములై యున్నందున వ్యవహితములై యున్నవి. అందువల్లనే ప్రమాణాంతరప్రకాశ్యములై యున్నవి. ఆత్మస్వరూపము ప్రత్యగ్రూపమైయున్నందున అవ్యవహితమైయున్నది. అందువల్లనే ప్రమాణాంతరము నపేక్షించదు. ఇదిగాక ఘటాదులు పదార్థములైయుండును గనుక, అన్యులకు భోగ్యములై యుండును. అందువల్లనే ప్రమాణాంతరప్రకాశ్యములై యున్నవి. ఆత్మతత్త్వము స్వార్థమైయున్నందున, అన్యభోగ్యము కాదు. అందువల్లనే ప్రమాణాంతరము నపేక్షింపదు. ఇదిగాక ఘటాదివస్తువులు విషయములైయున్నందున ప్రమాణాంతరప్రకాశ్యములై యున్నవి. ఆత్మస్వరూపము విషయిగా (ప్రకాశమైయున్నందున) ప్రమాణాంతరముల నపేక్షించదు. ఇదిగాక ఘటాదిపదార్థములు శబ్దస్పర్శాదిగుణములు కలవైయున్నందున ప్రమాణాంతరవేద్యము లయియున్నవి. ఆత్మస్వరూపము శబ్దాదిరహితమై యున్నందున ప్రమాణాంతరవేద్యము కానేరదు. ఇదిగాక ఇది కాఁగలదా? కానేరదా? యని సందేహింపఁదగియున్న విషయములే ప్రమాణములకు గోచరములైయుండును. ఆత్మతత్త్వము, తాను కాఁగలదా? కానేరదా? యనేసంశయమునకు యోగ్యమైనది కాదు. సర్వదా 'అహం (నేను)' అని నిశ్చయముగా ప్రకాశించుచుండును; గనుక, ప్రమాణములకు గోచరమైనది కాదు. ఇదిగాక, ప్రమాత (అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము) ఇదియేమో తెలియుదమని యిచ్ఛయించిన పిదప ఇంద్రియములు ప్రవర్తించగా పుట్టునవి ప్రమాణములు. ఇవి తృష్ణకు (ఆశకు, లేక ఇచ్ఛకు) పిదపఁ బుట్టుచున్నందున తృష్ణయొక్క ఉచ్ఛిష్టములైయున్నవి. ప్రమాణములకు కారణమైన తృష్ణకంటే పూర్వముననే సిద్ధమై యున్నందున చిదాత్మప్రమాణప్రకాశ్యము కాదు. అనిభావము.

అవ. ఈచెప్పినయర్థమందు శ్రుతియును ప్రమాణమైయున్నదనుచున్నారు.

వాక్య. శ్రుతి రపీమమర్థం నిర్వదతి. ౧౧౭

దం-అ. శ్రుతియును ఈయర్థమును నిశ్చయముగా చెప్పుచున్నది.

తా. ఆత్మస్వరూపప్రతిపాదకములయిన శ్రుతులున్ను ఆత్మతత్త్వము ప్రత్యక్షాది ప్రమాణగమ్యము కాదని నిశ్చయముగా చెప్పుచున్నదని భావము.

అవ. ఏమనిచెప్పుచున్నదో నిరూపించుచున్నారు.—

శ్లో. దిదృక్షితపరిచ్ఛిన్న పరాగ్రూపాది సంశ్రయాత్,
విపరీత మతో దృష్ట్యా స్వతోబుద్ధం న పశ్యతి. ౭౯

దం-అ. దృశ్యమై, పరిచ్ఛిన్నమై, పరాగ్భూతమై, రూపాదిగుణముల కాశ్రయమై యుండు విషయముకంటె ఆత్మ విలక్షణమైయున్నది. అందువల్ల స్వయంప్రకాశమైన ఆత్మను ప్రమాణముచేత చూడఁడు.

తా. దేహాదివిషయములు దృశ్యములై, (చూడతగినవై), దేశకాలములచేత పరిచ్ఛేదింపఁబడి బాహ్యమందున్నవై, శబ్దస్పర్శరూపరసాదిధర్మముల కాశ్రయమై యున్నవి. ఆత్మస్వరూపము దృశ్యముకానిదై, అపరిచ్ఛిన్నమై సర్వాంతరమై రూపాదిధర్మముల కాశ్రయముగానిదై, యున్నది; కావున, దృశ్యత్వాదిధర్మములుగల విషయములను ప్రకాశింపఁజేయునట్టి స్వభావముగల ప్రత్యక్షాదిప్రమాణములు, తద్విలక్షణమై స్వయంప్రకాశమైయున్న ఆత్మతత్త్వమును ప్రకాశింపఁజేయఁజాలవని భావము.

అవ. ఇది సర్వశ్రుతులయొక్క తాత్పర్యమని చెప్పి ఈయర్థమును ప్రతిపాదించే శ్రుతులను ఉదహరించుచున్నారు.—

శ్లో. న్యాయసిద్ధమతో వక్తి దృష్టే ర్ద్రష్టారమాత్మనః,
న పశ్యే త్ప్రత్యగాత్మానం ప్రమాణం శ్రుతిరాదరాత్. ౮౦

దం-అ. ప్రమాణభూతమైన శ్రుతిదృష్టికిన్ని, తనకున్ను, ద్రష్టగానున్న ప్రత్యగాత్మను చూడఁదగదని యుక్తిసిద్ధముగా తాత్పర్యముతో చెప్పుచున్నది.

తా. ఆత్మస్వరూపము రూపాదిహీనమై యున్నది 'నదృష్టే ర్ద్రష్టారం పశ్యేత్' ఇత్యాదిశ్రుతిప్రమాణములను ప్రకాశింపఁజేయుచు, తన్నుతానే ప్రకాశింపఁజేయుచున్న ప్రత్యగాత్మను ప్రమాణములచేత చూచి తెలిసికొనతగదని సయుక్తికముగా, సాభిప్రాయముగా ప్రతిపాదించుచున్నదని భావము. అనఁగా నీలపీతాదిరూపములను చూచుచున్నదృష్టిని ఆత్మ చూచుచుండును. అట్టి ఆత్మను దృష్టిచేత చూచుటకు శక్యముకాదని యీతాత్పర్యాదిలోను శ్లోకములోను నుదాహరించిన శ్రుత్యర్థము.

అవ. అనుమానప్రమాణమున కాత్మతత్త్వము గోచరించునది కాదని నిశ్చయించినచో అర్థాపత్త్యాదిప్రమాణములకున్ను గోచరించునదికాదని నిశ్చయింపఁబడుననే యభిప్రాయముతో చెప్పుచున్నారు.—

వాక్య. అనుమానా విషయత్వే అన్యదపి కారణముచ్యతే. ౧౧౭

దం-అ. అనుమానమునకు గోచరము కాకపోవుటయందు మఱియొకహేతువు చెప్పఁబడుచున్నది.

తా. కూటస్థాత్మస్వరూపము అనుమానప్రమాణముచేత ప్రతిపాదింపఁబడునది కాదనుటకు మఱియొక కారణము ముందఱిశ్లోకముతో చెప్పఁబడునని భావము.

శ్లో. ప్రత్యక్షస్య పరాక్త్వాన్న సంబంధగ్రహణం యతః
ఆత్మనోఽతోఽనుమిత్యాస్యానుభవో న కథంచన. ౫౧

దం-అ. ప్రత్యక్షప్రమాణము పరాగ్వస్తువిషయమై యున్నందువలన ఆత్మయొక్కసంబంధమును గ్రహించుట యెందువలన సంభవించదో అందువల్లనే యీయాత్మయొక్క అనుభవము, అనుమానముచేత నేవిధముననైనను గలుగనేరదు.

తా. రెండుపదార్థములకు గలిగియున్న అవినాభావసంబంధము ప్రత్యక్షముచేత గ్రహింపఁబడిన పిదప ఆసంబంధగ్రహణమును పురస్కరించుకొని అనుమానప్రమాణము, పదార్థమును తెలియునుగాని, అవినాభావసంబంధము గ్రహింపఁబడకమునుపు తెలియఁజేయఁజాలదు. అనఁగా వహ్నిధూమములకు అవినాభావసంబంధముకలదు. ఇది మహానసమందు (వంటఇంటిలో) ప్రత్యక్షముచేత గ్రహింపఁబడును. ఈలాగున వహ్నిధూమములయొక్క అవినాభావసంబంధమును గ్రహించినపురుషుఁడు మార్గమునబోవుచు నొక్కచోట దూరమున ధూమమును మాత్రము జూచి పూర్వము తాను ప్రత్యక్షముచేత గ్రహించిన వహ్నిధూమములయొక్క అవినాభావసంబంధమును జ్ఞాపకము తెచ్చుకొని ఇచ్చట ధూమముకలిగియున్నందున వహ్నికలదని యనుమానముచేత నిశ్చయించును గనుక, ప్రత్యక్షసిద్ధమైన సంబంధగ్రహణమును పురస్కరించుకొని అనుమానము, పదార్థమును తెలియఁజేయును. అని యర్థము. ప్రత్యక్షప్రమాణము పరాగ్వస్తువులయందు ప్రవర్తించుచున్నదిగాని, ప్రత్యగాత్మయందు ప్రవర్తించునదికాదు; గనుక, ప్రత్యగాత్మకు మఱియేపదార్థముతోటి అవినాభావసంబంధముకలదో దానిని గ్రహింపఁజాలదు. ఆత్మయొక్కసంబంధము ప్రత్యక్షగృహీతము కానందున, సంబంధగ్రహణపూర్వకముగా ప్రవర్తించునట్టి అనుమానము ఆత్మస్వరూపమును బోధింపఁజాలదని భావము.

అవ. ఈప్రకారముగా చెప్పినయుక్తులచేత, ఆత్మ ప్రమాణాంతరగోచరము గాదని, నిశ్చయించవలయునని ఉపసంహరించుచున్నారు....

వాక్య. ఏవమయం ప్రమాతృ ప్రమాణప్రమేయవ్యవహారః
సర్వఏవ పరాచీనవిషయ ఏవ న ప్రతీచీనమాత్మానమవ

గాహయితుమలమ్ ఏవం చ సత్యనేనైవ యథోక్తో౽ర్థో౽వసాతుం శక్యత ఇత్యాహ. ౧౧౯

దం-అ. ఈప్రకారముగ నీప్రమాతృప్రమాణప్రమేయములయొక్క వ్యాపారము (ప్రవృత్తి) యావత్తు పరాగ్వస్తువులనే విషయీకరించుచున్నది. ప్రత్యగాత్మైన ఆత్మస్వరూపమునుగూర్చి ప్రవేశించుటకు సమర్థమైనదికాదు. ఈలాగున గాదీనిచేతనే యిదివఱకు చెప్పినఅర్థము నిశ్చయించుటకు శక్యమై యున్నదని చున్నారు.

తా. ప్రమాతృప్రమాణప్రమేయములయొక్క వ్యాపారము యావత్తు పరాగ్వస్తువులయందు ప్రవర్తించుచున్నదిగాని, ప్రత్యగాత్మయందు ప్రవర్తించలేక యున్నది గనుక, ఈకారణముచేతనే ప్రత్యగాత్మస్వరూపము ప్రమాణాంతరవేద్యము నిశ్చయించదగియున్నదని ఉత్తరశ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. ప్రమాణవ్యవహారో౽యం సర్వ ఏవ పరాగ్యతః,
సువిచార్యాప్యతో౽నేన యుష్మద్యేవ దిదృక్షతే.

దం-అ. ఈప్రమాణములయొక్క ప్రవృత్తియావత్తు చక్కగా విచారించినను పరాగ్వస్తువిషయమై ఎందువల్లనున్నదో అందువలన ఈప్రత్యక్షాదికవ యుష్మదర్థమునందే (అనాత్మయందే) చూడవలయుననే ఇచ్ఛను చేయును.

తా. ఎంతనిపుణముగ నాలోచించిచూచినను ప్రత్యక్షాది ప్రమాణములు త్మభూతములై దేహగేహాదులయందే ప్రవర్తించుచున్నట్లు కనుపడుచున్నది; గ ప్రత్యక్షాదిప్రమాణములచేత అనాత్మవస్తువులే చూడవచ్చుచున్నవిగాని ఆత్మ చూడఁబడదని భావము.

అవ. ప్రత్యక్షాదిప్రమాణములు అనాత్మవిషయములైనందువలననే వేద వాక్యములు ఆత్మయందు ప్రమాణములైయున్నవనేయర్థమున్ను సిద్ధమైనదని ఉప రించుచున్నారు.

వాక్య. యస్మాల్లౌకికప్రత్యక్షాదిప్రమాణానధిగమ్యో౽హం బ్రహ్మాస్మీతి వాక్యార్థ స్తస్మాత్. ౧

దం-అ. 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మనైతిని) అనేవాక్యార్థము ఎందు లోకసిద్ధములైన ప్రత్యక్షాదిప్రమాణములచేత తెలియఁబడనిదై యున్నదో అందు అని ముందఱిశ్లోకముతో నేకముగా నన్వయించుము.

తా. తాత్పర్యమున్ను ముందటిశ్లోకముతోఁ జేర్చి చెప్పఁబడును.

శ్లో. అన్వయవ్యతిరేకాభ్యాం నిరస్యాప్రాణతో యతః,
వీక్షాపన్నస్య కోఽస్మీతి తదసీతి శ్రుతిర్జగౌ. ౫౩

దం-అ. అన్వయవ్యతిరేకములచేత ప్రాణపర్యంతము నిరసించి 'నేను ఎవఁడను' అని చూచువానికి "ఆబ్రహ్మవైతివి" అని శ్రుతి చెప్పినది.

తా. 'అహం బ్రహ్మాస్మి' అనే అఖండవాక్యార్థజ్ఞానము లోకసిద్ధములైన ప్రత్యక్షాదిప్రమాణమువల్ల కలుగునది కాదు గనుక, దేహము మొదలు ప్రాణమువఱకు, కనుబడుపదార్థములు ఆత్మ కాదని, అన్వయవ్యతిరేకముల చేత ఆలోచించి నిరాకరించుకొని, పిదప 'నే నెవఁడను?' అని స్వస్వరూపమును తెలియఁగోరి ఏపురుషుఁడుండునో వానిని గూర్చి 'తత్త్వమసీ'త్యాదిశ్రుతి 'నీవు ఆబ్రహ్మవే' నని యుపదేశించుచున్నదని భావము.

అవ. ద్వితీయాధ్యాయములో చెప్పఁబడిన అఖండవాక్యార్థజ్ఞానసాధనపదార్థవివేకమునకు కారణములైన అన్వయవ్యతిరేకములను మరల సంగ్రహముగ ప్రతిపాదించుట కుత్తరగ్రంథము ప్రవర్తించుచున్నదని, తాత్పర్యమును చెప్పఁబోవుచు ముందుగా నాయన్వయవ్యతిరేకములచేత నవ్యవహితముగా ప్రతిపాదింపఁబడే విషయమును నిర్దేశించుచున్నాఁడు.

వాక్య. సోఽయమన్వయవ్యతిరేకన్యాయః ఏతావానేవ. ౧.౨౧

దం-అ. ఈ యన్వయవ్యతిరేకన్యాయము ఇంతపర్యంతమే.

తా. స్పష్టము.

అవ. ఎంతపర్యంత మనఁగా చెప్పుచున్నారు.

వాక్య. యదవసానో వాక్యార్థః ౧.౨౨

దం-అ. వాక్యార్థజ్ఞానము ఏది ముఖ్యకారణముగా గలిగియుండునో అంతపర్యంతమే నని అన్వయము.

తా. వాక్యార్థజ్ఞానమునకు నిశ్చాయకము, (ముఖ్యకారణము) పదార్థనిశ్చయము. అది కలుగుటయే అన్వయవ్యతిరేకములకు పర్యవసానమని భావము. అనఁగా అఖండవాక్యార్థజ్ఞానమునకు సాక్షాత్కారణము పదార్థనిశ్చయమనియు, దానికి, అన్వయవ్యతిరేకజ్ఞానము సాధనమనియు, కావున నే అన్వయవ్యతిరేకములు పదార్థనిశ్చయజ్ఞానము కలిగేవఱకు ప్రవర్తించునని భావము.

వాక్య. తదభిజ్ఞస్య 'అహం బ్రహ్మాస్మీ' త్యావిర్భవతి. ౧.౨౩

దం-అ. దాని నెఱింగినవానికి 'అహం బ్రహ్మాస్మి' యనేజ్ఞానము ఆవిర్భవించు చున్నది.

తా. పదార్థనిశ్చయజ్ఞానము కలవానికి 'అహంబ్రహ్మాస్మి' అనే అఖండాకార జ్ఞానము ప్రకాశించునని భావము.

అవ. ఇఁకను ఉత్తరగ్రంథమునకు తాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. ద్రష్టృదృశ్యవిభాగేన ఆగమాపాయిసాక్షివిభాగేన
చ శ్రుత్యభ్యుపగతః సంక్షిప్యోచ్యతే. ౧౨౮

దం-అ. ద్రష్టయొక్క, దృశ్యముయొక్క విభాగముచేతను, ఉత్పత్తివినాశము లుకల కార్యకారణముల సాక్షియొక్క విభాగముచేతను, వేదాంతముల నంగీకరించి సంక్షేపముగ చెప్పఁబడును.

తా. ద్రష్టయొక్కస్వభావమును, దృశ్యముయొక్క స్వభావమును విభజించి ఉత్పత్తివినాశములు కలిగియున్నందున వచ్చుచు, పోవుచు నుండేపదార్థములకు సాక్షిగానుండే కూటస్థచైతన్యమును విభజించి, ద్వితీయాధ్యాయములో విస్తారముగా చెప్పిన పదార్థవివేకమును మరల ఇచ్చట సంక్షేపముగా చెప్పుచున్నాము. అదియు కేవలయుక్తి చేతకాక, శ్రుతివాక్యముల ననుసరించి చెప్పుచున్నామని భావము.

శ్లో. దృశ్యత్వాత్ ఘటవద్దేహో దేహవచ్చేంద్రియాణ్యపి,
మనశ్చేంద్రియవత్ జ్ఞేయం మనోవన్నిశ్చయాదిమత్. ౫౪

దం-అ. శరీరము దృశ్యమైయున్నందున ఘటమువంటిది. ఇంద్రియములును దేహమువంటిది. మనస్సున్ను ఇంద్రియములవంటిది. నిశ్చయాదివృత్తులుగలబుద్ధియున్ను మనస్సువంటిది.

తా. ఘటము ఏప్రకారము అనాత్మయో అటువలె ఈదేహమున్ను దృశ్యమై యున్నందున అనాత్మయే-ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవియున్నియు దేహమువలె జడములై అన్యాధీనప్రకాశముగ నున్నందున అనాత్మలేగాని ఆత్మయని చెప్పఁదగినది కాదు. అని భావము.

అవ. ఈప్రకారము ద్రష్టృదృశ్యవిభాగరూపమైన అన్వయవ్యతిరేకన్యాయమును చూపి రెండవవ్యతిరేకన్యాయమును కనుఁబఱచుచున్నారు.—

వాక్య. తథా సకలకార్యకారణాగమాపాయి విభాగసాక్షి
త్వేనాపి. ౧౨౯

దం-అ. ఆప్రకారమే సమస్తమైన కార్యకారణములయొక్క ఉత్పత్తివినాశములకు సాక్షిగా నుండుటచేతనున్న ఆత్మతత్త్వము నిశ్చయింపఁబడును.

తా. సమస్తమైన ఘటపటాదికార్యములయొక్కయు, మృత్పిండాది కారణములయొక్కయు, ఉత్పత్తివినాశములు జడములైనందున స్వయముగా ప్రకాశించవు గనుక, వాటిని ప్రకాశింపఁజేయునది ఆత్మస్వరూపమని తెలియవచ్చునని భావము.

అవ. ఈయర్థమును శ్లోకముతో విశదముగా చెప్పుచున్నారు.—

శ్లో. ప్రాగసద్భాతి పశ్చాత్సత్సచ్చ యాయాదసత్తథా,
అనాత్మాభిజనం తత్స్యాద్విపరీతః స్వయం దృశిః. ౫౩

దం-అ. పూర్వమునందు అసత్తుగానుండునది పిదప సత్తనుబొందును; సత్తుగానుండునది అటువలెనే అసత్తునుబొందును. ఇట్టివస్తువు అనాత్మస్వభావముకలదైయుండును. ఆత్మతత్త్వము తాను ఇందుకు విపరీతమై యుండును.

తా. ఘటాదిబాహ్యపదార్థములును, దేహాద్యాంతరపదార్థములును, ఉత్పత్తికి పూర్వము అసద్రూపములుగానుండి, ఉత్పత్తికి అనంతరము సద్రూపములగును. ఈ విధము సద్రూపములైయుండి వినాశానంతరము మరల అసద్రూపములగును. ఈప్రకారముగ కాలభేదముచేత సత్తాసత్తలను బొందుచు ఆగమాపాయములుగల దేహగేహాది వస్తువులు అన్నియు అనాత్మస్వభావము కలవియే యని తెలియఁబడుచున్నది. వీటిని అనఁగా దేహగేహాదులయొక్క సత్తాసత్తలను, ప్రకాశింపచేయుచున్న చైతన్యముమాత్రము, కాలభేదముచేత సత్తాసత్తలుకలదికాదు. సర్వదా సద్రూపమైయుండును. కూటస్థనిత్యమై యుండునని భావము.

అవ. ఇఁకను ద్రష్టృకోటిలో చేరియున్నందున తార్కికులు మొదలగువారిచేత ఆత్మయని తలఁచఁబడుచున్న అహంకారమునకు అనాత్మత్వమును సాధించుచున్నారు.—

వాక్య. తత్ర ఘటాదీనాం దృశ్యానామనాత్మత్వం ద్రష్ట్రాత్మపూర్వకం ప్రత్యక్షేణైవ ప్రమాణేనోపలభ్యానాత్మనశ్చాసాధారణాం ధర్మానవధార్య తైర్ధర్మైర్దృశ్యత్వాగమాపాయాదిభిర్ధర్మైః శరీరేంద్రియమనోనిశ్చయాది వృత్తిరనాత్మతయా వ్యుదస్యాహం వృత్తిమప్యోఽపి దృశ్యత్వావిశేషాత్ ద్రష్టృపూర్వకత్వ మవసీయతే. ౧౨౬

దం-అ. ఘటములు మొదలగుదృశ్యపదార్థములకు, అనాత్మత్వమును, ద్రష్ట్రాత్మను (ప్రమాతను) పురస్కరించుకొని ప్రత్యక్షప్రమాణముచేతనే తెలిసికొని, అనాత్మ యొక్క అసాధారణములైన, (ముఖ్యములైన) ధర్మములను నిశ్చయించుకొని దృశ్యత్వము, ఉత్పత్తి, వినాశము మొదలగు సాధర్మ్యములచేత దేహము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీనిని అనాత్మలగుటచే నిరసించి, అహంకారమునకున్ను దృశ్యత్వము సమానమైయున్నందున ద్రష్ట్రాత్మమూలకముగా (ప్రకాశకముగా) కలిగియుండుట నిశ్చయింపఁబడుచున్నది.

తా. ఘటాదిపదార్థములు దృశ్యములైయున్నందున, ప్రత్యక్షముగానే అనాత్మలని, ప్రమాతృచైతన్యముచేత తెలియుచున్నదిగదా? అనాత్మయొక్క ధర్మములే విముఖ్యములుగా నున్నవో వానినిన్ని, నిశ్చయించుకొని, అనఁగా ననాత్మలగు ఘటాదులయందు దృశ్యత్వము, ఉత్పత్తి, వినాశములు ముఖ్యధర్మములై యున్నవని తెలిసికొని, ఈధర్మములు శరీరేంద్రియమనోబుద్ధులయందు కూడా కలవుగాన, ఆశరీరేంద్రియాదులున్ను అనాత్మలేనని, ఆత్మకోటిలోనుండి తొలగించి, పిదప అహంకారమున్ను దృశ్యత్వాదిగుణములు కలదై యున్నందున ఘటాదులవలెనే మఱియొకదానిచేత (సాక్షిచైతన్యముచేత) ప్రకాశింపఁచేయఁబడుచున్నదగుటచే ననాత్మ యని నిశ్చయింపఁబడుచున్నది. అని భావము. దృశ్యత్వాదిధర్మములు గలిగియున్న శరీరేంద్రియాదులు అనాత్మలని ప్రమాతృచైతన్యముచేత తెలియఁబడుచున్నది. అటులే అహంకారమున్ను (ప్రమాతృచైతన్యమున్ను) దృశ్యత్వాదిధర్మములు కలిగియున్నందున అనాత్మయే గనుక, తానున్ను మఱియొకచైతన్యముచేత ప్రకాశింపఁజేయఁబడును. అహంకారమును ప్రకాశింపఁజేసేచైతన్యమే కూటస్థాత్మ యని తెలియవలయునని భావము.

అవ. ఈయర్థమే ఉత్తరశ్లోకములో చెప్పఁబడునని చెప్పుచున్నారు....

వాక్య. తదేతదాహ. ౧౨౭

దం-అ. ఈయర్థమును చెప్పుచున్నారు.

శ్లో. ఘటాదయో యథాలింగం స్యుః పరంపరయాహమః,
దృశ్యత్వాదహమప్యేవం లింగం స్యాద్ద్రష్టురాత్మనః. ౫౬

దం-అ. ఘటము మొదలగునవి పరంపరగా అహంకారమునకు ఎట్లు గమకములై యున్నవో అటులే అహంకారమున్ను దృశ్యముగా నున్నందున ద్రష్టయగు నాత్మకు గమకమై యున్నది.

తా. దేహముకంటె అత్యంతబాహ్యములైన ఘటాదివిషయములు, దృశ్యములైనందున దేహముతోఁకూడియున్న ద్రష్టను (చిదాత్మను) తెలియచేయుచున్నవి. ఈప్రకారము దేహమున్ను ఇంద్రియములతో కూడుకొనియున్న చిదాత్మను, తెలియఁజేయుచున్నవి. ఇంద్రియములున్ను మనస్సుతో కూడుకొని చిదాత్మను తెలియఁజేయుచున్నవి. మనస్సున్ను బుద్ధితో కూడియున్నచిదాత్మను తెలియఁజేయుచున్నది బుద్ధియున్ను అహంకారముతో కూడియున్న చిదాత్మను తెలియఁజేయుచున్నది. అహంకారము తానున్ను ఘటాదులవలె జడమై దృశ్యమైయున్నందున మఱియొకదానిచేత ప్రకాశింపఁజేయఁదగియున్నది, గనుక శుద్ధమైనచిదాత్మను (కూటస్థచైతన్యమును) తెలియఁజేయుచున్నదని భావము.

అవ. ఈప్రకారము అన్వయవ్యతిరేకములు ఆత్మతత్త్వజ్ఞానమునకు కారణమని విస్తారముగా నిరూపించినందున 'తత్త్వమస్యా'దివాక్యమునకు తిరిగి నిరర్థకత్వము ప్రాప్తించినదని సాంఖ్యమతమువార లాక్షేపించుచున్నారు.—

వాక్య. నను ద్రష్టృదర్శనదృశ్యానాం జాగ్రత్స్వప్నసుషుప్తే ష్వాగమాపాయదర్శనాద్వ్యత్సాక్షికా తేషా మాగమాపాయౌ స ఆగమాపాయవిభాగరహిత ఆత్మా యథా యన్నిబంధనౌ జగతః ప్రకాశాప్రకాశౌ సప్రకాశాప్రకాశ విభాగరహితః సూర్య ఇతి, యదా చైవం తదా వాక్యావగమస్యార్థస్యానుదితా నస్తమితవిజ్ఞానమాత్రస్వభావస్యానుమానే నైవ ప్రతిపన్నత్వా త్పునరపి వాక్యస్య నిర్విషయత్వప్రసంగః. ౧౨౮

దం-అ. ఓయీ! ద్రష్టృదర్శనదృశ్యములకు జాగ్రత్స్వప్నసుషుప్తిదశలయందు సద్భావాసద్భావములు (ఉత్పత్తివినాశములు) కాన్పించుచున్నందున వానియొక్కసద్భావాసద్భావములు యేది సాక్షిగాఁగలిగియున్నవో అది యుత్పత్తివినాశభేదములులేని ఆత్మ. ఎటులనగా లోకముయొక్కప్రకాశమున్ను అప్రకాశమున్ను, ఎవ్వఁడు కారణముగఁ గలిగియున్నవో, ఆసూర్యుఁడు ప్రకాశాప్రకాశభేదము లేనివాఁడని తెలియఁబడుచున్నదిగదా? ఈప్రకారముగ నెప్పు డేర్పడినదో అప్పు డుత్పత్తివినాశములు లేని జ్ఞానమాత్రమే స్వరూపముగాగల 'తత్త్వమస్యా'దివాక్యముచేత తెలియఁబడుచున్న అర్థము అనుమానముచేతనే తెలియఁబడుచున్నందున, మరల 'తత్త్వమస్యా'దివాక్యమునకు నిరర్థకత్వము ప్రసక్తమైనది.

తా. ద్రష్టృదర్శనదృశ్యములు మూఁడును జాగ్రత్స్వప్నదశలయందు సత్తకలవై (ఉత్పత్తికలవై) యున్నవి. సుషుప్తిదశలయందు సత్తలేనివై (వినాశముకలవై) యున్నవి. ఈద్రష్టృదర్శనదృశ్యములయొక్క ఉత్పత్తివినాశములు దేనివలన తెలియఁబడుచున్నవో అనఁగా జాగ్రత్స్వప్నములయందు, ద్రష్టృదర్శనదృశ్యములు కలవని, సుషుప్తిదశయందు లేవని యేది తెలిసికొనుచున్నదో, అది యుత్పత్తివినాశములు లేనిదై సర్వదా ఏకరూపమై యుండును అని తెలియఁదగియున్నది. ఎటులనఁగా దృష్టాంతమును చెప్పెదము. ఈసకలప్రపంచమునకు సూర్యుఁడొకప్పుడు ప్రకాశమును ఒకప్పుడు అప్రకాశమును కలుగఁజేయుచుండును. తాను ప్రకాశాప్రకాశములు లేనివాఁడై సర్వదా ప్రకాశైకస్వరూపుఁడైకదా యుండును. అటులే ద్రష్టృదర్శనదృశ్యముల యొక్క సత్తాసత్తలను తెలియఁజేయుచున్న చిదాత్మ తాను సత్తాసత్తలులేనిదై సర్వదా సత్తామాత్రస్వరూపమై యుండునని తెలియుచున్నది. గనుక మీరు 'తత్త్వమస్యా'ది వాక్యముచేత తెలియఁబడేయర్థము ఉపయుక్తముకానిదై కేవల విజ్ఞానస్వరూపమైన కూటస్థాత్మయేగదా? ఇట్టి కూటస్థాత్మస్వరూపము అనుమానముచేత తెలియఁబడుచున్నందున 'తత్త్వమస్యా'ది వాక్యము ఈయర్థమును తెలియఁజేయవలసిన అగత్యములేదు. అందుచే 'తత్త్వమస్యా'దివాక్యము నిరర్థకముగ నున్నదనుచున్నదని భావము.

అవ. ఈప్రకారము సాంఖ్యవాది యాక్షేపించగా సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. నైషదోషః. ౧౨౯

దం-అ. ఇది దోషముకాదు.

తా. సాంఖ్యుఁడు చెప్పినవాక్యనైరర్థక్యదోషము యుక్తమైనది కాదని భావము.

అవ. ఎందువలన యుక్తమైనది కాదో హేతువును చెప్పుచున్నారు —

వాక్య. లింగవ్యవధానేన తత్ప్రతిపత్తేః. ౧౩౦

దం-అ. లింగముయొక్క వ్యవధానముచేత నాత్మస్వరూపము తెలియఁబడుచున్నందున ఇది దోషముకాదని యన్వయము.

తా. అనుమానముచేత కలిగేజ్ఞానము వస్తువును పరోక్షముగా తెలియఁజేయును గాని ప్రత్యక్షముగా తెలియఁజేయదు. ఆత్మస్వరూపము అనుమానముచేత తెలియఁబడినచో పరోక్షముగానే యుండును. పరోక్షముగానుండుట ఆత్మస్వభావమునకు విరుద్ధము. ఆత్మస్వరూపము 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ'' అనే శ్రుతిచేత నిత్యాపరోక్షరూపముగ చెప్పఁబడియున్నది. ఇట్టి ఆత్మస్వరూపమును శ్రుతివాక్యము

బోధించునుగాని, అనుమానము బోధించదు. గావున 'తత్త్వమస్యా'దివాక్యము నిరర్థకముగాదు. అని భావము.

అవ. మరల సాంఖ్యుఁ డాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. నను సాక్షాదపరోక్షాదాత్మ స్వభావేనాత్మనో హానోపాదానయోః సంబంధగ్రహాత్తాత్కిమతిశయం వాక్యం కుర్యాత్. ౧౩౧

దం-అ. ఓయీ! అవ్యవహితప్రత్యక్షమైన ఆత్మస్వరూపముచేత అనాత్మయొక్క హానోపాదానముల (ఉత్పత్తివినాశముల)యొక్క సంబంధమును గ్రహింపఁబడుచున్నందున శ్రుతివాక్య మేమి యతిశయమును చేయును?

తా. ద్రష్టృదర్శనదృశ్యములు అనాత్మపదార్థములు. ఇవి జాగ్రత్స్వప్నసుషుప్తియవస్థలయందు ఆగమాపాయములు (ఉత్పత్తివినాశములు) కలవై యుండును. ఈయుత్పత్తివినాశములు అవ్యవహితాపరోక్షమైన సాక్షిచైతన్యముచేత తెలియఁబడుచుండును. గనుక, అనాత్మలయొక్క ఉత్పత్తివినాశములకును, సాక్షిచైతన్యమునకును, సాక్ష్యసాక్షిసంబంధము కలిగియున్నట్లు తెలియఁబడుచున్నది. సాక్ష్యములైన అనాత్మలయొక్కయుత్పత్తివినాశములచేత సాక్షాదపరోక్షరూపమైన సాక్షిచైతన్య మూహింపఁబడుచున్నది గనుక, సాక్షిచైతన్యముయొక్క అపరోక్షజ్ఞానమున్ను అనుమానముచేతనే సిద్ధించుచున్నందున శ్రుతివాక్యము నాదరించ పనిలేదని భావము.

అవ. ఈప్రకారము సాంఖ్యవాదిచేసినపూర్వపక్షమునకు సిద్ధాంతవాది పరిహారమును చెప్పుట కుపక్రమించుచున్నారు.—

వాక్య. మైవంవోచః. ౧౩౨

దం-అ. ఈప్రకారముగా చెప్పకుము.

తా. సాక్షాదపరోక్షరూపమైన సాక్షిచైతన్యము అనుమానముచేతనే తెలియఁబడుచుండగా తాదృశసాక్షిస్వరూపజ్ఞానార్థమై 'తత్త్వమస్యా'దివాక్యము నాదరించ పనిలేదని చెప్పకూడదని భావము.

అవ. చెప్పకూడదనుటకు హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. లింగాధీనత్వాత్ తత్ప్రతిపత్తేః. ౧౩౩

దం-అ. ఆసాక్షిచైతన్యముయొక్క జ్ఞానము లింగమున కధీనమైనందున అలాగున చెప్పకూడదని వెనుకటివాక్యముతోటి యన్వయము.

తా. దృష్టాంతమును, హేతువును పురస్కరించుకొని అనుమానము ప్రవర్తిం

చును. అట్టియనుమానముచేత కలుగుజ్ఞానము సామాన్యరూపమైయుండునుగాని మైన అసాధారణాకారవిషయముగా నుండదు గనుక సాక్షిప్రకాశ్యమైన చేత గలిగే సాక్షిస్వరూపజ్ఞానము అనుమానవిషయమై యున్నందున సాక్షి యొక్క నిర్విశేషాసాధారణాకారమును ప్రకాశింపఁజేయఁజాలదు అని భా

అవ. ఈచెప్పినయర్థమును శ్రుతిప్రమాణములతోఁగూడ వివరించుచు

వాక్య. నహిలింగవ్యవధానే నాత్మప్రతిపత్తిః సాక్షాత్ప్రతిః త్తిర్భవతి "యమేవైషవృణుతే తేన లభ్య" ఇతిశ్రుతేః.

దం-అ. లింగముయొక్క వ్యవధానముచేత కలిగేజ్ఞానము సాక్షాద నము కానేరదుగదా? "యమేవైషవృణుతే తేనలభ్యః" అనేశ్రుతివల్ల లా తెలియఁబడుచున్నది.

తా. అనుమానముచేత కలిగేజ్ఞానము పరోక్షజ్ఞానమేగాని, అపరోక్ష చెప్పఁబడదు. అనుమానముచేత కలిగేయాత్మస్వరూపజ్ఞానము అపరోక్షరూ డదు గనుక, ఆత్మాపరోక్షజ్ఞానార్థమై, వాక్యము అవశ్యాపేక్షితమై యున్న ర్థము "యమేవైషవృణుతే తేన లభ్యః, తస్యైషఆత్మా వివృణుతే తనూం స్వాం మాత్మ యేముముక్షువును అనుగ్రహించునో వానిచేతనే యీపరమాత్మ వాఁడు. ఆముముక్షువునకే యీపరమాత్మ తనయొక్క సకలవిశేషశూన్యమైన రణాకారమును సాక్షాత్కరింపఁజేయును. అనఁగా పరమేశ్వరానుగ్రహము నిర్విశేషపరమాత్మజ్ఞానముకలుగును) అనేశ్రుతి ప్రతిపాదించుచున్నదని భా

అవ. ఏయర్థమును శ్లోకములో నిరూపించెద మనుచున్నారు.—

వాక్య. అత ఆహ. ౧౩౫

దం-అ. అందువలన చెప్పుచున్నారు.

శ్లో. లింగమస్తిత్వనిష్ఠత్వాన్న స్యాద్వాక్యార్థబోధకమ్,
సదసద్వ్యత్థితాత్మాయ మతో వాక్యాత్ప్రతీయతే.

దం-అ. లింగము సద్భావమందు నిష్ఠకలదైయున్నందున వాక్యార్థము చునదికాదు. ఈయాత్మ సద్భావాసద్భావములవల్ల విముక్తుఁడు గనుక వాక్య తెలియఁబడుచున్నాఁడు.

తా. లింగమనఁగా అనుమానప్రమాణములో వస్తుసత్తను నిరూపించ పర్వతమందు వహ్నియొక్క సత్తను నిరూపించుటకు హేతువు ధూమముగాన లింగమని చెప్పఁబడును. ఇట్టిలింగము వస్తువుయొక్క సత్తనుమాత్రము తెలియ

గాని ఆవస్తువుయొక్క అసాధారణాకారమును తెలియఁజేయఁజాలదు. అనఁగా పర్వతమందు కనుపడేధూమము అచ్చట వహ్నికలదని వహ్నియొక్కసద్భావమునుమాత్రము తెలియఁజేయుచేకాని, ఆవహ్నియొక్క ఔష్ణ్యప్రకాశాద్యసాధారణాకారమును తెలియఁజేయదు. ఔష్ణ్యప్రకాశాద్యసాధారణాకారము ప్రత్యక్షప్రమాణముచేత తెలియఁదగినదైయున్నది. ఆప్రకారమే సాక్షిచైతన్యప్రకాశమైన సాక్ష్యము (దృశ్యాదిత్రిపుటీప్రపంచము) సాక్షిచైతన్యముకలదని సాక్షిచైతన్యముయొక్క సద్భావమునుమాత్రము తెలియఁజేయునుగాని, ఆసాక్షిచైతన్యముయొక్క కాలత్రయాబాధ్యత్వ పరిపూర్ణత్వాద్వితీయత్వాద్యాకారమును తెలియఁజేయఁజాలదు. ఆత్మస్వరూపము సత్త్వాసత్త్వాదిసర్వవికల్పశూన్యమై యున్నది. ఇట్టియాత్మయొక్క అసాధారణాకారము వేదాంతవాక్యముచేతనే తెలియఁదగియున్నది గనుక, వాక్యము నిరర్థకమని చెప్పినది న్యాయముకాద భావము.

అవ. సాంఖ్యవాది మఱియొకవిధముగా మరల నాక్షేపించుచున్నాఁడు.-

వాక్య. నను యది వ్యావృత్త సదసద్వికల్పజాలం వస్త్వభీష్టం
వాక్యాద్భవత స్తథాపి తు ఉత్సార్యతే వాక్యవిషయా
తృష్ణా తస్మా దంతరేణాపి వాక్యశ్రవణం నిరస్తాశేషవిక
ల్పమాగోపాలావిపాలపండితం సుషుప్తే వస్తు సిద్ధమతో
నార్థో వాక్యశ్రవణేన. ౧౩౬

దం-అ. ఓయీ! నివర్తింపఁబడిన సత్త్వాసత్త్వాది వికల్పసముదాయము కల ఆత్మస్వరూపము వాక్యమువలన తెలియఁబడునని నీకు సమ్మతమైయుండిన నుండనిమ్ము. అయినప్పటికి వాక్యమునందుగల అపేక్ష నిరాకరింపఁబడుచున్నది. ఎందువల్లననఁగా వేదాంతవాక్యశ్రవణము లేకపోయినప్పటికి సుషుప్తికాలమందు నిరసింపఁబడిన సకలవిశేషములుగల ఆత్మవస్తువు ప్రకాశించుట, గోవులను గొఱ్ఱెలను కాచువారు మొదలు పండితులవఱకు సిద్ధమైయున్నది గనుక వాక్యశ్రవణముతోటి ప్రయోజనములేదు.

తా. సకలవిశేషశూన్యమై పరిపూర్ణమైన ఆత్మస్వరూపము వాక్యమువలన తెలియఁబడునని నీకు సమ్మతమైయున్నదిగాని అట్టి ఆత్మస్వరూపమును తెలియుటకుగాను వేదాంతవాక్యము నపేక్షించుపని కనుపడలేదు. ఎందువల్లననఁగా, పండితులకు పామరులకు అందఱకును సుషుప్తిదశయను నొకదశకలదుగదా? ఆదశయందు సకలవిశేషరహితమై, అద్వితీయమైన ఆత్మస్వరూపము వేదాంతవాక్యశ్రవణమును చేయని గొల్లలుమొదలుకొని శాస్త్రజ్ఞులవఱకు నందఱకును స్ఫురించుచున్నది గనుక, వాక్యముచేతనే అద్వి

తీయబ్రహ్మస్వరూపజ్ఞానము కలుగుననే ఆశను పొందఁదగదు; కావున వాక్యము నిరర్థకమే నని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. నైతదేవం. ౧౩౭

దం-అ. ఇది ఈలాగునకాదు.

తా. వాక్యము నిరర్థకమని సాంఖ్యుఁడు చెప్పినది యుక్తము కాదని భావము.

అవ. సాంఖ్యవాది ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. కింకారణమ్? ౧౩౮

దం-అ. ఏమికారణము?

తా. నేను చెప్పినవాక్యనైరర్థక్య మెందువలన యుక్తముకాదని భావము.

అవ సిద్ధాంతవాది తాను చెప్పిన అర్థమునకు హేతువును చెప్పుచున్నాఁడు.—

వాక్య. సర్వానర్థబీజస్యాత్మానవబోధస్య సుషుప్తే సంభవాత్. ౧౩౯

దం-అ. సకలమైన అనర్థములకు కారణమైన, ఆత్మనిష్ఠమైన అజ్ఞానము సుషుప్తిదశయందు సంభవించుచున్నందున నీలాగున కాదని వెనుకటివాక్యముతో నన్వయము.

తా. కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖాదిసమస్తానర్థములకు మూలమైనది అజ్ఞానము. ఇట్టి యజ్ఞానము సుషుప్తిదశలో కలిగియున్నది గనుక, సకల విశేషశూన్యమైన కూటస్థాత్మస్వరూపము సుషుప్తిదశలో స్ఫురించదని భావము.

అవ. సుషుప్తియం దజ్ఞానము కలదనేయర్థమును దృఢపఱచుచున్నారు —

వాక్య. యది హి సుషుప్తేఽజ్ఞానం నాభవిష్యదంతరేణాపి
వేదాంతవాక్యశ్రవణమనననిదిధ్యాసనాన్యహం బ్రహ్మా
స్మీత్యధ్యవసాయాత్సర్వప్రాణభృతామపి స్వరసత ఏవ
సుషుప్తప్రతిపత్తేః సకలసంసారోచ్ఛిత్తిప్రసంగః. ౧౪౦

దం-అ. సుషుప్తిదశయం దజ్ఞానము సంభవించదని చెప్పినయెడల, వేదాంతవాక్యములయొక్క శ్రవణమనననిదిధ్యాసనములు లేకనే 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మానైతిని) అనే నిశ్చయజ్ఞానమువలన సకలమైన జీవులకును స్వరసముగానే సుషుప్తికాలీనజ్ఞానమువలన సమస్తమైనసంసారమునకు విచ్ఛేదము కలుగును (ప్రసక్తమౌను).

తా. సుషుప్తికాలమం దజ్ఞానములేదని చెప్పఁదగదు. ఆలాగున లేదని చెప్పినయెడల, వేదాంతవాక్యములయొక్క శ్రవణమనననిదిధ్యాసనములను చేయకనే ఆత్మ

తత్త్వజ్ఞానము సకలమైనజనులకు కలుగుచున్నది గనుక, అందఱకును సులభముగా మోక్షము కలుగవచ్చునని భావము.

అవ. ఓయీ! సుషుప్తిదశయం దందఱకును సకలసాంసారికదుఃఖనివృత్తిపూర్వకముగా కైవల్యప్రాప్తికలుగుచున్నదని యంగీకరించెదమని పూర్వవాది శంకించగా దానికి ఉత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. న చ కైవల్యా త్పునరుత్థానం న్యాయ్యం. ౧౮౧

దం-అ. మోక్షమువలన మరల లేచివచ్చుట యుక్తము కానేరదు.

తా. సుషుప్తిదశయందు కైవల్యమును పొందినచో మరల జాగ్రద్దశ నొంది సాంసారికదుఃఖములను పొందుట యుక్తముకాదు. 'న చ పునరావృత్తయే' యనుశ్రుతి మోక్షమును పొందినవారికి మరల సాంసారికప్రాప్తి లేదనిగదా చెప్పుచున్నది. అని భావము.

అవ. కైవల్యమును పొందినవానికి మరల ఉత్థానము వలదని చెప్పినచో నేమి బాధకమో దాని చెప్పుచున్నారు.—

వాక్య. అనిర్మోక్షప్రసంగాత్. ౧౮౨

దం-అ. మోక్షాభావము ప్రసక్తమగుచున్నందున న్యాయ్యముకాదని వెనుకటి వాక్యముతో నన్వయము.

తా. కైవల్యమును పొందినవారికి మరల సంసారము ప్రాప్తించునని చెప్పినచో నెప్పటికిని సంసారములోనుండి విమోచనము కలుగనేరదని భావము.

అవ. పూర్వపక్షవాదిచేయునట్టి మఱియొకశంకను సిద్ధాంతవాది యనువదించి పరిహరించుచున్నాఁడు.—

వాక్య. న చాన్య ఏవ సుషుప్తోఽన్య ఏవోత్థిత ఇతి వక్తుం శక్యం. ౧౮౩

దం-అ. సుషుప్తిదశనొందినవాఁడొకఁడనిన్ని, మరల జాగ్రద్దశ నొందినవాఁడు మఱియొకఁడనిన్ని చెప్పుటకు శక్యముకాదు.

తా. సుషుప్తిదశలోఁగలిగిన ఆత్మతత్త్వజ్ఞానమువల్ల ముక్తినొందినజీవుఁ డొకఁడనిన్ని, మరల జాగ్రదవస్థలో సంసారదుఃఖముల ననుభవించుజీవుఁ డింకొకఁడనిన్ని ఇరువురును ఒకటిగాదు గనుక, కైవల్యమును పొందినవానికి పునరుత్థానము లేనేలేదు అను సంశయమును శంకించుట తగదని భావము.

అవ. ఎందువలన తగదనఁగా హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. నాద్రాక్షం మహం సుషుప్తేఽన్య త్కించిదపీత్యుత్థి
తస్య ప్రత్యభిజ్ఞానదర్శనాత్. ౧౪౪

దం-అ. 'నేను సుషుప్తికాలమున మఱియొకదానిని దేనిని చూడక
యని నిద్రబోయి లేచినవానియొక్క ప్రత్యభిజ్ఞ కనుపడుచున్నందున ఆలాగ
టకు శక్యముకాదని వెనుకటివాక్యముతో నన్వయించవలయును.

తా. నిదురబోయి లేచినవాఁడు 'నేను నిద్రాకాలమున దేనిని మఱిరొ
చూచినవాఁడను కాన'ని యనుసంధించును. అనుసంధానమునుపట్టి
నిదురఁబోయినవాఁడును, లేచినవాఁడు నొక్కఁడే యని తెలియఁబడుచు
వెవ్వేఱని తెలియఁబడలేదు. కావున నిదురఁబోయినవాఁడొకఁడనియు, నిదుర
డింకొకఁడనియు చెప్పఁదగదని భావము.

అవ. సిద్ధాంతవాది తాను నిర్వహించినయర్థమును నిగమించుచున్నాఁ

వాక్య. తస్మాదవశ్యం సుషుప్తే ఽజ్ఞాన మభ్యుపగంతవ్యమ్.

దం-అ. ఆహేతువువలన అవశ్యముగా సుషుప్తికాలమం దజ్ఞానము న
వలయును.

తా. స్పష్టము.

అవ. పూర్వపక్షవాది మరల మఱియొకవిధముగా నాక్షేపించుచున్నాఁ

వాక్య. నను యది తత్రాజ్ఞానమభవిష్యద్రాగద్వేష ఘటా
జ్ఞానాదివత్ప్రత్యక్షమభవిష్యద్యదేహాలోకే ఘటం
న జానామీత్యజ్ఞాన మవ్యవహితం ప్రత్యక్షమ్. ౧౪౬

దం-అ. ఓయీ! ఆసుషుప్తి అజ్ఞానము కలిగియుండినచో, రాగద్వేష
జ్ఞానము మొదలగువానివలె ప్రత్యక్షముగా నుండవలసియుండును. ఈలోక
ఘటము నెఱుంగనని అజ్ఞానము అవ్యవధానముగా ప్రత్యక్షమైయుండునో.

తా. సుషుప్తిదశయం దజ్ఞానము గలదని చెప్పిన నాయజ్ఞానము
ప్రత్యక్షముగా కనుపడుచుండే రాగద్వేషాదులవలె ప్రత్యక్షముగా కనుపడవ
డును. ఈలోకములో ఘటాజ్ఞానము మొదలగు నజ్ఞానములు 'నేను ఘటము నె
నేను పటము నెఱుఁగను' ఇత్యాదివ్యవహారములచే ప్రత్యక్షముగా కాన్పించు
రాగద్వేషాదులున్ను 'నేను దీనియం దాసక్తిగలిగియున్నాను, నాకు దీనియం
లేదు' అని ఇత్యాదివ్యవహారములచేత ప్రత్యక్షములుగా నున్నవి. ఇటులే సుష

మందు అజ్ఞానము ప్రత్యక్షముగా కనుపడుటలేదుగదా? గనుక సుషుప్తికాలమున నజ్ఞానము కలదని చెప్పఁదగదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పెదనని ప్రతిజ్ఞను చేయుచున్నాఁడు.—

వాక్య. అత్రోచ్యతే. ౧౮౭

దం-అ. దీనియందు చెప్పఁబడును.

తా. ఈపూర్వపక్షమునందు సమాధానము చెప్పఁబడునని భావము.

అవ. ఏమని సమాధానము చెప్పఁబడునో చెప్పుచున్నారు దానిని.—

వాక్య. న. ౧౮౮

దం-అ. కాదు.

తా. సుషుప్తిదశయం దజ్ఞానము ప్రత్యక్షముగా కనుపడనందున లేదని చెప్పుటయుక్తము కాదని భావము.

అవ. ఎందువలన యుక్తముకాదో హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. అభివ్యంజకాభావాత్. ౧౮౯

దం-అ. ప్రకాశింపఁజేయువస్తువులేనందున ప్రత్యక్షముగాకనుపడలేదని శేషము.

తా. సకలమైనపదార్థముల కంతఃకరణముతో సంబంధముకలిగియుండునప్పుడే విశదప్రత్యక్షము కలిగియుండును. అజ్ఞానమును జాగ్రత్స్వప్నములయందు అంతఃకరణమునకు సంబంధించియున్నందున విశదముగా ప్రత్యక్షమైయున్నది. కావున సకలపదార్థములున్ను, అజ్ఞానమున్ను విశదముగా ప్రకాశించుటకు కారణము అంతఃకరణమైయున్నది. అట్టి అంతఃకరణము సుషుప్తిదశయందు లీనమైపోయినందున అజ్ఞానము విశదముగా ప్రత్యక్షముగా లేదుగాని సాక్షి ప్రత్యక్షసిద్ధమై యున్నదని భావము.

అవ. పూర్వపక్షవాదిచేఁ జేయఁబడు ప్రశ్న ననువదించి యుత్తరమును చెప్పుట నుపక్రమించుచున్నారు.—

వాక్య. కథమభివ్యంజకాభావ ఇతి చేత్ శృణు. ౧౯౦

దం-అ. ప్రకాశకవస్తువు లేకపోవుట యెట్టిదనిన, వినుము.

తా. సుషుప్తిదశయం దజ్ఞానమును ప్రకాశింపఁజేయు నంతఃకరణములేదని యెట్లు చెప్పుచున్నావో వినుము. దానిని నిరూపించెదమని భావము.

శ్లో. బాహ్యాం వృత్తిమనుత్పాద్య వ్యక్తిః స్యాన్నాహమో యథా,
నష్టేఽంతఃకరణం తద్వత్ ధ్వాంతస్య వ్యక్తిరంజసీ. ౯౮

దం-అ. బాహ్యమైనవృత్తిని పుట్టించక అహమర్థమునకు విశదప్ర లేదో అటులే అంతఃకరణమువినాగా అజ్ఞానమునకు విశదప్రకాశవ లేదు.

తా. అహమర్థ మనఁగా నంతఃకరణావచ్ఛిన్నచైతన్యము, సర్వద చున్నను బాహ్యములైన ఘటాదివిషయములయందు అంతఃకరణవృత్తి విశదముగా ప్రకాశించుటలేదు. అనఁగా 'ఘటమహం జానామి' (నేను గుదును) ఇత్యాద్యవ్యవహారములయందు ఘటాదివిషయాకారవృత్తి బుట్టి మర్థము ఘటాదివిషయములవలె విశదముగా ప్రకాశించుచున్నది. యందు కేవలము అవిశదముగా ప్రకాశించుచుండునని యర్థము. అటులే అంతఃకరణముతో సంబంధించినకాలములయందు విశదముగా ప్రకాశిం కాలములయందు సత్తారూపముగానుండి అవిశదముగా ప్రకాశించుచుం

అవ. మఱియొక పూర్వవాదియొక్కమతమును కనుపఱచుచున్నా

వాక్య. స్యాద్ద్రష్టురాత్మన ఇతి నిర్యుక్తిక మభిహిత త్వాహ.

దం-అ. మఱియొకఁడు గడచినయర్థమును జ్ఞాపకము తెచ్చి నందున అహంకారమున్ను ఈప్రకారమే ద్రష్టయగు నాత్మకు గమక యుక్తిశూన్యముగా చెప్పఁబడినదని చెప్పుచున్నారు.

తా. ౫౬ వ శ్లోకములో ఘటాదులు దృశ్యములయినందున దేహాదివిశిష్టాత్మబోధకములై యున్నవో అటులే అహంకారమున్ను దృశ్య మైన కూటస్థాత్మకు బోధకమై యున్నదని మేముచెప్పినయర్థమును య యుక్తియుక్తముగాదని ఒకానొకపూర్వవాది యాక్షేపించుచున్నా ఉత్తరశ్లోకము ౫౬ వ శ్లోకముతో సంబంధించినది గాని ౫౫ వ శ్లోకము చినది కాదని తెలియవలయును.

అవ. యుక్తియుక్తము గాదని చెప్పినందుకు హేతువు చున్నాఁడు.—

వాక్య. కిం కారణమ్?

దం-అ. ఏమికారణము?

తా. స్పష్టము.

అవ. పూర్వవాది చెప్పుకారణమును కనుపఱచుచున్నారు.—

వాక్య. అహం తత్ జ్ఞాత్రో ర్వివేకాప్రసిద్ధేః. ౧౫౩

దం-అ. అహంకారమునకును దానికి ద్రష్టయగు కూటస్థాత్మకును భేదము అప్రసిద్ధమైనందున నిర్యుక్తికముగా చెప్పఁబడినదని పూర్వవాక్యముతో నన్వయము.

అవ. ఈ వాక్యమును వివరించుచున్నారు.—

వాక్య. యథేహ దేవదత్తయోర్గ్రాహ్యగ్రాహకత్వేన స్ఫుట
తరో విభాగః ప్రసిద్ధే లోకేన తథేహాహంకారతత్ జ్ఞా
త్రోః విభాగో స్తీతి. ౧౫౪

దం-అ. ఈలోకమునందు ఘటమునకు దేవదత్తునకు దృశ్యత్వముచేతను ద్రష్టృత్వముచేతను స్పష్టమైనభేదము ఎట్లు ప్రసిద్ధమైయున్నదో ఆటులే యహంకారమునకును, దానికి ద్రష్టయైన చిదాత్మకును విభేదము లేదుగదా?

తా. ద్రష్టృదృశ్యములు భిన్నములై యున్నయెడల దృశ్యము ద్రష్టకుగమకమై యుండును. దేవదత్తునిచేతఁ జూడఁబడుచున్న ఘటమునకును, ఘటమును జూచుచున్న దేవదత్తునకును దృశ్యత్వద్రష్టృత్వరూపమైన భేదము అతిస్పష్టముగా లోకములో కనుపడుచున్నది. ఆటులే చిదాత్మచే చూడఁబడుచున్న అహంకారమునకును, అహంకారమును చూచుచున్న చిదాత్మకును దృశ్యత్వద్రష్టృత్వరూపమైన భేదము కనఁబడుటలేదు గనుక అహంకారము చిదాత్మకు గమకము కానేరదని భావము.

అవ. పూర్వపక్షవాదము నుపసంహరించుచున్నారు.—

వాక్య. తస్మా దసాధ్వేతదభిహితమితి. ౧౫౫

దం-అ. ఆహేతువువలన నిది అయుక్తముగా చెప్ప బడినదని చెప్పినాఁడు.

తా. ద్రష్టృదృశ్యములు అత్యంతభిన్నములై యుండినచో దృశ్యము ద్రష్టకు గమకముగా గలదు. అహంకారచిదాత్మలు అత్యంతభేదములై గనుపడనందున అహంకారము చిదాత్మకు గమకముకాదు గనుక ౧౫౬ వ శ్లోకములో అహంకారము చిదాత్మకు గమకమని చెప్పినది నిర్యుక్తికమని చెప్పుచున్నాఁడని భావము.

అవ. సిద్ధాంతవాది యీయాక్షేపమును నిరాకరింప నారంభించుచున్నాఁడు.—

వాక్య అత్రోచ్యతే. ౧౫౬

దం-అ. దీనియందు చెప్పఁబడును.

తా. ఈయాక్షేపమునందు సమాధానము చెప్పఁబడునని భావము.

శ్లో. దాహ్యదాహకతైకత్ర యథా స్యాదయపిణ్డదారుణోః,

జ్ఞేయజ్ఞాతృకతైవం స్యాదహం జ్ఞాత్రోః పరస్పరమ్. ౫౭

దం-అ. అగ్నికిని కాష్ఠమునకును (కొయ్యకును) దాహ్యదాహకభావము ఒక చోట యెటువలె కలదో ఇటువలెనే అహంకారమునకును చిదాత్మకును అన్యోన్యము జ్ఞేయజ్ఞాతృభావము కలదు.

తా. దాహ్యత్వము దారువునందును, దాహకత్వము అగ్నియందును ప్రత్యేకముగా నుండతగినవైనప్పటికిని, అగ్నిదారువులకు పరస్పరసంయోగము కలిగినప్పుడు దాహ్యత్వదాహకత్వములు రెండును ఒకచోటనే యున్నట్లు కనుపడుచున్నదిగదా? అటులే దృశ్యత్వము అహంకారమునందును, ద్రష్టృత్వము చిదాత్మయందును ప్రత్యేకముగా నుండతగినవైనప్పటికి అహంకారచిదాత్మలకు అన్యోన్యాధ్యాసము కలిగియున్నందున ఒకచోటనున్నట్లు కనుపడుచున్నవి అని భావము.—

అవ. ఓయీ ఘటపటాదులవలె అహంకారమున్ను సాక్షిచైతన్యమునకు దృశ్యముగా నున్నయెడల ఘటాదులకును, అహంకారమునకును దృశ్యత్వము సమానముగా నున్నందున ఘటాదులవలె అహంకారమున్ను ఇదం (ఇది) అనేజ్ఞానమునకు గోచరము కాదగియుండఁగా, అహం (నేను) అనేజ్ఞానమునకే గోచరము కావలసినదేమి? ఘటాదులున్ను అహం అనేజ్ఞానమునకు గోచరము కావలసియుండఁగా, ఇదం (ఇది) అనేజ్ఞానమునకే నియతముగా విషయములు కావలసినదేమి? అని యాక్షేపించగా నాయాక్షేపమునకు పరిహారముగ నుత్తరశ్లోకము నవతరింపఁజేయుచు ముందుగా దానికి ఉపయోగించేయర్థమును నిరూపించుచున్నారు.

వాక్య. ఏవం తావదవిద్యోత్థస్యాంతఃకరణస్య బాహ్యవిషయనిమిత్తరూపావచ్ఛేదాయ అహం వృత్తిః వ్యాప్రియతే. ౧౫౭

దం-అ. ఈప్రకారము బాహ్యములయిన విషయములే నిమిత్తముగాగల ఆకారముచేత పరిచ్ఛేదించుటకు 'అహం' అనేవృత్తి వ్యాపించుచున్నది.

తా. అంతఃకరణము అవిద్యానిర్మితమైయున్నది. ఇట్టి అంతఃకరణము బాహ్యములై శబ్దాదివిషయములయందు సంబంధించి తత్తద్విషయాకారముగా పరిణమించుచుండును గనుక, ఇట్టి అంతఃకరణముచేత శబ్దాదివిషయములను విభజించి తెలియుంటకొఱకు అంతఃకరణమందు 'అహం' అనేవృత్తి పుట్టుచున్నదని భావము. 'ఘటమహంజానామి' (ఘటమును నేను తెలియుచున్నాను) అనే వ్యవహారమునందు అంతఃకరణమునకు ఘటాకారమైనవృత్తి ఏలాగున పుట్టుచున్నదో, ఆలాగుననే 'అహం' అనే

వృత్తియును పుట్టుచున్నది. 'అహం' అనేవృత్తిపుట్టనియెడల అన్యులచేఁ దెలియఁబడిన ఘటమునకును భేదములేకపోవును. అని అభిప్రాయము.

అవ. అంతఃకరణమందు 'అహం' అనేవృత్తి పుట్టినందున ఘటాదివిషయము పరిచ్ఛేదింపఁబడినను, అంతః కరణము ఏలాగున ప్రతీతినొందు ననగా చెప్పుచున్నారు.—

వాక్య. తయావచ్ఛిన్నం సత్కూటస్థ ప్రత్యగాత్మోపాదానావబోధరూపస్య అవ్యవధానతయా విషయభావం ప్రతిపద్యత ఇతి. ౧౫౭

దం-అ. ఆ అహంవృత్తిచేత పరిచ్ఛేదింపఁబడినదై నిర్వికారమైన ప్రత్యగాత్మయే కారణముగాగల చిదాభాసస్వరూపమునకు (సాక్షికి) అవ్యవధానముగా విషయత్వమును బొందును.

తా. అంతఃకరణము 'అహం' వృత్తితో కూడుకొనియుండి జీవసాక్షికి అవ్యవధానముగా గోచరించును. కూటస్థాత్మచైతన్యము 'అహం' వృత్తితో కూడియున్న అంతఃకరణమందు ప్రతిబింబించును. ఆ ప్రతిబింబమే జీవసాక్షి యనంబడు. అట్టి జీవసాక్షికి గోచరించి 'అహం' అనే ఆకారముతో ప్రతీయమానమై యుండును. ఇదిగాక అంతఃకరణద్వారా సాక్షిచైతన్యమునకు గోచరించి ప్రకాశించుచున్న ఘటాదులవలెకాక, కేవల సాక్షిచైతన్యమునకు గోచరించి ప్రకాశించునని భావము.

అవ. అయినప్పటికి అంతఃకరణము ఘటాదులవలె 'ఇదం' (ఇది) అనిన్ని, మమ (నాది) అనిన్ని, కలదిగాక 'అహం' అనే ప్రతీతికలిగియుండుట కేమినిమిత్తమన చెప్పుచున్నారు.

వాక్య. తత్ర తయోః జ్ఞాత్రహంతా రూపయోః అవభాసకావభాస్యత్వ సంబంధవ్యతిరేకేణ నాన్యత్సంబంధాంతర ముపపద్యతే. ౧౫౮

దం-అ. ఈలాగుననుండగా, జ్ఞాతకును (సాక్షికిని) అహంకారమునకును, (అంతఃకరణమునకును) ప్రకాశకత్వ, ప్రకాశ్యత్వరూపమైన సంబంధముకంటే భిన్నముగా మఱియొకసంబంధము యుక్తముకాదు.—

తా. అంతఃకరణము ప్రకాశింపఁ జేయఁదగియున్నది. సాక్షిచైతన్యము ప్రకాశకమైయున్నది. ఇదియే అంతఃకరణసాక్షిచైతన్యములకు సంబంధముగాని మఱియొక సంబంధము కలిగియున్నట్టు కనుబడదు. కావున అంతఃకరణము 'అహం' అనే భాసిం

చుచున్నదిగాని, 'మమ' (నాది) అని ఆత్మీయముగా భాసించుటలేదు అని భావము.

అవ. అయితే ఘటాదులు 'ఇదం' అని, మమ అని ఆత్మీయములుగా ప్రకాశించుట కేమికారణమంటే చెప్పుచున్నారు.—

వాక్య. అహంతా రూపం త్వాత్మసాత్కృత్వా అహం కంచుకం పరిధాయ ఉపకార్యత్వోపకారకత్వశక్తిమస్సక్ బాహ్యావిషయేణోపకారిణావా అత్మాత్మీయం సంబంధం ప్రతిపద్యతే. ౧౬౦

దం-అ. అహంకారమును తనయధీనముగా జేసికొని, అంతఃకరణమనే చొక్కాయను తొడిగికొని, ప్రత్యగాత్మ తాను ఉపకరింపఁబడుటకును, ఉపకరించుటకును, సమర్థుఁడై ఉపకరించే బాహ్యవిషయముతోటిగాని, అపకరించే బాహ్యవిషయముతోటిగాని స్వస్వామిభావరూపమైన సంబంధమును పొందును.

తా. ప్రత్యగాత్మ అహంకారరూపమైన అంతఃకరణమును తనయం దారోపించుకొని, ఆయంతఃకరణముయొక్క పరిచ్ఛిన్నత్వాదిధర్మములు కలవాఁడై ఘటాదివిషయాములతోటి సంబంధించి వాటిచేత నుపకారమును అపకారమును బొందుచుండును. కావుననే ఘటాదివిషయములు తనవని, అభిమానించి వాటికి తాను స్వామినని, అవి తనకు స్వములని (సొత్తులని) భావించుచుండును. ఇట్టి స్వస్వామిసంబంధము ఘటాదివిషయములకును, చిదాత్మకును గలిగియున్నందున, ఘటాదులు 'మమ' అని ఆత్మీయములుగా ప్రతీతిగలవై యున్నవని భావము. అనఁగా అంతఃకరణప్రత్యగాత్మలకు ప్రకాశ్యప్రకాశకత్వసంబంధముమాత్రమే కలిగియున్నందున, అంతఃకరణము 'అహం' అని మాత్రము ప్రతీతమైయున్నది. ఘటాదివిషయములకు, ప్రత్యగాత్మకును ప్రకాశ్యప్రకాశకసంబంధము మాత్రమేగాక స్వస్వామి సంబంధమున్ను కలిగియున్నందున ఘటాదివిషయములు ఆత్మీయములుగా ప్రతీతములగుచున్నవని తాత్పర్యము.

వాక్య. తదేత దాహ. ౧౬౧

దం-అ. ఆ యీ యర్థమును చెప్పుచున్నాఁడు.

తా. ఈచెప్పినయర్థమును శ్లోకముతో చెప్పుచున్నాఁడని భావము.

శ్లో. ఇదం జ్ఞానం భవేత్ జ్ఞాతుః మమజ్ఞానం తథా హమః,
అజ్ఞానోపాధినేదం స్యా ద్విక్రియాతో౽హమో మమ. ౬౦

దం-అ. సాక్షిచైతన్యమునకు ఇదం (ఇది) అనేజ్ఞానము అగుచున్నది. ఆప్రకారమే అహమర్థమునకు (అంతఃకరణమునకు) మమ (నాది) అనేజ్ఞానము అగుచున్నది. అజ్ఞానము ఉపాధిగాఁగల చిదాభాసచేత 'ఇదం' అనేజ్ఞానము కలుగుచున్నది. అనంతరము అహమర్థమునకు మమ అనేవికారము కలుగుచున్నది-మఱియొకఅర్థము = అహంకారావశిష్టమైన సాక్షికి 'ఇదం' అని, అటువలెనే 'అహం' అనేజ్ఞానము కలుగుచున్నది. 'ఇదం' అనేజ్ఞానము అజ్ఞానోపాధిచేతనే కలుగుచున్నది, 'మమ' అనేజ్ఞానము అహంకారముయొక్క వికారముచేత కలుగుచున్నది.

తా. సాక్షిచైతన్యముచేత నవ్యవహితముగా ప్రకాశింపఁజేయబడినదై 'అహం' అనేవృత్తితోఁ గూడుకొన్నఅంతఃకరణమందు 'ఇదం' అనేజ్ఞానముమాత్రము సాక్షికి కలుగుచున్నది. ఆసాక్షిచైతన్యమే అంతఃకరణ తాదాత్మ్యమునొందినపుడు ఘటాదివిషయములతోఁటి సంబంధించి, తత్ప్రియుక్తములైన ఉపకారాపకారములను బొందుచున్నందున ఆసాక్షిచైతన్యమునకు ఘటాదివిషయములయందు 'మమ' అనేజ్ఞానమున్ను కలుగుచున్నది. ఇట్టి విభాగము ఎందువల్లకలుగుచున్నదనగా సాక్షిచైతన్యముమాత్రము ఉపాధిగాఁగలిగి ప్రకాశకముగా నేర్పడినప్పుడు ప్రకాశ్యములయందు 'ఇదం' అనేజ్ఞానముమాత్రము కలుగుచున్నది. ఆసాక్షిచైతన్యమే అంతఃకరణముద్వారా, బాహ్యవిషయములతో సంబంధించి వాటివలన నుపకారమును బొందినపుడు సంబంధాంతరము కలుగుచున్నందున 'మను' అనేజ్ఞానము కలుగుచున్నదని భావము.— ఈశ్లోకమునకే మఱియొకతాత్పర్యము= అహంకారముతోఁగూడియున్న సాక్షిచైతన్యమునకు ఘటాదివిషయములందు 'ఇదం' అని, 'మమ' అని రెండుజ్ఞానములు కలుగుచున్నవి. అందులో 'ఇదం' అనేజ్ఞానము కేవలాజ్ఞానోపాధిచేతనే కలుగును. 'మమ' అనేజ్ఞానము అహంకారముయొక్క వికారము (అంతఃకరణతాదాత్మ్యము) చేత కలుగుచున్నదని భావము.

అవ. చెప్పినవిభాగమందు ప్రమాణమును చూపించుటకు, ఉత్తరశ్లోకము ప్రవర్తించుచున్నది. అందుకొఱకు పూర్వశ్లోకములో ప్రతిపాదించినయర్థము ననువదించి, పూర్వపక్షవాది చేయునట్టిప్రశ్నను కనుపఱచుచున్నారు.—

వాక్య. ఏకస్యైవజ్ఞాతుః అంతర్బాహ్యనిమిత్తభేదాత్ విభిన్నేపి విషయే 'ఇదం మమేతి' జ్ఞానం ద్వైరూప్యం జాయ ఇత్యుక్తం అత్రోపక్రియమాణాపక్రియమాణ స్యైవజ్ఞాతుః విషయే మమప్రత్యయోభవతి, విపర్యయేచ ఇదం ప్రత్యయఇతి కథమవగమ్యతే. ౧౬౨

దం-అ. ఒకసాక్షికి ఆంతరమని బాహ్యమని కారణముయొక్క భేదమువలన భిన్నమైనవిషయమునందు 'ఇదం' అని, 'మమ' అని జ్ఞానము రెండువిధములుగా పుట్టునని చెప్పఁబడినది. దీనియందు ఉపకరింపఁబడుచు అపకరింపఁబడుచున్న జ్ఞాతకే(సాక్షికే) విషయమందు 'మమ' అనేజ్ఞానము కలుగును. విపరీతమందు 'ఇదం' అనేజ్ఞానము ఎట్లు తెలియఁబడుచున్నది.

తా. విషయము ఆంతరమని, బాహ్యమని రెండువిధములు, అందులో ఆంతర విషయము అంతఃకరణము (అహంకారము); బాహ్యవిషయము ఘటాదికము. వీటి యందు జ్ఞాతయగు సాక్షికి, 'ఇదం' అని 'మమ' అని రెండువిధములుగా జ్ఞానము పుట్టుచున్నదని పూర్వశ్లోకములో చెప్పఁబడినది. అందులో సాక్షికి ఉపకారాపకారములను చేయుచున్నవిషయములయందే, సాక్షికి 'మమ' అనే ఆత్మీయజ్ఞానము కలుగుచున్నది. ఉపకారాపకారములు చేయనివిషయమందు 'ఇదం' అనేజ్ఞానము కలుగుచున్నదిగాని 'మమ' అనేజ్ఞానము కలుగదనియే ప్రమాణముచేత తెలియఁబడినదని భావము.

అవ. సిద్ధాంతవాది ప్రమాణమును చూపుచున్నాఁడు.—

వాక్య. అవగమ్యతామన్వయవ్యతిరేకాభ్యామ్. ౧౬౩

దం-అ. అన్వయవ్యతిరేకములచే తెలియఁబడుఁగాక.

తా. అన్వయవ్యతిరేకములచే ప్రమాణముచేత మేము చెప్పిన భావమును తెలియవలయునని భావము.

అవ. ఆయన్వయవ్యతిరేకము లెట్టివని, శ్లోకము నవతరింపఁజేయుచున్నారు.

వాక్య. తత్కథమితిచేత్. ౧౬౪

దం-అ. అవి ఎట్టులనిన చెప్పుచున్నారు.

తా. అన్వయవ్యతిరేకము లనఁ నెట్టివి? వాటివలన మీరు చెప్పినయర్థము మేలాగున తెలియును? అనఁగా చెప్పుచున్నారని భావము.

శ్లో. అనుపక్రియమాణత్వాజ్జ్ఞాతు స్స్యా న్నహం మమ,
ఘటాదిష్విదం తు స్యా న్మోహమాత్రవ్యపాశ్రయాత్. ౬౧

దం-అ. అహంకారము సాక్షికి ఉపకారించనిదైనందున, ఘటాదులవలె 'మమ' అనేజ్ఞానము కలదికాదు. అజ్ఞానమాత్రముయొక్క ఆశ్రయమువలన 'ఇదం' అనేజ్ఞానము కలుగుచున్నది.

తా. అహంకారము ఆత్మచైతన్యమునకు ఉపకారమునుగాని, అపకారమును గానిజేయునది కానందున, అహంకారము ఘటాదులవలె 'మమ' అనేప్రత్యయమునకు

విషయము కానేరదు. అజ్ఞానోపాధికమైన చిదాభాసమును కలిగియున్నందున 'ఇదం' (ఇది) అని ప్రకాశించుటమాత్రమే కలిగియున్నదని భావము.—లోకములో తన కుపకారమును చేయుచున్న ఘటపటాదివస్తువులయందు 'నావి'యనే మదీయత్వ ప్రత్యయము కనబడుచున్నది. అపకారమును చేసే శత్రువులయందున్న వీరు నాశత్రువులని మదీయత్వప్రత్యయము కలుగుచున్నది. తనకు ఉపకారములుగాని ఘటపటాదుల యందును, అపకారములుగాని ఉదాసీనజనులయందును ఇవి 'వీరు' వారు అనేప్రత్యయము మాత్రము కలుగుచున్నది. అటులే ఆత్మకు, అహంకారము, ఉపకారాపకారములు రెంటిని చేయనందున 'ఇదం' అనేప్రత్యయముమాత్రము కలిగియున్నదని భావము.

అవ. ఉత్తరశ్లోకము నవతరింపఁజేయుచు పూర్వశ్లోకములో చెప్పిన అన్వయ యుక్తిని అనువదించుచున్నాఁడు.—

వాక్య. మోహ తత్కార్యాశ్రయత్వాత్ జ్ఞాతృత్వవిక్రియయోః పూర్వత్ర ఇదం మమ, జ్ఞానాన్వయః ప్రదర్శితం అథాధునా తద్వ్యతిరేకేణ వ్యతిరేకప్రదర్శనార్థమాహ. ౧౬౫

దం-అ. సాక్షిత్వమునకును వికారమునకును, అజ్ఞానము దానియొక్క కార్యమైన అంతఃకరణమును ఉపాధిగాగలిగియున్నందున 'ఇదం' అనే, 'మమ' అనే, ప్రత్యయములయొక్క సంబంధము పూర్వశ్లోకములోఁ జూపఁబడినది. ఇఁకను ఇప్పుడు అజ్ఞానతత్కార్యముల అభావముచేత 'ఇదం; మమ' అనేజ్ఞానములయొక్క అభావమును కనుపఱచుచున్నాఁడు.

తా. చిదాత్మకు అహంకారసాక్షిత్వము (అహంకారమును ప్రకాశింపఁజేయుట) అజ్ఞానోపాధిచేత సంభవించినది. ఘటాదివిషయప్రకాశకత్వము, అజ్ఞానవిషయమై నానావిధవిషయాకారముగ పరిణమించుచున్న అంతఃకరణోపాధిచేత సంభవించినది గావున, చిదాత్మకు అజ్ఞానోపాధిద్వారా, ఘటాదివిషయములయందు 'మమ' అనేజ్ఞానము కలిగినదని పూర్వగ్రంథములో చెప్పఁబడినది. ఇఁకను చిదాత్మకు అజ్ఞానోపాధ్యంతఃకరణోపాధులు లేనిసమయములయందు 'ఇదం' జ్ఞానముగాని, 'మమ' జ్ఞానముగాని కలుగనేరదని ప్రతిపాదించుటకొఱకు ఉత్తరశ్లోకము ప్రవర్తించుచున్నదనిభావము.

శ్లో. విక్రియాజ్ఞానశూన్యత్వాత్ నేదం న చ మమాత్మనః,
ఉత్థితస్య సతోఽజ్ఞానం నాహ మజ్ఞాసిషం యతః. ౬౨

దం-అ. చిదాత్మకు సుషుప్తికాలమందు అంతఃకరణోపాధ్య జ్ఞానోపాధులు లేనందున 'ఇదం' జ్ఞానములేదు; 'మమ' జ్ఞానమున్ను లేదు. ఎందువల్లననగా 'నేను ఎఱుఁగనైతి' ననే యజ్ఞానము నిద్రమేలుకొనినవానికే సంభవించుచున్నది.

తా. సుషుప్తిదశలో శబ్దాదివిషయాకారముగ పరిణమించు, అంతఃకరణము, దానికి కారణమైన అజ్ఞానము తోరెంపునులేవు. కావున చిదాత్మకు 'ఇదం' జ్ఞానము గాని, 'మమ' జ్ఞానముగాని యున్నట్లు కనుపడలేదు, అయితే సుషుప్తిదశయందు అజ్ఞానములేదని యేలాగున చెప్పవచ్చును? ఇదివఱకు సుషుప్తిదశయం దజ్ఞానముకలదని సాధించియుంటిరిగదా? యని శంకించతగదు. ఎందువల్లనన, 'నాహ మజ్ఞాసిషం' (నేనెఱుంగను) 'అహమజ్ఞః (నేను అజ్ఞానముకలవాఁడను) అని అత్యంతస్పష్టముగా నజ్ఞానానుభవము సుషుప్తినుండి మేలుకొనినవానికే కలుగుచున్నదిగాని, సుషుప్తిలో నున్నవానికి కలుగలేదు కావున, సుషుప్తిదశయం దజ్ఞానములేదని చెప్పఁబడినది. పూర్వమందు అస్పష్టమైన అజ్ఞానము సుషుప్తియందు కలదని సాధించఁబడినది కావున విరోధము లేదని భావము.

అవ. ఉత్తరశ్లోకమునకు తాత్పర్యమును చెప్పుచున్నారు.—

వాక్య. ఆత్మానాత్మవివేకస్య ఇయత్తా ప్రదర్శనార్థమాహ. ౧౬౮

దం-అ. ఆత్మానాత్మలయొక్క వైలక్షణ్యజ్ఞానములకు, అవధికి (పరిమాణమును) చూపుటకు చెప్పుచున్నారు.

తా. ఆత్మయొక్కస్వరూప మిటువంటిదని, అనాత్మయొక్క స్వరూపము ఇటువంటిది అని, విభజించి వేర్వేఱుగా విశదముగా తెలియవలయునని పూర్వము చెప్పఁబడియున్నది గదా? ఎంతవఱకు తెలియుటచే నాయాత్మానాత్మవైలక్షణ్యజ్ఞానము సంపూర్ణమగునో దానిని ఉత్తరశ్లోకములో చెప్పుచున్నారని భావము.

శ్లో. వాక్యప్రత్యక్షమానాభ్యాం ఇయానర్థః ప్రతీయతే,
అనర్థకృత్తమోహాని ర్వాక్యాదేవ చిదాత్మనః. ౬౩

దం-అ. వాక్యప్రమాణముచేత, ప్రత్యక్షప్రమాణముచేత నింతమాత్రమైన అర్థము తెలియఁబడుచున్నది, చిదాత్మకు అనర్థసంపాదకమగు నజ్ఞానము యొక్క వినాశము 'తత్త్వమస్యా'దివాక్యమువల్లనే కలుగుచున్నది.

తా. 'కతమ ఆత్మా యోఽయం విజ్ఞానమయః' ఇత్యాదివాక్యములు 'త్వం' పదార్థమైనజీవస్వరూపమును శోధించి నిర్మలముగాజేసి తెలియఁజేయువాక్యప్రమాణము అన్వయవ్యతిరేకయుక్తులచే జీవస్వరూపమును అంతఃకరణాద్యనాత్మలకంటె విలక్షణముగా

తెలిసికొని అనుభవించుట ప్రత్యక్షప్రమాణము. ఈరెండుప్రమాణములచేత ఆత్మస్వరూపము స్థూలదేహము మొదలుకొని అహంకారముపఱకుగల సకలమైన అనాత్మపదార్థములకంటెం, అత్యంతవిలక్షణమని, కూటస్థమని, స్వప్రకాశమని తెలియఁబడును,ఇంతవఱకు తెలియుటయే ఆత్మానాత్మజ్ఞానమునకు పరమావధి. అయితే 'తత్త్వమస్యాది' వాక్యము నిష్ఫలమా యని శంకింపతగదు. చిదాత్మయందు నిరూఢమైయుండి ఆధ్యాత్మికతాపాది సకలానర్థములను సంపాదించుచున్న అనాద్యజ్ఞానము 'తత్త్వమస్యా'ది వాక్యశ్రవణమువల్లనే బుట్టిన తత్త్వజ్ఞానమువల్లనే నశించును గాని; వాక్యప్రత్యక్షజన్యమైన ఆత్మానాత్మవివేకజ్ఞానముచేత నశించదు. కావున 'తత్త్వమస్యా'దివాక్యము నిష్ఫలము కాదని భావము.

అవ. ఓయీ! 'తత్త్వమస్యాది' మహావాక్యమే అజ్ఞానమును నశింపఁజేయునని చెప్పినయెడల ఆ 'తత్వమస్యా'ది మహావాక్యము ఒకపర్యాయము వినఁబడినమాత్రాననే అజ్ఞాననివర్తకమైన జ్ఞానమును పుట్టించవలసియుండును. ప్రత్యక్షప్రమాణము (చక్షురాదులు) ఒకపర్యాయము ప్రవర్తించినమాత్రాననేగదా రూపసాక్షాత్కారాదులను గలుగఁజేయుచున్నది. అని పూర్వవాదిశంకించగా జ్ఞానోత్పత్తిప్రతిబంధకపాపములు నిశ్శేషముగా నశించిన అధికారికి సకృత్ శ్రవణముచేతనే అజ్ఞాననివృత్తిని వాక్యము కలుగజేయుననుటకు సంశయమే లేదు. ప్రతిబంధకపాపములుగల యధికారికిమాత్రము ప్రతిబంధకపాపములు నశించేవఱకు అన్వయవ్యతిరేకములతోఁగూడి మాటికిమాటికి వినిపింపబడుచున్నదై అజ్ఞాననివర్తిని కలుగఁజేయునని దృష్టాంతముతో ప్రతిపాదించుచు సిద్ధాంతవాది ఉత్తరగ్రంథమును ప్రతిపాదించుచున్నారు.

వాక్య. ద్వితీయాధ్యాయాదౌ శ్రోతృచతుష్టయ ముపన్యస్తమ్. తత్రకృత్స్నానాత్మ నివృత్తౌ సత్యాం యః ప్రత్యగాత్మన్యవాక్యార్థతాం ప్రతిపద్యతే సః క్షుపితాశేషాంతరాయహేతురితి న తం ప్రతివక్తవ్యం కించిదప్యవశిష్యతే యోఽపి వాక్యశ్రవణమాత్రాదేవ ప్రతిపద్యతే తస్యాప్యతీంద్రియ శక్తిమత్వాన్న కించిదప్యపేక్షితవ్యమస్తి. యశ్చ శ్రావిత తత్త్వమస్యాది వాక్యైః స్వయ మేవాన్వయవ్యతిరేకౌకృత్వా తదవసాన ఏవ వాక్యార్థం ప్రతిపద్యతేఽసావపి యథార్థం ప్రతిపన్న ఇతిపూర్వవదేవాపేక్షితవ్యః. యః పునరన్వయ వ్యతిరేకౌ కారయితావ్యపి

పునఃపునర్వాక్యం శ్రావ్యతే యథాభూతార్థ ప్రతిపత్త
యే తస్య కృతాన్వయవ్యతిరేకస్య సతః కథం వాక్యం
శ్రావ్యత ఇతి తదుచ్యతే. ౧౬౭

దం-అ. రెండవయధ్యాయాదియందు వాక్యశ్రవణముచేయువారు నలుగురని యుంపన్యసింపబడినది. అందులో సకలమైన అనాత్మపదార్థము నివర్తించినదైయుండ గా ఏపురుషుఁడు ప్రత్యగాత్మయందు అఖండాకారమును పొందునో వాఁడు నశించిన సకలవిఘ్నహేతువులుకలవాఁడు గాన, వానినిగూర్చి చెప్పవలసినది కొంచెమైనను శేషించినదియుండదు. ఎవ్వఁడు వాక్యమును వినినమాత్రముననే దెలియునో వానికిని ఇంద్రియగోచరముగాని శక్తిగలిగియున్నందున కొంచెమైనను అపేక్షించవలసినదిలేదు. ఎవ్వఁడు వినిపింపఁబడిన 'తత్త్వమస్యాది' వాక్యములుగలవాఁడై తనంతటతానే యన్వయవ్యతిరేకములనుచేసి దానియొక్క సమాప్తియందే అఖండజ్ఞానమును బొందునో అతఁడున్న వాస్తవార్థమును తెలిసినవాఁడు కావున పూర్వపుఅధికారులవలెనే ఉపేక్షించతగినవాఁడు. ఇఁకను ఎవ్వఁడు అన్వయవ్యతిరేకములను చేయించియును మాటిమాటికి వాక్యమునువినిపింపఁబడునో వాఁడు చేయఁబడిన యన్వయవ్యతిరేకములు గలవాఁడైయుండ వాక్యమెట్లు వినుపించునో దానిని చెప్పుచున్నాఁడు.

తా. రెండవయధ్యాయముయొక్క ఆరంభమున ''కృత్స్నానాత్మ నివృత్తౌ'' అనేశ్లోకము మొదలుకొని రెండుశ్లోకములయందు 'తత్త్వమస్యాదిమహావాక్యములను శ్రవణముచేయునట్టి అధికారులు నలువురని చెప్పఁబడియున్నది. ఆనలువురధికారులలో జన్మాంతరకృతపరిపాకముచేత జన్మించినతోడనే దేహేంద్రియాదులయందు ఆత్మత్వబుద్ధినివృత్తమై ప్రత్యగాత్మయందు 'అహంబ్రహ్మాస్మి' యని అఖండాకారజ్ఞానము ఒకానొక అధికారికి కలుగును. అతను విరాట్టు (హిరణ్యగర్భుని) వంటివాఁడు. అట్టి యధికారికి తత్త్వజ్ఞానోత్పత్తి ప్రతిబంధకపాపములన్నియు నివృత్తములైయుండును గనుక వాక్యార్థము అప్రయత్నముగానే స్ఫురించును. కావున అతనికి మహావాక్యము అర్థమును బోధించేప్రకారమును నిరూపించవలసినపనిలేదు. మఱియొకఅధికారికి మహావాక్యము నొకసారి వినినమాత్రాననే అఖండజ్ఞానము కలుగును. ఇతఁడు వాసిష్ఠరామాయణమున, ఉపశమప్రకరణములో చెప్పఁబడిన జనకమహారాజువంటివాఁడు. ఇతఁడు జన్మాంతరకృతమై అదృష్టముచేతనే తత్త్వజ్ఞానము పుట్టుచున్నందున, అత్యద్భుతచిత్తనైర్మల్యము కలవాఁడు గనుక, ఇతనికిని ఉపదేశక్రమమును నిరూపించవలసినపనిలేదు. మఱియొక అధికారి ముందుగా 'తత్త్వమస్యా'దివాక్యములు విని పిదప అన్వయవ్యతిరేకములను తా

స్వయముగానే యాలోచించి క్రమముగా అఖండాకారమును బొందును.అతఁడు తైత్తిరీయోపనిషత్తులో చెప్పిన భృగుమహాముని వంటివాఁడు. ఇతనున్ను స్వయముగానే అఖండజ్ఞానము కలవాఁడగును. గనుక అతనికిన్ని 'తత్త్వమస్యాది'మహావాక్యము ఏప్రకారము బోధించునో ఆప్రకారముగ నిరూపించవలసినపనిలేదు. ఇఁకను యేయధికారికి సదాచార్యులు పదార్థశోధకములయిన అన్వయవ్యతిరేకములను బోధించి మహావాక్యమును మాటిమాటికి ఉపదేశము చేయుచుందురో ఆయధికారి ఛాందోగ్యషష్ఠాధ్యాయములో చెప్పఁబడిన శ్వేతకేతువువంటివాఁడు. ఈయధికారిపదార్థశోధనోపాయములయిన అన్వయవ్యతిరేకములను చక్కగావిచారించి 'త్వం' పదార్థజ్ఞానముకలవాఁడై యుండగా తర్వాత నుపదేశింపఁబడిన 'తత్త్వమస్యాది'మహావాక్యము అతనికి ఏవిధముగా అఖండాకారబ్రహ్మజ్ఞానమును కలుగఁజేయునో ఆవిధమును ఇప్పుడు నిరూపింపవలసియున్నది గనుక దానిని సదృష్టాంతముగా ప్రతిపాదించెదమని భావము.

అవ. అందులో ముందుగా దృష్టాంతము చెప్పఁబడుచున్నది.—

శ్లో. నవసంఖ్యాహృతజ్ఞానో దశమో విభ్రమాద్యథా,
న వేత్తి దశమోఽస్మీతి వీక్షమాణోఽపి తాన్నవ. ౬౭

దం-అ. పదియవపురుషుఁడు భ్రాంతిచేత తొమ్మిదవసంఖ్యచే నపహరింపఁబడిన జ్ఞానముకలవాఁడై ఆతొమ్మిదిమందిని చూచుచున్నవాఁడైనను, తాను పదియవవాఁడనని యెటులెఱుంగఁడో అటులేనని యుత్తరశ్లోకముతో నన్వయము.

తా. లోకములో నొకకథ వినఁబడుచున్నది. ఒకపండితుని శిష్యులు పదుగురు గురువుకొఱకు సమిధలను, దర్భలను,పుష్పములను, ఫలములను తీసికొనిరాఁ దలంచి గ్రామములోనుండి పయనమై అరణ్యమునకుపోయి సమిధలు మొదలగువానిని సంపాదించికొని మరల గ్రామమునకు తర్లి యొకచోటికి చేరి 'గ్రామమునుండి వచ్చినవారము మనము పదుగురముకదా? అందఱము ఇచ్చటికి చేరితిమా లేదా'యని విమర్శించి అందులో నొకఁడు లెక్కపెట్టుట కారంభించి తనకంటె భిన్నులగుతొమ్మిదిమందిని చూచుచున్నవాఁడైనను, తొమ్మిదిమందిని లెక్కించుటయందే వ్యాపించిన చిత్తముగలవాఁడై తాను పదియవవాఁడనసే జ్ఞానములేక పదియవవాఁడులేఁడు; మృతినొందినాఁడని దుఃఖించుచుండగా నొకధార్మికుఁ డామార్గమునవచ్చి దుఃఖించువారిని చూచి కనికరించి పదియవవాఁడు మృతినొందలేదు. నీయెదుట నుండువారు తొమ్మండుగురు. నీవు పదవవాఁడని యుపదేశించెను. 'దశమస్త్వసి' (నీవు పదియవవాఁడవైతివి) అనే యుపదేశవాక్యశ్రవణముచేత తాను పదియవవాఁడ నని తనయొక్క దశమత్వము నెఱింగి పరమానందము నొందెను, అని భావము.

అవ. ఉత్తరశ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. అథ దృష్టాంతగతమర్థం దార్ష్టాంతికే సమర్పయిష్యన్నాహ.

దం-అ. అనంతరము దృష్టాంతమునందున్న అర్థమును దార్ష్టాంతికమందు జూపుచు చెప్పుచున్నాఁడు.

తా. స్పష్టము.

శ్లో. అపవిద్ధద్వయోఽప్యేవం తత్త్వమస్యాదినా వినా,
వేత్తి నైకలమాత్మానం నాన్వేష్యం చాత్ర కారణమ్. ౬౫

దం-అ. ఈప్రకారమే నిరసింపఁబడినద్వైతప్రపంచముకలవాఁడున్ను 'తత్త్వమస్యాది' వాక్యముతోటి వినాగా అద్వితీయమైన ఆత్మస్వరూపమును నెఱుంగఁజాలఁడు. దీనియందు హేతువు అన్వేషింప (వెతుక) తగినదికాదు.

తా. నవసంఖ్యచే నపహరింపఁబడినవివేకముగలవాఁడు 'దశమస్త్వమసి'యనే వాక్యశ్రవణము లేనియెడల తనయొక్క దశమత్వము నెట్లు తెలియలేఁడో అటులే జీవుఁడుగా నేర్పడియుండు ప్రత్యగాత్మ తాను సాక్షాత్పరమాత్మస్వరూపుఁడై యుండియుం దేహేంద్రియవిషయాది బాహ్యప్రపంచమునందు వ్యాపించు చిత్తముకలవాఁడై ఆ దేహేంద్రియాదిభేదప్రపంచము తనకంటె వేఱుగానున్నదని తెలిసియును 'తత్త్వమస్యాది' వాక్యమును వినినచో 'అహం బ్రహ్మాస్మి' యని తనయొక్క అద్వితీయ బ్రహ్మస్వరూపమును తెలియఁజాలఁడు? అయితే అద్వితీయమై, స్వయంప్రకాశమైయున్న ఆత్మయందు అజ్ఞానము ఏభాగున సంభవించినదో, తెలియుంటకు శక్యముగాదు. అజ్ఞానప్రాప్తి కారణమును విచారించవలసినది లేదని భావము.

అవ. పూర్వశ్లోకములోని చతుర్థపాదార్థమును వివరింపనారంభించుచున్నారు.—

వాక్య. నాన్వేషం చాత్ర కారణమిత్యుక్తం తత్కస్మాదితి
చోదితే ప్రత్యాహ అన్వేషణాసహిష్ణుత్వాదితి. ౧౬౪

దం-అ. దీనియందు హేతువు విచారించఁదగినది కాదని చెప్పఁబడెను. అది ఎందువలననని శంకించగా విచారించుటను సహించనిదైన దని ప్రత్యుత్తరము.

తా. అద్వితీయాత్మస్వరూపమదజ్ఞానముయొక్క సంబంధమునుగూర్చి కారణమును విచారించతగదని చెప్పిరి. ఎందువలన విచారింపఁదగదనఁగా అజ్ఞానము విచారించుటను ఓర్చునదికాదు. గనుక విచారింపఁదగదని చెప్పినారమని భావము.

వాక్య. తత్కథమిత్యాహ. ౧౬౫

దం—అ. అది ఎందువల్లననఁగా చెప్పుచున్నారు.

తా. అజ్ఞానము విచారమును సహించునదికాదని యేలాగున చెప్పవచ్చునో దానిని ప్పేదమని భావము.

శ్లో. సేయం భ్రాంతి ర్నిరాలంబా సర్వన్యాయవిరోధినీ,
సహతే న విచారం సా తమో యద్వద్దివాకరమ్. ౬౬

దం—అ. ఆ యీభ్రాంతి (అజ్ఞానము) నిరాధారమైనది. సకలమైనయుక్తులకు సిద్ధమైనదిన్ని గనుక, ఆయజ్ఞానము అంధకారము సూర్యుని యెట్లు సహించదోఆటులే నారమును సహించదు.

తా. ఆత్మయొక్క వాస్తవస్వరూపము తెలియంగకపోవుటయును, ఆత్మయందు ర్తృత్వాదివిపరీతాకారమును చూచుటయును అజ్ఞాన మనంబడును. ఇట్టి యజ్ఞానము కప్రసిద్ధములైన ఘటాదిపదార్థములవలె ప్రసిద్ధకారణములు కలదికాదు. ఇదిగాక యుక్తిచేతను నిరూపించుటకు తగినదికాదు. అజ్ఞానస్వరూపము ఎటువంటిదో విచా ంచుటకు ఆరంభించగానే కనుపడకుండా బోవును గనుక అంధకారము తన్ను నివర్తిం జేయం సూర్యప్రకాశమును యేలాగున సహించదో ఆలాగుననే తనకు నివర్తకమగు చారమును అజ్ఞానము సహించదని భావము.

అవ. ఓయీ! కర్తృత్వభోక్తృత్వాదికారణములతోగూడియున్న అజ్ఞానము ప్రమాణజన్యజ్ఞానమువలన నివర్తించేయెడల ప్రత్యక్షాది ప్రమాణాంతరజన్యజ్ఞానమువలన గాడా నివర్తించవచ్చును. అప్పుడు వాక్యము నిష్ప్రయోజనమేగదా యని శంకించగా త్తరమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. తస్యాః ఖల్వస్యాః అవిద్యాయాః భ్రాంతేః సమ్యక్
జ్ఞానోత్పత్తిద్వారేణ నివృత్తిః. ౧౭౦

దం—అ. ఆ యీ యవిద్య యనుభ్రాంతికి నివృత్తి సమీచీన జ్ఞానముయొక్క దుత్పత్తిద్వారా కలుగును.

శ్లో. బుభుత్సోచ్ఛేదినీ చాస్య సదసీత్యాదినా దృఢమ్,
ప్రతీచి ప్రతిపత్తి స్స్యా న్నాసౌ మానాంతరాద్భవేత్. ౬౭

దం—అ. ఈముముక్షువునకు తెలియవలయుననే ఇచ్ఛను నివారించుచున్న ప్రత్య గాత్మవిషయమైనజ్ఞానము 'తత్త్వమసీ'త్యాదివాక్యముచేత కలుగుచున్నది. ఈజ్ఞానము ప్రమాణాంతరముచేఁ గలుగనేరదు.

తా. కర్తృత్వాదిసకలానర్థసంపాదకమై ప్రత్యగాత్మయం దపరో
కనుపడుచున్న అవిద్య సమ్యక్జ్ఞానము పుట్టుటచేత నివర్తించును. సమ్యక్జ్ఞాన
'అహం బ్రహ్మాస్మి' అనేజ్ఞానము. ఇట్టిజ్ఞానము పరమాత్మ ఎప్పుడో తెలియవ
ఇచ్చను నివర్తింపఁజేయును గావున ఇట్టి బుభుత్సోచ్ఛేదకమైన ప్రత్యగాత్మ
జ్ఞానము 'తత్త్వమసీ' త్యాదివాక్యములవల్ల కలుగుచున్నదికాని ప్రమాణాంతర
కలుగనేరదు. కావున వాక్యము నిరర్థకముగాదు. అనఁగా కర్తృత్వభోక్తృతా
సంసారభ్రాంతికధిష్ఠానంబైన ప్రత్యగాత్మ, ప్రమాణాంతరగోచరము కానందు
శప్రత్యగాత్మవిషయకజ్ఞానము వేదాంత మహావాక్యములవలన కలుగవల
ప్రత్యక్షాదిప్రమాణాంతరములవలన కలుగనేరదని భావము.

అవ. ఓయీ! ప్రమాణాంతరముచేత తెలియ శక్యముగాని జ్ఞానమును
ఏలాగున కలుగజేయుటకు శక్తమగునని యాక్షేపించుకొని సమాధానమును
చున్నాఁడు.—

వాక్య. కథం పునర్వాక్యం ప్రతిపాదయత్యేవేతిచేత్ దృ
ష్టాంతోక్తిః. ౧౭౧

దం-అ. వాక్య మెట్లు ప్రతిపాదించుటకు శక్తమగునంటే దృష్టాంత
బడుచున్నది.

శ్లో. జిజ్ఞాసోర్దశమం యద్వన్నవాతిక్రమ్య తాంస్యతః,
త్వమేవ దశమోఽసీతి కుర్యాదేవం ప్రమాం వచః.

దం-అ. పదియవవానిని దెలియఁగోరినవాఁడై తొమ్మండుగుర నతిక్రమిం
ఖించుచున్నవానికి, 'నీవే పదియవవాఁడవై లివి' అనేవాక్యము యెటులో,
వేదాంతవాక్యము యథార్థజ్ఞానమును చేయును.

తా. ప్రమాణాంతరములచేత పుట్టింపఁదగినజ్ఞానమునే, వాక్యమున్ను పుట్
గాని, తదితరమైనజ్ఞానమును వాక్యము ఏలాగున పుట్టించుననగా వెనుక చెప్పిన
ములో తొమ్మిదిమందిని లెక్కించి పదియవ వాని నెఱుంగక తెలియఁగోరి
వానికి, ప్రత్యక్షాదిప్రమాణములు నేను పదియవవాఁడననే అపరోక్షయథార్థజ్ఞా
కలుగఁజేయలేదు. ఆప్తపురుషోపదిష్టంబైన 'దశమస్త్వమసి' (నీవు పదియవవా
అనేవాక్యమే నేను పదియవవాఁడనే యపరోక్షయథార్థజ్ఞానమును కలుగఁజే
దిగదా! ఇటులే దేహాద్యహంకారాద్యాత్మవస్తువుల నవలోకించుచు పరమాత్మ
నని పరమాత్మ తెలియ నిచ్ఛయించుచున్న ముముక్షువునకు 'నేనే పరమాత్మ

జ్ఞానమును ప్రత్యక్షాదిప్రమాణాంతరములు కలుగఁజేయఁజాలవు. 'తత్త్వమసీ' త్యాదిమహావాక్యములే కలుగఁజేయఁజాలు నని భావము.

అవ. ఓయీ! 'దశమ స్త్వమసి' యనువాక్యమువలన పుట్టినజ్ఞానము ప్రమాణాంతరజన్యజ్ఞానములచేత బంధింపఁబడనందున ప్రమాణమని చెప్పవచ్చును. 'తత్త్వమస్యాది' వాక్యమువల్ల పుట్టినజ్ఞానము తనకంటే పూర్వకాలమందు పుట్టియున్న దేహేంద్రియాది ద్వైతప్రపంచవిషయకజ్ఞానములచేతను తనకంటె ఉత్తరకాలమందు పుట్టుచున్న ద్వైతప్రపంచజ్ఞానములచేతను బాధింపఁబడును, గనుక ప్రమాణము కానేరదు. అని పూర్వపక్షవాది శంకించగా 'తత్త్వమస్యాది'వాక్యజన్యజ్ఞానము తనకంటె పూర్వకాలమునఁ బుట్టిన ద్వైతజ్ఞానముల నన్నింటిని నిశ్శేషముగా నివర్తింపఁజేసియే పుట్టుచున్నది. తనకంటె నుత్తరకాలమునందు తనకు బాధకములయిన ద్వైతజ్ఞానములను పుట్టనీయదు; కావున, ప్రమాణమే నని అభిప్రాయముతో సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. సా చ తత్త్వమస్యాదివాక్యశ్రవణజా ప్రేమ ఉత్ప
న్నత్వాదేవ నచ నైవమితి ప్రత్యయాంతరంజాయతే. ౧౭౨

దం-అ. 'తత్త్వమస్యా'దివాక్యశ్రవణముచేఁబుట్టిన ఆజ్ఞానము పుట్టినందువలననే ఈప్రకారము కాదనే జ్ఞానాంతరము పుట్టదు.

తా. 'తత్త్వమస్యాది'వాక్యశ్రవణముచేఁ బుట్టినదై అద్వితీయప్రత్యగాత్మయాథాత్మ్యజ్ఞానము పుట్టినపిదప తద్విరుద్ధమైన భేదజ్ఞానము పుట్టనేరదని భావము.

అవ. ఈయర్థమును దృష్టాంతముతో నుత్తరశ్లోకమున చెప్పెదమని చెప్పుచున్నారు.—

వాక్య. తదేతత్ దృష్టాంతేన ప్రతిపాదయతి. ౧౭౩

దం-అ. ఆ యీ యర్థమును దృష్టాంతముచేత ప్రతిపాదించుచున్నాఁడు.

శ్లో. దశమోఽసీతి వాక్యోత్థా న ధీరస్య విహన్యతే,
ఆదిమధ్యావసానేషు న నవస్వస్య సంశయః. ౭౯
ఏవం తత్త్వమసీత్యస్మాత్ ద్వైత మృత్పత్త్యగాత్మని,
సమ్యక్ జ్ఞాతత్వమర్థస్య జాయేతైవ ప్రమా దృఢా. ౮౦

దం-అ. 'దశమోసి' (పదియవవాఁడవైతివి) అనేవాక్యమువల్ల పుట్టినజ్ఞానము ఈపురుషునకు చెడిపోదు. ఆదిమధ్యాంతకాలములయందు, ఈపురుషునకు తొమ్మిదిమందియందు సంశయము లేదు ఈప్రకారము చక్కఁగా తెలియఁబడిన 'త్వం' పదార్థ

జ్ఞానముకలవానికి 'తత్త్వమసి' అనే యీవాక్యమువల్ల ప్రత్యగాత్మయందు ర్థకమైన దృఢమైనజ్ఞానము పుట్టనేపుట్టును. (ఇది ౯౯. ౭౦ శ్లోకము న్వయము.)

తా. 'దశమస్త్వమసి' యనేవాక్యమువల్ల నేనే పదియవవాఁడననే నము నిశ్చయముగా కలుగుచున్నది. ఎందువల్లనంటే తనఎదుటనున్న తొమ్మ లెక్కించుచున్న వీనికి నేను పదియవవాఁడననేజ్ఞానము కలుగుటకు పూర్వ అజ్ఞానము పుట్టే సమకాలమునందును, జ్ఞానము పుట్టినపిదపనున్ను ఎదుటనుం డుగురియందు సంశయములేదు గనుక, అనఁగా వీరిలో పదియవవాఁడు లేఁడా యనుసంశయమే లేదు గనుక, 'దశమస్త్వమసి' యనువాక్యమును 'అహమేవ దశమః' (నేనే పదియవవాఁడను) అనే నిశ్చయజ్ఞానము తప్పకు చున్నది. ఈప్రకారమే ముందుగా 'త్వం' పదార్థమును అన్వయవ్యతిరే విమర్శించి, దేహాద్యహంకారాంతపదార్థము లాత్మకాదని నిశ్చయించుకొని యు త్సువునకు 'తత్త్వమస్యా'దివాక్యమును వినఁగానే, సర్వద్వైతప్రపంచవాసనా సమర్థమైన, 'అహం బ్రహ్మాస్మి' (నేనే బ్రహ్మను) అనే దృఢాపరోక్షజ్ఞానము కలుగును. అని భావము.

అవ. ఈయర్థమునందు పూర్వపక్షవాది చేయునాక్షేపమును ప్రారంభించుచున్నాఁడు. ఏమని యాక్షేపించుచున్నాఁడో యాయాక్షేపప్ర చూపుచున్నాఁడు.—

వాక్య. ప్రత్యగాత్మని ప్రమోఽజాయత ఇత్యుక్తం తత్ర
చోద్యతే. కిం యథా ఘటాది ప్రమేయవిషయా ప్రమా
కర్త్రాదికారకభేదానపహ్నవేన జాయతే తథైవ ఉత అ
షకారకగ్రామోపమర్దేన కర్తుః ప్రత్యగాత్మనీతి. ౧౭

దం-అ. ప్రత్యగాత్మయందు యథార్థజ్ఞానము పుట్టుచున్నదని దానియందాక్షేపింపఁబడుచున్నది. ఘటాదిపదార్థములు విషయముగాగల నము కర్తమొదలగు కారకవిశేషములయొక్క నిరాకరణము లేకపోవుట కారముగపుట్టునో అటులే పుట్టునా? లేక సకలమైన కారకసముదాయ వినాశముచేత కర్తకు ప్రత్యగాత్మయందు పుట్టునా? యని యాక్షేపించు (ఇది ౧౭౩, ౧౭౪ వాక్యములకు చేర్చి దండాన్వయము.)

తా. లోకములో పుట్టుచున్నఘటాదిజ్ఞానము, కర్తృకర్మక్రియాద

యుంచి వాటిని బాధింపకయే యెటుల పుట్టుచున్నదో అటులే ప్రత్యగాత్మవిషయమైన అద్వితీయజ్ఞానము పుట్టునా? లేక, కర్తృ, కర్మ, క్రియాదిభేదముల నన్నింటిని నశింపఁజేసి తానుమాత్రము కేవలముగ పుట్టునా? యని విచారించెదము. వీటిలో మొదటి పక్షమునందు కర్తృకర్మాదిభేదప్రపంచము నశించనందున ప్రత్యగాత్మజ్ఞానమునకు అద్వితీయత్వము సిద్ధించదు. రెండవపక్షమునందు కర్తృకర్మాదిభేదము లేనందున, కర్త్రాదుల నాశ్రయించి పుట్టదగిన ప్రత్యగాత్మజ్ఞానమే కలుగనేరదు గావున, ప్రత్యగాత్మవిషయమైన అద్వైతజ్ఞానము పుట్టునని చెప్పుట యుక్తముకాదని భావము. (ఇది పై ౧౭౩, ౧౭౪ వాక్యములకు చేర్చి తాత్పర్యము.)

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పెదనని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతే. ౧౭౫

దం-అ. చెప్పఁబడును.

తా. పూర్వవాదిచేసిన యాక్షేపమునకు పరిహారమును చెప్పెదనని భావము.

శ్లో. ప్రత్యక్త్వాస్య స్వతోరూపం నిష్క్రియాకారకాఫలమ్,
అద్వితీయం తదిద్ధాధీః ప్రత్యగాత్మేవ లక్ష్యతే. ౨౧

దం-అ. ఈచిదాత్మకు ప్రత్యక్త్వము స్వాభావికమైన ఆకారము. అది క్రియాశూన్యము, కారకరహితము, ఫలశూన్యము, అద్వితీయము. ఆయాత్మతో ననువిద్ధమైన బుద్ధి ప్రత్యగాత్మవలె చూడఁబడుచున్నది.

తా. సకలక్రియాశూన్యమై కర్తృత్వకర్మత్వాదికారకములులేనిదై ఫలశూన్యమై సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమై సర్వపదార్థముల కాంతరమై యుండునట్టి స్వరూపము చిదాత్మకు స్వాభావికమైయున్నది. ఇట్టి చిదాత్మవిషయముగా పుట్టుచున్నజ్ఞానమున్ను నిష్క్రియత్వాదిరూపముగానే యుండును. ప్రత్యగాత్మజ్ఞానము పుట్టుటకు పూర్వము, జ్ఞానోత్పత్తిసాధనమైన ప్రమాతృప్రమాణాదిభేదప్రపంచము కలిగియున్నప్పటికి, జ్ఞానము పుట్టినపిదప ప్రమాతృప్రమాణాదిభేదప్రపంచము నశించును గనుక, ప్రత్యగాత్మజ్ఞానమునకు అనుత్పత్తిగాని, సద్వితీయత్వముగాని సంభవించదు. అయితే చిదాత్మస్వరూపము కర్తృత్వభోక్తృత్వాదులకు కలదై ప్రకాశించుచుండగా నిష్క్రియాదిరూపమని యేలాగున చెప్పవచ్చునంటే, చిదాత్మస్వభావముగాని నిష్క్రియాది రూపమేయైనప్పటికి అంతఃకరణమందుఅధ్యసింపఁబడినందున,ఆయంతఃకరణముయొక్క కర్తృత్వాదిధర్మములు చిదాత్మయందున్నట్లు ప్రకాశించుచున్నవి. అంతఃకరణమున్ను చిదాత్మప్రతిబింబము కలిగియున్నందున తానే చిదాత్మవలె ప్రకాశించుచున్నదని భావము.

అవ. చిదాత్మప్రతిబింబము బుద్ధియందు కలదనుట ఒకయుక్తిని జూపుచున్నారు.—

వాక్య. యస్మాదేవమ్. ౧౭౬

దం-అ. ఎందువలన ఈప్రకారముగా నున్నదో.

శ్లో. విపశ్చితోఽప్యతస్తస్యా మాత్మభావం వితన్వతే,
దవీ యస్యింద్రియార్థేషు క్షీయతే హ్యుత్తరోత్తరమ్. ౭౨

దం-అ. అందువలన విద్వాంసులును ఆబుద్ధియందు ఆత్మబుద్ధిని జేయుచున్నారు. దూరమందున్న ఇంద్రియములు మొదలగువానియందు ఉత్తరోత్తరముగ తగ్గిపోవుచున్నదిగదా?

తా. బుద్ధియందు చిదాత్మస్వరూపము అధ్యసింపఁబడియున్నందుననే, ఆత్మానాత్మవివేకముగల పండితులున్న వ్యవహారకాలమున అంతఃకరణమునే ఆత్మగా భ్రమించి తదనుకూలవ్యవహారముకలవారై యున్నారు. విద్వాంసులకుకూడా అంతఃకరణమందు ఆత్మభ్రాంతికలుగుచున్నందున, అంతఃకరణమం దాత్మచైతన్యము ప్రతిభాసించుచున్నదని నిశ్చయింపవలసియున్నది. బుద్ధికి దూరదూరముగానున్న ప్రాణములు, ఇంద్రియములు, దేహము, వీటియందు చిదాత్మ ప్రతిభాసము తక్కువగానున్నందున వానియం దాత్మబుద్ధియును క్రమక్రముముగా తక్కువగానే యున్నవి గనుక అంతఃకరణమునం దాత్మచైతన్యము ప్రతిబింబించియున్నందున, అంతఃకరణమునందుగల కర్తృత్వాదివికారములు ఆత్మయందున్నట్లు వ్యవహరింపఁబడుచున్నవిగాని వాస్తవముగా చిదాత్మయందు కర్తృత్వాదివికారములు లేవని భావము.

అవ. మఱియొక పూర్వవాదియొక్క ఆక్షేపము కనుపఱుచుచున్నాఁడు.—

వాక్య. ఆహ. ౧౭౭

దం-అ. చెప్పుచున్నాఁడు.

తా. పూర్వవాది చెప్పుచున్నాఁడు అనిభావము.

వాక్య. యది వాక్యమేవ యథాభూతార్థావబోధకం అథ కస్య హేతోః అవిద్యోత్థాపితస్య కర్తృత్వాదే రుపదేశః. ౧౭౮

దం-అ. 'తత్త్వమస్యా'ది వాక్యమే వాస్తవార్థమును బోధించునదైనదా? అయితే ఏమి కారణమువలన అజ్ఞానముచేత సంపాదింపఁబడిన కర్తృత్వాదివికారముయొక్క ఉపదేశము వినఁబడుచున్నది?

తా. 'తత్త్వమస్యా'దివాక్యమే ప్రత్యగాత్మయొక్క నిత్యనిర్వికారమైన పారమార్థికస్వరూపమును బోధించేయెడల 'కర్తా బోద్ధా విజ్ఞానాత్మా పురుషః' 'పిప్పలం స్వాద్వత్తి' ఇత్యాదిశ్రుతివాక్యములు 'త్వం'పదార్థమైన జీవునియందు కర్తృత్వభోక్తృత్వాది సంసారధర్మములను బోధించుట కేమికారణమని భావము.

వాక్య. ఇత్యుక్తే ప్రతివిధీయతే. ౧౭౯

దం-అ. ఈప్రకారము చెప్పఁబడగా సమాధానము చెప్పఁబడును.

తా. ఈప్రకారము పూర్వపక్షవాది యాక్షేపించగానే ఉత్తరశ్లోకములో సమాధానము చెప్పఁబడునని భావము.

శ్లో. భ్రాంతిప్రసిద్ధ్యానూద్యార్థం తత్తత్త్వం భ్రాంతిబాధయా,
అయం నేత్యుపదేశ్యేత తథైవం తత్త్వమిత్యపి. ౭౩

దం-అ. భ్రాంతిప్రసిద్ధిచేత సిద్ధమైన అర్థమును అనువదించి, ఇదికాదని బాధించుటచేత ఆవస్తువుయొక్క యాథార్థ్యమును ఎట్లుపదేశింపఁబడునో ఆటులే 'తత్త్వమసి' యనేవాక్యమున్ను ఉపదేశించును.

తా. ఈలోకములో నొకపురుషుఁడుస్థాణువునుజూచిపురుషుఁడేననిభ్రాంతినొందియుండగా, ఆభ్రాంతిని నివారించునట్టివాఁడు 'నీకు గనుపడునట్టిపురుషుఁడు స్థాణువుగాని పురుషుఁడుగాడు' అని ముందుగా భ్రాంతిచేత కనుపడుచున్న పురుషస్వరూపము ననువదించి, పిదప నిదిపురుషుఁడుగాఁడని నిషేధించి, స్థాణువేనని, స్థాణువుయొక్క వాస్తవస్వరూపమును బోధించును. ఆటులే, వేదాంతవాక్యములున్ను చిదాత్మకు అనాదిభ్రాంతిసిద్ధములైన కర్తృత్వాదిసంసారధర్మములను 'కర్తా'బోద్ధా' ఇత్యాదివాక్యములచేత ననువదించి 'నేతీ'త్యాదివాక్యములచేత నిషేధించి 'తత్త్వమసీ'త్యాదివాక్యములచేత ప్రత్యగాత్మయొక్క స్వరూపయాథార్థ్యమును బోధించుచున్నవని భావము.

వాక్య. ఇదమర్థం దృష్టాంతేన బుద్ధావారోపయతి. ౧౮౦

దం-అ. ఈయర్థమును దృష్టాంతముచేత బుద్ధియం దారోపించుచున్నాఁడు.

తా. అస్పష్టముగా చెప్పినదృష్టాంతమును విశదపఱచుచు పూర్వోక్తార్థమును వ్యతిరేకముఖముగా బుద్ధియందు చేరేలాగున చెప్పుచున్నారని భావము.

శ్లో. స్థాణుః స్థాణురితీవోక్తిర్న నృబుద్ధిం నిరస్యతి,
వ్యనువాదాత్తథైవోక్తిర్భ్రాంతిం పుంసో నబాధతే. ౭౪

దం-అ. స్థాణువు, స్థాణువు అనేవచనము అనువాదములేకపోవుటవలన, పురుషుఁడనే బుద్ధిని యెట్లు నిరసించదో ఆటులే 'తత్'పదార్థమును మాత్రము చెప్పువాక్యమున్ను పురుషునియొక్కభ్రాంతి బాధించదు.

తా. స్థాణువునందు పురుషభ్రాంతికలవాని, యాభ్రాంతిని, నిరసించు ఇది స్థాణువు ఇది స్థాణువు అని స్థాణుస్వరూపమునుమాత్రమా చెప్పువాక్యము నం దారోపింపఁబడిన పురుషస్వరూపమును అనువదించకపోవుటచేత పురుష నివర్తింపచేయలేదు. ఆప్రకారమే చిదాత్మయందు కలిగిన కర్తృత్వాదిభ్రా సించుటకొఱకు, కేవలచిదాత్మస్వరూపమును బోధించే 'తదసి' (అబ్రహ్మైవతివి వాక్యము ఎన్నిపర్యాయము లుపదేశింపఁబడినను, ఆరోపితకర్తృత్వాది విశిష్ట రూపమును అనువదించనిదైనందున జీవత్వభ్రాంతిని నివర్తింపఁజేయఁజాలదని ।

అవ. ఓయీ! 'త్వం' పదార్థము కర్తృత్వాదిసంసారధర్మములు కలిగిన ప్రత్యక్షముగా గనుపడుచున్నదిగదా? ఇట్టి 'త్వం' పదార్థమును, కర్తృత్వా 'తత్' పదార్థస్వరూపముగా నేలాగున ప్రతిపాదింపఁబడుచున్నదని శంకి యుత్తరమును చెప్పుచున్నారు.—

వాక్య. యస్మాత్ శ్రోతృప్రసిద్ధానువాద్యేవ త్వమితిపదం తస్మా
దుద్దిశ్యమానస్థత్వాత్ దుఃఖిత్వాదే రవివక్షితత్వమేవ
విధీయమానత్వే హి సతి విరోధప్రసంగో న తు విధీయ
మానానూద్యమానయో రితి. ౧౮౧

దం-అ. ఏకారణమువలన శ్రోతలకు 'త్వం' అనేపదము ప్రసిద్ధమైన అనువదించునదిగానేయున్నదో, ఆకారణమువలన దుఃఖిత్వము మొదలగునవి ఆ వాక్యమందున్నందున వివక్షితము కానేకాదు. విధింపఁబడుట కలిగియున్న యెడ ధము ప్రసక్తమగును. విధింపఁబడుదానికిని, అనువదింపఁబడుదానికిని విరోధము

తా. వేదాంతములయందుగల 'త్వం' పదము అనఁగా జీవస్వరూపప్ర కములైన పదములు 'త్వం' పదార్థమైనజీవునకు 'తత్' పదార్థబ్రహ్మస్వరూపత్వము టకై ప్రత్యక్షాదిప్రమాణములచేత ప్రసిద్ధములైన యర్థముల ననువదించుచున్న 'త్వం' పదమందు గనుపడుచున్న దుఃఖిత్వ, కర్తృత్వ, సుఖిత్వాదులు అవివక్షి తాత్పర్యవిషయములుగావని) తెలియవలయును. అనువదించునట్టిపదము విధి పదముకంటె దుర్బలమైయుండును. కావననే 'తత్త్వ'దప్రతిపాదితమైన కర్తృ త్వాది జీవస్వభావము బాధింపఁబడుచున్నది. పదద్వయముయొక్క (తత్ పదముల రెంటియొక్క) అర్థములు విధింపఁబడినచో సమబలములుగా నుండు విరోధముసంభవించును. ఒకపదార్థము విధింపఁబడుచు మఱియొకపదార్థము అను బడుచున్నచో వాటికి విరోధము సంభవించదు. సమబలులకే విరోధముగాని,

దుర్బలులకు విరోధములేదు. ఇఁకనేమన, బాధ్యబాధకభావమే కలిగియుండునని భావము.

అవ. పదార్థస్వభావము నాలోచించి చూడఁగా 'తత్, త్వం' పదార్థములకువిరోధములేదని చెప్పి, పదములయొక్క స్వభావమును యోచించిచూచినను, వాటికి విరోధములేదని చెప్పుచున్నాఁడు.—

వాక్య. స్వప్రధానయోర్హి పదయోర్విరోధాశంకా సామా
న్యాలింగితత్వాత్తయో ర్నవిపర్యయే. ౧౮౨

దం-అ. ఆపదములకు జాతిచేత సంశ్లేషము కలిగియున్నందున, స్వప్రధానములగు పదములకు విరోధముకలదని శంకించవచ్చును. వైపరీత్యమందు శంకించతగదు.

తా. 'గౌరశ్వః పురుషః' (గోవు, అశ్వము, పురుషుఁడు) ఇత్యాదిపదములు తాము ప్రవర్తించుటకు మూలమై తమకు వాచ్యార్థమైయున్న గోత్వాదిజాతిని పరిత్యజించకే స్వప్రధానములైయుండును. గనుక 'గౌరశ్వః' ఇత్యాదిపదములకు అభేదబోధకములు, నసామానాధికరణ్యము విరుద్ధమైయుండును. శేషశేషిభావముగా ప్రవర్తించుచున్న పదములు ఒకపదము ముఖ్యముగాను, ఒకపదము అముఖ్యముగాను ఉండును. గనుక, వాటికి సామానాధికరణ్యము విరుద్ధముగాదని భావము.

అవ. ఈయర్థమునే శ్లోకముతో విశదముగా చెప్పుచున్నాఁడు.—

శ్లో. అనాలింగితసామాన్యౌ న జిహాసి తవాదినౌ,
వ్యుత్థితౌ తత్త్వమౌ తస్మాదన్యోన్యాభిసమీక్షిణౌ. ౭౫

దం-అ. 'తత్, త్వం' పదములురెండును తమతమవాచ్యార్థములవలన బహిర్గతములై పరిత్యజించదగిన అర్థమును ప్రతిపాదించనివై, పరిత్యజింపఁబడిన తమతమప్రవృత్తినిమిత్తములైన వాచ్యార్థములు కలవైయున్నవి. ఆకారణమువల్లనే పరస్పరము అపేక్ష కలవిగా నున్నవి.

తా. 'తత్త్వమసి' యను మహావాక్యమునందుగల 'తత్, త్వం' పదములు రెండును తమకు ప్రవృత్తినిమిత్తములైన బ్రహ్మత్వ, జీవత్వములనే వాచ్యార్థములను పరిత్యజించియున్నవి. గనుక, పరస్పరవిరోధములు కలవికావు. వాచ్యార్థమును పరిత్యజించియుండుట కేమికారణమన, ఆ 'తత్, త్వం' పదములు తాము తాత్పర్యముతో ప్రతిపాదించదలఁచిన అఖండాద్వితీయాపరోక్షసచ్చిన్మాత్ర స్వరూపమునకు విరుద్ధమైన పరిచ్ఛిన్నత్వ, సద్వితీయత్వ పరోక్షత్వాద్యర్థములను ఈమహావాక్యమునందు ప్రయోగింపఁబడి ప్రతిపాదించనివై యున్నవి. గనుక వాచ్యార్థమును పరిత్యజించియున్నవి.

స్వవాచ్యార్థమును పరిత్యజించియుండుట కేమికారణ మనఁగా, ఈ 'త
ములు రెండును, ఒకదానిని మఱియొకటి యపేక్షించియున్నందున,
లోనుంచి తొలఁగియున్నది. అనఁగా తాము ఏవాక్యమునందు చేరియుం
మునకు అద్వితీయవస్తువును ప్రతిపాదించుటయందు తాత్పర్యము కను
అట్టితాత్పర్యము ననుసరించి తామున్ను స్వవాచ్యార్థములైన అపరిచ్ఛి
న్నత్వ, సర్వజ్ఞత్వ, కించిదత్వాతివిరుద్ధాంశములను పరిత్యజించి, అవి
త్రాంశమును ప్రతిపాదించుచున్నవి. "లోకములోనున్న శత్రువులనిం
భుజించకుము" అనే యభిప్రాయముతోటి ప్రయోగింపఁబడిన 'విషం
మును తినుము) అనేవాక్యమునందుగల 'విషం-భుంక్ష్వ' అనేపదములు
లైన విషభక్షణములను పరిత్యజించియున్నట్టు కనుపడుచున్నవి యని భా
త్వం' పదములకు అన్యోన్యాభిసమీక్షణమనఁగా 'తత్'పదము ప్రతిపా
మునే 'త్వం'పదము ప్రతిపాదించవలయుననే నియమము. 'త్వం'పదమ
చినయర్థమునే 'తత్'పదమున్ను ప్రతిపాదించవలయుననే నియమమున

అవ. ఓయీ! 'తత్, త్వం' పదములయొక్క వాచ్యార్థములు
లైనందున సంసర్గముకలవి కాకపోయినప్పటికి లక్ష్యార్థములకు సంసర్గము
నని పూర్వపక్షవాది చేయుశంకను అనువదించి సిద్ధాంతవాది పరిహార
కారంభించుచున్నాఁడు.—

వాక్య. అపాస్తసామాన్యార్థత్వాత్ అనువాదస్థతా
విధీయమానేన చ, సహ విరోధా ద్దుఃఖిత్వాదేః
కామం జిహాసితార్థయో రసంసర్గో యథోపన్యస్తః
విరహాత్ తత్త్వమర్థయోరస్తు సంసర్గః నీలోత్పలః
చేన్నైవ మప్యుపపద్యతే.

దం-అ. దుఃఖిత్వము మొదలగునది అనువాదకపదమునం దుండు
పఁబడినపదార్థముతోఁగూడ విరోధము కలిగియుండుటవల్లను. నిర
ప్రవృత్తినిమిత్తంబైన స్వవాచ్యార్థము కలుగుటవల్లను, పరిత్యజించతగిన
పదార్థములకు సంసర్గాభావము యభీష్టముగా కలుగుగాక. ఇదిపఱకు చె
లేనందున 'తత్, త్వం' పదముల లక్ష్యార్థములకు, నీలోత్పలములకువలె
ర్గము కలుగవచ్చునని యనినచో నీప్రకారమున్ను యుక్తియుక్తముకాదు
తా 'తత్'పదముయొక్క వాచ్యార్థము పరోక్షత్వము. 'త్వం'
వాచ్యార్థము సద్వితీయత్వము. ఈరెండు సామాన్యర్థములైనందునను (త

ములకు ప్రవృత్తి నిమిత్తమైనజాతి అయినందున) 'త్వం' పదార్థమందు కనుపడుచున్న దుఃఖిత్వకర్తృత్వాదులు ప్రత్యక్షసిద్ధములగుటచేత అనువాద్యములై యున్నందునను, ప్రత్యక్షాదిప్రమాణాంతరసిద్ధములు కాకపోవుటచే విధింపతగియుండి 'తత్' పదముచే విధింపఁబడుచున్న పరమానందరూపత్వాదులతోటి విరోధించి యున్నందునను, 'తత్, త్వం' పదవాచ్యార్థములకు సంసర్గము లేకపోవచ్చును. 'తత్, త్వం' పదలక్ష్యార్థము లైన చిన్మాత్రస్వరూపములకు పూర్వోక్తదోషములు అనఁగా అనువాద్యత్వ విధేయార్థ విరోధాదిదోషములు లేనందున 'నీలముత్పలం' (నల్లనికలువ) ఇత్యాదివాక్యములయందు నీలోత్పలత్వములకువలె సంసర్గము కలుగవచ్చునని కొందఱు ఆక్షేపించెదరు. ఆయాక్షేపము యుక్తియుక్తముకాదని భావము.

వాక్య. యస్మాత్. ౧౮౪

దం-అ. ఎందువల్లను ?

తా. ఎందువలన యుక్తియుక్తముకాదనఁగా నుత్తరశ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. తదర్థయోస్తు నిష్ఠాత్మా ద్వయపారోక్ష్యవర్జితః,
నాద్వితీయం వినాత్మానం నాత్మా నిత్యదృశా వినా. ౭౬

దం-అ. ఆ 'తత్త్వం' పదములయొక్క తాత్పర్యభూమి యగుచిదాత్మ, సద్వితీయత్వ పరోక్షత్వములులేనివాఁడు. అద్వితీయమైన పరబ్రహ్మ ప్రత్యగాత్మను వదలి స్వరూపమును లభించదు. ప్రత్యగాత్మ నిత్యజ్ఞానస్వరూపుఁడైన పరబ్రహ్మతో వినాగా స్వరూపము లభించదు.

తా. 'తత్, త్వం' పదములురెండు లక్షణావృత్తి నవలంబించి చిన్మాత్రాత్మను తాత్పర్యముచేత ప్రతిపాదించుచున్నది. అట్టి 'తత్త్వం' పదలక్ష్యార్థమైన చిన్మాత్రాత్మ సద్వితీయత్వపరోక్షత్వాదిశూన్యమై, అఖండైకరసమై యున్నది. ఇట్టి చిదాత్మకు సంసర్గము కలుగనేరదు. 'నీలోత్పల' వాక్యమున నీలత్వోత్పలత్వములు పరస్పరభిన్నత్వములుగా గనుపడుచున్నందున, వానికి సంసర్గము కలుగవచ్చును. 'తత్, త్వం' పదలక్ష్యార్థములైన చిన్మాత్రస్వరూపములకు పరస్పరభేదము కనుపడనందున సంసర్గము సంభవించదు. 'తత్త్వం' పదలక్ష్యములకు భేదప్రతిపత్తి యెందువలన లేదనగా 'తత్' పదలక్ష్యార్థమైన అద్వితీయబ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటె భిన్నమైనదికాదు. భిన్నం అయినయెడల బ్రహ్మకు అద్వితీయత్వము ఘటించదు. 'త్వం'పదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మ నిత్యశుద్ధచైతన్యప్రకాశరూపమైన పరబ్రహ్మకంటె భిన్నమైనదికాదు. భిన్నమై

యయినచో నిత్యాపరోక్షచిద్రూపత్వము ప్రత్యగాత్మకు ఘటించదు గావున, నీప్రకారము ప్రత్యగాత్మపరమాత్మలకు భేదములేనందున, 'తత్, త్వం' పదములు అఖండార్థనిష్ఠములేగాని వానిసంసర్గము లేదని భావము. పదార్థములకు భేదప్రతిపత్తి కలిగియున్నచోట వాటికి సంసర్గము కలుగును. లేనిచో కలుగదని పరమార్థము.

అవ. పూర్వపక్షవాది చేయునాక్షేపమును చూపుచున్నారు.—

వాక్య. అత్రాహ కిమిహ జిహాసితం కిం వోపాదిత్సితమితి. ౧౮౫

దం-అ. ఇచ్చట చెప్పుచున్నారు. ఈ 'త్వం' పదమందు పరిత్యజింప నిచ్ఛయింపఁబడిన యర్థము ఏది? విధింప నిచ్ఛయింపఁబడిన యర్థము ఏది?

తా. 'త్వం' పదము ప్రత్యగాత్మస్వరూపమునుమాత్రము ప్రతిపాదించుచున్నదిగదా? అట్టి ప్రత్యగాత్మస్వరూపము నిర్విషయమై యున్నందున దానియందు హేయమైనభాగము కొంతయును, గ్రాహ్యమైనభాగము కొంతయును ఉండనేరదని పూర్వవాది యాక్షేపించుచున్నాఁడని భావము.

అవ. ఇందుకు సిద్ధాంతవాది పరిహారమును జెప్పుచున్నారు.—

వాక్య. ఉచ్యతే. ౧౮౬

దం-అ. చెప్పఁబడును.

తా. ఈచేసినయాక్షేపమునకు పరిహారము చెప్పఁబడునని భావము.

వాక్య. ప్రత్యగాత్మాభిధాయిన స్త్వంశబ్దాదుభయం ప్రతీ
యతేఽహం దుఃఖీ ప్రత్యగాత్మా చ. ౧౮౭

దం-అ. ప్రత్యగాత్మస్వరూపమును విధించుచున్న 'త్వం' పదమువలన రెండు తెలియఁబడుచున్నవి. (౧) నేను దుఃఖవంతుఁడను (౨) ప్రత్యగాత్మను అని.

తా. 'త్వం' పదమునందు 'నేను దుఃఖవంతుఁడను' అనేయర్థము ఒకటి, 'నేను ప్రత్యగాత్మను' అనే యర్థము ఒకటి. ఈరెండర్థములు తెలియఁబడుచున్నవిగాన, నేను దుఃఖవంతుఁడ ననేయర్థము త్యజింపఁదగియున్నది. నేను ప్రత్యగాత్మను అనేయర్థము గ్రహింపఁదగియున్నదని భావము. అనఁగా 'త్వం' పదము కేవల ప్రత్యగాత్మస్వరూపమును మాత్రము ప్రతిపాదించునది కాదు. అహంకారవిశిష్టమైన ఆత్మస్వరూపమును ప్రతిపాదించుచున్నది గనుక దుఃఖిత్వాదిధర్మసహితమైన అహంకారమున్ను, ప్రత్యగాత్మయున్ను, 'త్వం' పదమునందు కనుపడుచున్నవిగాన 'త్వం'పదార్థములో త్యాజ్యమైన భాగమున్ను కలదని భావము.

అవ. ఓయీ! 'త్వం' పదమునందు రెండర్థములు కలిగియుండిన, రెండర్థములున్ను గ్రాహ్యములే కావలయునుగాని ఒకటి గ్రాహ్యమని, మఱియొకటి త్యాజ్యమని, ఏలచెప్పవలయును? ఆలాగున చెప్పినను ప్రత్యగాత్మాంశమే గ్రాహ్యమని ఏల చెప్పవలయును? అహంకారాంశము త్యాజ్యమని నిశ్చయించుట కేమిహేతువు? అనిశంకించగా పరిహరించుచున్నాఁడు.—

వాక్య. తత్ర చ ప్రత్యగాత్మనోఽహం దుఃఖిత్యనేనాభిసంబంధ ఆత్మయాథాత్మ్యానవబోధహేతుక ఏవ, అతః అహమర్థః అనర్థోపసృష్టత్వా దజ్ఞానోత్థత్వాచ్చ హేయ ఇతి ప్రత్యక్షహేత్రోరవసీయతే. ౧౮౭

దం-అ. అందులో ప్రత్యగాత్మకు నేను దుఃఖవంతుఁడ ననే యర్థముతోటి సంబంధము ఆత్మతత్త్వము తెలియకపోవుటయే కారణముగా గలిగియున్నది. కావున అహంకారము అనర్థములలో గూడియున్నందువల్లను త్యాజ్యమైయున్నదని ప్రత్యక్ష ప్రమాణమనే కారణమువల్లనే నిశ్చయింపఁబడుచున్నది.

తా. ప్రత్యగాత్మకు నేను దుఃఖవంతుఁడననే యంశముతోటి సంబంధము స్వస్వరూపయాథాత్మ్యమును తెలియకపోవుట అనేఅజ్ఞానముచేత సంభవించినదిగాని వాస్తవముగ లేదుగాన అజ్ఞానమువల్ల అహంకారము సంభవించి సకలానర్థములను సంపాదించుచున్నందున త్యాజ్యమైయున్నది. ఈయర్థము ప్రత్యక్షముచేతనే తెలియఁబడుచున్నదని భావము.

అవ. పూర్వపక్షవాది మరల శంకించుచున్నాఁడు.—

వాక్య. తదర్థే కిం హేయం కిం వోపాదేయమితి నావధ్రియతే.

దం-అ. 'తత్' పదార్థమునందు త్యాజ్యము ఏదియనిన్ని, గ్రాహ్యమేదియనిన్ని నిశ్చయింపఁబడదు.

తా. 'త్వం' పదార్థమందుగల అహంకారాంశము అనర్థసంపాదకమై యున్నందున త్యాజ్యమని చెప్పినను చెప్పవచ్చును. 'తత్' పదార్థముగల సర్వజ్ఞత్వాద్యంశమున్ను పురుషార్థరూపముగా నున్నందున త్యాజ్యముకాదుగదా? గాన 'తత్' పదార్థమందు త్యాజ్యాంశమనిగాని, ఉపాదేయాంశమనిగాని నిశ్చయించుటకు వీలుకాదు. సర్వముపాదేయమే కావచ్చునని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. తత ఇద మభిధీయతే. ౧౮౦

దం-అ. అందువలన నిది చెప్పఁబడుచున్నది.

జేయఁబడదుగదా? లేక 'తత్'పదమున్ను 'త్వం' పదార్థమునే చెప్పునని సామానాధి కరణము నంగీకరించితిరా, అపుడు 'తత్, త్వం' పదము లేకార్థకములైనందున పౌనరుక్త్యదోషము, ఒకపదమునకు వైయర్థ్యము మొదలగుదోషములు సంభవించును. గనుక 'తత్' పదము 'త్వం'పదార్థగత సద్వితీయత్వాద్యాదులకు నివర్తకమని చెప్పినది యుక్తముకాదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతే. ౧౯౨

తా. పరిహారమును చెప్పుచున్నారమని భావము.

వాక్య. న చైవయో ర్నివర్తకనివర్త్యభావం వయం బ్రూమః కథం తర్హి త్వమర్థే ప్రత్యగాత్మని ప్రాగానవబుద్ధా ద్వితీయతా సానేనావబోధ్యతే అతోఽనవబోధనిరాసేన తదుత్థస్య సద్వితీయత్వస్య త్వమర్థస్థస్య పరోక్షత్వస్య చ తదర్థస్థస్య నిరసనాన్న వైయధికరణ్యాది చోద్యస్యావసరోఽస్తీతి. ౧౯౩

దం-అ. ఈ'తత్ పదార్థ, త్వం' పదార్థములకు నివర్త్యనివర్తకభావమును మేము చెప్పము. అయితే యేలాగన, 'త్వం'పదార్థమైన ప్రత్యగాత్మయందు పూర్వము తెలియఁబడని అద్వితీయత్వముకలుగుటచేత, ఆయద్వితీయత్వము ఈ 'తత్' పదముచేత తెలియఁజేయఁబడుచున్నది గాన అజ్ఞానము నిరసింపఁబడును. అందుచేతను, ఆ యజ్ఞానజన్యమై 'త్వం' పదార్థమందున్న సద్వితీయత్వమును 'తత్ పదార్థమందున్న పరోక్షత్వమును నిరసించుటవల్లను వైయధికరణ్యము మొదలగు దోషములకు నవకాశము లేదు.

'తత్' పదార్థము నివర్తకమని 'త్వం' పదార్థము నివర్త్యమని మేము చెప్పలేదు. అయితే మేము చెప్పినదేమనగా, 'త్వం' పదార్థమైన ప్రత్యగాత్మయందు అద్వితీయత్వము నిత్యముగానున్నది. అయితే అది అనాద్యజ్ఞానాచ్ఛాదితమై 'తత్త్వమస్యాది'వాక్యశ్రవణమునకు పూర్వమందు తెలియబడియున్నది. కాన అజ్ఞానము నశించి ఆయజ్ఞానకల్పితములైన 'త్వం' పదార్థనిష్టసద్వితీయత్వ దుఃఖిత్వాదులును తత్పదార్థనిష్ట పరోక్షత్వ సర్వజ్ఞత్వాదులును నివర్తించుననిమాత్రము చెప్పుచున్నాము. గాని ఈ 'తత్, త్వం' పదములు వీటియొక్క అర్థములున్ను నివర్తనివర్తకభావము సాక్షాత్తుగఁ గలిగియున్నదని చెప్పినదిలేదు. గనుక పూర్వవాది చెప్పిన వైయధికరణ్యపదాంతరవైయర్థ్యపౌనరుక్త్యాదిదోషములు మాపక్షమందు సంభవించవని భావము.

అవ. ఈచెప్పినయర్థమును శ్లోకముతో చెప్పుచున్నారు.—

వాక్య. తదిదమభిధీయతే. ౧౯౪

దం-అ. ఆయర్థము చెప్పఁబడుచున్నది.

తా. శ్లోకముతోచెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. తత్త్వమర్థేన సంపృక్తో నానాత్వం వినివర్తయేత్,
నాపరిత్యక్తపారోక్ష్యం త్వంతదర్థం సి సృప్సతి. ౭౫

దం-అ. 'తత్' పదార్థము 'త్వం' పదార్థముతో సంబంధించినదై భేదమును నివర్తింపచేయుచున్నది. 'త్వం' పదార్థమున్ను పరిత్యజింపఁబడని పరోక్షత్వముగల 'తత్' పదార్థమును సంబంధింప నిచ్ఛయించదు.

తా. 'తత్' పదార్థమై విధింపబడుచున్న అద్వితీయ బ్రహ్మస్వరూపము 'త్వం' పదార్థమై అనువదింపబడుచున్న ప్రత్యగాత్మస్వరూపముతో సంబంధించి అనఁగా ప్రత్యగాత్మకంటె అభిన్నముగా తెలియఁబడి, ఆ ప్రత్యగాత్మస్వరూపమును ఆవరించియున్న అజ్ఞానమును నివర్తింపఁజేసి యందుమూలమున అజ్ఞానజన్యములైన సద్వితీయత్వ దుఃఖత్వాదులను నివర్తింపజేయును. ఈ ప్రకారమే 'త్వం' పదార్థమైన ప్రత్యగాత్మ యున్ను పరోక్షత్వ సర్వజ్ఞత్వాదిస్వవిరుద్ధధర్మములను పరిత్యజించనిచో 'తత్' పదార్థమైన పరబ్రహ్మతోటి సంబంధము అభిన్నముగా గలుగదు. కాన 'తత్' పదార్థమందు గల పరోక్షత్వాది ధర్మములున్ను అజ్ఞాననివర్తిచేత నివర్తించుచున్నదని భావము.

అవ. మరల పూర్వవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కస్మాత్పునః కారణాత్తదర్థోఽద్వితీయలక్షణస్తదర్థేన ప్రత్యగాత్మనా పృథగర్థస్సన్నవిద్యోత్థం సద్వితీయత్వం నిహంతీతి. ౧౯౫

దం-అ. అద్వితీయస్వరూపమై 'తత్' పదార్థము 'త్వం' పదార్థమైన ప్రత్యగాత్మతో అభిన్నమైయుండి అజ్ఞానజన్యమైన సద్వితీయత్వమును నివారించునని యేకారణమువల్ల చెప్పఁబడినది.

తా. 'తత్' పదార్థమైన పరమాత్మ 'త్వం' పదార్థమైన ప్రత్యగాత్మతో అభిన్నమైయుండి 'త్వం' పదార్థము నావరించియున్న అజ్ఞానమును, అజ్ఞానజన్యములైన సద్వితీయత్వదుఃఖత్వాదుల నివర్తింపఁజేయునని చెప్పినది యుక్తముకాదు. ఎందువలన ననఁగా 'తత్త్వమసి' వాక్యము జీవబ్రహ్మైక్యమునందు తాత్పర్యముగలిగియున్నందున, దుఃఖత్వాదినివర్తియందు తాత్పర్యము గలదికాదు. ఐక్యమందును దుఃఖత్వాదినివృత్తి

ఽ రెంటియందును తాత్పర్యము కలదనినచో వాక్యభేదదోషము సంభవించును.
ఃమునకు ఒకయర్థమందే తాత్పర్యము కలిగియుండునుగాని, రెండర్థములయం
ర్యము కలిగియుండదు. రెండర్థములయందు తాత్పర్యమున్నచో వాక్యమును
ర్యాయము లుచ్చరింపవలసియుండును. అదియే వాక్యభేదదోషము కాన 'తత్'
దుఃఖత్వాదినివర్తకము కానేరదని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

క్య. ఉచ్యతే. ౧౯౬

వం-అ. చెప్పఁబడును.

తా. పూర్వవాది చేసిన యాక్షేపమునకు పరిహారము చెప్పఁబడునని భావము.

క్య. విరోధాత్. ౧౯౭

వం-అ. విరోధము కలిగియుండుటవల్లను.

తా. 'తత్త్వమసి'వాక్యము జీవబ్రహ్మైక్యమందు తాత్పర్యము కలిగియున్నట్లు
హాది తాత్పర్యలింగములచేత కనుపడుచున్నదిగదా? 'త్వం' పదార్థమందు
త్వాదులు కలిగియున్నయెడల, దుఃఖత్వాదివిశిష్టమైన 'త్వం' పదార్థముతోటి
తమైన 'తత్' పదార్థమునకు ఐక్యము సంభవించదు గనుక వాక్యతాత్పర్యము
ధము కలుగును. అందువలన దుఃఖత్వాదులు నివర్తించుట ఆవశ్యకమైయున్నది.
క్యభేదదోషము కలుగదు. స్వప్రధానములయిన అర్థములను ప్రతిపాదించు
నకే వాక్యభేదదోషమని భావము.

క్య. తదుచ్యతే. ౧౯౮

వం-అ. అదిచెప్పఁబడుచున్నది.

తా. సంగ్రహముగా చెప్పఁబడిన యర్థము శ్లోకములో చెప్పఁబడుననిభావము.

సాంసారిత్వాఽద్వితీయేన పారోక్ష్యంచాత్మనాసహ,
ప్రాసంగికం విరుద్ధత్వాత్ తత్త్వంభ్యాం బాధనం తయోః. ౭౯

వం-అ. సంసారిత్వము అద్వితీయమైన బ్రహ్మతోటి పరోక్షత్వము.అపరోక్షత్వ
త్మతోటిన్ని విరోధించుచున్నందున ఆసంసారిత్వపరోక్షత్వములకు 'తత్, త్వం'
చేత బాధనము నాంతరీయకమై (ఆవశ్యకమై) యున్నది.

తా. 'త్వం' పదార్థమందు కనుపడుచున్న సద్వితీయత్వదుఃఖత్వాదులు 'తత్'
పాద్యమైన అద్వితీయబ్రహ్మముతోటి విరుద్ధములై యున్నవి. 'తత్' పదా
వినఁబడుచున్న పరోక్షత్వసర్వజ్ఞత్వాదులు 'త్వం' పదప్రతిపాద్యమై సాక్షా

దపరోక్షమైన ప్రత్యగాత్మతోటి విరుద్ధములై యున్నవి. ఈరెండువిరుద్ధధర్మములు నివర్తించనిచో ప్రత్యగ్బ్రహ్మలకైక్యము సిద్ధించదు గనుక, ప్రత్యగ్బ్రహ్మైక్యమందు తాత్పర్యముగల 'తత్ త్వం' పదములచేత సంసారిత్వాదివిరుద్ధధర్మములు బాధింపఁబడుట నాంతరీయక (ఆవశ్యకమై)మైయున్నదని భావము. ఏది యేదివినాగా సిద్ధించదో అది దానికి నాంతరీయకమని చెప్పఁబడును.

వాక్య. తత్త్వమర్థయోస్తు బాధకత్వే ఽన్యదపి కారణ
ముచ్యతే. ౯౯

దం-అ. "తత్త్వం"పదార్థములయొక్క బాధకత్వమందు మఱియొక హేతువు చెప్పఁబడును.

తా. సాంసారిత్వపరోక్షత్వాదులు విరుద్ధములైనందున 'తత్' త్వం' పదార్థములచేత బాధింపఁబడునని యెందువలన చెప్పవలయును. 'తత్ త్వం' పదార్థములున్ను విరుద్ధములైయున్నందున సంసారిత్వాదులచేతనే బాధింపఁబడకూడదాయని కొందఱుశంకించెదరు. అలాగున శంకించతగదు. 'తత్, త్వం' పదార్థములే సంసారిత్వాదులను బాధించునుగాని, సంసారిత్వాదులు 'తత్, త్వం' పదార్థములను బాధింపఁజాలవనుటకు మఱియొక కారణము నుత్తరశ్లోకముతో చెప్పుచున్నామని భావము.

శ్లో. అజ్ఞాత పురుషార్థత్వాత్ శ్రౌతత్వా త్తత్త్వమర్థయోః,
స్వమర్థ మపరిత్యజ్య బాధకౌ స్తాం విరుద్ధయోః. ౮౦

దం-అ. 'తత్, త్వం' పదార్థములు అజ్ఞాతములై పురుషార్థములై యుండుటవల్లను, శ్రుతిచేత ప్రతిపాదింపబడుచున్నందునను, స్వకీయమైన అర్థమునకు వదలక విరుద్ధములకు బాధకములై యున్నవి.

తా. 'తత్, త్వం' పదలక్ష్యార్థములు ప్రమాణాంతరముచేత తెలియఁబడనివై యున్నవి. తెలిసినచో పురుషార్థములైయున్నవి. కాన వేదాంతవాక్యములచేత తాత్పర్యముతో ప్రతిపాదింపఁబడుచున్నవి. సంసారిత్వపరోక్షత్వాదులు ఇట్టివికావు. ఇవి ప్రత్యక్షాదిప్రమాణములచేత తెలియఁబడుచున్నవి. తెలిసినను పురుషార్థములుకావు. కావుననే వేదాంతవాక్యములచేత తాత్పర్యముతో ప్రతిపాదింపఁబడునవి కావు. ఈ కారణముచేత 'తత్, త్వం' పదార్థములే సంసారిత్వాదులకు బాధకములుగాని, సంసారిత్వాదులు 'తత్, త్వం' పదార్థములకు బాధకములుగావని భావము.

అవ. ఈప్రకారము 'తత్, త్వం' పదములు లక్షణావృత్తి నవలంబించి ప్రత్యగ్బ్రహ్మైక్యమును బోధించుటయందు ప్రత్యక్షాది ప్రమాణవిరోధము లేదని యిదివరకు చెప్పినయర్థమును అనువదించుచున్నారు.

వాక్య. ఏవం తావదయథోపక్రాంతేన ప్రక్రియావర్త్మనా న
ప్రత్యక్షాదిప్రమాణాంతరై ర్విరోధగంధోఽపిసంభావ్యతే. ౨౦౦

దం-అ. ఈప్రకారము ఉపక్రమము నతిక్రమించని ప్రకారముచేత ప్రత్యక్షము మొదలగు ప్రమాణాంతరములతోడి, విరోధవాసనయును సంభావింపఁబడదు.

తా. 'తత్, త్వం' పదములు ప్రత్యగ్బ్రహ్మైక్యమును ప్రతిపాదించునని ఆవిషయమునందు ప్రత్యక్షాదిప్రమాణాంతరములు లేశముగనైన విరోధించవని యింతవఱకు ప్రతిపాదించినారమని భావము.

అవ. ఇఁకను ప్రత్యక్షాదివిరోధము, లేకపోయినను, కలదని తలంచి 'తత్త్వమస్యా'దివాక్యము ప్రసంఖ్యానమందు తాత్పర్యముకలదని యెవ్వరు చెప్పుచున్నారో వారిపక్షమును నిరాకరించుట కారంభించుచున్నారు.

వాక్య. యదాపునః సర్వప్రకారేణాపి యతమానా నై
వేమం వాక్యార్థం సంభావయంతి (యామః) ప్రత్యక్షా
దిప్రమాణాంతరవిరోధత ఏవ తస్మిన్నపి పక్షఉచ్యతే. ౨౦౧

దం-అ. ఎపుడు సర్వవిధములచేతను ప్రయత్నమును చేయుచున్నవారలై ఈవాక్యార్థమును ప్రత్యక్షము మొదలగుప్రమాణములయొక్క విరోధమువలననే యూహించరో ఆపక్షమందున్ను చెప్పఁబడును.

తా. ముందుగా పదార్థజ్ఞానములను అన్వయవ్యతిరేకములచేత కలుగఁజేసికొనియున్న అధికారికి 'తత్త్వమస్యాది'వాక్యము ప్రత్యగభిన్నబ్రహ్మస్వరూపసాక్షాత్కారమును కలుగజేయునని,యిందువిషయమై ప్రత్యక్షాదిప్రమాణాంతరములుఎంతమాత్రము విరోధించవని మేముచెప్పిన అర్థమును విశ్వసించక, కొందఱు శాస్త్రకారులు తమతమబుద్ధికొలది యాలోచించి బ్రహ్మాత్మైక్యము ప్రత్యక్షాదిప్రమాణాంతర విరుద్ధమైనప్పటికి ప్రసంఖ్యానసాపేక్షమగు 'తత్త్వమస్యా'దివాక్యముచేతసంపాదింపఁబడునని చెప్పెదరు. వారిపక్షమందు కొన్నిదోషములు సంభవించును. వానిని ముందఱిగ్రంథములో కాన్పించుచున్నారమని భావము.—ప్రసంఖ్యానము అనఁగా ఆవృత్తి, అసకృదాలోచనము.

శ్లో. ప్రత్యక్షాదివిరుద్ధంచే ద్వాక్యమర్థం వేదేత్వకిత్,
స్యాత్తు తద్దృష్టివిద్వర్థం యోషాగ్నివదసంశయమ్ ౮౧

ద-అ. ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధమైన యర్థమును వాక్య మొకానొక చోట చెప్పినచో ఆవాక్యము స్త్రీయందు అగ్నిబుద్ధిని విధించువాక్యమువలె దృష్టివిధియే అర్థముగాఁగలది నిస్సంశయముగ నగును.

తా. ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధమైన బ్రహ్మాత్మైక్యమును వాక్యము ప్రతిపాదించుననిచెప్పితే, వాక్యము వస్తుస్వరూపప్రతిపాదకముగాదని దృష్టివిధిపరమని చెప్పవలసియుండును. (దృష్టివిధి యనఁగా అదిగాని వస్తువు అదియని భావించుమని చెప్పుట) ఇది పంచాగ్నివిద్యయందు కనుబడుచున్నది. ఇచ్చట ద్యులోక, పర్జన్యపృథివీ, పురుషులను, స్త్రీని వీరినైదుగురిని అగ్నిగా ప్రతిపాదింపఁబడియున్నది, ద్యులోకము మొదలు స్త్రీవఱకుగల పదార్థములు వాస్తవముగా అగ్నిగాకపోయినను, వానిని అగ్నిగా ప్రతిపాదించినందున ఆవాక్యము దృష్టివిధిపరమై యున్నది. ఆప్రకారమే బ్రహ్మాత్మల కైక్యము వాస్తవముగా లేకపోయినప్పటికి 'తత్త్వమసి' వాక్యము దానిని ప్రతిపాదించినందున, ఈవాక్యము దృష్టివిధిపరమై యుండునని భావము.

అవ. అయితే 'తత్త్వమస్యా'దివాక్యము వస్తుస్వరూపప్రతిపాదకముగాదని దృష్టివిధిపరమేనని చెప్పెదమనినచో అటులు చెప్పరా దనుచున్నారు.

వాక్య. యదా తు తత్త్వమస్యాదివాక్యం సర్వప్రకారే
ణాపి విచార్యమాణం న క్రియాం కటాక్షేణాపి వీక్షతే
తదా ప్రసంఖ్యానాది వ్యాపారః దుస్సంభావ్య ఇతి. ౨౦౨

దం-అ. ఎప్పుడు 'తత్త్వమస్యా'దివాక్యము సర్వవిధములచేత విచారింపఁబడుచున్నదై క్రీగంటిచూపుచేతనైతము క్రియనుచూడదో అపుడు ప్రసంఖ్యానము మొదలగువ్యాపారము (క్రియ) సంభావించుట శక్యమైనదికాదు.

తా. 'తత్త్వమసి' వాక్యము వస్తుస్వరూపమాత్రప్రతిపాదనపరమా? లేక ఉపాసనాదిక్రియాప్రతిపాదనపరమా? యని విచారింప నారంభించి యుపక్రమోపసంహారాదిషడ్విధతాత్పర్యలింగములను ఎన్నిపర్యాయములు ఎన్నివిధములచేత యాలోచించినను ఉపాసనాది క్రియావిశేషములను క్రీగంటిచూపుచేత కూడా వాక్యము నిరీక్షించునట్లు తెలియఁబడలేదు. అనఁగా స్వల్పముగానైనా 'తత్త్వమసి'వాక్యము క్రియలతో సంబంధించునట్లు తెలియఁబడలేదు. కాన ప్రసంఖ్యానాది(ఉపాసనాది) క్రియాపరత్వము కలిగియుండునేమో నని యూహించుటకు నైతము శక్యమైయుండదు. కావున 'తత్త్వమస్యా'దివాక్యము వస్తుస్వరూపమాత్ర ప్రతిపాదకమేగాని దృష్టివిధి పరముగాదని నిశ్చయింపఁదగియున్నదని భావము.

వాక్య. తదుచ్యతే. ౨౦౩

దం-అ. అది చెప్పఁబడును.

తా. ఈచెప్పినఅర్థము శ్లోకముతో చెప్పఁబడునని భావము.

శ్లో. వస్త్వేకనిష్ఠం వాక్యంచేన్న తస్య స్యాత్క్రియార్థతా.
వస్తునో హ్యేకరూపత్వా ద్వికల్పస్యాప్యసంభవః. ౮౨

దం-అ. వాక్యము వస్తుస్వరూపమునందే నిష్ఠకలదైయుండినచో ఆవాక్యమునకు క్రియాపరత్వము లేకపోవును. వస్తుస్వరూపము ఏకరూపముగా నున్నందునవికల్పమునకును సంభవములేదు.

తా. 'తత్త్వమసి' వాక్యము వస్తుస్వరూపమునే ప్రతిపాదించుచున్నందున క్రియాపరము కానేరదు. ఆవస్తువు అనఁగా, వాక్యముచేత ప్రతిపాదింపఁబడే ఆత్మవస్తువు కూటస్థమైనందున (నిత్యనిర్వికారమైనందున) క్రియచేత సాధింపఁదగినదికాదు. కావుననే దానియందు నిత్యసిద్ధమా? లేక, క్రియాసాధ్యమా? యనువికల్పముసైతము సంభవించదుగాన, 'తత్త్వమస్యా'దివాక్యము ప్రసంఖ్యానాదిక్రియావిషయము కాదని భావము.

అవ. వాక్యప్రతిపాద్యార్థమునకు ప్రమాణాంతరవిరోధముకలదని అంగీకరించి చెప్పిరి. ప్రమాణాంతరవిరోధమే లేదనుచున్నారు —

వాక్య. భిన్నవిషయత్వాచ్చ న ప్రమాణాంతర విరోధః. ౨౦౪

దం-అ. భిన్నమైనవిషయము కలిగియున్నందున ప్రమాణాంతరములతోటి విరోధములేదు.

తా. 'తత్త్వమసి'వాక్యము ప్రతిపాదించు నర్థమువేరు ప్రత్యక్షాదిప్రమాణాంతరములు ప్రతిపాదించేయర్థము వేరు. కావుననే 'తత్త్వమసి' వాక్యమునకు ప్రమాణాంతరవిరోధములేదు. ఒక అర్థమును వాక్యము ఒకరీతిగా, ప్రత్యక్షాదులు మఱియొకరీతిగా ప్రతిపాదించినచో వాక్యమునకు ప్రమాణాంతర విరోధము కలదని చెప్పవచ్చును. రెండును భిన్నవిషయములుగా నున్నప్పు డట్టివిరోధమును చెప్పఁగూడదని భావము.

వాక్య. కథం ఉచ్యతే. ౨౦౫

దం-అ. యేలాగనఁగా చెప్పఁబడును.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము, ప్రత్యక్షాదిప్రమాణాంతరములున్ను ఎట్లుభిన్నవిషయములో దానిని ముందటిశ్లోకమున చెప్పుచున్నామని భావము,

శ్లో. అపూర్వార్థాధిగమం కుర్వన్ప్రమాణం స్యాన్న చేన్న తత్,
న విరోధ స్తతో యుక్తో విభిన్నార్థావబోధినోః. ౮ ౩

దం.అ. అజ్ఞాతమగు అర్థముయొక్క జ్ఞానము చేయుచున్నదై ప్ర
గును. లేనిచో నది ప్రమాణమే కానేరదు. అందువలన భిన్నార్థములను బోధిం
ణములకు పరస్పరవిరోధము యుక్తముకాదు.

తా. మఱియొకదానిచేత తెలియఁబడని యర్థమును తెలియజేయుంన
ణమనంబడు. ప్రత్యక్షము ప్రమాణమైనందున తనకంటే ఇతరములైన ప్ర
లచేత తెలియఁబడనియర్థమునే తెలియఁజేయును. 'తత్త్వమసి' వాక్యము
మైనందున, తనకంటె ఇతరములయినప్రమాణములచేత తెలియఁబడని యర్థ
యఁజేయును ప్రమాణాంతరములచేత తెలియఁజేయఁబడిన అర్థమును తెలి
ప్రత్యక్షాదులు ప్రమాణములే కానేరవు. అనువాదకములని చెప్పవలసియుండు
వున ప్రత్యక్షాదిప్రమాణములు వాక్యము బోధించనియర్థమునే బోధించునని
మున్ను, ప్రత్యక్షాదులచే బోధింపఁబడనియర్థమునే బోధించునని యుం చెప్ప
అందువలననే వాక్యప్రత్యక్షములకు అన్యోన్యవిరోధముకలదని చెప్పఁదగదని

అవ. చెప్పినయర్థమును దృష్టాంతముగుండా విశదపఱచుటకై చెప్ప

వాక్య. య ఏవమపి భిన్నవిషయాణాం విరోధం వ
సోఽత్రాపి విరోధం బ్రూయాత్. ౨౦

దం-అ. ఈప్రకారమైనను, ఎవఁడు భిన్నవిషయములైన ప్రమాణ
విరోధమును చెప్పునో వాఁడు దీనియందున్ను విరోధమును చెప్పును.

తా. వేర్వేరుగానున్న అర్థములను బోధించేప్రమాణములకు విరోధ
యినను ఎవఁడు విరోధముకలదని చెప్పునో వాఁడు ఈముందు చెప్పెబోవ
దున్ను విరోధమును చెప్పగలడని భావము.

శ్లో. నాయం శబ్దః శ్రుతో యస్మాత్ రూపం పశ్యామిచక్షుషా
ఇతి యద్వత్తథైవాయం విరోధోఽక్షజవాక్యయోః. ౨

దం-అ. యేకారణమువలన నేత్రములచేత రూపమును జూచుచు
ఆకారణమువలన ఈశబ్దమువినబడలేదు. అనుట ఎట్టిదో అట్టిదే ప్రత్యక్షప్ర
ప్రమాణములకున్ను ఈవిరోధము.

తా. రూపమును గ్రహించునది నేత్రము. శబ్దమును గ్రహించునది
కాన చక్షుశ్శ్రోత్రములు తమతమవిషయములను గ్రహించుటయందుఅన్యోన్య

గలవికావు. అయినను నేను కంటితో రూపమునుచూచుచున్నందున చెవితో నీశబ్దమును వినకపోయితినని చక్షుశ్శ్రోత్రములకు పరస్పరవిరోధమును చెప్పుట యెటులయుక్తమో అటులే ప్రత్యక్షప్రమాణవాక్యములకున్ను పరస్పరవిరోధముచెప్పుట అయుక్తమని భావము. పరస్పరవిరోధములేని ప్రత్యక్షవాక్యములకు, విరోధమును చెప్పునట్టిబుద్ధిమంతుఁడు పరస్పరవిరోధములేని చక్షుశ్శ్రోత్రములకుగూడా శబ్దము వినఁబడునపుడు రూపము చూడఁబడదని, రూపము చూడఁబడునపుడు శబ్దము వినఁబడనేరదని విరోధమును చెప్పఁగలడని భావము.

అవ. ప్రమాణములకు పరస్పరవిరోధము కలదనేశంకను పరిహరించుటకు చెప్పుచున్నారు.—

వాక్య. ప్రమాణానాం సతాం న విరోధః శ్రోత్రాదీనామివ భిన్నవిషయత్వాత్, యయోశ్చాభిన్నవిషయిత్వంతయో రాఖునకులయోరివ ప్రతినియత ఏవ బాధ్యబాధక భావః స్యాత్. ౨౦౭

దం-అ. శ్రోత్రముమొదలయినవానివలె భిన్నమైనవిషయము కలిగియున్నందున ప్రమాణములైయున్నవాటికి విరోధములేదు. ఏవి యభిన్నమైనవిషయమును కలిగియుండునో అవి ఎలుకకు ముంగిసకువలె నొకదానినొకటి బాధించునట్టిస్వభావము నియతముగ కలిగియున్నది.

తా. శ్రోత్రనేత్రాదీంద్రియములు అత్యంతభిన్నములైన శబ్దరూపాది విషయములను బోధించుచున్నందున ఎట్లు పరస్పరవిరోధముకలవికావో అటులే ప్రమాణములని ప్రసిద్ధినొందియున్న ప్రత్యక్షానుమానశాబ్దములున్ను అత్యంతవిలక్షణవిషయములను ప్రతిపాదించుచున్నందున అన్యోన్యవిరోధము కలవికావు. ఏప్రమాణములు ఒకవిషయమునే ప్రతిపాదించునో అవి ఎలుకముంగిసలవలె పరస్పరవిరోధములు కలవైయుండును. ఒకదానినొకటి బాధించును. అనఁగా జ్వాలైక్యప్రత్యక్షము జ్వాలాభేదానుమానముచేతను, జలమువలె వహ్నియును పదార్థమైయున్నందున చల్లనైయుండునని యూహింపఁబడుచున్న వహ్నిశీతత్వానుమానము అగ్న్యుష్ణత్వప్రత్యక్షముచేతను, 'నహింస్యాత్సర్వభూతాని' యని హింసానిషేధబోధములు నగుశాస్త్రము 'అగ్నీషోమీయం పశుమాలభేత' యని యాగసంబంధించి పశుహింసాబోధకమైన శాస్త్రాంతరముచేతను, బాధింపఁబడుచున్నవిగాన, ప్రమాణములకు పరస్పరవిరోధము కలిగియున్నట్లు కనుపడుచున్నది. అయిన జ్వాలైక్యప్రత్యక్షజ్వాలాభేదాను మానములు, రెండును, ఒక

వహ్నిజ్వాలనే విషయముగా జేసికొని ప్రవర్తించినందునను హింసావిధాయకవాక్య
రెండును ఒకహింసనే విషయముగా జేసికొని ప్రవర్తించినందునను, పరస్పరవిరో
కలిగి యొక ప్రమాణముచేత మఱియొక ప్రమాణము బాధింపఁబడుచున్నప్పటికి
న్న ప్రమాణములని చెప్పదగియుండవు. ఒకటి ప్రమాణముగా మఱియొకటి ప్ర
భాసముగా చెప్పఁదగియుండును. (బాధింపఁబడునది ప్రమాణాభాసముగాఁ బా
చునది ప్రమాణముగా నుండును) గాని, రెండున్ను ప్రమాణములుగా నుండవు.
తభిన్నవిషయములుగల ప్రమాణములకు పరస్పరవిరోధము లేనేలేదని భావము.

వాక్య. అత స్తదుచ్యతే.

దం-అ. కావున అది చెప్పఁబడును.

తా. ఈచెప్పినయర్థము శ్లోకములో విశదముగా చెప్పఁబడునని భావము.

శ్లో. ప్రత్యక్షంచేన్న శాబ్దం స్యాత్ శాబ్దం చేదక్షజం కథమ్,
ప్రత్యక్షాభాసః ప్రత్యక్షే హ్యాగమాభాస ఆగమే. ౭౫

దం-అ. ప్రత్యక్షమైనపదార్థము శబ్దముచే బోధింపబడునదికాదు. శబ్ద
బోధింపఁబడునది, యేప్రకారము ప్రత్యక్షమగును? ప్రత్యక్షము అంగీకరింపఁ
మఱియొక్క ప్రత్యక్షము ప్రత్యక్షాభాసముగా నుండును. ఆగమము (శాస్త్రము)
కరింపఁబడగా మఱియొకఆగమము ఆగమాభాసముగ నుండును.

తా. ప్రత్యక్షముచే బోధింపఁబడుపదార్థము శాస్త్రముచే బోధింపఁబ
మఱియు బాధింపనుబడదు. శాస్త్రముచే బోధింపఁబడునది ప్రత్యక్షముచే బోధిం
దు, బాధింపనుసైతముబడదు. కావున శాస్త్రప్రత్యక్షములకు విరోధములేదు.
బాధకభావములు రెండును పొందిన రెండుప్రమాణములలో నొకటి ప్రమాణ
మఱియొకటి ప్రమాణాభాసముగా నుండునుగాని రెండును ప్రమాణములుగా ను
ఇది శుక్తియని, శుక్తిబోధకమైన ప్రత్యక్షము నంగీకరించగా, అచ్చటనే ఇది
మని రజతమును బోధించునట్టిప్రత్యక్షము, ప్రత్యక్షాభాసముగాని, వాస్తవమైన
క్షముగాదు. వీటిలో ఇది శుక్తియనేప్రత్యక్షము ఇది రజతమనే ప్రత్యక్షాభా
బాధించును. అటులే, శాస్త్రములోనున్ను ఒకవాక్యము ఒకఅర్థమును ప్రతిపాది
అందుకు విరుద్ధమైన అర్థమును ప్రతిపాదించునట్టి వాక్యాంతరము ఆభాసవాక్య
క వాక్యాభాసమును వాక్యము బాధించును. 'తత్త్వమస్యాది' వాక్యములు ప్ర
న్నకూటస్థాత్మస్వరూపమును బోధించుచుండగా ఇందుకు విరుద్ధముగా జీవబ్ర
మును సగుణమును బోధించువాక్యాంతరములు వాక్యాభాసములు గనుక 'తత్త్వ
వాక్యముచే బాధింపఁబడునని భావము.

గలవికావు. అయినను నేను కంటితో రూపమును చూచుచున్నందున చెవితో నీశబ్దమును వినకపోయితినని చక్షుశ్శ్రోత్రములకు పరస్పరవిరోధమును చెప్పుట యెటుల యుక్తమో అటులే ప్రత్యక్షప్రమాణవాక్యములకున్ను పరస్పరవిరోధముచెప్పుట అయుక్తమని భావము. పరస్పరవిరోధములేని ప్రత్యక్షవాక్యములకు, విరోధమును చెప్పునట్టిబుద్ధిమంతుఁడు పరస్పరవిరోధములేని చక్షుశ్శ్రోత్రములకుగూడా శబ్దము వినఁబడునపుడు రూపము చూడఁబడదని, రూపము చూడఁబడునపుడు శబ్దము వినఁబడనేరదని విరోధమును చెప్పఁగలడని భావము.

అవ. ప్రమాణములకు పరస్పరవిరోధము కలదనేశంకను పరిహరించుటకు చెప్పుచున్నారు.—

వాక్య. ప్రమాణానాం సతాం న విరోధః శ్రోత్రాదీనామివ భిన్నవిషయత్వాత్, యయోశ్చాభిన్నవిషయిత్వం తయో రాఖునకులయోరివ ప్రతినియత ఏవ బాధ్యబాధక భావః స్యాత్. ౨౦౭

దం-అ. శ్రోత్రముమొదలయినవానివలె భిన్నమైనవిషయము కలిగియున్నందున ప్రమాణములైయున్నవాటికి విరోధములేదు. ఏవి యభిన్నమైనవిషయమును కలిగియుండునో అవి ఎలుకకు ముంగిసకువలె నొకదానినొకటి బాధించునట్టిస్వభావము నియతముగ కలిగియున్నది.

తా. శ్రోత్రనేత్రాదీంద్రియములు అత్యంతభిన్నములైన శబ్దరూపాది విషయములను బోధించుచున్నందున ఎట్లు పరస్పరవిరోధముకలవికావో అటులే ప్రమాణములని ప్రసిద్ధినొందియున్న ప్రత్యక్షానుమానశాబ్దములున్ను అత్యంతవిలక్షణవిషయములను ప్రతిపాదించుచున్నందున అన్యోన్యవిరోధము కలవికావు. ఏప్రమాణములు ఒకవిషయమునే ప్రతిపాదించునో అవి ఎలుకముంగిసలవలె పరస్పరవిరోధములు కలవైయుండును. ఒకదానినొకటి బాధించును. అనఁగా జ్వాలైక్యప్రత్యక్షము జ్వాలాభేదానుమానముచేతను, జలమువలె వహ్నియును పదార్థమైయున్నందున చల్లనైయుండునని యూహింపఁబడుచున్న వహ్నిశీతత్వానుమానము అగ్న్యౌష్ణ్యప్రత్యక్షముచేతను, 'నహింస్యాత్సర్వభూతాని' యని హింసానిషేధబోధములు నగుశాస్త్రము 'అగ్నీషోమీయం పశుమాలభేత' యని యాగసంబంధించి పశుహింసాబోధకమైన శాస్త్రాంతరముచేతను, బాధింపఁబడుచున్నవిగాన, ప్రమాణములకు పరస్పరవిరోధము కలిగియున్నట్లు కనుపడుచున్నది. అయిన జ్వాలైక్యప్రత్యక్షజ్వాలాభేదానుమానములు, రెండును, ఒక

దం-అ. ప్రమాణములు తమసామర్థ్యముచేతనే అర్థజ్ఞానమును కలుగఁజేయుచున్నవి. పరస్పరసహాయ్యముకలిగినపుడే ప్రామాణ్యముకలుగునని స్వమముగా నంగీకరింపఁబడదు.

తా. ప్రత్యక్షాదిప్రమాణములను రూపాదివిషయములును స్వయముగా బోధించునుగాని అన్యప్రమాణములయొక్క సాహాయ్యమునుకోరి బోధించవు. ప్రమాణాంతరసాహాయ్యముచేతనే ప్రత్యక్షాదులు అర్థమునుబోధించేయెడలవాటికి స్వతఃప్రామాణ్యము లేకపోవును. ప్రమాణమొక్కటేయని చెప్పవలసియుండునని భావము.

అవ. ఇంతవరకు ఆత్మయందు కనుపడుచున్నదుఃఖత్వాదులు ప్రత్యక్షాదిప్రమాణములచేత గ్రహింపఁబడుచున్నవని యంగీకరించి అట్టిప్రత్యక్షాదిప్రమాణములతో విరుద్ధమైనందున 'తత్త్వమస్యా'దివాక్యము అప్రమాణమని చెప్పినవాక్యము దూషింపఁబడినది. ఇఁకను దుఃఖత్వాదులు ప్రత్యక్షాదిప్రమాణములచేత గ్రహింపఁబడునవికానే కావని చెప్పుచున్నాఁడు.

వాక్య. న చ సుఖదుఃఖాదిసంబంధోఽవగమ్యమానః ప్రత్య
క్షాది ప్రమాణైర్గృహ్యతే యేన విరోధః ప్రత్యక్షాదిప్ర
మాణై రుద్ఘాట్యతే. ౨౧౧

దం-అ. తెలియఁబడుచున్నసుఖదుఃఖాదులయొక్కసంబంధము ప్రత్యక్షాదిప్రమాణములచేత గ్రహింపబడదు. ఏకారణముచేత ప్రత్యక్షాదిప్రమాణములతో విరోధము ఎత్తిచూపఁబడునో.

తా. చిదాత్మయందు కనుపడుచున్నసుఖదుఃఖాదిసంబంధము ప్రత్యక్షముచేతగాని అనుమానముచేతగాని గ్రహింపఁబడునదికాదు. అలాగుననే గ్రహింపఁబడునదికాదు. అలాగున గ్రహింపఁబడునెడల 'తత్త్వమస్యా'దివాక్యమునకు ప్రత్యక్షాదిప్రమాణములతో విరోధముకలదని, అందుచే, నావాక్యమప్రమాణమని చెప్పవచ్చునని భావము.

అవ. పూర్వవాది ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. కథమ్. ౨౧౨

దం-అ. ఎటువలె.

తా. సుఖదుఃఖాది సంబంధము ప్రత్యక్షాదిప్రమాణములచే గ్రహింపఁబడదని యెటువలె చెప్పవచ్చునని భావము.

అవ. సిద్ధాంతవాది చెప్పుచున్నాడు.

వాక్య. శ్రుణు. ౨౧౩

దం-అ. వినుము.

తా. సుఖదుఃఖాదిసంబంధము ప్రత్యక్షాదిప్రమాణములచేత యేలాగున గ్రహింపఁబడదో దానిని చెప్పెదను వినుమని భావము.

శ్లో. దుఃఖితావగతౌ చేత్స్యాన్న ప్రమీయేత సాత్మవత్,
కర్మణ్యేవ ప్రమాన్యాయ్యా న తు కర్తర్యపి క్వచిత్. ౨౧౪

దం-అ. దుఃఖిత్వము ఆత్మయందు కలిగియుండినచో నాదుఃఖిత్వము ఆత్మవలె జ్ఞానప్రమాగోచరము కాకపోవును, జ్ఞానము కర్మయందే యుక్తముగాని కర్తయందు ఒకానొకచోటనున్ను యుక్తముకాదు.

తా. దుఃఖిత్వాదిధర్మములు ఆత్మతోఁ జేరి ఆత్మధర్మములై యున్నయెడల, ఆత్మ యేలాగున ప్రమాణజ్ఞానమునకు గోచరమైయుండదో ఆలాగుననే ప్రమాణజ్ఞానమునకు గోచరమైయుండవు. అనఁగా ధర్మిస్వరూపమును గ్రహింపఁబడినంగాని తద్ధర్మములు గ్రహింపఁబడవు. కాన ఆత్మస్వరూపము ప్రత్యక్షాదిప్రమాణజ్ఞానమునకు గోచరముకానందున తద్ధర్మములని మీచే నంగీకరింపఁబడిన దుఃఖిత్వాదిధర్మములున్ను ప్రత్యక్షాది ప్రమాణజ్ఞానములకు గోచరములుగావు. ప్రమాణజ్ఞానములు కర్మయందు ప్రవర్తించి ఆకర్మను ప్రకాశింపఁజేయునని చెప్పినచో న్యాయముగా నుండునుగాని, కర్తయందు ప్రవర్తించి ఆకర్తను ప్రకాశింపజేయునని చెప్పుట న్యాయముగానుండదు. కర్తయందు సైతము ప్రవర్తించి ప్రకాశింపజేయునని చెప్పినయెడల కర్తకు కర్మత్వముసిద్ధించి కర్తృకర్మల కేకత్వముసిద్ధించును. అది యుక్తముగాదని భావము. ప్రమాణజ్ఞానము వ్యాపించి ప్రకాశింపఁజేయుచున్న ఘటాదులు కర్మయనంబడు. ప్రమాణజ్ఞానమును ప్రవర్తింపజేయుచున్న అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము (ప్రమాత) కర్త యనంబడు. 'ఘటమహం పశ్యామి' (ఘటమును నేను చూచుచున్నాను) ఇత్యాదివ్యవహారములయందు దర్శనము ప్రమాణజ్ఞానము. ఇది తనకు కర్మగానున్న ఘటమును వ్యాపించి ప్రకాశింపఁజేయుచున్నదిగాని తనకు కర్తగానున్న అహమర్థమును ప్రకాశింపఁజేయదు. అహమర్థమునున్ను ప్రకాశింపఁజేయునని యనినచో నహమర్థమునకును కర్మత్వముసిద్ధించును. కర్మకర్తలు సర్వవ్యవహారములయందును భిన్నముగానుంట న్యాయ్యముగాని ఏకముగానుండుట న్యాయ్యము కాదని తాత్పర్యము.

అవ. పూర్వగ్రంథమునందు ప్రమాణములు భిన్నవిషయములగుటవల్లను, దుఃఖిత్వాదులు ప్రమాణగోచరములగుటకు వీలుకానందువల్లను, 'తత్త్వమా'దివాక్యము ప్రమాణాంతరవిరుద్ధార్థము కానందున, ప్రసంఖ్యానమందు తాత్పర్యముకలదని చెప్ప

తగదని నిరూపింపఁబడెను, ఉత్తరగ్రంథమునందు దుఃఖిత్వాదులు ప్రమాణగ్ర ములని ప్రమాణాంతరవిరోధము కలిగియున్నందున వాక్యము ప్రసంఖ్యానపరమ అంగీకరించినప్పటికి దుఃఖిత్వాదిరూపమైన సంసారమువలన మోక్షము కలుగ నేఁ చెప్పుచున్నారు.

వాక్య. అభ్యుపగమేఽపిచ ప్రసంఖ్యానశతేనాపి నైవ త్వం సంభావితదోషాన్ముచ్యసే. ౨౧౮

దం-అ. అంగీకరింపఁబడినప్పటికి, నూరు ప్రసంఖ్యానముల చేతకూడా నీవు భావితమైన (ఊహింపఁబడిన) దోషమువల్లముక్తుఁడవు కానేరవు.

తా. దుఃఖిత్వము మొదలగుసంసారధర్మములు ప్రత్యక్షాదిప్రమాణములచే యఁబడుచున్నవని, అట్టిప్రత్యక్షాదులకు విరుద్ధమైనందున 'తత్త్వమస్యా'దివాక్య కేవలవస్తుపరముకాదనిన్ని, ప్రసంఖ్యానము విధించుచున్నదనిన్ని, అంగీకరించినప్ప నీవు నూరుపర్యాయములు ప్రసంఖ్యానము చేసినను (ఆవృత్తిచేసినను) ఆత్మయం సంబంధించియున్నట్లు తలచుచున్నదుఃఖిత్వాది సంసారములోనుండి విముక్తుఁడవు కా రవని భావము.

వాక్య. అత ఆహ. ౨౧

దం-అ. అందువలన చెప్పుచున్నాఁడు.

తా. ప్రసంఖ్యానమును (ఆవృత్తిని) చేసిన నెందువలన సంసారమువలనము కలుగదనగా అందుకు ముందటిశ్లోకములో నుత్తరము చెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. ప్రమాణబద్ధమూలత్వాద్దుఃఖిత్వం కేన వార్యతే.
అగ్నేరుష్ణవన్నివృత్తిశ్చేన్నైరాత్మ్యం హ్యేతి సౌగతమ్. ౮

దం-అ. ప్రమాణముచేత దృఢముగా కట్టఁబడినమూలము కలిగియున్నందు దుఃఖిత్వము దేనిచేత నివారింపఁబడును? అగ్నియొక్క ఉష్ణమువలెనివృత్తికలుగుననిన చ బుద్ధమతమునందుగల శూన్యవాదము ప్రవర్తించును.

తా. దుఃఖిత్వాదిసంసారధర్మములు ప్రత్యక్షప్రమాణముచేత గ్రహింపఁబ యున్నందున ఆత్మస్వరూపమువలె అబాధ్యములైయుండును. గావున దేనిచేతనును నివర్తింపఁజేయబడవు. అయినను నివర్తించుననినచో నగ్నియొక్క వేడిమి నివర్తించు టుల నివర్తించును. అనఁగా వేడిమి, అగ్నియొక్కధర్మము ప్రత్యక్షముచేత గ్రహింపఁ డుచున్నది. అది అగ్ని నివర్తించినగాని నవర్తించదు. అటువలెనే దుఃఖిత్వాదికమును ఆత్మయొక్కధర్మము, ప్రత్యక్షముచేత గ్రహింపఁబడుచున్నది. కాన ఆత్మస్వరూపవ

నివర్తించినంగాని, నివర్తించదు. అందువల్లనే ఆత్మనివృత్తిపూర్వకముగా నివర్తించునని చెప్పవలయును. అప్పుడు ఆత్మస్వరూపమునకును నివృత్తి ని అంగీకరించినందున బౌద్ధమందు చెప్పఁబడినశూన్యవాదము ప్రాప్తమగునని భావము.

అవ. పూర్వపక్షవాదియొక్క మఱియొకఅభిప్రాయమును శంకించుకొని పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. అథ మతమ్. ౨౧౬

శ్లో. నిరాకర్తా ప్రసంఖ్యానం దుఃఖిత్వం చేత్స్వనుష్ఠితమ్,
ప్రత్యక్షాదివిరుద్ధత్వాత్కథముత్పాదయేత్ప్రమామ్. ౮౯

పం-ఆ. చక్కఁగా ననుష్ఠింపఁబడిన ప్రసంఖ్యానము దుఃఖిత్వమును నిరాకరించునని మఱియొకమతము (అభిప్రాయము) కలిగియుండినచో ప్రసంఖ్యానము ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధమైయున్నందున యథార్థజ్ఞానము నేలాగున పుట్టించును?

తా. ప్రసంఖ్యాన (ఆవృత్తి) మనునది చిరకాల మభ్యసింపఁబడినచో దుఃఖిత్వాదిసంసారధర్మములను నివర్తింపఁజేయగలదు. అనఁగా ప్రసంఖ్యానము నిరంతరము చిరకాలము అనుష్ఠించినయెడల అట్టిప్రసంఖ్యానము ఆత్మస్వరూపమును నివర్తింపచేయకనే ఆత్మయందు పరమానందరూపత్వాదిజ్ఞానమును బుట్టించి దుఃఖిత్వాదిధర్మములను నివర్తింపఁజేయుననే యభిప్రాయమున్నచో, నాయభిప్రాయమున్ను యుక్తము కాదు. ఏలననఁగా ప్రసంఖ్యానము (ఆవృత్తి) చిత్తైకాగ్రతను కలుగజేయును. ఆచిత్తైకాగ్రత ఆత్మయందుపరమానందరూపత్వాదిజ్ఞానమును పుట్టించి దుఃఖిత్వాదిధర్మములను నివర్తింపచేయునని చెప్పెదరు. ఆచిత్తైకాగ్రత ప్రత్యక్షాదిప్రమాణములలో నంతర్భూతము కానందున ఆత్మయందు పరమానందరూపత్వాదిజ్ఞానమును పుట్టించదు. లోకములో జ్ఞానము పుట్టించునవి ప్రమాణములే కాని ప్రమాణేతరములు గావు. ప్రసంఖ్యానము ప్రమాణము కానందున జ్ఞానమును పుట్టింపఁజాలదు. కావుననే దుఃఖిత్వాదులను నివర్తింపఁజేయఁజాలదు. ఇదిగాక దుఃఖిత్వాదిప్రతిపాదకప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధమైన పరమానందరూపత్వాదిజ్ఞానమునే పుట్టింపఁజాలదు. ఇఁక నెట్లు దుఃఖిత్వాదులును నివర్తింపఁ చేయగలదని భావము.

అవ పూర్వపక్షవాది యాక్షేపించుచున్నాఁడు—

వాక్య. నను ప్రసంఖ్యానం నామ తత్త్వమస్యాది శబ్దార్థాన్వయవ్యతిరేకయుక్తివిషయ బుద్ధ్యామ్రేడన మభిధీయతే తచ్చానుష్ఠీయమానం ప్రమితి వర్ధనయా పరిపూర్ణాం ప్రమితిం జనయతి న పునరైకాగ్ర్యవర్ధనయేతి

యథాశేషాశుచినీడే స్త్రీకుణపే కామినీతి నిర్వస్తుకః పురుషాయాసమాత్రజనితః ప్రత్యయఇతి. ౨౧౭

దం-అ. ఓయీ! 'తత్త్వమస్యా' దివాక్యార్థ సంబంధమైన యేయన్వయ వ్యతిరేకయుక్తికలదో తద్విషయమైనజ్ఞానమును ఆవృత్తిచేయుట యే ప్రసంఖ్యానమని చెప్పబడుచున్నది. అట్టిప్రసంఖ్యాన మనుష్ఠింపఁబడుచున్నదై, జ్ఞానమును వృద్ధిబొందించుట చేత పరిపూర్ణమైనజ్ఞానమును పుట్టించును. కాని ఏకాగ్రతను వృద్ధిబొందించుట చేతపుట్టించదు. ఎటువలెననఁగా సకలమైన అపవిత్రతకు కారణమైన స్త్రీయొక్క శవమునందు కామిని యనే (మనోహరమైనదనే) అయదార్థమైనపురుషునియొక్క ఆయాసమాత్రముచేత పుట్టినదై ఎటువలె పరిపూర్ణజ్ఞానము పుట్టించునో అటువలెనే.

తా. 'తత్త్వమస్యా'దివాక్యార్థమును అన్వయవ్యతిరేకములచేతవిచారించి, ఆవిచారణబుద్ధిని మాటిమాటికి భావించుటయే, ప్రసంఖ్యానమని చెప్పఁబడును. అట్టిప్రసంఖ్యానము చిత్తమున కేకాగ్రతను సంపాదించుచు తద్వారా పరిపూర్ణజ్ఞానమును కలుగజేయుననిన్ని దుఃఖిత్వాదిధర్మము లనునివర్తింపఁజేయుననిన్ని మేము చెప్పినదిలేదు. ఇక నేమని చెప్పినామనఁగా, పూర్వోక్తమైనప్రసంఖ్యానము శ్రద్ధాభక్తులతో ననేకపర్యాయము లనుష్ఠింపఁబడినచో, క్రమక్రమముగా ప్రత్యగభిన్నబ్రహ్మస్వరూపవిషయకమైన వాక్యార్థజ్ఞానమును వృద్ధిబొందించు, పర్యవసానమునందు పరిపూర్ణజ్ఞానమును కలుగజేయును. ఎటువలెననగా, న్యూనవర్ణములుగల సువర్ణమునకు వర్ణాధిక్యమును కలుగఁజేయుటకై అగ్నిపుటము వేయఁబడును. ఆపుటము అనేకపర్యాయములు వేయఁబడుచు ప్రతిపర్యాయము సువర్ణమందు కించిత్కించిద్వర్ణాధిక్యమును కలుగచేయుచు, పర్యవసానమందు పరిపూర్ణవర్ణమును సంపాదించును. ఇదిగాక పరిణతివిరసత్వదౌర్గంధ్యాద్యనేకదోషముల కాకరంబైన స్త్రీశరీరమునుచూచియిది కామిని (మనోహరమైనది) యనేబుద్ధి వాస్తవమైనమనోహరత్వములేనిదైనను పురుషునియొక్క అభినివేశముచేత పుట్టింపఁబడును. అట్టిబుద్ధి మాటిమాటికి భావింపఁబడినదై ప్రతిపర్యాయము స్త్రీశరీరమందు కించిత్కించిద్రమణీయత్వము నారోపించుచు పర్యవసానమునందుపరమరమణీయత్వమును స్ఫురింపజేయునుగదా? అటువలెనే 'తత్త్వమస్యా'దివాక్యార్థవిషయక ప్రసంఖ్యానమున్నుపరిపూర్ణపరమానందరూపత్వాదిజ్ఞానమును కలుగఁజేయును. కాన ప్రమాణవ్యతిరిక్తమైన చిత్తైకాగ్రత పరిపూర్ణజ్ఞానమును కలుగఁజేయనేరదని చెప్పినదోషము ప్రసక్తముకాదని భావము.

అవ. సిద్ధాంతపరిహారమును చెప్పనారంభించుచున్నారు.

వాక్య. తన్న. ౨౧౮

దం-అ. అదికాదు.

తా. ఆలాగున చెప్పకూడదు. అనఁగా ప్రసంఖ్యానము జ్ఞానమును వృద్ధిచేయుచు పరిపూర్ణజ్ఞానమును పుట్టించునని చెప్పకూడదని భావము.

అవ. పూర్వవాది ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. యతః. ౨౧౯

దం-అ. ఎందువల్లను.

తా. ఎందువల్ల చెప్పకూడదనిభావము.

అవ. సిద్ధాంతవాది శ్లోకముతో హేతువును జెప్పుచున్నాఁడు.—

శ్లో. అభ్యాసోపచయాద్బుద్ధేః యత్స్యాదైకాగ్ర్యమేవతత్,
నహి ప్రమాణాన్యభ్యాసా త్కుర్వం త్యర్థావబోధనమ్. ౯౦

దం-అ. అభ్యాసాతిశయమువల్ల బుద్ధికి యేదికలుగునో అదియేకాగ్రతయే. ప్రమాణములు ఆవర్తింపఁబడుటవలన అర్థజ్ఞానమును కలుగచేయవు. ఇది ప్రసిద్ధము.

తా. ప్రమాణములను అనేకపర్యాయములభ్యసించుటచేత బుద్ధికికలిగేవైశద్యము ఏకాగ్రతయని చెప్పఁబడునుగాని, పరిపూర్ణజ్ఞానమని చెప్పఁబడదు. ప్రత్యక్షాదిప్రమాణములు సకృత్ప్రవృత్తములగు పదార్థజ్ఞానమును కలుగఁజేయునుగాని అభ్యాసముచేత పదార్థజ్ఞానమును కలుగఁజేయవు అని భావము. రత్నపరీక్షనుచేయువారు రత్నమందు చక్షురింద్రియము ననేకపర్యాయములు ప్రవర్తింపఁజేయఁగాఆరత్నవిషయమైనయాథార్థ్యజ్ఞానము పుట్టుచున్నది. శ్రుతిస్మృత్యాదివాక్యములయొక్క అర్థతత్త్వమును తెలియఁగోరినవారు ఆవాక్యార్థము ననేకపర్యాయము లావర్తించఁగా వాక్యములయొక్క అర్థయాథార్థ్యము తెలియుచున్నదిగనుకప్రమాణాభ్యాసము అర్థజ్ఞానసంపాదకమని తోఁచునుగాని రత్నపరీక్షాదులయందును ప్రమాణాభ్యాసము అర్థజ్ఞానసంపాదకముగాదు. ప్రమాణమే అర్థజ్ఞానసంపాదకమైనచో నభ్యాసము జ్ఞానోత్పత్తిప్రతిబంధకములను నివర్తింపఁజేయును. అజ్ఞానాన్యథాజ్ఞానవిపరీతజ్ఞానములున్ను, చిత్తవిక్షేపమున్ను జ్ఞానోత్పత్తిప్రతిబంధకములు. ఇవి ప్రమాణాభ్యాసముచే నివర్తించును. పిదప ప్రమాణము అర్థతత్త్వజ్ఞానమును కలుగఁజేయును. కావున ప్రసంఖ్యానము చిత్తవిక్షేపాదిజ్ఞానోత్పత్తి ప్రతిబంధకములనుమాత్రము నివర్తింపఁజేయుచు ప్రమాణమున కుపకరించునుగాని సాక్షాత్తుగా జ్ఞానము పుట్టించదని తాత్పర్యము.

శ్లో. అభ్యాసోపచితా కృత్స్నం భావనా చేన్నిరంతరమ్,

నైకాంతికీ నివృత్తిః స్యాద్భావనాజం హి తత్ఫలమ్.

దం-అ. అభ్యాసముచేత వృద్ధిఁబొందించఁబడిన భావన (అనుసంధ
మైనసంసారమును నివర్తింపఁజేయుననినచో నానివృత్తి నిత్యమైనది కా
భావనవలనఁ బుట్టినదికదా?

తా. 'స యథా క్రతురస్మిఁల్లోకే పురుషోభవతి తథేతః ప్రేత్య
కమున పురుషుఁడు ఎటువంటి ఉపాసనఁగలవాఁడగునో, ఇచ్చట మృతిఁ
నట్టిఫలము కలవాఁడగును. అనఁగా నీలోకమున పురుషుఁ డెట్టిరూపమును
యట్టిరూపమును మరణానంతరము ప్రాప్తించును.) అనేశ్రుతియభ్యాసము
నుసంధానము కలుగుననిన్ని, ఆనిరంతరానుసంధానము దుఃఖిత్వాదిసకలస
ములను నివర్తింపఁజేయును. బ్రహ్మరూపతాప్రాప్తినిన్ని కలుగఁజేయునని
దించుచున్నది గావున, ప్రసంఖ్యానము దుఃఖిత్వాదులను నివర్తింపఁజేయ
నది యుక్తమేనని యనినచో నాలాగున చెప్పఁగూడదు. 'స యథాక్రత
చెప్పిన అభ్యాసము సగుణబ్రహ్మోపాసనము. దానిచేత గలిగే సాంసారి
బ్రహ్మప్రాప్తులు పునరావృత్తిశూన్యములయినసర్వార్థములు కావు.ఎందువలనన
మానవమావర్తం నావర్తంతే' (ఈకల్పమునుఁగూర్చి యావర్తినిపొందఁడు)
సగుణబ్రహ్మోపాసనచేత బ్రహ్మలోకప్రాప్తికలుగుననిన్ని, అచ్చట హిరణ్యగ
ర్యముప్రాప్తించుననిన్ని, వర్తమానకల్పము పరమైశ్వర్య మనుభవించఁబడి, భ
మువొక్క ఆదియందు మరల ఈలోకమునకు రాకడ సంభవించుననిన్ని
గనుక భావన (ఉపాసనము)చేత కలిగేఫలము నిత్యమైనది కాదనిన్ని భావ

వాక్య. అపిచాహ.

దం-అ. ఇదిగాక చెప్పుచున్నాఁడు.

తా. ప్రసంఖ్యానము సంసారధర్మనివృత్తిని, నిత్యముగా కలుగఁజేయ
నందు మఱియొకయుక్తి చెప్పఁబడుచునని భావము.

శ్లో. దుఃఖ్యస్మీత్యపి చేద్ధ్వస్తా కల్పకోట్యుపబృంహితా,
స్వల్పో యోఽభ్యాసజాస్థాస్నీ భావనేత్యత్ర కా ప్రవ

దం-అ. అనేకకల్పములయందునుండి వృద్ధినొందుచున్న నేను దు
ననేజ్ఞానము నశించుచో, స్వల్పకాలపు అభ్యాసముచేత పుట్టింపఁబడినజ్ఞానమ
యనుటయందు ఏమినమ్మకము?

తా. ఈసంసారము లెక్కించుటకు వీలులేనికాలమునందుండి యనువర్తించి వచ్చుచున్నది. కావున నేను దుఃఖవంతుఁడ ననుమొదలగుసాంసారికత్వజ్ఞానమున్ను అనంతకాల ప్రవృత్తమైయున్నది. ఇట్టిదుఃఖిత్వాదిజ్ఞానము ప్రసంఖ్యానము (భావన) చేత నశింపచేయెడల స్వల్పకాలమునందుండి యనువర్తించుభావనచేతకలిగేఫలము (దుఃఖిత్వాదినివృత్తిబ్రహ్మరూపతాప్రాప్తులు) నశించవని చెప్పితే యేలాగున నమ్మవచ్చును? గనుక భావనచేత నిత్యమైనఫలము సంభవించదని భావము.

అవ. పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు:—

వాక్య. నను శాస్త్రార్థాస్స్థిరత్వం భవిష్యతి. ౨౨౧

దం-అ. ఓయీ! శాస్త్రమువల్ల స్థిరత్వము కాఁగలదు.

తా. 'నచపునరావర్తతే' అనుశ్రుతివాక్యము సగుణోపాసనఫలమైన దుఃఖనివృత్తి బ్రహ్మప్రాప్తులకు వినాశములేదని చెప్పుచున్నదిగాన, నిత్యత్వమును చెప్పవచ్చునని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. నైవం. ౨౨౨

దం-అ. ఈప్రకారముకాదు.

తా. ఉపాసనాఫలమునకు స్థిరత్వము శాస్త్రమువలన కలుగుననియును చెప్పఁదగదని భావము.

అవ. ఎందువలననఁగా హేతువును చెప్పుచున్నారు.—

వాక్య. యథావస్థితవస్తుయాథాత్మ్యావబోధకారిత్వాచ్ఛాస్త్రస్య నహి పదార్థశక్త్యాధానకృచ్ఛాస్త్రమ్. ౨౨౩

దం-అ. శాస్త్రము వాస్తవముగానున్న వస్తువుయొక్కయాథార్థ్యజ్ఞానము కలుగఁజేయుచున్నందున, ఈప్రకారము చెప్పఁదగదని యన్వయము. శాస్త్రము పదార్థమందు సామర్థ్యప్రక్షేపమును చేయునదికాదు గదా?

తా. ప్రత్యక్షానుమానములకు గోచరముకానివస్తువులలో నేవస్తువు ఎటువంటి స్వరూపముగలదైయుండునో యాస్వరూపమును యథార్థముగా బోధించుటయే శాస్త్రమునకు స్వభావముగాని, పదార్థములయందు నూతనమైనశక్తివిశేషమును సంపాదించుట స్వభావముకాదు. కాన 'నచ పునరావర్తతే' యనేశ్రుతివల్లనున్ను ఉపాసనఫలమునకు నిత్యత్వము సిద్ధించదు. అయితే 'నచపునరావర్తతే' యనేశ్రుతి 'సగుణోపాసనఫలమునకు నిత్యత్వము చెప్పుచున్నట్లు కనుపడుచున్నదే' యనిన, వాస్తవము నిత్యత్వమును

చెప్పుచున్నది కాని, యీనిత్యత్వము సార్వకాలికనిత్యత్వముకాదు. యాగాదికర్మ ఫలమైనస్వర్గముకంటె సగుణోపాసనఫలము యెక్కువకాలముండునుకాన, నట్టిసాపే క్షికనిత్యత్వమును చెప్పుచున్నది. లేదా, సగుణోపాసనమును చేసినవారు బ్రహ్మ మును బొంది అచ్చట నిర్విశేషబ్రహ్మస్వరూపసాక్షాత్కారమును సంపాదించుకొని తోఁగూడ విదేహకైవల్యమునొందుదురు. కాన, ఉపాసకులకు మరల ఈలోక కావృత్తి (పునరాగమనము) లేదని శ్రుతిచెప్పుచున్నది. 'యత్కృతకం తదనిత్యం' (క్రియచేత సంపాదింపఁబడినదో అది యనిత్యము) అనేన్యాయముయొక్క సహాయముఁ గల 'నాస్త్యకృతః కృతేన' (కర్మచేత నిత్యమైన మోక్షములేదు)యనేశ్రుతి యాగా సాదికర్మలచే నిత్యమైన మోక్షము సంభవించదని చెప్పుచున్నది. 'ఇమంమానవమావ నావర్తంతే' (ఈకల్పమునుగూర్చి యావర్తమును పొందఁడు) అనేశ్రుతి సగుణోపా లకు కల్పాంతరమందు ఆవృత్తిని (పునర్జన్మను) ప్రతిపాదించుచున్నది గాన 'నచ రావర్తతే' యనుశ్రుతి యుపాసనఫలమునకు సార్వకాలికనిత్యత్వమును చెప్పఁజాల భావము.

వాక్య. ప్రసిద్ధంచ లోకే. ౨.

దం-అ. లోకమందు ప్రసిద్ధమైయున్నది.

తా. భావనాజన్యమైనఫలము నిత్యము కాదనేయర్థము లోకములోఁగూడ ప్ర సిద్ధమైయున్నది. గనుక, శ్రుతి యుపాసనఫలమునకు నిత్యత్వము చెప్పఁజాల భావము.

అవ. లోకప్రసిద్ధిని శ్లోకముతో చెప్పుచున్నాఁడు.—

శ్లో. భావనాజం ఫలం యత్స్యాత్ యచ్చ స్యాత్కర్మణః ఫలమ్,
న తత్స్థాస్నీతి మన్తవ్యం ద్రవిడేష్వివ సంగతమ్. ౬

దం-అ. ఉపాసనముచే జన్మించినఫల మేదికలదో కర్మలయొక్కఫల మేదికలదో అది ద్రవిడులయందు చేసినస్నేహమువలె, లేక వేశ్యాస్త్రీలయొక్క స్నేహముఁ స్థిరమైనదికాదని తలఁచవలయును.

తా. ఉపాసనముచేకలిగేఫలమున్ను యాగదానాదులచేకలిగేఫలమున్ను అర తోచేసినస్నేహమువలె, వేశ్యలుచేసే స్నేహమువలె కొంచెముకాలముండునుగాని ని ము కాదని భావము.

అవ. ఇంతవఱకు ప్రమాణములకు పరస్పరభేదము లేకుండుటవల్లను, దుఃఖిత దులు ప్రమాణగోచరము కానందువల్లను, 'తత్త్వమస్యా'దివాక్యము ప్రమాణాంతర

నకు విరుద్ధముగానియర్థము కలదైనందునను, 'తత్త్వమస్యా'దివాక్యము ప్రసంఖ్యానపరముగాదని ప్రతిపాదింపఁబడినది. ఇఁకను దుఃఖిత్వాదికము ప్రమాణాంతరగోచరమేనని యంగీకరించినను, 'తత్త్వమస్యా'దివాక్యమువల్ల పుట్టినజ్ఞానము ప్రమాణాంతరజన్యజ్ఞానములకంటె అత్యంతబలిష్ఠమై యున్నందున ప్రమాణాంతరజన్యజ్ఞానములను బాధించునని చెప్పఁబడును.—

వాక్య. యద్యపి ప్రత్యక్షాదిప్రమాణోపాత్తమాత్మనో దుఃఖిత్వం తథాపి 'తత్త్వమస్యా'ది వాక్యోత్థప్రత్యయ మేవ బలీయానితి నిశ్చయః. ౨౨౫

దం-అ. విచారించగా చిదాత్మయొక్క దుఃఖిత్వము ప్రత్యక్షాదిప్రమాణాంతరములచేత గ్రహింపఁబడినదే యగును. అయినప్పటికి 'తత్త్వమస్యా'దివాక్యమువల్ల పుట్టినజ్ఞానమే బలవంతమైనదని నిశ్చయము.

తా. దుఃఖిత్వాదిసంసారధర్మములు ప్రత్యక్షముచేతనే గ్రహింపఁబడుచున్నప్పటికి 'తత్త్వమస్యా'దివాక్యజన్యజ్ఞానము అన్నిటికంటే బలవంతమైయున్నందున ప్రత్యక్షసిద్ధమైన దుఃఖిత్వాదుల బాధించునని నిశ్చయింపఁదగియున్నదని భావము.

అవ. వాక్యజన్యజ్ఞానమే బాధకమైయున్నదనుటకు కారణమును చెప్పుచున్నారు.—

వాక్య అవ్యభిచారిప్రామాణ్య వాక్యోపాత్తత్వాత్. ౨౨౬

దం-అ. వ్యభిచారములేని ప్రామాణ్యమువల్ల గ్రహింపఁబడినందువలన.

తా. వేదవాక్యము పురుషప్రణీతము కానందున భ్రమప్రమాద విప్రలంభాదిదోషములు లేనిదై యుండును. అందువలన వేదముయొక్క ప్రామాణ్యము యెప్పటికి నేకరీతిగానుండును. అట్టి వేదవాక్యముచే పుట్టింపఁబడినజ్ఞానము సర్వజ్ఞానములకంటె ప్రబలమైయుండును గాన, వాక్యజన్యజ్ఞానమే ప్రత్యక్షసిద్ధదుఃఖిత్వాదిజ్ఞానమునకు బాధకమైయుండునని భావము.

అవ. వాక్యజన్యజ్ఞానమే బాధకమనుటకు మఱియొక కారణమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ప్రమేయస్య చ స్వతఏవ నిర్దుఃఖిత్వ ప్రసిద్ధేః. ౨౨౭

దం-అ. ప్రమేయమై చిదాత్మ స్వయముగానే దుఃఖరాహిత్యము ప్రసిద్ధమైయున్నందువల్లనున్ను.

తా. వాక్యముచే ప్రతిపాదింపఁబడుచున్న ప్రత్యగాత్మ, స్వయంప్రకాశమైయున్నందునను సుషుప్తిసమయమందు సర్వదుఃఖశూన్యమైయున్నట్లు స్వయముగానే

తెలియఁబడుచున్నది గాన ఆత్మకంటె భిన్నమైన ప్రత్యక్షప్రమాణముచే గ్రహింపఁబడుచున్న దుఃఖిత్వాదిసంసారధర్మము బాధింపఁదగియున్నది. ఈహేతువుచేతనున్న 'తత్త్వమస్యా'దివాక్యజన్యజ్ఞానము బాధకమని నిశ్చయము.

అవ. మఱియొక హేతువుచేతనున్ను ప్రత్యక్షాదిసిద్ధమైన దుఃఖిత్వాదికము బాధింపఁదగియున్నదని చెప్పుచున్నాఁడు.—

వాక్య. ప్రత్యక్షాదేస్తు సవ్యభిచారిత్వాత్. ౭౭

దం-అ. ప్రత్యక్షము మొదలగునది వ్యభిచారముతోఁగూడియున్నందువల్లనున్ను.

తా. ప్రత్యక్షప్రమాణము ఒకానొకప్పుడు దోషయుక్తమైయుండి శుక్తిరజతాదిమిథ్యావస్తువులనుగూడ గ్రహించుచున్నందున నాత్మయందు దుఃఖిత్వము గ్రహించునప్పుడును దోషయుక్తమైయుండునేమో నని సంశయింపఁదగియున్నది. ఇదిగాక జాగ్రద్దశయందు ప్రత్యక్షము ఆత్మయందు దుఃఖిత్వము గ్రహించినప్పటికి సుషుప్తిదశయందు నిర్దుఃఖిత్వమును గ్రహించుచున్నది గనుక, ఈకారణములవల్ల ప్రత్యక్షగృహీతమైన దుఃఖిత్వబాధ్యమై యున్నదని భావము.

అవ. మఱియొక కారణముచేతనున్ను దుఃఖిత్వజ్ఞానము బాధ్యమై యున్నదని చెప్పుచున్నాఁడు.—

వాక్య. సంభావనాయాశ్చ పురుషపరికల్పనామాత్రావష్టంభాచ్చేతి. ౭౮

దం-అ. ఊహ, పురుషునియొక్కకల్పనామాత్రమే ఆధారముగా కలిగియున్నందుననున్ను.

తా. ఆత్మ దుఃఖవంతుఁడై యుండవచ్చు ననేయూహను పురస్కరించుకొని దుఃఖిత్వగ్రాహి ప్రత్యక్షము ప్రవర్తించినది. ఊహయున్ను పురుషబుద్ధికల్పితమైనందున విశ్వసింపఁదగియుండదు గనుక, ప్రత్యక్షసిద్ధమైనదుఃఖిత్వజ్ఞానము 'తత్త్వమస్యా'దివాక్యజన్యప్రత్యగభిన్ననిర్విశేషబ్రహ్మస్వరూపజ్ఞానముచేత బాధింపఁదగియున్నదని భావము.

అవ. ఈయర్థమునే శ్లోకముతో చెప్పుచున్నాఁడు.—

శ్లో. నిర్దుఃఖిత్వం స్వతస్సిద్ధం ప్రత్యక్షాదేశ్చ దుఃఖితా,
కో హ్యాత్మాన మనాదృత్య విశ్వసే ద్బాహ్యమానతః. ౯౭

దం-అ. దుఃఖశూన్యత్వము స్వభావముచేత సిద్ధమైయున్నది. దుఃఖిత్వము ప్రత్యక్షము మొదలగుప్రమాణములవల్ల సిద్ధమైయున్నది. ఎవ్వఁడు ఆత్మను(తన్ను)ఆద

రించక తనకు బాహ్యముగా (దూరముగా) నున్న ప్రమాణమువల్ల సిద్ధమైన అర్థమును విశ్వసించును ?

తా. ప్రత్యగాత్మ సర్వదుఃఖశూన్యుఁడనే యర్థము నిర్దోషవేదవాక్యప్రమాణము వల్లనున్ను స్వానుభవమువల్లనున్ను తెలియఁబడుచున్నది. ప్రత్యగాత్మ దుఃఖవంతుఁడనే యర్థముదోషసంభావనకలదై స్వస్వరూపమున కత్యంతబాహ్యమైయున్న ప్రత్యక్షమువల్ల తెలియఁబడుచున్నది. నిర్దోషప్రమాణసిద్ధమైన అర్థమును పరిత్యజించి సంభావితదోష ప్రమాణసిద్ధమైన అర్థమును బుద్ధిమంతుఁడెవ్వఁడును పరిగ్రహించఁడు. ఇదిగాక స్వాను భవసిద్ధమైనయర్థమును వదలి అన్యసిద్ధమైన యర్థమునున్ను పరిగ్రహించఁడు. కాన 'తత్త్వమస్యా'దివాక్యజన్యజ్ఞానమే దుఃఖిత్వాదిజ్ఞానమునకు బాధకమై యున్నదని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నాఁడు.—

వాక్య. సంబంధార్థ ఏవ. ౨౩౦

దం-అ. సంబంధార్థమునందే శ్లోకము చెప్పఁబడుచున్నది.

తా. ౯౮ వ శ్లోకమునకు సంబంధమును జూపించిన ౨౨౩ వ వాక్యము మొద లిడి ౨౨౯ వ వాక్యమువఱకుగల గ్రంథముచే ప్రతిపాదించిన అర్థమునందు-అనఁగా ప్రత్యక్షప్రమాణసిద్ధమైన దుఃఖిత్వము 'తత్త్వమస్యా'ది వాక్యసిద్ధమైన ప్రత్యగాత్మ స్వరూపయాథాత్మ్యజ్ఞానముచేత బాధింపఁబడుననే యర్థమునందు-శ్రుతిప్రమాణము కనుపఱచుటకొఱకు ఉత్తరశ్లోకము ప్రవర్తించుచున్నది. అని భావము.

శ్లో.. అపి ప్రత్యక్షబాధేన ప్రవృత్తిః ప్రత్యగాత్మని,
"పరాంచిఖానీ" త్యేతస్మాద్వచసో గమ్యతే శ్రుతేః. ౯౯

దం-అ. ప్రత్యక్షము బాధించుటచేత శ్రుతికి ప్రత్యగాత్మయందు ప్రవృత్తికల దని "పరాంచిఖానీ" అనే శ్రుతివచనమువల్ల తెలియఁబడుచున్నది.

తా. శ్రుతివాక్యము ప్రత్యక్షమునుబాధించి తాను స్వతంత్రముగా ప్రత్యగా త్మస్వరూపమును బోధించునని మేము చెప్పినయర్థము కేవలయుక్తిచేత చెప్పినదికాదు. "పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూస్తస్మాత్ పరాఙ్పశ్యతి నాంతరాత్మన్" అనేశ్రుతిని యవలంబించి చెప్పఁబడినది. ఈశ్రుతి సృష్టికర్తయగు పరమేశ్వరుఁడు చక్షురాదీంద్రియములను బాహ్యవిషయములను గ్రహించువానిగానే సృష్టించెను. అందువల్ల నాయింద్రియముల (చక్షురాది)చేత పరాగ్విషయములనే చూచునుగాని, ప్రత్యగాత్మను చూడఁడని చెప్పుచున్నందున ప్రత్యక్షము బాహ్యవిషయములనే తెలి

యఁజేయుననిఆత్మస్వరూపమును తెలియఁజేయఁజాలదని, శ్రుతియే ఆత్మస్వరూపమును తెలియఁజేయవలసియున్నదని స్పష్టముగా కాన్పించుచున్నది కావున, శ్రుతివాక్యము ఆత్మస్వరూపమును తెలియఁజేయునప్పుడు తనకు విరుద్ధములైన ప్రత్యక్షాదిప్రమాణములను బాధించునని భావము.

అవ. శ్రుతికిని ప్రత్యక్షమునకును విరోధము కలదనేపక్షము తమకు సమ్మతము కాకపోయినను సమ్మతముగా నంగీకరించి చేసినవాదమును పరిత్యజించి ఇదివఱకు ప్రతిపాదించిన తమకు సమ్మతమైనపక్షమును జ్ఞాపకము జేయుచున్నాఁడు.—

వాక్య. అభ్యుపగమ్యైవముచ్యతే. న తు ప్రమాణం సత్ప్రమాణాంతరేణ విరుధ్యత ఇత్యసకృదవోచామ. ౨౩౧

దం-అ. అంగీకరించి ఈవిధముగ చెప్పఁబడుచున్నది. ప్రమాణమైనది మఱియొక ప్రమాణముతో విరోధించునని అనేకపర్యాయములు చెప్పియున్నాము.

తా. శ్రుతిప్రత్యక్షములకు విరోధముకలదని పూర్వవాదికి సమ్మతము. దానిని మేము ఒప్పుకొని శ్రుతి ప్రత్యక్షమును బాధించునుగాని ప్రత్యక్షము శ్రుతిని బాధించ నేరదని చెప్పినారము. శ్రుతిప్రత్యక్షములకు విరోధమే లేదని మాయభిప్రాయము. దీని నిదివఱలో ననేకపర్యాయములు చెప్పియున్నామని భావము.

అవ. ఓయీ! 'తత్త్వమస్యా'దివాక్యమునకును, దుఃఖిత్వాది ప్రత్యక్షమునకును విరోధము విశదముగా కాన్పించుచు నుండఁగా ప్రమాణమైనది మఱియొక ప్రమాణముతోటి విరోధించదని యేలాగున చెప్పుదురనఁగా 'తత్త్వమస్యా'దివాక్య దుఃఖిత్వాదిప్రత్యక్షములయందు వాస్తవముగా విరోధమే లేదు. ఆప్రమాణములురెండును యేయేవిషయములయందు ప్రవర్తించుచున్నవో ఆప్రవృత్తి నెఱుంగనందున పురుషునకు విరోధము కలిగియున్నట్లు తోఁచుచున్నది అని చెప్పుచున్నాఁడు.

వాక్య. యత్రాపి వాక్యప్రత్యక్షయో ర్విరోధాశంకా తత్రాపి పురుషమోహవశాదేవ సా జాయతే న తు పరమార్థత ఇతి. ౨౩౨

దం-అ. ఎచ్చట వాక్యప్రత్యక్షములకు విరోధము శంకింపఁబడునో అచ్చట ఆశంక పురుషునియొక్క అజ్ఞానవశమువల్లనే పుట్టుచున్నది. వాస్తవముగ లేదు.

తా. ప్రమాణద్వయమునకు విరోధమే లేదు. ఎచ్చట విరోధమున్నట్లు కాన్పించునో అచ్చట ప్రమాణద్వయముయొక్క స్వభావమును చక్కగా నాలోచించని పురుషులయొక్క అజ్ఞానమే కారణము. అనఁగా పురుషుఁడు తనయొక్క అజ్ఞానముచేత

'తత్త్వమస్యా'దివాక్యదుఃఖిత్వాది ప్రత్యక్షములకు విరోధమున్నట్లు తలఁచునుగాని వాస్తవమునకు వాటికి విరోధములేదని భావము.

అవ. ఎందువలన నీలాగున నిశ్చయించుచున్నారనఁగా ఆకారణమును చెప్పుటకై శ్లోకము నవతరింపఁజేయుచున్నారు.—

వాక్య. అతఆహ. ౨౩౩

దం-అ. అందుకు చెప్పుచున్నాఁడు.

తా. ఈలాగున నిశ్చయించుటకు కారణమును నిరూపించుటకై ముందటిశ్లోకము చెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. ప్రమాం చే జ్జనయే ద్వాక్యం ప్రత్యక్షాదివిరోధినీమ్,
గౌణీం ప్రత్యక్షతాం బ్రూయా న్ముఖ్యార్థా సంభవాద్బుధః. ౯౬

దం-అ. వాక్యము ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధమైనజ్ఞానమును పుట్టించినచో ముఖ్యార్థము సంభవించకపోవును. అందువలన ప్రత్యక్షమును అముఖ్యమైనదానినిగా పండితుఁడు చెప్పవలయును.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము ప్రత్యగాత్మయందు దుఃఖిత్వాదిసంసారమును బోధించుచున్న 'అహం దుఃఖీ'త్యాది ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధముగా, అద్వితీయకూటస్థ పరమానందచైతన్యస్వరూపజ్ఞానమును పుట్టించుచున్నది. అందుచేత పండితులైనవారు (ప్రమాణపర్యాలోచనానిపుణులు) 'అహం దుఃఖీత్యా'ది ప్రత్యక్షమును గౌణమని (అముఖ్యమని) చెప్పవలసియున్నది. ఎందువలన ననఁగా, స్వయంప్రకాశకూటస్థచైతన్యమే స్వరూపముగాఁగల ప్రత్యగాత్మకు దుఃఖిత్వాద్యాకారముగా పరిణామము సంభవించదు కావున ప్రత్యగాత్మవిషయమైన 'అహం దుఃఖీ' యనే ప్రత్యక్షము ముఖ్యముకానేరదు. ఇఁక నేమనఁగా, దుఃఖిత్వాదిధర్మములు గల యంతఃకరణమును ముఖ్యముగా చెప్పుచున్నదై గౌణవృత్తిచేత ప్రత్యగాత్మను బోధించుచున్నదని భావము.

అవ. 'అహం దుఃఖీ' యనేప్రత్యక్షము గౌణవృత్తిచేత ప్రత్యగాత్మనే బోధించుననే యర్థమును దృష్టాంతములచేత నిరూపించెదనని చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఏతస్యార్థస్య సుఖప్రతిపత్త్యర్థ ముదాహరణమ్. ౨౩౪

దం-అ. ఈయర్థము సుఖముగా తెలియుటకొఱకు దృష్టాంతము చెప్పఁబడును.

తా. స్పష్టము.

శ్లో. అగ్నిః సమ్యగధీతేఽసౌ జహాసోచ్చైశ్చ మంచకః,

53

యథా తద్వదహం వృత్త్యా లక్ష్యతేఽసర్వ్యాపి సః. ౯౭

దం-అ. 'ఈయగ్ని చక్కఁగా నధ్యయనము చేయుచున్నాఁడు. మంచము పెద్దగా నవ్వినది.' అనుట యెటువలెనో అటువలెనే అయోగ్యమైనదైనప్పటికి 'అహం' ప్రత్యయముచేత ఆప్రత్యగాత్మ లక్షింప (తెలియఁజేయ)ఁ బడుచున్నాఁడు.

తా. ఈశ్లోకములో 'అగ్నిరధీతే' (అగ్ని యధ్యనయము చేయుచున్నది), 'మంచోహసతి' (మంచము నవ్వుచున్నది) ఇత్యాదివాక్యములు ప్రయోగింపఁబడుచున్నవి. వీనిలో 'అగ్ని'శబ్దము వహ్నినిచెప్పెసామర్థ్యము కలదైనందున వేదాధ్యయనముచేయునట్టి బ్రహ్మచారిని చెప్పుటకు యోగ్యము కానిదైనప్పటికి బ్రహ్మచారిని చెప్పేలాగున ప్రయోగింపఁబడుచున్నది. 'మంచ'శబ్దము దార్వాదినిర్మితమైన శయనసాధనమును చెప్పేసామర్థ్యము కలదైయున్నందున నవ్వునట్టిస్వభావముగల పురుషుని చెప్పే యోగ్యతలేనిదైనప్పటికి పురుషుని బోధించేలాగున ప్రయోగింపఁబడుచున్నది. ఇటులే 'అహం' శబ్దము దుఃఖిత్వాదివికారములుగల యంతఃకరణమును చెప్పేసామర్థ్యము కలదైయున్నందున నిర్వికారచైతన్యమును చెప్పేయోగ్యత లేనిదైనప్పటికిని, నిర్వికారచిన్మాత్రమును బోధించేలాగున ప్రయోగింపఁబడి బోధింపుచున్నది అని భావము.

అవ. పూర్వపక్షవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కస్మాత్ పునఃకారణాత్ సాక్షాదేవాత్మా నాభిధీ
యతే కిమనయా కల్పనయేతి. ౨౩౫

దం-అ. ప్రత్యగాత్మ యొకకారణమువలన ముఖ్యవృత్తిచేత చెప్పఁబడఁడు. ఈకల్పనతోటి ఏమిప్రయోజనము?

తా. ముఖ్యవృత్తిచేత ప్రత్యగాత్మను చెప్పేశబ్దము కలదా? లేదా ? కలదనినచో నట్టిశబ్దముచేతనే ప్రత్యగాత్మను బోధించవచ్చును. అహంకారమును బోధించే శబ్దము లక్షణావృత్తిచేత ప్రత్యగాత్మను బోధించుచున్నదని ఏల కల్పించవలయును? ప్రత్యగాత్మను చెప్పే శబ్దము లేదనినచో, అహంకారబోధకమైన శబ్దముచేత, ప్రత్యగాత్మ లక్షింపఁబడదు. ఏలననఁగా, ఒకశబ్దముచేత ముఖ్యవృత్తిచేత బోధింపఁబడేపదార్థమే మఱియొకశబ్దముచేత నముఖ్యవృత్తిచే లక్షింపఁబడును. తీరశబ్దముచే ముఖ్యముగా బోధింపఁబడుచున్న తీరమేగదా గంగాశబ్దముచేత నముఖ్యముగా లక్షింపఁబడుచున్నది. ప్రకృతమందు ప్రత్యగాత్మ యొకశబ్దముచే ముఖ్యముగా బోధింపఁబడనందున మఱియొకశబ్దముచే ముఖ్యముగా లక్షింపఁబడదని భావము.

వాక్య. తత్రాహ. ౨౩౬

దం-అ. దీనియందు చెప్పుచున్నాఁడు.

**తా.** పూర్వపక్షవాదిచేసిన ఈయాక్షేపమునందు పరిహారమును సిద్ధాంతవాది చెప్పుచున్నాఁడు.

శ్లో. త్వమిత్యేతద్ద్వయాన్యన్న వర్తాత్మావబోధనే,
సమస్తీహ త్వమర్థోఽపి గుణలేశేన వర్తతే. ౯౮

దం-అ. 'త్వం' (నీవు) అనేశబ్దమును వదలి మఱియొకమార్గము ఆత్మను తెలియఁజేయుట యందులేదు. 'త్వం' (నీవు) అనేపదమున్ను ఈయాత్మయందు గుణలేశముచేతనే (లక్షణావృత్తిచేతనే) వర్తించుచున్నది.

**తా.** ఆత్మస్వరూపమును బోధించుటయందు 'త్వం, అహం' (నీవు, నేను) అనే పదములుతప్ప మఱివేఱుపదములు లేవు. ఆ 'త్వం, అహం' అనేపదములున్ను గుణవృత్తిచేతనే ఆత్మను బోధించుచున్నవి. ముఖ్యవృత్తిచేత నాత్మను బోధించే మఱియొక శబ్దము లేనేలేదు. అయినను, ఆత్మ 'త్వమహం' పదములకు లక్ష్యము కాకమానదు. వాచ్యత్వము లక్ష్యత్వమునందు ప్రయోజకము కానేరదు. అనఁగా నొకశబ్దమునకు వాచ్యమైనయర్థమే (ఒకశబ్దముచేత ముఖ్యవృత్తిచే బోధింపఁబడే యర్థమే) మఱియొకశబ్దమునకు లక్ష్యమైయుండును (మఱియొకశబ్దముచేత లక్షణావృత్తిచే లక్షింపఁబడు) అనే నియమములేదు. ముఖ్యార్థముతోటి సంబంధము కలిగియుండుటమాత్రమే లక్ష్యత్వమునందు ప్రయోజకమైయున్నది. ప్రత్యగాత్మ 'త్వమహం'పదములకు ముఖ్యార్థమైన అంతఃకరణముతోటి సంబంధించియున్నది. కాన 'త్వమహం' పదములకు లక్ష్యమైయున్నది. 'యతో వాచో నివర్తంతే'యనుశ్రుతి ప్రత్యగాత్మను ముఖ్యవృత్తిచే బోధించుశబ్దమే లేదనిచెప్పుచున్నది. ఇదిగాక శబ్దమును ప్రవర్తించుటకు జాతిగుణక్రియలు కారణమైయున్నవి. అవి ప్రత్యగాత్మయందు లేవు. కావున, ప్రత్యగాత్మ యే శబ్దముచేతను ముఖ్యవృత్తిచే బోధింపఁబడనందున నంతఃకరణవాచకములైన 'త్వమహం' శబ్దములచేతనే లక్షణావృత్తిచేత తెలియఁబడుచున్నదని భావము.

అవ. పూర్వపక్షవాది మరల యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. కస్మాత్ పునర్హేతో ర్హ్యహ మిత్యేతదపి గుణలేశేన
వర్తతే న పునస్సాక్షాదేవేతి. ౧౩౭

దం-అ. 'అహం' (నేను) అనేఈపదమున్ను గుణవృత్తిచేతనే ప్రత్యగాత్మయందు ప్రవర్తించుచున్నది. ముఖ్యవృత్తిచేతననిన చో ప్రవర్తించదని యేకారణమువల్ల చెప్పఁబడుచున్నది?

తా. 'త్వం' (నీవు), 'అహం' (నేను) ఇత్యాదిపదములు ముఖ్యవృత్తిచేతనే ప్రత్యగాత్మస్వరూపమును బోధించునని ఏల చెప్పకూడదు? లక్షణావృత్తిచేతనే ప్రవర్తించుచున్నవని యేలచెప్పుచున్నారని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నారు.—

వాక్య. విధూత సర్వకల్పనా కారణ స్వాభావ్యాదాత్మనః. ౨౩౭

దం-అ. 'ఆత్మ' సకలమైన కల్పనలకు కారణమైనవానిని నిరాకరించియుండు స్వభావముకలవాఁడై యున్నందువల్లను.

తా. 'గౌ శ్శుక్ల శ్చలః'-(గోవు-యెద్దు-తెల్లనిది-చలించుచున్నది) ఇత్యాది వ్యవహారములయందు గవాదిశబ్దములు గోత్వాదిజాతులను, శుక్లాదిశబ్దములు శ్వైత్యాది గుణములను, చలాదిశబ్దములు చలనాదిశబ్దములను అవలంబించి ప్రవర్తించుచున్నవి. కాన, జాతిగుణక్రియలు, సర్వవ్యవహారములయందు శబ్దార్థములకు వాచ్యవాచకభావమును కల్పించునవియై యున్నవి. అట్టి కల్పనములైన జాతిగుణక్రియలు అసంగప్రత్యగాత్మయందు నివృత్తములైయున్నవి గనుక, ప్రత్యగాత్మకు ఏశబ్దములున్ను వాచకములై యుండవని భావము.

వాక్య. అత ఆహ. ౨౩౮

దం-అ. అందువలన చెప్పుచున్నాఁడు.

తా. ఈయర్థమును శ్లోకముతో చెప్పుచున్నాఁడని భావము.

శ్లో. వ్యోమ్ని ధూమతుషారాభ్రమలినాసీవ దుర్ధియః,
కల్పయేయు స్తథా మూఢాః సంసారం ప్రత్యగాత్మని. ౮౮

దం-అ. దుష్టబుద్ధి కలవారు (భ్రాంతులు) ఆకాశమందు పొగను, మంచును, మేఘమును, మాలిన్యమునువలె ఆప్రకారమే మూర్ఖులు (అవివేకులు) ప్రత్యగాత్మయందు సంసారమును కల్పించెదరు.

తా. లోకములో వివేకహీనులగుమనుష్యులు, ఎట్టిపదార్థముతోనున్ను సంబంధించని స్వభావముకలిగి నిర్మలమైయుండే ఆకసమందు ధూమముకలదని, మంచున్నదని, మేఘములున్నవని యేలాగున కల్పించుచున్నారో, ఆలాగుననే వివేకహీనులు అసంగస్వప్రకాశకూటస్థస్వభావముగల ప్రత్యగాత్మయందు దుఃఖిత్వాదిసంసారధర్మములు కలవని కల్పించుచున్నారు; గాని, వాస్తవముగా జాతిగుణక్రియాదిధర్మములు లేవు గనుకనే, ప్రత్యగాత్మను ముఖ్యవృత్తిచే బోధించుశబ్దములు లేవని భావము.

అవ. పూర్వపక్షవాది మరల యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. నను సర్వకల్పనానామప్యాత్మని అత్యంతాసంభవే సమానేఽహం వృత్తౌ కః పక్షపాతే హేతుః-యేనవృత్త్యంతరాణి విధూయాహం వృత్త్యైవాత్మోపలక్ష్యత ఇతి. ౨౮౦

దం-అ. ఓయీ! ఆత్మయందు బొత్తిగా సంభవించకపోవుట అన్నికల్పనలకు సమానమైయుండఁగా 'అహం'శబ్దమునందు పక్షపాతమునొందుట కేమి కారణము? ఎందుచేత నితరశబ్దములవదలి అహంశబ్దముచేతనే యాత్మ లక్షింపఁబడునని చెప్పుచున్నావు?

తా. అహంకారము (అంతఃకరణము) ఆత్మయందు ఏలాగున కల్పింపఁబడినదో, దేహఘటపటాదివస్తువులున్ను ఆత్మయం దాలాగుననే కల్పింపఁబడియున్నవి కదా? ఇటులుండ అహంకారవాచకమైన అహంశబ్దముచేతనే ఆత్మ బోధింపఁబడును గాని, దేహఘటాదివాచకములైన దేహాదిశబ్దములచే నాత్మ బోధింపఁబడదని నిశ్చయించుట కేమికారణమని భావము.

అవ. ఈప్రకారముగా పూర్వవాది చేసిన యాక్షేపమునకు సిద్ధాంతవాది పరిహారమును చెప్పుట కారంభించుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతే. ౨౮౧

దం-అ. చెప్పఁబడును.

తా. ఈయాక్షేపమునకు పరిహారము చెప్పఁబడునని భావము.

శ్లో. చిన్నిభేయమహం వృత్తిః ప్రతీచీవాత్మనోఽన్యతః,
పూర్వోక్తేభ్యశ్చ హేతుభ్యః తస్మాదాత్మా నయోచ్యతే. ౧౦౦

దం-అ. ఈయహంకారము చిత్సదృశమైయున్నది. అది ఆత్మకు పిదప తానే యన్యములకంటే ప్రత్యగ్భూతమైయున్నది. ఇందువలననున్ను, పూర్వమున చెప్పఁబడిన కారణమువల్లనున్ను, ఆత్మ ఈ 'అహం' వృత్తిచేతనే లక్షింపఁబడుచున్నది.

తా. అహంకారము (అంతఃకరణము) చిదాత్మయం దన్నింటికంటె ముందుగా కల్పింపఁబడినందున చిత్సదృశమైయున్నది. అనఁగా తప్తాయఃపిండమువలె ఇదియే చిద్రూపముకాఁబోలునని సంశయించఁదగియున్నది. ఇదిగాక దేహేంద్రియాదుల కన్నింటికిని చిదాత్మయే ఆంతరమై (లోనున్నదై)యున్నది. అట్టిచిదాత్మకు పిదప నీయహంకారమే సర్వాంతరమైయున్నది. అనఁగా నహంకారము దేహేంద్రియాదులకంటె చిదాత్మకు అవ్యవహితసామీప్యముకలిగియున్నది. ఈహేతువులచేత అహంకారవాచకమైన 'అహం'శబ్దమే ఆత్మలక్షకముగాని, ఇతరశబ్దము లాత్మలక్షకములుగావని 'అహం' శబ్దమందు మేము పక్షపాతముకలవారమై యుంటిమని భావము.

అవ. పూర్వవాది చేయుంనాక్షేపమును ననువదించుచున్నాఁడు.—

శ్లో. అనేన గుణలేశేన హ్యాత్మ్యహం కర్తృకర్మయా,
లక్ష్యతేఽసావహం వృత్త్యా నాంజసాత్రాభిధీయతే. ౧౦౨

దం-అ. ఈశ్లోకాన్వయార్థములు ౨౪౨ వ వాక్యముక్రిందనే తెలుపఁబడెను.

వాక్య. నాంజసాత్రాభిధీయత ఇతికో హేతురితిచేత్. ౨౪౩

దం-అ. ముఖ్యవృత్తిచేత ఆత్మ బోధింపఁబడఁడని చెప్పుట కేమికారణమనఁగా.

తా. హేతువును చెప్పకయే ప్రత్యగాత్మ ముఖ్యవృత్తిచే చెప్పుటకు శబ్దమే లేదని చెప్పవచ్చునా యన్నచో నందులకు సమాధానము చెప్పెదమని భావము.

శ్లో. షష్ఠీగుణక్రియాజాతి రూఢయశ్శబ్దహేతవః,
నాత్మన్యన్యతమోఽమీషాం తేనాత్మా నాభిధీయతే. ౧౦౩

దం-అ. సంబంధము, గుణము, క్రియ, జాతి, రూఢి ఇవియైదును శబ్దమునకు కారణములు. వీటిలో నొక్కటియైనను ఆత్మయందులేదు. అందుచేత ఆత్మ చెప్పఁబడదు.

తా. రాజపురుషాదిశబ్దములు రాజునకు పురుషునకు స్వామి భృత్యసంబంధమును నిమిత్తముగాఁజేసికొని అర్థబోధకములైయున్నవి శుక్లం, నీలాదిశబ్దములు గుణమును నిమిత్తముగాఁజేసికొని ప్రవర్తించుచున్నవి. పాచకాదిశబ్దములు పాకాదిక్రియలను నిమిత్తముగాఁజేసికొని ప్రవర్తించుచున్నవి. (పాచకుఁడు అనఁగా వంటఁజేయువాఁడు) ఘుట పటాదిశబ్దములు జాతిని నిమిత్తముగాఁజేసికొని అర్థబోధకములైయున్నవి. ఆకాశచంద్రసూర్యాదిశబ్దములు రూఢిని నిమిత్తముగాఁజేసికొని అర్థమునుబోధించుచున్నవి. కాన, లోకములోనుండు యీవచ్ఛబ్దములు తమతమయర్థములను బోధించునప్పుడు ఆయాయర్థములయందుగల సంబంధ, గుణ, క్రియా, జాతి, రూఢులలో నొకదానిని నిమిత్తముగాఁ జేసికొనుచున్నవి.శబ్దప్రవృత్తినిమిత్తము లైదింటిలో నొకటియైనను ప్రత్యగాత్మయందులేదు. కాన, ప్రత్యగాత్మను ముఖ్యవృత్తిచే బోధించుశబ్దములేదని చెప్పినాముగాని నిష్కారణముగా చెప్పినవారముఁ కామని భావము.

అవ. పూర్వవాది మరల నాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. యదిశబ్దః అభిధానాభిధేయత్వ సంబంధాంగీకారేణ
నాత్మనివర్తతే కథం శబ్దాదహం బ్రహ్మాస్మీతి సమ్యగ్బోధో
త్పత్తిః. ౨౪౪

దం-అ. శబ్దము వాచ్యవాచకభావసంబంధము నంగీకరించుటచేత ఆ
ప్రవర్తించును; గానిచో శబ్దమువలన (వాక్యమువలన) 'అహంబ్రహ్మాస్మి' (నే
నైతిని) యనే పరమార్థజ్ఞానము యేప్రకారము పుట్టుచున్నది?

తా. ఆత్మకును, అహమాదిశబ్దములకును వాచ్యవాచకసంబంధనూలు
అహమాదిశబ్దములకు ప్రత్యగాత్మ గోచరించదుగదా ? అప్పుడు 'తత్త్వమసి
బ్రహ్మాస్మి' ఇత్యాదివాక్యములచేత ప్రత్యగ్బ్రహ్మైక్యరూపతత్త్వజ్ఞానము యేలాగ
నని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుట కారంభించుచున్నాఁడు.

వాక్య. ఉచ్యతే.

దం-అ. చెప్పఁబడును.

తా. సమాధానము చెప్పఁబడునని భావము.

శ్లో. అసత్యే వర్త్మని స్థిత్వా నిరుపాయ ముపేయతే,
ఆత్మత్వే కారణాద్వృద్ధైః గుణవృత్త్యా విబోధితాః.

దం-అ. మిథ్యాభూతమైన మార్గమందుండి ఉపాయములేని ఆత్మస్వ
పొందఁబడుచున్నది. ఆత్మత్వమనే కారణమువల్ల అముఖ్యవృత్తిచేత బోధిం
న్నారని తెలిసికొనుచున్నాము.

తా. ఆత్మస్వరూపము నిర్గుణమై, నిష్క్రియమై, నిరాకారమై,
యున్నందున సాక్షాత్తుగా తెలియుటకు తగినయుపాయము కలదిగాదు. కా
స్వరూపమందు కల్పింపఁబడి మిథ్యాభూతమైయున్న ఏదో ఒకవస్తువును అ
తద్వారా శుద్ధమైన ఆత్మస్వరూపము తెలియఁబడుచున్నది. అనఁగా మిథ్యా
లైన రేఖావిశేషములకును, సత్యములైన అకారాదివర్ణములకును సంబంధ
లేకపోయినను ఆ రేఖావిశేషములచేత (గీతలచేత) సత్యములైన అకారాది
యేలాగున తెలియఁబడుచున్నవో, యాలాగుననే మిథ్యాభూతములైన అహం
కును, పరమార్థసత్యమైన ప్రత్యగాత్మకును సంబంధమేమియు లేకపోయినను
కారాదులచేత సత్యమైన యాత్మతత్త్వము తెలియఁబడుచున్నదని భావము.
లోకములో ప్రమాణాంతరసిద్ధమైన తీరాదులచే లక్ష్యత్వము కలిగియున్నది. ఆత్మ
ణాంతరసిద్ధము కాదుగదా? ఏలాగున 'తత్త్వమస్యా'దివాక్యములచేత లక్ష్యమ
కించతగదు. తీరాదులు జడములైనందున ప్రమాణాంతరముచే ప్రకాశింపఁజేయ
న్నవి. ఆత్మస్వరూపము చిద్రూపమైనందున స్వయంప్రకాశమైయున్నది. కా
ణాంతరసిద్ధిని యపేక్షింపదు. అందువలన ఆత్మస్వరూపము 'తత్త్వమస్యా'ది

వలన లక్షణావృత్తిచే బోధింపఁబడుచున్నదని మేము తెలిసికొనుచున్నారమని భావము.

అవ. పూర్వపక్షవాది మరల నాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. కథం పునరభిధాన మభిధేయేనా నభిసంబంధం సద నభిధేయేఽర్థే ప్రమాంజనయతీతి. ౨౮౬

దం-అ. వాచకమైనశబ్దము వాచ్యమైనయర్థముతోటి సంబంధించినదై తనచేత చెప్పఁదగనియర్థమందు జ్ఞానము నేలాగున బుట్టించును?

తా. అకారాదివర్ణబోధకములైన రేఖావిశేషములు అకారాదివర్ణములతో సంబంధము లేనివైనను అకారాదివర్ణజ్ఞానమును కలుగచేయుచున్నందున ఉపాయము ఉపేయముతో సంబంధించకపోయినను ఉపేయార్థమును బోధించునని యంగీకరించ వచ్చును. వాచకమైనశబ్దము వాచ్యముతో సంబంధములేనిచో వాచ్యార్థమును నేలాగున బోధించును? అని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. శృణు యథా అనభిసంబంధమప్యనభిధేయేఽర్థేఽవి ద్యా నిరాకారణముఖేన బోధయతి. ౨౮౭

దం-అ. వినుము సంబంధించనిదైనను చెప్పశక్యముగాని యర్థమునందు అవిద్యను నిరాకరించుట మూలముగా నెటుల బోధమును కలుగఁజేయునో.

తా. వాచకము వాచ్యముతో సంబంధములేనిదైనప్పటికి అవిద్యను నశింపఁజేయును లక్ష్యార్థవిషయమైన జ్ఞానము నెటుల పుట్టించునో, ఆప్రకారము నీదృష్టాంతముగా చెప్పెదను వినుమని భావము.

అవ. శ్లోకము నవతరింపఁజేయుచున్నాఁడు.—

వాక్య. ఇత్యాహ. ౨౮౮

దం-అ. ఈప్రకారము చెప్పుచున్నాఁడు.

శ్లో. శయానాః ప్రాయశో లోకే బోధ్యమానాః స్వనామభిః,
సహసైవ ప్రబుధ్యంతే యథైవం ప్రత్యగాత్మని. ౧౦౫

దం-అ. లోకములో తరుచుగా నిద్రించువారు తమనామములచేత మేలుకొలుపఁబడుచున్నవారై త్వరగా నేప్రకారము ప్రబోధమును బొందుచున్నారో, ఆప్రకారముగనే ప్రత్యగాత్మయందు వాక్యము ప్రబోధమును కలుగఁజేయును,

తా. నిద్రించుచున్న పురుషుఁడు ఓ దేవదత్తుఁడా! లెమ్మని పిలువఁబడినవాఁడై ఆశబ్దము ఏయర్థమును చెప్పుచున్నదో అది తెలియకపోయినను, ఆశబ్దమును వినినంతనే నిదురనువదలి ప్రబోధమును కలవాఁడగుచున్నాఁడనుటను మనమందఱమును చూచుచున్నదేగదా? కాన, వాచ్యవాచకములసంబంధము తెలిసినంగాని యర్థజ్ఞానము కలుగదనే నిర్బంధములేదు. అటులే అవిద్యానిదుర ననుభవించుచున్న పురుషుఁడు 'తత్త్వమస్యా'దివాక్యములచేత ప్రబోధింపఁబడినవాఁడై, ఆవాక్యము యేయర్థముతో సంబంధించియున్నదో ఆసంబంధమును తెలియకపోయినను, ఆవాక్యశ్రవణముచేతనే అవిద్యానిద్రను పరిత్యజించి 'అహంబ్రహ్మాస్మి' యనే యఖండజ్ఞానము కలవాఁడగుచున్నాఁడను అని భావము.

అవ. ఓయీ! నిదురబోవువాని లేపునట్టి 'హే దేవదత్తో త్తిష్ఠ' (ఓయి దేవదత్తుఁడా లెమ్ము.) ఇత్యాదివాక్యములు పూర్వప్రబోధకాలమందు దేవదత్తాద్యర్థములయందు వాచ్యవాచకభావసంబంధములు కలవిగా గ్రహింపఁబడియున్నవి. కాన తత్కాలమునందు సంబంధగ్రహణము లేనిదైనను ప్రబోధమును కలుగఁజేయుననిచో నంగీకరింపఁదగియున్నది. ప్రకృతమందు 'తత్త్వమస్యా'దివాక్యములుగాని, వానియందలి 'తత్, త్వం' ఆది పదములుగాని ప్రత్యగాత్మయందు ఎప్పటికిని వాచ్యవాచకభావసంబంధముకలవిగా గ్రహింపఁబడియుండలేదు. అట్టిశబ్దములు ఏలాగున ప్రబోధమును కలుగఁజేయుననగి శంకించగా నుత్తరము చెప్పఁబడుచున్నది. —

శ్లో. న హి నామ్నాస్తి సంబంధో వ్యుత్థితస్య శరీరతః,
తథాపి బుధ్యతే తేన యథైవం తత్త్వమిత్యతః. ౧౦౬

దం-అ. శరీరమువలన వ్యుత్థానమును బొందినవానికి నామముతోటి సంబంధము లేదుగదా? అయినను ఆనామముతో మేలుకొనుచున్నాఁడు. ఇది ఎటువలెనో అటులే 'తత్త్వమసి' యనేవాక్యమువల్లను ప్రబోధముకలవాఁడగును.

తా. నిదురించువానికి శరీరేంద్రియాదులయందు అభిమానములేదు. అనఁగా ఇది నాశరీరము, ఇవి నాయింద్రియములు అనేజ్ఞానములేదు. కావుననే, ఓయీ! దేవదత్తుఁడా! లెమ్ము. అనేప్రబోధవాక్యములను వినుటగాని, ఆవాక్యములు ఏయర్థములను బోధించుచున్నవో ఆసంబంధములను గ్రహించుటగాని నిదురించినవానికి సంభవించదు. సంభవించుననిచో ప్రబోధము (దేహేంద్రియాదిజ్ఞానము) కలిగియుండుటవలన వాక్యములు వినఁబడినవని, వాక్యములు వినఁబడినందున ప్రబోధముకలిగెనని పరస్పరాశ్రయము ప్రసక్తించును. కాన వాక్యవాక్యార్థములకు సంబంధము తెలియకనుండగనే,

సుషుప్తియందు వాక్యము సకృచ్ఛ్రవణముచేతగాని, యసకృచ్ఛ్రవణముచేతగాని ప్రబోధమును కలుగఁజేయుచున్నదని అంగీకరించవలసియున్నది. అటులే 'తత్త్వమస్యా'దివాక్యమున్ను వాచ్యార్థముతోఁటి సంబంధములేనిదైనను, సంబంధజ్ఞానములేనిదైనను, అవిద్యానివృత్తిపూర్వకముగా ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానమును కలుగఁజేయుచున్నది. ఇదిగాక శబ్దార్థములయొక్క వాచ్యవాచకసంబంధజ్ఞానము వాచ్యార్థమును తెలియఁజేయునపుడే యపేక్షితమై యున్నదిగాని లక్ష్యార్థమును దెలియునప్పుడు అపేక్షితమై యున్నది గాదు. ప్రవాహవాచకమైన గంగాశబ్దము తీరవాచకముకాకపోయినను, లక్షణావృత్తిచేత తీరమును బోధించుచున్నది. అటులే 'తత్త్వమస్యా'దివాక్యము, అంతఃకరణావ్యవచ్ఛిన్నచైతన్యవాచకమై అఖండైకరసస్వప్రకాశపరబ్రహ్మబోధమును కలుగఁజేయుననుటకు అనుపపత్తి కొంచెమైనను కానరాదని భావము.

అవ. ఓయీ! మంచిది. 'తత్త్వమస్యా'దివాక్యమువలన ప్రత్యగాత్మవిషయికజ్ఞానము పుట్టుగాక, నివర్తింపఁజేయఁబడే యజ్ఞానమునకున్ను నివర్తింపఁజేయుచున్న జ్ఞానమునకును ఆత్మ ఆశ్రయమైయున్నందున ఆయాత్మకు సవికారత్వము ప్రాప్తించును. అని శంకించగా ఆశంకను దృష్టాంతమునుచెప్పి పరిహరించుచున్నారు.—

వాక్య. యథాచ.　　　౭౮౯

దం-అ. ఎటువలెనంటే.

తా. దృష్టాంతమును చెప్పెదమని భావము.

శ్లో. బోధాబోధౌ నభోఽస్పృష్ట్వా కృష్ణధీ నీడగౌ యథా,
బాధ్యేతరాత్మకౌ స్యాతాం తథైవాత్మని గమ్యతామ్.　　౧౦౭

దం-అ. నీలత్వజ్ఞానమున కాశ్రయమైయున్న ఆకసమునందలి జ్ఞానాజ్ఞానములు ఆకసమును స్పృశించకయే యేతీరున బాధ్యబాధకములుగనుండెనో యాతీరుననే ఈ ప్రత్యగాత్మయందున్ను తెలియఁబడుఁగాక.

తా. ఆకసము మూర్తద్రవ్యముకానందున రూపహీనము. అనునది జ్ఞానము. ఆకసము నీలోత్పలమువలె అతినీలమై యున్నది యనునది అజ్ఞానము. ఈజ్ఞానాజ్ఞానములు రెండున్ను ఆకసము నాశ్రయించియుండియును, ఆయాకసమునందు వికారమును సంపాదించకనే జ్ఞానము అజ్ఞానమును నివర్తింపఁజేయుచున్నది. అనఁగా ఆకాశము రూపరహితము అనేజ్ఞానము పుట్టినప్పుడుగాని, ఆకాశము నీలముగానున్నది అని అజ్ఞానము పుట్టినప్పుడుగాని, ఆకాశమునం దేవిధమైనవికారము సంభవించినదిలేదు. అయినను ఆకాశము రూపరహితమనేజ్ఞానముచేత ఆకాశము నీలమనే అజ్ఞానము నివర్తిందు

తా. నిద్రించుచున్న పురుషుఁడు ఓీ దేవదత్తుఁడా! లెమ్మని పిలువఁబడినవాఁడై ఆశబ్దము ఏయర్థమును చెప్పుచున్నదో అది తెలియకపోయినను, ఆశబ్దమును వినినందున నిదురనువదలి ప్రబోధమును కలవాఁడగుచున్నాఁడనుటను మనమందఱమును చూచుచున్నదేగదా? కాన, వాచ్యవాచకములసంబంధము తెలిసినంగాని యర్థజ్ఞానము కలుగదనే నిర్బంధములేదు. అటులే అవిద్యానిదుర ననుభవించుచున్న పురుషుఁడు 'తత్త్వమస్యా'దివాక్యములచేత ప్రబోధింపఁబడినవాఁడై, ఆవాక్యము యేయర్థముతో సంబంధించియున్నదో ఆసంబంధమును తెలియకపోయినను, ఆవాక్యశ్రవణముచేతనే అవిద్యానిద్రను పరిత్యజించి 'అహంబ్రహ్మాస్మి' యనే యఖండజ్ఞానము కలవాఁడగుచున్నాఁడు. అని భావము.

అవ. ఓయీ! నిదురబోవువాని లేపునట్టి 'హే దేవదత్తో త్తిష్ఠ' (ఓయి దేవదత్తుఁడా లెమ్ము.) ఇత్యాదివాక్యములు పూర్వప్రబోధకాలమందు దేవదత్తాద్యర్థములయందు వాచ్యవాచకభావసంబంధములు కలవిగా గ్రహింపఁబడియున్నవి. కాన తత్కాలమునందు సంబంధగ్రహణము లేనివైనను ప్రబోధమును కలుగఁజేయుననినచో నంగీకరింపఁదగియున్నది. ప్రకృతమందు 'తత్త్వమస్యా'దివాక్యములుగాని, వానియందలి 'తత్, త్వం' ఆది పదములుగాని ప్రత్యగాత్మయందు ఎప్పటికిని వాచ్యవాచకభావసంబంధము కలవిగా గ్రహింపఁబడియుండలేదు. అట్టిశబ్దములు ఏలాగున ప్రబోధమును కలుగఁజేయుననిశంకించగా నుత్తరము చెప్పఁబడుచున్నది.—

శ్లో. న హి నామ్నాస్తి సంబంధో వ్యుత్థితస్య శరీరతః,
తథాపి బుధ్యతే తేన యథైవం తత్త్వమిత్యతః. ౧౦౬

దం-అ. శరీరమువలన వ్యుత్థానమును బొందినవానికి నామముతోటి సంబంధము లేదుగదా? అయినను ఆనామముతో మేలుకొనుచున్నాఁడు. ఇది ఎటువలెనో అటులే 'తత్త్వమసి' యనేవాక్యమువల్లను ప్రబోధముకలవాఁడగును.

తా. నిదురించువానికి శరీరేంద్రియాదులయందు అభిమానములేదు. అనఁగా ఇది నాశరీరము, ఇవి నాయింద్రియములు అనేజ్ఞానములేదు. కావుననే, ఓయీ! దేవదత్తుఁడా! లెమ్ము. అనేప్రబోధవాక్యములను వినుటగాని, ఆవాక్యములు ఏయర్థములను బోధించుచున్నవో ఆసంబంధములను గ్రహించుటగాని నిదురించినవానికి సంభవించదు. సంభవించుననినచో ప్రబోధము (దేహేంద్రియాదిజ్ఞానము) కలిగియున్నందున వాక్యములు వినఁబడినవని, వాక్యములు వినఁబడినందున ప్రబోధముకలిగెనని పరస్పరాశ్రయము ప్రసక్తించును. కాన వాక్యవాక్యార్థములకు సంబంధము తెలియకనుండగనే,

సుషుప్తియందు వాక్యము సకృచ్ఛ్రవణముచేతగాని, యసకృచ్ఛ్రవణముచేతగాని ప్రబోధమును కలుగఁజేయుచున్నదని అంగీకరించవలసియున్నది. అటులే 'తత్త్వమస్యా'దివాక్యమున్ను వాచ్యార్థముతోఁటి సంబంధములేనిదైనను, సంబంధజ్ఞానములేనిదైనను, అవిద్యానివృత్తిపూర్వకముగా ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానమును కలుగఁజేయుచున్నది. ఇదిగాక శబ్దార్థములయొక్క వాచ్యవాచకసంబంధజ్ఞానము వాచ్యార్థమును తెలియఁజేయునపుడే యపేక్షితమై యున్నదిగాని లక్ష్యార్థమును దెలియునప్పుడు అపేక్షితమై యున్నదిగాదు. ప్రవాహవాచకమైన గంగాశబ్దము తీరవాచకముకాకపోయినను, లక్షణావృత్తిచేత తీరమును బోధించుచున్నది. అటులే 'తత్త్వమస్యా'దివాక్యము, అంతఃకరణాద్యవచ్ఛిన్నచైతన్యవాచకమై అఖండైకరసస్వప్రకాశపరబ్రహ్మబోధమును కలుగఁజేయునను టకు అనుపపత్తి కొంచెమైనను కానరాదని భావము.

అవ. ఓయీ! మంచిది. 'తత్త్వమస్యా'దివాక్యమువలన ప్రత్యగాత్మవిషయికజ్ఞానము పుట్టుగాక. నివర్తింపఁజేయఁబడే యజ్ఞానమునకున్ను నివర్తింపఁజేయుచున్న జ్ఞానమునకును ఆత్మ ఆశ్రయమైయున్నందున ఆయాత్మకు సవికారత్వము ప్రాప్తించును. అని శంకించగా ఆశంకను దృష్టాంతమునుచెప్పి పరిహరించుచున్నారు.—

వాక్య. యథాచ. ౨౮౯

పం-అ. ఎటువలెనంటే.

తా. దృష్టాంతమును చెప్పెదమని భావము.

శ్లో. బోధాబోధౌ నభోఽస్పృష్ట్వా కృష్ణధీ నీడగౌ యథా,
బాధ్యేతరాత్మకౌ స్యాతాం తథేహాత్మని గమ్యతామ్. ౧౦౭

పం-అ. నీలత్వజ్ఞానమున కాశ్రయమైయున్న ఆకసమునందలి జ్ఞానాజ్ఞానములు ఆకసమును స్పృశించకయే యేతీరున బాధ్యబాధకములుగనుండెనో యాతీరుననే ఈ ప్రత్యగాత్మయందున్ను తెలియఁబడుఁగాక.

తా. ఆకసము మూర్తద్రవ్యముకానందున రూపహీనము. అనునది జ్ఞానము. ఆకసము నీలోత్పలమువలె అతినీలమై యున్నది యనునది అజ్ఞానము. ఈజ్ఞానాజ్ఞానములు రెండున్ను ఆకసము నాశ్రయించియుండియును, ఆయాకసమునందు వికారమును సంపాదించకనే జ్ఞానము అజ్ఞానమును నివర్తింపఁజేయుచున్నది. అనఁగా ఆకాశము రూపరహితము అనేజ్ఞానము పుట్టినప్పుడుగాని, ఆకాశము నీలముగానున్నది అని అజ్ఞానము పుట్టినప్పుడుగాని, ఆకాశమునం దేవిధమైనవికారము సంభవించినదిలేదు. అయినను ఆకాశము రూపరహితమనేజ్ఞానముచేత ఆకాశము నీలమనే అజ్ఞానము నివర్తించు

చున్నది. అటులే ఆత్మ దుఃఖిత్వాదిసంసారముకలవాఁడనునది అజ్ఞానము. ఆత్మ స్వప్రకాశచిన్మాత్రస్వరూపుఁడనునది జ్ఞానము. ఈరెండును ఆత్మను ఆశ్రయించియున్నను ఆయాత్మ యందేలాగంటివికారములనున్ను సంపాదించవు. జ్ఞానము అజ్ఞానమును నివర్తింపఁజేయును. అని భావము.

అవ. పూర్వపక్షమును కనుపఱచుచున్నాఁడు.—

వాక్య "అసత్యే వర్త్మని స్థిత్వే" త్యుపశ్రుత్యా తివిస్మితో మ
హతాసంభ్రమేణ కశ్చిచ్చోదయతి. ౨౪౦

దం-అ. మిథ్యాభూతమైన మార్గమందు నిలచి అనిచెప్పినయర్థమును విని యాశ్చర్యముకలవాఁడై ఒకానొకఁడు గొప్పసంభ్రమముతో నాక్షేపించుచున్నాఁడు.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము మాయాకల్పితమైనందున మిథ్యాభూత అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము నవలంబించి దానిగుండా సత్యమైనపరబ్రహ్మను చునని ౧౦౪ వ శ్లోకములో చెప్పినయర్థమును విని యొకానొకపండితుఁడు నాశ్చర్యము కలవాఁడై యాక్షేపించుచున్నాఁడని భావము.

అవ. ఏమని యాక్షేపించుచున్నాఁడో చెప్పుచున్నాఁడు.—

శ్లో. నాసన్నుపాయో లోకేఽస్తి పరమార్థవినిశ్చయే,
నాసల్లింగాద్ధి బాష్పాదేః కశ్చిదగ్నిం ప్రపద్యతే.

దం-అ. వాస్తవార్థమును నిశ్చయించుటయందు మిథ్యాభూతమైన యుపాయము లోకములోలేదు. మిథ్యాద్యోతకమైన ఆవిరి మొదలగుదానివలన ఎవ్వఁడును అగ్నిని తెలియఁజాలఁడు.

తా. లోకములో వాస్తవమైనయర్థమును నిశ్చయించేయుపాయము వాస్తవమై యుండవలయును. కాని మిథ్యాభూతమై యుండతగదు. మిథ్యాభూతమైన సాధనముచేత వాస్తవార్థజ్ఞానము కలుగనేరదు. గ్రీష్మతప్తమైన భూమియందు తొలకరి వానకురియఁగా నావిరిలేచి ధూమమువలె కాన్పించును. అది వాస్తవమైనధూమము కానందున వాస్తవమైన బ్రహ్మతత్త్వజ్ఞానమును కలుగఁజేయఁజాలదని భావము.

అవ. ఈయాక్షేపమునకు పరిహారమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. ఇత్యేవం చోదయేద్యోఽపి బోధయేత్తం ఘటాదినా,
సదసద్భ్యాం విభక్తోఽసౌ పర్యాయశ్చ న చానయోః.

దం-అ. ఈప్రకారము ఎవఁడు ఆక్షేపించునో వానిని ఘటము మొదలగు నోరు మూయించవలయును. ఈఘటాదికము సత్యాసత్యములకంటె విలక్షణమైయున్నది. ఈసత్యాసత్యములు రెంటికిని ఒకదానికిఁదప నొకటి సంభవించుటలేదు.

తా. మిథ్యార్థముచేత వాస్తవార్థజ్ఞానము పుట్టింపఁబడదని వాదించేవానికి ఘటాదిపదార్థములను జూపి నిరాకరించవలయును. అనఁగా బ్రహ్మవ్యతిరిక్తము లైన ఘటాదివస్తువులు మాయాకల్పితములైనందున, మిథ్యాభూతములైయున్నవి. ఆయినను జలాహరణాదికార్యములను చేయుచున్నవి. ఘటాదులు శశవిషాణాదుల వలె శూన్యములని చెప్పఁదగినవి కావు. శశవిషాణాదులు కార్యసంపాదకములు కావుగదా? కాన, ఘటాదులు మిథ్యాభూతములైనను జలాహరణాదికార్యములను చేయుచున్నట్లు 'తత్త్వమస్యా'దివాక్యము మిథ్యాభూతమైనను పరమార్థబ్రహ్మజ్ఞానమును సంపాదించుచును. ఘటాదులు మిథ్యాభూతములు కావు. వాస్తవములే యనినచో, నాలాగున ననఁదగదు. ఘటములేదని వ్యవహారము కలిగియున్నందున ఘటము సత్యమని చెప్పఁదగదు. ఘటముకలదనే వ్యవహారము కలిగియున్నందున ఘటము అసత్యమని చెప్పఁదగదు. కాన ఘటాదికము సత్యాసత్యవిలక్షణమైయున్నది. కావుననే మిథ్యాభూతమనఁగా అనిర్వచనీయము. ఘటాదులయందు ఒకప్పుడు సత్తయును, మఱియొకప్పుడు అసత్తయును సంభవించుచుండును. కాన ఘటాదికము సత్యాసత్యమని చెప్పఁదగదని కొందఱు తలఁచెదరు. అదియును యుక్తముకాదు. ఏలననఁగా, సత్త అసత్త యనునవి ధర్మములు. ఇవి వాస్తవములయినచో ఫలాదిస్వరూప ముండుదనుక నుండును. కాన ఘటాదిక మొకప్పుడు సత్తతోటి, మఱియొకప్పు డసత్తతోటి సంబంధించదు. అవాస్తవములయినచో వానితోటి యేమాత్రమును సంబంధించదు. కాన సదసత్తలతోటి సంబంధించుచున్న ఘటాదికము మిథ్యాభూతమనే చెప్పవలయును. ఇదిగాక అసత్యమైన ప్రతిబింబము సత్యమైనబింబజ్ఞానమును కలుగఁజేయుచున్నది. అసత్యమైన స్వప్నవ్యాఘ్రాదిదర్శనము సత్యమైనభయకంపాదులను కలుగఁజేయుచున్నవి. ఆటువలెనే 'తత్త్వమస్యా'దివాక్యము సత్యమైన బ్రహ్మస్వరూపమును బోధించుచున్నదని భావము.

అవ. గతించినగ్రంథార్థము ననువదించుచు ముందుచెప్పఁబోవు గ్రంథతాత్పర్యమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఏవం కుచోద్యమున్మూల్య అథేదానీం ప్రకృత మభిధీయతే ప్రకృతంచానభిధేయే కథమభిధాశ్రుతి రవిద్యాధ్వంస్యాత్మని జ్ఞానం జనయతీతి తత్రైవ కారణాంతర ముచ్యతే. ౨౫౧

దం-అ. ఈప్రకారము కుత్సితమైనయాక్షేపమును పరిహరించి, ఇపుడు ప్రకృ

తమైనయర్థము చెప్పఁబడుచున్నది. వాచకమైనశబ్దము చెప్పుటకు యోగ
ప్రత్యగాత్మయందు అజ్ఞాననాశకమైన జ్ఞానమును పుట్టించుననునది ప్రకృ
ర్థము. దానియందే మఱియొక కారణము చెప్పఁబడుచున్నది.

తా. మధ్యే సంభవించిన శంకను పరిహరించి ప్రకృతార్థమును చె
చున్నాము. ప్రకృతార్థము ఏమన, 'తత్త్వమస్యా'దివాక్యము జాత్యాదిధర్మ
నందున వాచ్యముగాని, ప్రత్యగాత్మవిషయమై సర్వావిద్యానివారకంబగునర్థం
మును పుట్టించుననేయర్థము ప్రకృతమైయున్నది. దీనియందు మఱియొక హే
చెప్పుచున్నానని భావము. అనఁగా అవిద్యానివర్తకమైనజ్ఞానమును పుట్టించున
మస్యా'దివాక్యము. దానియొక్క స్వభావము నాలోచింపగా, వాచ్యార్థస
లేకపోయినను అవిద్యానివర్తకజ్ఞానమును పుట్టించుచున్నదని ఇదివఱకు చెప్పితి
కను నివర్తింపఁజేయఁదగిన అవిద్యయొక్క స్వభావమును ఆలోచించిరను
స్యా'దివాక్యము వాచ్యార్థసంబంధములేకనే అవిద్యానివర్తకజ్ఞానమును పుట్టిం
యర్థమును చెప్పఁబోవుచున్నామని తాత్పర్యము.

శ్లో. అతిదుఃస్థో ప్రబోధోఽత్ర హ్యాత్మైవాస్య ప్రబుధ్యతాం,
నిమిత్తమాత్రాద్వ్యేత్యేషా నాసాగ్రే బదరం యథా.

దం-అ. ఈయాత్మయందజ్ఞానము మిగుల దుఃస్థితమైనది. ఈ బుద్ధి కా
ఆత్మయే (స్వస్వరూపమే) ప్రబోధము. కాన ఈయవిద్య నాసికాగ్రమందున్న
డుపలె స్వల్పనిమిత్తమువల్ల నివర్తించును.

తా. ఉదయాస్తమయశూన్యమై, స్వయంప్రకాశమైన చిన్మాత్రము
ముగాఁగలవాఁడు ప్రత్యగాత్మ. ఇట్టి ప్రత్యగాత్మయందు అప్రకాశరూపమైన
సూర్యునియందంధకారమువలె ప్రతిభాసమాత్రముగా నుండఁదగిన దేగాని
ముగా నుండఁదగినదికాదు. కాన నేమాత్రము నిమిత్తముకలిగినచో నశించిపో
ఎటులనఁగా ముక్కుకొనను రేగుపండు నిలిచియుండఁజాలదు. ఒకవేళ నిలిచినా
స్వల్పమైన చలనమునకు క్రిందపడిపోవును. అటులే అవిద్యయును అత్యల్పని
చేతకూడా నశించునుగాని ప్రబలమై పరమార్థమైన నిమిత్తమే కావలయునని
ధము లేదని భావము.

అవ. పూర్వపక్షవాదియొక్క ఆక్షేపము ననుసరించి పరిహారము చె
న్నాఁడు.—

వాక్య. అనుదితానస్తమితకూటస్థ బోధమాత్రాస్వభా

వ్యాదాత్మనః దుస్సంభావ్యః అవిద్యాసద్భావఇతిచేత్ న, అవిద్యాప్రసిద్ధ్యైవ తత్సద్భావసిద్ధె రులూకనిశావదితి. ౨౫౨

దం-అ. ఆత్మ, ఉదయాస్తమయశూన్యమై నిర్వికారమై యున్నజ్ఞానమమాత్రమే స్వభావముగా కలిగియున్నందున అవిద్యాసద్భావము సంభావింప శక్యమైనదికాదని యనినచో గుడ్లగూబయొక్క రాత్రివలె అవిద్యాప్రసిద్ధిచేతనే అవిద్యయొక్క సద్భావము సిద్ధించుచున్నందున అలాగున చెప్పకూడదు.

తా. ఆత్మస్వరూపము ఉదయాస్తమయవర్జితమై నిత్యనిర్వికారమై స్వయంప్రకాశమైనజ్ఞానమే స్వరూపముగాఁ గలిగియున్నదిగదా? అట్టి యాత్మస్వరూపమునందు అవిద్యకలదని యేలాగున సంభావించవచ్చును (ఊహింపవచ్చును)? అని పూర్వవాది శంకించుచున్నాఁడు. కాని యాలాగున శంకించతగదు. ఏలననఁగా, ప్రత్యక్షముచేతను యుక్తిచేతను ప్రకాశరూపముగా గాన్పించుచున్నపగటియందు రాత్రిత్వము వాస్తవము సంభవించదుగదా? అయినప్పటికిని అట్టిపగటియందు ఉలూకముల (గుడ్లగూబల) యొక్క ప్రత్యక్షముచేత (అనుభవముచేత) రాత్రిత్వము సంభవించుచున్నదిగదా? అటువలెనే ఆత్మయందు శాస్త్రముచేతను తదనుకూలయుక్తిచేతను అవిద్యాసంభావము సంభవించకపోయినను అస్మదాదులయొక్క 'అహమజ్ఞః' (నేను అజ్ఞానిని) ఇత్యాద్యనుభవముచేత, అవిద్య కలిగియున్నట్లు కనుపడుచున్నది. అనుభవసిద్ధమైనదానిని లేదని చెప్పతగదని భావము.

వాక్య. అత ఇదముచ్యతే. ౨౫౩

దం-అ. కనుక ఇది చెప్పఁబడుచున్నది.

తా. అజ్ఞానము అనుభవసిద్ధమైయున్నందున అవశ్య మంగీకరించతగియున్నది. కాన అవిద్యాస్వభావమునుగూర్చి ఈముందు చెప్పఁబడునని భావము.

శ్లో. అహోధార్ష్ట్య మవిద్యాయాః న కశ్చిదతివర్తతే,
ప్రమాణం వస్త్వనాదృత్య పరమాత్మేవ తిష్ఠతి. ౧౧౧

దం-అ. ఏమియాశ్చర్యము! అజ్ఞానముయొక్క నిర్భయప్రవృత్తిని ఎవ్వాఁడును అతిక్రమింపఁజాలఁడు. ప్రమాణమునున్ను వస్తుస్వభావమునున్ను ఆదరించక పరబ్రహ్మవలె నిత్యముగా నుండియున్నది.

తా. అజ్ఞానము ఒకప్రమాణము ననుసరించియుండదు. తనస్వభావమునున్ను తాను అనుసరించియుండదు. తాను వస్తుతః అసత్యమైనప్పటికి సత్యమువలె కనుపడుచున్నది. కాన నిట్టి యజ్ఞానముయొక్కధార్ష్ట్యమును (నిర్భయప్రవర్తనను) ఈశ్వరుఁడు

గాని తత్త్వవేత్తగాని అతిక్రమించి యుండఁజాలరు. అనఁగా తత్త్వవేత్త, ఈశ్వరు డున్ను అవిద్యకు లోఁబడియుందురని భావము.

అవ. అవిద్య వాస్తవసత్తకలదిగాదని చెప్పుచున్నాఁడు.—

వాక్య. యస్మా దవిద్యాప్రసిద్ధ్యైవ అవిద్యాసద్భావసిద్ధిరత ఆత్మవస్తువృత్తానురోధేన న కథంచనాపి తత్సంభావనా ప్యస్తి. ౧౧౪

దం-అ. ఏ కారణమువల్ల అవిద్యయొక్క ప్రసిద్ధిచేతనే అవిద్యయొక్క సత్త సిద్ధించుచున్నదో ఆ కారణమువల్ల ఆత్మవస్తువుయొక్క స్వభావము ననుసరించుటచేత నేవిధముగనైనను ఆయవిద్యయొక్క సంభావనయున్నులేదు.

తా. అవిద్యయొక్క సత్తప్రతీతి సిద్ధమైయున్నదిగాని వాస్తవముగాలేదు. కాన ప్రత్యగాత్మయొక్క స్వభావము నాలోచించిచూడఁగా అవిద్య కలదేమో యని సంశ యించుటకుకూడా వీలులేకయున్నది. అనఁగా అవిద్యయందు దృష్టిని ఉంచిచూచితే అవిద్యయున్నట్లు తోఁచునుగాని, ఆత్మయందు దృష్టినుంచిచూచిన యవిద్య యున్నట్లే తోఁచదని భావము.

వాక్య. యత ఆహ. ౧౧౫

దం-అ. ఎందువల్లనంటే చెప్పుచున్నాఁడు.

శ్లో. జ్ఞానం యస్య నిజం రూపం క్రియాకారకవర్జితమ్,
సంభావనాప్యవిద్యాయా స్తత్ర స్యాత్కేన హేతునా. ౧౧౭

దం-అ. ఏయాత్మకు క్రియాకారకములు లేనిజ్ఞానమే స్వకీయమైనయాకార మైయున్నదో యట్టి యాత్మయందు అవిద్యయొక్కసంభావనయున్ను (ఊహయున్ను) యేకారణముచేత కలుగును?

తా. ఆత్మయొక్కస్వరూపము జ్ఞానమాత్రమైయున్నది. దానికి కర్తగాని,కర్మ గాని, క్రియగాని యేవిధమైనవిశేషమున్ను లేదు. ఇట్టి జ్ఞానమాత్రస్వరూపుఁడైన ప్రత్యగాత్మయందు అజ్ఞానముండవచ్చునని యూహించుటకే కారణములేదని భావము.

అవ. ఓయీ! ఆత్మయందు అవిద్యాసద్భావము ప్రతీతిమాత్రసిద్ధమేగాని పార మార్థికముగాదని యంటివి. అది యటులే యగుఁగాక; అవిద్య ప్రతీతిచేతనైన సిద్ధమై యున్నదిగదా? దానికి వృత్తి యేలాగున కలుగునన, పూర్వమందు చెప్పఁబడియున్న

యన్వయ వ్యతిరేకములతోఁగూడియున్న 'తత్త్వమస్యా'దివాక్యములవల్ల కలుగునని చెప్ప నారంభించుచున్నాఁడు.—

వాక్య. సోఽయమేవ మనుదాతా న స్తమిత అవగతిమాత్ర
శరీర ఆత్మాపిస న్నవిచారిత ప్రసిద్ధావిద్యామాత్ర వ్యవ
హిత ఏవ అతథైవ ఈక్ష్యతే యతోఽతః. ౨౫౬

దం-అ. ఈప్రకారము ఉదయాస్తమయశూన్యమైన చైతన్యమాత్రమే స్వరూపముగాఁగల పూర్వప్రతిపాదితుఁడైన ఈప్రత్యగాత్మ స్వయంప్రకాశుఁడైయుండియు అవిచారకాలమందు ప్రసిద్ధమైయుండే అజ్ఞానమాత్రముచేత వ్యవహితుఁడై అస్వప్రకాశునివలె ఎందువల్ల చూడఁబడుచున్నాఁడో అందువల్లనని ముందటిశ్లోకముతో సంబంధము.

తా. ఆత్మ నిత్యజ్ఞానస్వరూపుఁడై యున్నందున స్వప్రకాశుఁడైయుండిన్ని అవిచారితసిద్ధమైన అజ్ఞానముమాత్రముచేత నడగింపఁబడి స్వప్రకాశతలేనివానివలె కనుపడుచున్నాఁడు గనుక—అని ముందటిశ్లోకతాత్పర్యముతో నేకముగా పఠింపవలయును.

శ్లో. అనుమానాదయం భావా ద్వ్యావృత్తో భావమాశ్రితః,
తతోఽప్యస్య నివృత్తిః స్యా ద్వాక్యాదేవ బుభుత్సతః. ౧౧౩

దం-అ. ఈయాత్మ అనుమానమువలన దేహేంద్రియాదిపదార్థమువలన భేదమును పొందినవాఁడై అభావమును (అసత్తను) పొందినవానివలె యగుచున్నాఁడు. తెలిసికొన నిచ్ఛయించిన నీయాత్మకు ఆయభావమువల్లనున్ను వ్యావృత్తి (వేఱుగానుండుట) వాక్యమువల్లనే కలుగుచున్నది.

తా. విచారణచేయకమునుపు దేహేంద్రియాదిభావములు (వస్తువులు) ఆత్మగా గ్రహింపఁబడియున్నవి. పూర్వోక్తములగు అన్వయవ్యతిరేకములను విచారించుటచేత ఆత్మ దేహేంద్రియాదిభావములకంటె విలక్షణమైనవాఁడని తెలియఁబడునుగాని, ఇట్టివాఁడని విశేషముగా తెలియఁబడనందున అభావమును పొందినవానివలె తోఁచఁబడును. అనఁగా లేనివానివలె తోఁచఁబడును. పిదప 'దేహాదులను నేను కాకపోతిని, దేహాదులకంటె విలక్షణమైయుంటిని. అయితే నేనెవఁడ'నని తనస్వరూపమును తాను తెలియుట కాలోచించగా 'తత్త్వమసి' ఇత్యాది వేదాంతవాక్యములు 'నీవు సాక్షాత్పరబ్రహ్మ'వని బోధించుచున్నది. ఇందువలన వాక్యశ్రవణమునకు పూర్వమందు తోఁచఁబడియున్న అభావస్వరూపముకంటే కూడా ఆత్మకు వైలక్షణ్యము సిద్ధించునని భావము. అన్వయవ్యతిరేకరూపమైన అనుమానమును విచారించగా తనకు దేహాదిభావవైల

క్షణ్యముసిద్ధించి అభావరూపమును బొందినట్లుతోఁచుననిన్ని పిదప తానెవఁడనియోచించగా 'తత్త్వమస్యా'దివాక్యము 'తానే పరబ్రహ్మను' అనిబోధించుటచేత తనకు అభావరూపత్వమును నివర్తించి ప్రత్యగభిన్నుఁడై పరబ్రహ్మస్వరూపుఁడైయుండును గావున అన్వయవ్యతిరేకసహిత'తత్త్వమస్యా'దివాక్యమువలన అవిద్యానివృత్తి కలుగుచున్నదని తాత్పర్యము.

అవ. పూర్వపక్షవాదిచేయుశంకను అనువదించి పరిహారమును చెప్పుటకారంభించుచున్నాఁడు.—

వాక్య. భావవదభావాదపి వ్యావృత్తిరనుమానాదేవ కిమితి నభవతీతి చేచ్ఛృణు. ౨౫౭

దం-అ. భావమునందుండివలె నభావమునందుండి కూడా వ్యావృత్తి (విలక్షణత్వము) అనుమానమువల్లనే ఎందుకనికానేరదనియనినచో వినుము.

తా. ప్రత్యగాత్మ దేహేంద్రియాదిభావపదార్థములకంటె విలక్షణమైనవాఁడనేయర్థము పూర్వోక్తాన్వయవ్యతిరేకయుక్తులచేత ఎటులు సిద్ధించెనో, యటులే అభావవైలక్షణ్యమున్ను అన్వయవ్యతిరేకయుక్తులచేతనే సిద్ధించకూడదు? అభావవైలక్షణ్యముసిద్ధించుటకు అన్వయవ్యతిరేకసహకృత'తత్త్వమస్యా' వాక్యము నపేక్షింపవలసినపనియేమి? యని యాక్షేపించినచో అందునకు సమాధానమును చెప్పుచున్నాను వినుమని భావము.

శ్లో. నవ్యావృత్తిర్యథాభావాత్ భావే నైవా విశేషతః,
అభావాదప్యభావత్వాత్ వ్యావృత్తిర్నతథేష్యతే. ౧౧౪

దం-అ. భావమువల్ల వ్యావృత్తి సమానమైయున్నందున భావముచేతనే యేలాగునలేదో ఆలాగుననే అభావమువల్ల వ్యావృత్తియున్ను అభావమువల్లనే సిద్ధించునని యంగీకరింపఁబడదు.

తా. ప్రత్యగాత్మకు దేహేంద్రియాదిరూపమైన భావపదార్థముకంటే వైలక్షణ్యము ప్రత్యగాత్మభావరూపమై యున్నందున కలిగినదికాదు. ఎందువల్లననఁగా ప్రత్యగాత్మయొక్క భావత్వమున్ను దేహేంద్రియాదులయొక్క భావత్వమున్ను సమానములై యున్నందున ఆత్మయొక్క భావత్వము దేహేంద్రియాదిభావముకంటె వైలక్షణ్యమును ఆత్మకు సంపాదింపఁజాలదు. మఱిదేనివల్ల సంపాదింపఁబడుననన, పూర్వము చెప్పఁబడిన యన్వయవ్యతిరేకముచేత సంపాదింపఁబడుచున్నది. అటులే అన్వయవ్యతిరేకయుక్తిసంపాదితమైన దేహేంద్రియాదివైలక్షణ్యరూపమైన అభావముకంటె వ్యావృత్తియున్ను అన్వయవ్యతిరేకముచేతనే సంపాదింపఁబడదు, ఏలనన, ఆత్మకు దేహేంద్రియాది

వైలక్షణ్యరూపమైన అభావత్వము అనుమానముచేత సంపాదింపఁబడినందున ఆయ భావముకంటె వైలక్షణ్యము మఱల యనుమానము చేతనే సంపాదింపఁబడదు. కావున ఆత్మకు భావవైలక్షణ్యముమాత్రము అనుమానముచేత సంపాదింపఁబడును. అభావవైలక్షణ్యము 'తత్త్వమస్యా'దివాక్యముచేతనే సంపాదింపఁదగియున్నదని భావము.

అవ. ఫలితార్థమును నిగమించుచున్నారు.—

వాక్య. యతో నానుమానేన వ్యావిద్ధాశేషక్రియాకారక
ఫలాత్మని స్వారాజ్యేఽభిషేక్తుం శక్యతే తస్మాత్. ౨౪౮

దం-అ. నివర్తించిన సమస్తమైన క్రియాకారకఫలములుగల స్వరూపముగలిగినట్టి మోక్షమందు అభిషేకించుటకు అనుమానముచేత ఎందువల్ల శక్యమైయుండదో అందువల్లను-అని ముందఱిశ్లోకముతో నన్వయము.

తా. ప్రత్యగభిన్నబ్రహ్మాత్మతారూపమైన స్వారాజ్యము (మోక్షము) క్రియాకారకఫలాదిసకలవికారశూన్యమై యున్నది. ఇట్టి స్వారాజ్యమందు ముముక్షువునకు పట్టాభిషేకముచేయుటకు అనఁగా ఇట్టిమోక్షమును కలుగఁజేయుటకు అన్వయవ్యతిరేకయుక్తిరూపమైన అనుమానమునకు శక్యముకాదు గనుక-అని యుత్తరశ్లోకతాత్పర్యముతోచేర్చి పఠింపవలయును.

శ్లో. అవిద్యావిద్యయాసోఽయం ప్రసుప్తో దుర్వివేకయా,
భావాభావవ్యుదాసిన్యా శ్రుత్యైవ ప్రతిబోధ్యతే. ౧౧౪

దం-అ. విభజించుటకు శక్యముగాని యవిద్యయనే నిద్రచేత గాఢముగా సుప్తినొందియున్న ఆయీముముక్షువు భావాభావములనురెంటిని నివర్తింపఁజేయుచున్న శ్రుతిచేతనే బోధింపఁబడుచున్నాఁడు.

తా. అవిద్యయనునది ప్రమాణాంతరములచేత నివర్తింపఁజేయ శక్యమైనది కాదు. నిదురవలె యాత్మచైతన్యము నావరించి స్వరూపజ్ఞానహీనముగా చేయుచున్నది. ఇట్టి యవిద్యానిదురచేనాక్రమింపఁబడి ప్రత్యగాత్మ గాఢసుషుప్తిగలవానివలెస్వస్వరూపజ్ఞానము లేనివాఁడై యున్నాఁడు. ఇట్టి ప్రత్యగాత్మను దేహేంద్రియాదితాదాత్మ్యమును, అభావరూపత్వమును రెంటిని నిరసించుచున్న 'తత్త్వమస్యా'దివాక్యము అవిద్యానిద్రను నిరాకరించి స్వస్వరూపజ్ఞానమును కలుగఁజేయుచున్నదని భావము.

అవ. ప్రత్యగాత్మయందు అవిద్యాసద్భావమును మఱియొకవిధముగా నిర్వహింపనిమిత్తమై ముందుగా పూర్వపక్షవాదము కనుపఱచుచున్నాఁడు.—

వాక్య. అత్రాహ. ౨౪౯

దం-అ. పూర్వపక్షివాదమును కనుపఱచుచున్నాఁడు. ఇచ్చట-

తా. శుద్ధజ్ఞానస్వరూపుఁడైన ప్రత్యగాత్మయందు అవిద్య సంభ
పూర్వము మేముచెప్పిన యర్థమునందే పూర్వవాది యాక్షేపించుచున్నాఁడని

అవ. ఏమని యాక్షేపించుచున్నాఁడనఁగా చెప్పుచున్నాఁడు.

వాక్య. అనుదితా స్తమిత విజ్ఞానాత్మమాత్రస్వరూపత్వాత్
దుస్సంభావ్యా విద్యేతి. ౨౬౦

దం-అ. ఉదయాస్తమయశూన్యమైన విజ్ఞానమే స్వరూపముగాఁగల
గాత్మ కలదో ఆప్రత్యగాత్మయం దవిద్య సంభావింప శక్యమైనదికాదు.

తా. విశుద్ధజ్ఞానమాత్రస్వరూపుఁడైన ప్రత్యగాత్మయందు అవిద్య
సంభవించునని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమునుచెప్ప నారంభించుచున్నారు.—

వాక్య. నైతదేవమ్.

దం-అ. ఇది ఈప్రకారము కానేరదు.

తా. నీవుచేసిన ఈయాక్షేపము ఈప్రకారము చేయఁదగినది కానేరదు
భావము.

అవ. పూర్వవాది ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. కుతః.

దం-అ. ఎందువల్లను ?

తా. నేనుచేసినయాక్షేపము ఈప్రకారము చేయఁదగినది కానేరదని
ఉముచవలన నిర్ణయించెదవని భావము.

అవ. సిద్ధాంతవాది యుత్తరమునుచెప్పుటకై శ్లోకము నవతరింపఁజేయు
న్నారు.—

వాక్య. యత ఆహ.

దం-అ. ఎందువల్లనంటే చెప్పుచున్నాఁడు.

తా. నీవుచేసినయాక్షేపము ఎందువలన చేయఁదగినదికాదన నాహేతు
చెప్పెదను వినుమని భావము.

శ్లో. కుతో విద్యేతి చోద్యం స్యా న్నైవ ప్రాగ్వేత్వసంభవాత్,
కాలత్రయాపరిచ్ఛిత్తే ర్న చోర్ధ్వం చోద్యసంభవః. ౧

దం-అ. అవిద్య ఎందువల్ల ప్రాప్తించినదనేయాక్షేపము హేతువులేనందున పూర్వమున సంభవించనే సంభవించదు. కాలత్రయమునందును పరిచ్ఛేదములేనందున అనంతరమున్ను ఆక్షేపముయొక్క సంభవమున్ను లేదు.

తా. ఆత్మయం దవిద్య సంభవించ నేరదనేయాక్షేపము తత్త్వజ్ఞానముపుట్టుటకు ముందు చేయఁబడునా? లేక, తత్త్వజ్ఞానము కలిగినపిదప చేయఁబడునా? యని విచారించెదను. అందులో తత్త్వజ్ఞానముకలుగుటకు పూర్వమందు ఈయాక్షేపము సంభవించదు. ఎందువల్లనంటే తత్త్వజ్ఞానము కలుగకముందు ఉదయాస్తమయ శూన్యవిజ్ఞానమాత్రుఁడాత్మయని తెలియనందున నిట్టియాత్మయం దజ్ఞానము ఎటుల సంభవించుననే యాక్షేపముచేయుట కవకాశమేలేదు. ఇదిగాక తత్కాలమందు నే నజ్ఞుఁడనని అజ్ఞానము ప్రత్యక్షముగా ననుభవింపఁబడుచున్నందుననున్ను, ఆయాక్షేపము చేయఁదగినది కాదు. తత్త్వజ్ఞానముకలిగినపిదపనో, శుద్ధవిజ్ఞానస్వరూపుఁడైన ప్రత్యగాత్మయందు ఇంతకుమునుపు అజ్ఞానము వర్తించలేదు. వర్తమానమునందులేదు. ఉత్తరకాలమందు నైతము వర్తింపఁబోదు. అని నిశ్చయింపఁబడినందున ఆత్మయం దజ్ఞానము ఏలాగున సంభవించుననే యాక్షేపమున కవకాశమేలేదని భావము.

అవ. పూర్వపక్షవాదులకు సమ్మతములైన ప్రసంఖ్యానము మొదలగునవి అవిద్యానివర్తకములుగావని చెప్పినయర్థమును నిగమించుచున్నాఁడు.—

వాక్య. యస్మాత్తత్త్వమస్యాదివాక్యమేవ ఆత్మనః అశేషా
మవిద్యాం నిరన్వయామపనుదతి తస్మాత్. ౭౬౮

దం-అ. 'తత్త్వమస్యా'దివాక్యమే ఆత్మయొక్క సకలమైన అజ్ఞానమును సవాసనగా నెందువలన నివర్తింపఁజేయుచున్నదో ఆందువలన-అని యుత్తరశ్లోకముతో నన్వయము.

శ్లో. అద్ధాతమమనాదృత్య ప్రమాణం సదసీతి యే,
బుభుత్సన్తేఽన్యతః కుర్యుస్తేఽక్ష్ణాపి రసవేదనమ్. ౧౧౭

దం-అ. అత్యంతనిశ్చితమైన 'తత్త్వమసి' యనేప్రమాణమును ఆదరించక మఱియొకప్రమాణమువలన యెవరు ఆత్మతత్త్వమును తెలియ నిచ్ఛయించెదరో వారు నేత్రముచేతనున్ను రసజ్ఞానమును చేయుదురు.

తా. ఆత్మయందు భ్రాంతిసిద్ధమై స్ఫురించుచున్నఅజ్ఞానమును, తత్కార్యమైన దేహేంద్రియ సుఖదుఃఖాదిసంసారమునున్ను, 'తత్త్వమస్యా'దివాక్యమే నివర్తింపఁజేయును గాని ప్రసంఖ్యానాదిక్రియావిశేషములు నివర్తింపఁజేయఁజాలవు గనుక;

ఆత్మస్వరూపయాథార్థ్యమును, అపరోక్షముగాఁ జేయుటకు సమర్థమైనందున, అజ్ఞానమును సవాసనగా నివర్తింపఁజేయఁగలదని మిగుల నిశ్చయింపఁబడియున్న 'తత్త్వమస్యా'దివాక్యము నాదరించక (విశ్వసించక), ప్రసంఖ్యానాదిసాధనాంతరములచేత ఆత్మతత్త్వము నెవ్వరు ప్రత్యక్షముగా చేసికొనవచ్చునని తలంచుచున్నారో వారు మిగుల మూర్ఖులు. మధురాదిరసములను తెలియఁజేయుటయందు రసనేంద్రియము (నాలుక) మిక్కిలి సమర్థమై ప్రసిద్ధమైయుండఁగా దానిని వదలి, చక్షురింద్రియముచేత రసములను తెలియ నిచ్ఛయించుచు. కాన, 'తత్త్వమస్యా'దివాక్యమే ఆత్మతత్త్వజ్ఞానమును కలుగఁజేసి యందుమూలమున సకలావిద్యానివర్తిని కలుగఁజేయునని మేముచేసిన సిద్ధాంతము నిర్దోషమైయున్నదని భావము.

అవ. పూర్వపక్షవాదియభిప్రాయమునసువదించిపరిహారమును చెప్పుచున్నాఁడు.

వాక్య. ఏవ మప్రతిహతా మహం బ్రహ్మేతి ప్రమాం త
త్త్వమస్యాదివాక్యం కుర్వదపి న ప్రతిపాదయతీతిచే ద
భిమతం న కుతశ్చనాపి ప్రతిపత్తిః స్యాత్. ౭౬॥

ప్రతి-అ. ఈప్రకారము 'తత్త్వమస్యా'దివాక్యము నిరంకుశమైన 'అహంబ్రహ్మ' (నేను బ్రహ్మను) అనేజ్ఞానము కలుగఁజేయుచున్నప్పటికి, కలుగఁజేయఁజాలదని యభిప్రాయము కలిగియుండినచో నీ ప్రమాణముచేతనున్ను యథార్థజ్ఞానము కలుగ నేరదు.

తా. ఇదివఱకుచెప్పినయుక్తికలాపముచేత'తత్త్వమస్యా'దివేదాంతవాక్యములు ప్రత్యగభిన్నబ్రహ్మజ్ఞానమును నిస్సంశయముగా కలుగఁజేయుచున్నవని తెలియఁబడుచున్నది. అయినను ఎవ్వఁడు అట్టి బ్రహ్మజ్ఞానము తాదృశవేదాంతవాక్యములు కలుగఁజేయ నేరవని విశ్వసించఁడో, వానికి ప్రత్యక్షాదిప్రమాణములున్ను, ఇతరవేదభాగమున్ను, ఏదియును స్వస్వవిషయజ్ఞానమును కలుగఁజేయునని విశ్వాసము ఉండనేరదు. 'తత్త్వమస్యా'దివేదాంతవాక్యములున్ను, ఇతరవేదవాక్యములున్ను, ప్రత్యక్షాదిప్రమాణాంతరములున్ను, ఇవియన్నియును స్వతఃప్రమాణములైయుండఁగా, వేదాంతవాక్యములు స్వార్థమైన అద్వితీయబ్రహ్మస్వరూపముయొక్క జ్ఞానమును కలుగఁజేయునప్పుడు, ఇతరములు స్వస్వవిషయములగుయాగాదులయొక్కయు, రూపాదులయొక్కయు జ్ఞానమును యేలాగున కలుగచేయఁగలవు? కాన, వానికి సర్వప్రమాణములయందును విశ్వాసము లేకపోవునని భావము.

అవ. సంగ్రహముగా చెప్పినయర్థమును వివరించి శ్లోకము నవతరింపఁజేయుచున్నాఁడు.—

వాక్య. అత ఆహ. ౨౬౬

దం-అ. దానిని చెప్పుచున్నాఁడు.

తా. స్పష్టము.

శ్లో. ఇదంచేదనృతం బ్రూయా త్సత్యా మవగతావపి,
నచాన్యత్రాపి విశ్వాసో హ్యవగత్సవిశేషతః. ౧౧౭

దం-అ. జ్ఞానము కలుగుచున్నప్పటికి ఈవాక్యమును అప్రమాణముగా చెప్పినయెడల మఱియొకదానియందున్న జ్ఞానము సమానముగానున్నందున, విశ్వాసము కలుగనేరదు.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము నిశ్చితమైనజ్ఞానము కలుగఁజేయుచున్నప్పటికి, ఈ'తత్త్వమస్యా'దివాక్యము అప్రమాణమని యెవ్వఁడు చెప్పునో, వానికి ఇతరవేదవాక్యములయందున్ను ఇతరప్రమాణములయందున్ను యథార్థజ్ఞానసంపాదకములనే నమ్మకము కలుగనేరదని భావము.

అవ. ఓయీ! 'తత్త్వమస్యా'దివాక్యము లప్రమాణమని మేను చెప్పినదిలేదు. 'అహం బ్రహ్మాసీత్యుపాసీత' (నేనే బ్రహ్మ నని ఉపాసింపవలయును) అని యుపాసనావిధియందు తాత్పర్యమును కల్పించి అందుచేత నవి ప్రమాణములని చెప్పుచున్నామని యాక్షేపమురాగా సమాధానమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. న చోపాదిత్సితాద్వాక్యార్థాద్వాక్యార్థాంతరం క
ల్పయితుం యుక్తం. ౨౬౭

దం-అ. గ్రహింపనిచ్ఛయించిన వాక్యార్థముకంటె మఱియొకవాక్యార్థమును కల్పించుట యుక్తముకాదు.

తా. 'తత్త్వమస్యా'దివాక్యములకు జీవాత్మపరమాత్మైక్యమే తాత్పర్యార్థమని గ్రహింపవలసియుండఁగా దీనికి భిన్నమైన జీవాభిన్నస్వరూపోపాసనము తాత్పర్యార్థమని ప్రతిపాదించుట యుక్తముగాదని భావము.

వాక్య. యస్మాత్. ౨౬౮

దం-అ. ఎందువల్లననఁగా.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము ఉపాసనావిధిపరమని యెందువలన కల్పించకూడదనఁగా దానికి హేతువు చెప్పఁబడెనని భావము.

శ్లో. నచేదనుభవోఽతః స్యాత్పదార్థావగతావపి,
కల్ప్యం విధ్యంతరం తత్ర నహ్యనోఽర్థోఽవగమ్యతే. ౧౧౮

దం-అ. పదార్థజ్ఞానముకలిగినను ఈవాక్యమువలన తత్త్వజ్ఞానము కలుగనిచో, మఱియొకవిధి కల్పింపఁదగియుండును. అచ్చట మఱియొక అర్థము తెలియఁబడుటలేదు.

తా. 'తత్త్వం'పదార్థములను అన్వయవ్యతిరేకముచేత చక్కఁగా విచారించి తెలిసినవానికి ఈ'తత్త్వమసి'వాక్యము అద్వితీయబ్రహ్మస్వరూపమును తెలియఁజేయనిచో అప్పుడు ఈవాక్యము స్వార్థమందు తాత్పర్యముకలదనియు, ఉపాసనను విధించుట యందు తాత్పర్యముకలదనియు కల్పించుట యుక్తమగును. అట్లు లేదు గదా? 'తత్,త్వం' పదార్థజ్ఞానము కలవారందఱకును నిస్సంశయముగా వాక్యార్థజ్ఞానము కలుగుచున్నది. గనుక, ఉపాసనావిధిపరత్వము కల్పింపతగదు. ఇదిగాక, 'తత్త్వమసి' వాక్యప్రకరణములో ఉపాసనావిధాయకమగుపద మొక్కటియైనను కనుపడలేదు. కాన ఈకారణమువల్లనున్ను 'తత్త్వమస్యా'దివాక్యములకు అర్థాంతరము చేయఁదగదని భావము.

అవ. అయితే పూర్వోక్తమైన అన్వయవ్యతిరేకయుక్తిపదార్థజ్ఞానమును కలుగఁజేసి, అందుమూలముగ వాక్యార్థజ్ఞానమునకు కారణమగునని చేయఁగుదు చెప్పఁబడ్డున నఁగా, దానిని నిరూపించుటకై ముందుగా తద్యుక్తిపదార్థజ్ఞానమునకై యున్నయుక్తిని చూపించుచున్నాఁడు.—

వాక్య. న చ యథాభిహితోఽర్థో యథోక్తేన న్యాయేన నావసీయతే. ౧౯

దం-అ. యథోక్తమైనయర్థము యథోక్తమైనన్యాయముచేత నిశ్చయింపఁబడ లేదు.

తా. ఇదివఱకు రెండవయధ్యాయములో నిరూపించిన 'త్వం' పదార్థము, అచ్చటనిరూపించిన అన్వయవ్యతిరేకయుక్తిచేత నిశ్చయముగా తెలియఁబడుచున్నది గాని తెలియఁబడకపోవుట లేదని భావము.

వాక్య. కోఽసౌ న్యాయ ఇత్యత ఆహ. ౨౦

దం-అ. ఈన్యాయమెట్టిదనఁగా దానిని చెప్పుచున్నాఁడు.

తా. 'తత్త్వం' పదార్థములయొక్క యాథార్థ్యమును తెలియఁజేయు న్యాయము యేదియని ప్రశ్నించఁగా రెండుశ్లోకములతో నాన్యాయమును ప్రకటింపఁ జేయుచున్నాఁడని భావము.

శ్లో. నామాదిభ్యో నిరాకృత్య త్వామర్థం నిష్పరిగ్రహాః,
నిఃస్పృహా యుష్మదర్థేభ్యః శమాదివిధిచోదితః. ౧౨౦

శ్లో. భంక్త్వాచాన్నమయాదీన్ తాన్ పంచానాత్మతయార్గళాన్,
అహం బ్రహ్మేతి వాక్యార్థం వేత్తిచేన్నార్థ ఈహయా. ౧౨౧

దం-అ. 'త్వం'పదార్థమైన ఆత్మను నామము మొదలగుదానివలన నిరాకరించి పరిగ్రహము (మమకారము)లేనివాఁడై యుష్మచ్ఛబ్దార్థములగు శరీరేంద్రియాదులవల్లను ఆశలేనివాఁడై,శమాదిగుణయుక్తుఁడై అన్నమయము మొదలగునాయైదుబంధకములనుఆత్మభిన్నములగుటచే భంగపఱచి (నిరసించి) నేను బ్రహ్మనని వాక్యార్థమును తెలిసినవాఁడైనచో వానికి ఉపాసనముచేత ప్రయోజనములేదు.

తా. ఛాందోగ్యోపనిషత్తులోని సప్తమప్రపాఠకమునందు సనత్కుమారుఁడు నారదునకు ఆత్మతత్త్వము నుపదేశించునప్పుడు ముందుగా నామము,వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, ఉదకము, తేజస్సు,ఆకాశము, స్మరణము, ఆశ, ప్రాణము ఈపదునైదింటిని యాత్మయని యుపాసించుమని చెప్పి, అనంతరము భూమ (అపరిచ్ఛిన్నచిదానందము) ఆత్మయని తెలియుమని యుపదేశించెను. 'త్వం' పదార్థమైన చిదాత్మ ఈనామాదిపంచదశపదార్థములలోఁ చేరినదికాదు. వీటికంటె అత్యంతవిలక్షణమైనదని ముందుగా నిశ్చయించుకొని పిదప గృహక్షేత్రపుత్రకళత్రాదులయందు మమకారమునువదలి పరమవైరాగ్యమునుబొంది యనంతరము దేహేంద్రియాదులయందున్ను నిఃస్పృహకలవాఁడై శమదమ సన్న్యాస తితిక్షా శ్రద్ధా సమాధానములనే షడ్గుణములు కలిగి తైత్తిరీయోపనిషత్తులోఁ చెప్పియున్న అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయానందమయములు అనేపంచకోశములయం దహంకారమమకారములు లేనివాఁడై యేపురుషుఁడుండునో ఆపురుషుఁడు అఖండజ్ఞానోత్పత్తి ప్రతిబంధకముల నన్నింటిని నివర్తింపఁజేసికొని యున్నందున నిస్సంశయముగా 'అహంబ్రహ్మాస్మి' త్యాకారకాపరోక్షజ్ఞానముకలవాఁడగును. అట్టి పురుషుని కుపాసనముతోఁ ప్రయోజనమేమనిభావము.

అవ. ఈప్రకార మన్వయవ్యతిరేకయుక్తి విచారపరుఁడైన అధికారికి వేదాంతవాక్యములు తత్త్వజ్ఞానమును పుట్టించునని చెప్పి, ఈలాగున అంగీకరించనిచో వేదాంతములకు అప్రామాణ్యము సంభవించునని దోషమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. న చేదేవముపగమ్యతే వాక్యస్య ప్రమాణస్య
సతోఽప్రామాణ్యం ప్రాప్నోతి. ౨౭౧

దం-అ. ఈప్రకార మంగీకరింపఁబడకపోయినచో ప్రమాణమైనవాక్యమునకు అప్రామాణ్యము ప్రాప్తించును.

తా. స్పష్టము.

అవ. చెప్పినయర్థమును విశదపఱచుటకై శ్లోకము నవతరింపఁజేయుచున్నాఁడు.—

వాక్య. తదాహ. ౨౭౨

దం-అ. దానిని చెప్పుచున్నాఁడు.

శ్లో. యదర్థం చ ప్రవృత్తం యద్వాక్యం తత్ర న చేచ్ఛ్రితమ్,
ప్రమా ముత్పాదయేత్తస్య ప్రామాణ్యం కేన హేతునా. ౧౨౨

దం-అ. వినఁబడుచున్న యేవాక్యము యేయర్థమునొఱకు ప్రవర్తించెనో ఆవాక్యము ఆయర్థమునందు జ్ఞానమును కలుగఁజేయకపోయినచో, ఆవాక్యమునకు ప్రామాణ్యము యేకారణముచేత సంభవించును?

తా. వేదాంతములయందు వినఁబడుచున్న యేవాక్యము, యేయర్థమును ప్రతిపాదించుటకై ప్రవర్తించిన ట్లుపక్రమోపసంహారాదికారణములచే నిశ్చయింపఁబడియున్నదో ఆవాక్య మాయర్థమును బోధించలేకపోయినచో నావాక్యము ప్రమాణము అని యెట్లు వచ్చునని భావము.

అవ. ఓయీ! వేదాంతవాక్యములు ప్రమాణములే యగుగాక. అయినను ఆప్రామాణ్యము ప్రసంఖ్యానవిధిపరత్వముచేతనే యగుచున్నదని శంకను వాక్యముచేతను శ్లోకముయొక్క ప్రథమపాదముచేతను చూపుచున్నారు.—

వాక్య. అథ మన్యసే. ౨౭౩

శ్లో. జానీయాచ్చేత్ప్రసంఖ్యానాచ్ఛబ్దః సత్యవచాః కథమ్,
పారోక్ష్యం శబ్దో నఃప్రాహ ప్రసంఖ్యానాత్త్వసంశయమ్. ౧౨౩

దం-అ. పైశ్లోకములోని ప్రథమపాదపుప్రథమభాగమునకుమాత్రము ప్రసంఖ్యానమువలన తెలిసికొనునని తలఁచినచో.

తా. ప్రసంఖ్యానమును విధించుటచేతనే వేదాంతవాక్యములు ప్రమాణములుగాని కేవలవస్తుమాత్రబోధకములగుటచేత ప్రమాణములుగావు అని నీవు తలఁచెదవు. అని భావము.

అవ. ఈశంకను రెండవపాదము (పై ౧౨౩ వశ్లోకముయొక్క)చే పరిహరించుచున్నాఁడు.—

దం-అ. ౧౨౩ వ శ్లోకపుప్రథమపాదపుద్వితీయభాగమునకుమాత్రము వేదము సత్యవచనము కలది యేలాగున యగును?

తా. వాక్యము ప్రసంఖ్యానపరమేయైనచో ప్రత్యక్షాదివిరుద్ధముగా నద్వితీయ

పరబ్రహ్మస్వరూపమును బోధింపఁజాలదు గనుక, స్వార్థమందు ప్రామాణ్యముకలది కాక పోవును అని భావము.

అవ. మరల పూర్వవాది శంకించుచున్నాఁడు.—

దం-అ. ౧౨౩ వ శ్లోకపు ద్వితీయపాదపుప్రథమ ద్వితీయభాగములకు శబ్దము మాకు పరోక్షత్వమును బోధించుచున్నది. ప్రసంఖ్యానమువలన ననినచో నిస్సంశయముగా (అపరోక్షత్వము) కలుగును.

తా. వాక్యము పరోక్షమైన యాత్మతత్త్వమును స్వభావముగా బోధించును. ఆయాత్మతత్త్వము ప్రసంఖ్యానమువలనగాని అపరోక్షముగా భాసించదు గనుక వేదాంతవాక్యములు ప్రసంఖ్యానము మూలముగ నద్వితీయాత్మతత్త్వసాక్షాత్కారమును కలుగఁజేయును. అందువల్లనే యవి ప్రమాణములని భావము.

అవ. ఈశంకను పరిహారించుచున్నాఁడు.—

వాక్య. న చ యుక్తిశబ్దవృత్తిలక్షణాత్ప్రసంఖ్యానా ద్యథావత్ప్రతిపత్తిర్భవిష్యతీతి సంభావయామః. ౨౭౮

దం-అ. యుక్తులయొక్క శబ్దములయొక్క పౌనఃపున్యానుసంధానమే లక్షణముగాఁగల ప్రసంఖ్యానమువల్ల యాథార్థ్యజ్ఞానము కలుగగలదని యూహింపఁజాలము.

తా. ప్రసంఖ్యానమనఁగా అన్వయవ్యతిరేకయుక్తిని 'తత్త్వమా'దిపదార్థములను మాటిమాటికి విచారించుటయేగదా? అట్టి ప్రసంఖ్యానమువలన వాస్తవమైన అద్వితీయబ్రహ్మసాక్షాత్కారజ్ఞానము కలుగునని మాకు తోఁచదని భావము.

వాక్య. యస్మాత్. ౨౭౯

దం-అ. ఎందువల్లను?

తా. ఎందువలన తోఁచఁబడదనఁగా నాకారణము చెప్పఁబడునని భావము.

శ్లో. యుక్తిశబ్దౌ పురాప్యస్య న చేదకురుతాం ప్రమామ్,
సాక్షాదావర్తనాత్తాభ్యాం కిమపూర్వం ఫలిష్యతి. ౧౨౪

దం-అ. ఈయధికారికి యుక్తి, శబ్దములు రెండు పూర్వమందున్న యథార్థజ్ఞానమును కలుగఁజేయనిచో వానియొక్క అసహాయమైన నావృత్తివలన, నూతనమైనది ఏది ఫలించును?

తా. సాధనచతుష్టయసంపన్నుఁడైన యధికారి మొట్టమొదట నన్వయవ్యతిరేకయుక్తిని 'తత్త్వమాది'శబ్దములచే విచారించియేయున్నాఁడు. అప్పు డాయుక్తిశబ్దము లాత్మవిషయమైన పరోక్షజ్ఞానమును కలుగఁజేసినవిగాని, అపరోక్షజ్ఞానమును కలుగఁ

జేయలేదుగదా? అట్టియు క్తిశబ్దముల నెన్నిపర్యాయము లావృత్తినిజేసినను అంతకు ముందు కలుగని యపరోక్షజ్ఞానము యెటులకలుగును? అనుమానప్రమాణముచే పరోక్షముగా తెలియఁబడినఅగ్ని, యాయనుమానము నెన్నిపర్యాయము లావర్తిచేసినను పరోక్షముగానే యుండును. కాని యపరోక్షము కానేరదుకదా? అట్లు యుంక్తిశబ్దానుసంధానముచేత మొదట పరోక్షముగా భాసించినయాత్మ, ఆయుంక్తిశబ్దములను ఎన్నిపర్యాయము లావృత్తిచేసినను పరోక్షముగా భాసించదు. భాసించినప్పటికిని విధురపరిభావిత కామినీసాక్షాత్కారమువలె మిథ్యారూపమై యుండును గాని వాస్తవమైయుండదని భావము.

అవ. ఓయీ! 'ఆవృత్తి రసకృదుపదేశాత్' అనుసూత్రమునందు బ్రహ్మసూత్రకర్తయగు శ్రీవేదవ్యాసమహర్షి, యుక్తిశబ్దములయొక్క పౌనఃపున్యానుసంధానమనే ప్రసంఖ్యానమును ప్రతిపాదించియున్నారు కాన ప్రసంఖ్యానమును వినా కేవలవాక్యము బోధకము కానేరదని పూర్వపక్షవాదిచేయునట్టిశంక ననువదించుకొని సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. అథైవమపి ప్రసంఖ్యానమంతరేణ ప్రాణాన్ ధారయితుం న శక్నోషీతి చేత్ శ్రవణాదావేవ సంపాదయిష్యామః. ౧౭౬

దం-అ. 'అథ'శబ్దము పక్షాంతరసూచకము. ఈలాగైనను ప్రసంఖ్యానమును వినాగా ప్రాణములను ధరించుటకు సమర్థుఁడవు కాకపోయినచో, శ్రవణము మొదలగువానియందే సంపాదించుచున్నాము.

తా. కేవల వాక్యమే బ్రహ్మతత్త్వజ్ఞానసంపాదకమైయుండఁగా, ఈపక్షము నంగీకరించక, 'ఆవృత్తిరసకృదుపదేశాత్' అనేసూత్రమునుబట్టి ప్రసంఖ్యానము నంగీకరించినగాని, బ్రతుకలేననినచో, శ్రవణమననాదులయందు ప్రసంఖ్యానము కలదని మేము చెప్పుచున్నాము. అట్టి ప్రసంఖ్యానము ననుష్ఠించుచు బ్రతుకవచ్చునని భావము. అనఁగా ఆవృత్తి సూత్రమందు సూత్రకారులు బ్రహ్మతత్త్వజ్ఞానసాధనములైన శ్రవణమననములయం దావృత్తి (ప్రసంఖ్యానము) కర్తవ్యమని సాధించియున్నారు. గాని బ్రహ్మతత్త్వజ్ఞానమునం దావృత్తి కర్తవ్యమని సాధించినవారు కారు. కాన శ్రవణమననముల నావృత్తిచేయుచుండి వాక్యమువలన బ్రహ్మజ్ఞానప్రాప్తినొందుఁడని భావము.

వాక్య. కథమ్. ౧౭౭

దం-అ. ఏలాగున?

తా. శ్రవణమననావృత్తిచేత బ్రహ్మజ్ఞాన మేలాగునకలుగునో చెప్పుచున్నారని భావము.

శ్లో. ప్రసంఖ్యానే శ్రుతావస్య న్యాయోఽస్త్వామ్రేడనాత్మకః,
ఈషచ్ఛ్రుతం సామిశ్రుతం సమ్యక్ శ్రుత్వావగచ్ఛతి. ౧౨౫

దం-అ. ఈయధికారికి ప్రసంఖ్యానమందు ఆవృత్తిరూపమైనన్యాయము శ్రవణమందు సంభవించుగాన, కొంచముగా వినఁబడినయర్థమున్ను సంపూర్ణముగా విని తెలియుచున్నాఁడు.

తా. తత్త్వజ్ఞానసాధనములగు శ్రవణమననములు ఆవృత్తిచేయఁదగియున్నవి. కాన నీవు ఆవశ్యకర్తవ్యమని తలఁచియున్న ప్రసంఖ్యానము శ్రవణమననములయందుపయోగించును. అనఁగా గురుముఖముగా వేదాంతమహావాక్యములయొక్క తాత్పర్యమును వినుట శ్రవణమనంబడు. వినినతాత్పర్యమును యుక్తులచేత నాలోచించి సరిపఱచుకొనుట మననమనంబడు. ఈరెంటిని పలుమా అనుష్ఠించవచ్చునని యర్థము. అయిన నొకపర్యాయము శ్రవణముచేసినఁ జాలదా? ఆవృత్తిగా చేయవలసినపనియేమి? అని నచో నాలాగున అనరాదదు. ఉత్తమాధికారికి సకృచ్ఛ్రవణము చేతనే 'తత్త్వజ్ఞానము' ఉదయించును.మందాధికారికి ఆవృత్తిగా శ్రవణముఆవశ్యకమైయున్నది. వేదాంతవాక్యతాత్పర్యమును ఒకసారి వినుటచే కొంచము గ్రహించును. రెండవసారివినుట చే మఱికొంచెము గ్రహించును. కాన 'తత్త్వజ్ఞానము' కలిగేవఱకు శ్రవణమననాదులను ఆవృత్తి చేయవలసియుండునని భావము. శ్రవణాదులయొక్క ఆవృత్తి (పునఃపునః అనుష్ఠానము) అవశ్యముగా చేయఁదగియున్నది. ఏలననఁగా, 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' ఇత్యాదివాక్యములయందు శ్రవణాదు లనేకపర్యాయము లాచరింపఁదగినవి యని ప్రతిపాదింపఁబడియున్నదిగదా? యని సూత్రార్థము.

అవ. పూర్వపక్షవాదియొక్క ఆక్షేపము కనుపఱచుచున్నాఁడు.—

వాక్య. నను ప్రసంఖ్యానవిధిమనభ్యుపగచ్ఛతః పారమహంసీచర్యా బౌద్ధాదిచర్యావదశాస్త్రపూర్వికా ప్రాప్నోతి తతశ్చారూఢపతితత్వం న స్యాదశేషకర్మణాం చ నివృత్తిర్న ప్రాప్నోతీతి. ౨౭

దం-అ. ఓయీ! ప్రసంఖ్యానవిధిని అంగీకరించనివానికి సన్న్యాసానుష్ఠానము బౌద్ధాదులయొక్క అనుష్ఠానమువలె అశాస్త్రీయమై ప్రాప్తించును. అందువలన ఆరూఢపతితత్వము సిద్ధించును. సకలకర్మలయొక్క నివృత్తియున్ను ప్రాప్తించదు.

తా. 'తత్త్వమస్యా'దివాక్యములకు ప్రసంఖ్యానవిధాయకత్వము లేదనిన్ని స్వరూపమాత్రబోధకత్వమే కలదనిన్ని చెప్పు వేదాంతియొక్క పక్షమున సన్న్యాసాశ్రమానుష్ఠానము బౌద్ధాదులయొక్క అనుష్ఠానమువలె శాస్త్రసమ్మతము కాదనిన్ని, కేవలస్వేచ్ఛ చేత నాచరింపఁబడినదనిన్ని చెప్పవలసియున్నది. ఏలనన, మోక్షేచ్ఛగలపురుషుఁడు విధిచోదితములైన నిత్యనైమిత్తికకర్మలయందు ప్రవర్తింపకూడదని యంగీకరించియుంటివి గదా? 'తత్త్వమస్యా'దివాక్యములు ప్రసంఖ్యానవిధాయకములు గానందున 'తత్త్వజ్ఞానా'భ్యాసమునందును ముముక్షువు ప్రవర్తించఁడుగదా? మఱియొకదానియందు ప్రవర్తించుటకు విధిలేదుగదా? కాన, వేదాంతి దేనియందు ప్రవర్తించుటకు నిత్యనైమిత్తికకర్మలను పరిత్యజించును? అందుచే నిత్యనైమిత్తికకర్మపరిత్యాగరూపమైన సన్న్యాసము వేదాంతిచేయుట యుక్తముకానేరదు. శాస్త్రమున్ను మఱియొకదానియందు ప్రవర్తింపఁజేయకనే, నిత్యనైమిత్తికకర్మపరిత్యాగమునువిధింపదు. విధింపకపోయినను, వేదాంతి స్వేచ్ఛచేతనే సన్న్యసించినచో, నాసన్న్యాసము బౌద్ధాదులయొక్క సన్న్యాసమువలె అశాస్త్రీయమై నిష్ఫలమై పోవును. వివేకజ్ఞానము కలిగినపిదప చేయఁబడిన సర్వకర్మపరిత్యాగము అశాస్త్రీయమైనను దోషములేదనియనఁదగదు. సకల శ్రుతీతిహాసపురాణములయందు 'తత్త్వజ్ఞాన'మనే యున్నతమార్గమునందు సంచరించువాఁడు శాస్త్రీయక్రమము నవలంబించి సంచరించవలయునేగాని, శాస్త్రీయక్రమము నతిక్రమించి ప్రవర్తింపకూడదనిన్ని, అలాగున ప్రవర్తించినచో నాతఁ డారూఢపతితుఁ డగుననిన్ని చెప్పఁబడియున్నందున నశాస్త్రీయముగా సర్వకర్మపరిత్యాగమును చేసినచో 'తత్త్వవేత్తయున్ను' ఆరూఢపతితత్వము సిద్ధించును. ఇదిగాక 'తత్త్వమా'దివాక్యములు 'తత్త్వజ్ఞానా'భ్యాసవిధాయకములని అంగీకరించినచో నన్యవిషయచింతన మేమాత్రములేక నిరంతరము తత్త్వజ్ఞానాభ్యాసము చేయవలసినది. ఆవశ్యకమైయున్నందున అందుకు విరుద్ధములైన నిత్యనైమిత్తికకర్మలను పరిత్యజించుట యుక్తమైయుండును. 'తత్త్వమాది'వాక్యములు జ్ఞానాభ్యాసవిధాయకములని యంగీకరించనిచో, 'యావజ్జీవం అగ్నిహోత్రం జుహోతి' 'అహరహస్సంధ్యా ముపాసీత' ఇత్యాదిశ్రుతులచే విధింపఁబడిన అగ్నిహోత్రాదికర్మ లవశ్యముగా ననుష్ఠింపఁదగియున్నందున వాటిని పరిత్యజించుట కవకాశమే కలుగదు. కాన 'తత్త్వమాది'వాక్యములు 'తత్త్వజ్ఞానా'భ్యాసరూపమైన ప్రసంఖ్యానమును విధించుచున్నవని తప్పక నంగీకరించవలయునని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. అపిచ. ౨౭౯

దం-అ. చెప్పఁబడును.

తా. సమాధానము చెప్పఁబడునని భావము.

శ్లో. త్వమర్థస్యావబోధాయ విధిరప్యాశ్రితో యతః,
తమన్తరేణ యే దోషా స్తేఽపి నాయాన్త్య హేతవః. ౧౨౬

ఇతి సురేశ్వరాచార్యవిరచితే నైష్కర్మ్యసిద్ధౌ
తృతీయోఽధ్యాయః.

దం-అ. ఏహేతువువలన 'త్వం' పదార్థముయొక్క పరిజ్ఞానముకొఱకు, విధిన్ని ఆశ్రయింపఁబడినదో, యాహేతువువలన ఆవిధిని వినాగా నేదోషములుకలవో యవి నిష్కారణములై రానేరవు.

తా. 'త్వం' పదార్థమైన శుద్ధప్రత్యగాత్మయొక్కస్వరూపమును విశదముగా తెలియుటకై వేదాంతవాక్యశ్రవణమననములు విధింపఁబడుచున్నవని అంగీకరించియుంటిమి. కాన శ్రవణమననములయందు ప్రవర్తించుట కనుకూలముగా నిత్యనైమిత్తికాది సర్వకర్మసన్న్యాసము వారికి అశాస్త్రీయమని ఆరూఢపతిత్వాదిదోషములు సంభవించునని చెప్పినదోషములకు కారణము లేనందున వేదాంతిమతమందాదోషములు లేశముగానైనను సంభవించవు. అందుచే వేదాంతిమతము నిత్యనిర్దోషమై యున్నది. వానిని యాశ్రయించుటచేతనే ముముక్షువునకు నిత్యనిరతిశయపురుషార్థము ప్రాప్తించునుగాని యన్యమతముల నాశ్రయించుటచేత మోక్షము ప్రాప్తించదని భావము.

ఇది సర్వవేదాంతసారసంగ్రహవ్యాఖ్యానంబున
మూఁడవయధ్యాయము.

---

# నాల్గవయధ్యాయము.

అవ. ఈప్రకారము ప్రథమాధ్యాయమునందు వేదాంతములన్నియు 'తత్త్వమస్యా'దివాక్యజన్యములైన తత్త్వజ్ఞానమే మోక్షసాధనమని ప్రతిపాదించుటయందు సమన్వితములైయున్నవనియు, ద్వితీయాధ్యాయమున నన్వయవ్యతిరేకములచేత పదార్థనిశ్చయములు కలుగఁజేసికొని యున్నవారలకు వాక్యమువలన తత్త్వజ్ఞానము కలుగుటకు విరోధము కాన్పించదనియు, తృతీయాధ్యాయమున తత్త్వజ్ఞానోత్పత్తికి 'తత్త్వమస్యా'దివాక్యశ్రవణమే సాధనమనియు, విస్తారముగ ప్రతిపాదించి యీనాల్గవయధ్యాయమున తత్త్వజ్ఞానముయొక్కఫలమును ప్రతిపాదింపఁదలఁచి ముందుగా పూర్వాధ్యాయములయొక్క అర్థమును సంగ్రహముగ చెప్పెదమని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.—

శ్లో. పూర్వాధ్యాయేషు యద్వస్తు విస్తరేణోదితం స్ఫుటమ్,
సంక్షేపితోఽధునా వక్ష్యే తదేవ సుఖవిత్తయే. ౧

దం-అ. వెనుకటిఅధ్యాయములందు ఏయర్థము విస్తరముచేత స్పష్టముగ చెప్పఁబడినదో ఆయర్థమునే సుఖముగ తెలియుటకొఱకు సంగ్రహముగ నిప్పుడు చెప్పుచున్నాను.

తా. పూర్వాధ్యాయములయందు విస్తరముగ చెప్పినయర్థమును సులభముగ తెలియుటకై ఈనాల్గవయధ్యాయమునందు ముందుగా సంక్షేపముగ నిరూపించి పిదప తత్త్వజ్ఞానఫలమును ప్రతిపాదించెదమని భావము.

అవ. ఓయీ! విస్తారముగా చెప్పినయర్థమునే తెలియనివారలకు సంక్షేపముగా చెప్పిన సులభముగా నేలాగున తెలియునని యాక్షేపమురాగా, సమాధానమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. సంక్షేపవిస్తరాభ్యాం హి మందోత్తమధియాం నృణామ్,
వస్త్వాచ్యమానమేత్యంతఃకరణం తేన భణ్యతే. ౨

దం-అ. మందబుద్ధి ఉత్తమబుద్ధి గలమనుష్యులకు సంగ్రహముచేతను విస్తారముచేతను చెప్పినయర్థ మంతఃకరణమునుగూర్చి పొందుచున్నది. అందుచే చెప్పఁబడుచున్నది.

తా. లోకములో కొందఱు మందబుద్ధికలవారై యుందురు. మఱికొందఱు జనులుత్తమబుద్ధికలవారై యుందురు.అందులో మందబుద్ధికలవారు విస్తారముగ చెప్పినంగాని

గ్రహింపఁజాలరు. కాన నట్టి మందబుద్ధికలవారినుద్దేశించి మొదటిమూఁడధ్యాయములలో విస్తారముగ జెప్పఁబడినది. ఉత్తమబుద్ధిగలవారు సంక్షేపముగ చెప్పినమాత్రమున గ్రహింపఁగలరు. అట్టియుత్తమబుద్ధిగలవారల నుద్దేశించి ఈనాల్గవయధ్యాయములో నాయర్థమే సంక్షేముగా చెప్పఁబడుచున్నదని భావము.

అవ. సందేహింపఁబడినయర్థమే విచారింపఁబడుచుండునుగాన, నేది సందేహింపఁబడు అర్థమో దానిని నిరూపించుటకుగాను ముందుగా సందేహింపఁబడని యర్థమును జూపుచున్నాఁడు.—

శ్లో. ఆత్మానాత్మచ లోకేఽస్మిన్ ప్రత్యక్షాది ప్రమాణతః,
సిద్ధస్తయోరనాత్మాతు సర్వత్రైవాత్మపూర్వకః. 3

దం-అ. ఈలోకమునందు ఆత్మయును అనాత్మయును ప్రత్యక్షము మొదలగు ప్రమాణములవలన సిద్ధమైయున్నది. ఆరెంటిలో ననాత్మయనునది అన్నిప్రమాణములయందును ఆత్మపూర్వకమైయున్నది.

తా. ఆత్మ, అనాత్మ ఈరెండు ప్రత్యక్షాదిప్రమాణములచే నిస్సంశయముగా తెలియఁబడుచున్నవి. ప్రత్యక్షాదిప్రమాణములచే ననాత్మయే తెలియఁబడుచున్నదని శంకింపఁదగదు. ద్రష్ట (చూచువాఁడు) లేనిచో దృశ్యము (జూడఁబడునది) సిద్ధించదు. గాన ప్రమాణములచే ననాత్మ సిద్ధించునప్పుడు ముందు ఆత్మ సిద్ధించునని భావము.

అవ. అయితే ప్రమాణసిద్ధములగు నాత్మానాత్మలు ఎట్టివో చెప్పుచున్నాఁడు.—

శ్లో. అనాత్మత్వం స్వతఃసిద్ధం దేహాద్భిన్నస్య వస్తునః,
జ్ఞాతురప్యాత్మతా తద్వన్మధ్యే సంశయదర్శనమ్. ర

దం-అ. దేహముకంటె భిన్నమైనపదార్థమునకు అనాత్మత్వము స్వాయముగాసిద్ధమైయున్నది. జ్ఞాతకు(తెలియునట్టివానికి) ఆత్మత్వమును అటులే నడుమను సంశయముయొక్క దర్శనము కలిగియున్నది.

తా. దేహముకంటె భిన్నములై కనుపడుచున్నఘటాదివస్తువులు అనాత్మలని నిస్సంశయముగా తెలియుచున్నది. ఘటాదులను తెలియుచున్నవాఁడు (జ్ఞాత) ఆత్మయనిన్ని స్పష్టమైయున్నది. అయితే సందేహింపఁదగినవస్తు వేదియనఁగా దృశ్యములైన ఘటాదిపదార్థములయొక్కయు ద్రష్టయగు నాత్మయొక్కయు మధ్యమందున్న దేహేంద్రియాదులలో నేది యాత్మయని (ద్రష్టయగు) సందేహము కనుపడుచున్నది. అనఁగా శాస్త్రకారులందఱు ఘటాదివస్తువులు అనాత్మలనిన్ని, వానిని జూచుచుండు ద్రష్ట ఆత్మయనిన్ని, నిస్సంశయముగ నంగీకరించి, ఆద్రష్టదేహమని కొందఱు, ఇంద్రియములని

కొందఱు, మనస్సని కొందఱు, బుద్ధియని కొందఱు, వీటికంటె విభిన్నమైన మఱియొకటి యని కొందఱు యీలాగున వివాదమును చేయుచున్నారు. కాన దేహాదులాత్మయగునా కాదా యని సందేహింపఁబడుచున్నవని భావము.

అవ. అయితే ద్రష్ట యేలాగున నిర్ణయించునంటే చెప్పుచున్నాఁడు.—

శ్లో. అసాధారణాంస్తయోర్ధర్మా జ్ఞాత్వాధూమాగ్నివద్బుధః,
అనాత్మనోఽథ బుద్ధ్యంతా జానీయ దనుమానతః ౫

దం-అ. వివేకియగు పురుషుఁడు ఆత్మానాత్మలయొక్క అసాధారణములగు ధర్మముల నెఱింగి ధూమముచేత నగ్నినివలె అనుమానముచేత బుద్ధివఱకుగల యనాత్మ వస్తువులను తెలియవలయును.

తా. ద్రష్టృత్వము అజడత్వము మొదలగునవి ఆత్మయొక్క నియతధర్మములు. దృశ్యత్వము జడత్వము మొదలగునవి అనాత్మయొక్క నియతధర్మములు అని ఇట్లు తెలిసి ధూమమున్నచోట అగ్ని కలదని నిశ్చయించినటుల దేహేంద్రియమనఃప్రాణబుద్ధుల యందు దృశ్యత్వజడత్వములు కలిగియున్నందున అవియనాత్మలని నిశ్చయించవలయునని భావము.

అవ. దేహేంద్రియాదులయందు సంశయము కనుపడుచున్నదని చెప్పిరి. వాని యందు సంశయమునకు కారణమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. ఇదమిత్యేవ బాహ్యేఽర్థే హ్యహమిత్యేవ బోద్ధరి,
ద్వయం దృష్టం యతో దేహే తేనాయం ముహ్యతే జనః. ౬

దం-అ. బాహ్యమైనవస్తువునందు 'ఇదం' (ఇది) అనే వ్యవహారమే కాన్పించుచున్నది. ద్రష్టయందు 'అహం' (నేను) అనేవ్యవహారమే కాన్పించుచున్నది. ఏ కారణమువల్ల దేహమందు రెండున్ను కాన్పించుచున్నవో అందుచేత నీమనుష్యుఁడు మోహమును బొందుచున్నాఁడు.

తా. ఘటాదివిషయములందు 'ఇదం' (ఇది) అనేబుద్ధియే కలుగుచున్నదిగాని 'అహం' (నేను) అనేబుద్ధి కలుగుటలేదు. ద్రష్టయందు 'అహం' అనేబుద్ధి కలుగుచున్నదిగాని 'ఇదం' (ఇది) అనేబుద్ధి కలుగుటలేదు. దేహాదులయందో 'అయం దేహః' (ఈదేహము) 'అహం మనుష్యః' (నేను మనుష్యుఁడను) అని యుభయమైనబుద్ధియుం కలుగుచున్నది. అనఁగా ఘటాదివిషయములను జూచినప్పుడు 'అయం ఘటః' (ఇది ఘటము) అనియే వ్యవహరింపఁబడునుగాని 'అహం ఘటః' (నేను ఘటమును) అని వ్యవ

హారములేదు. ద్రష్టను వ్యవహరించునప్పుడు 'అహం పశ్యామి' (నేను చూచుచున్నాను) 'అహం శృణోమి' (నేను వినుచున్నాను) అని ఈలాగున వ్యవహరింపఁబడునుగాని 'ఘట మయం పశ్యామి' అని ఈలాగున వ్యవహరింపఁబడదు. దేహమునుగూర్చి వ్యవహరించు నప్పుడైతే 'అయం మే దేహః' (ఇది నాదేహము అనిన్ని) 'అహం మనుష్యః' (నేను మనుష్యుఁడను) అనిన్ని ఉభయథా వ్యవహరింపఁబడుచున్నదిగాన, దేహాదులు ఆత్మయగునా కాదా? యని సంశయింపఁదగియున్నదని భావము.

అవ. అయితే ఏయుక్తిచేత నిర్ణయించవచ్చుననే శంక ననువదించి పూర్వా ధ్యాయములయందు చెప్పిన యన్వయవ్యతిరేకములచేత నిర్ణయించవచ్చునని చెప్పుచు న్నాఁడు.—

వాక్య. కేన పునర్న్యాయేనాఽఽత్మానాత్మనో రశ్వమహిష
యో రివ విభాగః క్రియత ఇతి ఉచ్యతే. ౧

దం-అ. అశ్వమహిషములయొక్క వైలక్షణ్యమువలె ఆత్మానాత్మలయొక్క వైల క్షణ్యము యేయుక్తిచేత సంపాదింపఁబడునదియు చెప్పఁబడును.

తా. స్పష్టము.

శ్లో. న్యాయః పురోదితోఽస్మాభి రాత్మానాత్మ విభాగకృత్,
తేనేద మర్థ ముత్సార్య హ్యహమిత్యత్ర యో భవేత్. ౨
విద్యాత్తత్త్వమసీ త్యస్మా ద్భావాభావదృశం సదా,
అనంతర మబాహ్యార్థం ప్రత్యక్షం మనిరంజనా. ౩

దం-అ. ఆత్మయొక్కయు, అనాత్మయొక్కయు వైలక్షణ్యమును తెలియఁ జేయుయుక్తి మాచే పూర్వము చెప్పఁబడియున్నది. ఆయుక్తిచేత 'అహం' (నేను) అని వ్యవహరింపఁబడుచున్న అర్థమందే యికలదో ఆ'ఇదం' అని చెప్పఁబడుచున్న అనా త్మాంశమును నిరాకరించి 'తత్త్వమసి' యనే ఈవాక్యమువల్ల సర్వకాలములయందు సత్తాసత్తలకు సాక్షిగానుండి లోపలనుండునదిమాత్రమేగాక, వెలుపలనుండునదిమాత్ర మేగాక సర్వపరిపూర్ణుఁడైన ఆత్మను మననశీలుఁడై సులభముగా తెలియవలయును.

తా. ఆత్మానాత్మలయొక్కవిభాగమును తెలియఁజేయతగినయుక్తి నీద్వితీయా ధ్యాయమునందు మేము విశదముగా చెప్పియున్నాము. ఆయుక్తి నవలంబించి అహ మర్థమునందు కలిగియున్న ఇదమర్థమును ముందుగా తెలిసి దానిని నిరాకరించవలయును. అనఁగా 'అహం' అని చెప్పఁబడుచున్న అహంకారము చిదచిద్గ్రంథిరూపమై యు న్నది. అందులో అవిద్యాభాగము దృశ్యమై జడమైయున్నందున, ఆత్మ కాదని నిశ్చయించి,

దానిని నివారింపవలయును. (తొలఁగింపవలయును). పిదప చక్కఁగా మననము చేయుచున్నవాఁడై శేషించియున్న చిదంశ మేదికలదో ఆచిదంశమే సత్తాసత్తలను ప్రకాశింపఁజేయును. సర్వసాక్షియై, బాహ్యాభ్యంతరములయందు పరిపూర్ణుఁడై యున్న ప్రత్యగాత్మ యని 'తత్త్వమస్యా'దివాక్యములవల్ల ఆచిదాత్మను తెలియవలయునని భావము.

అవ. ఇచ్చట పూర్వవాది వాక్యార్థమును (పరిపూర్ణ చిదాత్మస్వరూపమును) తెలిసికొనుటకు క్రమమెద్ది యని ప్రశ్నించుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతాం తర్హి కయా తు పరిపాట్యా వాక్యార్థం
వేత్తీతి. ౨

దం-అ. అయితే ఏక్రమముచే వాక్యార్థమును తెలియును? చెప్పఁబడుఁగాక.

తా. వాక్యార్థమైన పరిపూర్ణచిదాత్మస్వరూపము యేక్రమముచే తెలియఁబడునని భావము.

అవ. సిద్ధాంతవాది ప్రతివచనమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతే అన్వయవ్యతిరేకాభ్యామ్. 3

దం-అ. చెప్పఁబడును. అన్వయవ్యతిరేకములచే తెలియఁబడునని శేషము.

తా. మొదటను అన్వయవ్యతిరేకముల నాలోచించి, దేహాదిబుద్ధ్యంతవస్తువులాత్మకాదని నిరసించి, పిదప దేహాదులకంటె విలక్షణమై, దేహాదులకు సాక్షియై (ప్రకాశకమైన) ప్రత్యగాత్మను తెలిసికొని, ఆప్రత్యగాత్మ పరిపూర్ణబ్రహ్మగా 'తత్త్వమస్యా'దివాక్యమువలన తెలియఁబడును గనుక ఇదియే పరిపూర్ణచిదాత్మను తెలియుక్రమమని భావము.

అవ. 'తత్త్వమస్యా'దివాక్యముతోఁటి ప్రయోజనమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. త్యక్తకృత్స్నేదమర్థత్వాత్ త్యక్తోఽహమితి మన్యతే,
నావగచ్ఛామ్యహం యస్మాన్నిజాత్మాన మనాత్మనః. ౪

దం-అ. విడువఁబడిన సకలమైన 'ఇద'మర్థము కలిగియున్నందున 'అహ' మర్థమున్ను విడువఁబడినదని తలఁచుచున్నాఁడు. ఏలనన ననాత్మకంటె వేఱుగా నిష్కర్షించి గాస్వరూపమును నేను తెలియకయున్నాను.

తా. దేహము మొదలు బుద్ధివఱకుగలవస్తువులు మొదటినుండి 'అహ'మని ఆత్మగా గ్రహింపఁబడియుండియు, అన్వయవ్యతిరేకయుక్తులను విచారించినపిదప ఆత్మకాదని తెలిసి పరిత్యజింపఁబడినవి. కాన 'అహ' మని చెప్పఁబడుచున్న ఆత్మయనేపదార్థము

లేదని ముముక్షువు తలంచుచుండును. ఏల తలఁచునన ననాత్మలైన దేహాదులవల్లనుండి విలక్షణముగా నిష్కర్షింపఁబడిన నాస్వరూపము నాకు తెలియఁబడకయున్నది. కాన, నేను లేనేలేనని తలఁచును గావున దేహాదివిలక్షణమైన స్వస్వరూపమును నిర్ణయించుట కొఱకు 'తత్త్వమస్యా'దివాక్య మపేక్షింపఁబడుచున్నదని భావము.

అవ. పూర్వోక్తార్థమును విశదీకరించుటకొఱకు మఱల ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. అథ శరీరాదిబుద్ధిపర్యంతః స సర్వోఽపి అనాత్మేతి ప్రమాణాద్వినిశ్చిత్య కిమితి బుభుత్సాతో నోపరమతే. ౪

దం-అ. అటుగాక శరీరము మొదలు బుద్ధివఱకుగల యదియంతయు ననాత్మయే యని ప్రమాణమువల్ల నిశ్చయించి తెలియవలయుననే ఇచ్ఛవలన నెందుకని యుపరమింపఁడు?

తా. దేహాదిబుద్ధ్యంతపదార్థములు దృశ్యములై జడములై యున్నందున ఆత్మ కాదని అనుమానప్రమాణముచే నిశ్చయించినపిదప తెలిసికొనవలయుననే ఇచ్ఛ ముముక్షువునకు నివర్తింపఁగూడదా? ఇంకను 'తత్త్వమస్యా' దివాక్యము నపేక్షింపవలసినపని యేమి? అని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. శృణు. ౫

దం-అ. వినుము.

తా. అనుమానప్రమాణముచేత దేహాదిబుద్ధ్యంతపదార్థములను, అనాత్మలని నిశ్చయించినపిదప నైతము, 'తత్త్వమా'దివాక్యము అపేక్షింపఁబడుటకు నిమిత్తమును చెప్పుచున్నాను వినుమని భావము.

శ్లో. అనుచ్ఛిన్న బుభుత్సుశ్చ ప్రత్యగ్ధతో రనాత్మనః,
దోలాయమానచిత్తోఽయం ముహ్యతే భూతవన్నరః. ౧౦

దం-అ. ఈమనుష్యుఁడు అనాత్మవలననుండి ప్రత్యగాత్మయొక్క ప్రతిపత్తికొఱకు విచ్ఛేదమునొందని బుభుత్సకలవాఁడై, సంశయించుచున్నచిత్తముకలవాఁడై పిశాచముపట్టినవానివలె మోహమును బొందుచుండును.

తా. ముముక్షువగుపురుషుఁడు ఆత్మస్వరూపమును నిష్కర్షించి తెలియుటకుగాను ముందుగా ననాత్మవస్తువు లివియని విచారించి తెలిసికొనుండెను. కాన నతనికి

ఆత్మస్వరూపము ఇట్టిదని నిశ్చయము తెలియునంతవరకు తెలియవలయుననే ఇచ్ఛ నివర్తింపదు. అనాత్మవస్తువు లివియని తెలిసినమాత్రాననే ఆత్మతత్త్వము తెలియఁబడినది కాదు గదా? కాన ముముక్షువు ఆత్మతత్త్వము తెలియనందున పిచ్చివానివలె అనిశ్చితచిత్తము గలిగి మోహమును జెందుచుండును. అందువలన నాత్మతత్త్వమును తెలియఁజేయునట్టి 'తత్త్వమా'దివాక్యమును అపేక్షించును. అందుచే నాత్మతత్త్వ మిట్టిదని నిశ్చయముగా తెలియును. కాన నప్పటికి బుభుత్స నివర్తించునని భావము.

అవ. పూర్వవాది మరల శంకించుచున్నాఁడు.—

వాక్య. అవిలుప్త విజ్ఞానాత్మనః ఆత్మత్వాదేవ నిత్యసాన్నిధ్యాత్ బుభుత్సుః కిమితి న ప్రతిపద్యత ఇతి. ౬

దం-అ. నశించనివిజ్ఞానమే స్వరూపముగాఁగల ప్రత్యగాత్మకు ఆత్మత్వము కలిగియున్నందుననే సర్వదా సాన్నిధ్యము కలిగియున్నందున, తెలియ నిచ్ఛయించినవాఁడేల తెలియఁజాలఁడు.

తా. ఆత్మతత్త్వము తెలియఁబడకపోయినంగదా బుభుత్స నివర్తింపదు. ఆత్మ స్వయంప్రకాశచైతన్యస్వరూపుఁడున్ను, సర్వవ్యాపకుఁడునై యున్నాఁడు. అందువల్లనే యాత్మ ఒకకాలమందు లేఁడని చెప్పుటకు వీలులేదు. కాన నసాత్మవస్తువు లివియని నిశ్చయించినమాత్రాన నిత్యసన్నిహితమైన యాత్మవస్తువు తెలియఁబడునుగాని, తెలియఁబడకపోవుటకు కారణములేదని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. యస్మాత్. ౭

దం-అ. ఎందువల్లను?

శ్లో. యై రద్రాక్షీ త్పురాఽఽత్మానం యమనాత్మేతి వీక్షతే,
దృష్టే ర్ద్రష్టారమాత్మానం తైః ప్రసిద్ధైః ప్రమిత్సతి. ౧౧

దం-అ. ఏఇంద్రియములచేత పూర్వమున దేనిని ఆత్మగా జూచెనో అనంతరమున దానిని అనాత్మయని చూచును. ఆ ప్రసిద్ధములైన ఇంద్రియములచేత అంతఃకరణములకు సాక్షియైయున్న ఆత్మను తెలియ నిచ్ఛయించుచున్నాఁడో అందువలన తెలియఁజాలఁడని శేషము.

తా. ముముక్షువగుపురుషుఁడు తనకు వివేకము (శాస్త్రజన్యజ్ఞానము) కలుగకముందు దేహేంద్రియాదుల నాత్మగా తలఁచియుండి వివేకముకలిగిన పిదప నా దేహేంద్రియాదులనే చక్షురాదీంద్రియములచే ననాత్మగా చూచుచుండును. 'తత్త్వమ

...క్యము నపేక్షించనపుడు దేహేంద్రియాదులనే చూచుస్వభావముగల చక్షు
...ియములచేత అంతఃకరణాది సర్వదృశ్యప్రకాశకుఁడైన చిదాత్మను జూడ
...ందును గాన నాచిదాత్మ తెలియఁబడఁడు. అందువలననే బుభుత్స నివర్తింప
...వము.

అ. మరల పూర్వవాది శంకించుచున్నాఁడు.—

శ్లో. కస్మాత్పునర్వైతాః పరాచీనాభిః శబ్దాద్యవలేహినీభి
...ిరాత్మాన మనాత్మవన్నవీక్షతఇతి. ౨

టీ-అ. బాహ్యప్రవృత్తికలవియు, శబ్దాదివిషయములను గ్రహించునదియు నైన
...నవాత్మనువలె నాత్మను యేహేతువువలన చూడఁడు?

తా. చక్షురాదీంద్రియజ్ఞానములు బాహ్యమందు ప్రవర్తించుచు శబ్దస్పర్శాది
ములను గ్రహించుచున్నవి. ఇవి దేహాదులకంటె బాహ్యములైన శబ్దాదివిషయము
...ించేస్వభావము కలవైనను, వానికంటె కించిదాంతరములైన దేహేంద్రియా
నైతము గ్రహించుచున్నవిగదా? అటులే దేహాదులకంటె యాంతరమైయున్న
ను ఎందుకని గ్రహించవని భావము.

అవ. సిద్ధాంతి సమాధానమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. ఉచ్యతే. ౯

టీ-అ. చెప్పఁబడును. సమాధానమని శేషము.

నచక్షుర్వీక్షతే శబ్దమతదాత్మత్వకారణాత్,
యథైవం భౌతికీ దృష్టిర్నాత్మానం పరిపశ్యతి ౧౦

టీ-అ. నేత్రము అది ప్రకృతిగాగలది కాకపోయినందున నేప్రకారము శబ్ద
మాడదో, ఈప్రకారమే భూతములను చూచుచున్నవిజ్ఞానము ఆత్మను చూడ

తా. చక్షురింద్రియము రూపమును గ్రహించు సామర్థ్యముగలదైనను, రూప
...స్వభావముగలశబ్దమును గ్రహింపఁజాలదు. అందుకు నిమిత్తము శబ్దమునే
...కాశమువల్ల చక్షురింద్రియము పుట్టకపోవుటయే అనఁగా నేయిం
ము ఏగుణముగలభూతమువలనఁ బుట్టనో నాయింద్రియము ఆగుణమునే గ్రహిం
...ని గుణాంతరమును గ్రహింపఁజాలదు. చక్షురింద్రియము రూపగుణముగల తేజ
పుట్టినందున రూపమును గ్రహించునుగాని శబ్దమును గ్రహింపదని యర్థము
...ద్వారా బహిర్నిర్గతమగుచున్నవి. జ్ఞానములు (వృత్తులు) భూతసమ

దాయజనితమైన అంతఃకరణములవలన పుట్టుచున్నందున భూతసముదాయ దేహాదులనే గ్రహించునుగాని, సర్వవిలక్షణమైన ప్రత్యగాత్మను గ్రహి భావము.

అవ. గతించిన గ్రంథముయొక్క తాత్పర్యము ననువదించి యం యొక్క తాత్పర్యమును కీర్తించుచున్నాఁడు.—

వాక్య. ప్రత్యక్షాదిప్రమాణస్వాభావ్యానురోధేనతావ దర్శనకారణయుక్తమ్. అథప్రమేయ స్వాభావ్యాను ధేన ప్రతిషేధ ఉచ్యతే.

దం-అ. ప్రత్యక్షాదిప్రమాణములయొక్కస్వభావము ననుసరించుట ఆత్మదర్శనము లేకపోవుటకు కారణము చెప్పఁబడినది. ఇఁకను ప్రమేయ స్వభావము ననుసరించుటచేత నిషేధము చెప్పఁబడును.

తా. ప్రత్యక్షాదిప్రమాణజ్ఞానములు భౌతికాంతఃకరణజన్యత్వముస్వ గలిగియున్నవి. ఇట్టిస్వభావమును బట్టియోచించగా నీప్రమాణజ్ఞానములు ప్ర గ్రహింపఁజాలవని యింతవఱకు ప్రతిపాదించితిమి. ఇఁకను ప్రత్యగాత్మ యొ వమునుబట్టి యోచించినను ప్రమాణజ్ఞానములు ప్రత్యగాత్మను గ్రహింపఁజా దమని భావము.

శ్లో. ధీవిక్రియా సహస్రాణాం హానోపాదానధర్మిణామ్,
సదా సాక్షిణమాత్మానం ప్రత్యక్త్వా న్నాహమీక్షతే

దం-అ. వినాశము, జన్మము ధర్మములుగాఁగల బుద్ధియొక్కవికారస ఎప్పుడున్ను సాక్షియైయున్నచిదాత్మను ప్రత్యగ్రూపముగా నున్నందున, ము చూడఁజాలదు.

తా. ప్రత్యగాత్మ సమస్తమైనబుద్ధివృత్తులయొక్క ఉత్పత్తివినాశమ యైయున్నది. తాను ఎప్పటికిని ఉత్పత్తివినాశములులేనిదై యున్నది. త్యగాత్మ ప్రమాణజ్ఞానములని చెప్పఁబడుచున్న బుద్ధివృత్తులయొక్కసద్భా అభావకాలమునున్ను ప్రకాశింపఁజేయుచున్నందున ప్రమాణజ్ఞానములచేత డదు. గ్రహింపఁబడుననినచో ప్రమాణజ్ఞానములు లేనికాలమందు చిదాత్మ వలసి వచ్చును. చిదాత్మ లేకపోనిమ్మనినచో ప్రమాణజ్ఞానాభావము తెలి భావము.

అవ. ఈప్రకారము ద్రష్టృదృశ్యాదివివేకముచేతఅత్మానాత్మవివేకవ

బడినది. ఇఁకను ఆవివేకజ్ఞానము దేనిని ఆశ్రయించియున్నదని ఆక్షేపించి సమాధానమును చెప్పఁదలఁచి ముందుగా నాక్షేపమును చూపుచున్నాఁడు.

వాక్య. క్వ పునరియం వివేకబుద్ధిః కిమాత్మన్యుతానాత్మనీతి
కించ అతః యద్యాత్మని కూటస్థత్వవ్యాఘాతః అనాత్మ
ధర్మిత్వాత్ అథానాత్మని తస్యా అప్యచైతన్యాన్న వివేక
సంబంధ ఇతి. ౧౧

దం-అ. ఈవివేకజ్ఞానము దేనియందుండును ? ఆత్మయందుండునా? అనాత్మయందుండునా? దీనివలన నేమియన, ఆత్మయందుండినచో ననాత్మను చూచుచున్నందున కూటస్థత్వమునకు విరోధముకలుగును. అనాత్మయందుండినచో నాయాత్మకు చైతన్యములేనందున నీవివేకసంబంధము కలుగనేరదు.

తా. అహమని తోఁచఁబడుచున్న అహంకారమందు దృశ్యమైనఖండాంశము అనాత్మయనిన్ని ద్రష్టయైన చిదంశ మాత్మయనిన్ని తెలిసికొనుటవివేకజ్ఞానమనఁబడును. ఇట్టి వివేకజ్ఞానము ఆత్మను ఆశ్రయించియుండునా? లేక అనాత్మను ఆశ్రయించియుండునా? యని యాలోచించెదము. ఆత్మ నాశ్రయించియుండుననినచో ననాత్మభూతాంతఃకరణపరిణామరూపమైన వృత్తికి ఆత్మ యాశ్రయమైనయెడల నాయాత్మ సవికారమైయుండును. గాన నిఖిలశ్రుతిప్రకాశితమైన ఆత్మయొక్క కూటస్థత్వ (నిర్వికారత్వ) మునకు భంగము కలుగును. లేక, అనాత్మను ఆశ్రయించియుండుననినచో నాయనాత్మ యచేతనమైయున్నందున వివేకజ్ఞానమున కాశ్రయము కానేరదు. కాన వివేకజ్ఞానమున కాశ్రయమే లేనందున వివేకజ్ఞానము అన్వయవ్యతిరేకానుమానముచేత కలుగనే కలుగదని భావము.

అవ. సిద్ధాంతవాది సమాధానమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతే దాహ్యదాహకతైకత్రేత్యుక్తపరిహారాత్. ౧౨

దం-అ. చెప్పఁబడును. ''దాహ్యదాహకతైకత్ర'' యనే (౩. అధ్యా. ౫౯. శ్లో) శ్లోకమునందు చెప్పఁబడిన సమాధానమువలన ఈశంక యిచ్చట చేయఁదగినది కాదు.

తా. ''దాహ్యదాహకతైకత్ర'' యనుశ్లోకములో నంతఃకరణచిదాత్మలకు వాస్తవతాదాత్మ్యములు లేకపోయినను ఆరోపితతాదాత్మ్యము కలిగియున్నందున, అంతఃకరణ మచేతనమైనను, జ్ఞాతృత్వము కలిగియున్నది. యని ప్రతిపాదించియుంటిమి. కాన నిచ్చట వివేకజ్ఞానమున కాశ్రయములేదని విచారింపఁదగదు. ఏలనఁగా నంతఃకరణచిదాత్మల కారోపితతాదాత్మ్యము కలిగియున్నందున అంతఃకరణపరిణామరూపమైన వివేకజ్ఞానము చిదాత్మయం దారోపింపఁబడి చిదాత్మయే యాశ్రయముగా

గలిగియున్నది. చిదాత్మయందు వాస్తవముగా వివేకజ్ఞానములేనందున, చిదాత్మయొ కూటస్థత్వమునకు హానిలేదు. ఆరోపింపఁబడిన మలినత్వాదులచేత నాకసముయొ స్వచ్ఛత్వమునకు హానిలేదుకదా? యని భావము.

శ్లో. బుద్ధావేవ వివేకోఽయం యదనాత్మతయాభిదా,
బుద్ధిమేవాపమృద్నాతి కదలీం తత్ఫలం యథా.

దం-అ. దేనియొక్క అనాత్మత్వముచేత భేదము నిశ్చయింపఁబడుచున్న ఆబుద్ధియందే ఈవివేకము బుట్టుచున్నది. అరఁటిచెట్టుయొక్క ఫలము అరఁటిచెట్టును బుద్ధినే నశింపఁజేయుచున్నది.

తా. అంతఃకరణ మనాత్మయగుటచేత ఆత్మకంటె భిన్నమై తెలియఁ చున్నది. అట్టియాత్మ భిన్నమైనబుద్ధియందే వివేకజ్ఞానము పుట్టుచున్నది. కాన ఇ జ్ఞానము బుద్ధియందే యుండఁదగినదైనను, అవివేకముచేత బుద్ధితాదాత్మ్య బొందియున్న చిదాత్మయందారోపింపఁబడి చిదాత్మ నాశ్రయించియుండునట్లు కా చుచున్నది. అయితే బుద్ధియందుపుట్టిన వివేకజ్ఞానము బుద్ధిని యేలాగున నివర్తి జేయుననన, అరఁటిచెట్టునబుట్టిన అరఁటిపండ్లగెల యాయరఁటిచెట్టును నశింపఁజేసిన బుద్ధియందుబుట్టిన వివేకజ్ఞానము బుద్ధిని నశింపఁజేయుచున్నదని భావము.

అవ. ఓయీ! ఈలాగైతే ఈచెప్పిన వివేకజ్ఞానముచేతనే బుద్ధి మొదలగుదై ప్రపంచము నివర్తింపఁజేయఁబడుచుండఁగా 'తత్త్వమస్యా'దివాక్యముతోటి ప్ర జనమేమియని శంకించగా నుత్తరమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. సోఽయమతత్త్వే తత్త్వదృక్.

దం-అ. ఆపరమార్థమందు పరమార్థదృష్టిగల ఆ యీముముక్షువు.

శ్లో. అనుమానప్రదీపేన హిత్వా సర్వానానాత్మనః,
సంసారైకావలంబిన్యా తదభావం ధియేప్సతి.

దం-అ. దీపమువంటియనుమానముచేత సకలమైన యనాత్మలను పరిత్యజి సంసారమునే ముఖ్యముగా నవలంబించియున్నవివేకబుద్ధిచేత నాసంసారముయొ అభావమును (నివృత్తిని) ఇచ్ఛయించుచున్నాఁడు.

తా. ఆత్మకును అనాత్మకును ఏభేదముకలదో, ఏ యితరేతరాభావముకల ఆరెండును అద్వైతవిరుద్ధములైనందున అపరమార్థములే యగును. ఇట్టి యితరేత భావముల నవలంబించియున్నవి, లేక బుద్ధియున్ను, అపరమార్థములే యగును. అన నాత్మానాత్మ లత్యంతభిన్నములనియు, ఆత్మయం దనాత్మ లేదనియు ననాత్మ

దాత్మ లేదనియు తెలియుటయే వివేకజ్ఞానము. ఇట్టి వివేకజ్ఞానము ఆత్మానాత్మలయొక్క పరస్పరభేదాన్యోన్యాభావముల నవలంబించి ప్రవర్తించుచున్నదిగాని, కేవలాత్మస్వరూపము నవలంబించియున్నదిగాదు. కావుననే యీవివేకజ్ఞానము భ్రాంతి యనందగియున్నది. ఆత్మగానిదేహాదులయం దాత్మబుద్ధిచేసియున్నముముక్షువు, ముందుగా నాత్మానాత్మలయొక్క భేదమును, అన్యోన్యాభావమును దీపమువలె స్పష్టముగా ప్రకాశింపఁజేయుచున్న అన్వయవ్యతిరేకానుమానముచేత దేహాద్యనాత్మలనన్నిటిని, పరిత్యజించి పిదప 'తత్త్వమస్యా'దివాక్యమును వినినచో ద్వైతప్రపంచరూపమైనసంసారమును తరించును. 'తత్త్వమస్యా'దివాక్యము నపేక్షింపక పూర్వోక్తవివేకజ్ఞానముచేతనే సంసారమును తరించుటకు నిశ్చయించినచో నది సిద్ధించదు. ఆత్మైకాకారమగు పరమార్థజ్ఞానముచేత సంసారతరణము సిద్ధించును. కాని ఆత్మానాత్మలభేదాదుల నవలంబించియున్న అపరమార్థవివేకజ్ఞానముచేత సంసారతరణము సిద్ధించదని భావము.

అవ. పూర్వపక్షవాదియొక్క యాక్షేపము ననువదించి పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. యోఽయమన్వయవ్యతిరేకజో వివేక ఆత్మానాత్మ
విభాగలక్షణోఽనాత్మస్థః స్థాణౌ సంశయావబోధవత్ప్రతి
పత్త్వోఽయథావస్తు స్వాభావ్యాన్మృగతృష్ణికోదక
ప్రబోధవదితి.	౧౪

దం-అ. అన్వయవ్యతిరేకములచేతఁ బుట్టిన, ఆత్మానాత్మలభేదమే లక్షణముగా గలిగియుండి, అంతఃకరణతాదాత్మ్యాధ్యాసముగల యాత్మయందున్న ఏయీవివేకజ్ఞానముకలదో అది అవాస్తవవిషయస్వభావమును గలదైయున్నందున స్థాణువునందుకలిగిన సంశయజ్ఞానమువలె, ఎండమావులయందు ఉదకమని కలుగుచున్నమిథ్యాజ్ఞానమువలె అయథార్థమని తెలియఁదగినది.

తా. 'తత్త్వమస్యాది'వాక్యముఅనాత్మవస్తువులనన్నిటిని నిషేధించి ఆత్మయొక్క ఆసాధారణస్థితిని బోధించుచున్నది. అన్వయవ్యతిరేకములున్ను అనాత్మల నన్నింటిని పరిహరించి ఆత్మయొక్క అసాధారణరూపమునే తెలియఁజేయుచున్నది. కాన వివేకజ్ఞానముచేతనే మోక్షమెందుకని కలుగగూడదు? అన్వయవ్యతిరేకజన్యములు నైతము'తత్త్వమస్యా'దివాక్యము నపేక్షించవలసినపనియేమి? యని కొందఱాక్షేపించెదరు. ఆయాక్షేపము యుక్తముకానేరదు. ఏలననఁగా, అన్వయవ్యతిరేకము లాత్మస్వరూపమును బోధించినను, దేహాద్యనాత్మవస్తువులకంటె ఆత్మకు కలిగియుండుభేదమునే

బోధించుచున్నందున, ఆభేదము అఖండరసైక ప్రత్యగాత్మస్వరూపమునకు విరుద్ధ న్నందునను, ఆత్మయొక్క దేహాదిభేదమునవలంబించియున్న వివేకజ్ఞానము ఆత్మ అసాధారణస్వరూపము నవలంబించియున్నదిగాదు. కావున పరమార్థజ్ఞానమని నదికాదు ఇఁక నెట్టిదియన, స్థాణువునుచూచి ఇది స్థాణువా? చోరుఁడా? యని శయజ్ఞానమువలె, మరీచికలనుజూచి ఇది జలమని కలిగినభ్రాంతి జ్ఞానమువలె, అ జ్ఞానమగును. కావున వివేకజ్ఞానమువలన ముక్తి కలుగనేరదు. 'తత్త్వమస్యా'ది దేహాద్యనాత్మలను పరిహరించి ఆత్మస్వరూపమును బోధించునప్పుడు ఆత్మయొక ద్వైకరసచిన్మాత్రాకారమునే ముఖ్యముగా బోధించుచున్నందున వాక్యజన్యమైన పరమార్థమైయున్నది. దానిచేతనే ముక్తిసంభవించునని భావము.

వాక్య. అత ఆహ.

దం-అ. దీనిని చెప్పుచున్నాఁడు.

తా. ఈయర్థమే శ్లోకముతో చెప్పఁబడునని భావము.

శ్లో. సంసారబీజసంస్థోఽయం తద్ధియాముక్తి మిచ్ఛతి,
శశో నిమీలనేనేవ మృత్యుం పరిజిహీర్షతి.

దం-అ. కుందేలు కన్నుమూయుటచేత మృత్యువును పరిహరించ నిచ్ఛ నటుల సంసారమునకు కారణమైన అజ్ఞానమందున్న ఈవివేకజ్ఞానముకలవాఁడు కజ్ఞానముచేతనే మోక్షమును ఇచ్ఛయించుచున్నాఁడు.

తా. సంసారమునకు బీజము అజ్ఞానము. అజ్ఞానముచేతనే భేదజ్ఞానము చున్నది. వివేకజ్ఞానముకలవాఁడు ఆత్మానాత్మలయొక్క భేదమును చూచుచు కాన అజ్ఞానములో నున్నవాఁడేకాని, అజ్ఞానము నతిక్రమించినవాఁడుకాఁడ వివేకజ్ఞాని భేదము నవలంబించియున్న వివేకజ్ఞానముచేత మోక్షమును గోరుచున కావున తనకు ప్రాప్తించినమరణము కన్నులుమూసికొనిన నివర్తించునని తలఁ లను మూసికొనియున్న కుందేలువంటివాఁడు. అనఁగా కుందేలు తన్ను వ్యాధుల వచ్చినప్పుడు తాను కన్నులను మూసికొనినచో తనకు మరణము తప్పిపోవునని నుగాని, మరణము తప్పక ప్రాప్తించును. అటులే ముముక్షువు తనకు సంభవించిన ర్శనరూపమైనసంసారము వివేకజ్ఞానముచేత నివర్తించుననితలఁచి వివేకజ్ఞానమును దించికొనియుండినను సంసారము నివర్తింపదని భావము

అవ. ఈప్రకారము భేదప్రపంచమును గోచరింపఁజేయుచున్న ప్ర ప్రమాణములు ఆత్మస్వరూపమును గోచరింపఁజేయఁజాలవని యుక్తిచేత ప్ర ఈయుక్తి నిర్దుష్టముగాదని చెప్పుచున్నాఁడు.—

వాక్య. అస్యార్థస్య ప్రసిద్ధ్యై శ్రుత్యుదాహరణమ్. ౧౬

౧౦-అ. ఈయర్థముయొక్క దార్ఢ్యముకొఱకు శ్రుత్యుదాహరణము చేయఁబడు చున్నది.

తా. శ్రుతిమూలమైనయుక్తియే ప్రబలముగాన, ఇదివఱకు చెప్పినయుక్తి శ్రుతిమూలమైయున్నదని యుత్తరశ్లోకములచే చెప్పఁబడునని భావము.

శ్లో. ఇమమర్థం పురస్కృత్య శ్రుత్యా సమ్యగుదాహృతమ్,
"యచ్చక్షుషే"తి విస్పష్టం "నదృష్టే"రితిచ స్ఫుటమ్. ౧౭

౧౧-అ. ఈయర్థమును పురస్కరించుకొని 'నచక్షుషా' యనేశ్రుతిచేతను, 'నదృష్టేః' యనేశ్రుతిచేతను, యథేచ్ఛముగా, స్పష్టముగా, చక్కఁగా ప్రతిపాదింపఁబడినది.

తా. "నచక్షుషా పశ్యతికశ్చనైనం" (ఈప్రత్యగాత్మను ఎటువంటివాఁడున్ను నేత్రముచే జూడఁజాలఁడు) అనేశ్రుతియును, "నదృష్టేః ద్రష్టారం పశ్యేః" (దృష్టికిన్ని ప్రకాశకుఁడైయున్నఆత్మను దృష్టిచేత చూడవలదు) అనేశ్రుతియును చక్షురాదిసర్వప్రత్యక్షాదిజ్ఞానములకు గోచరించునదికాదని నిస్సంశయముగా ప్రతిపాదించుచున్నవి. ఈశ్రుతులను అవలంబించి మేమున్ను యుక్తిచేత 'ఆత్మ' ప్రమాణాంతరగోచరుఁడుకాఁడని ప్రతిపాదించినారము కావున, మేముచెప్పినయుక్తి నిర్మూలము కాదని భావము.

అవ. ఆత్మస్వరూపము ప్రత్యక్షాదిప్రమాణగోచరముకాదంటిరి. అయితే దేనికి గోచరమగుననఁగా చెప్పుచున్నారు.—

శ్లో. బుద్ధ్యంతమపిద్వైతం కోన్వహంస్యామితీక్షితుః,
శ్రుతిస్తత్త్వమసీత్యాహ సర్వమానాతిగామినీ. ౧౮

౧౨-అ. ఈప్రకారము బుద్ధిపఱకుగల అనాత్మవర్గమును నిరసించి "నేనెవఁడగుదు" నని యాలోచించువానికి సర్వప్రమాణముల నతిక్రమించియున్నశ్రుతి "అబ్రహ్మ వు నీవైతివి"ని చెప్పుచున్నది.

తా. ఇదివఱకు చెప్పియున్న అన్వయవ్యతిరేకానుమానముచేత దేహము మొదలు బుద్ధివఱకుగలవానిని అనాత్మలని నిరసించి ఆత్మవస్తువు వీనికంటె విలక్షణమైనదని నిశ్చయించి వివేకజ్ఞానముకలవాఁడై దేహేంద్రియమనః ప్రాణబుద్ధులు "నేను కానుగదా! అయితే నేనెవఁడను" అని ముముక్షువు యోచించుచుండఁగా సర్వప్రమాణముల నతిక్రమించి సర్వాధికమైయున్న శ్రుతి "నీవు అహంబ్రహ్మవే" నని బోధించుచున్నది.

అంతఃకరణము మొదలగు నపరమాత్మనుగూర్చి ఉపదేశముచేయఁబడినదనినచో, ఆయప రమాత్మ స్వయముగానే సుఖిత్వదుఃఖిత్వాదిసంసారరూపమై జడమైయున్నందున దానికి ఉపదేశముచేత నేవిధమైనఫలమున్ను కలుగనేరదు. అనఁగా చేతనునకు ఆగంతుకమై నసంసారము నివర్తించేకొఱకుగదా ఉపదేశము చేయఁబడుచున్నది. ఆపరమాత్మ చేతనము గాకపోవుటవల్లను స్వతఃసంసారరూపమైనందునను, దానికి ఉపదేశము చేయుంట చేత ప్రయోజనము కలుగనేరదు. కావున పరమాత్మకు ఉపదేశముచేయఁబడినదని చెప్పినను నిష్ప్రయోజనత్వదోషము సంభవించుచున్నది. అపరమాత్మకు ఉపదేశము చేయఁబడినదనిచెప్పినను అదే నిష్ప్రయోజనత్వదోషము సంభవించుచున్నందున వేదాంతిమతము యుక్తమైనదికాదని భావము.

అవ. ఈపూర్వపక్షమునకు పరిహారము చెప్పుచున్నారు.—

వాక్య. అత ఆహ. ౧౯

దం-అ. అందువల్ల చెప్పుచున్నారు.

తా. ఈప్రకారముచేసిన యాక్షేపమునకు పరిహారమును శ్రీశంకరభగవత్పాదాచార్యులవారే చెప్పుచున్నారని భావము.

శ్లో. అవివిచ్యోభయం వక్తి శ్రుతిశ్చేత్స్యాద్గ్రహస్తథా,
ఇతి పక్షముపాదాయ పూర్వపక్షం నిశాత్య చ. ౨౦

దం-అ. ఆత్మానాత్మగ్రంథిని విభజించకయున్న ప్రత్యగాత్మనుద్దేశించి 'తత్త్వమసి' యనేశ్రుతి యుపదేశించుచున్నదని చెప్పునెడల అప్పుడు అంగీకారము కలుగును. ఈపక్షమును గ్రహించి పూర్వపక్షమును ఖండించి భగవత్పాదులచే నుదహరింపఁబడినదని ౧౯వ శ్లోకముతో నన్వయము.

తా. అంతఃకరణతద్ధర్మములను అవివేకముచేత తనయందారోపించుకొని 'అహం' అని వ్యవహరించుచున్న ప్రత్యగాత్మ నుద్దేశించి 'తత్త్వమసి' యనేశ్రుతి ఉపదేశించుచున్నదనే పక్షము మాచేత నంగీకరింపఁబడుచున్నది. ఇంతేగాని కేవల ప్రత్యగాత్మనుగూర్చి ఉపదేశము చేయఁబడినదని, కేవలాపరమాత్మను (అంతఃకరణాదికమును) ఉపదేశముచేయఁబడినదని ఈరెండుపక్షములును అంగీకరింపఁబడినవికావు. అని ఈపక్షమును సిద్ధాంతముగా నంగీకరించి పూర్వపక్షవాది కేవలాపరమాత్మకా యని వికల్పించిన రెండుపక్షములను ఖండించి ఉపదేశసాహస్రియందు భగవత్పాదులవా రుదహరించియున్నారు. మేమున్ను 'క్వపునరియం వివేకబుద్ధిః' అనే ౧౧ వాక్యమునందు పూర్వపక్షమును చూపించి "బుద్ధాదేవవివేకోయం" అనే ౧౪వ శ్లోకమునందు సమాధానమును

చెప్పియున్నాము. గనుక మేము చెప్పినయర్థము శ్రీశంకరభగవత్పాదులచేతనున్ను ప్రతి పాదింపఁబడియున్నదని భావము.

అవ. ఈప్రకారము 'బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్' తదాత్మానమేవా వేదహం బ్రహ్మాస్మీతి' అనే బృహదారణ్యశ్రుతిని ఆలోచించగా అంతఃకరణాధ్యాసముకలిగి అంతఃకరణములకంటె విలక్షణముగా తెలియఁబడని ప్రత్యగాత్మనుగూర్చియే, యుపదేశము చేయఁబడుచున్నదని చూపింపఁబడినది. అయితే ఆత్మానాత్మలయొక్క స్వరూపవైలక్షణ్యమును బోధించుచున్న అన్వయవ్యతిరేకములతో పని యేమనుశంక కుత్తరము చెప్పుచున్నాఁడు.—

వాక్య. తచ్ఛేదమవివేకాత్స్వతో వివిక్తాత్మనే తత్త్వమసీత్యుపదిష్టమ్. ౨౦

దం-అ. స్వయముగానే విభజించి తెలియఁబడిన స్వరూపముగలవానికి అజ్ఞానముకలిగియున్నందున 'తత్త్వమసి' యనునది యుపదేశింపఁబడినది.

తా. 'తత్త్వమస్యా'దివాక్యము వినఁబడకమునుపే అన్వయవ్యతిరేకములచే నాత్మస్వరూపమును దేహేంద్రియాదులకంటెవిలక్షణముగా తెలిసియున్నవానికే 'తత్త్వమసి' యనువాక్యము బ్రహ్మాత్మత్వము నుపదేశించుచున్నది. కావున అన్వయవ్యతిరేకములు వ్యర్థములుకావు. అయితే అన్వయవ్యతిరేకములచేతనే విశుద్ధాత్మజ్ఞానము పుట్టి కలుగుచుండఁగా 'తత్త్వమస్యా'దివాక్యోపదేశము నిరర్థకమగునుకదా? యనిశంకించతగదు. అన్వయవ్యతిరేకములచేత ఆత్మయొక్క దేహాదివైలక్షణ్యమును తెలియఁబడినను, అఖండైకరసబ్రహ్మరూపత్వము తెలియఁబడనందున కొంత అజ్ఞానము శేషించియుండును. సర్వ అజ్ఞాననివృత్తియే మోక్షమనంబడును. కావున ప్రత్యగాత్మకు పరబ్రహ్మరూపత్వమును బోధించు 'తత్త్వమస్యా'దివాక్యోపదేశము అవశ్యాపేక్షితమైయున్నదనిభావము.

శ్లో. యుష్మదస్మద్విభాగజ్ఞే స్యాదర్థవదిదం వచః,
యతోఽనభిజ్ఞే వాక్యం స్యాత్ బధిరేష్వివ గాయనమ్. ౨౧

దం-అ. ఆత్మానాత్మలవైలక్షణ్యము తెలిసినవానివిషయమై ఈవాక్యము ప్రయోజనముకలది యగును. ఎందువలన తెలియనివానివిషయమై వాక్యము, చెవిటివాండ్రవిషయమై గానమువలె వ్యర్థమగునో అందువల్ల.

తా. అన్వయవ్యతిరేకములచే నాత్మానాత్మలయొక్క వైలక్షణ్యమును బాగుగ తెలిసికొని, 'త్వం' పదార్థవివేకముగలవానికి, 'తత్త్వమస్యా'దివాక్యము తత్త్వజ్ఞానమును పుట్టించి సకలఅవిద్యానివృత్తిని కలుగఁజేయును. పదార్థజ్ఞానములేనివానికి చెవిటివాని

యొద్ద మంచిసంగీతమును వినిపించితే యేలాగున వ్యర్థమో ఆలాగున వ్యర్థమైయుండు నని భావము.

అవ. అన్వయవ్యతిరేకములు పదార్థజ్ఞానమునకు కారణమని మేము చెప్పిన యర్థము శ్రీభగవత్పాదుల చేతను చెప్పఁబడినదని చెప్పుచున్నాఁడు.—

వాక్య. తస్య చ యుష్మదస్మద్విభాగవిజ్ఞానస్య కా యుక్తి రుపాయభావం ప్రతిపద్యతే శృణు. ౨౧

దం-అ. ఆ ఆత్మానాత్మలయొక్క వైలక్షణ్యము నెఱుంగుటకు ఏయుక్తి సాధనత్వమును పొందుననఁగా చెప్పుచున్నాను వినుము.

తా. స్పష్టము.

శ్లో. "అన్వయవ్యతిరేకౌ హి పదార్థస్య పదస్యచ,
స్యాదేతదహమిత్యత్ర యుక్తిరేవావధారణే."

దం-అ. పదముయొక్క, పదార్థముయొక్క సంబంధమైన అన్వయవ్యతిరేకములే 'ఇది నేను' అనే ఈనిశ్చయమందు ఉపాయము అగుచున్నది.

తా. 'త్వం', 'అహం' ఇవి పదములు; ఆత్మయు ననాత్మయు ఇది పదార్థము. వీటియొక్క అన్వయవ్యతిరేకములను ద్వితీయాధ్యాయములో మేము చెప్పియున్నాము. ఆ యన్వయవ్యతిరేకములే ఇది యని చెప్పఁబడుచున్న అనాత్మపదార్థమును 'అహ' మని చెప్పఁబడుచున్న ఆత్మపదార్థమును విభజించి నిశ్చయించుటయందు సాధనములై యున్నవని భావము.

అవ. అనువృత్తివ్యావృత్తిరూపములైన అన్వయవ్యతిరేకములు ఆత్మానాత్మనిశ్చయసాధనములని చెప్పి ఆగమాపాయరూపములైన అన్వయ వ్యతిరేకములున్ను ఆత్మానాత్మనిశ్చయ సాధనములని శ్రీశంకరభగవత్పాదులచే చెప్పఁబడియున్నదని చూపించుచున్నాఁడు.—

వాక్య. కథం తౌ యుక్తి రత్రాహ.

దం-అ. ఆయన్వయవ్యతిరేకము లెట్లుపాయమైనదియు చెప్పుచున్నాఁడు.

తా. ఆగమాపాయరూపములైన యన్వయవ్యతిరేకములు ఆత్మానాత్మనిర్ధారణమందు సాధకములైనప్రకార మెటులనఁగా అది శ్రీభగవత్పాదులవారిచే చెప్పఁబడినదని భావము.

శ్లో. "నాద్రాక్షమహమిత్యస్మిన్ సుషుప్తేఽన్యన్న నాగపి,
న వారయతి దృష్టిం స్వాం ప్రత్యయం తు నిషేధతి." ౨౨

దం-అ. ఈసుషుప్తియందు మఱియొకదానిని కొంచెముగనైన నేను చూడ నైతిని అని స్వరూపభూతమైనజ్ఞానమును నివారించఁడు. అన్యజ్ఞానమున్ను నిషేధింపఁబడుచున్నది.

తా. నిదురపోయిలేచినవాఁడు నిద్రాకాలమందు నేను మఱియొకదానిని కొంచెమైనను చూచినవాఁడనుకానని పరామర్శించును. ఈపరామర్శలో నేను చూచినవాఁడనుకానని కనుపడుచున్నందున తానసే అజ్ఞానసాక్షియగు స్వస్వరూపము నిషేధింపఁబడినదికాదు. ఎందువలననఁగా పరామర్శయనఁగా పూర్వమునం దనుభవింపఁబడినవానిని అనుసంధించుట. దానికి అనుసంధించువాఁడు అవశ్యముగా కావలసియున్నది. కావున సుషుప్తికాలమందు చిద్రూపుఁడైనఆత్మ యనువర్తించియే యున్నది. ఘటపటాదివిషయములు వానిని గ్రహించునట్టిజ్ఞానమే నిషేధింపఁబడియున్నది. ఇందుచేత నాత్మస్వరూపము సుషుప్తియందును ఆగమాపాయములు లేనిదై నిత్యమై యున్నది. అనాత్మయగుదేహాదులు స్వప్నజాగ్రములయందుండి సుషుప్తియందు లేనివై యున్నందున అనిత్యములై యున్నవి. ఈయన్వయవ్యతిరేకములు ఈప్రకారము ఆత్మానాత్మవివేకసాధనములని భావము.

అవ. ఈప్రకారము అన్వయవ్యతిరేకములచేత ఆత్మానాత్మవివేకమును సంపాదించుకొనియున్నవానికి 'తత్త్వమస్యా'దివాక్యమే అద్వైతజ్ఞానమును సంపాదించునుగాని మఱియొకటి సంపాదించదనేయర్థమునున్ను శ్రీశంకరభగవత్పాదులచే చెప్పఁబడినదని చూపించుచున్నాఁడు,—

శ్లో. "ఏవం విజ్ఞాతవాచ్యార్థే శ్రుతి లోకప్రసిద్ధతః,
శ్రుతి స్తత్త్వమసీత్యాహ శ్రోతుర్మోహాపనుత్తయే." ౨౮

దం-అ. శ్రుతివల్లను, లోకప్రసిద్ధివల్లను, ఈప్రకారము తెలియఁబడిన వాచ్యార్థము కలవానివిషయమై వాక్యశ్రవణముచేసినవానియొక్క అజ్ఞాననివృత్తికొఱకు శ్రుతి ఆబ్రహ్మ నీవేనని చెప్పుచున్నది.

తా. 'నహి ద్రష్టుః దృష్టే ర్విపరిలోపోవిద్యతే' (సాక్షియొక్క స్వరూపభూతమైన జ్ఞానమునకు లోపములేదు) అనేశ్రుతినిబట్టి, పూర్వోక్తములగు అన్వయవ్యతిరేకములనుబట్టి, ఎవఁడు 'త్వం' పదార్థమైన శుద్ధచిత్తును తెలిసియుండునో, వానికి పరిచ్ఛిన్నత్వభ్రాంతిజనకమైయున్నఅజ్ఞానాంశము నివర్తించుటకు 'తత్త్వ'మసీ'త్యాదివాక్యము 'త్వం' పదార్థమైన శుద్ధచిత్తు అఖండైకరసపరిపూర్ణమైనబ్రహ్మయేనని బోధించునుగాని, మఱియొకప్రమాణము ఈయర్థమును బోధింపఁజాలదని భావము.

అవ. 'త్వం' పదలక్ష్యార్థమును మేము ఏప్రకారముగ చెప్పితిమో ఆప్రకారమే శ్రీభగవత్పాదులున్ను చెప్పియున్నారని చెప్పుచున్నారు.—

వాక్య. తత్ర 'త్వం' ఇతి పదం యత్ర లక్షణయావర్తతేసోఽర్థ ఉచ్యతే. ౨౩

దం-అ. అందులో 'త్వం' అనేపదము ఏయర్థమునందు లక్షణచేత ప్రవర్తించుచున్నదో ఆయర్థము చెప్పఁబడుచున్నది.

తా. 'తత్త్వమసి'వాక్యములోనుండే 'త్వం' పదము ఏయర్థమును లక్షణావృత్తిచేత చెప్పుచున్నదో ఆయర్థము నిశ్చయించి ముందటిశ్లోకములో చెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. "అహంశబ్దస్య యా నిష్ఠా జ్యోతిషి ప్రత్యగాత్మని,
సైవోక్తా సదసీత్యేవం ఫలం తత్ర విముక్తతా." ౨౪

దం-అ. 'అహం'శబ్దమునకు స్వయంప్రకాశమైన ప్రత్యగాత్మయందు ఏపర్యవసానస్థితికలదో, అదియే సచ్ఛబ్దార్థమైన బ్రహ్మవైతి వనేపదముచేతనున్ను చెప్పఁబడినది. దానియందు అజ్ఞాననివృత్తి ఫలమైయున్నది.

తా. ఆత్మవాచకమైన 'అహం' శబ్దము ముఖ్యావృత్తిచే దేహేంద్రియాదివిశిష్టమైన చైతన్యమును బోధించుచున్నను, దేహేంద్రియాదిసంబంధగంధశూన్యమై, స్వయంప్రకాశమై, నిత్యమై, చిద్రూపమైయున్న ప్రత్యగాత్మను తాత్పర్యవృత్తిచేత ప్రతిపాదించుచున్నది. ఈయర్థమునే 'తదసి' అనేపదద్వయమున్ను ప్రతిపాదించుచున్నది. కావున 'త్వం' పదలక్ష్యార్థమునకును, 'తదసి' యనేవాక్యార్థమునకును భేదమేలేదు. అనఁగా బ్రహ్మాభిన్నమైన చిదాత్మనే త్వంపదతాత్పర్యముతోటి ప్రతిపాదించుచున్నదని యర్థము. ఇదిగాక బ్రహ్మాభిన్నప్రత్యగాత్మస్వరూపజ్ఞానముచేత సకలావిద్యానివృత్తిరూపమైనమోక్షము ఫలమని 'తస్యతావదేవ చిరన్నవిమోక్షతే' (సదాత్మ తత్త్వజ్ఞానముకలవానికి మోక్షముకలుగుటకు శరీరపాతమువఱకే విళంబము. అనంతరము విళంబముండదని) శ్రుతి ప్రతిపాదించుచున్నదనిగాని భిన్నాత్మజ్ఞానము కలవానికి మోక్షముకలదని చెప్పియుండలేదు. కావున వేదాంతమహావాక్యగత 'త్వమహమా'దిపదములు ఫలవంతమైన అభిన్నాత్మస్వరూపబోధనమందు తాత్పర్యము కలిగియున్నవిగాని నిష్ఫలభిన్నాత్మస్వరూపబోధనమందు తాత్పర్యము కలవికావని భావము.

అవ. ఆత్మానాత్మవివేకముకలుగుటకు అన్వయవ్యతిరేకములను మఱియొకవిధముగాకూడా శ్రీభగవత్పాదులు ప్రతిపాదించియున్నారని ముందటియైదుశ్లోకములకు తాత్పర్యమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. అన్యచ్చాన్వయవ్యతిరేకోదాహరణమ్ యథా. ౨౮

దం-అ మఱియొక యన్వయవ్యతిరేకములయొక్క ఉపపాదనము చేయఁబడినది. అది ఎటులనఁగా చెప్పెదము.

తా. ఆత్మానాత్మవివేకముకొఱకు శ్రీశంకరాచార్యులు పూర్వోక్తాన్వయవ్యతిరేకములకంటె విభిన్నములయిన యన్వయవ్యతిరేకములను ఉపదేశసాహస్రియందు ఉదహరించియున్నారు. వానిని ముందఱ గాన్పించెదమని భావము.

శ్లో. "ఛిత్వా త్యక్తేన హస్తేన స్వయం నాత్మా విశేష్యతే,
తథా శిష్టేన సర్వేణ యేన యేన విశేష్యతే." ౨౯

దం-అ. ఛేదించి విడువఁబడినహస్తముచేత ఆత్మ తానెట్లు విశేషింపఁబడదో, అటులే దేనిదేనిచేత విశేషింపఁబడునో శేషించిన ఆయా సకలముచేతను విశేషింపఁబడదు.

తా. ఈలోకములో నొకపురుషుఁడు హస్తములు కలిగియుండునపుడు మంచిహస్తములుకలవాఁడనిగాని, కురూపహస్తములు గలవాఁడనిగాని హస్తములచే విశేషింపఁబడి వ్యవహరింపఁబడును. ఆహస్తములను ఛేదించినపిదప అట్లు వ్యవహరింపఁబడఁడు గదా? అటులే ఈయాత్మయున్న వివేకములేనికాలమందు స్థూలదేహగతములయిన శ్రోత్రాదీంద్రియములచేతను, సూక్ష్మదేహగతములయిన సుఖదుఃఖకర్తృత్వాదులచేతను, విశేషింపఁబడి "నేను మంచినేత్రములు కలవాఁడను, నేను సుఖవంతుఁడను" అని ఈలాగు వ్యవహరింపఁబడుచుండునుగాని వివేకము గలిగినపిదప ఆలాగున విశేషింపఁబడి వ్యవహరింపఁబడఁదగనివాఁడని తాత్పర్యము.

అవ. ఓయీ! శ్రోత్రనేత్రసుఖదుఃఖాదులచేత ఆత్మ ఏల విశేషింపఁబడదనఁగా శ్రోత్రసుఖదుఃఖాదు లవిద్యచేత నారోపింపఁబడినందున మిథ్యాభూతము లగుటచేత విశేషింపఁబడదని చెప్పుచున్నాఁడు.—

శ్లో. "విశేషణ మిదం సర్వం సాధ్వలంకరణం యథా,
అవిద్యాధ్యస్తమతః సర్వం జ్ఞాత ఆత్మన్యసద్భవేత్." ౩౦

దం-అ. ఈవిశేషణమంతయు మంచియాభరణమువలె అవిద్యచేత నారోపింపఁబడినది. అందువల్ల నాత్మ తెలియఁబడఁగా ఇదియంతయు మిథ్యయే యగును.

తా. దేహముకంటె విలక్షణమైన చిదాత్మ తాను దేహమునందు తాదాత్మ్యాభిమానము చేసియున్నందున దేహమునందు సంబంధించియున్న మకుటకుండలాద్యాభరణములను తనయందు సంబంధించియున్నట్లు తలఁచి నేను మకుటముకలవాఁడను, నేను

కుండలములు గలవాఁడనని వ్యవహరించుచుండును గదా? ఇటులే స్థూలదేహసంబంధము గల కరచరణాద్యవయవములను సూక్ష్మదేహసంబంధములగు సుఖదుఃఖాదులను తనవియని తలఁచి నేను మంచి చేతులుకలవాఁడను, నేను సుఖవంతుఁడనని వ్యవహరించును. స్థూల సూక్ష్మదేహములయందు తాదాత్మ్యాభిమానము కలిగియున్నందున ఇట్టివ్యవహారము స్వస్వరూపజ్ఞానము కలుగకముందు కలిగియుండును. శాస్త్రాచార్యప్రసాదముచేత 'అహం బ్రహ్మాస్మి' యనుస్వరూపయాథాత్మ్యజ్ఞానము కలిగినపిదప నివర్తించుననని భావము.

అవ. దేహేంద్రియాదివిశేషములన్నియును నాత్మయందు అజ్ఞానకల్పితములై యున్నందున ఛిన్నహస్తమువలె ఆత్మకు వాస్తవవిశేషణములు కానందున చిదాత్మ సకల విశేషణశూన్యుఁడని చెప్పఁబడుచున్నాఁడు.—

శ్లో. "తస్మాత్త్యక్తేన హస్తేన తుల్యం సర్వం విశేషణమ్,
అనాత్మత్వేన తస్మాత్ జ్ఞో ముక్తః సర్వవిశేషణైః."

దం-అ. ఆకారణమువలన సకలమైనవిశేషణములున్ను అనాత్మయగుటచేత ఛిన్నము చేయఁబడినహస్తముతోటి సమానమైనవి. అందువలననే చిద్రూపుఁడైనఆత్మ సకలవిశేషణములచేతను విడువఁబడినవాఁడు.

అవ. ఆత్మస్వరూపమును నిశ్చయించి చూపుచున్నాఁడు.—

శ్లో. "జ్ఞాతైవాత్మా సదా గ్రాహ్యో జ్ఞేయముత్సృజ్య కేవలః,
అహమిత్యపి యద్గ్రాహ్యం వ్యపేతాంగసమం హి తత్."

దం-అ. తెలియఁబడుదానిని పరిత్యజించి తెలిసికొనువాఁడే నిరవయవమైన ఆత్మయని యెప్పుడున్ను గ్రహింపవలయును. 'అహం' నేను అనిగ్రహింపఁబడునది యేదికలదో అదియును త్యక్తహస్తముతోటి సమానమైనది.

తా. దేహేంద్రియాదులు జాగ్రదవస్థయందుమాత్రము ప్రకాశించును స్వప్న సుషుప్తులయందు ప్రకాశించనందున అనాత్మలని చెప్పఁబడియున్నవి. దేహేంద్రియాదుల యొక్క భావాభావములను ప్రకాశింపఁజేయుచు సర్వావస్థలయం దేకరూపముగా భాసించునట్టి యేచైతన్యముకలదో ఆచైతన్యమే యాత్మస్వరూపము. ఇదిగాక 'అహం' అనిగ్రహింపఁబడుచున్న అహంకారమున్ను ఛిన్నహస్తము యేలాగున దేహధర్మము కాదో, ఆలాగుననే యాత్మధర్మము కాదు. కనుక, ఆత్మస్వరూపము దేహేంద్రియమనః ప్రాణబుద్ధ్యహంకారాది సర్వవిశేషరహితమై, కేవలమై, నిరవయవమై, నిరంజనమై, చిద్రూపమై యుండునది యని భావము.

అవ. ఈప్రకారము దేహేంద్రియాదులు వ్యభిచారులైయున్నందున ఆత్మవిశేషణములు కావనిచెప్పి దృశ్యములైనందుననున్ను ఆత్మవిశేషణములు కావని చెప్పుచున్నారు.—

శ్లో. "దృశ్యత్వా దహ మిత్యేష నాత్మధర్మో ఘటాదివత్,
తథాన్యే ప్రత్యయా జ్ఞేయా దోషాశ్చాత్మామలోహ్యతః." ౩౦

దం-అ. 'అహం' అనిచెప్పఁబడుచున్న అహంకారమున్ను దృశ్యమైయున్నందున ఘటము మొదలగుదానివలె ఆత్మధర్మము కాదు. అటులే ఇతరములగు సుఖదుఃఖాదులున్ను రాగద్వేషాదిదోషములున్ను తెలియఁదగినవి. అందువలన ఆత్మ నిర్మలుఁడు.

తా. 'అహం' శబ్దవాచ్యమైయున్న అహంకారము ఘటాదులవలె దృశ్యమైయున్నందున ఆత్మధర్మములు కానేరవు. ఇదిగాక అహంకారపరిణామములైన సుఖాదులున్ను రాగద్వేషాదులున్ను దృశ్యములైనందున ఆత్మధర్మములు కావనియే తెలియవలయును. ఈప్రకార మాత్మ సకలధర్మశూన్యుఁడైనందున నిత్యనిర్మలుఁడని యెఱుంగునది యని భావము.

అవ. 'ఉపదేశసాహస్రి'లోని 'తత్త్వమసి' ప్రకరణమందు భగవత్పాదులు సకలన్యాయములను క్రోడీకరించి యేమి చెప్పినయర్థమునే కొన్నిశ్లోకములలో ప్రతిపాదించియున్నారని మరల చూపించుచున్నాఁడు.—

వాక్య. సర్వన్యాయోపసంగ్రహః. ౨౫

దం-అ. సకలమైన న్యాయములయొక్క సంగ్రహము చేయఁబడినది.

తా. శ్రీభగవత్పాదులు పూర్వగ్రంథమునందు ప్రతిపాదించినయుక్తులను అన్నిటిని సంగ్రహించి కొన్నిశ్లోకములలో నిమిడ్చియున్నారు. వానిని చూపించెదమని భావము.

శ్లో. "నిత్యముక్తత్వ విజ్ఞానం వాక్యాద్భవతి నాన్యతః,
వాక్యార్థస్యాపి విజ్ఞానం పదార్థస్మృతిపూర్వకమ్." ౩౧

దం-అ. నిత్యముక్తుఁడ ననేజ్ఞానము వాక్యమువలన కలుగుచున్నది. మఱియొకదానివలన కలుగదు. వాక్యార్థముయొక్కజ్ఞానము, పదార్థజ్ఞానము పూర్వమందు కలదైయుండును.

శ్లో. "అన్వయవ్యతిరేకాభ్యాం పదార్థః స్మర్యతే ధ్రువమ్,
ఏవం నిర్దుఃఖమాత్మాన మక్రియం ప్రతిపద్యతే." ౩౨

దం-అ. పదార్థము అన్వయవ్యతిరేకములచేత తెలియఁబడును. ఇది సత్యము. ఈవిధముగా దుఃఖరహితమై క్రియాశూన్యమైన ఆత్మను తెలియుచున్నాఁడు.

శ్లో. "సదేవేత్యాది వాక్యేభ్యః ప్రమా స్ఫుటతరా భవేత్
దశమ స్త్వమసీత్యస్మా ద్యథైవం ప్రత్యగాత్మని."

దం-అ. "దశమ స్త్వమసి" యనే ఈవాక్యమువలన యేప్రకారమో రమే ప్రత్యగాత్మయందు యథార్థజ్ఞానము 'సదేవసోమ్యేద మగ్రఆసీత్' క్యములవలన మిగుల విశదమైనది యగును.

తా. నేను అవిద్యాదిదోషములవల్ల సర్వదా విముక్తమైయున్న పర యఖండజ్ఞానము 'తత్త్వమస్యాది' వాక్యములవలన కలుగవలయునే గాని, మ ధనమువలన కలుగదు. 'తత్త్వమస్యాది' వాక్యార్థమును తెలియుటకుగాను 'త్వం' పదార్థమును విశదము తెలిసికొనవలయును. పూర్వోక్తములయిన అ రేకములను పర్యాలోచనచేయుటచే పదార్థము నిశ్చయముగా తెలియఁబడ ముందుగా నన్వయవ్యతిరేకములను విచారించి 'త్వం' పదార్థము నెఱింగి పిదప జ్ఞానమును సంపాదించుకొని యున్న పురుషుఁడు సర్వదుఃఖవినిర్ముక్తమై, సర గంధశూన్యమై, అఖండైకరసమై, పరిపూర్ణమైయున్న ప్రత్యగాత్మను ప్రత్యక్షవ యఁగలఁడు. 'సదేవసోమ్యేదమగ్రఆసీత్' అనేవాక్యమువల్ల స్వజాతీయ స్వగతభేదరహితమని 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అనేవాక్యమువల్ల సచ్చిదా పరిపూర్ణమని ప్రతిపాదింపఁబడుచున్న పరబ్రహ్మను సదాచార్యులు ఎప్పుడు మసి' యనువాక్యము నుపదేశించి 'నీవే యా బ్రహ్మవు' అని బోధించునో అప్ర ర్థనిశ్చయజ్ఞానముకలవానికి పూర్వోక్తప్రత్యగాత్మస్వరూపసాక్షాత్కారము ! అది ఎట్లు కలుగునన 'దశమ స్త్వమసి' యనువాక్యమును ఆప్తపురుషుఁ డుపదేశిం నేను పదియవవాఁడననే జ్ఞానము ఎటువలె కలుగునో, అటువలె కలుగునని భా

వాక్య. వీక్షాపన్న స్యోదాహరణమ్.

దం-అ. 'వీక్షాపన్నస్య' అనుశ్లోకమున నుదాహరణము చెప్పఁబడును.

తా. మూఁడవయధ్యాయమున 'వీక్షాపన్నస్యకోస్మీతి' యను ౫౩వ చేత నేయర్థమును మేము చెప్పియుంటిమో 'నవసంఖ్యాహృతజ్ఞానః' అనుదృష్టా చూపి 'అపవిద్ధద్వయోప్యేవం' అని దార్ష్టాంతికమును నిరూపించి ౬౪-౬౫ శ్లో చేత నేయర్థమును నిరూపించియుంటిమో ఆయర్థమున్ను స్వకపోలకల్పితమ శ్రీశంకరభగవత్పాదులచే ప్రతిపాదింపఁబడియే యున్నది. ఆయాచార్యవచ ఇచ్చట ఉదహరించెదమని భావము.

శ్లో. "నవబుద్ధ్యపహారాద్ధి స్వాత్మానం దశపూరణమ్,

అపశ్యన్ జ్ఞాతుమేవేచ్ఛేత్ స్వమాత్మానం జనస్తథా." ౩౪

దం-అ. మనుష్యుఁడు తొమ్మిదిమందిమి మేము అనే జ్ఞానముచేత నాకర్షింపఁబడియున్నందున పదియవసంఖ్యను పూరించుచున్న తనస్వరూపమును చూడనివాఁడై తనస్వరూపమును తెలిసికొన ఇచ్ఛయించనే ఇచ్ఛయించును. అటువలెనే.

శ్లో. "అవిద్యాబద్ధ చక్షుష్ట్వాత్ కామాపహృతధీః సదా,
వివిక్తం దృశిమాత్మానం నేక్షతే దశమం యథా." ౩౫

దం-అ. అజ్ఞానముచేత కట్టఁబడిన నేత్రము (బుద్ధి) కలవాఁడైనందున యెప్పుడున్ను విషయాభిలాషచేత నపహరింపఁబడినచిత్తముకలవాఁడై విలక్షణమైయుండి జ్ఞానరూపమైనయాత్మను పదియవవానివలె చూడఁజాలఁడు.

తా. ఒకానొకపురుషుఁడు తాను పదియవవాఁడైనను తనతోకూడా తొమ్మిదిమందిని లెక్కించుచు తానున్ను ఆతొమ్మిదిమందిలో నంతర్భవించియున్నట్లు తలఁచి, తాను ఆతొమ్మిదిమందికంటె వేఱుగానుండి పదియవవాఁడైనను తన్నుతా నెఱుంగక పదియవవానికి నెఱుంగుటకు యత్నించును. అటులే ఈపురుషుఁడు అజ్ఞానతిరోహితమైన స్వస్వరూపజ్ఞానముకలవాఁడై యున్నందున బాహ్యవిషయములయందు వ్యాపించుచిత్తముకలవాఁడైయుండి సర్వవిషయములకంటె భిన్నమై విజ్ఞానఘనమైయున్న స్వస్వరూపమును తెలియనేరకయుండును అని భావము.

అవ. ఉత్తరశ్లోకముల కవతారికను చేయుచున్నాఁడు.—

వాక్య. సోఽయమేవ మవిద్యాపటలావగుంఠిత దృష్టిస్సన్
కథముత్థాప్యత ఇత్యాహ. ౨౭

దం-అ. ఈపురుషుఁడు ఈప్రకారము అజ్ఞానదోషముచేత నాచ్ఛాదింపఁబడిన దృష్టికలవాఁడైయుండి యేప్రకారము లేవనెత్తఁబడునో చెప్పుచున్నాఁడు.

తా. అజ్ఞానముచేత దృఢముగా నాచ్ఛాదింపఁబడియుండిన సమ్యక్దర్శనము కలవాఁడుగదా ముముక్షువు? ఇట్టి ముముక్షువునకు అజ్ఞానమును నివర్తింపఁజేసి సమ్యక్దర్శనమును ఆవిర్భవింపఁజేయునట్టి సాధనములు శాస్త్రాచార్యోపదేశములేగదా? ఈశాస్త్రాచార్యోపదేశాదులు సత్యములా? లేక అసత్యములా? సత్యములైనచో నాత్మయొక్క అద్వితీయత్వము బాధింపఁబడును. ఆత్మభిన్నములై యున్నవన్నియు మిథ్యలైయుండినగదా ఆత్మ అద్వితీయమైయుండును. లేక, అసత్యములనినచో యథార్థజ్ఞానమును పుట్టింపనేరవు. కావున ముముక్షువు ఏలాగున అవిద్యానివృత్తిపూర్వకముగా సమ్యక్జ్ఞానమునొంది సంసారసాగరమును తరించు ననుశంకను పరిహరించెదమని భావము.

శ్లో. యథా స్వాపనిమిత్తేన స్వప్నదృక్ప్రతిబోధితః,
కరణం కర్మ కర్తారం స్వాప్నం నైవేక్షతే స్వతః. ౩౮
అనాత్మజ్ఞ స్తథైవాయం సమ్యక్ప్రత్యావబోధితః,
గురుశాస్త్రం తథా మూఢం స్వాత్మనోఽన్యం నపశ్యతి. ౩౯

టం-అ. స్వప్నమునుజూచువాఁడు స్వప్నదృష్టములైన చోరాదినిమిత్తములచేత మేలుకొలుపఁబడినవాఁడై స్వప్నమందు చూడఁబడినసాధనమును, క్రియను, కర్తను స్వయముగా (నెటువలె) చూడనే చూడఁడో, (౩౮) అటువలెనే ఆత్మజ్ఞానములేని ఈపురుషుఁడున్ను శ్రుతిచేత చక్కఁగా బోధింపఁబడినవాఁడై తనకంటె భిన్నమైనగురువును శాస్త్రమును, ఆలాగుననే అజ్ఞానినిన్ని చూడనేచూడఁడు. (౩౯)

తా. ఈలోకములో స్వప్నమునుజూచువాఁడు తనస్వప్నమందు తనయొక్క అజ్ఞానముచేత కల్పింపఁబడిన చోరవ్యాఘ్రాదులనుచూచి అందువల్ల పుట్టినభయముచేత మేలుకొనినవాఁడై స్వప్నదశయందు స్వాజ్ఞానకల్పితములై తనకంటె భిన్నములై యున్న చోరవ్యాఘ్రాదులను చూడఁడుగదా? అటువలెనే అనాద్యజ్ఞాననిద్రాపరవశుఁడైయున్న పురుషుఁడున్ను స్వాజ్ఞానకల్పితములైయున్న శాస్త్రాచార్యులవలనఁబుట్టినతత్త్వజ్ఞానముచేత తాను పరబ్రహ్మమేనని యెఱింగినవాఁడై అజ్ఞానదశయందు తనకంటె భిన్నములుగా కనుపడుచున్న శాస్త్రాచార్యులను చూడనేరఁడు. శ్రుత్యాచార్యాదులవిద్యాకల్పితములైనందున బ్రహ్మాద్వితీయత్వమునకు హానిలేదు. అజ్ఞానకల్పితములైన చోరవ్యాఘ్రాదులచేతకూడా ప్రబోధము కలుగుచున్నందున అజ్ఞానకల్పితశాస్త్రాచార్యోపదేశములచేతకూడా తత్త్వజ్ఞానము కలుగుటకు విరోధము కలుగదని భావము.

అవ. ఓయీ! మిథ్యాభూతశాస్త్రాచార్యోపదేశములచేత తత్త్వజ్ఞానోత్పత్తి కలుగునుగాక; అయినను ప్రపంచముకంటె భిన్నముగా బ్రహ్మ బోధింపఁబడునా? లేక, అభిన్నముగా బోధింపఁబడునా? భిన్నముగా బోధింపఁబడుననినచో నద్వైతమునకు విరుద్ధము. అభిన్నముగా బోధింపఁబడునన్నచో బ్రహ్మకు సప్రపంచత్వము సిద్ధించును. బ్రహ్మ నిష్ప్రపంచమనిగదా మీసిద్ధాంతము. అని పూర్వపక్షవాది యాక్షేపించుచున్నాఁడు.—

వాక్య. స కిం సకలసంసారప్రవివిక్తమాత్మానం వాక్యాత్ప్రతిపద్యత ఉత నేతీతి. ౨౭

టం-అ. ఆపురుషుఁడు వాక్యమువల్ల సకలమైనప్రపంచము సంసారముకంటె భిన్నవిలక్షణమైన యాత్మను తెలిసికొనునా? లేక, తెలిసికొనఁజాలఁడా?

తత్త్వమాదివాక్యమువల్ల తెలియఁబడే బ్రహ్మస్వరూపము సకలప్రపంచ అభిన్నమా? ఉభయపక్షములయందును దోషములుకలవు. కావున వాక్య స్వరూపప్రతిపత్తి కలుగనేరదని భావము.

సిద్ధాంతవాది ఈయాక్షేపమునకు పరిహారమును చెప్పుచున్నాఁడు.—

అత్ర బ్రూమః- కూటస్థావగతిమాత్రశేషత్వా
తిపత్తేః. ౨౯

దీనియందు చెప్పుచున్నాము. జ్ఞానము కూటస్థమైన ఆత్మస్వరూపము త్వాకారముమాత్రమే శేషముగా గలిగియున్నందున వాక్యమువల్ల బ్రహ్మ త్తి కలుగునని శేషము.

కత్త్వమస్యాది వాక్యమువల్ల బ్రహ్మస్వరూపజ్ఞానము తెలియఁజేయఁ నము కేవల నిర్విశేషమైన బ్రహ్మస్వరూపమును మాత్రము అవలంబించి ఆబ్రహ్మస్వరూపము ప్రపంచభిన్నమనే అంశమునుగాని, ప్రపంచాభిన్న గాని అవలంబించియుండదు గనుక పూర్వోక్తదోషములు ప్రసక్తించ

ఈయర్థమునే దృష్టాంతసహితముగా చెప్పుచున్నాఁడు.—

తే ఆహ. ౩౦

అందువల్ల చెప్పుచున్నాఁడు.

వసాననిష్టః స్యాద్దండసర్పో యథా తథా,
వగతినిష్ఠం స్యాద్వాక్యాజ్జగదసంశయమ్. ౩౧

దండమునందు కల్పింపఁబడినసర్పము యెటువలె దండరూపముగా పర్య ధిగా నుండునో అటువలెనే ప్రపంచమున్ను వాక్యమువల్ల నిస్సంశయ త్రమే అవధిగా కలదై యుండును.

దమందు కల్పింపఁబడినసర్పము అజ్ఞానదశయందు ప్రకాశించుచున్నను ండమాత్రముగా ప్రకాశించును. అట్టికాలమందు ఆదండము కల్పిత మనిగాని, అభిన్నమనిగాని యుల్లేఖింపఁబడదు. అటులే ఈదృశ్య ద్రియవిషయాదిప్రపంచము పరమాత్మయందు కల్పింపఁబడి అజ్ఞానదశ చుచున్నను జ్ఞానదశయందు నిత్యచిన్మాత్రమైన పరమాత్మమాత్రమే చ్చట ప్రపంచము భిన్నముగగాని, అభిన్నముగగాని ఉల్లేఖింపఁబడ

అవ. చెప్పినయర్థమునందు కారణమును ప్రశ్నచేయుచున్నాఁడు.—

వాక్య. కుత ఏతత్? 3

దం-అ. ఇది ఎందువలన?

తా. 'తత్త్వమస్యా'ది వాక్యజన్యమైనజ్ఞానము నిత్యచైతన్యబ్రహ్మస్వరూపమా మునందు నిష్ఠగలిగియుండునుగాని ప్రపంచభావాభావములయందు నిష్ఠకలిగియుం దనుట కేమినిమిత్తమని భావము.

అవ. ఉత్తరమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. యస్మాత్. 3

దం-అ. ఎందువల్లనంటే.

శ్లో. పశ్యన్నితి యదా హాఁచైచః ప్రత్యక్త్వ మజ మవ్యయమ్,
అపూర్వా నపరానంతం త్వమా తదుపలక్ష్యతే. 3

దం-అ. 'పశ్యన్' అనుశ్రుతి ప్రత్యగ్రూపమై, జన్మవిహీనమై, వినాశరహితమై పూర్వాపరపరిచ్ఛిన్నరూపమైన యేయాత్మస్వరూపమును పెద్దగా బోధించెనో ఆయాత్మ స్వరూపమే 'త్వం' శబ్దముచేత లక్షింపఁబడుచున్నది.

తా. "యద్వైతం నపశ్యతి పశ్యన్వై తన్నపశ్యతి న హి ద్రష్టుర్దృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం పశ్యేత్" ఇత్యాదిశ్రుతులు సుషుప్తియందు ఆత్మస్వరూపము జన్మాదిభావవికారములు లేనిదనిన్ని, సర్వాంతరమనిన్ని, నిత్యజ్ఞానస్వరూపమనిన్ని, అఖండైకరసమనిన్ని ప్రతిపాదించుచున్నవి. ఈయాత్మస్వరూపమునే 'త్వం'పదము తాత్పర్యముతో బోధించుచున్నది. కాన ఆత్మస్వరూపముకంటె భిన్నమైనద్వైతప్రపంచము అవిద్యాకల్పితమైనందున ఆత్మస్వరూపజ్ఞానముచేత నశించునప్పుడు, ఆత్మమాత్రావశిష్టమై నశించును. గనుక తత్త్వజ్ఞానము ఆత్మమాత్రావలంబమైయుండును అని భావము.

అవ. సకలద్వైతప్రపంచశూన్యమైన ఆత్మవస్తువు సుషుప్తిదశయందు అప్రయత్నముగానే ప్రకాశించుచుండఁగా 'తత్త్వమస్యా'దివాక్యజన్యజ్ఞానముతోటి ప్రయోజనమేమి? ఆట్టిజ్ఞానములేకనే ఆత్మస్వరూపము సిద్ధించుచున్నదిగదా? యని శంకించుకొని పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. తత్త్వమస్యాది వాక్యోత్థ విజ్ఞానే నైవ బాధ్యతే. 33

దం-అ. 'తత్త్వమస్యా'దివాక్యమువల్ల పుట్టినవిజ్ఞానముచేత బాధింపఁబడును.

తా. అజ్ఞానము జ్ఞానముచేతనే నివర్తింపఁజేయఁబడునుగాని స్వయముగా నివ

ర్తింపదు. కావున ద్వైతప్రపంచకల్పనాకారణమైన అవిద్య నివర్తించుటకు 'తత్త్వమస్యా'దివాక్యజన్యజ్ఞానము అపేక్షితమైయున్నదని భావము.

అవ. ఓయీ! అజ్ఞాననివృత్తి 'తత్త్వమస్యా'దివాక్యజన్యవిజ్ఞానముచేతనే కలిగెనెడల, సుషుప్తిదశయందు నిర్విశేషమైన ఆత్మవస్తువు సిద్ధించునని 'నతు తద్వితీయమస్తి' యనుశ్రుతి యేలాగున చెప్పుచున్నదని శంకింపఁగా పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. యస్మాత్. ౩౮

దం-అ. ఎందువల్లననఁగా.

శ్లో. అస్మాద్యదపరం రూపం నాస్తీత్యేవ నిరూప్యతే,
అన్యథా గ్రహణాభావా ద్బీజం తత్స్వప్నబోధయోః. ౮౦

దం-అ. సుషుప్తిదశయందు ద్వైతవస్తుగ్రహణము లేనందువల్ల ఈయాత్మవస్తువుకంటె మఱియొకవస్తువు ఏదికలదో అది లేదని శ్రుతిచేత నిరూపింపఁబడుచున్నది. ద్వైతప్రపంచమును తెలియకపోవుటయనే ఆయజ్ఞానము స్వప్నజాగ్రద్దశలకు కారణమై యున్నది.

తా. సుషుప్తియందు ఘటపటాదివస్తురూపమైన ద్వైతప్రపంచము గ్రహింపఁబడక యున్నందున ఆత్మస్వరూపముకంటె భిన్నమైన వస్తుజాతములేదని 'న తు తద్వితీయమస్తి' యనేశ్రుతి ప్రతిపాదించుచున్నదిగాని ద్వైతవస్తుప్రతీతికి కారణమైన అజ్ఞానముకూడా లేదని ప్రతిపాదించినదికాదు. సుషుప్తిదశయం దజ్ఞానముకూడా లేదని చెప్పునెడల మరల స్వప్నము జాగ్రత లేకపోవలసియుండును గనుక, స్వప్నజాగ్రతలకును వాటియందు కనుపడుద్వైతప్రపంచమునకును కారణమైన అజ్ఞానము సుషుప్తిదశయందున్నదని యంగీకరించవలయును. ఆయజ్ఞాననివర్తికొఱకు 'తత్త్వమస్యా'దివాక్యజన్యజ్ఞానము అపేక్షితమైయున్నదనిభావము.

వాక్య. అస్యార్థస్య ద్రఢిమ్న ఉదాహరణమ్. ౩౯

దం-అ. ఈయర్థముయొక్క దార్ఢ్యముకొఱకు ఉదాహరణము చెప్పఁబడును.

తా. వాక్యశ్రవణము కలిగినగాని అజ్ఞానము నివర్తింపదు. గనుక సుషుప్తిదశయందు అజ్ఞాననివృత్తి కలుగదని మేము చెప్పినవిషయమును శ్రీగౌడపాదాచార్యులవారున్ను ప్రతిపాదించియున్నారు. వారియొక్కకోరికను ఉదహరించెదమని భావము.

శ్లో. "కార్యకారణబద్ధౌ ద్వౌ విష్యేతే విశ్వతైజసౌ,
ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌ తౌ తుర్యే న సిధ్యతః. ౮౧

దం-అ. విశ్వుఁడున్ను తైజసుఁడున్ను కార్యాజ్ఞానకారణాజ్ఞానములచేత బద్ధులై యున్నారని ఇచ్ఛయింపఁబడుచున్నారు. ప్రాజ్ఞుఁడు కారణాజ్ఞానముచేతనే బద్ధుఁడైయున్నాఁడు. తురీయునియం దీరెండును సిద్ధించవు.

తా. విశ్వుఁడనఁగా జాగ్రదవస్థలోనుండు జీవుఁడు. తైజసుఁడనఁగా స్వప్నావస్థనున్న జీవుఁడు. వీరిద్దఱున్ను అనేకవిధభేదప్రపంచమును కల్పించి ప్రకాశింపఁజేయుచున్న విక్షేపాజ్ఞానముచేతను, చిదాత్మస్వరూపము నావరించి ప్రకాశింపకుండాచేయుచున్న ఆవరణాజ్ఞానముచేతను, ఈరెంటిచేతను ఆవరింపఁబడియున్నారు. ప్రాజ్ఞుఁడనఁగా సుషుప్తిదశయందుండు జీవుఁడు. ఇతఁడు ఆవరణాజ్ఞానముచేతనే యావరింపఁబడియున్నాఁడు. కావుననే సుషుప్తిదశయందు ఆత్మస్వరూపము యథార్థముగా ప్రకాశింపక పోవుటమాత్రమేగాని, నానావిధప్రపంచము ప్రకాశించుటలేదు. తురీయుఁడనఁగా 'తత్త్వమస్యా'దివేదాంతవాక్యశ్రవణముచేత స్వస్వరూపయాథార్థ్యజ్ఞానము నెఱిఁగిన జీవుఁడు. అతనికి విక్షేపాజ్ఞానము ఆవరణాజ్ఞానము ఈరెండున్ను సంభవించవని భావము.

అవ. తురీయస్వరూపము సిద్ధించేప్రకారమును చెప్పుచున్నారు.—

శ్లో. "అన్యథా గృహ్ణతః స్వప్నో నిద్రా తత్త్వమజానతః,
విపర్యాసే తయోః క్షీణే తురీయం పదమశ్నుతే." ౪-౩

దం-అ. విపరీతముగా గ్రహించుచుండఁగా స్వప్నము సంభవించును. స్వరూపము నెఱుఁగకయుండఁగా సుషుప్తి సంభవించును. ఈరెంటియొక్కవిపర్యయము క్షయము నొందుచుండఁగా తురీయస్వరూపము పొందఁబడును.

తా. స్వప్నజాగ్రద్దశలయందు స్వరూపము నెఱుఁగకపోవడమేగాక, విపరీతార్థములను గ్రహించుచుండును. అట్టిదశయందే స్వప్నజాగరణములు కలుగుచుండును. సుషుప్తియందు విపరీతార్థమును గ్రహించక స్వరూపముమాత్రము గ్రహింపఁబడకనుండును. ఇట్టిసమయమందు సుషుప్తికలిగియుండును. విపరీతార్థగ్రహణస్వరూపాగ్రహణములనే అజ్ఞానములురెండున్ను తత్త్వజ్ఞానములురెండున్ను తత్త్వజ్ఞానముచే నశించినచో తురీయమైన నిష్కళంకాత్మస్వరూపము ప్రకాశించునని భావము.

వాక్య. తథా భగవత్పాదీయ ముదాహరణమ్. ౩౬

దం-అ. ఆప్రకారమే శ్రీశంకరభగవత్పాదులవారి సంబంధమైన ఉదాహరణము చెప్పఁబడుచున్నది.

తా. శ్రీగౌడపాదాచార్యులుమాత్రమేకాదు సుషుప్తియందు బీజాజ్ఞానముం

డునని చెప్పినది. వారియభిప్రాయము ననుసరించియున్న శ్రీశంకరాచార్యులవారున్ను చెప్పియున్నారు. వారివచనము నుదాహరించి చూపెదమని భావము.

శ్లో. సుషుప్తాఖ్యం తమోఽజ్ఞానం బీజం స్వప్నప్రబోధయోః,
స్వాత్మబోధప్రదగ్ధం స్యా ద్బీజం దగ్ధం యథాభవమ్. ౪౩

దం-అ. స్వప్నజాగరణములకు కారణమై సుషుప్తమని, తమస్సని, అజ్ఞానమని వ్యవహరింపఁబడుచున్న మూలావిద్యస్వరూపజ్ఞానముచేత దహింపఁబడినదై, దహింపఁబడినవిత్తనమువలె మరల సంసారోత్పాదనము లేనిది యగును.

తా. సుషుప్తమని, అజ్ఞానమని, తమస్సని చెప్పఁబడుచున్న అజ్ఞానము స్వప్నజాగరణములను కలుగఁజేసి వాటియందు నానావిధద్వైతపదార్థములను చూపించుచు, నానావిధసుఖదుఃఖానుభవరూపమయిన సంసారమునకు కారణమైయుండును. ఇట్టియజ్ఞానము ఆత్మతత్త్వజ్ఞానముచేత నశించినచో అగ్నిదగ్ధమైన చణకాదిబీజము మరల అంకురమును పుట్టించలేనట్టు సంసారమును మరల ప్రవర్తింపఁజేయనేరదు. అనిభావము. ఈశ్లోకములోని సుషుప్తిదశయందు అజ్ఞానము కలదనిన్ని, అది స్వప్నజాగరణములకు కారణమనిన్ని, ఆత్మతత్త్వజ్ఞానముచేత నశింపఁజేయఁబడుననిన్ని చెప్పఁబడియున్నది.

శ్లో. ఏవం గౌడై ర్ద్రావిడైర్నః పూజ్యై రర్థః ప్రభాషితః,
అజ్ఞానమాత్రోపాధిః సన్నహమాదిదృగీశ్వరః. ౪౪

దం-అ. ఈప్రకారము మాకు పూజ్యులైన గౌడపాదులవారిచేతను, ద్రవిడదేశోత్పన్నులగు శ్రీశంకరభగవత్పాదులచేతను ఈయర్థము విస్తరముగా భాషింపఁబడినది. ఆయర్థమెద్దియనఁగా పరమాత్మ అజ్ఞానముమాత్రముపాధిగాఁ గలవాఁడై, అహంకారాది దృశ్యప్రపంచమునకు సాక్షియై జీవుఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడనుట.

తా. సచ్చిదానందాద్వితీయుఁడైన పరమేశ్వరుఁడే అనాద్యజ్ఞానముచేత జీవత్వమునొంది అహంకారాదిదృశ్యప్రపంచమునకు సాక్షియైయున్నాఁడని మేము చెప్పిన యర్థమును మాకు గురువులైన శ్రీగౌడపాదస్వామివారున్ను, శ్రీశంకరులవారున్ను ఏకకంఠ్యముగా మాండూక్యకారికలయందును, ఉపదేశసాహస్రియందును ప్రతిపాదించియున్నారని భావము.

అవ. ఓయీ! 'తమ ఆసీత్' 'ఆసీ దిదం తమోభూతం' అని శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధమైయుండి జగత్కారణమైన అజ్ఞానము పరమేశ్వరునియొక్క శక్తిగానున్నందునపరమేశ్వరునికంటె యభిన్నముగదా యున్నది. ఇట్టియజ్ఞానము, జ్ఞానముచేత నివర్తించునని ఏలాగున చెప్పవచ్చుననే శంకను పరిహరించుచున్నాఁడు.—

వాక్య. తత్రాన్యథాగ్రహణవత్ అన్యథా గ్రహణబీజమగ్ర హణమపి అనాత్మధర్మ ఏవేత్యాహ. 32

దం-అ. అందులో విపరీతజ్ఞానమువలె విపరీతజ్ఞానమునకు కారణమైయు అజ్ఞానమున్ను అనాత్మస్వభావమే నని చెప్పుచున్నాఁడు.

తా. స్వప్నజాగరణములయందు నానావిధభేదములను చూపించుచున్న వి జ్ఞానమున్ను నానావిధభేదములున్ను ఎట్లు ఆత్మస్వరూపముకంటె బహిర్భూతమ యున్నవో, అటులే విపరీతజ్ఞానమునకు కారణమైయున్న మూలాజ్ఞానమున్ను ఆత్మ రూపముకంటె బహిర్భూతమై యున్నదని ఉత్తరశ్లోకములో చెప్పఁబడునని భావ

శ్లో. ఇదం జ్ఞానమహం జ్ఞాతా జ్ఞేయమేతదితి త్రయమ్,
యోఽవికారో విజానాతి పరాగేవాస్య తత్తమః. 

దం-అ. 'ఇది' యని చెప్పఁబడునది జ్ఞానము; 'నేను' అని చెప్పఁబడునది జ్ఞా 'ఇది' యని చెప్పఁబడునది జ్ఞేయము. ఈమూఁటిని నిర్వికారుఁడైన ఎవ్వఁడు (ఏచిదా తెలిసికొనుచున్నాఁడో, ఈచిదాత్మకు ఆ అజ్ఞానము బహిర్భూతమైనదే యగును.

తా. జ్ఞాతృజ్ఞానజ్ఞేయములనే త్రిపుటిని నిర్వికారుఁడైన ఏచిదాత్మ తెలిసికొను న్నాఁడో, అట్టిచిదాత్మకు జగద్బీజమైన అజ్ఞానము బహిర్భూతమైయున్నదిగాని అ ర్భూతమై యున్నదిగాదు. కావుననే బహిర్భూతములగు జ్ఞాతృజ్ఞేయాదులు, ఆత్మజ్ఞా ముచే నివర్తించునటుల ఈయజ్ఞానమున్ను ఆత్మజ్ఞానముచేత నివర్తించును. అజ్ఞాన దృశ్యమై జడమైయున్నందున ఆత్మకంటె బహిర్భూతమని యెఱుంగునది. ఇట్టి య నము, పరమేశ్వరాధీనసత్తాప్రకాశములు కలదైనందున పరమేశ్వరశక్తియని శ్రుతిస్మృ లయందు వ్యవహరింపఁబడుచున్నదిగాని, పరమేశ్వరునివలె అది నశ్వరమనే యభి యముతో వ్యవహరింపఁబడినదికాదని భావము.

అవ. ఓయీ! సుఖదుఃఖాదిధర్మసంబంధమువలె అజ్ఞానసంబంధమున్ను ఆత్మయ దేకలదని చెప్పఁదగదా? యని శంకించగా, ఆత్మ నిత్యనిర్వికారమైనందున సుఖదుఃఖా సంబంధము కలదియు కానేరదు; అటులే అజ్ఞానసంబంధమును కలదికాదని పరిహా మును దృష్టాంతపూర్వకముగా జెప్పుచున్నాఁడు —

వాక్య. యత ఏతదేవమత స్తస్యైవ బీజాత్మన స్తమసశ్చిత్తధ ర్మవిశిష్టస్య స్వకార్య ద్వితీయాభిసంబంధో న త్వవివేక కారిణ ఆత్మన ఇత్యాహ దృష్టాంతేన. 33

దం-అ. ఇది ఎందువలన ఇట్టిదో అందువలన కారణరూపమై చిత్తధర్మముతో

గూడుకొనియున్న అజ్ఞానమునకు తనచేఁ జేయఁబడిన రెండవదానితో సంబంధమే కాని వికారశూన్యమైన ఆత్మకు సంబంధము లేదని దృష్టాంతముచేత చెప్పుచున్నాఁడు.

తా. ఆత్మ తాను నిత్యనిర్వికారుఁడై యుండియే జ్ఞాతృజ్ఞేయాదివస్తువులను ప్రకాశింపఁజేయుచున్నందున, సుఖదుఃఖాదివికారముల కాశ్రయమైనవాఁడు కాఁడు. కావుననే సుఖదుఃఖాదిద్వైతవస్తువులకు ఆశ్రయము, జాగ్రదాదిప్రపంచమునకు కారణమై అంతఃకరణరూపముగా పరిణమించి యున్న అజ్ఞానమేగాని నిత్యనిర్వికారమైనచిదాత్మ కాఁడు. చిదాత్మ అంతఃకరణోపాధికుఁడై యున్నందున, అంతఃకరణగత సుఖదుఃఖాది ధర్మములు చిదాత్మయం దున్నట్లు తోఁచఁబడి, చిదాత్మ వాటికి ఆశ్రయముగా నున్నట్లూహింపఁబడుచున్నాఁడుగాని, వాస్తవముగా సుఖదుఃఖాదిధర్మముల కాశ్రయమైనవాఁడు గాఁడు. ఈయర్థము దృష్టాంతమును చెప్పి విశదముగా నుత్తరశ్లోకములో చెప్పఁబడునని భావము.

శ్లో. రూపప్రకాశయో ర్యద్వత్ సంగతి ర్వక్రియావతః,
సుఖదుఃఖాదిసంబంధః చిత్తస్యైవం వికారిణః. ౪౬

దం-అ. రూపప్రకాశములయొక్క సంబంధము వికారముగలవస్తువునకెటులో అటువలెనే సుఖదుఃఖాదులయొక్క సంబంధమును వికారముగల చిత్తమునకు (అని తెలియవలయును).

తా. రూపము ప్రకాశము ఈరెంటియొక్కసంబంధము ఉత్పత్త్యాదివికారములుగల వహ్నికి కలిగియున్నదిగదా? అటులే సుఖదుఃఖాదిధర్మములయొక్క సంబంధమును పరిణామాదివికారములుగల చిత్తమునకే కలిగియుండునుగాని, నిర్వికారమై ఏకరూపమైయున్న చిదాత్మకు కలిగియుండదు.సంబంధమనునది వికారివస్తువుయందే యుండును. రూపప్రకాశములయొక్క సంబంధము వికారిద్రవ్యమైన వహ్నియందేకదా కనుపడుచున్నది. అటులే సుఖదుఃఖాదిసంబంధమును వికారివస్తువైనచిత్తమందే యుండఁదగినది కాని, నిర్వికారమైన ఆత్మవస్తువునం దుండఁదగదని భావము.

అవ. ఉత్తరశ్లోకమున కవతారికను చేయుచున్నాఁడు.—

వాక్య. తదేతదన్వయవ్యతిరేకాభ్యాం దర్శయిష్యన్నాహ. ౩౯

దం-అ. ఆ యీయర్థమును అన్వయవ్యతిరేకములచే జూపుచు జెప్పుచున్నాఁడు.

తా. చిత్తముకలిగియుండినచో సుఖదుఃఖాదిసంబంధముండును. లేనిచో సుఖదుఃఖాదిసంబంధము లేకపోవునని ..యన్వయవ్యతిరేకములనుజూపి సుఖదుఃఖాదులు చిత్తధర్మములేకాని ఆత్మధర్మములు గావనిచెప్పినయర్థమును స్థిరపఱచుటకొఱకు ఉత్తరశ్లోకము ప్రవర్తించుచున్నదని భావము.

శ్లో॥ సంప్రసాదేఽవికారిత్వాదస్తం యాతే వికారిణి,
పశ్యతో నాత్మనః కించిద్ద్వితీయం స్పృశతేఽణ్వపి. ౭

టీం-అ. సుషుప్తికాలమందు వికారయుక్తమైనచిత్తము లయించియుండగా ఆత్మ వికారరహితుఁడై యుండుటవలన చూచుచున్నవాఁడైనను రెండవవస్తువు కొంచెమైనను స్పృశించనేరదు.

తా. సర్వవికారముల కాధారమగుచిత్తము సుషుప్తికాలమందు లయించిపోవుగాన, నట్టికాలమందు నిత్యజ్ఞానస్వరూపుఁడైన ఆత్మ, ప్రకాశించుచుండియు కర్తృత్వాదివికారవస్తువులతో కొంచెమైనను సంబంధములేనివాఁడై యుండునుగదా? యభావము.

అవ. పూర్వశ్లోకములో సుషుప్తికాలమందని చెప్పినందున జాగ్రత్స్వప్నకాలములయందు ఆత్మకు రెండవవస్తువుతోటి సంబంధముండునని తోఁచఁబడునుగాని ఆ రెండుదశలయందుకూడ వాస్తవముగా రెండవవస్తువుతోటి సంబంధము ఆత్మకు లేదని చెప్పించుచున్నారు.—

వాక్య. సోఽయం నిత్యస్వజ్ఞానమూర్తిరాత్మా.

టీం-అ. ఆ యీనిర్వికారజ్ఞానరూపుఁడైన ఆత్మ. (అని ముందుశ్లోకములో నన్వయము.)

శ్లో॥ యథా ప్రాజ్ఞే తథైవాయం స్వప్నజాగరితాంతయోః,
పశ్యన్నప్యవికారిత్వాద్ద్వితీయం నైవ పశ్యతి. ౭౮

టీం-అ. సుషుప్తికాలమునం దేప్రకారమో ఆప్రకారమే, స్వప్నకాలజాగ్రత్కాలములయందున్ను వికారరహితుఁడైనందున చూచుచున్నవాఁడైనను రెండవదానిని చూడఁడు.

తా. నిత్యనిర్వికారజ్ఞానస్వరూపుఁడైన ఆత్మ, సుషుప్తికాలమునం దేప్రకారము నిర్వికారుఁడైయుండెనో, ఆప్రకారమే జాగ్రత్స్వప్నములయందును నిర్వికారుఁడై యుండును. కాన జ్ఞానస్వరూపముతో ప్రకాశించుచుండియు రెండవవస్తువుతో సంబంధము వాస్తవముగా కలిగియుండఁడు. అయితే సర్వవికారముల కాశ్రయమైనచిత్తము జాగ్రత్స్వప్నములయందు ప్రకాశించుచుండును. గనుక ఆచిత్తముయొక్క వికారములు ఆత్మగతములైయున్నట్లు తోఁచును. వికారములు వాస్తవముగా ఆత్మగతములే యైనచో సుషుప్తిదశయందు సైతము తోఁచవలసియుండును. చిత్తము నశించియున్న సుషుప్తిదశయందు ఆత్మ నిర్వికారమైయున్నందునను, చిత్తము ప్రకాశించుచున్న స్వప్నజాగ్ర

త్తలయందు ఆత్మ వికారవంతుఁడై యున్నట్లు కాన్పించుచున్నందునను, సర్వకాలముల యందు ఆత్మ నిర్వికారుఁడే యని, చిత్తమే వికారముల కాధారమని నిశ్చయింపఁదగి యున్నదని భావము.

అవ. జాగ్రత్స్వప్నసుషుప్తి యనఁబడు నీమూఁటిదశలయందు నీయాత్మ నిర్వికారుఁడే నని తెలిసినవానికి ఏమిఫలముకలుగునో ఆఫలమును చూపుచున్నాఁడు.—

శ్లో. ఏవం జ్ఞానవతో నాస్తి మమాహ మ్మతి సంశ్రయమ్,
భాస్వత్ప్రదీపహస్తస్య హ్యంధకార ఇవాగ్రతః. ౪౮

దం-అ. ఇట్టిజ్ఞానముకలవానికి, అంతఃకరణము నాశ్రయించియున్న మమకారము, అహంకారమున్ను ప్రకాశించుదీపము చేతులో కలవానికి చీఁకటి ఎదుట నుండనటుల నుండనేరదు.

తా. మంచిప్రకాశముగలదీపమును చేతులో నుంచుకొనినవానికి చీఁకటి ఏప్రకారము సంభవింపదో, ఆప్రకారమే పూర్వోక్తమైన ఆత్మ యాథార్థ్యజ్ఞానముకలవాని। అహంకారమమకారములు సంభవింపవని భావము.

వాక్య. తత్ర దృష్టాంతః. ౪౯

దం-అ. దానియందు దృష్టాంతము చెప్పఁబడును.

తా. ఆత్మయాథార్థ్యజ్ఞానము కలిగినపుడు ఆత్మభిన్నములైన యహంకారాదులు, లేకపోవుననేయర్థమునందు దృష్టాంత ముత్తరశ్లోకములో చెప్పఁబడుననిభావము.

శ్లో. అప్రబోధా ద్యథా సిద్ధి ర్ద్వైతాదన్యస్య వస్తునః,
బోధాదేవ మసిద్ధత్వం బుద్ధ్యాదేః ప్రత్యగాత్మనః. ౫౦

దం-అ. అజ్ఞానమువల్ల ద్వైతప్రపంచముకంటె భిన్నమైనవస్తువుయొక్క అప్రకాశము ఎటువలెనో, ఆప్రకారమే జ్ఞానమువలన ప్రత్యగాత్మకంటె భిన్నమైనఅంతఃకరణాదివస్తువుయొక్క అప్రకాశము కలుగుచున్నది.

తా. జ్ఞానము కలుగకమునుపు అంతఃకరణాదులకంటె భిన్నమైయున్న ఆత్మస్వరూపము ఏలాగున ప్రకాశించదో, ఆప్రకారమే జ్ఞానము కలిగినపిదప ఆత్మస్వరూపముకంటె భిన్నమైన అంతఃకరణాదిపదార్థము ప్రకాశించదు. అని భావము.

అవ. తత్త్వవేత్తయొక్క అనుభవము ఏలాగుననుండునో చూపుచున్నాఁడు.—

వాక్య. స ఏషవిద్వాన్ హానోపాదానశూన్యమాత్మానమా
త్మని పశ్యన్. ౪౨

దం-అ. ఆ యాత్మతత్త్వవేత్తయగుపురుషుఁడు తనచిత్తమందు ఆత్మస్వరూపమును చూచుచున్నవాఁడై (అని ముందుశ్లోకముతో పఠింపవలయును.)

శ్లో. సర్వమేవానుజానాతి సర్వమేవ నిషేధతి,
భేదాత్మలాభోఽనుజ్ఞాస్యా న్నిషేధో తత్స్వభావతః. ౫౧

దం-అ. అన్నిటిని అంగీకరించును; అన్నిటిని నిషేధించును. అనఁగా ద్వైతప్రపంచ స్వరూపముయొక్కదర్శనము అంగీకార మనంబడును. ద్వైతసంబంధశూన్యమైన ఆత్మయొక్క స్వభావమువలన నిషేధమని చెప్పఁబడును.

తా. పూర్వోక్తమైన ఆత్మయాథార్థ్యజ్ఞానముగలపురుషుఁడు తనహృదయమందు స్వచ్ఛమైన ప్రత్యగాత్మస్వరూపమును దర్శించుచుండి సకలమైన అంతఃకరణాది దేహాంతప్రపంచము కలదని లేదనిన్ని తలంచును. అది ఎటులనఁగా వ్యవహారస్వభావముచే సకలమైనప్రపంచము కలదనియు, ఆత్మస్వభావమును చూచితే ప్రపంచము ఏమిన్ని లేదనిన్ని భావించునని భావము.

అవ. ఇపుడు ప్రకరణమును ముగింపుచున్నాఁడు.—

వాక్య. సర్వస్యోక్తత్వాదుపసంహారః. ౮౩

దం-అ. సర్వమైనయర్థము చెప్పఁబడినందున ఉపసంహారము (ముగింపు) చేయఁబడుచున్నది.

శ్లో. పరమార్థాత్మనిష్ఠం యత్సర్వవేదాంతనిశ్చితమ్,
తమోఽపనుద్ధియాం జ్ఞానం తదేతత్కథితం మయా. ౫౨

దం-అ. సకలమైనఉపనిషత్తులయందు నిశ్చయింపఁబడి అంతఃకరణములయొక్క అజ్ఞానమును నివారించునదియును, పరమార్థరూపమైన ఆత్మయందు నిష్ఠగలదియును అయినజ్ఞాన మెద్దికలదో అట్టిజ్ఞానము నాచేత చెప్పఁబడినది.

తా. ఇంతవఱకు గడచిన గ్రంథములో సర్వవేదాంతములయందు నిశ్చయముగా ప్రతిపాదింపఁబడియున్న ఆత్మయాథార్థ్యనిరూపకమైన తత్త్వజ్ఞానమును నేను ప్రతిపాదించియున్నాను. ఇంతకంటె విశేషముగా చెప్పవలసినదిలేదు. ఈజ్ఞానము సర్వదుఃఖమూలమైన అజ్ఞానమును నివారించి పరమానందసాంద్రమైనముక్తిని కలుగఁజేయునని భావము.

అవ. సాంఖ్యశాస్త్రసిద్ధాంతమందు ఆత్మస్వరూపము చిన్మాత్రమని, ఆనందరూపమని, నిర్లేపమని చెప్పఁబడియున్నను ఆయాత్మస్వరూపము అనేకముగా నుండునని చెప్పియున్నందున ఈయద్వైతసిద్ధాంతమందుగూడ ఆప్రకారమే యాత్మస్వరూ

పము అనేకముగా నుండునేమోయని కొందఱకు మందబుద్ధులకు భ్రాంతికలుగునని తలంచి మరల పూర్వోక్తార్థమును సంగ్రహించి చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఏతావదిహోక్తమ్. ౪౪

దం-అ. ఈగ్రంథమం దింతమాత్రపుఅర్థము చెప్పఁబడినది.

తా. పూర్వగ్రంథమునందు చెప్పఁబడినసారాంశమును చెప్పుచున్నామని భావము.

శ్లో. నేహాత్మవిన్మదన్యోఽస్తి నమత్తోఽజ్ఞోఽస్తి కశ్చన,
ఇత్యజాన న్విజానాతి యః సబ్రహ్మ విదుత్తమః. ౫౩

దం-అ. ఈలోకములో వేఱైనవాఁడు నాకంటె ఆత్మజ్ఞానమున కాశ్రయమైనవాఁడు లేఁడు. అజ్ఞానమున కాశ్రయమైనవాఁడున్ను నాకంటే మఱియొకఁడు లేఁడు. అని ఈలాగున తెలియనివాఁడైయుండి యెవఁడు తెలియునో వాఁడు బ్రహ్మవేత్తలలో నుత్తముఁడు.

తా. అంతఃకరణాదివస్తువులు స్వతః జడములైనందున జ్ఞానమునకుగాని అజ్ఞానమునకుగాని విషయములై యుండవు. జ్ఞానస్వరూపుఁడను, అద్వితీయుఁడను అయిన నేనే ఆరెంటికిని విషయమైయున్నాను. నాకంటె మఱియొకచిదాత్మ లేఁడని నిశ్చయించుకొని, ఆత్మస్వరూపము వృత్తిజ్ఞానముచే ప్రకాశించునది కాదనియు, స్వయముగా ప్రకాశించుననియు ఎఱింగియున్నవాఁడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడని చెప్పఁబడును. కాని సాంఖ్యులవలె అనేకచిదాత్మలు కలరని తెలిసినవాఁడు ముఖ్యబ్రహ్మవేత్తగాఁడని భావము.

అవ. ఈవిధముగా తత్త్వవిచారమును సమాప్తినొందించి తత్త్వజ్ఞానియొక్క చర్యను (నడవడిని) నిరూపింపఁదలంచి ముందుగా బ్రహ్మజ్ఞాని వర్ణాశ్రమధర్మముల ననుష్ఠింపవలసియుండునా? లేక మానవలసియుండునా? లేక యథేచ్ఛముగా సంచరింపవచ్చునా? యని ప్రశ్నను చేయుచున్నాఁడు.—

వాక్య. ఏవమాత్మానం జ్ఞాత్వా కిం ప్రవర్తితవ్యముత నివర్తితవ్యమాహోస్విన్ముక్తప్రగ్రహా తేతి. ౪౫

దం-ఈవిధముగా నాత్మస్వరూపమును తెలిసినపిదప ప్రవర్తించవలయునా? లేక, నివర్తించవలయునా? లేక, విడువఁబడిన నిర్బంధము కలిగియుండునా? అని ప్రశ్న చేయఁబడుచున్నది.

తా. స్పష్టము.

అవ. ఈప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఉచ్యతే. ౪౬

దం-అ. చెప్పఁబడుచున్నది.

శ్లో. జ్ఞేయాభిన్నమిదం యస్మాత్ జ్ఞేయవస్త్వనుసార్యతః,
నప్రవృత్తిం నివృత్తిం వా కటాక్షేణాపి వీక్షతే. ౫౪

దం-అ. తెలియఁదగినవస్తువుకంటె భిన్నముగానిజ్ఞానము, యేకారణమువలన తెలియఁదగినవస్తువునే యనుసరించియుండునో, ఆకారణమువలన బ్రహ్మజ్ఞానముకల వాఁడు ప్రవృత్తినిగాని నివృత్తినిగాని క్రీగంటిచూపుచేతఁగూడా చూడఁడు.

తా. వేదాంతజ్ఞానమువలనకలిగిన 'అహంబ్రహ్మాస్మి' యనేతత్త్వజ్ఞానము జ్ఞేయమైన అద్వితీయబ్రహ్మస్వరూపముకంటె భిన్నముగానిదై అద్వితీయబ్రహ్మస్వరూపముతోటి సర్వదా ఏకీభవించియుండును. కాన తత్త్వజ్ఞానముగల పురుషుఁడు సర్వకాలములయందును అద్వితీయపరమానందస్వప్రకాశబ్రహ్మస్వరూపమునే దర్శించుచుండునుగాని వర్ణాశ్రమధర్మానుష్ఠానమందు సన్న్యసించి వాటిని త్యజించుటయందుగాని అభినివేశముగలవాఁడై యుండఁడు. అని భావము.

అవ. వేదాంతమహావాక్యజన్యమైన తత్త్వజ్ఞానము జ్ఞేయబ్రహ్మకంటె భిన్నముగాదని యేలాగున చెప్పవచ్చునని ప్రశ్నను గనుపఱచి యుత్తరమునుచెప్ప నారంభించుచున్నాఁడు.—

వాక్య. కుతఏతత్ జ్ఞేయాభిన్నమితి. ౪౭

దం-అ. జ్ఞేయముకంటె అభిన్నమని చెప్పిన ఈయర్థము యేహేతువువల్లను.

వాక్య. యతః. ౪౮

దం-అ. ఎందువల్లనంటే చెప్పఁబడును.

తా. తత్త్వజ్ఞానము తెలియఁదగినబ్రహ్మకంటె అభిన్నమైయుండునని యేకారణమువల్ల చెప్పితినో అందుకు హేతువును చెప్పెదను వినుమని భావము.

శ్లో. ప్రాగాత్మబోధాద్బోధోఽయం బాహ్యవస్తూపసర్జనః,
ప్రధ్వస్తాఖిలసంసార ఆత్మైకాలంబనః శ్రుతేః. ౫౫

దం-అ. ఈజ్ఞానము ఆత్మసాక్షాత్కారము కలుగకముందు బాహ్యపదార్థముల యొక్క సంబంధముకలిగియుండును. నశించినయావత్సంసారముగలదశయందు ఆత్మస్వరూపమునే యవలంబించియుండునని శ్రుతివల్ల గనుపడుచున్నది.

తా. వేదాంతమహావాక్యశ్రవణముచే కలిగియున్న ఆత్మతత్త్వజ్ఞానము అఖండ పరమానందబ్రహ్మాత్మానుభవము కలిగేవఱకు గురువు, శాస్త్రము మొదలగుబాహ్య పదార్థముల నవలంబించియుండును. సకలమైనసంసారానర్థములను నివారించునట్టి యాత్మానుభవము కలిగినపిదప ఆయాత్మస్వరూపమునే యవలంబించి ఆత్మస్వరూపముకంటె భిన్నమని తలంచుటకు శక్యముగాకయుండును. ఈయర్థము "యత్ర చాన్యదివ స్యాత్తత్రాన్యోఽన్యత్పశ్యేద్యత్ర త్వస్యసర్వమాత్మైవా భూత్తత్కేన కం పశ్యేత్" అనే శ్రుతివలన తెలియఁబడుచున్నది. శ్రుత్యర్థము— ఎప్పుడు మఱియొకవస్తువు ఉన్నట్లు తెలియునో అప్పుడు మఱియొకఁడు మఱియొక వస్తువును జూచును.— అనఁగా జ్ఞానమని, జ్ఞేయమని, జ్ఞాతయని భిన్నమైనవ్యవహారము కలిగియుండును. ఎప్పుడు జ్ఞానజ్ఞేయాదివస్తువులన్నియు ఆత్మస్వరూపమేనని తెలియునో అప్పుడు ఎవఁడు దేనినిజూచును? అనఁగా జ్ఞానజ్ఞేయాది భేదము నివర్తించి ఆత్మమాత్రమే ప్రకాశించునని యుదాహృతశ్రుత్యర్థము.

అవ. ఓయీ! తత్త్వజ్ఞానికి అగ్నిహోత్రాదిప్రవృత్తిధర్మములు లేకపోయినను, అమానిత్వ అదంభిత్వాది నివృత్తిధర్మములు కలవుగదా? కావున నీతత్త్వజ్ఞాననివృత్తి ధర్మములను విధించుచున్నశాస్త్రమునకు బద్ధుఁడైయుండునని యాక్షేపమురాఁగా తత్త్వజ్ఞాని స్వభావముచేతనే అమానిత్వాదిధర్మములు కలవాఁడైయుండునుగాని, శాస్త్రము విధించినందున మనము అమానిత్వాదిగుణములుగలవారమై యుండవలయుననే యభిప్రాయముతో నవికలవాఁడైయుండఁడు. శాస్త్రవశ్యత్వమును సంపాదించునట్టి బ్రాహ్మణత్వాద్యభిమానమున్ను దానికి కారణమైన అజ్ఞానమున్ను తత్త్వజ్ఞానముచేత నశింపఁ బడియున్నది గదా యని ఉత్తరమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. ఏవ మవగతపరమార్థతత్త్వస్య న శేషశేషిభావ
స్తత్కారణస్యోత్సారితత్వా దిత్యాహ. ౪౯

దం-అ. ఈప్రకారము తెలియఁబడిన పరమార్థస్వరూపముకలవానికి శేషశేషిభావము లేదు. దానికి కారణమైనఅజ్ఞానము నశించియున్నందున అని చెప్పుచున్నాఁడు.

తా. శాస్త్రము నన్ను నియమించుచున్నది. నేను నియమింపఁబడుచున్నాను. అనే అభిప్రాయము తత్త్వజ్ఞానికి కలిగియుండదు. ఎందువలననఁగా, 'నేను బ్రాహ్మణుఁడను, నేను గృహస్థును' అని ఇట్టి యభిమానము శాస్త్రవశ్యతకు కారణము. ఈయభిమానమునకు అజ్ఞానము కారణము. ఇట్టి యజ్ఞానము తత్త్వజ్ఞానముచేత నశించిపోయినందున అభిమానమున్ను నశించిపోవును గనుక అభిమానప్రయుక్తమైన శేషశేషిభావమ్ము

(శాస్త్రవశ్యత) బ్రహ్మజ్ఞానికి ఉండనేరదు. అని యుక్తశ్లోకములో చెప్పఁబడినదని భావము.

శ్లో. వాస్తవేనైవ వృత్తేన నిరుణద్ధి యతోభవమ్,
నివృత్తిమపి మృద్నాతి సమ్యగ్ధీః ప్రవృత్తివత్. ౫౮

దం-అ. ఈహేతువువలన తత్త్వజ్ఞానము వస్తుస్వభావముచేతనే సంసారమును నివారించుచున్నదో ఆహేతువువలన ప్రవృత్తినివలె నివృత్తినిన్ని మర్దించుచున్నది.

తా. తత్త్వజ్ఞానము ప్రవృత్తి నివృత్తి శూన్యమైయున్న శుద్ధాత్మస్వరూపమును అనుసరించియున్న సర్వసంసారమును నివర్తింపఁజేయుచున్నది. కావున విధింపఁబడే అగ్నిహోత్రాదిప్రవృత్తిని యేలాగున నివారించుచున్నదో ఆలాగుననే విధిప్రాప్తమై అమానిత్వాదినివృత్తినిన్ని నివారించుచున్నది. తత్త్వజ్ఞాని పూర్వాభ్యాససంస్కారముచేతనే అమానిత్వాదినివృత్తిధర్మములుకలవాఁడై యుండును గాని విధిబద్ధుఁడై ఆధర్మముల ననువర్తించఁడని భావము.

అవ. ఓయీ! తత్త్వజ్ఞానము తాను జన్మించగానే సంసారమును నివర్తింపఁజేసేయెడల, తత్త్వజ్ఞానికి అమానిత్వాదినివృత్తి, ధర్మవిధాయకశాస్త్రవశ్యత అనావశ్యకమని చెప్పవచ్చును. ఆలాగున లేదుగదా? ఆతత్త్వజ్ఞానము అనాదికాలమునుండి ప్రవర్తించుచున్న అజ్ఞానమును, దానిచేత సంభవించుచున్న దుర్వాసనలను నివర్తింపఁజేయుటకై అభ్యాసమును అపేక్షించియుండును తత్త్వజ్ఞానము నభ్యసించువరకును అమానిత్వాదినివృత్తిధర్మములు అవశ్యాపేక్షితములై యుండును గనుక, తత్త్వజ్ఞాని నివృత్తిశాస్త్రవశ్యుఁడు కాఁడని చెప్పఁదగదని శంకను పరిహరించుచున్నాఁడు.—

శ్లో. సకృదాత్మప్రసూత్యైవ నిరుణద్ధ్యఖిలం భవమ్,
ధ్వాంతమాత్ర నిరాసేన న తతోఽన్యాప్యపేక్షతే. ౫౯

దం-అ. తత్త్వజ్ఞానము ఒకమారు తాను పుట్టుటచేతనే అజ్ఞానమును గూడ తును నిరసించుటచేత సకలమైనసంసారమును నివర్తింపఁజేయును. మిథ్యాజ్ఞానము అజ్ఞానమునకంటె వేరైనదికాదు.

తా. తత్త్వజ్ఞానము తాను పుట్టుచుండఁగానే అజ్ఞానమునునివర్తింపఁజేసి మూలవత్తుసంసారమును నివర్తింపఁజేయును. కాని అభ్యాసమును అపేక్షించదు. దుర్వాసనలు, మిథ్యాజ్ఞానము మొదలయినవి అజ్ఞానముకంటె భిన్నములు కావు. అజ్ఞానము నశించఁగానే నశించును గనుక తత్త్వజ్ఞానాభ్యాసము, తత్త్వజ్ఞానికి అనపేక్షితమగుచున్నందున, అభ్యాసమున కవశ్యాపేక్షితములయిన నివృత్తిధర్మములకొఱకు శాస్త్రవశ్యతకలదని చెప్పఁదగదని భావము.

అవ. ఓయీ! జ్ఞానము తాను పుట్టుచుండఁగనే సకలాజ్ఞాననివర్తకమని ఏలాగున చెప్పవచ్చును? లోకములో చక్షురాదీంద్రియములవల్ల కలిగిన ఘటాదిజ్ఞానములు తమకు గోచరించుచున్న ఘటాది అజ్ఞానమును మాత్రమే నివర్తింపఁజేయుచున్నవిగాని సకలాజ్ఞానముల నివర్తింపఁజేయుటలేదుగదా? యని శంకించుకొని ఉత్తరమును చెప్పుచున్నాఁడు.—

శ్లో. దేశకాలాది సంబంధా ద్దేశాదేర్మోహకార్యతః,
నానుత్పన్నమదగ్ధంవా జ్ఞాన మజ్ఞాన మస్త్యతః. ౫౮౭

దం-అ. దేశకాలము మొదలగువాటితోటి సంబంధములేనందునను, దేశము మొదలగునది అజ్ఞానముచేత నేర్పడినదైనందునను, ఉత్పత్తిగాని, జ్ఞానముగాని, నశించని అజ్ఞానముగాని లేదు.

తా. ఘటాదిపదార్థములు దేశకాలాదులచేత పరిచ్ఛిన్నములై జడములై యున్నందునఅట్టిఘటాదివిషయములైనజ్ఞానములు, దేశకాలాదులనపేక్షించి ఘటాదివస్తువిషయములయిన అజ్ఞానములనుమాత్రమే నివర్తింపఁజేయునుగాని, సర్వాజ్ఞానములను నివర్తింపఁజేయఁజాలవు. ఆత్మవస్తువు అజ్ఞానకల్పితములైన దేశకాలావస్థలచేత పరిచ్ఛిన్నములుగానిదై, అఖండమై, చిన్మాత్రమైయున్నందున తాదృశాత్మవిషయముగా జ్ఞానముపుట్టగనే సర్వాజ్ఞానము నశించునుగాని నశించని మఱియొకఅజ్ఞానము నిలచియుండదు. ఆయజ్ఞానమును నశింపఁజేయుటకై మఱియొకజ్ఞానము పుట్టవలసియుండదని భావము.

అవ. కావున తత్త్వజ్ఞానము పుట్టగానే సకలమైన అజ్ఞానము నివర్తించుచున్నందున తత్త్వజ్ఞాని నివృత్తిశాస్త్రమునకు వశ్యుఁడు కానేరఁడని చెప్పినవిషయము యుక్తమేయగునని నిగమించుచున్నాఁడు.—

శ్లో. సమ్యక్ జ్ఞానశిఖిప్లుష్ట మోహతత్కార్యరూపిణః,
సకృన్నివృత్తే ర్బాధ్యస్య కింకార్య మవశిష్యతే. ౫౮౮

దం-అ. తత్త్వజ్ఞానముచేత దహింపఁబడిన అజ్ఞానమున్ను, తత్కార్యములయిన దేహాదివాసనలున్ను గలవానికి బాధింపఁదగినసంసారము ఒకమారుగానే నివర్తింపనందున చేయవలసినకృత్య మేది మిగిలియుండును?

తా. ఆత్మయాథాత్మ్యజ్ఞానము గలవానికి అజ్ఞానమున్ను, అజ్ఞానకల్పితములయిన దేహేంద్రియరాగద్వేషాదివాసనలున్ను, జ్ఞాన మనే వహ్నిజ్వాలచేత నిశ్శేషముగా దహిం

పఁబడినందున చేయవలసిన కృత్యములు కొంచముగ నైనను మిగిలి యుండవు. యావత్కార్యములు జ్ఞానము పుట్టకముందే సమాప్తి నొందును గనుక తత్త్వజ్ఞాని విధిశాస్త్రమునకుగాని నిషేధశాస్త్రమునకుగాని బద్ధుఁడు కాఁడని భావము.

అవ. ఈప్రకారము సద్యోముక్తిపక్షము నంగీకరించి (సద్యోముక్తి యనఁగా తత్త్వజ్ఞానము కలిగిన కాలమందే మోక్షము ప్రాప్తించుట) తత్త్వజ్ఞాని, నివృత్తిశాస్త్రబద్ధుఁడు గాఁడని పరిహారము చెప్పఁబడినది. ఇఁకను జీవన్ముక్తిపక్షము నంగీకరించి పరిహారమును చెప్ప నారంభించుచున్నాఁడు.—

వాక్య. వాస్తవే నైవ వృత్తే నావిద్యాయాః ప్రధ్వస్తత్వా
న్న కించిదవశిష్యత ఇత్యుక్తః పరిహారః అథాపర
స్సాంప్రదాయికః. ౫౦

దం-అ. ఆత్మజ్ఞానముయొక్క స్వభావముచేతనే అజ్ఞానము నశించుటవలన కొంచెమైన కార్యమున్ను మిగిలియుండ దని పరిహారము చెప్పఁబడినది. పిదప సంప్రదాయసిద్ధమైన పరిహారమును చెప్పఁబడును.

తా. తత్త్వజ్ఞానము పుట్టినమాత్రముననే, సూర్యుఁ డుదయము కాఁగానే యంధకారమువలె అజ్ఞానతత్కార్యములు నిశ్శేషముగా నశించును. కావున తత్త్వవేత్తకు కర్తవ్యాంశము శేషించి యుండదు. అందువల్లనే తత్త్వవేత్త నివృత్తిశాస్త్రమునకు శేషము కాఁడని పరిహారము చెప్పఁబడినది. ఈపరిహారము సద్యోముక్తిపక్షము నవలంబించి చెప్పినారము. సద్యోముక్తియొక్క స్వరూపమును దానియందు కలిగే యాక్షేపములకు పరిహారమును, ప్రమాణవచనములను, జీవన్ముక్తిప్రకాశికలో విస్తారముగ చెప్పియున్నారము. ఇఁకను జీవన్ముక్తిపక్ష మవలంబించి, తత్త్వవేత్త నివృత్తిశాస్త్రమునకు బద్ధుఁడు కాఁడని ప్రతిపాదించుచున్నామని భావము.

శ్లో. నివృత్తసర్పః సర్పోత్థం యథా కంపం న ముంచతి,
విధ్వస్తాఖిలమోహోఽపి మోహకార్యం తథాత్మవిత్. ౬౦

దం-అ. నివర్తించిన సర్పముగలపురుషుఁడు సర్పమువలన పుట్టిన వణఁకునుయెట్లు వదలలేఁడో, అటులే ఆత్మతత్త్వజ్ఞానపురుషుఁడున్ను నశించిన సకలాజ్ఞానము కలవాఁడైనను అజ్ఞానకార్యమును విడువఁడు.

తా. ఈలోకములో నొకఁడు రజ్జువును జూచి సర్ప మని భ్రమించి భయపడి

ం చుండఁగా ఆప్పుడైనవానియొక్కఁడు 'ఇది సర్పముకాదు, త్రాడు' అని బోధించు సర్పమనేబుద్ధి నివర్తించినను భయముచే కలిగిన వణఁకును వెంటనే వదలలేఁడు. కాలమువఱకు అనుభవించు చుండును. ఆప్రకారమే ఆత్మతత్త్వజ్ఞానము గల ఁడున్ను తత్త్వజ్ఞానముచే నిశ్శేషముగా అజ్ఞానము నశించియున్నను అజ్ఞానకృ లైన దేహేంద్రియరాగద్వేషాదులను వెంటనే వదలఁడు. కొంతకాల మనుసంధిం నే యుండును. అని భావము.

అవ. 'ఓయీ! తత్త్వజ్ఞాని కొంతకాలమువఱకు దేహేంద్రియాదుల ననువర్తి ంచేయుండుఁగాక; నివృత్తిశాస్త్రమునకు బద్ధుడుగాకపోవుట కేమికారణము?' ఆక్షేపము రాఁగా ఉత్తరమును చెప్పుచున్నాఁడు.—

వాక్యం. యతః ప్రవృత్తి బీజ ముచ్ఛిన్నం తస్మాత్. ౫౧

దం-అ. ఎందువలన ప్రవృత్తికి కారణమైన అజ్ఞానము నశించిపోయెనో అందు

తరో రుత్ఖాతమూలస్య శోషేణైవ యథా క్షయః,
తథా బుద్ధాత్మతత్త్వస్య నివృత్త్యైవ తనుక్షయః. ౬౧

దం-అ. పెల్లగింపఁబడినవేరుగల వృక్షమునకు ఎండిపోవుటచేతనే ఏప్రకారము ను కలుగునో, ఆప్రకారము తెలియఁబడిన ఆత్మస్వరూపము కలవానికి నివృత్తి శరీరవినాశము కలుగును.

తా. నానావిధములయిన విధినిషేధకార్యములయందు ప్రవర్తించుటకు మూలము కామకర్మవాసనలేగదా? అవియన్నియు ఆత్మతత్త్వజ్ఞానము కలుగగానే నశించి ఉన్నందున తత్త్వవేత్త విధినిషేధకార్యములకు బద్ధుఁడు కాఁడు. వృక్షమునకు అభి కలుగఁజేయుచున్న నడిమివేరు తెగిపోయినపిదప నావృక్షము క్రమముగా వి నశించిపోవునటుల, ఫలానుభవముచేత క్రమక్రమముగా ప్రారబ్ధకర్మ నశించేకొ త్త్వజ్ఞానియొక్క సకలప్రవృత్తులు క్షీణించి శరీరాదులున్ను నశించిపోవునని .

అవ. ''ఓయీ! తత్త్వజ్ఞానియొక్క దృశ్యమానము లయినప్రవృత్తులు విధిశా యుక్తములు గావని చెప్పుచున్నావు. ఇఁకను రాగద్వేషాదిప్రయుక్తము లని ంచియుండును. లోకములో ప్రవృత్తికి విధిశాస్త్రముగాని, రాగద్వేషములుగాని

మూలముగా నుండును గాని, ఈరెంటికంటె భిన్నమైన ప్రవృత్తికారణము లేదు గదా? కావున తత్త్వజ్ఞాని విధికి బద్ధుఁడు కానిచో రాగద్వేషముల ననుసరించి సురాపానాది కృత్యములయందు యథేష్టముగా ప్రవర్తింపవచ్చును" అని చెప్పువారియొక్క పక్షమును నిరాకరించుటకు ఉత్తరశ్లోకము చెప్పఁబడు చున్నది. అని యవతారికను చేయుచున్నాఁడు.—

వాక్య. అథాలేపకపక్షం నిరాసార్థ మాహ. ౬౨

దం-అ. పిదప అలేపకపక్షమును నిరసించుటకొఱకు చెప్పుచున్నాఁడు.

తా. తత్త్వజ్ఞాని యథేచ్ఛముగా నిషిద్ధకృత్యముల నాచరించినను తత్త్వజ్ఞానప్రభావముచేత ఆపాపములచే లిప్తుఁడు కాఁడని కొందఱు తలఁచెదరు. వారిమతమును దూషించుటకొఱకు ఉత్తరశ్లోకము చెప్పుచున్నాఁడని భావము.

శ్లో. బుద్ధాద్వైతసతత్త్వస్య యథేష్టాచరణం యది,
శునాం తత్త్వదృశాం చైవ కో భేదోఽశుచిభక్షణే. ౬౨

దం-అ. తెలియఁబడిన అద్వితీయతత్త్వముకలవానికి, యథేచ్ఛాచారము కలిగియున్నచో, కుక్కలకును తత్త్వవేత్తలకును అమేధ్యమును భక్షించుటయందేమి భేదము కలదు?

తా. అద్వితీయబ్రహ్మస్వరూపజ్ఞానము కలవారు పరదారగమన, సురాపానాది నిషిద్ధకర్మల నాచరించుచో, శునకములకును తత్త్వవేత్తలకును భేదమే లేకపోవును. కావున తత్త్వవేత్త మనుష్యజాతికి ఉచితమైన ఆహారవిహారములు కలవాఁడైయుండును. కాని పశుపక్షిమృగాదిజాతులకు ఉచితమైన ఆహారాదులకలిగియుండఁడుగదా? ఆప్రకారమే ప్రతిభాసించుచున్న వర్ణాశ్రమములకు తగిన ఆహారవిహారములు గలిగియుండును గాని, జాత్యంతరాదుల కుచితమైన ఆహారాదులు కలిగియుండఁడు గనుక తత్త్వవేత్త యోగ్యమైనకర్మలనే యావజ్జీవ మనుష్ఠించును గాని సురాపానాది అయోగ్యకర్మల నాచరించఁడని భావము.

అవ. అలేపకవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. కస్మాన్న భవతి. ౬౩

దం-అ. ఎందువలన కానేరఁడు?

తా. ఉపనయనాదిసంస్కారములను బొందినపిదప 'నేను బ్రహ్మచారిని, నేను బ్రాహ్మణుఁడను' ఇత్యాది వర్ణాశ్రమాభిమానము సంభవించును గావున, ఆవర్ణాశ్రమాభి

మానము మధ్యకాలమున సంభవించినదిగాని పుట్టుక మొదలుకొని యున్నది కాదు. నేను మనుష్యుఁడ ననే మనుష్యజాత్యభిమానము జన్మ మొదలుకొని యున్నది గాననే, ఇది స్వాభావికముగాని ఆగంతుకము కాదు. ఇట్టి మనుష్యజాత్యభిమానవాసనచేత మనుష్యజాతికి ఉచితమైనకర్మలనే తత్త్వజ్ఞాని చేయునే; ప్రబలమైన మనుష్యజాతికి తగినకర్మలను చేయఁడనియు, దుర్బలమైన వర్ణాశ్రమాదివాసనల నుచితమైన కర్మలనే చేయునని యు చెప్పుటకు కారణమేమి యని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహరించుచున్నాఁడు.—

వాక్య. యస్మాత్. ౫౪౪

దం-అ. ఎందువల్లనంటే.

శ్లో. అధర్మా జ్జాయతే ఽజ్ఞానం యథేష్టాచరణం తతః,
ధర్మకార్యే కథం తత్స్యా ద్యత్ర ధర్మోఽపి నేష్యతే. ౬౩

దం-అ. అధర్మముచేత అజ్ఞానముపుట్టును. ఆయజ్ఞానముచేత యథేష్టాచారము (నిషిద్ధకర్మానుష్ఠానము) సంభవించును. దేనియందు ధర్మముగూడా ఇచ్ఛయింపఁబడదో అట్టిధర్మసాధ్యమైన తత్త్వజ్ఞానమందు ఆయథేష్టాచారము ఏప్రకారముగా గలుగును?

తా. పూర్వజన్మములయందు చేసిన పాపములవలన ఈజన్మములో సురాపానాది నిషిద్ధకార్యములను చేయవలయు ననేబుద్ధి పుట్టును. ఆబుద్ధివల్లనే సురాపానాది నింద్యకార్యములను యథేచ్ఛముగా జేయుచుండును. తత్త్వజ్ఞాన మనునది మిక్కిలిశ్రేష్ఠమైన పుణ్యకర్మల నాచరించుటచే కలుగుచున్నది. ఇట్టిజ్ఞానము కలిగినప్పుడు ప్రవృత్తిని కలుగఁజేయుచున్న అవిద్యాకామాదు లన్నియు నశించుచున్నందున, శాస్త్రవిహితములయిన ధర్మకార్యములయందున్ను తత్త్వవేత్త నేరఁడే. శాస్త్రనిషిద్ధములయిన సురాపానపరదారగమనాదిపాపకార్యములయం దేలాగున ప్రవర్తించును? కావున తత్త్వవేత్త పూర్వాభ్యాససంస్కారముచే వర్ణాశ్రమోచిత ధర్మకార్యములయందే ప్రవర్తించును గాని, నిషిద్ధకార్యములయందు ప్రవర్తించఁడని భావము.

అవ. ఈయర్థమందు ప్రమాణమును జూపుచున్నాఁడు.—

శ్లో. ప్రత్యాచష్టేణ ఆహతో యథేష్టాచరణం హరిః,
"యస్యసర్వే సమారంభాః" "ప్రకాశం చే"తి సర్వదృక్. ౬౪

దం-అ. సర్వజ్ఞుఁడైన శ్రీకృష్ణభగవానుఁడు యథేష్టాచరణమును నివారించుచు, 'యస్యసర్వే సమారంభాః' 'ప్రకాశంచ ప్రవృత్తించ' అనేవాక్యములను చెప్పియున్నాఁడు.

తా. శ్రీకృష్ణమూర్తి భగవద్గీతలలో 'యస్యసర్వే' యనుశ్లోకములోను, 'ప్రకాశంచ' అనుశ్లోకములోనున్ను తత్త్వవేత్త నింద్యకార్యములను సుతరాం చేయఁడని విస్పష్టముగా ప్రతిపాదించియున్నారు. అని భావము.

అవ. ఇఁకను కైముతికన్యాయముచేత తత్త్వవేత్త యథేష్టాచారము కలవాఁడై యుండఁడని నిరూపించుచున్నాఁడు.—

వాక్య. తిష్ఠతు తావ త్సర్వప్రవృత్తి బీజఘస్మరం జ్ఞానం
ముముక్ష్వవస్థాయా మపి నసంభవతి యథేష్టాచర
ణమ్. ౫౫

దం-అ. సకలమైన ప్రవృత్తులకు బీజమైన అవిద్యను నశింపఁజేయుచున్న జ్ఞానము ఉండుఁగాక; ముముక్షుదశయందున్ను యథేష్టాచారము సంభవింపదు.

తా. తత్త్వజ్ఞానసంపాదనార్థమై శ్రవణమనననిదిధ్యాసములయందు ప్రవర్తించుచున్న ముముక్షువు సైతము శ్రవణాదులయందును, ఇతరకార్యములయందును ప్రవర్తించుటకు మూలమైయున్న అవిద్యను నిశ్శేషముగా నశింపఁజేసి ఉదయించిన తత్త్వజ్ఞానము గలపురుషుఁడు యథేష్టాచరణము కలవాఁడై యుండునని చెప్పుటకు అవకాశము ఏప్రకారముగా గలుగు నని భావము.

వాక్య. తదాహ. ౫౬

దం-అ. దానిని చెప్పుచున్నాఁడు.

తా. ముముక్షువు విహిత నిషిద్ధవిషయములయందు ప్రవర్తించఁ డనేయర్థమును ఉత్తరశ్లోకములో చెప్పుచున్నాఁడని భావము.

శ్లో. "యోహి యత్ర విరక్తః స్యా న్నాసౌ తస్మై ప్రవర్తతే,
లోకత్రయవిరక్తత్వా న్ముముక్షుః కిమి తీహతే." ౬౫

దం-అ. ఎవ్వఁడు దేనియందు విరక్తుఁడైయుండునో వాఁడు దానికొఱకు ప్రవర్తించఁడుగదా? మోక్షేచ్ఛగలవాఁడు మూఁడులోకములయందును విరక్తి గలవాఁడై యున్నందున దేనిని యిచ్ఛయించును?

లోకములో నేపురుషుఁడైన నొకవస్తువునందు విరక్తి గలిగియున్నపుడు
ంపాదింపఁ దలఁచి ప్రవర్తింపఁడు గదా? మోక్షేచ్ఛగలపురుషుఁడు పుత్త్రుల
భార్యయందును, ద్రవ్యమునందును, స్వర్గాదిలోకములయందును, విరక్తిగల
ండును. స్వర్గాదిలోకములు లభించుటకై జ్యోతిష్టోమాదియాగములయందు
దఁడు. పుత్త్రాదులు లభించుటకై భార్యలయందును, ద్రవ్యమును సంపాదిం
క గోరక్షణాదివ్యాపారములయందును ప్రవర్తించఁడు. ఈలాగునఉండఁగా
సాధనములయిన యథేష్టాచారమం దేలాగున ప్రవర్తించును. గనుక,
యథేష్టాచరణమునందు ప్రవర్తించనప్పుడు ముక్తప్రాయుఁడైన తత్త్వజ్ఞాని
నని యేలాగున చెప్పవచ్చునని భావము.

. తత్ర దృష్టాంతః. ౫౭

అ. దీనియందు దృష్టాంతము చెప్పఁబడును.

ఈపైనచెప్పఁబడిన అర్థమునందు దృష్టాంతము చెప్పఁబడునని భావము.

ంధయా పీడ్యమానోఽపి నవిషం హ్యత్తు మిచ్ఛతి,
ష్టాన్న ధ్వస్తతృడ్ జాని న్నామూఢ స్తజ్జిఘత్సతి. ౫౮

అ. ఆఁకలిచే బాధింపఁబడువాఁడున్ను విషమును భక్షింప నిచ్ఛయించఁడు
గ్యమైన అన్నముచేత తీరిన ఆఁకలిగల మూర్ఖుఁడుగాని (పిచ్చివాఁడుగాని)
భక్షింప నిచ్ఛయించఁడు.

. లోకములో నొకపురుషుఁడు బహుక్షుధచేత పీడింపఁబడుచున్నవాఁడై
ాణమును తీయునట్టి విషమును భక్షించుటకు తలఁచఁడు గదా? ఇఁకను
్యదులతో గూడి మంచి యోగ్యమైన భోజనముచేసి ఆఁకలితీరి తృప్తినొం
ఁడు 'ఇది విషము, దీనిని తిన్నచో ప్రాణహాని కలుగును' అని తెలిసిదానిని
) భక్షించునా? పిచ్చివాఁడైతే భక్షించునేమోగాని, మంచివాఁడు భక్షిం
ప్రకారమే ముముక్షువు పరమపురుషార్థమైన మోక్షమును పొందక యుండి
క్షమును సాధించుటకు శ్రవణాదివ్యాపారములయందు ప్రవర్తించుచున్నను,
దిదోషదూషితములయిన ఐహికాముష్మికవిషయములయందు విరక్తుఁడై వాటి
యందు ప్రవర్తించనప్పుడు, తత్త్వజ్ఞాని పరబ్రహ్మానందానుభవముచే తృప్తి
ందును గనుక, అతిక్షుద్రములయిన విషయసుఖములయందు ప్రవర్తించఁ
వలసినదే లేదని భావము.

అవ. ఇంతవఱకు చెప్పిన అలేపకపక్షనిరాకరణమును ముగించుచున్నాఁడు.—

వాక్య. యతో ఉవగతపరమార్థతత్త్వస్య యథేష్టాచరణం
స మనాగపి ఘటతే ముముక్షుత్వే ఉపిచ తస్మాత్. ౫౭

దం-అ. పరమార్థతత్త్వజ్ఞానము కలవానికి ముముక్షుదశయందున్న యథేష్టాచరణము ఎందువలన కొంచెముగానైనను సంభవించదో, అందువలన.

శ్లో. రాగో లింగ మబోధస్య చిత్తవ్యాయామభూమిషు,
కుతః శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః. ౬౭

దం-అ. మనస్సుయొక్క స్వాభావికసంచారము గలశబ్దాదివిషయములయందు అనురాగము కలిగి యుండుట అజ్ఞానమునకు గురుతై యుండును. ఏవృక్షముయొక్క తొఱ్ఱలో నిప్పుండునో ఆవృక్షమునకు పశిమి ఎక్కడిది?

తా. పరమార్థతత్త్వమును చక్కఁగా తెలిసికొని యున్నవానికి, యథేష్టాచారము కొంచెమైన నుండదు. ముముక్షువునకుసైతము అటులే; కావున చిత్తము సాధారణముగా ప్రవర్తించుచున్న శబ్దాదివిషయములయందు ఆశకలిగినచో, నట్టియాశగలపురుషుఁడు అజ్ఞాని యనియే యూహించవలయునే గాని, తత్త్వజ్ఞానము కలవాఁడని యూహించఁదగదు. అనఁగానెవ్వఁడు శబ్దాదివిషయములయం దాసక్తిగలవాఁడై యుండునో వాఁ డజ్ఞానియే కాని జ్ఞాని కాఁడని ఎఱుంగవలయును. ఎటులనఁగా ఏచెట్టుయొక్కతొఱ్ఱలో నగ్ని రగులుకొనుచుండునో ఆచెట్టు పచ్చిగానుండదుగదా? అటులే రాగద్వేషాదులు హృదయములో సంచరించుచుండఁగా తత్త్వజ్ఞానము చక్కఁగా గలుగదని భావము.

అవ. ఈప్రకారము ప్రస్తావముగా వచ్చిన అలేపకపక్షమును నిరసించి పూర్వమందు చెప్పిన 'తత్ త్వం' పదార్థవివేచనమూత్రమే జ్ఞానసాధనము కానేరదు. మఱికొన్నిసాధనములుకూడా కలవని వాటిని చేర్చి ప్రతిపాదించుచున్నాఁడు.—

వాక్య. సకలపురుషార్థసమాప్తికారిణో ఉస్యాత్మావబోధస్య
కుతః ప్రసూతిరితి - ఉచ్యతే. ౫౮

దం-అ. సమస్తపురుషార్థములసమాప్తికి హేతువైన ఈయాత్మతత్త్వజ్ఞానముయొక్క ఉత్పత్తి దేనివలన కలుగునో చెప్పఁబడును.

తా. తత్త్వజ్ఞానము కలుగగానే ధర్మార్థకామమోక్షములను చతుర్విధఫలపురుషార్థములు ప్రాప్తించినంత సుఖము కలుగుచున్నందున తత్త్వజ్ఞానము సకలపురుషార్థములను సమాప్తిఁజేయుచున్నది. ఇట్టి సర్వోత్కృష్టమైనతత్త్వజ్ఞానము తృతీయాధ్యాయములో జెప్పిన 'తత్,త్వం'పదార్థవివేకముచేతనే కలుగునా? మఱికొన్ని సాధనములనైత మపేక్షించునా? అని కొందఱు ప్రశ్నను చేయుదురు.వారికి ఉత్తరమును చెప్పఁబోవుచెప్పుచున్నార మని భావము

శ్లో. అమానిత్వాదినిష్ఠో యో యశ్చాద్వేష్ట్రాదిసాధనః,
జ్ఞాన ముత్పద్యతే తస్య న బహిర్ముఖచేతసః. ౬౭

దం-అ. ఏపురుషుఁడు అమానిత్వము మొదలగుగుణములయందు నిష్ఠగలవాఁడై యుండునో, ఏపురుషుఁడు అద్వేష్టృత్వాదిసాధనములు కలవాఁడై యుండునో, వానికే తత్త్వజ్ఞానము పుట్టుచున్నది. బాహ్యవిషయములయం దాసక్తమైన చిత్తము కలవానికి పుట్టనేరదు.

తా. అమానిత్వము, అదంభిత్వము, అద్వేష్టృత్వము, సర్వభూతమైత్రి మొదలగుగుణములు గలవానికే 'తత్త్వం'పదార్థవివేచనముచేత తత్త్వజ్ఞానము ఉదయించును. బాహ్యములైనశబ్దాదివిషయములయం దాసక్తి కలిగియుండి శుష్కముగా ఖ్యాతిలాభపూజనముల నపేక్షించి వేదాంతశాస్త్రములను చదివి 'తత్త్వం' పదార్థముల నుపదేశించువారికి తత్త్వజ్ఞానము కలుగనేరదని భావము. అమానిత్వాదిగుణములయొక్క లక్షణమును భగవద్గీతలయొక్క ౧౨, ౧౩వ యధ్యాయములలో చూడనగు.

అవ. పూర్వవాది శంకించుచున్నాఁడు.—

వాక్య. ఉత్పన్నఆత్మవిజ్ఞానే కి మవిద్యాకార్యత్వాత్ ప్రవృత్తివ న్నివృత్త్యాత్మకామానిత్వాదయోఽపి నివర్తంతే ఉత నేతి. ౬౦

దం-అ. ఆత్మజ్ఞానముపుట్టగానే నివృత్తిధర్మరూపములైన అమానిత్వాదిగుణములున్ను అజ్ఞానముచే సంభవించినవైనందున ప్రవృత్తిధర్మములవలె నివర్తించునా? లేక నివర్తించవా?

తా. ప్రవృత్తిధర్మములైన యాగదానాదిహోమాదులు యేప్రకార మజ్ఞానజన్యములైయున్నవో ఆప్రకారమే నివృత్తిధర్మములయిన అమానిత్వాదులున్ను అజ్ఞానజన్యములైనందున, ఆత్మతత్త్వజ్ఞానము కలుగగానే నివర్తించవలసియున్నది. లేనిచో

సకలాజ్ఞానతత్కార్యనివర్తకత్వము తత్త్వజ్ఞానమునకు లేకపోవును. నివర్తించు ననినచో తత్త్వవేత్తకు మరల యథేష్టాచారము ప్రాప్తించుచున్నది. ఇదిగాక ముముక్షువునకుఅమానిత్వాదులు తత్త్వజ్ఞానోత్పత్తికి సాధనములై యుండునుగదా? అట్టియమానిత్వాదులు ముక్తదశ కలిగినప్పు డుండవలసిన యవశ్యము లేదు. ఉండునన్నచో తత్త్వవేత్త నివృత్తిశాస్త్రమునకు వశ్యుఁడనే చెప్పవలసియుండు నని భావము.

అవ. సిద్ధాంతవాది పరిహారమును చెప్పుచున్నాఁడు.—

వాక్య. నేతి బ్రూమః. ౮౧

దం-అ. లేదని చెప్పెదము.

తా. అమానిత్వాదులు నివర్తించవనియు, నివర్తించకపోయినను ముముక్షువునకువలె సాధనరూపములై యుండవనియు, తత్త్వజ్ఞాని నివృత్తిశాస్త్రమునకు వశ్యుఁడు కాఁడనియు చెప్పెదము. అని భావము.

అవ. పూర్వపక్షవాది మరల శంకించుచున్నాఁడు.—

వాక్య. కిం కారణమ్. ౮౨

దం-అ. ఏమికారణము?

తా. మీరు చెప్పిన విషయములకు కారణము కలదా యని భావము.

అవ. సిద్ధాంతవాది తాను చెప్పిన విషయము లన్నింటికిని హేతువును చెప్పుచున్నాఁడు.—

వాక్య. నివృత్తిశాస్త్రావిరుద్ధ స్వాభావ్యా త్పరమాత్మనః న
తు నియోగవశాత్. ౮౩

దం-అ. పరమాత్మ నివృత్తిశాస్త్రమునకు విరుద్ధముగాని స్వభావము కలవాఁడై నందున నివృత్తిధర్మములు నివర్తించవు. కాని నివృత్తిశాస్త్రముయొక్క ఆజ్ఞావశమువల్ల కాదు.

తా. అఖండ సచ్చిదానందస్వరూపుఁడైనపరమాత్మ సకలధర్మశూన్యుఁడై తేజరిల్లుచున్నందున, సకలధర్మాధర్మరాహిత్యమును బోధించుచున్న నివృత్తిశాస్త్రముతో సమానస్వభావము గలవాఁడై యుండును. కావున తాదృశపరమాత్మస్వరూపభూతుఁడై తేజరిల్లుచున్న తత్త్వజ్ఞానియందు అమానిత్వాదిధర్మములు స్వభావముగానే యుండునుగాని, నివృత్తిధర్మవిధాయకశాస్త్రబద్ధతచేత నుండునవిగావు. అని భావము.

అవ. పూర్వవాదిచే చేయఁబడు ప్రశ్న ననువదించుకొని సిద్ధాంతవాది చెప్పుచున్నాఁడు.—

వాక్య. కథం తర్హి శ్రుణు. ౬౪

దం-అ. అయితే ఏప్రకార ముండునో చెప్పెదను వినుము.

శ్లో. ఉత్పన్నాత్మప్రబోధస్య త్వద్వేష్టృత్వాదయో గుణాః,
అయత్నతో భవం త్యస్య నతు సాధనరూపిణః. ౬౫

దం-అ. ఆత్మతత్త్వజ్ఞానముపుట్టిన ఈపురుషునకు అద్వేష్టృత్వము మొదలగుగుణములు అప్రయత్నముగానుండును. కాని సాధనరూపములుగా నుండవు.

తా. ఆత్మతత్త్వజ్ఞానము కలిగినపిదప అమానిత్వము అద్వేష్టృత్వము మొదలగుగుణములు స్వాభావికములై యుండునుగాని, ముముక్షుదశయందువలె ఒకకార్యమునకు సాధనములై యుండవు. అని భావము.

అవ. అమానిత్వాదిగుణములు ముముక్షువునకు సాధనములై జీవన్ముక్తునకు స్వభావములై యుండునని యంగీకరించవలసి యున్నందున తత్త్వజ్ఞానసాధనమైన ఈనైష్కర్మ్యసిద్ధి (సర్వవేదాంతసారసంగ్రహ) ప్రకరణమును వినుట కిచ్ఛయించినపురుషుఁడు ముందుగా అమానిత్వాదిగుణములు కలవాఁడై యుండవలయునని చెప్పుచున్నాఁడు.—

వాక్య. యత ఏవ మేతదతః. ౬౬

దం-అ. ఏకారణమువల్ల నిది ఈప్రకారమై యున్నదో ఆకారణమువల్లను.

శ్లో. ఇమంగ్రంథ ముపాదిత్సు రమానిత్వాదిసాధనః,
యత్నత స్స్యా న్నదుర్వృత్తః ప్రత్యగ్ధర్మానుగో హ్యయమ్.

దం-అ. ఈగ్రంథమును గ్రహింపఁ దలచినవాఁడు ప్రయత్నపూర్వకముగా అమానిత్వాదిగుణములు సాధనముగాఁ గలవాఁడు కావలయును. దుర్గుణములుకలవాఁడు కాఁగూడదు. ఈగ్రంథము ప్రత్యగాత్మస్వరూపము ననుసరించుచున్నదిగదా?

తా. అమానిత్వాదిధర్మములు ముముక్షుదశయందు సాధనములై యుక్తదశయందు స్వభావములై యున్నవి. కావున ఈగ్రంథమును వినఁదలఁచిన పురుషుఁడు అమానిత్వాదిగుణములను సంపాదించుకొనవలయును. ఏలననఁగా ఈగ్రంథము సకలవిశేషశూన్యమైన ప్రత్యగాత్మతత్త్వమును బోధించుచున్నది. కావున మానదంభాదిదుర్గుణములు కలవాఁడైనచో నీగ్రంథశ్రవణమువలన తత్త్వజ్ఞాన ముదయించదు. అందుచే నమాని

త్వాది సద్గుణములు కలవాఁడై యుండవలయు నేగాని మానదంభదర్పాసూయాదిదుర్గుణములుకలవాఁడై యుండఁ దగదని భావము.

వాక్య. నదాతవ్యశ్చాయం గ్రంథః. ౬౮

దం-అ. (పైదుర్గుణములు కలవానికి) ఈగ్రంథము నుపదేశింపఁగూడదు.

తా. మానదంభదర్పాసూయాదిదుర్గుణములలో నొక్కదానిని కలిగియుండు పురుషున కేమాత్రమున్ను ఈగ్రంథము నుపదేశింపఁగూడదు.

అవ. ఈప్రకారము ఈగ్రంథమును వినఁదలఁచినవానికి ఉండవలసిన నియమములను చెప్పి ఉపదేశించువారికి ఉండవలసిన నియమములను చెప్పుచున్నాఁడు.—

శ్లో. నావిరక్తాయ సంసారా న్నానిర స్తైషణాయ చ,
న చాయమవతే దేయం వేదాంతార్థ ప్రవేశనమ్. ౭౧

దం-అ. వేదాంతార్థమునందు ప్రవేశమును కలుగఁజేయుచున్న ఈగ్రంథము సంసారమువల్ల విరక్తి చెందనివానికి ఇయ్యఁదగదు. నిరసించఁబడని ఈషణములు గలవానికి ఇయ్యఁదగదు. అహింసమొదలగు యమనియమములు లేనివానికి ఇయ్యఁదగదు.

తా. అద్వైతాత్మతత్త్వమును కరతలామలకముగా తెలియఁజేయు సామర్థ్యముగల ఈగ్రంథమును ఉపదేశము చేయునప్పుడు సంసారమందు వైరాగ్యముసంపూర్ణముగా గలిగి పుత్త్రైషణ, దారేషణ,ధనేషణలను విడిచి, అహింసా సత్య బ్రహ్మచర్యాది యమనియమములు నిశ్చయముగా కలిగియున్నవారిని చక్కఁగా పరీక్షించి ఉపదేశించవలయు నేగాని అన్యులకు ఉపదేశించఁ దగదని భావము.

అవ. ఓయీ! అనధికారులీప్రకరణము చదువఁదగదని చెప్పెదవు. అధికారము గలవారలు ఈప్రకరణమును తెలియుటచే నేమిఫలమును బొందెదరనఁగా చెప్పుచున్నారు.

శ్లో. జ్ఞాత్వా యథోదితం సమ్యగ్ జ్ఞాతవ్యం నాఽవశిష్యతే,
న చానిరస్తకర్మేదం జానీయా దంజసా తతః. ౭౨

దం-అ. చెప్పినయర్థమును చక్కఁగా తెలిసికొనియుంటే తెలియవలసిన యర్థము మిగిలియుండదు. అందువల్ల విడువఁబడినకర్మలు గలవాఁడు దీనిని సులభముగా తెలియఁగూడదు.

తా. అమానిత్వాదిధర్మములు గలిగి సర్వకర్మసన్న్యాసము నాచరించిన యధికారి ఈగ్రంథమును గురుముఖముగా వినినచో యావదర్థములున్ను తెలియును. తెలియ

సినవిషయము కారవయుండదు. కావున అనధికారిగా నుండి ఈగ్రంథమును చదివి
నో ఫలపర్యవసానము గలజ్ఞానము పుట్టనేరదని భావము.

అవ. అయితే ఎవరు ఈప్రకరణార్థమును చక్కఁగా దెలియఁగలరో చెప్పుచు
న్నారు.—

శ్లో. నిరస్తసర్వకర్మాణః ప్రత్యక్ప్రవణబుద్ధయః,
నిష్కామా యతయః శాంతా జానంతీదం యథోదితమ్. 23

దం-అ. నిరసించఁబడిన సర్వకర్మలుగలిగి, ప్రత్యగాత్మయం దాసక్తమైన చిత్త
ముగలిగి, కామరహితులై, శాంతులైన పురుషులు ఈచెప్పఁబడిన యర్థమును తెలియఁ
గలరు.

తా. ప్రత్యగాత్మస్వరూపమును సాక్షాత్కరింపఁ జేసికొన నిచ్ఛఁగలవారై, ఇహ
లోకపరలోకములయం దాశలేనివారై, శమదమశ్రద్ధాభక్త్యాదిగుణములు గలవారై,
సర్వకర్మ సన్న్యాసమును జేసిన పరమహంసపరివ్రాజకులు, ఈప్రకరణార్థమును చక్కఁ
గా దెలిసి యనుభవించగలరని భావము.

అవ. గ్రంథకర్త తనయహంకారమును పరిహరించుకొనుచున్నాఁడు.—

శ్లో. శ్రీమచ్ఛంకరపాదపద్మయుగళం సంసేవ్య లబ్ధోచివాక్
జ్ఞానం పారమహంస్య మేతదమలం స్వాంతాంధకారాపనుత్,
మాభూ దత్ర విరోధినీ మతిరతః సద్భిః పరీక్ష్యం బుధైః
సర్వత్రైవ విశుద్ధయే మత మిదం సంతః పరం కారణమ్. 24

దం-అ. జ్ఞానవైరాగ్యము మొదలగు సంపత్తుగల శ్రీమచ్ఛంకరాచార్యుల
పాదారవిందద్వంద్వమును సేవించి వారియొక్క అనుగ్రహమును ఉపదేశమును బొంది,
పరమహంస పరివ్రాజకులకే యోగ్యమై, శుద్ధమై, హృదయగత మగుఅజ్ఞానాంధకార
మును నిరసించునదైన తత్త్వజ్ఞానమును కరతలామలకముగా బోధించుచున్న ఈగ్రంథ
మును నేను చెప్పితిని. ఈగ్రంథమందు విరోధబుద్ధి యుండవలదు. కాన సత్పురుషులగు
విద్వాంసులచేత నిది పరీక్షింపఁ దగినది. సర్వప్రదేశములయందును గుణదోషములను
శోధించుటకే ఈగ్రంథము నాకు సమ్మతమై యున్నది. సత్పురుషులైనవారు గుణదోషము
లను పరీక్షించి శుద్ధముగాఁ జేయుటకు కారణమై యున్నారు గదా?

దం-అ. వ్యాపకుఁడగు పరమేశ్వరునియొక్క స్వరూపము ననుసరించియుండి సకలమైన సంసారమును నివర్తింపఁ జేయుచున్న బ్రహ్మవిద్యను శ్రీశంకరభగవత్పాదులు తమయొక్క దివ్యజ్ఞానోపాయమువల్ల, విష్ణుమూర్తియొక్క పాదాంగుష్ఠము ననుసరించి యుండి సంసారదుఃఖముల నన్నింటిని నివర్తింపఁజేయుచున్న గంగను సాంబమూర్తి తనయోగసామర్థ్యమువలన బొందినట్లు బొందిరి. సర్వజ్ఞులై, బ్రహ్మనిష్ఠులైయనేక బ్రహ్మవేత్తలతోఁగూడియున్న ఆశంకరాచార్యులను భక్తితోటి చక్కఁగా నారాధించి శ్రేష్ఠమైనగుణములకాశ్రయమై యున్న శ్రీశంకరాచార్యులవల్ల సకలవేదాంతప్రసిద్ధమైన ఆబ్రహ్మవిద్యను, భగీరథుఁడు ఈశ్వరుని యారాధించి ఈశ్వరునివల్ల వేదమంత్రములచే ప్రతిపాదింపఁబడుచున్న గంగను లభించినటుల నేను లభించి సంసారమందు పడి దుఃఖించుచున్నజనులకు, జననమరణాది సంసారదోషములయొక్కవినాశముకొఱకు ఆబ్రహ్మవిద్యను ఈగ్రంథరూపముగా చెప్పితిని.

తా. సులభము.

అవ. బ్రహ్మవిద్యనుగూర్చి గురుభక్తి ముఖ్యసాధన మని తెలియఁజేయుటకు ఈప్రకరణముయొక్క ఆరంభమునందువలె సమాప్తియందును గురునమస్కారమును జేయుచున్నాఁడు —

శ్లో. వేదాంతోదరవర్తి భాస్వదమలం ధ్వాంతచ్ఛిదస్మద్ధియో
దివ్యం జ్ఞాన మతీంద్రియేఽపి విషయే వ్యాహన్యతే న క్వచిత్,
యో నో న్యాయశలాకయైవ నిఖిలం సంసారబీజం తమః
ప్రోత్సార్యావిరకా*ర్షీద్గురుగురుః పూజ్యాయ తస్మై నమః. ౭౭

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరపూజ్య
పాదశిష్య శ్రీసురేశ్వరాచార్యవిరచితాయాం నైష్కర్మ్యసి
ద్ధౌ సంబంధోక్త్యా చతుర్థోఽధ్యాయః
సమాప్తః.

దం-అ. ఉపనిషత్తులయొక్కగర్భమందు వర్తించునదియై, శుద్ధసత్వరూపమై, రాగద్వేషాదిదోషశూన్యమై, మనయొక్క బుద్ధిసంబంధమైన అజ్ఞానాంధకారమును

ఛేదించునదియై, స్వప్రకాశస్వరూపమును ప్రకాశింపఁజేయునదియై, ఇం
రముగాని సచ్చిదానందస్వరూపమునందు తాత్పర్యముగలిగి ప్రమాణాంతర
ర్థములయందు దేనియందును విరోధము లేనిదై యొప్పుచున్న జ్ఞానమును,
సైతము గురువైన ఏమహానుభావుఁడు మాసంసారకారణమైన అజ్ఞానమును
యుక్తిసహితప్రమాణవచనమనే శలాక(నేత్రాంజనపుకణిక)చేత నిరాక
ర్భవింపఁజేసెనో అట్టి సర్వలోకపూజ్యుఁడైన శ్రీశంకరభగవత్పాదులకొఱ
రమును చేసెదను.

శ్లో. సులభము.

ఇది సర్వవేదాంతసారసంగ్రహమునందు చతుర్థప్రకరణము ముగి

ఇతి నైష్కర్మ్యసిద్ధిప్రకరణం సమాప్తమ్.

---

# శ్లోకానుక్రమణిక.

☞ 252-వ పేజీలో ౧౦౧-వ శ్లోకముక్రింద దీనిని చేర్చికొని పఠించవలయును.

శ్లో. దగ్ధృత్వంచ యథావహ్నే రయసో మన్యతే తు ధీః,
చైతన్యం తద్వదాత్మీయం మోహాత్కర్తరి మన్యతే. ౧౦౨

దం-అ. మందబుద్ధిగలవాఁడు వహ్నియొక్క దాహకత్వమును యినుముయొక్క సంబంధమైనదానినిగా యెటువలె తలంచునో, అటువలెనే ఆత్మయొక్క చైతన్యమును అజ్ఞానమువల్ల కర్తయందు (బుద్ధియందు) తలంచుచున్నాఁడు.